మాధవ - విద్యారణ్య

# శ్రీశంకర విజయము

వ్యాఖ్యాత:

చిలుకూరు వెంకటేశ్వర్లు

**శ్రీ రామకృష్ణ తపోవనం**

**20, రేస్‌కోర్స్ రోడ్, గిండీ, చెన్నై - 600 032.**

ఫోన్ : 9884708559

Email : chvenkateswarlu30@gmail.com

website : www.sriramakrishnatapovanam.org

**శ్రీశంకర విజయము**

రెండవ ముద్రణ : 2011

పబ్లిషర్స్ :
**శ్రీ రామకృష్ణ తపోవనం**
20, రేస్ కోర్స్ రోడ్డు,
గిండీ, చెన్నై - 600 032
ఫోన్ : 9884708559
Email : chvenkateswarlu30@gmail.com
website : www.sriramakrishnatapovanam.org

డి.టి.పి.
ఆర్. అనురాధా రఘురామ్ (9441186831)

డిస్ట్రిబ్యూటర్స్ :
**రామకృష్ణ మఠం**
దోమలగూడ, హైదరాబాదు–500 029.
ఫోన్ : 040–27631149

# నా మాట

సంగీత ప్రియులంతా శ్రీ త్యాగరాజస్వామి వారిని పరబ్రహ్మగా నాదబ్రహ్మగా ఉపాసించడం కద్దు. అలాగే వేదాంత ప్రియులంతా శ్రీశంకర భగవత్పాదుల వారిని సాక్షాత్తూ శివావతారంగా, పరబ్రహ్మగా ఉపాసిస్తూ ఉంటారు.

మా గ్రామం తోట్లవల్లూరు, కృష్ణాతీరంలో ఉండే గ్రామాల్లోకే పెద్ద గ్రామంగా ఉండేది. మా తండ్రి శ్రీ నోరి సూర్యనారాయణగారు తమ యావజ్జీవితం శ్రీవిద్యోపాసనలో గడిపారు. ఆయన మంత్రోపదేశం పొందడానికి మునుపే, అంటే బాల్యం నుంచీ శ్రీ శంకర భగవత్పాదుల వారి పట్ల ఆకర్షితులయ్యారట! ఆ విధంగా జగద్గురువుల పట్ల నెలకొన్న ప్రేమచేత ఏటేటా మా ఇంట్లో శ్రీ శంకర జయంతి పర్వదినాన్ని శ్రీరామ నవమి ఉత్సవంమల్లే జరిపేవారు. శ్రీ శంకర భగవత్పాదుల వారి చిత్రపటాన్ని చేతుల మీద ఉంచుకొని గ్రామం అంతా ఊరేగించేవారు. నాలుగు వర్ణాల పెద్దలూ ఊరేగింపులో పాల్గొని ప్రసాద వినియోగం దాకా ఉండిపోయేవారు. వీళ్లే కాకుండా విజయవాడ, మచిలీపట్టణం వంటి పట్టణాల నుంచీ కూడా బంధువులు వచ్చి ఈ ఉత్సవంలో పాల్గొనేవారు. ఆ రోజు ఇంట్లో పండుగ వాతావరణం నెలకొని ఉండేది. అందరిలోకి చిన్నవాణ్ణి కావటం వలన వచ్చిన బంధువులంతా చిన్నాచితకా పనులు నాకే చెప్పేవారు. వాళ్లు కోరిన సేవలు చేస్తూ ఎంతో ఎత్తుకు ఎదిగిపోయినట్లు సంబరపడిపోయేవాడిని.

మా తండ్రిగారు మరణ సమయంలో సైతం శ్రీ శంకర జయంతి ఉత్సవానికి కావలసిన ఏర్పాట్ల మీదే మనస్సు లగ్నం చేసి, చివరకు శంకర జయంతి ఇంకా కొద్ది రోజులు ఉందనగానే కన్నుమూశారు.

ఆయన స్వయంగా శ్రీ శంకర భగవత్పాదుల పాదపద్మాలను ఆశ్రయించడమే కాకుండా మా తోట్లవల్లూరు గ్రామస్థులందరినీ శ్రీ శంకర జయంతి ఉత్సవాల్లో ఉత్సాహంతో, స్ఫూర్తితో పాల్గొనేట్లు చేసి వారిని శ్రీ శంకరుల పట్ల ఆకర్షితులను చేయగలిగారు.

ఆ రకంగా నాకు శ్రీ శంకరుల పట్ల బాల్యం నుంచీ కొద్దిపాటి అవగాహన ఏర్పడింది. ఓ యాభై సంవత్సరాల పాటు వ్యాపారంలో తలమునకలై, ఆ రంగం నుంచి విరమించుకొన్న తరువాత మళ్లీ మనస్సులో శ్రీ శంకరులను గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలనే ఆకాంక్ష తలెత్తింది.

అందుకే భగవాన్ శ్రీరామకృష్ణులు ఇలా వచించారు: “ఓ విత్తనం ఇంటి గోడ మీద పడి ఉంటుంది. ఆ ఇల్లు పూర్తిగా శిథిలమై నేలమట్టమైనప్పటికీ ఆ విత్తనం నేల మీద పడి మొలకెత్తుతుంది. అలాగే భగవన్నామానికి అంత శక్తి ఉంది.”

చిన్నతనంలో ఎప్పుడో శ్రీ శంకరుల పట్ల ప్రేమ అనే బీజం నాలో నాటుకోవడం వలన, అది మళ్లీ మొలకెత్తి శ్రీ శంకరులను గూర్చి తెలుసు కోవాలనే కుతూహలం నాలో పెరగసాగింది. మా తండ్రిగారు తమ జీవిత కాలమంతా పారాయణ చేసిన ‘శ్రీ శంకర విజయ’ కావ్యం కాస్తా శిథిలమై ఎక్కడో కనబడకుండా పోయింది. అప్పుడు బజారుకెళ్లి శ్రీ శంకరులను గురించిన పుస్తకాలు లభిస్తాయేమోని ప్రయత్నించాను. శ్రీ శంకరులను గురించిన ఒకటి రెండు కావ్యాలు, ఒకటి రెండు సంక్షిప్త జీవిత చరిత్రలు కనిపించాయి. కాని మాధవ – విద్యారణ్యస్వామి రచించిన శ్రీ శంకర విజయ కావ్య ప్రచురణ ఒకటి మాత్రమే దొరికింది. అది ఏర్పేడు వ్యాసాశ్రమం వారి ప్రచురణ. అందులో శ్రీ టి. శివచరణం గారి వ్యాఖ్యానం కూడా ఉండడం నా అదృష్టంగా భావించాను. మహదానందంతో ఆ గ్రంథాన్ని ముందుంచుకొని కూర్చున్నాను. ఆ గ్రంథం అంతా శిష్ట గ్రాంథికంలో సాగింది. మరీ పండితులైన వారు మాత్రమే ఆ గ్రంథాన్ని ఆస్వాదించగలరేమోగాని నేను మాత్రం ఎంత కష్టపడినా ఒక పుట కూడా చదవలేకపోయాను. శ్రీ శంకరుల పట్ల ఉండే ప్రేమ, ఆయనను గురించి

సమగ్రంగా తెలుసుకోవాలనే తపన ఉండడం వలన ఎలాగైనా ఆ గ్రంథాన్ని పూర్తిగా చదివి తెలుసుకోవాలన్న పట్టుదల నాలో పెరిగింది. మళ్లీ అదే పుస్తకాల దుకాణానికి వెళ్లి శబ్దరత్నాకరం (నిఘంటువు) కూడా పట్టుకొచ్చాను. ఈ రెండు గ్రంథాలు ముందు వేసుకొని ఒకటిన్నర సంవత్స రాలు కుస్తీ పట్టాను. శ్రీ శంకరులను గురించి తెలుసుకోవాలనుకొనే వాళ్లంతా ఇంత శ్రమపడవలసిందేనా? అనిపించింది. అప్పుడే శ్రీరామకృష్ణులు నాలో ప్రవేశించి, “పోనీ, ఎక్కువ మంది తక్కువ శ్రమతో శ్రీ శంకరులను గురించి తెలుసుకోగల ప్రయత్నం నువ్వే ఎందుకు చేయకూడదు?” అని ప్రశ్నించినట్లనిపించింది. శ్రీ గురుదేవులే ఆ విధంగా ఆదేశిస్తే, ఇక వేదాంతంతోగాని, పాండిత్యంతోగాని, భాషాజ్ఞానంతోగాని ఏం పని? అన్నీ ఆయనే చూసుకొంటారు లెమ్మని జంకునూ, సంకోచాన్నీ విడిచిపెట్టి ఈ సాహసం చేశాను.

ఈ ప్రయత్నం ముఖ్యంగా నాబోటి జ్ఞానశూన్యులైన పాఠకులనూ, ఓ అరవై ఏళ్లు వచ్చాక ఆధ్యాత్మిక విషయం మీద మనస్సు మళ్లిన యువకులనూ దృష్టిలో ఉంచుకొని ముందుకు సాగించాను. శ్రీ మాధవ విద్యారణ్యుల వారినే ప్రమాణంగా తీసుకొని ఆయన ప్రవచించిన ప్రతీ శ్లోకానికీ నాకు తోచిన మేరకు, పాఠకులకు విసుగు పుట్టని రీతిలో తాత్పర్యాన్ని స్వీకరిస్తూ రచన సాగించాను. ఈ గ్రంథంలో పొందుపరచిన సంఖ్యలు మూల గ్రంథంలోని శ్లోకాలకు సమన్వయపరచబడ్డాయి.

నా ఈ ప్రయత్నానికి మూలకారకులు నా గురుదేవులు శ్రీరామకృష్ణులు. ఈ గ్రంథంలో చోటుచేసుకొనే దోషాలన్నీ నావి. నా తపన అంతా శ్రీశంకరుల దిగ్విజయ యాత్రను గూర్చి ఎక్కువ మంది తెలుసుకోవాలనే ప్రయత్నమే గాని, భాష పట్ల పట్టులేని వాణ్ణి; ఆధ్యాత్మిక, వేదాంత విషయాల్లో బొత్తిగా ప్రవేశం లేనివాణ్ణి కావడంతో పండితులు, పాఠకులు నన్ను మన్నిస్తారని నమ్ముతున్నాను.

లోకంలో ఏదైనా ఒక పని తృప్తిగా చేయగలిగినప్పుడు “ఈ జన్మకిది చాలు” అనిగాని ‘నా జన్మ ధన్యమైంది’ అని గాని అనుకుంటూ ఉంటారు. అట్లాగే, ఈ సందర్భంలో నాకీ జన్మ నిచ్చిన నా తల్లితండ్రులు శ్రీ నోరి

సూర్యనారాయణ, సీతమ్మ గార్లను గుర్తు చేసుకొని వారి పాదములకు సాష్టాంగ నమస్కారములు చేస్తున్నాను. అట్లాగే, నిస్వార్థంగాను నా శ్రేయస్సే తన పరమ లక్ష్యంగా తలచి నన్ను పెంచి పెద్దచేసిన నా పెంపుడు తల్లి శ్రీ చిలుకూరు శ్యామలాంబ గారి పాదాలకు సాష్టాంగ ప్రణామాలు చేస్తున్నాను.

ఈ గ్రంథ రచనలో నాకు తోడ్పడిన శ్రీ. టి. శివచరణంగారి (వ్యాసాశ్రమం) వ్యాఖ్యలకూ, ఆంగ్లంలో శంకర దిగ్విజయ వ్యాఖ్యాతలు శ్రీమత్ స్వామి తపస్యానందగారికి (శ్రీరామకృష్ణ మఠం) నా ప్రత్యేక కృతజ్ఞతాభివందనాలు తెలుపుకొంటున్నాను.

**– చిలుకూరు వెంకటేశ్వర్లు**

# భూమిక

## గ్రంథ ప్రస్తావన

ముముక్షువులు, సాధకులు భగవానుని పాదపద్మాల నాశ్రయించి నిత్యమైన భగవత్ప్రాప్తికై పరితపించాలి. మహాపురుషుల అనుగ్రహంలేక ఎవ్వరూ తత్త్వజ్ఞానప్రకాశాన్ని పొందలేరు. భగవానుడీ ప్రపంచాన్ని సృష్టించి, వాసనాబద్ధ జీవులు సంసారం నుండి విముక్తి పొందడానికి అనేక విధాలుగా సంరక్షిస్తున్నాడు. అయినా ఈ ప్రపంచంలో అనేకులు బద్ధులవుతున్నారు. వీరిని బంధాల నుండి తప్పించడానికై దయామయులైన మహర్షులు ప్రయత్నిస్తూనే ఉన్నారు. ధర్మం నశించి అధర్మం వృద్ధియైనప్పుడు భగవానుడే స్వయంగా అవతరించి ధర్మాన్ని తిరిగి ప్రతిష్ఠాపిస్తుంటాడు. శ్రీరామకృష్ణాది అవతారాలే అందుకు నిదర్శనాలు. అంతేగాక ముక్తపురుషులు కూడా భగవదాజ్ఞ ననుసరించి ప్రపంచాన్ని ఉద్ధరించడానికై ప్రయత్నిస్తున్నారు.

ఈ విశాల ప్రపంచాన్ని ఉద్ధరించే విషయాన్ని గూర్చి విచారిస్తే భగవానుని మహిమలు తెలుసుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. పరబ్రహ్మతత్త్వ మొక్కటే సత్యం. కంటికి కనిపించే పదార్థాలేవీ సత్యం కావు. అజ్ఞాన బంధాల నుండి విముక్తి పొంది, జ్ఞానోపదేశ పరంపరలు ఏర్పడతాయి.

ఈ కలియుగంలోనే 2500 సంవత్సరాల క్రితం బుద్ధ భగవానుడు జన్మించి, అహింసే పరమధర్మమనీ, నిర్వాణాన్ని అందరూ పొందవచ్చుననీ బోధించాడు. ఆ విధంగా బుద్ధుని బోధలన్నీ చక్కగా ప్రచారం పొంది బౌద్ధ మతంగా రూపొందింది. ఆ తరువాత కొంత కాలానికి లోకంలో

నాస్తికులు వృద్ధి చెందారు. అహింసా సిద్ధాంతాన్ని మరచి, వేదాలను దూషిస్తూ భీతిలేనివారై ధర్మహాని చేయసాగారు. అటువంటి సమయంలో దయాస్వరూపుడైన పరమశివుడు, తన కుమారుడైన కుమారస్వామిని లోక రక్షణకై పంపాడు. ఆయనే 'కుమారిలభట్ట'ని పండితులు చెబుతున్నారు. ఆయన వేదవిరుద్ధమైన పాషండ మతాన్ని ఖండిస్తూ, సాంఖ్య, యోగ, న్యాయ శాస్త్రాలు వేదవిరుద్ధాలు కాకపోయినా వాటన్నింటినీ తొలగిస్తూ పరమ వేదతత్త్వాన్ని తిరిగి స్థాపించారు. వేదాలను వేదాంత తత్త్వమైన అద్వయ పరతత్త్వాన్ని వేదకాలంలోనే పూర్తిగా గ్రహించలేక బద్ధులయ్యారు. శ్రీహరి భగవానుడు వేదవ్యాసుడుగా అవతరించి బ్రహ్మసూత్రాలను రచించాడు. పండితులైనవారికే ఆ బ్రహ్మసూత్రాలు బోధపడక ఎవరికి తోచిన అర్థాన్ని వారు వ్యాఖ్యానిస్తూ అనేక మతాలను స్థాపించారు. అవి ఏవీ కూడా వేదాంత తత్త్వానికి అద్దంపట్టేవి కాలేకపోయాయి. బ్రహ్మవిద్యాసంప్ర దాయం శిథిలమై అడుగంటిపోయింది. అటువంటి స్థితిలో పరమశివుడు, బద్ధజీవులను ముక్తులను చేయాలని తలచి భూలోకాన అవతరించాడు. ఆ పరమ శివావతారులే శ్రీ శంకర భగవత్పాదాచార్యులు.

ఆ మహాత్ముడు వేదాంత విరుద్ధమైన మతాలన్నింటిని ఖండించి జీవేశ్వరైక్యతత్త్వాన్ని స్థాపించి అద్వైతాన్ని ప్రతిపాదించి, బోధించారు. అందువలన బద్ధులైన జనులు బ్రహ్మజ్ఞానాన్ని పొంది ముక్తులయ్యారు. శ్రీ శంకరాచార్యులు జ్ఞానమార్గాన్ని మాత్రమే బోధించారనీ, కర్మయోగాన్ని విస్మరించారనీ ఒక అపోహ ఉంది. అటువంటి సందేహాలన్నీ 'శ్రీ శంకర విజయం' చదివిన వెంటనే తొలగిపోతాయి. కుమారిలభట్టు అవతార రహస్యం, కర్మయోగ సిద్ధాంతాలను ప్రతిపాదించటానికే అవతరించారని తెలుసుకోగలుగుతారు. అట్లాగే భక్తియోగం జ్ఞానసంపాదనకు మొదటిమెట్టు అని కూడా తెలుసుకుంటారు. శ్రీ శంకరాచార్యులవారు చేసిన లోకోపకారాలు అంతో ఇంతో తెలియని వారుండరు. అయినా ఈ మహాపురుషుని చరిత్ర చదవటంవల్ల ఇంకా స్పష్టంగా తెలుసుకోగలుగుతారు. ఆదిశంకరుల చరిత్రలు ప్రపంచంలో ఎన్ని ఉన్నాయో స్పష్టంగా తెలియదు. సంస్కృతంలో

పదైనా ఉంటాయని అంటారు. అయితే ఇప్పుడు ప్రచారంలో మాత్రం మూడే కనిపిస్తున్నాయి. అంతేకాకుండా శ్రీ శంకర భగవత్పాదుల వారు జీవించిన కాలాన్ని నిర్ణయించటంలో కూడా భిన్నాభిప్రాయాలున్నాయి. వెంపరాల సూర్య నారాయణ శాస్త్రిగారు రచించిన పద్యకావ్యంలో వారు సేకరించిన పీఠికలో పొందుపరచిన విషయాలు పాఠకులకు ఎంతో ఉపయోగంగా ఉంటాయనే తలంపుతో ఇక్కడ యథాతథంగా పొందుపరుస్తున్నాం.

1. శృంగేరీపీఠం వారు — క్రీ.పూ. 36 ప్రాంతాల్లో జీవించి ఉంటాడని
2. కాంచీమఠం వారు — క్రీ.పూ. 508 ప్రాంతాల్లో జీవించి ఉంటాడని
3. జగన్నాథమఠం వారు — క్రీ.పూ. 516 ప్రాంతాల్లో జీవించి ఉంటాడని
4. ద్వారకామఠం వారు — క్రీ.పూ. 541 ప్రాంతాల్లో జీవించి ఉంటాడని

భిన్నాభిప్రాయాలు వెల్లడిచేసినా, వైశాఖశుద్ధ పంచమినాడు ప్రపంచంలో ఎల్లరూ శంకర జయంతి జరుపుకొంటున్నారు.

జగద్గురువులు శ్రీ శంకరాచార్యులవారి జన్మకాలం గూర్చి ఎందరు ఎన్ని విధాలుగా నిర్ణయించినా రెండువేల సంవత్సరాలకు పూర్వమేనన్నది నిర్వివాదాంశం. జగద్గురువులు లోకానికి చేసిన మహోపకారాన్ని విలువకట్టే సత్తా ఎవరికీ లేదు. శ్రీ శంకరుల ప్రజ్ఞాశక్తి సర్వవిలక్షణమనీ, అప్రతిహత మనీ, అపారమనీ వారి గ్రంథాలందలి విషయాలే చాటి చెబుతున్నవి.

శ్రీ శంకరభగవానులు ప్రస్థానత్రయ భాష్యాన్నేగాక వేదాంతసారమంతా తేలికగా అర్థమయ్యే విధంగా 'అపరోక్షానుభూతి', 'తత్త్వవివేకము', 'ఆత్మబోధ' మొదలైన అనేక గ్రంథాలను రచించి లోకానికి అందించారు.

శ్రీశంకరభగవత్పాదులకు శివకేశవ భేదం లేదు. సర్వవ్యాపకం, సర్వచైతన్యమూర్తి ఒక్క పరబ్రహ్మమేనని లోకానికి తెలియచేయడానికే,

దేవతలందరి అనుగ్రహం పొందడానికి, వేదాంతంలోని గంభీరమైన సారాన్ని సగుణనిర్గుణతత్త్వాన్ని తెలుసుకోవడానికి, చతుర్విధ పురుషార్థాలను పొందగల అనేక స్తోత్రాలను రచించారు. (శివానందలహరి, సౌందర్యలహరి, భజ గోవిందము, హరిమీడే స్తోత్రము, షట్పది మొదలైనవి)

శ్రీశంకరభగవత్పాదులు ఏయే మతాలను ఖండించారో, పై స్తోత్రా లన్నీ ఏ ప్రదేశంలో రచించారో, ఏయే ప్రదేశాలందు శిష్యులకు భాష్యాలను బోధించారో, జనుల ముక్తిని కోరి ఎట్టి జ్ఞానామృతాన్ని ఉపదేశించారో మొదలైన విషయాలన్నీ ఈ గ్రంథంనుండి పొందగలరు. అంతే కాక, తమ శిష్యులైన సురేశ్వరాచార్య, పద్మపాదాచార్య, హస్తామలకాచార్య, తోటకాచార్యులకు వేదాంత ప్రచారానికై భాష్యాలను ఏయే రీతులలో బోధించారో చక్కగా తెలియబరచబడినది. ఎక్కడెక్కడ మఠాలను స్థాపించారో వాటికి ఎవరిని మఠాధిపతులుగా నియమించారో తెలుసుకోవచ్చు. శంకరుల భాషా శైలి మృదుమధురమేగాక శబ్దగాంభీర్యంలో మరొకరు వారికి సాటిరారు.

ఈ గ్రంథకర్త, శ్రీ విద్యారణ్యస్వాములవారు మహాగంభీరమైన ఈ 'శంకర విజయకావ్యం' రచించారు. పూర్వాశ్రమంలో వీరి నామధేయం శ్రీ మాధవాచార్యులుగా ప్రసిద్ధిచెందినది. అందువలన ఈ గ్రంథం శ్రీ మాధవాచార్య కృత, 'శ్రీ శంకర విజయ'మనే నామంతో ప్రసిద్ధి పొందినది. ఈ గ్రంథంలో ప్రాచీన శంకర విజయానికన్నా, వేదాంతాది సకల శాస్త్ర రహస్యాలు విపులంగా వివరించబడినవని పండితుల అభిప్రాయం.

శ్రీ విద్యారణ్య స్వాములవారు సుమారు 500 సంవత్సరాలకు పూర్వం తుంగభద్రా నదీతీరాన నివసించేవారు. స్వాములవారు వేదాల్లోని శిక్ష, వ్యాకరణము, ధర్మశాస్త్రము మొదలైన షడంగాలను అధ్యయనం చేశారు. వీరు నాలుగు వేదాలకూ భాష్యం వ్రాశారు. మహాపండితులుకూడా వీరు రచించిన భాష్యాలనుండి వేదార్థాలను పొంది అనేక సందేహాలను నివృత్తి చేసుకొంటున్నారు. పంచవింశ బ్రాహ్మణ భాష్యం, షడ్వింశ బ్రాహ్మణ

భాష్యం, జ్యోతిష గ్రంథాలు, జైమినీ న్యాయమాల అనే మీమాంసా వ్యాఖ్యానం, జీవన్ముక్తి ప్రకాశిక, అనుభూతి ప్రకాశం, వేదాంత పంచదశి మొదలైన అనేక గ్రంథాలను రచించారు. ఈ 'శంకర విజయ' గ్రంథం మహాకావ్యలక్షణాలు కలిగినదని పండితుల అభిప్రాయం. ఎందుకంటే, వీరి శ్రీ శంకర విజయంలో కల్పితాంశం లేకపోయినా, ఇది నవరసాలతో మనోహరమైన భావార్థాలతో కూడి ఉండడమే అందుకు కారణం. శ్రీ విద్యారణ్యస్వామి వారి రచనా విధానం, యథార్థ విషయాలను ప్రతిపాదించటం ఎంతో కొనియాడదగినవి. వీరి గ్రంథంలో పరకాయ ప్రవేశాది అంశాల గురించిన పలువురి సందేహాలను సంపూర్ణంగా నివృత్తి చేశారు. ఇదంతా ఇట్లా ఉండగా, స్వామి వారికి లక్ష్మీకటాక్షం అపారంగా కలగటం వల్ల విద్యానగరాన్ని ఆయనే నిర్మించారని చరిత్రకారులు చెబుతున్నారు.

శ్రీ శంకరభగవత్పాదులు కేరళ రాష్ట్రంలో జన్మించారనడం జగద్విదితమే. ఆదిశంకరుల జీవితాన్ని తెలియబరిచే గ్రంథాలు అనేకం ఉన్నా కూడా, ఈ శ్రీ మాధవాచార్య కృతమైన 'శంకర విజయ'మే సర్వసమ్మతమై, ఇతర గ్రంథాలలో తలమానికమై నిలిచింది. స్వామీజీ చాలాకాలం తిరుపతి క్షేత్రమున గోకర్ణ తీర్థంలో తీవ్రమైన తపస్సు ఆచరించారు.



# విషయసూచిక





# శ్రీశంకర విజయము

## సర్గము - 1

### మంగళాచరణం

గ్రంథ ప్రస్తావన:

1. సకల సంపత్తితో కూడుకొని స్వయంప్రకాశ స్వరూపుడైన నా గురుదేవులు విద్యాతీర్థుల రూపాన అవతరించిన పరమాత్మకు నమస్కరిస్తున్నాను. విద్యాతీర్థ రూపాన జ్ఞానస్వరూపుడై తలచిన వారినందరి పాపాన్ని నశింపజేసి పవిత్రులను చేసే భగవంతునికి నమస్కరిస్తున్నాను. బ్రహ్మ విద్యాస్వరూపుడయి, అనేక తర్క కుతర్కాలతో కూడిన విద్యను శోధించి, పరిశోధించి, పరిశుభ్రం గావించే భాష్యకారులైన శ్రీ శంకరాచార్యులే విద్యా తీర్థులనబడుతున్నారు.

సరస్వతీదేవి ఏ ప్రవక్త నాశ్రయించి మలిన పంకాలనుండి పరిరక్షించ బడి అందరిచేత పూజలందుకొంటున్నదో, అట్టి శంకరునికి నమస్కరిస్తున్నాను.

వ్యాస మహర్షి బోధించిన బ్రహ్మసూత్రాలకు అర్థాలను, వ్యాఖ్యానాలను చేస్తూ, వేదాలకు ఏ అర్థం చెప్పారో ఆ అర్థమే శ్రుతులకు కూడా న్యాయమవుతుంది. శ్రీ శంకరాచార్యులు బ్రహ్మసూత్రాలకు చెప్పిన అర్థమే వేదయుక్తమైనది. వేదాంతాలకు అర్థాన్ని ప్రవచించిన శ్రీ శంకరులే మాకు రక్షకులు. శ్రీ శంకరులే విద్యాతీర్థులూ, మహేశ్వరుని అవతారమూ కూడా అయి ఉన్నారు. పరమేశ్వరుని అవతారం శ్రీ శంకరాచార్యులే. అట్టి శివావతారానికి

నమస్కరిస్తున్నాను. ఎల్లప్పుడూ నా హృదయంలో ఉండేట్లుగా అర్థిస్తున్నాను. ప్రాచీన శంకర విజయంలోని సారాన్ని గ్రహించి మాధవాచార్యుడనైన నేను స్పష్టంగా చెబుతున్నాను. ఇక నేను చెప్పబోయే శంకర విజయంలో కేవలం బ్రహ్మవిద్యాప్రాప్తిని కలిగించే జీవబ్రహ్మైక్య ప్రాతిపదికనే ప్రధానాంశంగా స్వీకరిస్తూ, శ్రీ శంకర గురుదేవుల జీవిత చరితాన్ని సంగ్ర హంగానూ, మనోహరముగానూ చెబుతాను.

2. ప్రాచీన శంకర విజయం అనేకమైన అర్థాలు, గూఢార్థాలతో విస్తారంగా చెప్పబడినది గదా! మరి సంగ్రహంగా చెప్పదలచుకొన్న ఈ శంకర విజయంలో స్పష్టంగా చెప్పగలనా అని సందేహించవద్దు. పర్వత శిఖరాలను, ఏనుగుల సమూహాలను, చిన్న అద్దంలో స్పష్టంగా చూడడం లేదా? అలాగే నేను కూడా విస్తారంగా చెప్పబడిన ప్రాచీన శంకర విజయంలోని శ్రీశంకరవాక్య సముదాయాన్ని, జీవిత విశేషాలను స్పష్టంగా చూపుతాను.

నా శక్తియుక్తులన్నీ ఉపయోగించి ప్రాచీన శంకరవిజయంలోని సారాంశమంతా సంగ్రహించి నేను తలపెట్టిన ఈ శంకర విజయంలో చొప్పించాను. ప్రాచీన శంకర విజయం మహోన్నతమైన కల్పవృక్షం వంటిది. అందలి సుకుమారమైన పుష్పాలనుండి పండితులు భ్రమరాలై సారాంశా మృతాన్ని పానం చేస్తున్నారు. గురువరేణ్యులైన శంకర భగవత్పాదులవారిని మనస్సులో ధ్యానించి శ్రీ శంకర విజయం రచించడానికి పూనుకొన్నాను.

3. పంచామృతంలోని చక్కెర, తేనె మొదలైన పదార్థాలన్నీ మధుర మైనవే అయినా ఒక దానితో మరొకటి చేరేటప్పుడు కొత్త రుచి పుడుతుంది. అట్లే అనేకమంది పండితులచే విరచితమైన ప్రాచీన శంకర విజయానికి నాచే రచించబడే కావ్యం తోడై ఎంతో మేలైన రుచుల నందించగలదని నా విశ్వాసం. బంగారం అందరికీ ప్రియమైనదే. దానికి మెరుగుపెడితే మహోజ్జ్వలంగా ప్రకాశిస్తుంది. అలాగే నా కావ్యం ప్రాచీన కావ్యానికి మెరుగులు దిద్దగలదు. మేరుపర్వతమే బంగారు కాంతు లీనుతుండగా, అక్కడ వెలసిన కల్పవృక్షం మరింత శోభాయమానంగా ఉంటుంది. అట్లే

ప్రాచీన దిగ్విజయానికి ఈ సంగ్రహరూప శంకర విజయం శోభను పెంచుతుందే గాని తరగనీయదు.

4. పురాతన కవు లెందరో శ్రీ శంకరాచార్యుల వారిని స్తుతించారు. అనేకమంది భాష్యకారులు శ్రీ శంకరుల చరితాన్ని వ్రాసి శంకరులను సంతుష్టుని చేసి కృతార్థులైనారు. నా ఈ స్వల్ప గ్రంథంచే నన్ను ధన్యుని చేస్తారుగాక! పూర్ణకాముడైన భగవంతుడు భక్తుడు సమర్పించే ఎలాంటి స్వల్ప విషయానికైనా సంతుష్టుడవుతాడు. శ్రీ మహావిష్ణువు నిత్యమూ క్షీరసాగరంలో శేషశాయిపై పరుండినా, గోపిక లిచ్చే కొద్దిపాటి పాలనే తృప్తిగా గ్రోలి వారందరినీ అనుగ్రహిస్తున్నాడు. అలాగే భగవత్పాదులవారు కూడా దయతో నన్ననుగ్రహిస్తారుగాక!

5. పతంజలి వంటి మహర్షులు వ్యాకరణ భాష్యం బోధించారు. అది శబ్దశాస్త్రం మాత్రమే. మహేశ్వరావతారుడైన శ్రీ శంకరులు సమస్త వేదసారమూ, శబ్దాతీతమూ అయిన బ్రహ్మసూత్రాలకు భాష్యం రచించాడు. శ్రీ శంకరుని అవతారమైన శ్రీ శంకర భగవత్పాదులను స్మరించినంతనే సకల మాలిన్యాలు నశిస్తాయి.

6. శ్రీ శంకర భగవత్పాదులు సద్వస్తువును ఉపదేశింప అవత రించారు. వసంతకాలాన వికసించే జాజిపువ్వుల పరిమళంకన్నా, మాలతీ పుష్పాలందలి మకరందంకన్నా మధురమైన శంకరభగవానుల ఉపదేశాలు, సద్గుణాలు నాలుగు దిక్కులకూ వ్యాపించినవి. మహాపవిత్రమైన అట్టి శంకర భగవానుల గుణగణా లెక్కడ? ప్రాకృతబుద్ధి గల నేనెక్కడ? నేను కేవలం గురుకృపచేతనే ఆయన గుణవర్ణనలు చేస్తున్నానే గాని అది నా సామర్థ్యం కాదు.

7. ఇంత కాలం నరాధములైన రాజులను సేవించాను. అయోగ్యు లైనా కూడా యోగ్యులని, ధన్యజీవులు కాకపోయినా ధన్యులని వారిని స్తుతించాను. ధనమదాంధులైన వారి చరితాలను పలురకాలుగా కల్పిత

కథలచేత వర్ణించాను. నా ప్రజ్ఞాపాటవాలన్నీ మలినమైపోయాయి. నా వాక్కు పాపపంకిలమైనది. నా శాస్త్రపాండిత్యమంతా నరాధముల సేవల కొరకే వ్యర్థమైనది.

అట్టి నా వాక్కు శ్రీ శంకర భగవత్పాదులవారి పవిత్ర చరిత్రను రచించటంచేత శుద్ధమైనది. నా అంతఃకరణం పవిత్ర మవుతున్నది. ఈ విషయంలో వేదవ్యాసులవారి వాక్యమే ప్రమాణం.

విషయవాంఛాపరులను వర్ణించటమనే అరణ్యంలో పొర్లటంచేత పాపధూళితో మలినమైనది. వాక్కులను భగవత్కథాలాపమనే గంగా జలంతో పవిత్రం చేసుకొంటున్నాను.

8. నరాధములైన రాజులను స్తుతించడమంటే గొడ్రాలి బిడ్డ, గాడిద కొమ్ములమల్లే అసత్యాలై ఉన్నవి. అట్లే క్షుద్రులైన ప్రభువులను కీర్తిప్రతిష్ఠలకు, సంపదలకు ఇంద్రునితోను, కుబేరునితోను పోల్చి వర్ణిస్తున్నారు. అట్టి వర్ణనలు దుర్వాసనతో కూడి ఉంటవి. అజ్ఞానుడనై నేను రాజులను ఆ విధంగా వర్ణించేవాడను. అందుచేత నా వాక్కు కూడా దుర్గంధపూరితమైనది. అటువంటి నేను ముల్లోకాలచే కీర్తించబడే శ్రీ శంకరాచార్యుల వారి కీర్తి అనే నర్తకి యొక్క సుగంధం, మలిన వాసనలన్నిటినీ పారద్రోలుతున్నది. శ్రీ శంకరులవారి కీర్తి నలు దిక్కులకు వ్యాపిస్తున్నది. అట్టి మహనీయుని సంకీర్తనం గావించి నా వాక్కును శుద్ధి చేసుకొంటాను. శ్రీ శంకర గుణాలను కీర్తించటమే నాకు పరమ శరణ్యం.

9. ప్రేమ స్థైర్యాలతో కూడుకొన్న గురుదేవులను భక్తిపూర్వకంగా మృదుమధురమైన గుణవర్ణనలతో వర్ణించి చెబుతాను. ఈ శంకర విజయమనే కావ్యం దేవతలను పారిజాత వృక్షం సంతోషపరచేట్లు, పండితులను సహృదయులను సుగంధాలను వెదజల్లుతూ ఆనందసాగరంలో ఉంచుగాక! చంద్రశేఖరుని అవతారమైన శంకర భగవత్పాదులకు నా కవితలను పుష్పమాలలు చేసి భక్తితో సమర్పిస్తాను.

10. ఈ శంకర విజయ కావ్యం మాధుర్యంతో, పరిమళంతో కూడి కస్తూరికా ద్రవ్యాలమల్లే ఘుమఘుమ లాడుతూ ప్రీతికరమవు తున్నది.

క్రూరస్వభావులైన తురుష్కులు సాధుస్వభావం కలిగిన గోమాతను హింసిస్తున్నారు. అట్లే రసజ్ఞులు కానివారు, కఠిన స్వభావులైన కుకవులు శంకర విజయ మనే నా పవిత్ర కావ్యాన్ని ఆదరింపక కువిమర్శలతో నిందిస్తారు.

11. నా కావ్యాన్ని గూర్చి ఇంతగా ఆలోచించవలసిన పనిలేదు. ఎందువల్లనంటే, ఇంత విశాల ప్రపంచంలో నా గ్రంథాన్ని ఆదరించే సహృదయులే కరువవుతారా? దేశంలో మనోజ్ఞమైన హృదయం గలవారు, శ్రేష్ఠమైన సూక్తులను గ్రహించగలవారు, సత్పురుషులు, రసజ్ఞులు, మహాకవులు ఉన్నారు. నేను చింతింపవలసిన పనిలేదు. శంకర భగవత్పాదులవారి స్తుతిరూపమై యీ కావ్యాన్ని ఆదరిస్తే ఎంతో సంతోషిస్తాను. నా కావ్యాన్ని నిర్విఘ్నంగా పరిసమాప్తి గావిస్తాను. అందుకు ఆ శంకరుల ఆదర మెన్నడూ లభించగలదు.

12. పవిత్రమైన కార్యాలు తలపెట్టినప్పుడు విఘ్నాల నెదుర్కోవడం సహజమే. శ్రీ శంకరుల చరిత్ర వ్రాయడం అంటే అది అంత చిన్న విషయ మేమీ కాదు. శంకరుల చరిత్ర వ్రాయాలని అనేక మంది ప్రయ త్నించారు. కొందరు ముందుకు సాగలేక ఆగిపోయారు. మరికొందరు మధ్యలో ఆగిపోయారు. అయితే గురుదేవులైన శ్రీ శంకరులకు నా యందున్న అవ్యాజ ప్రేమచేత నేను ఈ ప్రయత్నంలో విజయం సాధిస్తాను. కొందరు రెండు పాదాలకు అర్థాలు వ్రాయగలిగారు. మరికొందరు శ్లోకార్థం సగమే వ్రాయగలిగారు. నే నెంతవరకు సఫలీకృతుడ నవుతానో చూద్దాం! పిల్లలు ఆకాశంలో ఉన్న చంద్రుణ్ణి పట్టుకోవాలని విఫల ప్రయత్నం చేస్తారు. అయితే నా ప్రయత్నం కూడా అటువంటిదేనా?

గ్రంథం ప్రారంభించే ముందు కవులు తమ గూర్చి తక్కువ చేసి మాట్లాడుకోవటం జరుగుతూనే ఉంటుంది. అది వారికి అలంకారమే గాని అవమానం ఎన్నటికీ కానేరదు. కొందరు ప్రారంభించి ముందుకు సాగలేకపోయారంటే, ప్రతిష్ఠకోసం ప్రారంభించడం గురుదేవులపై పూర్తి విశ్వాసం లేకపోవడమే అందుకు కారణం. శ్రీ శంకరుల అనుగ్రహం నాపట్ల సంపూర్ణంగా ఉంది. అందువలన నేను నిర్విఘ్నంగా ఈ గ్రంథాన్ని పూర్తి చేస్తాను.

13. అనేక మందికి సాధ్యపడని శ్రీ శంకర విజయ మహాకావ్య రచనలో నేను సఫలీకృతుడను కాగలను. ఎందువల్లనంటే, గురుకృప ఉంటే మందమతులు, నోరు లేనివారే కావ్యాలు వ్రాయగలుగుతున్నారు. ఇక కొద్దిపాటి జ్ఞానం ఉన్న నేను ఈ కావ్యాన్ని వ్రాయలేనా? తప్పక కృతార్థుడనవుతాను. అంతా గురుకటాక్షమే.

14. సర్వవిద్యాధిష్ఠాన స్వరూపిణియైన శ్రీ సరస్వతీదేవి సంతుష్టి చెంది నా నాలుకపై నాట్యం చేస్తుందిగాక! కవిత్వ ధాటి అంతరాయం లేకుండా ప్రవహించుగాక! అప్రతిహత ధాటి గలిగి, మృదుమధురమైన పల్కులతో, గంభీరమైన పదాలతో అందరి హృదయాలనూ ఆనందపరచు గాక!

15. సామర్థ్యంలేక మధ్యలో విరమించిన పక్షంలో తప్పక అపకీర్తి పాలవుతారు. అలా అయితే ముందుగానే గ్రంథ రచనాకార్యాన్ని విర మించుకోవడం మంచిది.

వేదాంత తత్త్వభరితమైన శ్రీ శంకర సద్గురుల చరిత మెక్కడ? కల్పితాలు, క్షుద్రవర్ణాలతో కూడిన రచనలు చేసే నే నెక్కడ? శ్రీ శంకరగురు పవిత్ర చరిత్రను వ్రాయాలంటే సూక్ష్మబుద్ధి, కుశలత అవసరమై ఉన్నవి. విచారణ చేసి చూస్తే నా కంత సామర్థ్యం ఉన్నట్లు తెలియడం లేదు. అందుచేత, అమృతప్రాయమైన శ్రీ శంకర విజయ చరితాన్ని వృథాగా ఉప్పు నీటిలో కలిపి నాశనం చేస్తున్నావని పారిపోతున్న నా చంచల వాక్కును శ్రీ శంకరుల

గుణగణాలను స్తుతించమని కవులు ప్రేరేపిస్తున్నారు. వీరికి గురువు యెడల గల గౌరవము ఎంత అద్భుతమయినది.

శ్రీ శంకరుల గుణాలు నిష్కళంకమై మహిమాసంపన్నమై కవీశ్వరు లందరినీ ఆకర్షించి వర్ణింపజేస్తున్నవి. వారందరూ కృతార్థులవడం వలన నేను కూడా కృతార్థుడనవుతాననే నమ్మకం కలుగుతున్నది. కనుక శ్రీ శంకరుల సద్గుణాలు సర్వప్రేరకాలై ఉన్నవి.

16. అరణ్యంలో మృదుస్వభావం గల ఒక ఆడ జింక కిరాతునికి చిక్కుకొని నాశనమై పోతున్నది. అట్లే మృదుమధుర భావాలతో నేను ఎంతగానో శ్రమజేసి ఈ శంకర విజయ కావ్యాన్ని రచించాను. అట్లే నా రచనపై కుకవులు చేసే దుర్వ్యాఖ్యానాల వలన నా వాఙ్మాధుర్యం, సుకుమార విషయాలు నిందింపబడవచ్చు.

17. శ్రీ శంకర విజయం కూడా కావ్యలక్షణాలు గలదని పండి తులు పలుకుతున్నారు. ఈ గ్రంథం లౌకిక కావ్యాలమల్లే గాక మోక్షహేతు వవడం వలన అలౌకిక కావ్యమై ఉన్నది. లోకంలో శ్రేష్ఠమైన, చమత్కృతితో కూడిన ఆనందాన్ని కలిగించే రచనలను కావ్యాలంటారు. ఆ విధంగా శ్రీ శంకర విజయం మహాకావ్యమని చెప్పబడవచ్చు.

శబ్ద ప్రధానాలు వేదాలు. అర్థప్రధానాలు పురాణాలు. రసప్రధానాలు కావ్యాలు. శబ్దార్థ ప్రధానాలైన వేదపురాణాలకన్నా కావ్యాలు సరసమైనవి, మనోజ్ఞమైనవి, సులభమై పురుషుని కర్తవ్యం, ధర్మ అనుష్ఠానాలను సూచిస్తూ ప్రవర్తింపచేస్తున్నవి. కనుకనే శ్రీమద్రామాయణ, శ్రీ యోగవాసిష్ఠ, భారత భాగవతాలతో జనులు నడచుకొంటున్నారు. అందులోని ధర్మానుష్ఠానా లను శ్రవణం చేస్తున్నారు. మనన నిధిధ్యాసనలచేత ఆత్మసాక్షాత్కారం పొందుతున్నారు. శ్రీ శంకర విజయం వలన కూడా అట్టి ఫలితాలనే పొందగలరు.

18. ఈ శంకర విజయ కావ్యం నవరసభరితమై జనులందరి హృదయాలను రంజింపజేస్తుంది. ఈ కావ్య ప్రధాన ఉద్దేశ మేమంటే,

అనర్థాలన్నిటికీ కారణమైన అవిద్య నశించి, బ్రహ్మానంద ప్రాప్తి కలగడమే.

ఈ శ్రీ శంకర విజయ మహాకావ్యమనే రచన చేస్తున్న నేను కూడా కృతార్థుడనే కాగలను. అంతా శ్రీ శంకర గురువరుని కృపా కటాక్షమే. ఆ మహాత్ముని అనుగ్రహం సర్వదా కలుగుగాక!

శ్రీ శంకర విజయ కావ్యం పదునారు సర్గాలతో కూడుకొని ఉన్నది. అందులో ప్రథమ సర్గంలో ఉపోద్ఘాతం ప్రస్తావించబడినది. ద్వితీయ సర్గంలో భగవంతుడైన మహేశ్వరుని అవతారమయిన శ్రీ శంకరాచార్యుల జననం ప్రస్తావించబడినది. తృతీయ సర్గంలో నానా దేవతల అవతారాలు, నిరూపణ పేర్కొనబడినవి.

19. చతుర్థ సర్గంలో శ్రీ శంకర భగవత్పాదులవారి పదునెనిమిది సంవత్సరాల వృత్తాంతమూ తెలియబరచారు. పంచమ సర్గంలో శ్రీ శంకరుల సన్న్యాసాశ్రమాన్ని గూర్చి వివరించబడినది.

20. షష్ఠ సర్గంలో మహర్షుల సంప్రదాయానుగుణమైన ఆత్మవిద్య, శ్రీ శంకరాచార్యులవారు సుస్థిర ప్రతిష్ఠను పొందటం నిరూపించబడినది.

21. సప్తమ సర్గంలో శ్రీ శంకరాచార్యులవారికి వేదవ్యాసుల సందర్శనం. అష్టమ సర్గంలో శ్రీ మండన మిశ్ర – శ్రీ శంకరాచార్యుల సంవాదం.

22. నవమ సర్గంలో శ్రీ మండనమిశ్రుల భార్య శ్రీ ఉభయభారతీ దేవినే ధర్మనిర్ణేతగా నియమించుకొని శ్రీ మండనమిశ్రునితో సంవాదం. దశమ సర్గంలో శ్రీ శంకరులు పరకాయప్రవేశమనే యోగమహిమచే రాజు దేహంలో ప్రవేశించటం.

23. దశమ సర్గంలో పరకాయ ప్రవేశ విద్యాఫలితమైన కామశాస్త్ర విద్యాపాటవాన్ని ప్రకటించారు. ఏకాదశ సర్గంలో ఉగ్రభైరవ నామధేయ మహాకాపాలకుడు సంహరించబడటం.

24. ద్వాదశ సర్గంలో హస్తామలక, తోటకు లనేవారు శ్రీ శంకరాచార్యుల నాశ్రయించి శిష్యులవడం. త్రయోదశ సర్గంలో వార్తికాలతో కూడిన

బ్రహ్మ మంత్ర భాష్య రూపమైన బ్రహ్మ విద్యాప్రచారాన్ని ప్రతిపాదించడం.

25. చతుర్దశ సర్గంలో శ్రీ పద్మపాద తీర్థయాత్రా నిరూపణం. పంచదశ సర్గంలో శ్రీ శంకరాచార్య కృత దిగ్విజయ వర్ణనం.

26. షోడశ సర్గలో శ్రీ శంకరాచార్యులు శారదా పీఠం స్థాపించి అందులో నివసించడం. ఈ విధంగా పదునారు సర్గాలందు శ్రీ శంకరాచార్యుల దివ్యచరిత్ర విపులంగా వివరించబడినది.

27. సుప్రసిద్ధమైన శ్రీ శంకర చరితం సర్వపాపాలను హరిస్తుంది. ఒకసారి విన్నంతనే అన్ని మనోరథాలను ఈడేరుస్తుంది.



# సర్గము - 2

## శివగురు, ఆర్యాంబలకు శ్రీ శంకరులు జన్మించడం

1. శ్రీ కుమారస్వామి తన తండ్రియైన పరమేశ్వరుని ఆజ్ఞను శిరసా వహించి కుమారిలభట్టుగా అవతరించి లోకంలో వేదకర్మ కాండ ప్రవృత్తిని సుస్థిరంగా ప్రతిష్ఠించాడు. మరల జీర్ణించిపోయిన జ్ఞానకాండను ఉద్ధరింప చంద్రశేఖరుడైన మహేశ్వరుడు కేరళ దేశమందలి వృషాచల పర్వత పంక్తులలోని పూర్ణానదీ తీరాన సర్వజనుల విషయాసక్తిని హరించడానికై జ్యోతిర్లింగరూపంలో అవతరించాడు.

2. ఇలా జ్యోతిర్లింగరూపమై అవతరించిన పరమేశ్వరుడు ఆ దేశానికి రాజైన రాజశేఖర మహారాజునకు స్వప్నంలో సాక్షాత్కరించగా, ఆ ప్రభువు పరమేశ్వరుని ఆజ్ఞానుసారం జ్యోతిర్లింగేశ్వరునకు దేవాలయం నిర్మించి నిత్యపూజకు ఏర్పాట్లు చేశాడు.

3. సర్వ లక్షణాలతో కూడిన, మనోహరమైన 'కాలడి' అనే బ్రాహ్మణ అగ్రహార మొకటి ఆ దేవాలయానికి సమీపంలోనే విలసిల్లుతున్నది.

4. మనోహరమూ సకల జనానందకరమూ అయిన 'కాలడి' అనే ఆ అగ్రహారంలో మహేశ్వరుడు అవతరింపదలచి పుణ్యదంపతుల గర్భానికై అన్వేషించాడు. ఆ గ్రామంలో విద్యాధిరాజనే బ్రాహ్మణోత్తము డొకడు నివసిస్తు న్నాడు. అతడు సకల శాస్త్రాలందూ, ఆత్మతత్త్వమందూ మనస్సు నిశ్చలపరచి ప్రకాశిస్తూన్నాడు.

5. మహాపండితుడైన విద్యాధిరాజుకి పూర్వజన్మ సుకృతంచే బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతూ పుత్రుడు కలిగాడు. జ్ఞానంలో శివునిగాను, విద్యయందు బృహస్పతిగాను ఉండటంచేత ఆ శిశువుకు 'శివగురు' వని నామకరణం చేశారు.

6. విద్యాధిరాజు తనయుడైన శివగురు గురుకులవాసంలో గురువుకు శుశ్రూషలు చేస్తూ, భిక్షాటనచే దొరికిన ఆహారాన్ని ముందుగా గురువునకు సమర్పించేవాడు. గురువు అనుమతిస్తే భుజించేవాడు. లేకుంటే నిరాహారంతో గడిపేవాడు. బ్రహ్మచర్యవ్రతాన్ని నిష్ఠతో కొనసాగిస్తూ ఉదయం, సాయంకాలం అగ్నిహోత్రం చేస్తూ అధ్యయనం చేయసాగాడు.

7. వేదార్థాన్ని తెలుసుకోవడానికి విచారణతో కూడిన పూర్వమీమాంస శాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. (ఎంతటి విద్వాంసుడైనా పూర్వమీమాంసా శాస్త్రాన్ని అధ్యయనం చేయనిదే వేదార్థాన్ని పొందజాలడు). కనుక శివగురు పూర్వమీమాంసాశాస్త్రంతో కూడిన వేదవేదాంగాలను అధ్యయనం చేశాడు. ఇందువలన తెలిసేదేమంటే, ఏ శాస్త్రమైనా అర్థం తెలియకుండా అధ్యయనం చేసినంత మాత్రాన ఎలాటి ప్రయోజనమూ పొందజాలరు.

8. బ్రహ్మచర్యవ్రతంతో వేదాధ్యయనం పూర్తి అయిన తరువాత గృహస్థాశ్రమాన్ని స్వీకరించాలని గురువు ఈ విధంగా ఉపదేశించాడు:

"వేదాధ్యయనం ముగిసింది. వేదార్థాలు తెలుసుకోవడానికి మూలమైన పూర్వమీమాంస కూడా బాగా చదివావు. సందేహాలు లేకుండేట్లుగా విచారణ చేశావు. నువ్విక్కడకు వచ్చి చాలాకాలమైనది. (గురుకులవాసంలో పన్నెండు సంవత్సరాలు శాస్త్రాధ్యయనం నియమంతో చేయాలనీ, అప్పుడే పవిత్రాత్ము డవుతాడనీ మనుధర్మశాస్త్రం వచిస్తున్నది.)

9. "నువ్వు నాకు పరమ భక్తుడవు. నువ్వు చేసిన శుశ్రూషలచే పరమానందం పొందాను. సాంగ వేదాధ్యయనాదులను చేశావు. కనుక ఇక ఇంటికి వెళ్లు. తల్లితండ్రులు నీకై ఎదురుచూస్తుంటారు. వారిని సంతోష పరచు.

10. "వత్సా! జీవితం క్షణభంగురమని తలచి మధ్యాహ్నం చేయ వలసిన పనులు ఉదయానే పూర్తి చేసుకోవాలి. అలాగే రేపు చేయవలసిన పనులు ఈ రోజే పూర్తి చేసుకోవాలి. ఈ విధంగా పనులన్నీ ముందు గానే పూర్తి చేసుకొని సిద్ధంగా ఉండాలని శాస్త్రాలు వచిస్తున్నాయి."

11. సకాలంలో విత్తనాలు నాటితేనే అవి మొలకెత్తి అధికమైన పంటలు పండుతాయి. కాలం తప్పించి నాటితే ఫలించవు. అదే విధంగా యౌవనంలో వివాహం చేసుకొంటే సంతానం కలుగుతుంది. అలాకాక యౌవనం రాకముందో, యౌవనం మించిపోయిన తరువాతనో వివాహం చేసుకొంటే ఫలితాలుండవు.

12. కుమారా! తల్లిదండ్రులు శిశువు జన్మించగానే అతడి వివాహాన్ని గూర్చి కలలు కంటారు. కనుక నీ తల్లితండ్రుల కలలను పండించు.

13. ఆ యా వంశాలకు చెందిన పితృదేవతలు తమకు అంతరాయం లేకుండా పిండప్రదానాలు జరగాలని కోరుకొంటారు. కాబట్టి పితరులు తమ సంతతి ఎడతెగకుండా ఉండడానికి తమ వంశం వృద్ధి చెందుతూనే ఉండాలని కోరుకొంటారు.

14. వేదాన్ని అర్థం చేసుకోవాలంటే మీమాంసాశాస్త్రం పఠించాలి. అప్పుడే వేదమందలి ధర్మతత్త్వం, విజ్ఞాన విచారాలతో కూడివున్న మీమాంస శాస్త్రమందలి ఫలం పొందవచ్చు. కనుక వివిధాలైన యజ్ఞయాగాదులను అనుష్ఠానం చేయడానికే వేదాన్ని అర్థం చేసుకోవలసి ఉంది. అటువంటి వేదవిదితమైన ధర్మాలను ఆచరించాలంటే వివాహం చేసుకోవాలి. తరువాత ధర్మపత్నీ సమేతుడైతేనే పవిత్ర గృహమేధి అవడానికి అధికారం పొందగలడు. వివాహానికి పరమ లక్ష్యం ధర్మానుష్ఠానమే కాని, పిండప్రదానమో లేక సంతానోత్పత్తో కాదు.

15. ముముక్షువుల వైరాగ్యం తీవ్రమైనదయితే వివాహాశ్రమాన్ని స్వీకరించకుండానే సన్న్యసించవచ్చు. అందువలన తీవ్రవైరాగ్యశాలీ, ధీమంతుడూ అయిన శివగురు, గురువుతో ఇలా నివేదిస్తున్నాడు.

**శివగురు:** “గురూత్తమా! తమరు చెప్పింది యథార్థమే. కానీ, నైష్ఠిక బ్రహ్మచర్యం పాటిస్తూ, వేదాధ్యయనం చేసిన పురుషుడు తప్పనిసరిగా గృహస్థాశ్రమం స్వీకరించాలనీ, ఇతర ఆశ్రమాలు స్వీకరించరాదనీ వేదాలలో కఠిన నియమాలేవీ చెప్పబడలేదు.

ఆత్మవిముక్తిని కోరే వివేకి, వైరాగ్య దురంధరుడైన ముముక్షువు, నాల్గవదియైన సన్న్యాసాశ్రమాన్ని పొందుతున్నాడు. అలాగాక సంపూర్ణ వైరాగ్యంలేక ధనం, సంపదలు, స్వర్గాది భోగాలను కోరుకొనేవాడు బ్రహ్మచర్యం నుండి గృహస్థాశ్రమాన్ని స్వీకరించవచ్చు. వారికి కలిగే వైరాగ్యం ఉత్తమమైనదా లేక మందమైనదా అన్న తీవ్రతనుబట్టి వారు ఆ యా ఆశ్రమాలను స్వీక రించవచ్చు. అందరూ గృహస్థులు కావాలని గాని, అందరూ నైష్ఠిక బ్రహ్మ చారులు కావాలనే వేదోక్తమైన నియమం లేదు.

ఈ విషయమై శ్రుతి ప్రమాణాలిలా ఉన్నాయి:

i. బ్రహ్మచర్యం పూర్తిచేసి గృహస్థుడు కావాలి. తరువాత వానప్రస్థం, అటు తరువాత సన్న్యసించాలి.

ii. బ్రహ్మతత్త్వాన్ని పొందగోరేవారు పరమాత్మను వేదాలలో వర్ణించినట్లు, యజ్ఞం చేత అవినాశియగు తపస్సు చేత ఆత్మవృత్తులను హోమించిన వాడు తెలియుచున్నాడు. ఈ పవిత్ర కర్మానుష్ఠానంచే నా దేహం సంస్కరించబడి, జ్ఞానార్జనయోగ్యంగా చేయబడుచున్నది.

iii. విశుద్ధ సత్త్వగుణోపేతుడైన పరబ్రహ్మాన్ని ధ్యానించడానికై స్వాత్మరూపాన సాక్షాత్కరిస్తున్నాడు. దేహాన్ని ధరించిన తరువాత దేవ, పితృ, ఋషి ఋణాలతో కూడుకొని ఉండేవాడవుతాడు.

iv. యజ్ఞాలచేత, మహాయజ్ఞాలచేత బ్రహ్మజ్ఞానం పొందడానికి ఈ దేహం యోగ్యమై ఉంది.

v. గర్భాదానాది జాతసంస్కారాది సంస్కారయుక్తాలు 48 విధాలు ఉన్నవి. వీనిచే సంస్కరించబడుచున్నాడు.

vi. మూడు ఋణాలను తీర్చి మనస్సును మోక్షంపట్ల నిలపాలి. పుణ్యకర్మ లాచరించటంచే అంతఃకరణం పరిశుద్ధమై జ్ఞానం కలుగుతున్నది.

పైన పేర్కొన్న ప్రమాణాలతో క్రమంగా ఆశ్రమం స్వీకరించటంచేత, చిత్తశుద్ధి కలిగి జ్ఞానప్రాప్తి కలుగుతుంది. ఇవన్నీ గూడా మందాధికారులకు మాత్రమే వర్తిస్తాయి.

క్రమపద్ధతి అనుసరించకపోనా, బ్రహ్మచర్యం నుండే సన్న్యసించవచ్చు. గృహం నుండి గాని, వనం నుండి గాని సన్న్యసించవచ్చు. యజ్ఞరూపమైన కర్మానుష్ఠానాలు సంసార మనే సముద్రంలో, దృఢం కాని తెప్పలుగానే ఉండిపోతాయి. కర్మలచేత, సంతానంచేత, ధనంచేత విముక్తి కలుగదు. కంటికి కనిపించే దృశ్యవస్తువులపై త్యాగబుద్ధి కలగాలి. అప్పుడే అమృతత్వాన్ని పొందగలరు.

ఈ పై శాంతి వాక్యాలు తీవ్ర వైరాగ్యం కలిగిన ముముక్షువులకు ఆశ్రమ క్రమం పాటించవలసిన అవసరం లేదని తెలుపుతున్నవి. ఇవి ఉత్తమమైన అధికారి విషయమని తెలుపుతున్నవి.

16. మహాత్మా! నేను ఇంతవరకు తమ సన్నిధానంలో ఉన్నట్లుగానే, మరణించేవరకు నిష్ఠతో బ్రహ్మచర్యాన్ని పాటిస్తాను. దృఢమైన సంకల్పంతో పలాశదండాన్ని, కృష్ణాజినాన్ని ధరించి, అగ్నిహోత్రం చేస్తుంటాను. ఇంత వరకు నేర్చిన వేదాలను అధ్యయనం చేస్తాను. జీవిత కాలమంతా శుశ్రూష చేసుకొంటూ మీ వద్దే గడుపుతాను.

17. మహాత్మా! తమ రెందుకు పరమ వైరాగ్యపథాన్ని కప్పిపుచ్చి, కర్మకాండ బంధురమైన ప్రవృత్తి మార్గాన్ని ఉపదేశిస్తున్నారు?

లోకంలో వివాహం వలన మొదట్లో కొన్ని సుఖాలను పొందవచ్చు. భార్యచే వచ్చే కొన్ని బాహ్యసుఖాలు కనిపించినా, సంసారంలో ప్రవే శించిన తరువాత అందులోని సుఖదుఃఖాలు అనుభవంలోకి వస్తాయి. విశ్లేషించి చూడగా, భార్య వలన కలిగే సుఖానుభవాలన్నీ రసం లేనివిగా తోస్తాయి. సంసారం సారం లేనిది. వివేకియైనవాడు సంసార ప్రవృత్తి, దృశ్యపదార్థాలన్నీ రోత కలిగించేవని ఎరిగి వైరాగ్యం పొందుతాడు.

18. వివాహం వలన ఇహలోక సుఖాలు పొందలేకపోయినా, సహధర్మచారణీ సమేతు డవడంచేత యజ్ఞయాగాదులు చేయటం వలన పుణ్యలోకాలైనా దక్కుతాయని అనుకొంటే అదీ దక్కదు. ఎలాగంటే-

శాస్త్రాలలో చెప్పినట్లు సాధన సంపత్తులన్నీ సమకూర్చుకొని చేసే యజ్ఞయాగాదులలో ఏమాత్రం క్రియాలోపం ఉన్నా ఫలం లభించదు. ఎక్కడా ఎటువంటి చిన్న పొరపాటైనా దొర్లకుండా యాగాలు చేయడం అంత సులభమైన విషయ మేమీ కాదు. కాబట్టి యాగాల వలన వర్షాది ఫలాలు లభిస్తాయని చెప్పలేము. చిత్రాది యాగాలు చేస్తే పశుసంపద మున్నగునవి లభిస్తాయి; పశుయాగాదుల వలన వర్షాలు కురుస్తాయి, వాటి వలన కరువు కాటకాలు నశిస్తాయి. అయితే దైవవశాన ఫలం లభించకపోతే యాగానికి చేసిన ఖర్చంతా వృథా అవుతుంది. అంతే కాదు, పశుయాగాదుల వలన పాపం కూడా చుట్టుకొంటుంది. కాబట్టి పారలౌకిక సుఖాలు దొరుకుతాయని కూడా గట్టిగా చెప్పలేము. అన్ని విధాలుగా యాగాది క్రతువులు అనర్థాలనే చెప్పవచ్చు.

ఈ విధంగా శివగురు గురుదేవుని సన్నిధానంలో గృహస్థాశ్రమం అన్ని విధాలా అనర్థమని ప్రతిపాదిస్తూ -

19. అంతేగాక, గృహస్థు దరిద్రుడయితే గృహస్థాశ్రమానికి పరమధర్మా లయిన అతిథి సత్కారం, దానం, భోగం మొదలైన పరమ ధర్మాలను ఆచరించలేడు. ధనంలేని గృహస్థుడు ఇతరులకు ఏ విధంగానూ సహాయపడ లేడు. అటువంటి వాడు పాపం చేసినవాడయి నరకం పొందుతాడు.

ఒకవేళ గృహస్థు సంపన్న కుటుంబంలో జన్మిస్తే పై చెప్పిన కష్టాలు ఉండవని చెప్పవచ్చు. సంపన్న కుటుంబంలో పుట్టినవాదు విషయ పాశాలకు బద్ధులై దుఃఖాలనే పొందుతున్నారు. ఆ విధంగా విషయాలచే సంతృప్తి చెందనివాడు నిస్సందేహంగా పాపి అవుతున్నాడు.

విషయ సుఖాలపై కోరిక ఎన్నటికీ తరిగేది కాదు. నేయి వంటి హవిస్సులచేత అగ్ని చల్లారకపోగా, మరింత పెచ్చు పెరిగేట్లు కామనలు

వృద్ధి అవుతాయి. అటువంటి విషయసుఖాలవల్ల ఆ యా సంస్కారాలు వృద్ధి అవుతవి.

మహాఘోరమైన ఈ సంసారం అంతం లేనిది. అది చల్లారకపోగా వృద్ధియైపోతూనే ఉంటుంది. ఇంద్రియ సుఖాలవల్ల కలిగే దుఃఖాలన్నీ విషయాలేనని తెలుసుకో. రాఘవా! ప్రాణులు విషయాల పట్ల ఎంతగా ఆసక్తి పెంచుకుంటారో, దుఃఖబీజాలు కూడా అంతగానే మొలకెత్తుతుంటాయి. కనుక సంసారమన్నది విషయాలచే నిందించదగ్గది. దుర్ఘటం, దుఃఖ బీజాలకు మూలం.

20. గృహస్థు అయినవాడు బంధువులను, స్నేహితులను సంతోషపెట్ట డానికై వస్తువులు సేకరించటంలో మునిగిపోతాడు. ఈ వస్తుసేకరణ మనే కార్యక్రమం ఎన్నటికీ ముగిసేది కాదు. క్రమంగా తాను ఆర్జించి పెట్టుకొన్న దంతా కరిగిపోతుంది. మరల సేకరణకు కృషి ప్రారంభిస్తారు. ఈ విధంగా విశ్రాంతి లేకుండా పోతుంది. ఇక స్థిరత్వంగాని, శాంతిగాని ఎక్కడ నుండి వస్తుంది? అందువల్ల సంసారం అన్ని విధాలా దుఃఖమయమే.

21. శివగురు సంసారం అనిత్యమని తనకు తోచినదంతా గురు సమ్ముఖాన వెల్లడించాడు. విషయవాంఛలపై తనకు కలిగిన భావాలను చెబుతున్న సమయంలో శివగురు తండ్రి విద్యాధిరాజు అక్కడకు వచ్చాడు. కుమారుడు వేదవేదాంగాలన్నీ పరిపూర్ణంగా అధ్యయనం చేసినాడని తెలుసుకొని ఎంతో సంతోషించాడు. బాలుని ఇంటికి తీసుకొనిపోయి గృహస్థాశ్రమంలో ప్రవేశపెట్టడానికి గురువు అనుమతి కోరాడు. కానీ, శివగురు తన జీవితాంతం గురుసేవ చేస్తూ ఆశ్రమంలోనే ఉంటానని అమితంగా ప్రాధేయపడ్డాడు. కానీ తండ్రి బలవంతంపై ఆయనతో కలసి ఇంటికి వెళ్లవలసివచ్చింది.

22. శివగురు ఇంటికి చేరగానే తల్లికి సాష్టాంగ నమస్కారం చేశాడు. ఉత్తమ విద్యలను అభ్యసించి వచ్చిన పుత్రుణ్ణి ఆలింగనం చేసుకొని తల్లి

ఆనందబాష్పాలు రాల్చింది. చాలా కాలం తరువాత పుత్రుని చూడటం వలన పుత్రుని స్పర్శ చందన కర్పూరాలకన్నా చల్లగా తోచింది.

23. శివగురు చాలాకాలం తరువాత గురుకులవాసం నుండి రావడం వలన బంధువులు అంతా దూరప్రాంతాల నుండి కూడా విద్యాధిరాజు ఇంటికి రాసాగారు. విచక్షణా జ్ఞానసంపన్నుడూ, విద్యాధికుడూ అయిన ఆ శివగురు బంధువులకు ఎదురువెళ్లి సాదరంగా ఆదరిస్తూ వినయంతో వారందరికీ సాష్టాంగనమస్కారం చేస్తూ సపర్యలు చేశాడు.

24. తండ్రి విద్యాధిరాజు సార్థకనామధేయుడు. సకలవిద్యలయందు ఎంతో ప్రావీణ్యం కలిగి ఉన్నాడు. కుమారుని విద్యాకుశలతను పరీక్షింపగోరి వేదములందలి పద, క్రమ, జట, శిఖ, ఘన మొదలైన అంశాలలో స్వరం ఉచ్చారణలను నిశితంగా పరీక్షిస్తూ అనేక ప్రశ్నలు వేశాడు.

25. తండ్రియైన విద్యాధిరాజు బహుముఖ ప్రజ్ఞావంతు డవడంవలన కుమారుణ్ణి కూడా వేదవేదాంగాలందూ, షడ్దర్శనాలందూ, వ్యాకరణమందూ, మహావిద్వాంసుని చేయదలచాడు.

పూర్వమీమాంసాశాస్త్రమందు, భాట్ట మతమని, గురుమతమని రెండు విధాలున్నవి - కుమారిలభట్టుచే ప్రతిపాదించిన దానిని 'భాట్ట' మత మనీ, ప్రభాకరుని సిద్ధాంతాన్ని 'గురు'మతమనీ చెబుతారు. అట్లే తర్కశాస్త్రంలో న్యాయదర్శనం, వైశేషిక దర్శనమని రెండు విధాలున్నవి. కణభుజ్మహర్షిచే రచించబడినది 'కాణాద'మనీ, దానినే 'వైశేషిక దర్శన'మంటారు. గౌతమ మహర్షిచే రచించబడిన గ్రంథాన్ని 'న్యాయదర్శన' మంటారు. మీమాంసా శాస్త్రంలోని రెండు మతాలు, తర్కశాస్త్రంలో రెండు మతాలు ఈ షడ్భేదంచే ఏర్పడినవి. ఉత్తరమీమాంసయైన వేదాంతమూ, సాంఖ్యయోగాలు గ్రహించ దగినవి.

విద్యాధిరాజు తనయుడైన శివగురును షడ్దర్శనాలందు (1. పూర్వ మీమాంస 2. ఉత్తరమీమాంస, 3. న్యాయము, 4. వైశేషికము

5. సాంఖ్యము, 6. యోగము) నిశితంగా పరీక్షింపదలచాడు. అనులోమ విలోమక్రమంలో అనేక ప్రశ్నలు అడిగాడు. ముందుగా తండ్రికి నమస్కరించి ప్రశ్నలన్నింటికీ, ఆందోళన చెందక, తొట్రుపడక, ధైర్యంతో విషయాన్ని విడువక గురుదేవుని మనసున ధ్యానించి, విశదంగాను, సహేతుకంగాను, చిరునవ్వులు చిందిస్తూ సునాయాసంగా సమాధానాలు చెప్పాడు.

26. తండ్రియైన విద్యాధిరాజు వేదములందు, వేదాంగాలైన శిక్షావ్యాకరణాది శాస్త్రాలందూ వేసిన ప్రశ్నలన్నిటికీ శివగురు తడుముకోకుండా తక్షణమే సమాధానాలు ఇచ్చాడు. తనయుని సునిశితమైన సూక్ష్మబుద్ధి కుశలతకు తండ్రి ఎంతో ఆనందం పొందాడు.

స్వమతస్థాపనలోగాని, పరమత ఖండనలోగాని, మండన ముండనములందూ సాటిలేని చాతుర్యాన్ని, సమయస్ఫూర్తిని గాంచి అత్యధికానందం పొందాడు. అతడి సమాధానాలలోని స్వచ్ఛత, సహజత్వం, స్వతస్సిద్ధమైన వాక్కులు ఆయన చెవులకు విందు చేశాయి. పుత్రుని పాండిత్య ప్రకర్షతో కూడిన సంస్కారయుతమైన సూక్తులు వినేవారికి అమృతప్రాయాలైనాయి. ఈ సంవాదంచేత పుత్రుని సర్వవిద్యావిశారదత్వం సామాన్య విషయం కాదని గ్రహించాడు.

27. శివగురుని పాండిత్యం, వినయ సంపత్తి, శీలం వంటి సద్గుణాలన్నిటినీ జనులు వేనోళ్ళ కొనియాడసాగారు. ఈ వృత్తాంతమంతా విన్న బ్రాహ్మణ కన్యల తల్లితండ్రులు మా కన్య నిస్తామంటే, మా కన్య నిస్తామని పోటీపడసాగారు. తమ కన్యలను శివగురునికి కట్టబెడతామని పోటీలుపడసాగారు.

28. శివగురుకు తమ కన్యనిస్తామని అనేకమంది విప్రశ్రేష్ఠులు వచ్చిపోసాగారు. వారు కన్యతోపాటు అధిక ధనం కూడా ఇస్తామని ఆశ చూపసాగారు. కొందరు తమ కన్యను స్వీకరించమని ప్రాథేయ పడసాగారు.

విద్యాధిరాజు మాత్రం ధనాశకు లొంగలేదు. ఆతడు అత్యున్నతమూ, శ్రేష్ఠమూ అయిన సంతానోత్పత్తినే కోరుకొన్నాడు. కనుక మఘ

పండితుడనే బ్రాహ్మణుణ్ణి తన కుమారునికి కన్యనీయవలసినదని విద్యాధిరాజు అడిగాడు.

29. అంతట మఘ పండితుడు వివాహం తన ఇంట జరగాలని పట్టు బట్టాడు. అందుకు విద్యాధిరాజు అంగీకరించక కన్యను తీసుకొనివచ్చి తన ఇంటనే కన్యాదానం జరిపించమని పట్టుబట్టాడు. మఘ పండితుడు, విద్యాధిరాజు ఇద్దరూ విద్యాధికులు, శ్రేష్ఠమైన వంశస్థులు మాత్రమేకాక, అష్టైశ్వర్య సంపన్నులు కూడా కావటం వలన ఎవరూ వారి వారి పట్టు విడువలేదు.

30. పట్టు విడువని మఘ పండితుడు కన్యాదానం తన ఇంట జరిపిస్తే రెట్టింపు ధనమిస్తానని ప్రకటించాడు. ద్రవ్యాశకు ఎంతమాత్రం లోబడని విద్యాధిరాజు, తనకు ధనం అవసరం లేదనీ, కన్యను మాత్రం ఇస్తే అదే పదివేలనీ, అదే మాకు పరమానందమనీ తెలిపాడు.

31. ఈ విధంగా మఘ పండితుడు, విద్యాధిరాజు వివాదపడుతూ ఉండగా, మధ్యవర్తియైన బ్రాహ్మణు డొకడు మఘ పండితునితో "అయ్యా! మీ ఇద్దరు ఇంత చిన్న విషయంపై రాద్ధాంతం చేస్తున్నారు. ఈ అవకాశం తీసుకొని మరొక బ్రాహ్మణుడు శివగురునకు తమ కన్య నిచ్చి తన్నుకు పోగలడు. అప్పుడు నష్టపోవలసినవాడవు నువ్వే" నని హితవు పలికాడు.

32. మధ్యవర్తి చెప్పిన మాటలు మఘపండితునికి తలకెక్కాయి. మూర్ఖంగా ప్రవర్తిస్తే గుణవంతుడూ, రూపవంతుడూ, వేదాధ్యయనం చేసిన వాడూ అయిన శివగురు తన కన్యకు కాకుండా పోతాడేమోనని భయపడ్డాడు. వెంటనే తన కన్యను తీసుకొని వచ్చి విద్యాధిరాజు ఇంటనే వివాహం జరిపించడానికి అంగీకరించాడు. ఆ విధంగా మఘ పండితుడు శివగురు గుణాలచే ఆకర్షితుడయ్యాడు.

33. మఘ పండిత, విద్యాధిరాజు లిద్దరూ ఏకాభిప్రాయానికి వచ్చిన తరువాత వారి వారి ఇష్టదైవాలను ప్రార్థించుకొన్నారు. తరువాత వివాహానికి నిశ్చితార్థం చేసుకొన్నారు. ఇద్దరూ వధూవరుల జాతకాలను ఇచ్చిపుచ్చుకొని వాటిని పరిశీలిస్తామని పరస్పరం చెప్పుకొన్నారు.

34. ఆర్యాంబా, శివగురుల వివాహం అత్యంత వైభవంగా జరిగింది. బంధువులందరు వివాహానికి వచ్చి వధూవరులను ఆశీర్వదించారు. మఘ పండితుడు, విద్యాధిరాజు వచ్చిన బంధువులందరినీ తగిన విధంగా సత్కరించి పంపారు.

35. ఆర్యాంబకు సతీదేవి అనే మరొక పేరు ఉంది. సతీదేవి శివగురులు పరిశుభ్రమైన దుస్తులు ధరించి, మల్లెమొగ్గల వంటి పలువరుస గలవారై, వివిధాలైన బంగారు ఆభరణాలను ధరించారు. ఒకరినొకరు క్రీగంట బ్రోచుకొంటూ ప్రేమానురాగాల నొలకబోసుకోసాగారు. ఆ పవిత్ర వధూవరులు పార్వతీపరమేశ్వరుల మల్లే మహోన్నతమైన సుఖాలనుభవించ సాగారు.

36. ఆ విధంగా శివగురు గృహస్థ ఆశ్రమాన్ని స్వీకరించి గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాలనే అగ్నిహోత్రాలను వేదోక్తంగా చేయసాగాడు. త్రేతాగ్నులతో అగ్నిహోత్ర కార్యాలు చేయనివాడు తదుపరి చేసే ఉత్తమమైన యాగాలకు అధికారి కాజాలడు. అందువలన శివగురు ఋత్విక్కులతో కూడి త్రేతాగ్నులను ప్రతిష్ఠించి, అగ్నులను తృప్తిపరచాడు.

37. శివగురు స్వర్గాది పరలోక సుఖాలను కోరి ధన వ్యయ ప్రయాసల కోర్చి అనేక యాగాలను చేశాడు. అతడు ప్రతిదినం చేసే యాగాలు, అందు దేవతల కిచ్చే హవిస్సుల వలన దేవతలు అమృతపాన రుచినే మరచారని జనులు చెప్పుకోసాగారు. ఆ విధంగా అనేక మంది దేవతల నుద్దేశించి అనేక యాగాలు చేశాడు. ఆ విధంగా సర్వదేవతలు అతనిపట్ల సంతృప్తులైనారు. గృహస్థు తప్పక యాగాలను ఆచరించాలి.

38. ఆ శివగురు దేవతలనే గాక పిండప్రదానాలచే పితృదేవతలను, అన్నదానంచే మానవులను ఎటువంటి కొరతా లేకుండా సంతృప్తిపరచ సాగాడు. ఆతడి వద్ద తరగని విద్యాధనముండటంచేత ఎల్లప్పుడు పండితుల మధ్య కొలువై ఉంటూ వారికి జ్ఞానదానం చేసేవాడు. ఆ విధంగా అందరి

మనోరథాలను తీర్చుస్తూ, శివగురు 'నడయాడే కల్పవృక్షం'గా ప్రసిద్ధి చెందాడు.

39. పరోపకారం చేయటం ఆయనకు నిత్యవ్రతమైనది. నిత్యం వేదాధ్యయనం చేస్తూ, శ్రుతి స్మృతులందు విధించిన కర్మలన్నీ యథా విధిగా చేస్తుండడంచేత అంతరంగం పరిశుద్ధమై ఉంది. ఇది ఒక నాటి మాట కాదు. అనేక సంవత్సరాలు గడచిపోయాయి.

40. శివగురు సౌందర్యాన మన్మథాకారుడై, ఓర్పునందు భూదేవిని పోలి ఉన్నాడు. విద్యలయందు బృహస్పతికి సమానుడై ఉన్నాడు. కుబేరుని పోలిన ధనవంతుడైనా ఒకింతకూడా గర్వంలేక అందరితోను వినమ్రుడై ప్రవర్తించేవాడు. గర్వకారణాలైన రూపం, ధనం, విద్య పరిపూర్ణంగా కలిగివున్న శివగురునిలో ఆవగింజంత అహంకారమైనా కనిపించేది కాదు. అటువంటి శివగురుకు వయస్సు మీరిపోతున్నా సంతాన భాగ్యం కలుగలేదు.

41. లోకంలో ధన కనక వాహనాదులు, మడిమాన్యాలు, ఇళ్ళువాకిళ్ళు తోటలు, కీర్తిప్రతిష్ఠలు, బంధుజనం మొదలైనవన్నీ మానవులను అహంకారు లనుగా చేస్తుంటాయి. కాని శివగురుకు పుత్రసంతానం లేకపోవటంచేత అన్నీ ఉండీ ఏదీ సంతోషపరచలేకపోయింది.

42. ధర్మానుష్ఠానాలందు పూర్ణుడై సకల దేవతలను సంతృప్తిపరచటం చేత శివగురు తనకు సంతానప్రాప్తి తప్పక కలుగగలదనే ధీమా కలిగి ఉండేవాడు.

43. శివగురు భార్య ఆర్యాంబతో "సాధ్వీ! సంతానం కోరి మనం చేయదగిన కార్యాలన్నీ చేశాము. అయినా పుత్రభాగ్యం కలుగలేదు. రోజు రోజుకూ వయస్సు మీద పడటంచేత అవయవపటుత్వం తగ్గుతున్నది. సుఖాలలో కెల్ల పుత్రప్రాప్తే పరమ సుఖమని చెబుతారు. ఏం చేయాలో బోధపడకున్నది" అని పలికాడు.

44. అంతేగాక పుత్రుడు లేకుండా పరలోక ప్రాప్తి కూడా కలుగదని వేదాలలో చెప్పబడినది. అందులకై చేయవలసిన సత్కర్మలన్నీ ఆచరించాము. పుత్రుడు లేకుండటం వలన మన ఇరువురికి ఉత్తమ లోకగతులు

లేకపోవటమేగాక, పితృ ఋణాన్ని తీర్చుకోలేనివాడినైనాను. అందువలన నా జన్మ నిరర్థక మవుతున్నది గదా!

45. మంగళవతీ! సంతానంలేని మనల నెవ్వరు తలచుకోరు. మనకు పిల్లలు, వారికి పిల్లలు ఈ విధంగా మనుమలు, మునిమనుమలతో వంశం వృద్ధి చెందితే మన తర్వాతి సంతతి మనలను స్మరిస్తుంది. వంశం కూడా వృద్ధి చెందుతుంది. అట్లాగే చిగురించి ఫలపుష్పాలతో సమృద్ధిగా ఉన్న వృక్షాన్ని ఆదరిస్తారు. అట్లా కాకుండా పండ్లుపూలులేని గొడ్డుమోతు వృక్షాన్నెవరైనా తలచుకొంటారా?

46. శివగురు పలికినదంతా విన్న (ఆర్యాంబ) సతీదేవి భర్తతో ఇలా పలికింది: "నాథా! మహేశ్వరుడైన పరమశివుడు భక్తుల పాలిట కల్పవృక్షం. భక్తిశ్రద్ధలతో ఆయనను ఆశ్రయిద్దాం. ఆయన తప్పక కరుణించి మన ప్రార్థనను మన్నిస్తాడు. మనకు తప్పక పుత్రప్రాప్తి కలుగుతుంది. మీరు విచారించకండి.

47. నాథా! పరమ దయామయుడైన ఆ పరంధాముణ్ణే సేవిద్దాం. సత్వరమే భక్తుల కోర్కెలు తీర్చేవాడు ఈశ్వరుడే అనడానికి ఉపమన్యుని వృత్తాంతమే పరమ ప్రమాణం. దేవతలు కేవలం శిలాప్రతిమలు కారు. దేవతలు మానవుల మల్లే జడస్వరూపులు కూడా కారు. పరమేశ్వరుడు కేవలం జ్ఞానస్వరూపుడు. చైతన్యస్వరూపుడై భక్తుల కోరికలన్నీ తీరుస్తాడు. మహాభారతంలోని ఉపమన్యుని వృత్తాంతమే ఇందుకు నిదర్శనం.

పూర్వం ఉపమన్యు డనే మునికుమారుడు తోటి బాలురు పాలుత్రాగడం చూశాడు. ఇంటికిపోయి తనకు కూడా పాలు ఇమ్మని తల్లిని వేధించాడు. అంతట ఆ మునిపత్ని పిండిని నీటిలో కలిపి అవే పాలని త్రాగించింది. అవే పాలని తలచి తోటి బాలురతో తాను కూడా పాలు త్రాగానని చెప్పాడు. అందుల కా బాలురు "నువ్వు త్రాగింది పాలు కాదు. నీరు కలిపిన పిండి"అని పరిహసించారు. ఆ బాలుడు ఇంటికి పోయి తల్లి నడుగగా ఆమె తన దారిద్ర్యాన్ని గూర్చి తెలిపింది. అప్పు డా బాలుడు తల్లి ద్వారా ఈశ్వరుని ఆరాధిస్తే సకలం చేకూరుతుందని తెలుసుకొన్నాడు.

తరువాత మహేశ్వరుని ఉపాసించి, ఆయనను మెప్పించి క్షీరసముద్రానికే అధిపతి అయ్యాడు.

ఈ విధంగా సతీదేవి శివగురునికి ధైర్యం చెప్పి మహేశ్వరుని గూర్చి తపస్సు చేయమని చెప్పింది.

48. తరువాత భార్య పలుకులకు సానుకూలంగా స్పందించినవాడై శివగురు పుత్రుని పొందడానికై అర్ధనారీశ్వరుడైన పరమశివుని భక్తిభావంతో వినమ్రుడై ప్రసన్నుని గావించుకోవాలని తలచాడు.

49. అంతట శివగురు తన గృహానికి సమీపంలోని పూర్ణానదిలో స్నానం చేసి మొదట కందమూలాలను మాత్రమే భుజిస్తూ శివుణ్ణి గూర్చి తపస్సు చేశాడు. తరువాత కొన్ని దినాలకు నీరు త్రాగడం కూడా మాని కేవలం గాలిని మాత్రమే భక్షిస్తూ మనస్సును మహేశ్వరుని పాదాల చెంత నుంచి ధ్యానం చేస్తూ తపస్సును తీవ్రతరం గావించాడు.

50. శివగురుని భార్యయైన ఆర్యాంబ కూడా వృషాచలేశ్వర క్షేత్రంలో వెలసిన మహేశ్వరుని అమిత భక్తిశ్రద్ధలతో ఆరాధించింది. అనేక కఠిన నియమాలను పాటిస్తూ దేహాన్ని మిక్కిలి కృశింపజేసి తీవ్ర తపస్సు చేసింది. వారిరువురు ఆ విధంగా చాలకాలం తీవ్రమైన తపస్సు చేశారు.

51. కొంత కాలానికి దయాసాగరుడైన పరమేశ్వరుడు కరుణించి శివగురుకు స్వప్నంలో బ్రాహ్మణ రూపాన సాక్షాత్కరించాడు. "శివగురూ! నిష్కాముడవైన నువ్వు ఎందుకోసం ఇంత కఠోరమైన తపస్సు చేస్తున్నావు? నీ మనస్సులో ఏదైనా కోరిక ఉంటే తెలుపు. అనుగ్రహిస్తాను" అని పలికాడు. అందుకు శివగురు తన పుత్రకాంక్షను వ్యక్తం చేశాడు.

52. దేవదేవుడూ, సర్వప్రకాశ స్వరూపుడూ అయిన ఆ పరమేశ్వరుడు శివగురుతో ఇలా పలికాడు: "భక్తా! సర్వజ్ఞుడు, సకల గుణసంపన్నుడు, అల్పాయుష్కుడునైన ఒక పుత్రుని ప్రసాదిస్తాను; అలా కాకపోతే, అసర్వజ్ఞులు, దీర్ఘాయుష్కులు, బహు దుష్టస్వభావులైన పెక్కుమంది పుత్రుల నొసగుతాను. నీకు ఏది సమ్మతమో తెలుపు. నా పలుకులు సత్యం. నీవు నమ్ము."

అంతట శివగురు పరమశివుని ఈ తీరున ప్రార్థించాడు:

53. "ఓ పరమేశ్వరా! సర్వజ్ఞత్వానికి స్థానమైనవాడూ, సకల గుణసంపన్నుడూ, లోకవిఖ్యాత యశోనిధియైన ఒక పుత్రుణ్ణి ప్రసాదించు." అంతట ఆ పరమశివుడు "అట్లే అగుగాక! ఇక నీ తపస్సు చాలించు. నీ కోరిక నెరవేరగలదు" అని పలికాడు.

54. పరమదయాళువగు పరమశివుని దర్శించి, ఆయనచే ప్రసాదించ బడిన వరాన్ని తలచుకొంటూ స్వప్నంనుండి మేల్కొన్నాడు. తరువాత ఆ వృత్తాంతాన్ని భార్యయైన ఆర్యాంబకు తెలియబరచాడు. అంతట ఆమె స్వప్నం తప్పక సత్యమవుతుందన్నది. మహాత్ముడైన పుత్రుడు తప్పక జన్మిస్తాడని పూర్ణ విశ్వాసం వ్యక్తం చేసింది.

55. తరువాత ఆ పుణ్యదంపతులు తాము పొందిన స్వప్నం యథార్థ మవుతుందనే విశ్వాసంతో ఇంటికి పోయారు. వా రాచరించిన తపస్సు ఫలించినందుకు ఎంతో సంతోషించినవారై బ్రాహ్మణులకు దక్షిణ లిచ్చి వారిని సంతృప్తులను చేశారు. విరివిగా అన్నదానాలను చేసి బ్రాహ్మణుల ఆశీర్వాదాలను పొంది పరమానందం పొందారు.

56. బ్రాహ్మణ సంతర్పణచేసి, శివగురు భోజనం చేస్తుండగా తను తినబోయే అన్నంలో శివతేజస్సు ప్రవేశించింది. అట్టి మహాపవిత్ర భుక్తశేషాన్ని శివగురు సంతృప్తితో భుజించాడు. తరువాత ఆర్యాంబకూడా భర్త భుజించిన భుక్తశేషాన్ని భుజించింది. ఆ విధంగా భగవానుడు వారిని అనుగ్రహించడానికై ప్రవేశించాడు.

57. సర్వలోకరక్షకుడైన ఆ పరమశివుడు ఆర్యాంబ గర్భంలో ప్రవే శించాడు. ఆమె గర్భం మెల్లమెల్లగా వృద్ధిచెందసాగింది. ఆ సమయంలో ఆర్యాంబ శరీరమంతా ప్రకాశవంతమై వెలుగొందింది. ఆమె దేహమందలి అప్రాకృతిక తేజస్సుచేత దివ్యపురుషుడు జన్మించబోతున్నాడని తెలుస్తున్నది.

58. పదునాలుగు భువనాలను భరించేవాడూ, అష్టమూర్తీ, చతుర్భువ నాలకు భర్తా, మంగళకరుడూ అయిన దేవదేవుని ఆర్యాంబ తన గర్భంలో భరిస్తున్నది. పంచభూతాలు, సూర్యచంద్రులు, జీవుడు అనే అష్టమూర్తులను నీ కోసం ధరించిన, ఓ ఈశ్వరా! నీకు నమస్కారం.

59. ఆర్యాంబ గర్భం ధరించడానికి ముందే శివతేజం ఆమెలో ప్రవేశించి వ్యాపించింది. అట్టి శివతేజస్సు దేహమంతటినీ సంరక్షిస్తున్నది. అందువలన ఆర్యాంబకు ఎంత మాత్రమూ బాధగాని, చింతగాని కలుగలేదు.

60. సతీదేవి (ఆర్యాంబ) గర్భధారణ సమయమందు గంధపుష్పాదులే ఆమెకు బరువైపోయాయి. ఇక ఆభరణాల విషయం విడిగా చెప్పాలా? అందువలన అలంకారాలన్నీ విసర్జించింది. పుష్పాలు, గంధం కూడా బరువని తోచింది. కాని, పదునాలుగు భువనాల కర్త అయిన పరమేశ్వరుని భరించటంలో కొంచెం కూడా భారమని తెలియలేదు. అందుకు కారణం భగవానుని కృపావిశేషమేగాని మరొకటి కాదు.

61. ఆర్యాంబ గర్భం ధరించినప్పటి నుండి 'వేవిళ్ళు' ఆమెను మిక్కిలి బాధించసాగాయి. అవి ఎలా ఉన్నవంటే, మొదట ఏదో దుస్తరమైన వస్తువై ఆశ కలుగుతుంది. అది తీరిన వెంటనే దానికంటే కష్టసాధ్యమైన కోరిక మరొకటి పుట్టుకు వచ్చేది. చిరకాలవాంఛయైన పుత్రప్రాప్తి నెరవేరబోతున్నా, ఈ కోరికలు మాత్రం తీరేట్లు లేవు.

62. ఇలా ఆర్యాంబ కోరికలు రోజురోజుకూ పెరిగిపోతున్నవి. ఇరుగుపొరుగు వారంతా, ఆమె కోరినవన్నీ ఏదో విధంగా సమకూర్చి సంతోషపెట్టసాగారు. పుత్రప్రాప్తి సంతోషాన్ని కలిగించేదే అయినా, గర్భధారణ సమయాన మాత్రం బహుదుఃఖదాయకం గదా అని తలచింది.

63. ఆర్యాంబకు దినదిన ప్రవర్ధమానమయ్యే తన గర్భం, దానితో పాటే పెరిగే 'వేవిళ్ళు' కోరికలు సర్వసహజమైనవే గాని వేరొకటిగాదు. మహేశ్వరుని తేజస్సు తన గర్భమందుంచుకొన్న ఆమెకు ఏ విధమైన చింతగాని, దుఃఖంగాని లేవు. అందువలననే, చింతలు, దుఃఖాలు పోగొట్టుకోవటానికి మహాత్ములైనవారు పరమేశ్వరుని పరతత్త్వాన్ని శరణు వేడతారు.

64. ఆర్యాంబ తరచూ స్వప్నాలను కనేది. అందు తెల్లని దేహంగల వాడైన నందీశ్వరుడు తనను మోస్తూ తిరుగునట్లు గాంచేది. అంతేగాక

గంధర్వులు విద్యాధరులు, దేవతలు తనను స్తుతిస్తూ కీర్తించేవారు. ఈ శుభప్రదాలైన స్వప్న సంఘటనలు, నందీశ్వరునకు ప్రభువైన మహేశ్వరుడు ఆర్యాంబకు పుత్రుడు కాగలడని సూచిస్తున్నవి. భక్తుల కోరికలను తీర్చేందుకు భగవానుడు స్వప్నమందు దర్శనమిస్తుంటాడు గదా! మొదటగా శివగురుకి స్వప్నమందు మహోత్తరమైన పురుషుడు జన్మిస్తాడని తెలిపాడు. దానిని బట్టి ఇప్పుడు ఆర్యాంబ ప్రసవింపబోయే శిశువు శంకరభగవానుడే అని తెలుస్తున్నది.

65. ఆర్యాంబ తరచూ గాంచే స్వప్నాలందు రూపాల కన్నా శబ్దాలే ఎక్కువగా ఉండేవి. "జయహో, జయహో" అనో, "రక్ష-రక్ష" అనో, "మాం కృపాదృష్ట్యా అవలోకయ" (వరా లిచ్చి మమ్ము రక్షింపు, "దయాదృష్టితో కాపాడు.") ఇలా మంగళకరాలైన శబ్దాలు వింటూ ఉలిక్కిపడి లేస్తుండేది. మరల మరల తిరిగి అటువంటి శబ్దములనే స్వప్నంలో వినడంచే తనకు జన్మించబోయే పుత్రుడు సర్వలోకరక్షకుడై, వరాల నిచ్చే వేల్పులలో శ్రేష్ఠుడైన మహేశ్వరుడే కాగలడని తలచింది.

66. ఏదైనా మాట్లాడాలంటేనే విసుగు, చికాకుపడుతూ ఉండేది. అయితే పరమతాలను పూర్వపక్షం చేస్తున్నట్లుగాను స్వమతాన్ని సిద్ధాంతాలను ప్రతిష్ఠాపితం చేసి ప్రత్యర్థులందరిని గెలుస్తున్నట్లు ఊహించుకుంటూ ఉండేది. తను పడుకునే మంచం, ఎక్కి దిగాలంటే కష్టపడేది. అటువంటిది ఏవో తెలియని మహోన్నతమైన విద్యాసింహాసనాలను ఎక్కుతున్నట్లుగా కలలు కనేది.

67. అంతే కాకుండా, సాత్త్విక స్వభావులైన వారిపట్ల ప్రీతీ, విషయ లోలురు కనబరచే రాగద్వేష ప్రవృత్తులపట్ల విరక్తీ కలిగి ఉండేది. అద్వైత సిద్ధాంతాల యందు ఆసక్తి కలిగి ఉండేది. ఇటువంటి సూచనలచేత ప్రపంచంలో సరస్వతీ సింహాసనం అధిష్ఠించే మహేశ్వరుడు జన్మించబో తున్నాడనే సూచనలు కానరాసాగారు.

68, 69. సతీదేవి స్తనద్వయాలందు బ్రహ్మదేవునిచే సృష్టించ బడిన పాలు అమృతమై పారుతూ నూతనామృతపూర్ణాలైన కుంభాలమల్లే ప్రకాశిస్తున్నవి.

70. ఆర్యాంబ గర్భంలో ఉన్నప్పుడే ఆ శిశువు స్తనాల మధ్య ద్వైత భావాన్ని (జీవుడు, బ్రహ్మం) ఆ రెంటి నడుమ మాధ్యమిక మతమనబడే శూన్యవాదాన్ని మహాత్ములచే మిగుల నింద్యాలవడంచే తీవ్రంగా నిందించాడు. ఈ ప్రకారం గర్భభారంచే ఆర్యాంబ కుచగురుత్వాన్ని మధ్య గౌరవాన్ని పొందింది. ఇవి రెండూ గర్భ చిహ్నాలని తెలుసుకోవాలి.

71. గ్రహాలన్నీ శుభలగ్నమందున్న సమయంలో (సూర్యుడు మేషరాశిలోను, అంగారకుడు మకరరాశిలోను, శని తులారాశిలోను, బృహస్పతి కేంద్రమందూ, ఇతర గ్రహాలన్నీ తగు విధాలుగా ఉండగా) శివగురు ధర్మపత్నియైన ఆర్యాంబ, పార్వతీదేవి కుమారస్వామినిమల్లే, మహోత్తమ పురుషుణ్ణి ప్రసవించింది.

72. మహోన్నత పురుషుని కన్న శివగురు ఆనందసాగరంలో మునిగి తేలాడు. తదుపరి జాతకర్మలు నిర్వహించి శక్తివంచన లేకుండా బ్రాహ్మణులకు ధనం, గోవులు, భూమి, వస్త్రాలు మొదలైనవి దానం చేశారు.

73. శివగురుని పుత్రుడు జన్మించిన శుభ సమయాన పులులు లేళ్ళు, ఏనుగులు సింహాలు; పాము - ఎలుకలు; ఎలుకలు - పిల్లులు తమ సహజ వైరాన్ని మరచి అన్యోన్యంగా కలిసిమెలిసి తిరిగాయి. మహాత్ములు జన్మించినప్పుడు పై విధంగా జరగడం శుభసూచకమని పెద్దలు చెబుతారు.

74. సకల చరాచర ప్రపంచం పరమశాంతిని పొందినది. వృక్షాలు, తీగలు విరగబూసి కాయలు, పండ్లు కాచాయి. నదులందు నీరు సమృద్ధిగా ప్రవహించసాగింది. దేశమంతా సకలసంపదలతో విలసిల్లింది.

75. శ్రీ శంకర భగవత్పాదులవారి జననం వలన పాషండ మతస్థుల వాదనలన్నీ నేలపాలైనవి. వేదాలకు శిరోధార్యాలైన ఉపని

షత్తులు ఊపిరి పీల్చుకొన్నాయి. వేదవ్యాసుల అద్వైతతత్త్వం సుస్థిరపరచే సమయ మాసన్నమయింది.

76. ఆకాశం నిర్మలమయింది. వాయుదేవుడు తన శీతల గాలులతో ఆమోదాన్ని తెలిపాడు. హోమాగ్నులు ఆకాశము నంటుతూ తమ ఆనందాన్ని ప్రకటించసాగాయి.

77. మహేశ్వరు డిలా భూలోకాన అవతరించిన వేళ, దేవతలు హర్షాతిరేకంతో పూలవర్షం కురిపించారు. జగత్తు నలుమూలలందు సుగంధాలతో ప్రసన్న భావమేర్పడింది.

78. ఆ మహాత్ముడు జన్మించగానే ఎన్నో మహోత్కృష్ట ధర్మాలు ప్రకటితమయ్యాయి. సూర్యునిమల్లే తేజస్సు కలిగినవాడూ. శ్రీరాముని వంటి మహాపురుషుల ఓజస్సుతో పరిపూర్ణుడూ అయిన శంకరుడు ఆర్యాంబ శివగురులందు ఉదయించాడు.

పవిత్ర, ప్రజ్ఞ, కర్మసాక్షిత్వాలలో సూర్యుని పోలినవాడూ, లోకోద్ధరణ యందు మేరుపర్వతాన్ని పోలినవాడూ, విద్యావినయాలందు సరస్వతీదేవిని పోలి మహోత్కృష్టమైన ధర్మాలను పుట్టినప్పుడే ప్రకటించాడు.

79. అంతట శివగురు జ్యోతిషంలో నిష్ణాతులైన పండితులను రావించి బాలుని జాతక ఫలాలను తెలుసుకోగోరాడు. పండితు లా బాలుని జాతకాన్ని నిశితంగా పరిశీలించి అమితాశ్చర్యం పొందారు. ఈ బాలుడు సామాన్య మానవమాత్రుడు కాడనీ, స్వతంత్రంగా అనేక గ్రంథాలు రచిస్తాడనీ, తన ప్రతిభాపాటవాలతో ఎందరో ఉద్దండ పండితులను ఓడించి తన స్వసిద్ధాంతాలను ప్రతిపాదించి, జగత్తున స్థాపించి చిరస్థాయిగా ఉండేట్లు చేస్తాడనీ పలికారు.

80. ఈ భూమి ఉన్నంతవర కీతడి కీర్తి విస్తరిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఈతడు ఈశ్వరవరప్రసాదుడు, పరిపూర్ణుడని పలికారు. అవధులు లేని ఆనందంచేత శివగురు బాలుని ఆయుఃప్రమాణం గూర్చి ప్రశ్నించలేదు.

ఆ పండితులు కూడా అశుభం పలుకడానికి ఇష్టపడక బాలుని ఆయువును గూర్చి తెలియబరచలేదు.

81. బాలుడు జన్మించి పురిటి దినాలు కాగానే శివగురు నామకరణం చేయదలచాడు. బంధువు లందరూ వచ్చి బాలుణ్ణి ఆశీర్వదించి విలువైన కానుక లెన్నో సమర్పించారు. గ్రీష్మకాలపు ఎండ వేడిని లెక్కచేయక వచ్చిన బంధుజనులకు చంద్రకిరణాల వంటి శిశువు వారి తాపాలనన్నీ చల్లార్చాడు.

82. దీపము పెట్టిన ఈ పురిటి ఇంట్లో ఆ బాలుడే దీపమై వెలుగుచున్నాడు. అంటే శివ తేజోరాశి నిరాటంకంగా ప్రకాశిస్తూ, అజ్ఞానాంధకారాన్ని ప్రారద్రోలి వెలుగును ప్రసాదించినట్లున్నదని భావం.

83. బాలుని సౌందర్యం, ప్రసన్నత, ప్రశాంతత మొదలైన గుణాల చేత, చూడవచ్చిన వారందరికీ సంతోషమూ, మంగళమూ కలిగించడం చేత పండితులు శంకరుడనే నామం ప్రశస్తంగా ఉంటుందని తలచారు. అదేగాక, శివగురు చాలాకాలం మహేశ్వరుని ధ్యానించి, ఆయన వరప్రసాదంచేత పొందిన బాలుడవటంచేత శంకరు డనే నామాన్నే స్థిరం చేశాడు.

84. సృష్టి, స్థితి, లయ కారకుడైన మహేశ్వరుడు మానవరూపంలో వస్తే మానవునిమల్లే ప్రవర్తిస్తాడు. ఈ విషయాన్ని పెక్కు పురాణాలు మనకు ధ్రువీకరించాయి. అందువలన శంకర భగవానుడు బాలుడై బోర్లపడటం, పొట్టతో దేకటం, తప్పటడుగులు వేయటం, దోగాడటం వంటి బాల్యచేష్టలచేత తల్లిదండ్రులను, బంధుజనులను సంతోషపరచసాగాడు.

85. ఆర్యాంబ బాలుని ప్రక్కపై పరుండబెట్టి బాలుడు ఆడుకోవడానికి పచ్చటి మణులను ఏర్పాటు చేసింది. తన్ను చూడవచ్చినవారు సహృదయు లైతే బాలుడు ఆ మణులను ప్రీతితో చూసేవాడు. వారు కూడా పరమానందం చెంది హృదయాలు ప్రసన్నాలై వెళ్ళేవారు. అలాకాక వచ్చినవారు ప్రతివాదు లైతే ఆ మణులను చంచలదృష్టితో చూసేవారు. అప్పుడు వారి ముఖాలు కాంతిహీనాలయ్యేవి.

86. శంకరుడు తన ప్రక్కపై పరుండి మంచాన్ని కాలితో తన్నేవాడు. అది చూసేవారికి ఎలా ఉండేదంటే జీవేశ్వర భేదాన్ని వాదించే ద్వైత పండిత శిరోమణుల సిద్ధాంతాలను ఖండించేట్లుండేది. (శయ్య) వలె సుఖ దాయకమని తలచే జీవేశ్వర భేద సిద్ధాంతాన్ని 'తత్త్వమసి' అనే మహావాక్యంచేత ఖండిస్తున్నట్లుండేది. పిల్లవాడు పక్కను కాలితో తన్నుతున్నాడనేదే ముఖ్యాంశం.

87. బాలుడు రెండక్షరాల మాటలు పలుకసాగాడు. అంటే 'నేతి', 'శివోఽ హమ్' అనేవి అద్వైతానికి ప్రాతిపదికలై దశదిశలందూ అద్వైతాన్ని వ్యాపింపచేయబోతున్నాడని స్పష్టమైనది. తరువాత తప్పటడుగులు వేయగా గుండెలు ఝల్లుమన్నాయి.

88. బాల శంకరుడు పలికిన పలుకులు మృదుమధురంగా కోయిల లను వెక్కిరిస్తున్నట్లున్నాయి. తప్పటడుగులు వేసే హంసలకు నడక నేర్పు నట్లున్నది. అంటే శంకరుని వాక్చాతుర్యం కోకిల స్వరంలా, నడక హంస గమనంలా ఉందని భావం.

89. ఆ విధంగా తప్పటడుగులు వేసే ఆ బాలుని పాదాలు పద్మాల మల్లే మెత్తగాను కుంకుమ పరాగాలమల్లే రక్తవర్ణాలై ఉన్నవి.

90. బాలుని శిరస్సు పరిశీలించి చూస్తే చంద్రవంక, ఫాలభాగాన మూడవ నేత్రం, భుజాలందు శూలం, స్ఫటికంతో పోటీపడే తెల్లకాంతిని చూసిన శివగురు, సాక్షాత్తూ మహేశ్వరుడే తన కుమారుని రూపాన అవత రించాడని గ్రహించాడు.

91. రాజనీతి నెరిగిన వాని రాజ్యము పెరిగేట్లుగా, వ్యసనాలు లేని పండితుని పాండిత్యంమల్లే, శరత్కాలంలో చంద్రుని కాంతిమల్లే, బాలశంకరుని దేహం దినదినాభివృద్ధి చెందుతోంది. శంకరుని దేహంలో ప్రశాంతి ప్రసన్న మైన దివ్యతేజస్సు, లక్ష్మిలా వృద్ధీ, సరస్వతిలా రూపంచే శంకరుడు దినదినప్రవర్ధమాను డవుతున్నాడు. అలాంటి బాలుని చూసుకొని ఆర్యాంబ, శివగురులు మురిసిపోసాగారు.

92. అంతేకాక, వక్షఃస్థలాన ఫణిరేఖ, పాదాలందు చామరచిహ్నాలు, లలాటాన చంద్రరేఖ, హస్తాలందు గద, ధనుస్సు, డమరుకాలను తెల్పే రేఖలు

స్పష్టంగా కనిపించసాగాయి. శిరస్సున త్రిశూల రేఖలు కానవచ్చాయి. మహాద్భుతకరమైన నారీతత్త్వాన్ని దేహాన చూసి (అర్ధనారీశ్వరుని) జనులు రెప్పవేయక దర్శించసాగారు. ఈ మహానుభావుడు తప్పక శంకరుని దివ్యావతారమేనని తలపోశారు.

93. బ్రహ్మ మొదటగా సనకాదులను సృష్టించి వేదం ఉపదేశించాడు. అలాంటి వేదం క్షీణించి దుర్గతి పొందినది. అందువలన స్వర్గం కూడా మానవులకు దుర్లభమైనది. సహజంగా అవిద్యాపరులైన జీవులు మోక్షాన్ని పొందాలంటే జ్ఞానమార్గమే యుక్తమైనదని తలచి కరుణామయుడైన మహేశ్వరుడు శ్రీ శంకరాచార్యుల రూపంలో భూమిపై అవతరించాడు.



# సర్గము - 3

## మండనమిశ్రుల పరిణయం

1. మహేశ్వరుడైన పరమశివుడు శివగురు ఆర్యాంబలకు శ్రీశంకరు డనే పేరుతో జన్మించాడు. తరువాత దేవతలు ఉత్తమమైన బ్రాహ్మణులుగా జన్మించి మీమాంసాది షడ్దర్శనాలను బాగా అధ్యయనం చేశారు.

2. శ్రీశంకర భగవత్పాదులకు సహాయం చేయుటకై విమలుడనే బ్రాహ్మణోత్తమునకు కుమారునిగా శ్రీ మహావిష్ణు అంశతో శ్రీ పద్మపాదా చార్యులుగా జన్మించి ద్వైతవాదులకు ప్రతివాదియై వారందరినీ తన వాదనలతో ఓడించి ప్రసిద్ధిపొందాడు.

3. శ్రీ జైమిని మహర్షి పూర్వమీమాంస ప్రవర్తకుడు. కుమారిలభట్టు ఈయనకు ప్రథమ శిష్యుడు. ఈయన కుమారస్వామి అంశతో జన్మించాడని ప్రసిద్ధిగాంచాడు. ప్రభాకరుడు కుమారిలభట్టు ప్రథమ శిష్యుడు. ఈతడు అనేక యజ్ఞయాగాదులు చేసి సూర్యునికి ప్రీతిపాత్రుడయ్యాడు. పూర్వమీమాంస అన్నది రెండు విధాలుగా ఉంది. అందు ప్రభాకర మత ప్రవర్తకుడైన ప్రభాకరు డీతడే. అట్టి ప్రభాకరునియందు వాయుదేవుడు ప్రసన్నుడై హస్తామలకాచార్యు నిగా జన్మించాడు. అంటే వాయుదేవుని అంశతో జన్మించిన హస్తామలకా చార్యులు, మహేశ్వరుని అవతారమైన శంకర భగవత్పాదులకు శిష్యుడై సేవించాడు.

4. వాయుదేవుని పదవ వంతు అంశతో శ్రీతోటకాచార్యులు జన్మించారు. ఈయన ద్వైతవాదుల వాదన లన్నిటినీ మథించి, ఛిన్నాభిన్నం చేస్తూ శ్రీశంకర భగవత్పాదులను సేవించాడు. ఈ విధంగా పద్మపాద, హస్తా మలక, తోటకాచార్యుల రూపాన ఆ యా దేవతల అంశతో మహేశ్వరుని సేవించారు.

5. ఉదంకుడనేవాడు సకల వేదవేదాంగాల నభ్యసించి, వైరాగ్యం గలవాడై ఉంఛవృత్తిచే జీవిస్తూ కణాదమహర్షికి పుత్రుడై, నంది అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. (కణాద మహర్షి తర్కశాస్త్రమైన వైశేషిక దర్శన కర్త.)

6. సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు వేదార్థాలను సులభంగా ప్రతిపాదించడానికి, పరమశివుని సేవించే తలపు కలవాడై సురేశ్వరాచార్యులుగా అవతరించాడు. దేవగురువైన బృహస్పతి సూత్రభాష్యాలను, ఉపనిషత్తులను సులభతరం చేయడానికి ఆనందగిరి అనే నామంతో వెలశాడు. సూర్య భగవానుని సారథియైన అరుణదేవుడు విష్ణు అంశతో పుట్టి పద్మపాదుడనే (సనందుడు) పేరుతో ప్రసిద్ధిగాంచాడు. వరుణదేవుడు మహేశ్వరుని సేవింపదలచి శ్రీ చిత్సుఖాచార్యునిగా జన్మించాడు. అద్వైత ప్రతిపాదితమైన "చిత్సుఖీ" గ్రంథాన్ని రచించాడు.

7. అసూయాపరులైన రాక్షసులను సంహరించేట్టి, తత్త్వ అవధారణా సామర్థ్యం కలిగినవారూ, జనులను సంసార తాపం నుండి రక్షించ సమర్థులైన అనేకమంది దేవతలు, పవిత్ర బ్రాహ్మణ పుత్రులుగా జన్మించారు.

8. దేవగురువైన బృహస్పతి దేహాత్మ వాదంచే నాస్తికత్వాన్ని ప్రతిపాదిస్తూ 'చార్వాకదర్శన'మనే శాస్త్రాన్ని రచించాడు. అందుకు కృద్ధుడైన బ్రహ్మ, బృహస్పతిని భూలోకంలో జన్మించేట్లు శపించాడు. తరువాత బృహస్పతి భూలోకంలో 'మండనమిశ్రు'నిగా జన్మించాడు. ఈతడు పూర్వమీమాంస ప్రతిపాదించే కర్మకాండకు ప్రవర్తకుడై చార్వాక మతాలన్నింటినీ నాశనం చేశాడు. నందీశ్వరుడు 'ఆనంద గిరి' అనే నామంతో అవతరించాడు. మహేశ్వరుని ఆజ్ఞను శిరసావహించి సకల దేవతలు శివ సేవాపరాయణులవడానికి భూలోకంలో జన్మించారు. ఈ విధంగా త్రిమూర్తులు, బృహస్పతి, నందికేశ్వరుడు, తమ తమ మహోన్నత స్థానాల నుండి పరివారంతోసహా భూలోకంలో అవతరించారు. అందువలననే అవలీలగా తమ ప్రజ్ఞాపాటవాలతో నాస్తికవాదాన్ని ఖండించారు. అద్వైతతత్త్వాన్ని సుస్థిరంగా స్థాపించడానికి అనేక గ్రంథాలను రచించారు.

9. బ్రహ్మదేవుడు సురేశ్వరాచార్యులుగా జన్మించగా, సరస్వతీదేవి ఉభయభారతిగా అవతరించినదని మరికొందరు అభిప్రాయపడు తున్నారు.

10. ఒకానొక సమయంలో సత్యలోకంలో ఒక సభ జరిగింది. ఆ సభకు అనేకమంది మహర్షులు వచ్చారు. వారందరు సాంగముగా వేదాధ్య యనం చక్కగా చేసినవారు. వేదనిలయమైన బ్రహ్మ ముందు చక్కగా వేద పఠనం చేసి ఆ దేవదేవునికి తమ ప్రజ్ఞాపాటవాలను చూపారు. ఆ సమ యంలో దుర్వాసమహాముని సావధానచిత్తుడు కాకపోవుటంచేత స్వరం తప్పిపోయింది. స్వరం తప్పటంచేత క్రమం కూడా వికటంగా తోచింది.

11. చదువుల తల్లియైన సరస్వతీదేవి, దుర్వాసమహర్షి అన్య మనస్కుడై పవిత్ర వేదోచ్చారణయందు అపస్వరం పలుకడంతో "అయ్యో! మహర్షి సావధానుడై ఉంటే ఇలాంటి అపరాధం జరిగి ఉండేది కాదు గదా!" అని తలచి ఫక్కున నవ్వింది. మహర్షికి కోపం ఎప్పుడూ ముక్కుపైనే ఉంటుంది. సరస్వతీదేవి తనను చూసి నవ్వినందుకు ఎంతో కృద్ధుడయ్యాడు.

12. "మహర్షినన్న గౌరవంలేక, నా తపోమహిమకు భయపడక, స్త్రీ సహజమైన బిడియాన్ని వదలి నిండు సభలో నన్ను చూసి నవ్వింది. ఈమె భూలోకంలో మానవ స్త్రీగా జన్మించుగాక! నీ విద్యాపాటవాన్ని, సుస్వరోచ్చారణను భూలోకంలో ప్రదర్శించు. నీకు ఇదే తగిన గుణపాఠం" అని పలికాడు. తరువాత సరస్వతీదేవి తన తప్పిదాన్ని గ్రహించి మహర్షి పాదాలపైబడి ప్రార్థించింది.

13. సభయందు కొలువు తీరిన మహర్షులు కూడా శాపనివృత్తి తెలుపమని దుర్వాసుని ప్రార్థించారు. "ఓ మునివరేణ్యా! లోకంలో కుమారుని తప్పులు తండ్రి మన్నిస్తున్నాడు గదా! అనుకోకుండా ఈ సరస్వతీదేవి చిన్న తప్పు చేసింది కనుక నీవు ఆమెను పుత్రికాభావంతో చూడు. ఆమెను మన్నించు" అని వేడుకొన్నారు. అప్పుడు దుర్వాసుడు ప్రసన్నుడయ్యాడు.

14. మహర్షి పాదాలపై మీదబడి ఎంతో దుఃఖంతో శాపనివృత్తి కోరిన సరస్వతీదేవి ప్రార్థనవలనా, ఇతర మహర్షుల విన్నపాల నాలకించే దుర్వాసుడు సరస్వతీదేవిని అనుగ్రహించి శాపనివృత్తిని ఇలా తెలిపాడు. “భూలోకంలో పరమశివుడు అద్వైతతత్త్వాన్ని స్థాపించి సకల జనులను ఉద్ధరించడానికి శ్రీ శంకరాచార్యులుగా మానవ రూపంలో అవతరిస్తాడు. ఆ మహాత్ముని దర్శించిన పిమ్మట నీకు సత్యలోక ప్రాప్తి కలుగగలదు” అని పలికాడు.

15. దుర్వాసముని శాపం మేరకు శోణమనే నదం ప్రవహించే తీరాన విష్ణుమిత్రుడనే బ్రాహ్మణునకు సరస్వతీదేవి పుత్రికగా జన్మించింది. ఆ చదువుల తల్లి ఉభయభారతీదేవి అనే పేర మానవమాత్రురాలిగా అవతరించింది. ముని ఆమెను మానవకాంతగా జన్మించమని మాత్రమే శపించాడుగాని, ఆమె దివ్యజ్ఞానాన్ని హరింపలేదు. అందువలన చతుష్షష్టి కళలు ఆ మహాదేవిని మానవరూపాన కూడా అనుసరించే వచ్చాయి. ఆ కారణంగా ఆ భారతీదేవి సర్వోత్తమ గుణాలతో మహాప్రజ్ఞావంతురాలై స్త్రీ ధర్మంతో విరాజిల్లింది. ఆమె కేవలం మానవకాంతగా ఉన్నప్పటికీ అన్ని విషయాలలోను సరస్వతీదేవి మల్లేనే ప్రకాశించింది. ఆ విధంగా శ్రీ భారతీదేవి అవతారమై ఈ ఉభయభారతీదేవీ సర్వజ్ఞానవంతురాలిగా ప్రఖ్యాతి గావించింది.

16. ఆ ఉభయభారతీదేవి బాల్యంలోనే సమస్త శాస్త్రాలను, వేదాలను కావ్యనాటకములను, షడంగాలను (సాంఖ్య, యోగ, వైశేషిక, న్యాయ, మీమాంసా, వేదాంతాలు) మొదలైన అనేక శ్రుతి స్మృతులను గణించగలిగింది. శైశవాననే ఆమె సర్వజ్ఞతకు, పాండిత్యానికి పండిత పామరులెల్లరూ ఆశ్చర్యపోయారు.

17. ఉభయభారతీదేవి అనే పేరుతో యుక్తవయస్కురాలైన ఆ సరస్వతీదేవి విద్యావినయ సౌశీల్యాదులు విప్రుల ద్వారా బహుళ ప్రచారమై మండనమిశ్రుని చేరింది. మండనమిశ్రుడనే విశ్వరూపుడు సకల విద్యాస్వరూపిణి, లావణ్యవతియైన ఆ ఉభయభారతీదేవి వృత్తాంతాన్ని విని

ఆమె పట్ల ఆకర్షితుడయ్యాడు. అలాగే ఆ ఉభయభారతీదేవి కూడా విశ్వరూపుని పట్ల అనురాగం గలదయింది. ఆ ప్రకారం వారిరువురిలోనూ ప్రేమబీజా లంకురించాయి.

18. ఆ విధంగా వారిరువురు ఒకరిపై నొకరు ప్రేమాభిమానాలను పెంచుకొంటూ స్వప్నాలలో కలుసుకోసాగారు. మేల్కొన్న తరువాత ఆ విరహం వృద్ధి కాజొచ్చింది.

19. మండనమిశ్రునకు, ఉభయభారతీదేవికి పరస్పరం ప్రత్యక్షంగా చూసుకోవాలన్న కాంక్ష పెరగసాగింది. ఒకరి గూర్చి మరొకరు ఎంతసేపు విన్నా విసుగు చెందకపోగా, సదా స్వప్నంలో దర్శింప ఉబలాటపడసాగారు. ఒకరి హృదయం మరొకరు దోచుకొన్న నాటినుండి అన్నోదకాలపై హితవు సన్నగిల్లింది. బాహ్యప్రపంచాన్నే మరచి ఊహాలోకంలోనే నివసించసాగారు.

20. ఇది ఇలా ఉండగా, మండనమిశ్రుని తండ్రియైన హిమ మిత్రుడు కుమారుని శరీరం రోజురోజుకు కృశించి పోవటం చూసి ఆశ్చర్య పోయాడు. వైద్యులను సంప్రదించగా దేహాన ఎట్టి అనారోగ్యమూ లేదని తెలిపారు. అక్కడ ఉభయభారతీదేవి తండ్రియైన విష్ణుమిత్రుని స్థితికూడా అలాగే ఉంది. వారు పరిపరి విధాల విచారించీ ఆమె నుండి సరియైన సమాధానం రాబట్టలేకపోయారు.

21. మండమిశ్ర, ఉభయభారతుల తండ్రులు వారి పిల్లల దుఃఖ కారణాలను గూర్చి యిలా ఆలోచించసాగారు. "లోకంలో ప్రాణులు సుఖాలనే కోరుకొంటారు. కోరుకున్న సుఖాలు దొరకని పక్షంలో దుఃఖి స్తారు. అంటే ప్రియమైన వస్తువు దక్కకపోయినా అప్రియ వస్తువు వచ్చి పడ్డా దుఃఖమే కలుగుతుంది. వారు ఇంకా కౌమారావస్థలోనే ఉన్నారు. వారి కిష్టమయిన వస్తువులన్నీ అందుబాటులోనే ఉంటున్నవి. అయినా ఏదో తాపంచేత దుఃఖిస్తూన్నారు. నిప్పులేక పొగరాదు గదా! కార్యం పొగ అయితే కారణం నిప్పు గదా!"

22. "వీరా ఇంకా కౌమారంలోనే ఉన్నారు. వివాహానికి ఇంకా వయసు మించిపోలేదు. ఎవరివల్లా అవమానం పొందలేదు. సౌఖ్యాలు అనుభవించేం దుకు కావలసిన ధనమున్నది. కుటుంబ భార మసలేలేదు. వ్యవహార తత్త్వజ్ఞులమైన మాకు ఎన్ని విధాలుగా ఆలోచించినా మీ దుఃఖకారణం తెలుసుకోలేకుండా ఉన్నాము."

23. "సకల శాస్త్రాలు చదివారు. ప్రజ్ఞావంతులు. అందుచేత అవి వేకం గాని, మూఢస్వభావంగాని దుఃఖకారణమై ఉండదు. పోనీ, శాస్త్ర విచారణాదులలో ఏమైనా పరాజయం పొందారా అంటే, అదీ కారణం కాదు. ఎందువల్లనంటే, మీరు నిరుపమ ప్రజ్ఞాపండితుల వద్ద శుశ్రూష చేసినవారు (సుశిక్షితులు) న్యాయశాస్త్రమందు ప్రావీణ్యం పొందినవారు. అటువంటి వీరికి పండితులనుండి పరాభవం జరిగే అవకాశమే లేదు. అయితే కారణమేమై ఉండవచ్చు?

24. వీరు పుట్టినప్పటి నుండి మహాపవిత్రులుగా ఉంటున్నారు. వేదోక్తమైన కర్మలనే చేస్తూ వచ్చారు. నిషిద్ధ కర్మ లెన్నడూ చేయలేదు." ఈ విధంగా తమలో తామే తర్కించుకొని హిమమిత్రుడు మండనమిశ్రుని, విష్ణుమిత్రుడు ఉదయభారతీదేవిని ఎంతో ఓర్పుతోను నేర్పుతోను కారణం తెలుసుకోవడానికి ప్రశ్నించసాగారు. ఈ విధంగా తమ తమ తండ్రుల నిర్బంధంచేత మనస్సులోని మాట చెప్పడానికే వారు నిర్ణయించుకొన్నారు.

26. మండనమిశ్రుడు ఇలా అన్నాడు: "తండ్రీ! శోణమనే నదం తీరాన విష్ణుమిత్రుడనే పండిత శ్రేష్ఠుడు వసిస్తున్నాడు. ఆయన శ్రోత్రియపరుడు, పరమ పవిత్రుడు. ఆ బ్రాహ్మణునికి ఉభయభారతి అనే పుత్రిక ఉంది. ఆమె గూర్చి బ్రాహ్మణ శ్రేష్ఠుల ద్వారా విని ఉన్నాను. ఆనాటి నుండి ఆమె రూపలావణ్యాలు, గుణగణాలు నా మనస్సును ఆకర్షించినవి. ఆమెనే ప్రతిదినం స్వప్నంలో చూస్తున్నాను. ఆమెనే వివాహమాడాలని సంకల్పిం చాను." (తూర్పు వైపుగా ప్రవహించే వాటిని నదులనీ అవి స్త్రీ రూపమైనవనీ; అట్లే పశ్చిమ దిక్కుగా ప్రవహించేవన్నీ నదాలనీ, అవి పురుష రూపమైనవనీ చెబుతారు.)

27. మండనమిశ్రుని మనస్సు తెలుసుకొన్న హిమమిత్రుడు వెంటనే ఇద్దరు బ్రాహ్మణులను పిలిచి, తన పుత్రునకు ఉదయభారతిని కోరుతూ ఆమె తండ్రియైన విష్ణుమిత్రుని ఇంటికి రాయబారం పంపాడు. వారూ బహు దూరప్రయాణం చేసి విష్ణుమిత్రుని గృహాన్ని చేరారు.

28. ఇది ఇలా ఉండగా అక్కడ ఉభయభారతీదేవి తన అభీష్టాన్ని తండ్రి కిలా తెలిపింది: "నాయనా! సకల శాస్త్రపారంగతుడు, జ్ఞానసమృద్ధుడైన విశ్వరూపుడనే పవిత్ర నామంతో రాజగృహవాసియైన ఒక బ్రాహ్మణోత్త ముడు ఉన్నాడు. ఆ మహానుభావుని పాదపద్మాలు సేవిస్తూ ధన్యురాలను కావాలని ఆశిస్తున్నాను. ఈ విషయంలో నా మనస్సులోని కోరికను నెర వేర్చిన యెడల నా జన్మ ధన్యమని భావిస్తాను" అని ప్రార్థించింది.

29. విష్ణుమిత్రుడు తన పుత్రికయైన ఉభయభారతి పలికిన మృదు మధురమైన పలుకులు విని పరమానందభరితుడై వినుచుండగా, విశ్వ రూపుడనే మండనమిశ్రుని తండ్రి పంపగా వచ్చిన బ్రాహ్మణులు విష్ణుమిత్రుని గృహాన్ని చేరుకొన్నారు.

30. హిమమిత్రుడు పంపిన ఆ బ్రాహ్మణు లిరువురిని విష్ణు మిత్రుడు సాదరంగా ఆహ్వానించి అర్ఘ్యపాద్యాది సపర్యలు చేసి పూజించాడు. వారు కొంత విశ్రాంతి తీసుకొన్న తరువాత సావధానంగా, ప్రశాంత హృదయంతో కుశల ప్రశ్నలు వేస్తూ, "అయ్యా! ఎంతో వ్యయప్రయాసలతో చాలాదూరం నుండి ప్రయాణం చేసివచ్చారు; కారణమే"మని ఆదరంగా ప్రశ్నించాడు. అంత ఆ బ్రాహ్మణశ్రేష్ఠులు "తమ కుమార్తె వివాహ విషయమై విశ్వరూపుని తండ్రి హిమమిత్రుడు పంపగా వచ్చాం.

31. "పండితవరేణ్యా! మేము హిమమిత్రుడు పంపగా వచ్చాం. మీ కుమార్తె సకల శాస్త్రాలు నేర్చి అపర సరస్వతీదేవియై ఉన్నదనీ, యుక్త వయస్కురాలనీ, పవిత్ర వంశంలో జన్మించినదనీ సమస్త సద్గుణరాశియనీ తెలుసుకొన్నాడు. ఆయన కుమారుడు విశ్వరూప పండితుడు, సకల శాస్త్రాలను చదివి పరిపూర్ణుడై ఉన్నాడు. ఆతడు అన్ని విధాలుగా మీ పుత్రికకు తగిన వరుడై ఉన్నాడు. కనుక మీ పుత్రికారత్నాన్ని హిమమిత్రుని

కుమారుడైన విశ్వరూపున కిచ్చి వివాహం జరిపించమని కోరడానికి వచ్చాం. 'రత్నం రత్నేన సంగచ్ఛతే' అన్న సూక్తి ననుసరించి పరస్పర సంబంధం కోరి వచ్చాం."

32. విష్ణుమిత్రుడు బ్రాహ్మణులతో ఇలా పలికాడు: "ఓ బ్రాహ్మణోత్తము లారా! హిమమిత్రుని మాటగా మీరు చేసిన వివాహ ప్రసంగం నాకెంతో సంతోషాన్ని కలిగించింది. నేను కూడా అదే కోరుకొంటున్నాను. అయినా నా భార్యను కూడా సంప్రదించి, ఆమె అభీష్టం కూడ తెలుసుకొని ఒక నిర్ణయానికి వస్తాను. ఎందుకంటే, రేపు మర్నాడు పిల్లకు ఏదైనా దుఃఖం వాటిల్లితే ఆమే గదా ఓదార్చాలి. అటువంటి సమయంలో 'నా మాట వినకపోయినందువలననే యీనాడు నా కుమార్తె కష్టాలపాలైనదని' చెప్పగలదు. కనుక నా కుమార్తె విషయంలో నా భార్యను సంప్రదించి ఒక నిర్ణయానికి వస్తాను. అదే సరియైన నిర్ణయమని భావిస్తున్నాను."

33. విష్ణుమిత్రుడు భార్యతో ఇలా అన్నాడు: సౌభాగ్యవతీ! మనకు కుమారుడైనా కుమార్తెయైనా భారతి ఒక్కతే సంతానం. అది కుమార్తె అవడంతో తల్లిగా నీకు ఎక్కువ బాధ్యత ఉంది. ఆమె వివాహ వయస్కురా లైనది. ఇప్పుడు మన కన్యను తమ పుత్రునికి కోరి హిమమిత్రుడు ఇరువురు బ్రాహ్మణులను పంపినాడు. హిమమిత్రుని కుమారుడైన విశ్వరూపుడు మహా పండితుడు. సర్వజ్ఞుడు. స్ఫురద్రూపి, మన పుత్రికకు అన్ని విధాల సరియైన వాడని తలచుచున్నాను. మన పుత్రికకు సరియైన సమయంలో వివాహం చేయవలసిన బాధ్యత మనపై ఉన్నది. నువ్వు బాగా ఆలోచించి నీ నిర్ణయం తెలుపు. "సకృత్కన్యా ప్రదీయతే" కన్య నొకే పర్యాయం ఈయవలె నన్నది స్మృతి వాక్యం. కనుక బాగా ఆలోచించి నీ నిర్ణయం తెలుపు. ఒకసారి కన్యని యిస్తామని చెప్పి తిరిగి మాట తప్పటం మిక్కిలి దోష మవుతుంది.

34. విష్ణుమిత్రుని భార్య ఇలా పలికింది: ఆర్యా! పిల్లవాడు నివసించే ఊరు చాలా దూరాన ఉన్నది. రావాలన్నా, పోవాలన్నా ఎంతో ప్రయాసతో కూడుకొన్నది. అది అలా ఉంచు, పిల్లవాని శాస్త్రపాండిత్యం, వంశం,

ఆస్తిపాస్తులు, శీలం, యోగ్యత మున్నగునవన్నీ ఇతరులు చెప్పగా వినటమేగాని, మనకు ప్రత్యక్షంగా తెలియదు. స్మృతివాక్య మొకటి వినండి.

'కుల, శీల, వయో, రూప, విద్య, ధన, సోదర వర్గాలనే ఏడు విషయాలను పరిశీలించి కన్యాదానం చేయాలి. బుద్ధిమంతులైన వారు మిగత విషయాలు పట్టించుకోనవసరం లేదు.' కనుక ఇప్పటికిప్పుడే మీకు ఏమని సమాధానం చెప్పగలను?

35. విష్ణుమిత్రుడు ముందుగా తన కుమార్తె మనస్సు తెలుసుకొన్నాడు. తరువాత తానుగూడా వరుని యోగ్యతల విషయంలో అనుకూలంగానే విని నందున భార్యను ఒప్పించడానికి అనేక దృష్టాంతాలు, ఉపమానాలను వినిపించాడు. "ఓ పరిశుద్ధాత్మురాలా! వరుని కులగోత్రాలు, శాస్త్ర పాండిత్యం మున్నగునవన్నీ మనం ప్రత్యక్షంగా చూడలేదని త్రోసివేయరాదు. లోకంలో పేరుప్రతిష్ఠలున్నవారి విషయంలో ప్రత్యక్ష ప్రమాణాన్ని పరిగణించవలసిన పనిలేదు. ఎందువల్లనంటే లోకవిఖ్యాతమైన రుక్మిణీ కల్యాణ చరిత్రే ఇందుకు తార్కాణం.

36. ఓ సతీమణీ! ఈ విశ్వరూపుడు (వరుడు) సాక్షాత్తూ విష్ణు మూర్తితో ఎలా పోల్చి చెప్తావని నువ్వు అనవచ్చు. విను. లోకంలో నాస్తిక మతం వృద్ధిచెంది వేదం క్షీణించిపోతున్నది. తిరిగి వేదాన్ని ఉద్ధరింప మహేశ్వరుని ఆజ్ఞపై కుమారస్వామియే కుమారిలభట్టుగా అవతరించాడు. అటువంటి కుమారిలభట్టు వద్ద యీ విశ్వరూప పండితుడు విద్యాభ్యాసం చేసినవాడు. ఇతణ్ణి సామాన్య మానవమాత్రునిగా తలచవద్దు. దైవాంశ సంభూతునిగా తలచు. కనుక వీరి విషయంలో పట్టుపట్టవద్దు. నన్ను విశ్వసించు.

37. ఓ శోభన శీలవతీ! విశ్వరూపుడని పేర్కొబడే మండనమిశ్ర పండితుడు పరమశ్రేష్ఠుడు. మన అదృష్టవశాత్తు మనకు వరుడు కాబోతున్నాడు.

37. బ్రాహ్మణులకు వైదిక ధర్మమార్గాన నడిపే విద్యే తరగని ధనం. అటువంటి విద్యే మానవుడు ఏ లోకానికి పోయినా రక్షిస్తూన్నది. ఆ

ధనం తరిగిపోయేది కాదు. రాజులు, చోరులు, స్త్రీలు కూడా దీనిని అపహ రించలేరు. అంతేగాక లోకంలో వస్తువాహనాలను సంపాదించే ధనం ధనమే కాదు.

38. ఓ సుదతీమణీ! లోకంలో ధనసంపాదనే పరమలక్ష్యంగా ఉన్నది. దీనివలన మానవుడు పతనమై కష్టాలనే పొందుతున్నాడు.

ధనం సంపాదించటం, దానిని సంరక్షించుకోవటం, ఖర్చుచేయటం, అనే ప్రక్రియలన్నీ కష్టాలనే కలిగిస్తున్నాయి. ధనవంతులందరికీ ఈ విషయం బాగా తెలుసు. ధనసంపాదనే లక్ష్యంగా పెట్టుకున్న విద్యాహీనుడు ధనమంతా చోరులుగాని, రాజుగాని, బంధువులుగాని అపహరిస్తారనే భయంతో నిత్యమూ దుఃఖాన్నే అనుభవిస్తూ ఉంటాడు.

39. ఓ సుశీలే! లోభులు కొందరు ధనాన్ని జాగ్రత్తపరచడానికి భూమిలో పాతిపెట్టుచున్నారు. లోభగుణం తిరిగి దానిని బయటకు తీయ నీయదు. ఆ విధంగా భూమిలో పాతిపెట్టితే భూమిపాలగుతున్నది. అదే, ఏ నదీతీరానో పాతిపెట్టితే నది పాలగుచున్నది. ఎవరివద్దనైనా గుప్తంగా దాచి ఉంచితే ఆ ధనం వాని పాలగుచున్నది. ఈ విధంగా చెప్పుకుంటూపోతే ధనం వల్ల కలిగే అనర్థాలు కోకొల్లలు. పైగా అది శాశ్వతం కాదు. అదే విద్యాధనమయితే అది నిత్యం, సుఖకరం, సర్వశ్రేష్ఠం.

40. ఓ ధర్మ శీలామణీ! ధనసంబంధమైన విషయాలను ఒక ప్రక్కన పెట్టు. బాలికలు ఎల్ల కాలం తల్లితండ్రుల ఇంట్లోనే ఉండరాదు. వివాహానికి పూర్వమే రజస్వలయైతే ఆ తల్లితండ్రులు భయంకర నరకాలలో పడతారు. కనుక మన కన్య రజస్వల కాకపూర్వమే వివాహం జరపాలి. అలా చేయని యెడల జరిగే అనర్థాన్ని చెబుతా. విను.

"వివాహం కాకుండా కన్య తండ్రి గృహంలోనే రజస్వలయైతే ఆ తండ్రి శిశుహత్యా పాతకాన్ని పొందుతాడు. ఆ తల్లి పాపాత్మురాలవు తున్నది."

41. ఓ ధర్మస్వరూపిణీ! మన ఇద్దరి మధ్య ఇంత చర్చ అనవసరం. మనం మన పుత్రికనే పిలిచి, తన మనస్సులో ఏ పవిత్రునినైనా వరించి ఉంటే అటువంటి బ్రాహ్మణశ్రేష్ఠుణ్ణే నిర్ణయిద్దాం."

42. అంతట తల్లిదండ్రు లిరువురూ ఉభయభారతీదేవిని పిలిచారు. "ఓ సుకుమారదేహధారిణీ! హిమమిత్రు డనే బ్రాహ్మణశ్రేష్ఠుడు తన పుత్రు డైన విశ్వరూపునికి నిన్ను కన్యగా కోరి ఇరువురు బ్రాహ్మణులను పంపి నాడు. విశ్వరూపుని గుణగణాలను నీకు వినిపించితిమి. నీ మనస్సులోని మాట చెబితే మేం ఆ ప్రకారమే చేస్తాం" అన్నారు.

ఈ విధంగా తన మనోరథాన్ని గూర్చి తండ్రి ముఖతా వినగానే ఆమె ఆనందం కట్టలు తెంచుకొని నోట మాటరాలేదు. దేహమంతా రోమాంచితమైనది. మనసులోని మాట బయటకు చెప్పలేనిదైనా, రోమాంచితం వంటి సాత్త్విక భావాలు ఆమె మనోరథాన్ని రెండింతలుగా ప్రకటించి నట్లయినది.

43. ఆ విధంగా ఉభయభారతీదేవి తన మనోరథాన్ని రోమాంచం ద్వారా ప్రకటించడంతో తల్లితండ్రు లిద్దరూ ఆమె మనోభీష్టాన్ని గ్రహించ గలిగారు. తరువాత బ్రాహ్మణు లిరువురికీ తమ అంగీకారాన్ని తెలిపారు. అంతట ఆ బ్రాహ్మణు లిరువురు తమ కార్యం సిద్ధించటంచేత ఆనందంతో తిరిగి హిమమిత్రుని ఇంటికి బయలుదేరారు.

44. జ్యోతిశ్శాస్త్రంలో అఖండ ప్రజ్ఞాపాటవాలు కలిగిన భారతీదేవి, 'రాబోయే పదునాలుగవ దినము దశమి తిథియందు సర్వమంగళప్రదమైన ముహూర్తం ఉన్న'దని తానే స్వయంగా వ్రాసి ఆ లేఖను ఆ బ్రాహ్మణుల కిచ్చింది.

45. తమ రాయబారం ఫలించటంతో ఆ బ్రాహ్మణు లిరువురూ అమితానందంతో హిమమిత్రుని గాంచి విషయమంతా విపులంగా తెలియబరచారు.

46. విష్ణుమిత్రుని గృహం నుండి వచ్చిన విప్రు లిరువురూ ఉభయ భారతీదేవి స్వయంగా వ్రాసి ఇచ్చిన లగ్నపత్రాన్ని హిమమిత్రునికి సమర్పిం చారు. ఆ లేఖను అందుకొన్న హిమమిత్రుడు మందహాసం చేస్తూ ఆ బ్రాహ్మణు లిరువురను సముచితంగా పూజించి అమూల్యమైన రత్నాభరణాలు, వస్త్రాదులతో సంతృప్తిపరచాడు.

47. విశ్వరూప పండితుడు ఉభయభారతీదేవి వృత్తాంతమంతా బ్రాహ్మణుల నుండి తెలుసుకొన్న సర్వ విషయాలు తండ్రి చెప్పగా విని ఎంతో సంతోషించాడు. తరువాత బంధువుల నాహ్వానించి తదుపరి కార్యా చరణ కార్యక్రమాన్ని గూర్చి పలికాడు.

48. దైవజ్ఞులయిన జ్యోతిశ్శాస్త్ర పండితులచే వివాహ ముహూర్తం నిశ్చయమైనది. ఆ ముహూర్తానికి విశ్వరూప పండితుని తల్లితండ్రులు, సకల బంధువర్గంతో కూడి కన్యాపాణిగ్రహణానికై విష్ణుమిత్రుని గృహానికి తరలి వచ్చారు.

49. ఆ విధంగా విశ్వరూపపండిత నామధేయుడైన మండన మిశ్రుడు శోణ నదీ తీరానికి రాగానే, విష్ణుమిత్రుడు మంగళ తూర్యరావాలతో ఎదురేగి వారిని స్వగృహానికి ఆహ్వానించి తీసుకొనిపోయాడు. మగపెండ్లి వారందరకు సకల మర్యాదలు చేశారు.

50. అంతట విష్ణుమిత్రుడు అల్లుణ్ణి ఆహ్వానించి ఆసనమిచ్చి అర్ఘ్య పాద్యాదులను, మధుపర్కాలను సమర్పించాడు. మృదుమధురమైన మాటలు పలుకుతూ అల్లుని ఆదరించి విష్ణుమిత్రుడు మహానందం పొందాడు.

"నాయనా! నా కుమార్తెతోపాటు ఈ కనిపించే ఇళ్ళు, గోవులు, బంగారం, పంట భూములు మిగిలిన సమస్త ధనమూ సంతోషంతో నీకు సమర్పిస్తున్నాను" అని పలికాడు.

[అతిథులు వచ్చినప్పుడు గృహస్థు అర్ఘ్యపాద్యాదుల నిచ్చి ఆదరించాలి. పాద్యం అంటే కాళ్ళు కడుక్కునేందుకై ఇచ్చే నీరు. ఇక్కడ అర్ఘ్యం అంటే పూజకోసం ద్రవ్యం, జలం, చందనం మున్నగునవి సమకూర్చటం.]

మధుపర్కం = పెరుగు, నెయ్యి, జలం, తేనె, చక్కెర. వీటిని మధుపర్కం లేక పంచామృతాలు అని చెబుతారు. (దధి సర్పిజ్జలం క్షౌద్రం సితాచైతైశ్చ పంచభిః! ప్రోత్యతే మధుపరుస్తు"]

51. విప్రోత్తమా! నా పూర్వజన్మ సుకృతంచే, సాక్షాత్తూ బ్రహ్మ స్వరూపుడవు, వేదమూర్తివైన నిన్ను అల్లునిగా పొందే భాగ్యం కలిగింది. ఈ వివాహం అనే పేరుతో మేమందరమూ ధన్యుల మవడమే కాక మా వంశమంతా ధన్యమైనది. లేకుంటే పండితోత్తములు, సర్వజ్ఞులైన మీరెక్కడ? నే నెక్కడ?

52. ఓ పూజ్యుడా! ఇక్కడ ఉన్న సంపద అంతా నేటి నుండి మీ అధీనంలో ఉంటుంది. మీరు యథేచ్ఛగా అనుభవించవచ్చు. ఇకపై ఈ సొత్తు అంతా తమదే కాని నాది కాదు సుమా!" అని పలుకగా, అంతట విశ్వరూపుని తండ్రియైన హిమమిత్రుడు ఇలా పలికాడు: "మహోదారా! ఈ వివాహం ద్వారా నా పుత్రుడు మీకూ పుత్రుడే అవుతున్నాడు. అట్లే మీ పుత్రిక కూడా నాకు పుత్రికయే అవుచున్నది. కనుక యికపై మీది మాది అనే భేదమేమీ లేదు. రెండు కుటుంబాలు ఒకటైనవి. ఇంతవరకు మీరు పలికిన పలుకులన్నీ మీ ఔదార్యాన్ని, మహోన్నత భావాలను తెలియజేస్తున్నవి. మీ పలుకులన్నీ నిష్కపటంగాను, సమయోచితంగాను ఉన్నవి. ఆ పలుకులు మీ కెంతైనా తగియున్నవి సుమా!"

53-54. ఉభయభారతీ, విశ్వరూపులు అసమాన సౌందర్యమూర్తు లవడంచే బంధువులు వారికి ఏ అలంకారాలు చేసినా అవన్నీ వెలవెల పోయాయి. అయినా ఆ శుభముహూర్తాన స్నానం చేయించి చందనాది లేపనాలతో అలంకరించసాగారు. బంధుజనులంతా వధూవరుల అసమాన సౌందర్యాన్ని గాంచి అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందారు.

55. వివాహాది శుభసమయాలలో ఆభరణాలను అలంకరించుకోవడం లోకాచారం. కానీ వధూవరులకు చేసిన అలంకారాల వల్ల ఆభరణాలకే ఎక్కువ శోభ చేకూరింది కాని, వధూవరుల శోభను పెంచలేకపోయింది.

56. ఆ ఉభయభారతీదేవి జ్యోతిశ్శాస్త్రంలో ఉద్దండ పండితురాలు. తన వివాహానికి ముహూర్తాన్ని తానే నిశ్చయించింది. తరువాత జ్యోతిశ్శాస్త్ర పండితు లా ముహూర్తాన్ని పరిశీలించి అది శుభయోగాదులతో కూడి సర్వమంగళప్రదమైనదని తెలుసుకొని ఆశ్చర్యపోయారు.

57. వివాహ సుముహూర్త వేళ వాద్యఘోషల, శంఖధ్వనుల, వేదాధ్యయనాలతో వివాహ మంటపమంతా ఘోషిస్తూ ఉండగా సకల శాస్త్రపారంగతుడైన విశ్వరూపుడు శ్రీమదుభయభారతీదేవి హస్తాన్ని గ్రహించాడు. పాణిగ్రహణం చేసుకొన్నాడు.

58. అట్టి వివాహ సమయంలో విష్ణుమిత్రుడూ, హిమమిత్రుడూ, వారి వారి బంధువర్గానికి సకల సౌకర్యాలు కలిగిస్తూ వారిని సంతృప్తిపరచ సాగారు. బంధువర్గం కూడా పరమానందభరితులై వారిరువురను వేనోళ్ళ ప్రశంసించారు.

59. వివాహ సమయంలో విశ్వరూపుడు శాస్త్రోక్తంగా అగ్నిహోమం చేస్తుండగా ధర్మపత్నియైన ఉభయభారతీదేవి ఆతడిని అనుసరించింది. ఇరువురూ అగ్నిహోత్రునకు ప్రదక్షిణాలు చేసి అగ్నిదేవుని సంతృప్తిపరచారు.

60. వివాహానికి వచ్చిన విప్రులందరికీ దక్షిణలు ఇచ్చి ఆ నూతన దంపతులు సంతోషపరచి పంపారు. తరువాత వారు మిగిలిన నాలుగు రోజులు అగ్నికార్యాన్ని చేస్తూ అగ్నిని సంరక్షించారు.

61. వివాహానంతరం విశ్వరూపుడు కొత్త పెండ్లికూతురుతో, తన స్వగృహానికి బయలుదేరాడు. అప్పుడు విష్ణుమిత్రుడు, తన ధర్మపత్నితో కలసి విశ్వరూపునితో ఇలా అన్నాడు: “మహాభాగా! లోకంలో ఆడపిల్లను అల్లారుముద్దుగా పెంచుకొంటారు. కొడుకైనా, కూతురైనా ఆమే అయి నప్పుడు వారి ప్రేమానురాగాలగూర్చి ప్రత్యేకంగా చెప్పాలా? మా బాలిక ఇంకా పసిబిడ్డే. దానికి ఏ పనిపాటలు మేము నేర్పలేదు. లోక వ్యవహారం అసలే తెలియదు. మీరందరు ఈ విషయాలు తప్పక మనసులో ఉంచుకోవాలి.

మా ఉభయభారతి ఎంత చిన్నపిల్లో వినండి. తోటి పిల్లలతో ఆటలకు పోతుంది. తన ఆకలి కూడా తనకు తెలియదు. అక్కడే పరుండి

పోతుంది. మేము పోయి మా బాలికను తీసుకొనివచ్చి తినిపించేవారం. మాకు పుత్రుడైనా, పుత్రికయైనా ఆమే కనుక ఆమెపట్ల మేము ఎట్టి నిర్బంధాలను విధించలేదు. ఈ విషయాలన్నీ మీరు మనస్సులో ఉంచుకొని తమ బిడ్డయేనని తలచి సంరక్షించాలి.

63. అయ్యా! గృహిణి గృహకార్యాలను తప్పక నిర్వర్తించాలి. మేమూ అంగీకరిస్తాం. అయితే మా బాలికను చక్కగా మంచి మాటలతో చెప్పి చేయించుకొంటే ఎన్ని పనులైనా విసుక్కోకుండా చేస్తుంది. భగవంతుడు ఆమెకు అలాంటి సూక్ష్మబుద్ధీ, శక్తి సామర్థ్యాలూ ఇచ్చాడు. అలాకాక, కఠినమైన మాటలతోను, గర్జింపులతోను చెబితే అసలే మొండికివేస్తుంది. రోషం ఎక్కువ. ఆ తరువాత మనమెన్ని అనుకున్నా ప్రయోజనం ఉండదు సుమా! ఎందువలన ఇంతగా చెప్తున్నానంటే, లోకంలో అంతా ఒకే తీరుగా ఉండరుగదా! కొందరు మంచి మాటలకు పొంగిపోయి ఎంతటి కష్టమైన పనులైనా చేస్తారు. వీరిది ఉత్తమమైన స్వభావమని చెప్పవచ్చు. మరికొందరు అరచి, దుర్భాషలాడితేగాని పనులు చేయరు. అట్టివారు ఉత్తమ స్వభావులు కారు. స్వభావం అన్నది అంత తేలికగా విడువదు గదా! కనుక మంచి మాటలతో చెబితే మా కుమార్తె ఇంటి పనులన్నీ సమర్థవంతంగా చేయగలదు.

64. లోకంలో బాలికలకు నయంతోగాని, భయంతోగాని గృహ కార్యాలందు తల్లిదండ్రులు తగిన శిక్షణ ఇవ్వడం సామాన్య ధర్మం. అలా కాకుంటే తల్లిదండ్రులకు అపఖ్యాతి వస్తుంది. కాని భారతీదేవి పట్ల తల్లి దండ్రులమైన మేము ఏ విధమైన కఠిన వాక్యాలను ప్రయోగించలేదు. కారణమేమంటే దైవజ్ఞుడైన బ్రాహ్మణు డొకడు వచ్చి భారతీదేవి యందలి లక్షణాలు చూసి, “ఈమె ఏదో శాపవశాన భూలోకంలో జన్మించిన దేవతాస్త్రీయే గాని మానవ కన్య కాదు. కనుక ఎలాంటి పరిస్థితులలోనూ ఈమెను కఠిన వాక్యాలచే నిందించవద్దు. ఇది నా ఆజ్ఞగా స్వీకరించండి” అని పలికి వెళ్లిపోయాడు. కనుక మేము ఆమెపట్ల కఠినంగా ఎన్నడూ ప్రవర్తించలేదు.

65. అంతే కాక, ఆ విప్రోత్తముడు ఇంకా, ఇలా చెప్పాడు: “ఈ ఉభయభారతీదేవి సాక్షాత్తూ సరస్వతీదేవియే గాని, వేరొకరు కాదు. ఈమెలో సకల శాస్త్రాలందు, సకల ధర్మాలందు సర్వజ్ఞతను తెలిపే లక్షణాలు పరి పూర్ణంగా ఉన్నవి. ఇరువురు దివ్యపురుషులు ఖండనమండనంగా వాదోప వాదాలు జరుపుతూ ఈమెను ధర్మనిర్ణేతగా వ్యవహరించమని కోరతారు. వారు ఈమె నిర్ణయాన్ని శిరసావహిస్తారు. ఈమె పరిశుద్ధురాలు.” అందువలన మేము భారతీదేవిపట్ల అతి జాగ్రత్తతో వ్యవహరించాము.

66. ఇంతవరకు మా పుత్రిక మా అధీనంలో పెరిగింది. ఇకమీదట ఆమె అత్తగారి అధీనంలో జీవించనున్నది. కనుక అత్తగారితో మా వాక్యంగా విన్నవించండి.

67. పిల్లలు బాల్య చాపల్యంచేత తప్పులు చేయవచ్చు. లేదా అనుభవంలేక తప్పులు జరుగవచ్చు. పుట్టుకతోనే ఎవరూ పరిపూర్ణతను సాధించలేరు గదా! పోనుపోను మా బాలిక పనులు చేయటంలో ప్రావీణ్యాన్ని సంతరించుకోగలదు. కాబట్టి మా పుత్రికను కడుపులో పెట్టుకొని రక్షించండి.

68. సహజంగా గృహరక్షణ భారమంతా ఆమె అత్తగారిమీద ఉంటుంది. మా బాలిక తన అత్తగారి అధీనంలో నుండి జీవించాలి. ఆమె ఇప్పుడు మా ప్రత్యక్షంలో లేనందున మా మాటగా మీరే ఆమెకు విన్నవించండి. మిమ్మల్నే నమ్మివున్నామని పరిపరి విధాలుగా చెప్పి, ఉభయభారతీదేవిని వరునికి అప్పగించారు.

69. విష్ణుమిత్ర దంపతులు తమ కుమార్తెకు కూడా సమయోచిత మైన ఉపదేశం చేస్తున్నారు. “అమ్మా! ఇకపై నువ్వు ఆటపాటలు కట్టిపెట్టు. బాల్యదశ అంతమై యౌవనంలో ప్రవేశించావు. పైపెచ్చు నీ విప్పుడు నీ భర్త ఇంటికి వెళుతున్నావు. ఆ ప్రదేశమంతా నీకు క్రొత్త. అక్కడ మనుజులు కూడ కొత్తవారే. అక్కడ తెలిసీతెలియని పనులు చేసి నవ్వులపాలు గాబోకు. అక్కడ నువ్వు ఏ యే ధర్మాలు ఆచరించాలో బాగా తెలుసుకొని ఆచరించు. నీ బాల్యచేష్టలు మాకు ముద్దుగాని వారికి కాదు గదా!

70. ఓ కుమారీ! బాల్యదశలో నువ్వు మా రక్షణలో ఉన్నావు. వివాహానంతరం నీ భర్తే నీకు రక్షకుడగుతున్నాడు. కనుక ఎల్లవేళలా భర్తనే శరణు పొందు. దానివలన నువ్వు ఇహలోకంలోను, పరలోకంలోను గూడ సుఖసంతోషాలను పొందగలవు.

71. ఓ కుమారీ! భర్త ననుసరించవలసిన పరమధర్మాలన్నీ ఆచరించు. భర్త భుజించక ముందు భుజింపకు. ప్రక్కపై నుండి భర్తకంటే ముందుగా లేచి స్నానం చేయాలి. భర్త దూరప్రయాణంలో ఉన్నప్పుడు విశేషాలంకారాలు చేసుకోవద్దు. భర్త ఎదుట ఆచరించే ధర్మాలను, భర్త లేనప్పుడు ఆచరించవలసిన ధర్మాలను బాగా తెలుసుకొని ప్రవర్తించు. ఈ విషయంలో అరుంధతి, అనసూయ, లోపాముద్ర వంటి వారిని ప్రమాణంగా తీసుకో.

72. కుమారీ! భర్త కోపంతో ఉన్నట్లయితే నువ్వు ఓర్పు వహించి ఉండాలి. ప్రతికూలంగా మాట్లాడితే అశాంతి కలుగుతుంది. శాంతం, ఓర్పు వహించినట్లయితే, భర్త తనంతట తానే శాంతుడవుతాడు. వెయ్యిమాటలెందుకు గృహిణికి సహనమే పరమ భూషణమని తెలుసుకో. క్షమాగుణం ఎల్లవేళల శాంతిని ప్రసాదిస్తుంది.

73. భర్త ముందు పరపురుషుని గూర్చి ఏమీ మాట్లాడవద్దు. దీని వలన పరస్పరం అనుమానాలు తలయెత్తగలవు. ఈ అనుమాన బీజం వారి మధ్యగల ఆంతరంగిక ప్రేమభావాన్ని నశింపచేస్తుంది.

74. అమ్మా! పురుషుడు బయటకు పోయి ఇంటికి రాగానే, భార్య చేతిలో ఉండే పనులన్నీ వదిలివేసి కాళ్లు కడిగి, మధురమైన సంభాషణ చేయాలి. జీవితాన్ని పరమ పవిత్రం చేసుకో. జీవితాన్ని వ్యర్థం చేసుకోరాదు. అదే పతివ్రతాధర్మం.

75. సుపుత్రీ! భర్త గ్రామాంతరం పోయినప్పుడు, బంధువులు గాని, మహాత్ములుగాని వచ్చినప్పుడు వారిని ఆదరించి యథోచితంగా అతిథి మర్యాదలు సలిపి ఆదరించాలి. భర్త లేడుగదా! ఇది నా పని

కాదని తలచరాదు. అలా చేస్తే వారు నిరాశ చెందుతారు. దానివలన వంశం క్షీణిస్తుంది. భర్త ఇంటలేని సమయంలో మహాత్ములను, అతిథులను సత్కరించటం సతీమణులకు పరమ ధర్మమని తెలుసుకో.

76. కుమారీ! ఇక్కడ మా పట్ల ఎలా విధేయతతో మెలగినావో, అక్కడకు పోయిన తరువాత అత్తమామల పట్ల కూడా విధేయతతో వ్యవహరించాలి. అంతే కాదు, భర్త సహోదరుల పట్ల కూడా అత్యంత ఆదరంతో మెలగాలి. లేకుంటే వారు నీపై భర్తతో చాడీలు చెప్పి మీ ఇద్దరి మధ్య ఎడబాటు కలిగిస్తారు. అన్ని విధాలుగా మన వంశప్రతిష్ఠ, అటు వారి వంశప్రతిష్ఠ వృద్ధి అయ్యేట్లు ప్రవర్తించు. ఇది ధర్మాత్ములు ఆచరించే మార్గమని తెలుసుకో."

విష్ణుమిత్రుడు ఈ విధంగా భారతీదేవి మండనమిశ్రులకు ధర్మతత్త్వాన్ని ఉపదేశించిన తరువాత గురువు, మామగారు అయిన విష్ణుమిత్రుని వద్ద, బంధువర్గం వద్ద సత్కారాలు పొంది తమ స్వగృహానికి బయలుదేరారు. ఉభయవంశాలను తన పవిత్ర ఆచరణలచేత కీర్తిమంతం చేయడంలో భారతీదేవి "ఉభయభారతీదేవి"గా ప్రఖ్యాతి పొందినది.

78. దుర్వాసముని శాపంచే శ్రీ సరస్వతీదేవి, భారతీదేవిగా జన్మించింది. తిరిగి ఆ మునియే శంకరుని దర్శనానంతరం శాప విమోచనం పొందుతుందని తెలిపాడు. అట్టి భారతీదేవియే శ్రీ శంకరాచార్యులు సర్వజ్ఞుడని నిరూపించడానికి మధ్యవర్తిగా నిలువనున్నది. ఆమె పాండిత్యానికి దైవత్వమబ్బింది.

79. శ్రీకృష్ణ భగవానుని మల్లేనే, శ్రీ శంకరులు కూడా మాయాదేవిని తన స్వాధీనంలో ఉంచుకొని బాల్యమందే తన లీలలను ప్రకటించారు.

80. శ్రీ మహావిష్ణువు మల్లేనే జరిగింది, జరుగబోయేది ఎరిగినట్లుగానే, శ్రీ శంకరులుకూడా భూతభవిష్యద్వర్తమాన విషయాలన్నీ త్రికాల జ్ఞానంతో తనయందే చూశారు.

81. బాలకృష్ణుని మల్లేనే, బాలశంకరులు కూడా లోక సంరక్షణకోసం లీలామానుష విగ్రహాన్ని స్వీకరించి శిశువుగా ఉయ్యాలలో ఊగే సమయం నుండి అద్భుత లీలలను ప్రదర్శిస్తూ జనులందరినీ ఆశ్చర్యపరచారు. శ్రీకృష్ణ భగవానుడు విష్ణ్వంశను ప్రదర్శించిన విధంగా బాలశంకరులు కూడా తన మహేశ్వరావతారాన్ని ప్రదర్శించి జనులను ఆశ్చర్యపరచారు.

82. మనోహరమైన కేశాలు గలవాడూ, 'కేశి' అనే రాక్షసుని సంహరించినవాడు కాబట్టి విష్ణుమూర్తికి కేశవుడని పేరు వచ్చినది. శుభాలకు ఈశ్వరుడు కనుక శంకరుడు విష్ణుమూర్తి అయ్యాడు. అట్లాగే యీ బాలశంకరుడు కూడా కేశపాశాలచే పాశాన్ని ధరించిన మహేశ్వరునిలా ఉన్నాడు. బాలశంకరుడు తన బాల్యచేష్టలచేత బ్రహ్మదేవుని వలె ప్రకాశిస్తున్నాడు. ఈ ప్రకారంగా బాలశంకరుడు త్రిమూర్తులవలె ప్రకాశించుస్తున్నాడు.

83. బౌద్ధులు పశుపతి మతాన్ని స్వీకరించారు. క్షపణకులు కపాలాన్ని ధరించి దిగంబరులై తిరుగుతున్నారు. విష్ణుమతావలంబులు మొదలైనవారు వేదమార్గాన్ని దూషించసాగారు. అటువంటి వేదోక్తమార్గాన్ని ఉద్ధరించడానికీ, ఘోరమైన సంసారారణ్యంలో సంచరించేవారికి నివృత్తిమార్గాన్ని చూపేందుకూ, మోక్షమార్గాన్ని ప్రసాదించడానికీ శంకరుడనే పేరుతో అవతరించి ఉన్నాడు. ఆ మహేశ్వరుడే శ్రీశంకరాచార్యుల రూపంలో అవతరించాడు.



# సర్గము - 4

## బాల శంకరుల పాండిత్య లక్షణాలు

1. మహేశ్వరుడు తన మాయాశక్తిచేత లీలామానుషవిగ్రహుడై శివగురు ఇంట అవతరించడం జగద్విదితమే. లోకంలో పుత్రోదయం చేత తల్లిదండ్రులు అమితానందాన్ని పొందడం సహజమే. అయినప్పటికీ ఇట్టి లోకోత్తర పురుషుడు, పరమశివుని అవతారమయిన ఈ బాలుని పుట్టుకచేత శివగురు దంపతులు ఎలాంటి మహానందం పొందారో వర్ణించ శక్యం కాదు గదా! ఎందుకంటే ఈ బాలుడు ఒకటవ సంవత్సరంలోనే మాతృ భాషను పరిపూర్ణంగా గ్రహించాడు. ఇక తక్కిన భాషలన్నింటిలోనూ అచ్చులు, హల్లులు మొదలైన అక్షరములన్నీ నేర్చుకొన్నాడు.

2. బాలశంకరునకు రెండవ యేడు రాగానే అన్ని భాషలలోని అక్షరాలు వ్రాయడం తనంతట తానే స్వయంగా నేర్చుకొన్నాడు. మూడవ యేడు ప్రవేశించగానే అన్ని భాషలను గురువు లేకుండా చదవటమే కాక, ఇతరులకు బోధించడానికి కూడా సమర్థుడయ్యాడు.

3. బాలశంకరులు ఒకసారి గురుముఖత వినగానే గ్రహించటం చేత, ఏకసంథాగ్రాహియై గురువులకు శ్రమ లేకుండా చేశాడు. గురువులేని సమయంలో బాలశంకరులే తోటి విద్యార్థులకు బోధించేవాడు.

4. తన వయస్సులోని బాలురు ఇంకా తప్పటడుగులు వేస్తుండగా శ్రీ బాలశంకరులు పైన వివరించినట్లు సర్వ భాషలందూ ప్రావీణ్యం సంపాదించారు.

5. బాలశంకరునకు మూడవ యేటనే పుట్టు వెంట్రుకలను తీయించి, చెవులు కుట్టి, 'చూడ కర్మ' సంస్కారం చేశారు. ఆ సంస్కారానంతరం బాలశంకరుని దేహం ప్రజ్వలిస్తూన్న అగ్నిహోత్రుని మల్లే ప్రకాశించసాగింది. ఆ విధంగా బాలశంకరుడు స్ఫటికంలా శుద్ధమై పవిత్రుడై వెలుగొంద సాగాడు.

6. బాలశంకరులు మూడేళ్లు నిండకముందే శాస్త్రములన్నీ చక్కగా అవగాహన చేసుకొని గ్రహించగలిగేవాడు. గురువు బోధించినా, బోధించక పోయినా సర్వశాస్త్ర జ్ఞానం సంతరించుకొన్నాడు. భూర్భువాది సప్తవ్యాహృతు లతో కూడిన వేదాలను అధ్యయనం చేశాడు. పండితులకే కష్టసాధ్య మైన తర్కశాస్త్రాన్ని అలవోకగా గ్రహించాడు. ఉద్దండ పండితులతో కావ్య నాటకాదులయందు వాదప్రతివాదాలు సలిపి వారందరినీ నిరుత్తరులను చేసేవాడు.

7. బాలశంకరులు అఖండ ప్రజ్ఞావిశేషంచేతా, సాటిలేని వాగ్ధాటి చేతా శాస్త్ర విషయాలందు ప్రతివాదులను నిరుత్తరులను చేసేవాడు. వాద జల్ప వితండ ప్రసంగాలందు ప్రఖ్యాతిగాంచిన విద్వాంసులను కూడా ఆడుతూపాడుతూ జయించేవాడు. బృహస్పతికి కూడా పాఠాలు చెప్పగల నేర్పరి అయ్యాడు. మహేశ్వరుని అవతారమైన శ్రీ శంకరుల ముందు మిగిలిన పండితులందరు సూర్యుని ముందు దివిటీమల్లే వెలవెలబోయారు. దూరప్రాంతాల నుండి బాలశంకరులతో వాదించాలనే ఉత్సాహంతో వచ్చిన పండితులందరూ ముందుకు రాగానే నోరు మెదపలేకపోయేవారు.

8. ఆదిశేషుడే పతంజలి మహర్షియై తన వేయి ముఖాలతో వ్యాకరణ భాష్యాన్ని ప్రవచించాడు. అటువంటి పతంజలి మహర్షి మాటల పొందిక అప్రతిహత వాగ్ధోరణిని మించిపోయి, వేయిమంది పండితులు కలసి ఒకేసారి వాదించినా బాలశంకరుని ముందు నిలువలేకపోయారు. వారందరూ బాలశంకరుని దర్శించినంత మాత్రానే ముగ్ధులయ్యేవారు.

9. బాలశంకరుడు చిన్నతనంలోనే వేదబాహ్యాలైన పాషండ మతా లన్నింటినీ ఖండించేవాడు. ఈ విధంగా పరమతాలన్నిటినీ ఖండిస్తూ, స్వమతాన్ని సుస్థిరంగా స్థాపించటంలో బాల్యం నుండే తను అసమాన ప్రజ్ఞాపాటవాలను చాటుకొన్నాడు.

10. శివగురు, ఈ విధంగా సూర్యభగవానునిమల్లే ప్రకాశిస్తూన్న తన పుత్రుణ్ణి చూసుకొని, 'ఆహా! ఇలాంటి బాలకుని జన్మచేత నా వంశ మంతా చరితార్థమైనది గదా' అని మహానందం పొందాడు.

11. శివగురు తనకు వయస్సు మీరిపోతున్నదని గ్రహించి, బాల శంకరునికి మూడవ యేటనే ఉపనయనం చేయాలని తలచాడు. కానీ తన సంకల్పం నెరవేరకముందే ఆయన పరమపదించాడు.

12. శివగురు పుత్రప్రాప్తికై చాలాకాలం పరితపించాడు. చివరకు పరమేశ్వరానుగ్రహంతో తన పుత్రుని వైభవాన్ని కళ్లార చూడలేకపోయాడు.

13. బాలశంకరులకు ఉపనయన సంస్కారాలు జరుగనందున జ్ఞాతులే శివగురుని దహనసంస్కారాలు జరిపించారు. దుఃఖిస్తూన్న ఆర్యాంబను బంధుజనులందరు పరిపరి విధాలుగా ఓదార్చారు.

14. ఆర్యాంబ, శివగురుని మరణానంతరం వైదిక కర్మలన్నీ తాను స్వయంగా నిర్వర్తించింది. తాను చేయజాలని కర్మలన్నీ జ్ఞాతుల చేత చేయించి తన భర్తకు సద్గతులు కలుగేట్లు చేసింది. ఆ సంవత్సర మంతా మాసికాది పితృ కార్యాలు చేయించి జ్ఞాతులను, బ్రాహ్మణులను భోజనాదులచే తృప్తిపరచింది. ఆ సంవత్సర కాలంలో ఎలాంటి శుభకార్యా లను తలపెట్టరాదు కనుక, పుత్రునికి ఉపనయన ప్రయత్నాలను విరమించు కొంది.

15. శివగురుని సాంవత్సరికాలయ్యాక, శ్రేష్ఠమైన ముహూర్తం చూసి బాలశంకరుని అయిదవ యేట ఉపనయనం చేసి సాంగ వేదాధ్య యనానికి అర్హునిగా చేసింది.

16. సామాన్యంగా వేదంలోని నాలుగు నియమాలను ఒక్కొక్క నియమాన్ని పన్నెండు సంవత్సరాల చొప్పున నాలుగు నియమాలను 48 సంవత్సరాలపాటు అధ్యయనం చేయవలసి ఉంటుంది. కానీ బాల శంకరులు తన అయిదవయేట వేదాధ్యయనం ప్రారంభించి, నాలుగు నియమాలను పన్నెండు సంవత్సరాలలో సంపూర్ణంగా అధ్యయనం చేసి, అందరినీ ఆశ్చర్యపరచారు. 'ఈ మహానుభావుడు మానవమాత్రుడు కాడు; దేవతా కాడు; లోకాన్ని ఉద్ధరించడానికి అవతరించిన మహేశ్వరుడే' అని తలచారు.

17. బాలశంకరులు గురుముఖత వేదవాక్యం వెలువడగానే ఆ వాక్యాన్ని పూర్తిగా తెలుసుకోవడమేకాక, దానికి సంబంధించిన అధీతి, బోధ, ఆదరణ, ఆచరణ, ప్రచారణాల వరకు వాక్యాలన్నిటినీ స్వయంగా గ్రహిస్తూ తన పాండిత్యాన్ని ప్రదర్శించేవాడు. ఈతడి కుశాగ్రబుద్ధికి తగినట్లుగా పాఠాలు చెప్పగల సామర్థ్యం తమకు ఉందా అని గురువే సందేహపడేవాడు. ఇక తోటి విద్యార్థుల విషయం విడిగా చెప్పాలా? ఇటువంటి నిరుపమ ప్రజ్ఞావిశేషాలచేత తన అప్రాకృతబుద్ధిని శ్రీ శంకరులు ప్రదర్శించేవారు.

18. శ్రీ శంకరులు కేవలం రెండు మూడు మాసాలలోనే గురువుతో సమానంగా సకల విద్యలను నేర్చుకోవడమేగాక తోటి విద్యార్థులకు వేదాంగా లన్నీ బోధించసాగారు. శ్రీ శంకరులు సాక్షాత్పరమేశ్వరుడవడంచేత గురువులు నిమిత్తమాత్రులే అయ్యారు.

19. వేదాలయందు చతుర్ముఖ బ్రహ్మకు సమాను డయ్యాడు. వేదాంగాలైన శిక్షావ్యాకరణాలందు, గార్గ్య మహర్షితో సమానుడయ్యాడు.

వేదాలకు ఉపాఖ్యానాలు తెలుపడంలో, తాత్పర్యాలు వివరించటంలో, అందలి కథలను తెలుపుతూ వేదార్థాన్ని వేదబుక్కులను ప్రవచించిన బృహస్పతితో సమానుడయ్యాడు.

వేదోక్తమైన కర్మకాండ వివేచనమందు, కర్మకాండను ధర్మ, అర్థ ప్రతి పాదికలకు సూత్రాలను ప్రవర్తింపచేసిన జైమిని మహర్షికి సమానుడయ్యాడు.

బ్రహ్మసూత్రాలను రచించి వేద విభాగాలను చేసిన వేదవ్యాసునితో సమానుడయ్యాడు. ఒక్కమాటలో చెప్పాలంటే, శ్రీ శంకరులు తన అయిదవ యేటనే సకల విద్యాస్వరూపుడై మహర్షులందరితో సమానుడుగా సర్వదేవతా స్వరూపుడుగా ప్రకాశించాడు.

ఈ విధంగా శ్రీశంకరులు సర్వవిద్యలయందూ తమ ఆధిక్యాన్ని నిరూపించారు.

20. గౌతమ మహర్షి, కణాద మహర్షి రచించిన న్యాయ, దర్శన, వైశేషిక దర్శనాలను పూర్తిగా అధ్యయనం చేశాడు. మహా కఠినమైన

తర్కశాస్త్రంలో అసమాన పాండిత్యాన్ని ప్రదర్శించాడు. కపిలముని ప్రకటించిన సాంఖ్య శాస్త్రంలోనూ సాటిలేని పాండిత్యాన్ని గడించాడు. సాంఖ్య సూత్రాలను అర్ధసహితంగా అవగాహన చేసుకొని వాటిలోని రహస్యాలను అన్వేషించాడు. పతంజలి యోగదర్శనాన్ని నీరు త్రాగినంత సులభంగా గ్రహించి అందలి ఈశ్వర, నిరీశ్వర భావాలను ఆకళింపు చేసుకొన్నాడు.

జైమిని మహర్షి రచించిన కర్మకాండ ప్రతిపాదితమైన ధర్మసూత్రాలకు శ్రీ కుమారిలభట్టు వార్తికాలను రచించాడు. వాటిని భాట్ట ఘట్టములంటారు. అవన్నీ చాలా కఠినంగా ఉండటంచేత వాటికన్నిటికీ చక్కగా అర్థాలను తెలుసుకొన్నాడు. పూర్వమీమాంసా తత్త్వ రహస్యాలను గుర్తించి విమర్శించసాగాడు.

అద్వైతవిద్య అనబడే బ్రహ్మవిద్య జ్ఞానకాండను తన సిద్ధాంతంగా చేసికొన్నాడు. ఉత్తరమీమాంసా శాస్త్రాన్ని తన స్వతంత్ర శాస్త్రంగా చేసుకొన్నాడు. వేదవ్యాసుని బ్రహ్మసూత్రాలను తన వ్యాఖ్యాన విషయాలుగా చేసుకొన్నాడు.

ఈ ప్రకారం షడ్దర్శనాల రహస్యాలను తెలుసుకొని, వాటి యందు పూర్వపక్ష వాదం అవలంబించి, ఆ యా శాస్త్రాలందు ఆ యా ఋషులూ తానే అయి విలసిల్లాడు.

అయినా శంకరులు సాంఖ్యయోగాదులచే తృప్తి చెందలేదు. తానే పరమ శివుడవడంతో క్షీణించిపోతున్న అద్వైతతత్త్వాన్ని తిరిగి స్థాపించ దలచాడు. అందుకు సర్వమహర్షుల సిద్ధాంతాలను పూర్వపక్షం చేస్తూ జ్ఞానకాండయైన బ్రహ్మవిద్యాతత్త్వ స్వరూపమైన అద్వైతాన్ని తన సిద్ధాంతంగా స్వీకరించాడు. కనుక అద్వైత తత్త్వమైన ఉత్తర మీమాంసాదర్శనాన్ని మాత్రం స్వీకరిస్తూ, మిగిలిన సాంఖ్యాది పంచదర్శనాలు పరమార్థాలు కాబోవని నొక్కివక్కాణించాడు.

సాంఖ్య, యోగ, తర్కాది సకలశాస్త్రాలందు ఏ సుఖం ఉందో ఆ సుఖమంతా నిర్మలం, అఖండం ఆనందస్వరూపమైన అద్వైత విద్యానుభవమంతా పరబ్రహ్మయందు ఒక అణువై ఇమిడిపోయిందని శ్రీశంకరాచార్యుల

వారు ప్రతిపాదించారు. అలాగే బ్రహ్మవిద్యాప్రతిపాదితమైన అద్వైత పరమార్థంలో సకల శాస్త్ర సుఖాలు విలీనమై ఉన్నవని బోధించారు. అదెలాగంటే సముద్రంలోని జలం అపరిమితం, అక్షయం. దానినుండే మేఘాలు నీటిని గ్రహించి తిరిగి వర్షం ద్వారా బావులు, సరస్సులు, చెలములు మొదలైన కూపాలకు చేరుతున్నది.

పర్యవసాన మేమంటే, వేదంనుండి జ్ఞానకాండను వేదవ్యాసుడు గ్రహించి బ్రహ్మసూత్రాలను రచించాడు. మిగిలిన మహర్షులు వారి వారి అనుభవాన్ని బట్టి వేర్వేరు శాస్త్రాలను రచించారు. అగ్ని నుండి చిన్నచిన్న కణాల మల్లే అద్వైతం నుండి సకల శాస్త్రాలు పుట్టాయి. లోకంలో అనేక మతాలు ఉద్భవించాయి. పరమాత్మతత్త్వం అనంతం; అలాంటి తత్త్వాన్ని ప్రతిపాదించే అద్వైతం అపరిచ్ఛిన్నం, పరమానందం, శివం, కైవల్యం, సకల వేదాంత సారం, కనుక శ్రీ శంకరుల మనస్సు అద్వైత సిద్ధాంత స్థాపనకే పరుగులు పెట్టుతున్నది.

కూపాదులందలి జలాలచే కలిగే ప్రయోజనం గంగ మొదలైన పవిత్ర నదులందు, అనంతమైన సముద్రమందు సులభంగా సిద్ధిస్తుంది. అలాగే సర్వవేదాలందలి ప్రయోజనం బ్రహ్మజ్ఞానం పొందినవారికి తప్పక కలుగుచున్నదని భగవద్గీతా స్మృతి పేర్కొంటున్నది.

21. బాలశంకరులు గురుకులంలో విద్య నేర్చుకొంటూ భిక్షాటనచే జీవించేవారు. ఒక రోజు తనతోటి వారితో కలసి భిక్షకై ఒక బీదబ్రాహ్మణి ఇంటికి పోయారు.

22. అప్పు డా బ్రాహ్మణి భిక్షకై వచ్చిన బ్రహ్మచారులను చూసి దీనంగా, ఆదరంతో ఇలా పలికింది: "మీ వంటి పుణ్యాత్ములకు ఎవరు సపర్యలు చేస్తారో అలాంటి వారి జన్మ ధన్యమవుతుంది. మీ వంటి మహాత్ముల దర్శనమే కోటి పుణ్యాల పెట్టు. నిశ్చయంగా అలాంటి వారి జన్మ ధన్యమగుచున్నది. మా కలాంటి భాగ్యం కలుగుతుందా?

23. గృహస్థులకు ఇంటికి వచ్చిన వారికి ఆతిథ్యమివ్వడం, బ్రహ్మ చారులకు భిక్ష నివ్వడం పరమ ధర్మమై ఉన్నది. ఎన్నడూ రానివాడవు, క్రొత్తగా ఒడుగు చేసుకొనివచ్చిన బ్రహ్మచారికి గుప్పెడు మెతుకులు పెట్టలేని దీనస్థితిలో ఉన్నాను. ఈ విధంగా మా జన్మ నిరర్థకమైనది. దయామయు డైన భగవానుని అనుగ్రహానికి పాత్రులం కాలేకపోయాం, మా జీవితమంతా నింద్యమైంది గదా!"

24. ఈ విధంగా ఆ గృహిణి దీనంగా తన దారిద్ర్యాన్ని నిందించు కొంటూ, వటుడైన బాలశంకరుని జోలెలో ఒక ఉసిరిక పండును వేసింది. బాలశంకరుడు ఆ పండును మహాప్రీతితో తీసుకొన్నాడు. జ్ఞాననిధియైన ఆ మహాత్ముని హృదయం ద్రవించింది. ఆ గృహిణిని అనుగ్రహింపదలచారు.

25. శ్రీ మహావిష్ణువు పత్నీ, సర్వైశ్వర్యాలకు అధిపత్నీ అయిన శ్రీ మహాలక్ష్మిని ఉద్దేశించి మృదుమధురమైన పలుకులతో అర్థవంతమైన స్తోత్ర మొకటి ఆశువుగా పఠించాడు.

26. ఈ ప్రకారం శంకరులు లక్ష్మీదేవిని స్తోత్రం చేయగా ఆ తల్లి సంతసించినదై మెరుపుతీగను బోలిన శరీరకాంతితో కళ్లు మిరుమిట్లు గొలుపుచూ నలుదిక్కులు ప్రకాశించగా ప్రత్యక్షమయింది.

27. ముక్కోటి దేవతలు ఏ దేవి పాదపద్మాలకు సదా నమస్కరిస్తుం టారో, అలాంటి లక్ష్మీదేవికి చేతులొగ్గి నమస్కరిస్తూ, లలిత గాంభీర్యమైన పదాలచే స్తుతించాడు. శ్రీ శంకరుల స్తోత్రాలకు అమితంగా సంతోషించినదై చిరునవ్వు నవ్వుతూ ఇలా పలికింది.

28. "వత్సా! ఈ నిర్భాగ్యురాలి పట్ల నీకు కలిగిన అనుగ్రహాన్ని నే నెరుగుదును. వీరు పూర్వజన్మలందు కొంచమైనా పుణ్య కార్యాలు చేసివుండలేదు. కనుక నా కటాక్షానికి పాత్రులు కాజాలకపోయారు. ఏ కొద్దిపాటి పుణ్యం చేసి ఉన్నా నా అనుగ్రహానికి పాత్రులయ్యేవారు" అని లక్ష్మీదేవి బ్రాహ్మణుల దారిద్ర్య కారణాన్ని తెలిపింది.

29. లక్ష్మీదేవి పలుకులు విన్న శంకరులు "తల్లీ! జగజ్జననీ! నేను నీ అనుగ్రహానికి పాత్రుడనైతే, నేను కరుణించదగినవాడనైతే ఈ బ్రాహ్మణ గృహిణి నా కొక ఆమలక (ఉసిరిక) ఫలాన్ని సమర్పించింది. అందువలన

నీ అనుగ్రహానికి ఆమె తప్పక పాత్రురాలు కాగలదు. కనుక ఆ ఉసిరిక ఫలమానమునకు ప్రతిఫలం వెంటనే ప్రసాదించు” అని లక్ష్మీదేవిని ప్రార్థించారు.

**శ్రీకనకధారాస్తవము:–**

**వందే వందారుమందార మిందిరానందకందలమ్**
**అమందానందసందోహబంధురం సింధురాననమ్.**

ఇది గణపతి స్తుతి. భక్తులకు కల్పవృక్షం. లక్ష్మీదేవికి ఆనందాన్నిచ్చే మొలక, అత్యధికమైన ఆనందరాశితో మనోహరుడైన గజముఖునికి నమస్కరిస్తున్నాను.

**అంగం హరేః పులకభూషణమాశ్రయంతీ**
**భృంగాంగనేవ ముకుళాభరణం తమాలమ్,**
**అంగీకృతాఖిలవిభూతిరపాంగలీలా**
**మాంగల్యదాఽస్తు మమ మంగళదేవతయాః.**

లక్ష్మీదేవి కడగంటి చూపు (సొగసు) సకల సంపదలకు నిలయమైంది. మొగ్గలతో అలంకృతమైన చీకటి చెట్టును ఆడుతుమ్మెద మల్లే ఆ చూపు, శ్రీ మహావిష్ణువు శరీరాన్ని ఆశ్రయించి గగుర్పాటు అనే ఆభరణాన్ని చేకూరుస్తుంది. అట్టి లక్ష్మీదేవి కడగంటి చూపు నాకు సకల శుభాలను అనుగ్రహించుగాక!

**ముగ్ధా ముహుర్విదధీతీ వదనే మురారేః**
**ప్రేమత్రపాప్రణిహితాని గతాగతాని,**
**మాలాదృశోర్మధుకరీవ మహోత్పలే యా**
**సా మే శ్రియం దిశతు సాగర సంభవాయాః.**

లక్ష్మీదేవి చూపుల వరుస గొప్ప నల్లకలువపైకి ఆడుతుమ్మెదమల్లే శ్రీమహావిష్ణువు ముఖం మీదికి ప్రేమతోను, సిగ్గుతోను మాటిమాటికీ

రాకపోకలు సాగిస్తూ, ముగ్ధమనోహరంగా ఉంది. ఆ చూపుల వరుస నాకు సంపదను ప్రసాదించుగాక!

**విశ్వామరేంద్రపదవిభ్రమదానదక్ష-**
**మానందహేతురధికం మురవిద్విషోఽపి,**
**ఈషన్నిషీదతు మయి క్షణమీక్షణార్థ-**
**మిందీవరోదరసహోదరమిందిరాయాః.**

లక్ష్మీదేవి కడగంటి చూపు సమస్తమైన దేవేంద్ర వైభవాన్ని అనుగ్రహించడానికి సమర్థమైనట్టిది. శ్రీమహావిష్ణువుకు కూడా అధికమైన ఆనందాన్ని ఇవ్వగలిగినట్టిది. అట్టి ఆ చూపు నాపై క్షణకాలం నిల్చుగాక!

**ఆమీలితాక్షమధిగమ్య ముదా ముకుంద-**
**మానందకంద మనిమేష మనంగతంత్రమ్,**
**ఆకేకరస్థితకనీనికపక్ష్మనేత్రం**
**భూత్యై భవేన్మమ భుజంగశయాంగనాయాః.**

లక్ష్మీదేవి అరవిరిసిన కంటిచూపు సమ్మోహన శక్తి గలిగి, రెప్పపాటు లేనిదై, ఆనందానికి ఆధారమై, సంతోషంతో విష్ణువును పొంది, ఆయనకు పారవశ్యాన్ని కలిగించేట్టిది. అట్టి చూపు నాకు ఐశ్వర్యాన్ని అనుగ్రహించుగాక!

**బాహ్వంతరే మురజితః శ్రితకౌస్తుభే యా**
**హారావళీవ హరినీలమయీ విభాతి,**
**కామప్రదా భగవతోఽపి కటాక్షమాలా**
**కల్యాణ మావహతు మే కమలాలయాయాః.**

లక్ష్మీదేవి కడగంటి చూపులు (వరుస) కౌస్తుభమణితో ప్రకాశించే విష్ణువు వక్షస్థలం మీద ప్రసరించి, ఇంద్రనీలమణుల హారాల మల్లే

వెలుగొందుతున్నాయి. ఆయన కోరికలను కూడా తీర్చగలిగివున్నాయి. అట్టి చూపులు నాకు శుభం కలిగించుగాక!

**కాలాంబుదాళిలలితోరసి కైటభారేః**
**ధారాధరే స్ఫురతి యా తటిదంగనేవ,**
**మాతుస్సమస్తజగతాం మహనీయమూర్తిః**
**భద్రాణి మే దిశతు భార్గవనందనాయాః.**

కారుమబ్బులో మెరుపుతీగలాగా, నీలమేఘశ్యాముడైన విష్ణువు వక్షస్థలంలో ప్రకాశించే లోకమాత, లక్ష్మీదేవి. ఆమె అద్భుతరూపం నాకు శుభాలను ప్రసాదించుగాక!

**ప్రాప్తం పదం ప్రథమతః ఖలు యత్ప్రభావాత్**
**మాంగల్యభాజి మధుమాథిని మన్మథేన,**
**మయ్యాపతేత్తదిహ మంథరమీక్షణార్థం**
**మందాలసం చ మకరాలయకన్యకాయాః.**

సముద్రరాజు కుమార్తెయైన లక్ష్మీదేవి కడగంటి చూపు తిన్ననై, నెమ్మదై, మథించే స్వభావం కలిగింది. ఆ చూపు ప్రభావంతో మంగళ నిలయుడైన విష్ణువు మనస్సులో మొట్టమొదట మన్మథుడు స్థానం పొంద గలిగాడు గదా! అట్టి చూపు ఇక్కడ నా మీద ప్రసరించుగాక!

**దద్యాద్దయానుపవనో ద్రవిణాంబుధారా**
**మస్మిన్నకించన విహంగశిశౌ విషణ్ణే,**
**దుష్కర్మఘర్మమపనీయ చిరాయ దూరం**
**నారాయణప్రణయినీ నయనాంబువాహః.**

లక్ష్మీదేవి చూపు అనే మేఘం దయ అనే గాలితో ప్రేరేపింపబడి, ధనం అనే జలధారను పక్షికూనమల్లే దీనుడనై, దరిద్రుడనైన నాపై కురిపించి, నా పాప తాపాన్ని శాశ్వతంగా దూరం చేయుగాక!

**ఇష్టా విశిష్టమతయోఽపి నరా యయా ద్రాగ్**
**దృష్టాస్త్రివిష్టపపదం సులభం భజంతే,**
**దృష్టిః ప్రహృష్టకమలోదరదీప్తిరిష్టాం**
**పుష్టిం కృషీష్ట మమ పుష్కరవిష్టరాయాః.**

కమలాసన అయిన లక్ష్మీదేవి చూపు, వికసించిన కమలం మధ్య ఉన్న కాంతి కలిగినట్టిది. ఆ చూపు సోకిన మానవులు యజ్ఞయాగాది క్రతువులు చేయని వారైనా, వెంటనే సులభంగా స్వర్గసుఖాలను అనుభవింపగలరు. అట్టి లక్ష్మీదేవి చూపు నాకు కోరిన సంపదను ప్రసాదించుగాక!

**గీర్దేవతేతి గరుడధ్వజసుందరీతి**
**శాకంభరీతి శశిశేఖరవల్లభేతి,**
**సృష్టి స్థితి ప్రళయ కేళిషు సంస్థితా యా**
**తస్యై నమస్త్రిభువనైకగురో స్తరుణ్యై.**

సృష్టి-స్థితి-ప్రళయ క్రీడలలో బ్రహ్మభార్యయైన సరస్వతిగా, విష్ణువు భార్య అయిన లక్ష్మీదేవిగా, శక్తి స్వరూపిణి అయిన శివుని భార్య పార్వతీ దేవిగా ఎవరున్నారో, ముల్లోకాల ఏకైక అధిపతికి భార్యయైన ఆమెకు నమస్కారం.

**శ్రుత్యై నమోఽస్తు శుభకర్మఫలప్రసూత్యై**
**రత్యై నమోఽస్తు రమణీయగుణార్ణవాయై,**
**శక్త్యై నమోఽస్తు శతపత్రనికేతనాయై**
**పుష్ట్యై నమోఽస్తు పురుషోత్తమవల్లభాయై.**

సత్కర్మ ఫలాలను ప్రసాదించే శ్రుతి (వేద) స్వరూప లక్ష్మికి నమస్కారం. మనోహరమైన గుణాలకు సముద్రం వంటిదైన రతి (సంతోష) స్వరూప లక్ష్మికి నమస్కారం. నూరు రేకుల పద్మమే నివాసస్థానమైన శక్తి (సహస్రార) స్వరూప లక్ష్మికి నమస్కారం. పురుషోత్తముని భార్య అయిన పుష్టి (పూర్ణ-నిండైన) స్వరూపలక్ష్మికి నమస్కారం.

**నమోఽస్తు నాళీకనిభాననాయై**
**నమోఽస్తు దుగ్ధోదధిజన్మభూమ్యై,**
**నమోఽస్తు సోమామృతసోదరాయై**
**నమోఽస్తు నారాయణవల్లభాయై.**

పద్మంతో సమానమైన ముఖం కలిగినట్టిదీ, పాల సముద్రమే జన్మ భూమి అయినట్టిదీ, చంద్రునికి – అమృతానికి తోడ బుట్టినట్టిదీ, విష్ణువుకు భార్య అయినట్టిదీ అయిన లక్ష్మీదేవికి నమస్కారం.

**నమోఽస్తు హేమాంబుజపీఠికాయై**
**నమోఽస్తు భూమండలనాయికాయై,**
**నమోఽస్తు దేవాదిదయాపరాయై**
**నమోఽస్తు శర్ఙ్గాయుధవల్లభాయై.**

బంగారు తామరయే సింహాసనంగా, భూమండలానికి మహారాణిగా, కొలువుదీరి దేవతలు మొదలైన వారిని దయజూచునట్టిశార్ఙ్గధన్విని (విష్ణువు యొక్క) భార్యయైన లక్ష్మీదేవికి నమస్కారం.

**నమోఽస్తు దేవ్యై భృగునందనాయై**
**నమోఽస్తు విష్ణోరురసి స్థితాయై,**
**నమోఽస్తు లక్ష్మ్యై కమలాలయాయై**
**నమోఽస్తు దామోదరవల్లభాయై.**

భృగు మహర్షి పుత్రికయై, విష్ణువు వక్షస్థలంలో నిలిచినదై, కమల నివాసినియై, విష్ణుపత్ని అయిన లక్ష్మీదేవికి నమస్కారం.

**నమోఽస్తు కాంత్యై కమలేక్షణాయై**
**నమోఽస్తు భూత్యై భువనప్రసూత్యై,**
**నమోఽస్తు దేవాదిభిరర్చితాయై**
**నమోఽస్తు నందాత్మజవల్లభాయై.**

కమలాలవంటి కన్నులు గలిగి, కాంతి స్వరూపిణియై, లోకాలను సృష్టించి, ఐశ్వర్య స్వరూపిణియై, దేవతలు మున్నగు వారిచేత పూజితురాలై, కృష్ణుని భార్య రుక్మిణియై ఉన్న లక్ష్మీదేవికి నమస్కారం.

**సంపత్కరాణి సకలేంద్రియనందనాని**
**సామ్రాజ్యదాననిరతాని సరోరుహాక్షి,**
**త్వద్వందనాని దురితాహరణోద్యతాని**
**మామేవ మాతరనిశం కలయంతు మాన్యే.**

పూజనీయురాలవైన ఓ తల్లీ! కమలాక్షీ! నీకు చేసే వందనాలు సంపదలను ప్రసాదిస్తాయి. సకల-ఇంద్రియాలకు సంతోషాన్ని (సుఖాన్ని) కలిగిస్తాయి, సామ్రాజ్యాన్ని (చక్రవర్తిత్వాన్ని) ఇవ్వడంలో ఆసక్తి కలిగి ఉంటాయి; పాపాలను పూర్తిగా తొలగించటానికి పూనుకొని ఉంటాయి. అట్టి వందనాలు ఎల్లప్పుడు నన్ను ధన్యుని చేస్తూనే ఉండుగాక! అంటే - నేను ఎప్పుడూ నీకు నమస్కరిస్తూ ధన్యుణ్ణి అవుతాను గాక అని భావం.

**యత్కటాక్షసముపాసనావిధిః**
**సేవకస్య సకలార్థసంపదః,**
**సంతనోతి వచనాంగమానసైః**
**త్వాం మురారిహృదయేశ్వరీం భజే.**

విష్ణువు హృదయేశ్వరివైన ఓ దేవీ! నీ కడగంటి చూపుకోసం చేసే ఉపాసనా కార్యం, భక్తునికి సకల సంపదలను సమకూరుస్తుంది. అందు వల్ల మనోవాక్కాయకర్మల ద్వారా (త్రికరణ శుద్ధిగా) నిన్ను పూజిస్తున్నాను.

**సరసిజనయనే సరోజహస్తే**
**ధవళతమాంశుకగంధమాల్యశోభే,**
**భగవతి హరివల్లభే మనోజ్ఞే**
**త్రిభువనభూతికరి ప్రసీద మహ్యమ్.**

పూజ్యురాలవైన ఓ లక్ష్మీదేవీ! కమలనయనా! కమలహస్తా! మిక్కిలి తెల్లనైన వస్త్రాలతో, గంధమాల్యాలతో ప్రకాశించుదానా! మనోహర స్వరూపా! ముల్లోకాలకు సంపదలను ప్రసాదించుదానా! నన్ను అనుగ్రహించు.

**దిగ్ఘస్తిభిః కనకకుంభముఖావసృష్ట-**
**స్వర్వాహినీవిమలచారుజలప్లుతాంగీమ్,**
**ప్రాతర్నమామి జగతాం జననీ మశేష-**
**లోకాధినాథగృహిణీ మమృతాబ్ధిపుత్రీమ్.**

దిగ్గజాలు బంగారు కలశాలతో ఆకాశగంగా జలాన్ని తెచ్చి అభిషేకించగా, ఆ నిర్మలమైన-మనోహరమైన జలంతో తడసిన శరీరం కలిగిన జగజ్జనని, సమస్తలోకాలకు అధిపతి అయిన విష్ణువు ధర్మపత్ని, అమృత సముద్ర పుత్రి అయిన లక్ష్మీదేవికి ప్రాతఃకాలంలో నమస్కరిస్తున్నాను.

**కమలే కమలాక్షవల్లభే త్వం**
**కరుణాపూరతరంగితైరపాంగైః,**
**అవలోకయ మామకించనానాం**
**ప్రథమం పాత్ర మకృత్రిమం దయాయాః.**

విష్ణుపత్నివైన ఓ లక్ష్మీదేవీ! నేను బీదవారిలో ప్రథముణ్ణి! నీ దయకు కపటంలేని తగిన పాత్రుడను. అందువల్ల నన్ను దయారసంతో ఉప్పొంగిన నీ కడగంటి చూపులతో చూడు.

**స్తువంతి యే స్తుతిభి రమూభి రన్వహం**
**త్రయీమయీం త్రిభువనమాతరం రమామ్,**
**గుణాధికా గురుతర భాగ్యభాగినో**
**భవంతి తే భువి బుధభావితాశయాః.**

వేదస్వరూపిణి, త్రిలోకమాత అయిన లక్ష్మీదేవిని ఈ స్తుతులతో ఎవరు స్తుతిస్తారో, వారు అధిక గుణవంతులవుతారు, అధిక సంపన్నులవుతారు, ఈ లోకంలో విద్వాంసుల ప్రశంసలను అందుకుంటారు.

**సువర్ణధారాస్తోత్రం యచ్ఛంకరాచార్యనిర్మితమ్**
**త్రిసంధ్యం యఃపఠేన్నిత్యం స కుబేరసమో భవేత్.**

శంకరాచార్యులు రచించిన ఈ కనకధారా స్తోత్రాన్ని ప్రతిదినం మూడు సంధ్యలలో ఏ వ్యక్తి పారాయణం చేస్తాడో ఆ వ్యక్తి కుబేరునితో సమానుడౌతాడు.

*(డా॥ వింజమూరి విశ్వనాథమయ్యగారి సౌజన్యంతో)*

30. ఈ విధంగా భక్తితో ప్రార్థించిన బాలశంకరుల అభీష్టాన్ని అనుగ్రహించిన లక్ష్మీదేవి ఆ బ్రాహ్మణుని యింటి ఆవరణనంతా బంగరు ఉసిరిక పండ్ల వర్షం కురిపించింది. దయామయుడైన శంకరులు వారి దారిద్ర్యాన్ని అంతరింపచేయగా జనులందరు ఆ బాలశంకరుల మాహాత్మ్యాన్ని వేనోళ్ల కొనియాడారు. ఈ లీలచేత పామరులు కూడా ఈతడు సాక్షాత్తూ మహేశ్వరస్వరూపుడని తెలుసుకొన్నారు. పురాకృతపుణ్యాలు లేకపోయినా, దానం గ్రహించేవాడు మహాత్ముడయితే ఫలం తతణమే లభించగల్గదనీ, మహాత్ముల అనుగ్రహం అమోఘమనీ తెలుస్తోంది.

31. శ్రీశంకరుల ప్రార్థన మేరకు లక్ష్మీదేవి ప్రసన్నురాలై ఆ బీద బ్రాహ్మణుని ఇంట బంగరు ఉసిరిక పండ్ల వర్షం కురిపించి అంతర్ధాన మయింది. బాలశంకరులు అతిచిన్న వయస్సులోనే వేదవేదాంగాలన్నీ అధ్యయనం చేయడమే కాకుండా, తన దివ్య మహిమలచేత సర్వజనుల ప్రశంసలను పొందారు.

32. స్వర్గంలోని కల్పతరువుమల్లే బాలశంకరులు తనను ఆశ్రయించిన సకల జనులు కోరిన కోరికలన్నీ తీర్చారు. భూలోక పారిజాతంగా ప్రసిద్ధి గాంచారు. శిథిలమైన వేదాన్ని, వైదిక మార్గాన్ని సంరక్షించటంచేత భక్తుల కోరికలు తీరటంచేత దేవతలకూ, బ్రాహ్మణులకూ అత్యంత ప్రీతిపాత్రు లయ్యారు.

33. శ్రీశంకరులు బ్రాహ్మణి గృహాన బంగారు వర్షం కురిపించిన తరువాత తన భిక్షాటనం పూర్తి చేసుకొని తోటి విద్యార్థులతో కలసి మళ్లీ గురుకులంలో ప్రవేశించి శాస్త్రాల నభ్యసించసాగారు.

34. లోకంలో స్త్రీలు శ్రేష్ఠులైన భర్తలను పొంది సకల భోగభాగ్యా లను పొందగోరాలని ఆశిస్తారు. అలాగే సర్వవిద్యలనే కన్యలు శ్రేష్ఠుడైన శంకరుల నాశ్రయించి తమ కీర్తి లోకంలో చిరస్థాయిగా ఉండాలని కాంక్షిస్తున్నవి. అంటే సర్వవిద్యలు శ్రీ శంకరుల నాశ్రయించి ప్రకాశిస్తున్నాయి.

35. శ్రీ శంకరులు సకల శాస్త్రాలలోని నిగూఢమైన అర్థాలన్నీ సునా యాసంగా గ్రహిస్తూ సకల విద్యల నభ్యసించారు. ఆయన సకల విద్యా ప్రౌఢిమ, అప్రాకృత చరిత్ర అంతంలేని కాంతిపుంజమై ప్రకాశించింది. సకలకళాపరిపూర్ణుడు, తేజోవిరాజితుడైన శంకరుల దివ్యదేహం మహా దేదీప్య మానంగా వెలిగిపోతున్నది. శ్రీ శంకరుల దేహం పరిశుద్ధం, అప్రాకృతం, బ్రహ్మవర్చస్సుతో కాంతిపుంజమై వెలుగొందుతోంది. అంటే శ్రీ శంకరుల దేహం వేదవేదాంగాలతోను, సకల శాస్త్రాల సారంతోను, సకల మహర్షుల విలక్షణమైన తేజస్సుతోను విరాజిల్లుతూన్నది.

36. శ్రీ శంకరులను సాక్షాత్తూ పరమశివునిగా భావించి విప్రోత్తము లందరు ఆయన పాదాలను పూజిస్తూన్నారు. చంద్రుడు కూడ తన చల్లని కిరణాలచేత శంకరుని పాదాలను స్పృశిస్తున్నాడు. ఇది చూసిన కమలాలు మేం పరమ సుకుమారమైనవారమని మనోహరమైన వారమని గర్వించేవారం. కవులు కూడా మమ్మల్ని ముఖం, పాదాలు, హస్తాలతో పోల్చడం కద్దు. ఇప్పుడు మాకన్నా సుకుమారి, మనోహరమగు బాల శంకరుడు రావడంతో మా గర్వమంతా అణగిపోయినదని వాపోయినవి.

37. శ్రీ బాలశంకరుల కరచరణాలు లోకంలో కమలాలవంటి వస్తువులతో పోల్చదగినవిగావు. ఎందుకంటే అవి అన్నీ ఉత్పత్తి గలవి. కాని శంకరుల పాదాలు దివ్యములు, అప్రాకృతాలు, సర్వతమోభంజకాలు గదా! కాబట్టి సాదృశ్యం అసంభవం.

38. కొందరు శ్రీ శంకరుల పాదాలను పద్మాలతో పోలుస్తున్నారు. అది ఎంతమాత్రం సమంజసంగా తోచటం లేదు. ఎందుకంటే, శ్రీవిష్ణ్వంశతో జన్మించిన శ్రీ పద్మపాదాచార్యులు పద్మాలపై కాలుమోపి గంగానదిని దాటారు. అలాంటి పద్మపాదుడు శ్రీ శంకరులకు శిష్యుడై ఉన్నాడు. ఆ విధంగా శిష్యునిచే తిరస్కృతమైన పద్మాలను శ్రీ శంకరుల పాదాలతో పోల్చవచ్చునా?

39. శ్రీ శంకరుల పాదాలను పద్మాలతోను, ముఖాన్ని చంద్రబింబం తోను పోల్చి చెప్పటం ఎంతమాత్రమూ సమంజసంగా లేదు. ఎందుకంటే యోగీశ్వరులు అంతఃకరణశుద్ధిని పొంది, నిత్యానందులై తమ హృదయ కమలమున శ్రీశంకరుల పాదపద్మాలను స్మరిస్తూన్నారు. కనుక, యోగీంద్రుల హృదయ కమలమందు విరాజిల్లే శ్రీ శంకరుల పాదపద్మం పద్మంకన్నా ఎక్కువగా ప్రకాశిస్తుంది.

40. శ్రీ శంకర పాదారవిందం భక్తుల అజ్ఞానాన్ని నాశనం చేసి అక్షయమైన ఆత్మజ్ఞాన మొసగి వారిని పరమాత్మ స్వరూపులనుగా చేస్తున్నది. అంతేగాక ఆ దివ్యపాదం సనాతనమైన దేహాత్మాది భ్రాంతులను శేషం లేకుండా నిర్మూలం చేస్తున్నది. వ్యామోహాది వాసనలు కూడా శ్రీ శంకరుల పాద సంస్మరణ చేసేవారి దరిచేరవు. ఇంకా కామక్రోధ మద మాత్సర్యాది దుర్గుణాలను కూడా సంపూర్ణంగా హరిస్తుంది. సర్వతాపాలను, సకల వ్యసనాలను ఆ పాదాలు భక్షిస్తాయి.

శ్రీ శంకరుల పాదం మనోరథాలను తీరుస్తూ సకల జనులకు శుభకరమై, శివస్వరూపమై, కరుణారససంభరితమై అలరారుతున్నది. శ్రీ శంకర భద్ర భవ్య పాదం భజించేవారికి సకల జ్ఞానమిస్తూంది. భ్రాంతులన్నీ తొలగిపోతాయి. సర్వవ్యసనాలు (పూరి గుడిసెను భస్మం చేసేట్లు) ఆహుతియైపోతాయి. నీరు త్రాగినంతనే దాహం తీరేట్లు, కామ క్రోధాది వ్యవహారాలను సమూలంగా అపహరిస్తుంది. సకల వితరణ దక్షయై అజ్ఞానులను ఆదరించి ఉద్ధరిస్తుంది. కరుణారస సంభరితంగా ఉంటుంది.

41. బాలుడైన మార్కండేయుడు తన అల్పాయుష్షును తెలుసుకొని మహేశ్వరుని పాదపద్మాల నాశ్రయించాడు. ఆతణ్ణి తీసుకొనిపోవడానికి యమభటులు వచ్చారు. కానీ శంకర భగవానుని తేజస్సు మార్కండేయునికి రక్షగా ఉండటంచేత దగ్గరకు కూడా రాలేకపోయారు. అప్పుడు యముడే స్వయంగా వచ్చి మార్కండేయుని బంధింప ప్రయత్నించాడు. పరమేశ్వరుడు కాలితో యముణ్ణి ఒక తన్ను తన్నాడు. యముని రెండు భుజాలు పుండ్లయి వ్రణాలేర్పడి కాయలు కాచినవి. అట్టి పాదప్రహారం చేత యముణ్ణి పవిత్రునిగా చేస్తూ, మార్కండేయుని దీర్ఘాయువుగాను, మహర్షిగాను చేసింది. మహేశ్వరునికి ఎదురుగా సాష్టాంగ నమస్కారం చేసేవారి అంతఃబహిః శత్రువులను నిశ్శేషంగా నిర్మూలించటం చేత "సర్వశత్రు పరిహారకుడు"గా ప్రసిద్ధిని పొందాడు.

కనుక ఈ శంకరుల శోభాకరమైన పాదాలను నిత్యం ధ్యానించే వారిని స్మరసంబంధవివాదరహితులనుగా ఆత్మజ్ఞాన పరిపూర్ణులనుగా చేస్తూన్నది.

42. పూర్ణిమనాడు చంద్రుడు తన కిరణాలచే సముద్రునకు మహో ల్లాసం కలిగిస్తున్నాడు. తన చల్లని కిరణాలు లోకమంతా ప్రసారం చేసి అంధకారాన్ని పారద్రోలుతున్నాడు. నక్షత్రాల మధ్య వెలసి 64 కళలతో పూర్ణుడై తన చల్లని కిరణాలచే లోకంలో తాపాలను పోగొట్టుతున్నాడు. అందరి మనస్సును ఆహ్లాదపరస్తున్నాడు.

ఆ ప్రకారంగానే, శ్రీ శంకరులు సకల విద్యలకు ఉత్తేజాన్ని కలిగిస్తూ ఉపనిషత్తులు ప్రతిపాదించిన బ్రహ్మతత్త్వానికి నూతన ఉత్సాహాన్ని కలిగిస్తు న్నారు. అంతేకాక అద్వైతతత్త్వ ప్రకాశకుడై తన జ్ఞానప్రకాశం చేత గాఢాంధకారాన్ని తొలగిస్తున్నాడు. స్వయంప్రకాశమానుడై నిరంతరం ప్రణవంచే బ్రహ్మతత్త్వమందు రమిస్తూన్న శ్రీ శంకరుల పాద స్పర్శ సంసార తాపాలను పోగొట్టి పరమానందం కలిగిస్తూన్నది. అంటే శ్రీ శంకరుల పాదస్పర్శ చేత భక్తులు అజ్ఞాన నివృత్తి కలిగి ముక్తిని పొందుతున్నారని అర్థం. 64

కళలతో కూడిన చంద్రులు బాహ్యతాపాలను పోగొట్టి బాహ్యమైన ఆనందాన్నే కలిగిస్తున్నారు. కానీ శంకరుడనే ఈ చంద్రుడు, తన జ్ఞాన కిరణాలచేత అజ్ఞానాన్ని తొలగించి లోపల బయటకూడా తాపాలను హరిస్తూ శాశ్వతానందాన్ని ప్రసాదిస్తూన్నాడు.

43. శ్రీ శంకరులకు చేసే నమస్కారం ముక్తిప్రదమా లేక వారి పాదస్పర్శ ముక్తిప్రదమా అని రెండు వాదాలున్నవి. పరమశివుడే శ్రీ శంకరులు కనుక రెండూ ముక్తిప్రదాలే.

నిజానికి ఎవరు శ్రీ శంకరుల పాదాలు తమ హృదయ మందు ప్రతిష్ఠించుకొంటారో అలాంటి భక్తశిరోమణుల పాదధూళి తక్షణమే ముక్తిని ఒసగుతుంది. అలా అయితే, శ్రీ శంకరుల ప్రత్యక్ష పాద సంస్పర్శ విషయం ప్రత్యేకంగా చెప్పాలా? వారెంత ధన్యులో గదా!

44. శ్రీ బాలశంకరులు ధరించిన వస్త్రం క్షీరసముద్ర నురుగుమల్లే, ఇంద్రుని ఐరావతం మల్లే తెల్లగాను, స్వచ్ఛంగాను ప్రకాశించింది.

45. శ్రీ శంకరుల నడుము మూడు వరుసలతో కూడిన మొలత్రాటితో బంధించబడి స్ఫటికమణి శైలాల చరియలమల్లే విలసిల్లినది. అలాంటి నైష్ఠిక బ్రహ్మచారి లోకాచారాన్ని పాటించి మోదుగ కర్ర, మొలతాడు ధరించి గురు సన్నిధానంలో వేదాధ్యయనం చేస్తున్నాడు.

46. శ్రీ శంకరులు వామ హస్తాన శ్రుతిసారమైన ఉపనిషత్తులను, దక్షిణ హస్తాన జ్ఞానముద్రలను ధరించి లోకంలోని అజ్ఞానమనే అంధ కారాన్ని పారద్రోలుతున్నారు.

శ్రీ శంకరుల సిద్ధాంతాలన్నీ శ్రుతిసారాలనీ, ఉపనిషత్తులచే ప్రతిపా దించబడిన బ్రహ్మవిద్యయైన అద్వైత తత్త్వాన్ని వామహస్తాన స్వీకరించారని భావం. వేదాలను, ఉపనిషత్తులను వ్యతిరేకించే ప్రతివాదుల ఉపసిద్ధాంతా లను, లోకవినాశకరాలను సమూలంగా నిర్మూలించి తన స్వసిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ చిన్ముద్ర (జ్ఞానముద్ర) ధరించి ఉన్నారని భావం.

బొటన వేలు బ్రహ్మం. చూపుడు వేలు జీవుడు. ఈ రెండిటి ఐక్యమే జీవబ్రహ్మైక్యం. దీనినే చిన్ముద్ర అని అంటారు.

47. శ్రీ శంకరుల హస్తాలు కడు సుకుమారాలు. పద్మాలమల్లే మనోహరమై ఎల్లవేళలలో కాంతివంతమై ఉంటాయి. ఆయన ముఖారవిందం దివ్యతేజస్సుతో కాంతివంతమై, దివ్యమైన హస్తాలు కలిగి, ఆయన విగ్రహమే దివ్యమంగళ విగ్రహమై ఒప్పుచుండగా, ఆయనను అస్థిరాలైన కమలాలతో పోల్చదగునా?

48. ఆయన వక్షఃస్థలం సువిశాలమై శయ్యమల్లే పరచిన తివాచీయై మృదువుగా ఉండగా; ఉరస్థలం మిక్కిలి బలిష్టమై ఉన్నది.

శ్రీ శంకరుల కీర్తి అనే విజయలక్ష్మి ముల్లోకాలు తిరిగి తిరిగి అలసి పోయినదై, పృథు శయ్యమల్లే అమరి ఉన్న శ్రీ శంకరుల వక్షః స్థలంపై విశ్రాంతి తీసుకొంటోంది. ఆ విధంగా శ్రీ శంకరులు బాల్యంలోనే సకల విద్యాపూర్ణులై విజయలక్ష్మిని తన ఉరఃస్థలాన నిలుపుకొన్నారని భావం.

49. శ్రీ శంకరుల బాహువులు విజయస్తూపాల మల్లే సుదీర్ఘాలు. (శత్రురాజులను జయించి విజయసూచకంగా) ఆ విధంగానే శ్రీశంకరులు పాషండ మతాలను ఖండించి ప్రతివాదులను నిరుత్తరులుగాచేసి తన ప్రజ్ఞాపాటవాలతో జయించారు. అంతేకాక, అంతఃశత్రువులను (దుర్గుణం, దుర్వృత్తులు, మలినాలు) నాశనం చేసి విజ్ఞానియై జితేంద్రియుడయ్యారు. ఈ విధంగా అంతశ్శత్రువులను, బహిఃశత్రువులను జయించటంచేత ఆజానుబాహువులను దిగ్విజయ స్తూపాలతో అభివర్ణించారు.

50. శ్రీ బాలశంకరుల యజ్ఞోపవీతం అత్యంత సూక్ష్మంగాను, స్వచ్ఛంగాను, తెల్లగాను ఉండి పరమ పవిత్రమై ప్రకాశిస్తూన్నది.

51. శ్రీశంకరుల కంఠం శంఖం మల్లే అందంగానూ ధ్వనిలో శంఖనాదాన్ని పోలి గంభీరంగానూ ఉంటుంది. అంటే సహజ మధుర గంభీర కంఠస్వరం గలవారని భావం.

52. శ్రీశంకరుల పెదవులు దొండపండులా ఎర్రగా ఉండి మల్లె మొగ్గలవంటి తెల్లని పలువరుస గలిగి, చంద్రబింబంలాంటి ముఖారవిందంతో ప్రకాశిస్తూన్నాయి.

53. శ్రీశంకరుల చెక్కిళ్లు నునుపుదేలి అద్దాలమల్లే ప్రతిబింబిస్తున్నాయి. సరస్వతీదేవి సర్వదా శ్రీ శంకరుల నాలుకపైననే నివాసం ఉండటంచేత అప్పుడప్పుడు ఆమె తన సౌందర్యాన్ని చూసుకోవడానికి బ్రహ్మదేవుడు సరస్వతీదేవి సౌకర్యం కోసం శంకరుల చెక్కిళ్లను నిలువుటద్దాలుగా చేశాడు.

54. శ్రీశంకరులు సర్వలోకాల పుణ్యసంచయమనే క్షీరసాగరాన జన్మించారు. ఆకసాన వెలుగొందే చంద్రుడు కూడా పాలకడలి నుండే జన్మించాడు. అంతకు మించి వారిరువురిలో ఎలాంటి పోలికా లేదు. పైపెచ్చు శంకరులే అధిక మన్ననలకు పాత్రులవుతారు. అది ఎలాగంటే– 1. శ్రీశంకరుల కాంతి పుంజాలు శాశ్వతం; కానీ ఆకసాన ఉన్న చంద్రుని కాంతిపుంజాలు అశాశ్వతం. 2. శ్రీశంకరులు సత్పురుషుల తేజోరాసులను వృద్ధి చేస్తూండగా, ఆకసాన ఉన్న చంద్రుడు నక్షత్రాల కాంతిని హరిస్తున్నాడు. 3. శ్రీ శంకరులు నిష్కళంకియై ప్రకాశిస్తూండగా; ఆకసాన ఉన్న చంద్రుడు క్షయ స్వభావియై క్షీణిస్తూన్నాడు.

55. శ్రీ శంకరులను దర్శించినంతమాత్రానే దీనజనులు సంరక్షించ బడతారు. శ్రీ శంకరులు వటువుగా ఉండగా, బ్రాహ్మణి ఇంటికి భిక్షకు పోయినప్పుడు వారి దీనావస్థను చూచి జాలి చెందారు. కరుణామయుడైన శ్రీ శంకరులు లక్ష్మీదేవిని మెప్పించి ఆ బ్రాహ్మణి ఇంట బంగరు ఉసిరిక పండ్ల వర్షం కురిపింపజేశారు.

56. దేవతలకే జయింప శక్యం కాని ఖరదూషణాది రాక్షస సంహారానికై సముద్రంపై వారధిని నిర్మించి శత్రువులందరినీ సంహ రించిన శ్రీరామచంద్రుడు తన కృపాకటాక్ష వీక్షణంచేత యుద్ధంలో మరణించిన వానరాలన్నింటినీ తిరిగి బ్రతికించాడు.

అదే విధంగా, వేదమత దూషకులైన వారందరినీ ఖండిస్తూ, ప్రతివాద పరిషత్తును సేతువుగా చేసుకొని తన వాదనాపటిమతో మహర్షి తత్త్వాన్ని గైకొని శ్రీ శంకరులు తమ కృపాకటాక్ష వీక్షణాలచేత సకల కుటిల మతాలను ఓడించి తన జ్ఞానామృతాన్ని ప్రసరింపజేసి వారందరినీ సంసారం నుండి రక్షించారు.

57. జనన మరణాలతో కూడిన సంసారం భయంకరమైన అరణ్యంమల్లే ఉన్నది. బాధలచేత, తాపాలచేత ప్రవేశించడానికి వీలులేకున్నది. కోరికలనే దావాగ్నిచే చుట్టుముట్టబడి ఉన్నది. రకరకాలైన రోగాలు, అదుపులేని అడవి ఏనుగులమల్లే స్వేచ్ఛగా సంచరిస్తూండగా, ఇటువంటి సంసారా రణ్యంలో శ్రీ శంకరులు శరణు కోరినవారి బాధలన్నీ నిర్మూలం చేసి ఆనందాన్ని కలిగిస్తున్నారు. చాలాకాలంగా వర్షాలులేక బాధపడే జీవరాసులకు కుంభవృష్టిగా వర్షాలు కురిసినట్లయింది. జీవుల తాపాలన్నీ నశించినవి.

అదే విధంగా జీవులు జన్మజన్మల నుండి పొందే సంసార తాపాలనే దావాగ్నిచే పీడించబడుతున్నారు. అంతేగాక ఈ సంసార మార్గం అధర్మమైన దవడం వలన అలాంటి వారు శ్రీ శంకరుల కరుణాకటాక్ష వీక్షణాల నాశ్ర యించారు; పూర్వమెన్నడూ ఎరుగని నిత్యానందం పొందుతున్నారు.

58. శ్రీ శంకరుల నుదుట దిద్దిన మూడు తెల్లటి విభూతి రేఖలను కవులు రెండు విధాలుగా పోల్చి చెబుతున్నారు. శ్రీ శంకరుల పవిత్ర పారిశుధ్యాన్ని, స్వచ్ఛతను ఆశించి గంగానదే ఆయన నుదుట ప్రవహిస్తున్నదని ఒకరు ఉత్ప్రేక్షించగా, రెండవ వారు, ఋగ్యజుస్సామ వేదత్రయాల సారభూతమే ఆ మూడు విభూతి రేఖలుగా వెలసినవని అభివర్ణిస్తున్నారు.

59. శ్రీ శంకరులు నిరుపమానమైన తన దేహసౌందర్యంచేత మన్మథుణ్ణి కూడా తృణీకరిస్తున్నారు. దేవదేవుడైన శ్రీ శంకరులను అంతః కరణాన ధ్యానించేవారూ కామాన్ని జయిస్తున్నారు. అంటే ఆ మహనీయాత్ముని గాంచిన వారు సకల వికారాలు హరింపబడి సుజ్ఞానులవుతారు. శ్రీ శంకరులు దేహసౌందర్యంచేతనేగాక, హృదయమందు కూడా కాముని జయించారు; జితేంద్రియులు.

60. లోకంలో జనులంతా సంసారమనే దావాగ్నిలో చిక్కుకొని భార్యా పిల్లల వ్యామోహంలో పడి ఆధ్యాత్మిక ఆధిభౌతిక తాపాలను పొందుతూ బద్ధులై ఉన్నారు. అటువంటి వారిని తన జ్ఞానామృతంచే పరమ శాంతులను చేయడానికి మౌనముద్రను విడచి వటవృక్షచ్ఛాయ నుండి బయలుదేరిన శ్రీ దక్షిణామూర్తే శ్రీ శంకరాచార్యులుగా అవతరించారు. పూర్వం పరమశివుడు యోగులైన సనకాదులకు జీవబ్రహ్మైక్యోపదేశం చేయడానికి మౌనముద్రతో శ్రీ దక్షిణామూర్తి అవతారం దాల్చి వటవృక్షాన్ని ఆశ్రయించి అఖండానంద బ్రహ్మస్వరూపుడై ఉన్నాడు. ఆ దక్షిణామూర్తి భూలోకంలో ఇప్పుడు శ్రీశంకరాచార్యులుగా అవతరించారు. ఇప్పుడు తాను ఉద్ధరించదలచినది సామాన్యజనులవడం వలన వటవృక్షాన్ని, మౌనముద్రను విడనాడారు. ఇప్పుడు జ్ఞానోపదేశాలను గావిస్తూ వేదాన్ని తిరిగి స్థాపించారు. శ్రీ శంకరులు కేవలం ప్రాకృత దివ్యదేహంతో ప్రకాశిస్తున్నారు.

61. నాస్తికవాదులలో ఒక తెగ వారిని వైభాషికు లంటారు. వారినే క్షపణకులని కూడా అంటారు. నాస్తికులైన వైభాషిక, సౌత్రాంతిక, యోగా చార్య, మాధ్యమిక జైన, చార్వాకులు మొదలయిన మతస్థులందరు శ్రీశంకరుల దివ్యసుందర విగ్రహాన్ని, అప్రాకృత జ్ఞానవైభవాన్ని తెలుసుకొని ఎదురు మాట్లాడలేక గడగడ వణకసాగారు. రాజాజ్ఞను ధిక్కరించిన రాజద్రోహులు రాజు ఎదుట ఎలా గడగడ వణకుతారో అలాగే శ్రీ శంకరుల యెదుట పరమేశ్వరుని వేదార్థాలను అతిక్రమించడం చేత నాస్తికులందరు దిక్కులేనివారై పడి ఉన్నారు. అలాగే అమిత కల్మష హృదయులైన వైశేషికాదుల కథా ప్రావీణ్యమంతా అస్తమించి పూర్తిగా మాయమైపోయింది.

కణాద ముని రచించిన తర్కశాస్త్రమే, సప్త పదార్థ ప్రతిపాదికమైన వైశేషికదర్శనం. వీరిని వైశేషికు లంటారు. వీరు శంకరుల యెదుట తమ మతాన్ని వినిపించలేకపోయారు. వైశేషికులు, సాంఖ్యులు, మీమాంసకులు, పతంజలి యోగదర్శనాభిజ్ఞులు, న్యాయదర్శనాభిజ్ఞులు, తమ ద్వైత ప్రసంగాలు చేయలేకపోయారు. మంత్రముగ్ధులై వాక్కు స్తంభించిపోగా నిశ్చేష్టులయ్యారు.

ఈ విధంగా, వేదాంతార్థాన్ని తెలుసుకోలేక, అసత్యాలకూ, దురాచారా లకూ పాల్పడుతూ తమ మతాన్ని స్థాపించలేక వితండాలైన కుతర్కాలు చేయడానికి సాహసింపలేకపోయారు. చివరకు వారు కూడా శ్రీ శంకరుల పాదాల నాశ్రయించారు. వేదాంత భాస్కరుని ముందు నాస్తిక మతాలు నిలువగలవా?

62. పరమేశ్వరుడు, శ్రీ శంకరు లిరువురు మన్మథుణ్ణి జయించిన వారే. మహేశ్వరుడు మన్మథుణ్ణి దహించి అనంగునిగా, కామునిగా చేశాడు. భూలోక శంకరుడు కామవికారాలన్నిటినీ సమూలంగా ధ్వంసం చేశాడు. పండితులచేత శంకరుడూ, దేవతలచేత ఈశ్వరుడూ స్తుతించబడ్డారు. భూలోక శంకరుడు వేదమతాన్ని స్థాపించి యజ్ఞాలు చేయించాడు. కైలాస వాసుడైన ఈశ్వరుడు దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేశాడు. పరమశివుడే శంకర రూపంలో అవతరించి వేదాల సత్యత్వాన్ని, ప్రామాణ్యాన్ని తిరిగి స్థాపించాడు. కనుక శంకరుడు సాక్షాత్తూ పరమశివుడైన మహేశ్వరుడే అని తెలుసుకోవాలి.

63. శ్రీ శంకరులకు సమానమైన వాడు ముల్లోకాలలో వెదకినా లేడు. ఎంతటి పండితుడైనా శంకరులతో సమానుడు కాలేడు. ఒకవేళ ఎవరి నైనా సమానుడుగా చెప్పవలసి వస్తే తనకు తానే సమానుడవుతున్నాడు. ఎలాగంటే, "ఆకాశానికి ఆకాశమే సమానం. సముద్రానికి సముద్రమే సమానం. రామరావణ యుద్ధానికి రామరావణ యుద్ధమే సమానం." అట్లాగే శంకరునికి శంకర భగవానుడే సమానం. శ్రీ శంకర భగవానుడు అద్వితీయుడు, నిరుపమానుడు, సర్వవిద్యా స్వరూపి.

64. స్వర్గలోకంలో నందనవనమందు కల్పవృక్షాల సంఖ్య ఎక్కువ గానే ఉంది. అటువంటి కల్పవృక్షాలకు అనేక పుష్పాలు వికసించి ఉన్నవి. అలాంటి పుష్పాల చుట్టూ భ్రమరాలు లెక్కకుమించి ఉన్నవి. అలాగే శ్రీ శంకరుల గుణజాలాలు సామాన్యంగా విచారించగా అసంఖ్యాకాలుగా నున్నవి. విశేషంగా విచారణ చేస్తే అసంఖ్యాంతరాలుగా ఉన్నవి. నిశ్శేషంగా విచారించే తత్త్వజ్ఞులకు అనంతంగా తెలుస్తున్నాయి. అనంత తత్త్వాన్ని

ఎరిగిన మహాత్ములకు అనంతంగానే భాసిస్తున్నాయి. కనుక భగవంతుడైన శంకరుని గుణాలు అనంతాలనడం యథార్థం.

65. శ్రీ శంకరులు అనర్థాలకు హేతువులైన విషయాభిలాషను, అస్థిరమైన కామ్యవస్తువులను, తత్త్వజ్ఞానంచేత విచారించి మోక్ష ప్రతిబంధకాలని, దుఃఖభూయిష్ఠాలవటంచే నిశ్శేషంగా ఛేదించారు. కామవిజయుడనే బిరుదం పొందారు. హింసాది దుర్గుణ సమూహాలను తన ఖడ్గంచే తుత్తినియలు చేశారు. కనుక పరుష వచనాలు, హింసాది దుర్గుణాలు, సర్వ వికారాలను సహించడం, మానాభిమానాల కోర్చుకోవడం అనేవి క్షమా గుణంచే సునాయాసంగా జయించారు. పరుల గుణాలలో దోషం ఆరోపించడం, అసూయపడడం వంటి దుర్గుణాలను పూర్తిగా జయించారు. ధర్మాన్ని అతిక్రమించటం, గర్వం, తనను గూర్చి తానే గొప్పలు చెప్పుకోవడం వంటి దుర్గుణాలను జయించారు. తనకంటే అధికులు చాలామంది ఉన్నారనే నిరాడంబర వజ్రాయుధంచేత క్షణంలో ఛేదించారు. అంతేగాక సమస్తం తనకే కావాలనే ఆశాపిశాచాన్ని సంతృప్తి అనే మహాస్త్రంచే పారద్రోలారు. అంటే శ్రీ శంకరులు సకల సుగుణాలకు ఆశ్రయభూతులై ప్రసన్న భావంతో ప్రశాంతదృష్టితో ప్రకాశిస్తున్నారు.

66. శ్రీ శంకరులు కామాన్ని జయించి నిశ్శేషంగా భస్మ మొనరించారు. క్రోధరాహిత్యంచే ప్రశాంతచిత్తులయ్యారు. అటువంటి పరమ శివావతారుడు తనను సేవించే శిష్యుల దోషాలన్నీ హరించి విజ్ఞానవంతులుగా చేశాడు. అట్టి శంకరుని ధ్యానించటంచేత శిష్యులు కూడా ధన్యాత్ములైనారు.

67. శ్రీ శంకరాచార్యుల గూర్చి ఏనుగుల జంట నడుమ జరిగిన సంభాషణను తెలియజేస్తున్నారు. దిగ్గజం భార్య ఇలా పలికింది: ఓ ప్రియా! ఈ గ్రీష్మ కాలంలో పగటిపూట తాపాన్ని నశింపజేసే చంద్ర కిరణాలు ఎచ్చట నుండి వచ్చాయి? ఇది అసంభవం గదా?

**దిగ్గజం ఇలా పలికింది:** ముగ్ధరాలా! ఇంకా నీకు తెలియదా? సర్వలోక రక్షణకై పరమశివుడు అవతరించినాడు. అట్టి జగద్గురుడైన

శ్రీ శంకరాచార్యుల శరీరం నుండి వ్యాపించే సుగుణాలేగాని చంద్రకిరణాలు కావు.

**దిగ్గజం భార్య ఇలా పలికింది:** ఓ ప్రియతమా! ఈ చల్లదనానికి కారణం చంద్రకిరణాలు కాకుంటే నల్ల కలువలన్నీ ఎలా వికసించినాయి? ఆశ్చర్యం! చంద్రుడు లేకుండా ఎలా కలువలు వికసిస్తాయి?

**దిగ్గజం ఇలా పలికింది:** ఓ ముగ్ధా! భయపడకు. శ్రీ శంకరాచార్యుల గుణగణాలకు విస్మయం చెందిన దేవకాంతలు కన్నులు పెద్దవిగా చేసుకొని నాలుగు ప్రక్కల చూస్తూన్నారు. వారి కన్నులు వికసించిన కలువలమల్లే ప్రకాశిస్తూన్నాయి.

ఈ విధంగా ఆ మహనీయుని సుగుణాలు దిగంతాల దాకా వ్యాపించాయని తెలుస్తోంది.

68. లోకమందున్న పాలు, చెరకు వంటి సమస్త మధుర పదార్థాల కన్నా శ్రీశంకరుల సద్గుణాలే మధురాతిమధురమైనవి. శ్రీశంకరుల గుణ మాధుర్యం ధన్యం, సర్వశ్రేష్ఠం. సర్వమాధుర్యాలు ఆ సుగుణజాలమందు ఉన్నవిగాని, గుణమాధుర్యం మాత్రం ఎచ్చటా లభించదు. శ్రీశంకరుల గుణమాధుర్యం అప్రాకృతం, దివ్యం. మిగిలిన మాధుర్యాలలో లభించే ఆనందం అస్థిరం.

69. శ్రీ శంకరులు క్షమాగుణంలో భూదేవినే మించిపోయారు. అది ఎలాగంటే, భూదేవికి బాహ్యాన పర్వతాలు మొదలైన వస్తుజాలాన్ని భరించే సామర్థ్యం ఉంది. కాని శ్రీ శంకరులమల్లే కామ క్రోధాది తిరస్కృత చిత్త ప్రయుక్త వికారాలను సహించే నిర్వికారమైన శక్తి లేదు.

ఇక శంకరుల అనంతమైన విద్యాపాటవాలను పరిశీలిస్తే, కేవలం సరస్వతీ స్వరూపులైన కుమారస్వామి ప్రభృత దేవతల గర్వం పరమశివుని ముందు నిరుపమానమై విలసిల్లింది. కుమారస్వామి అవతారమైన కుమారిల భట్టు పూర్వమీమాంసా ప్రతిపాదనం శిథిలం కానున్నది.

ఇక వైరాగ్య విషయం పరిశీలిస్తే, పూర్వం పరమశివుడు శుకమహర్షికి వైరాగ్యాది మహాతత్త్వ వాక్యాన్ని ఉపదేశించాడు. శ్రీ శంకరులు అలాంటి మహేశ్వరుని అవతారమవడంచే నిరవధిక వైరాగ్యం సర్వలోక ప్రఖ్యాతమై ఉన్నది.

70. శ్రీ శంకరులు క్షమలో భూమితో సమానులు. నిర్దోష యశస్సు, సర్వ విద్యల యందు సరస్వతీదేవితో సమానులు. 'తుల్య బలవిరోధే వికల్పః' (సమాన బలం గలవారితో పోటీపడినప్పుడు ఒక దానిని స్వీకరించాలి) అన్న న్యాయాన్ని అనుసరించి సరస్వతీదేవి శంకరులనే సమర్థిస్తుంది. భక్తుల మనోరథాలను ప్రసాదించటంలో కల్పవృక్షం వంటివారు. అట్టి అప్రాకృత గుణ విశిష్టుని వర్ణించడానికి అందరూ లజ్జాభావం పొందుతున్నారు.

71. లోకంలో మేరు పర్వతానికి దీటైనది మరొక పర్వతం లేనట్లుగా, శ్రీ శంకరులతో సమానమైన మహర్షులు పూర్వం జన్మించలేదు. ఈ వర్తమాన కాలంలో లేరు. రాబోయే కాలాలలో జన్మింపబోరు - అంటే మూడు కాలాల్లోనూ శ్రీ శంకరులకు సమానులు లేరని భావం.

72. కులదీపకుడైన శంకరుల విద్యాపటిమచేత, వినయశీలం చేత, సాధుస్వభావంచేత, సచ్చరిత్రచేత ఆయన కులం యావత్తూ అమితంగా శోభించింది.

73. కల్పవృక్షం ఎల్లప్పుడు పుష్పాలతో, ఫలాలతో నిండుగా విరాజిల్లుతుంది. అలాంటి ఫలపుష్పాల నాశ్రయించి భ్రమరాల గుంపులు గుంపులుగా చుట్టి తిరుగుతూంటాయి.

శ్రీ శంకరుడనే కల్పతరువు కూడా నిత్యం పుష్పఫలభరితమై ఉండగా పండితు లనే భ్రమరాలు ఆయనను ఆశ్రయించి కోరిన జ్ఞానసంపదను పొందుచున్నారు.

74. శ్రీ అద్వైత తత్త్వ సిద్ధాంతాన్ని స్థాపింపదలచిన శ్రీ శంకరాచార్యులు తన మధురమైన మాటల చేత, నిరుపమ వాక్చాతుర్యంచేత కవి పండితుల నెల్లరను సమ్మోహితులను చేశారు. ఆదిశేషుని అవతారుడైన

పతంజలి యోగదర్శనాన్ని, కపిలమహర్షిప్రోక్త సాంఖ్యదర్శనాన్ని, కణాద మునిప్రోక్త వైశేషికదర్శనాన్ని లెక్కింపకున్నారు. ఈ విధంగా న్యాయ దర్శనాన్ని గాని, పూర్వమీమాంసాదర్శనాన్నిగాని గణనలోకి తీసుకోక విరసములని తలచి త్యజిస్తున్నారు. ఇక నాస్తిక గ్రంథాల గూర్చి వేరే చెప్పాలా? భగవానుడు ఎల్లప్పుడు ఉపమానరహితుడు; వారి వాక్యం నిరుపమం, నిర్దోషం, అప్రాకృతం.

75. శ్రీ కుమారిలభట్టు, ప్రభాకరులు ప్రతిపాదించిన పూర్వమీమాంస సిద్ధాంతాలన్నీ అడుగంటిపోతున్నాయి. ఇప్పుడే శంకరుల సూక్తులచేత నీట మునిగిపోయిన ఉపనిషత్తులు ఉద్ధరించబడినవి. శ్రీ శంకరుల ప్రతివాది యైన భట్టభాస్కర మహాపండితుని వలన వేదాంత అర్థాలు దుర్గతిని చెందు తుండగా వాటన్నింటినీ ఖండించి అద్వైతతత్త్వాన్ని స్థాపించారు. అలాంటి వేదాంతాలను పడిపోకుండా చేయూతనిచ్చి సంరక్షిస్తూ అద్వైతసిద్ధాంతా మృతాన్ని స్రవింపచేశారు. కర్మసిద్ధాంతాన్ని ఖండిస్తూ, జ్ఞానకాండను శ్రీశంకరులు తన ప్రవచనాలచేత స్థాపించారు. "న చ శేషభవీ, భాస్కర" అనే శ్లోకద్వయార్థాలచేత శ్రీ శంకరుల బ్రహ్మసూత్ర భాష్యాన్ని, పతంజలి భాష్యాన్ని, జైమిని సూత్రభాష్యాన్ని, సాంఖ్యదర్శనాలను, ఆ శాస్త్రాలలోని సిద్ధాంతాలను ఖండించి అద్వైత తత్త్వప్రతిపాదకమైన సర్వసిద్ధాంతాలకు శిరోధార్యంగా జేశారు.

76. భగీరథుడు దీర్ఘకాలం తపస్సుచేసి మహేశ్వరుని అనుగ్రహాన్ని పొంది దేవనదియైన గంగను భూమిపైకి ప్రవహింపచేశాడు. ఆ దేవనది అహంకారంతో, ఆర్భాటంతో కూడి అతివేగంగా ప్రవహించింది. శ్రీశంకరుల ముఖారవిందం నుండి వెలువడే జ్ఞానామృత ప్రవాహం ఆ దేవనది వేగాన్ని తిరస్కరిస్తున్నది. శ్రీ శంకర సద్గురువు వాగమృతం సర్వతోముఖంగా వర్షిస్తూండగా, బాహ్యవేషధారులు, సన్న్యాసులు, మెట్ట వేదాంతులు మొదలైన వారందరూ క్షామం, కరువుకాటకాల వంటివారై శ్రీ శంకరుల వద్దకు రాలేకపోయారు. శ్రీ శంకరుల వాక్ప్రౌఢిమ అనంతం, సుధామయం.

77. శ్రీశంకరభగవత్పాదుల వారి కంఠం నుండి వెలువడే వేదధారలు స్పష్టంగానూ, స్వరయుక్తంగానూ ఉండి సకల వేదాంత వ్యాఖ్యానాలు వినే వారల చిత్తచాంచల్య మనే మదపుటేనుగులను గజశాలయందు బంధిస్తున్నవి. సకల చిత్త ప్రవృత్తులను, చపల స్వభావాలను నివారిస్తున్నది. అఖండ జ్ఞాన నిలయంగా తేజరిల్లుతూన్నది. అంతేగాక దుష్టంగా ప్రవచించే ప్రతివాదులను నిరోధిస్తున్నది. బ్రహ్మజ్ఞానులు శ్రీ శంకరుల సూక్తి దామములను కంఠస్థం చేస్తున్నారు. శ్రీ శంకరుల సూక్తి సుధారసం సకల సంతాపాలను పోగొట్టి మహానందాన్ని అలరింపజేస్తూన్నది. ఇలాటిది అలాటిది అనడమెందుకు; శంకర ప్రవచన ధోరణి సంసార సాగరం నుండి తరింపజేసే దృఢమైన నౌకగా అలరారుతున్నది. ఇలా శ్రీ శంకర సూక్తిరాజం నిరుపమం, సకల అజ్ఞానభంజకం.

78. శ్రీ శంకరుల వాక్సుధామయ సుస్వరం అద్వైతవిజయలక్ష్మి విజయఘుంటరావం ఘణఘణమని మోగుచున్నది. సర్వమత ఖండనంచేత స్వయంప్రకాశకత్వంతో అద్వైతవిజయలక్ష్మి నిరంతరం శ్రీ శంకరులవాక్కు నందు తాండవమాడుచున్నది. శ్రీ శంకరసూక్తి సుస్వరం పరమశ్రావ్యంగా ఉన్నది.

79. కర్పూరకస్తూరీద్రవ్య లేపనాలు శరీర తాపాలను పోగొట్టేట్లు, శ్రీ శంకరుల సూక్తులు జ్ఞానపరిమళాలతో ఆధ్మాత్మిక, ఆదిభౌతికాది సర్వ తాపాలను హరిస్తూన్నవి. ఆంతరంగికాలైన భవవ్యాధి తాపాలన్నింటినీ ఖండించడంచే బాహ్య తాపాలను అణచడానికి చంద్ర కిరణాలు అసమర్థా లయ్యాయి. శ్రీ శంకర సూక్తి సంపదలు కస్తూరి కర్పూరాదుల కంటే, చక్కెర, ద్రాక్ష వంటి మధుర పదార్థాల కంటే, చంద్ర కిరణాల కంటే, విలక్షణమై సకల జనరంజకాలై విలసిల్లాయి. సూక్తి సుధారసం అక్షయం.

80. శ్రీశంకరగురువరేణ్యుల బోధన, వాగ్జాలంతో కేవలం శుద్ధ అద్వైత ప్రాతిపాదికయే మోక్షానికి రాజమార్గమని ప్రకటించారు. భేదవాదు

లందరూ సమూలంగా అంతరించిపోయారు. సకల అహంకారాలు నిశ్శేషంగా వినాశనం చెంది లోకంలో బ్రహ్మజ్ఞానవేత్తలై విహరించారు.

81. గాలితో కలసి ఉన్న సుగంధం లోకమంతా సువాసనలు వెద జల్లేట్లు శ్రీ శంకరులు పరిశుద్ధ వేదాంత సిద్ధాంతాలను లోకమంతా ప్రవర్తింప చేశారు. లోకంలో ధర్మం పరిపూర్ణంగా నెలకొంటే అతివృష్టి వంటి ఈతి బాధలు ఉండవు. శ్రీ శంకరులు లోకంలో వేద ధర్మాన్ని ప్రతిష్ఠాపన చేయడం వలన ఈతిబాధలులేక జనులు సుఖసంతోషాలతో మనగలిగారు. దావాగ్నిమధ్యన ప్రాణభయంతో కొట్టుమిట్టాడు వానికి నిండుగా ప్రవహించే నదీజలాల నుండి వీచే శీతల గాలుల మల్లే, వివిధ పుష్పాల నుండి వీచే సుగంధ పరిమళాలు తాపాలన్నింటినీ నశింపచేసి ఆనందాన్ని కలిగిస్తాయి. అలాగే విషమబుద్ధియుతమై, జననమరణ కారణమైన సంసార భయంలో కొట్టుమిట్టాడుతున్న అవివేకులకు శ్రీ శంకరుల జ్ఞాన సుధామయ సూక్తులు జ్ఞానమకరందాన్ని, బ్రహ్మానందమనే పరిమళ సౌరభాలను ప్రసాదిస్తూన్నవి.

82. శ్రీ శంకర కవివరుల నాలుకపై నిలచి శ్రీ సరస్వతీదేవి నాట్యం చేస్తూండగా వస్తున్న శ్రావ్యమైన ధ్వనులు ఆమె కాలి అందెల సవ్వడియా? లేక ఆమె ధరించిన వడ్డాణపు గలగలలా? లేక చేతి గాజుల గలగలా? అనే సంశయాలు బయలుదేరినవి. ఎందువలనంటే, శ్రీ సరస్వతీదేవి శ్రీశంకరుల నాలుకపై నాట్యం చేస్తున్నది. ఆ విజ్ఞానవిశారదుడైన శంకరుల సూక్తులు సరస్వతీమయాలై ప్రకాశిస్తూన్నవి. అవి కేవల విజ్ఞానమయాలు.

83. శ్రీ శంకరుల సూక్తులు గంభీరంగా దట్టంగా కమ్ముకొన్న మేఘ సమూహాల మల్లే, పెనుగాలులకు అల్లకల్లోలమైన సముద్రపుటలమల్లే, అప్పుడే విచ్చుకొని సువాసనలను వెదజల్లే మల్లెపూలమల్లే ఉన్నవి. కేవలం విజ్ఞానపరిమళాలతోను, నిరంతరం ఉల్లాసం గొలుపేదీ ఎదురులేని ప్రతిభతో అంతటా ప్రకాశిస్తూన్నవి.

84. శ్రీ శంకరులు ప్రవచించిన భాష్యాది రూప అమృతవాణి ఛందోబద్ధమైన పద్యకావ్యం కాకపోయినా "గద్యం కవీనాం నికషం

వదంతి" సూక్తి ననుసరించి గద్యరూపమైనా సర్వదోషరహితమై పరిశుద్ధమై మనోజ్ఞంగా భాసిస్తూన్నది; వినినంత మాత్రానే జ్ఞానం కలుగుతుంటుంది; సర్వ విషాలను హరించే అమృతంలా అద్వైతామృతపానం చేయిస్తున్నది; అప్రతిహత వాగ్ధోరణి అమృత ధారలమల్లే ప్రవహిస్తూన్నది; మదించిన ప్రతివాదుల కుతర్కాలనే మహా పర్వతాలను వజ్రాయుధంచేత పిండి అయ్యేట్లు చేస్తున్నది. అంతేకాక శ్రీ శంకరుల సూక్తులు, అన్ని వస్తువులు లభించే అంగడిలా ప్రకాశిస్తూండగా, సాధకులు, పండితులు జ్ఞానులు తమ తమ యోగ్యతకు తగిన విద్యామృతాన్ని గ్రహిస్తున్నారు. శ్రీ శంకరవాణి శోభనమైన చరితంతో కూడినదై సంసారం వలన కలిగే ఆధ్యాత్మిక దుఃఖాలను నాశనం చేస్తున్నది; సర్వదోషాలను పరిహరిస్తున్నదై ముక్తిమార్గాన్ని చూపుతున్నది; ఈ విధంగా శ్రీ శంకర సూక్తులను అమృత పానం చేసినవారై శాశ్వత సౌఖ్యాలను పొందుతున్నారు.

85. నేను నాది అనే అహంకార మమకారాలు సకల దుఃఖాలకు కారణమై దేహేంద్రియాలయందు సుస్థిరంగా నాటుకొనిపోయినవి. మనస్సునందు జనించే మనోవ్యాధులన్నిటికీ మూలమగుతున్నది. ఈ మనోవికారాలు అనేక విధాలుగా ఉన్నవి. మహావృక్షాలను సహితం బీజం తనలో ఎలా ఇముడ్చుకొంటున్నదో అలాగే ఈ అహంకార బీజం సర్వదుఃఖాలను, సంతాపాలను, సంసార సంస్కారాలను తనలో సూక్ష్మరూపంలో ఇముడ్చుకొంటున్నది. అహంకారమనేది మానసిక ప్రశాంతతను హరించి, మనస్సు నిండా కాలుష్యాన్ని వ్యాపింపచేసి సర్వదుఃఖాలను కలిగిస్తున్నది. ఈ అహంకారమనేది ఒక నాటక రంగస్థలం లాంటిది. రంగస్థలమే లేకుంటే నటకుల నాట్యప్రసక్తి లేదు. క్లేశాలనే నటకుల ప్రవేశమే ఉండదు. అంతేగాక రాగద్వేషాలే నాటక ప్రారంభానికి ముందుండే వాద్యబృందం. ఆ విధంగా రాగద్వేషాలు దృశ్యనాట్య అహంకారాలకు వాద్యఘోషమై ఉంది. రాగద్వేషాలకు అసత్యాలు మూలకారణమై ఉన్నాయి. అసత్తువైన దృశ్యపదార్థాలకు గృహమే ఉద్యానవనం లాంటిది. మలిన జీవుడు ఈ ఉద్యానవనంలో విహరిస్తూ ఉంటాడు.

కనుక అనర్థాలన్నిటికీ దేహేంద్రియాలందుండే దురహంకారాన్ని శ్రీశంకర సూక్తి అనే ఖడ్గం ఛేదిస్తూన్నది.

86. అతి ప్రాచీనాలైన వేద వాక్కుల ఉపనిషత్తుల సారమైన శ్రీశంకరుల సూక్తి సముదాయం నాస్తికత్వంచే దూషితాలైన క్షపణకులైన నాస్తికులకు వైభాషికులచే వంచితులగుతూ సంసారమందు చిక్కుకున్న జీవులందరకు సంజీవనిమల్లే పనిచేస్తున్నది. శ్రీ శంకరుల అద్వైతామృతం నాస్తికమతవిషాన్ని హరిస్తూన్నది; సర్వజనులకు శాంతిప్రదమై జనులకు ఆనందకరమగుతున్నది.

87. పెనుగాలికి ఎగిరి పడుతున్న పవిత్ర గంగా తరంగాలు చేసే కోలాహలంమల్లే, శ్రీ శంకరుల సూక్తి ప్రవాహాలు అసత్యాలైన పాషండ మతాలన్నింటినీ సమూలంగా నశింపజేస్తున్నవి. శ్రీశంకరుల సూక్తులు కేవలం ముక్తి ప్రదాలు.

88. శ్రీశంకరులు పరమాదరంతో పలికిన మధురమైన సూక్తులను అప్పుడే వికసించిన మల్లెల సౌరభాలతో ఆలింగనం చేసుకోవడానికి అధికమైన ఆసక్తిని చూపుచున్నవి. పారిజాతాలందలి మకరందం, కల్పవృక్ష కుసుమాలందలి మకరందంమల్లే, విజ్ఞాన పరిమళాలతో కూడిన అద్వైతా నందంతో సత్పురుషుల మనస్సును రంజింపచేస్తున్నవి. శ్రీ శంకరుల సూక్తి చేత సజ్జనుల మనస్సులు మత్తెక్కుచున్నవి. సర్వసంతోషకరాలు, సకల సంతాపాలను హరింపజేస్తున్నవి.

89. శ్రీ శంకరులు తమ ప్రసన్న వదనం నుండి చంద్రకిరణాల వంటి చల్లని, శాశ్వతసుఖాన్ని ప్రసాదించే అద్వైతసుధారసాన్ని ప్రసరింప చేస్తున్నారు. అందరూ శ్రీ శంకరుల సూక్తి సుధాసాగరాన మునకవేస్తున్నారు. అలాంటి జ్ఞానామృతాన్ని వదలి, పరమ మూర్ఖులైనవారు మాత్రమే ద్వైత తత్త్వమనే విషాన్ని స్వీకరించి, జనన మరణాలను పొందుతున్నారు. ఎల్లప్పుడు పట్టు వస్త్రాలనే ధరించే అలంకార పురుషుడు, మురికిలో పడివున్న గుడ్డ పీలికలతో బొంతను చేసుకోవడానికి ఇష్టపడతాడా? కలలో కూడా ఇష్టపడదు. అటువంటి అలంకారపురుషునికి మతిభ్రమిస్తే పట్టువస్త్రాలను కాదని

గుడ్డపీలికలను కోరుకొంటాడు. అలాగే తాను పరిశుద్ధాత్ముడైనా కూడా, అజ్ఞానంచేత పిచ్చిపట్టినవాడై అన్నిటినీ కాదని ద్వైతవాదాన్ని ఆశ్రయిస్తున్నాడు. అంటే శ్రీ శంకరవరముని ప్రబోధాలనే జ్ఞానామృతంచేత జనులందరు పరబ్రహ్మమందు విహరిస్తున్నారని భావం.

90. శ్రీ శంకర మహర్షి చంద్రుని అద్వైతామృతాన్ని పొందే జ్ఞానవంతునికి ఆవుపాలు ఉప్పగా తెలుస్తోంది. తేనెను ఇష్టపడడం లేదు. చక్కెరను చూస్తూనే ఏవగించుకొంటున్నాడు. ద్రాక్షరసాన్నే వద్దనే వాడు ఇక కొబ్బరి కాయను దగ్గరకు రానిస్తాడా? ఎందుకంటే, అవి అన్నీ లౌకిక పదార్థాలు. విషయ భరితాలు. త్రాగేటప్పుడు, తినేటప్పుడు మాత్రమే తియ్యగానూ రుచిగానూ ఉంటాయి. కానీ శ్రీ శంకర సూక్తి సుధారసం అలౌకికం నిత్యానందాన్ని కలిగించేది. కనుక శ్రీశంకరుల అద్వైతజ్ఞానమాధుర్యం పానం చేసే ధన్యాత్ముడు మిగిలిన మధురపదార్థాలను (చక్కెర, తేనె మున్నగునవి) నీచంగా చూస్తున్నాడు.

91. శ్రీ శంకరుల సూక్తిపరంపరలు మధురాలై ఆహ్లాదం కలిగిస్తూ, వినినంత మాత్రానే ఎటువంటి పాషండుని హృదయాన్నైనా కదిలించ సమర్థమై ఉన్నవి. అంతేగాక ఈ సూక్తులు చెరుకుగడ నుండి రసాన్నంతా పీల్చి మాధుర్యాన్ని గ్రహించినవి. అమృతం చోరభయం చేత తన అమృతత్వాన్ని శ్రీ శంకరుల సూక్తులలో దాచి ఉంచింది. లోకంలో ఏ మధుర పదార్థంచేత పొందలేని మాధుర్యాన్ని పొందుచున్నారు. మిగిలిన మధుర పదార్థా లెన్ని భుజించినా వాటిలో ఎలాంటి మాధుర్యమూ పొంద లేకున్నారు. అంటే, శ్రీ శంకరుల అద్వైతతత్త్వ ప్రతిపాదక సూక్తులను అవగాహన చేసుకొన్న ధన్యాత్ములకు మరి యే యితర మత ప్రతిపాదక వాక్కులు రుచించకున్నవి. శ్రీ శంకరుల సూక్తులు కేవలం ఆనందప్రద ములు, జననమరణ భయ భంజకాలు.

92. శ్రీ శంకరుల వాక్కులు సర్వపరిమళాలను, మాధుర్యాలను కలిగి ఉన్నవి. ఆ సుగంధాల నుండి ఒక అంశాన్ని కర్పూరం అప్పుగా తీసు

కోగా, కస్తూరి మరికొంత పొందింది. బహుకాల సాంగత్యం చేత మల్లెపూవులు, సుకుమారత్వాన్ని కుంకుమ పువ్వు అడిగి పుచ్చుకున్నాయి. ఇలాంటి శంకరుల జ్ఞానపరిమళం స్వయంగాను విశృంఖలంగాను అన్ని ప్రదేశాలకు వ్యాపించినది.

93. బాగా చిలికిన పెరుగు వెన్నతో కూడిన రుచికరమైన ద్రవాన్ని గ్రోలాను. తియ్యని ఆవు పాలు, చెరకు రసం త్రాగాను. నానా పుష్పాల నుండి సేకరించిన మధురాతిమధురమైన తేనెను త్రాగాను. తియ్యటి అరటి పళ్లను భుజించాను. నా పూర్వజన్మ సుకృతం చేత శ్రీ శంకరుల సూక్తుల లోని మాధుర్యాన్ని పొందాను. పైన చెప్పిన మధుర పదార్థా లన్నీ, శ్రీ శంకరుల సూక్తుల ముందు రసహీనాలయ్యాయి. శ్రీశంకర సూక్తులను పానం చేసినవారు ధన్యులు గదా!

94. ఆధ్యాత్మికాదిసంతాపాలచే పరితపిస్తున్న ఆర్త జీవులకు శ్రీ శంకరుల అప్రాకృతబోధామృతం అత్యంత శీతలమైన పెద్ద కర్పూరపు వర్షమై ఉంది. ఆ సూక్తిపంక్తులు మాయామాలిన్యాలు లేని ముత్యాలతో కూర్చబడి, ముక్తికాంతకు కంఠహారమై ఉంది. పరమ అద్వైత తత్త్వంలోని శ్రీ శంకరుల సూక్తులను కంఠస్థం చేసిన వారిని ముక్తి కాంత స్వయంగా వరిస్తుంది. శ్రీ శంకరుల సూక్తి సందోహాలు కేవలం కైవల్యపదాలు. కేవలం అద్వైత స్వరూపమై మహాతటాకాన హంసాంగనయై విహరిస్తున్నది. ఈ ప్రకారం శ్రీ శంకర భగవత్పాదుల సర్వసంతాపహరం, నిత్య ఆనందజనక మైన సూక్తిధారలు బుద్ధి యందలి మాయామాలిన్యాలను కడిగివేసి జ్ఞానసిద్ధిని ప్రసాదిస్తున్నవి. శ్రీ శంకరుల సూక్తి ధారలందు పానం చేసినా, స్నానం చేసినా, ధారాప్రసారం కలిగినా, జనులు పరిశుద్ధాత్ములవుతారు.

95. ఒకానొక మహావృక్షాన్ని అల్లుకొని సుకుమారమైన కల్పలత ఒకటి మనోహరమైన ఆకులు, పుష్పాలు, ఫలాలతో శుక పికాది పక్షులచే సేవించబడుతోంది. అదే విధంగా పరమశివావతారుడైన శంకరులు వేదాలనే మహావృక్షానికి ఉపనిషత్తులతో పాదు చేసి, తమ సూక్తిసుధ లనే నీటితో కల్పలతలను (బాగా) తడుపుతూ పైకి ప్రాకించారు. సురేశ్వర, పద్మపాదా

చార్యులు తత్త్వజ్ఞాన మనే పుష్పాలతోను, బ్రహ్మానందమనే ఫలాల నందిస్తారు గాక! దేవతల, బ్రాహ్మణుల విమలచిత్తాలనే (మద్దిచెట్టు) వృక్షజాలాల పైకి దృఢంగా ప్రాకుతూ, తత్త్వజ్ఞానమనే పుష్పాలతోను, బ్రహ్మానందమనే ఫలాల నందిస్తూ పవిత్రాత్ములందరికీ జ్ఞానసిద్ధి నొసగు గాక!

శ్రీ శంకర భగవత్పాదులు అద్వైత ప్రతిపాదక వేదాంతార్థాలను విశదపరస్తూ, శ్రీ సురేశ్వర, పద్మపాదుల వాక్పటిమనాధారంగా చేసుకొని బ్రహ్మానందాన్ని ప్రసాదిస్తూ లోకంలో పరమ శాంతిని నెలకొలిపారు.

96. పరమశివుడు నాట్యం చేస్తుండగా మహేశుని కిరీటమందలి గంగానది గట్టు తెగి అదుపు లేకుండా గంభీరంగా ప్రవహించేట్లు; శ్రీ శంకరులు అవతరించడానికి ముందు వేదాంత వ్యతిరేక మతాలు పెచ్చుపెరిగి ఉన్నవి. జ్ఞానకాండను ఉద్ధరించడానికి అవతరించిన శ్రీశంకరులు అద్వైత సిద్ధాంతాలను ప్రతిపాదించగా ద్వైతమతాలన్నీ తెరమరుగైపోయినాయి. ఆ విధంగా వేదాంతమర్యాదను అతిక్రమించిన ద్వైతవాదుల దురహంకారం శ్రీ శంకరుల హుంకారంచే క్షణంలో నాశనమయ్యింది. శ్రీ శంకర సూక్తి అప్రతిహతం, సర్వతోరమణీయం, అమృతం.

97. దేవాసురులు అమృతంకోసం క్షీరసాగరాన్ని మథించడానికి వాసుకిని త్రాడుగా చేసుకొన్నారు. అలా మథిస్తూండగా పాల సముద్రం నుండి హాలాహలమనే అగ్ని పుట్టి ఆ మంటలు ఆకాశం వరకు వ్యాపించి నవి. అలా కెరటాల మల్లే ఎడతెగని మహావేగంతో బయలుదేరుతున్న శ్రీ శంకరుల సూక్తిపరంపరలు జ్ఞానామృతమై నలుదిక్కులా వర్షిస్తూన్నవి. అలా విజృంభించిన జ్ఞానామృతం సంసారాగ్ని యందు తాపం చెంది దుఃఖాలచే పరితపిస్తూన్న జీవులకు పరమశాంతిని ప్రసాదిస్తూన్నది. అటు వంటి శంకర గురువరుని సర్వజనులు స్తుతించి ధన్యులవుతున్నారు.

98. శ్రీ శంకరుల కీర్తి ముల్లోకాలందూ వ్యాపిస్తూ క్షీరసాగరాన్ని చేరింది. అక్కడ చంద్రునికీర్తితో తలపడవలసిరాగా వారిరువురూ ఒకరి జుట్టు మరొకరు పట్టుకొని భీకరంగా యుద్ధం చేశారు. తరువాత గదా యుద్ధానికి దిగారు. ఇక కైలాసగిరికి చేరి ఒకరి భుజాలొకరు పట్టుకొని

భయంకరంగా పోరాడి అన్ని విధాలుగా ఆధిక్యాన్ని చాటుకొన్నారు. శ్రీ శంకరుల కీర్తి ముల్లోకాలందూ వ్యాపించి, క్షీరసాగరం కైలాసాల మల్లే ప్రకాశించింది.

99. లోకంలో పరిశుద్ధమైన వస్తువులేవి? అనే చర్చ వచ్చినప్పుడు క్షీరసముద్రాన్ని, కైలాసపర్వతాన్ని, రాజహంసను, శరత్కాల చంద్రుని చెప్పు కొంటారు. అటువంటి చంద్రుని కీర్తిని కూడా శ్రీ శంకరుల కీర్తి జయించటం చేత కళంకితుడై తన పూర్వవైభవాన్ని కోరి క్షీరసముద్రంలో మునకలు వేస్తున్నాడు, కైలాసానికి పోయి శివుణ్ణి ప్రార్థిస్తున్నాడు. ఆ విధంగా శ్రీ శంకరుల కీర్తి నిర్మలం, పరిశుద్ధం, కడు శీతలం.

100. శ్రీ శంకరుల కీర్తి అన్ని దిక్కులయందు వ్యాపించింది. దిక్కు లనే స్త్రీలు శ్రీ శంకరుల కీర్తిని మల్లెమాలలుగా చేసుకొని తమ కొప్పులందు తురుముకొన్నారు. అంతేగాక ఆ అంగనలు శ్రీ శంకరుల పవిత్ర కీర్తిని చందనంగా చేసుకొని తమ నుదుట దిద్దుకొంటున్నారు. అంతేకాక ఆ దిగ్భాహినులు శంకరుల కీర్తిని నక్షత్రమాలగా కట్టి కంఠాన ధరిస్తూన్నారు. ఆ విధంగా శ్రీ శంకరుల కీర్తి ప్రసారాలు మల్లెపువ్వుల దండల మల్లే, చందన ద్రవ్యాలమల్లే, ముక్తాహారాలమల్లే అత్యంత ధవళమై ఆకాశమంతా వ్యాపించాయి.

101. శ్రీ శంకరులు కీర్తిచంద్రులు, కనుక అక్షయులు. ఆకాశంలోని చంద్రుడు క్షయించేవాడు. కనుక దిక్కులనే నారీమణులు కీర్తిచంద్రునే తమ తొడలపై పరుండబెట్టుకొని మహాసంతోషాన్ని అనుభవిస్తున్నారు. లేదా తమ తొడలపై పరిశుద్ధమైన వస్త్రంగా ధరిస్తున్నారు. శాశ్వతం కాని ఆకాశ చంద్రుని తమ తొడలపై చేర్చుకోవడానికి ఇష్టపడటం లేదు. కీర్తిచంద్రుని కాంతిని ఆకాశమందలి నక్షత్రాలు లాగుకొంటున్నాయి. తారలు ఎల్లప్పుడు కీర్తి చంద్రునితో క్రీడించడానికి సుముఖంగా ఉంటాయి. అలాగే ఆకాశం కూడా కీర్తిచంద్రునే ఎల్లవేళలా ముద్దాడుతుంది; కానీ నిజచంద్రుని ఎల్లప్పుడు ముద్దాడటం లేదు. లోకాలోక పర్వత పంక్తులన్నీ కీర్తిచంద్రుని పట్ల ప్రసన్నాలై ఉన్నవి. కానీ లోకాలోకములందు నిజచంద్రుని ప్రసారమే

ఉండదు. శ్రీ శంకరుల కీర్తిచంద్రికలు లోకాలోకములందు సూర్యచంద్రులు కూడా జొరబడలేని ప్రదేశాలందూ ప్రకాశిస్తూన్నవి. ఆదిశేషుడు కీర్తిచంద్రుని యందు ప్రీతి కలిగి ఉన్నాడు; కానీ ఆ చోటునకు నిజచంద్రునకు ప్రవేశం లేకున్నది. శ్రీ శంకరుల కీర్తిచంద్రికలు ముల్లోకాలందూ ఆశ్చర్యకరం, సర్వతో రమణీయం కాగా, ఆకసాన ఉన్న చంద్రుడు శ్రీ శంకరుల కీర్తిచంద్రికలకు సమానుడు కాకున్నాడు. ఆ విధంగా శ్రీ శంకరుల కీర్తిచంద్రికలు ముల్లోకాలకు ఆహ్లాదం కలిగిస్తున్నాయి.

102. శ్రీ శంకరుల కీర్తి ప్రసరణ సమస్త ప్రపంచాలను వ్యాపించి అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేస్తున్నది. శ్రీ శంకరుల జ్ఞానమాధుర్యం నలుదిక్కులను, చంద్రలోకంలోను, పాలసముద్రమందు వ్యాపించి, మాయా మోహమనే అంధకారాన్ని హరిస్తూన్నా, తనను ఆశ్రయించిన వారందరినీ పరిశుద్ధ హృదయులనుజేస్తూ పూర్ణజ్ఞానాన్ని ప్రసాదిస్తూన్నది.

103. శ్రీ శంకరుల కీర్తిపరంపరలు, సింహరాజం ఏనుగు కుంభ స్థలాన్ని కొట్టడానికి నూతన ఉత్సాహాన్ని తెచ్చుకొని గజరాజు పైకి ఎగబ్రాకేట్లు గాను; క్షీరసముద్ర తరంగాలు అమితోత్సాహంతో ఎగసిపడేట్లుగాను; శ్రీ శంకరుల కీర్తిచంద్రికలు సమస్త లోకాలందూ క్షణంలో వ్యాపిస్తూ అమితంగా శోభిస్తూన్నవి.

104. శ్రీ శంకరుల యశశ్చంద్రికలు లోకాలోక పర్వత గుహలలో కూడా వ్యాపించి అమిత ఆనందాన్ని కలిగిస్తూన్నవి. లోకాలోక పర్వత గుహకు కలువతీగకు మధ్య జరిగిన సంభాషణ ఇలా ఉంది.

**కలువ తీగ పలుకుచున్నది:** ఓ పర్వత గుహా! చాలా కాలానికి నీలో సంతోషాన్ని చూస్తున్నాను. కారణ మేమి? ఓహో! తెలిసినది. శ్రీశంకరుల కీర్తిచంద్రికలను ఆలింగనం చేసుకోవడంచే ఆనందంలో మైమరచివున్నావు.

**పర్వత గుహ ఇలా పలికింది:** ఓ కలువతీగా! నువ్వు కూడా చాలాకాలం తరువాత ఎంతో సంతోషంగా ఉన్నావు. కారణం తెలుసుకోవచ్చా? ఆవల తెలిసింది, నీ చిరునవ్వే వికసించిన కలువపువ్వు చెబుతున్నది.

ఈ విధంగా ఆ రెండూ తమకు కీర్తిచంద్రోదయ కారణంగా చిరునవ్వు లొలికిస్తూన్నవని అర్థం.

105. అనంతమైన తత్త్వజ్ఞానామృతాన్ని నిరంతరం ప్రసరింపజేసే వాడూ, లోకంలో అందరికీ ఆనందం కలిగించేవాడూ అయిన శ్రీ శంకరా చార్యులవారు తత్త్వజ్ఞానాన్ని స్థాపించినారు. జన్మజన్మాంతరాల నుండీ సంసార దావాగ్నియొక్క భరింపరాని దుఃఖాల నివారింప అమృతాన్ని వర్షించే క్రొత్త మేఘమై వచ్చి ఉన్నాడు. అరణ్యంలో అగ్ని ప్రజ్వరిల్లి అరణ్యమంతా వ్యాపించి సమస్త జీవరాసులను తుదముట్టిస్తుంది. వర్షం కురవగానే ఆ దావాగ్ని యావత్తూ చల్లారి సమస్త జీవులకు సుఖశాంతులను ప్రసాదిస్తుంది. అట్లే శ్రీ శంకరాచార్య యతివరుడు తత్త్వమనే అమృతాన్ని కురిపించటం చేత సకల జీవులు పరమశాంతిని పొందుచున్నారు. దుర్జన పండితులందరు పెద్ద దూదిరాశి వంటివారు. చిన్నగాలి వీచినంతనే నాలుగు ప్రక్కలకు ఎగిరిపోతుంటారు. పెనుగాలి వీస్తే ఇక విడిగా చెప్పాలా? శ్రీ శంకరాచార్యులు అద్వైత తత్త్వప్రాతిపదికచేత అట్టి పాషండు లందరు పలాయనం చిత్తగించారు.

106. శ్రీ శంకరులు సింహంమల్లే పండిత సమూహం నడుమ కూర్చుండి భాగవత, స్కాంద, పద్మ పురాణాలను, మహాభారతాన్ని, మన్వాది స్మృతులను, పూర్వమీమాంస, ఉత్తర మీమాంసాది శాస్త్రాలను పండితులతో చర్చిస్తున్నారు.

107. శ్రీ శంకరులు శ్రీ వ్యాస భగవానుడు రచించిన మహా భారత మందలి శాంతిపర్వంలోని ప్రబోధకసూక్తి సందేశా లన్నిటినీ సమూలంగా అధ్యయనం చేశారు. అందలి శాంతియుత వాక్యాలచేత ఆత్మపరిశుద్ధతను పొందారు.

108. శ్రీ శంకరులవారు, ఒక్క సృష్టి కార్యం నిర్వర్తించడమన్నది తప్ప తక్కిన అన్ని విషయాలలోను బ్రహ్మతో సమానుడు; శేషశయనం మినహా తక్కిన విషయాలందు శ్రీ మహావిష్ణువుతో సమానుడు; మన్మథుని భస్మం చేయడమన్నది తప్ప తక్కిన విషయాలందు పరమశివునితో సమానుడు. ఇక్కడ విశేషార్థ మేమంటే శ్రీ శంకరులవారు సకల దృశ్య స్ఫురణలు లేని

వారవడంచేత బ్రహ్మకన్నా, సకల భోగాలను దూరీకరించడం చేత విష్ణు మూర్తికన్నా, సమభావం గ్రహించినవాడవడంచే పరమశివునికన్నా విలక్షణుడై, పరమపురుషుడై పరమాద్వైత తత్త్వంతో ప్రకాశిస్తున్నారు.

109. శ్రీశంకరభగవత్పాదులవారు బ్రహ్మవిష్ణు మహేశ్వరులని పండితులు తలపోస్తున్నారు.

ఎల్లప్పుడు, పండిత ప్రకాండుల మధ్య పరివేష్టితుడై స్వముఖ పద్మ మందు సరస్వతీ సమలంకృతు డవడంచేత బ్రహ్మదేవుడనీ, క్షమాగుణం గలవాడవడంచేత క్షమాలక్ష్మీవిలసితు డవడంచేత శ్రీమహావిష్ణువనీ, ఆర్య యైన పార్వతీదేవిచేత అర్చించబడే కామద్వేషి యైన పరమశివుడనీ తలచు చున్నారు. శ్రీశంకరగురువరుడు సకల విద్యలకు నిలయమై, విజ్ఞానలక్ష్మితో కలసి పరమసాత్త్వికప్రవృత్తిచే విలసిల్లుతూ లోకాలకు సకల విద్యలను ప్రసాదిస్తూ, జ్ఞాన ప్రబోధం చేశారు.

110. మహాసాధ్వియైన సీతాదేవిని కపటసన్యాసి వేషం ధరించి వచ్చిన రావణాసురుడు అపహరించి లంకకు గొనిపోయాడు. భగవానుడైన శ్రీరామచంద్రుడు రాక్షసుల నందరినీ సంహరించి సీతామాతను చెరనుండి విడిపించాడు. తరువాత కఠినమైన అగ్నిపరీక్షకు గురిచేశాక ఆమెను స్వీకరించాడు. అదే విధంగా శంకర తాపసవరేణ్యు డనే పురుషోత్తముడు జన్మరాహిత్యాన్ని కలిగించే జ్ఞానరూపసత్తను మాయాభిక్షువులు, నాస్తికులు అపహరించగా. నాస్తికులను, అనేకాత్మవాదులను జయించి తమకు ప్రియాతి ప్రియమైన జ్ఞానసత్తను గ్రహించారు. శ్రీరామచంద్రుడు తాపసి రూపంలో ముల్లోకాలను రక్షించేట్లు, శ్రీ శంకరులు కూడా తాపసరూపం దాల్చి మన లందరిని రక్షిస్తూన్నారు. సత్తారూప సీతాదేవిని గ్రహించిన శ్రీరామచంద్రుడు సకల జనులను రక్షింప పూనుకొనగా, శ్రీ శంకరాచార్యులు కూడా సకల జనులను ఉద్ధరించడానికి తాపస రూపం ధరించి శ్రీశంకరాచార్యులై అవతరించి ఉన్నారు.



# సర్గము - 5

## శ్రీ శంకరులు మాతృదేవిని సేవించడం

1. శ్రీ శంకర భగవానులు ఏడేళ్లు నిండేవరకు గురుకుల వాసం చేశారు. సర్వశాస్త్రాలను, వేదవేదాంగాలను అభ్యసించారు. అప్రాకృత దివ్యచరిత్ర గలవారై, అద్భుత ప్రతిభాసంపన్నులై అసాధారణమైన కీర్తిని సముపార్జించారు. ఈ విధంగా సకల విద్యలతో పరిపూర్ణులై గురుకులం నుండి స్నాతకవ్రతం ఆచరించి శ్రీ గురువుల అనుజ్ఞ పొంది స్వగృహానికి చేరి తల్లికి నమస్కరించి సపర్యలు చేయసాగారు.

2. శ్రీ శంకర వటుడు ప్రాతఃకాలానే లేచి సంధ్యాసమయాలందు సూర్యాగ్నుల నారాధిస్తూ, మాతృసేవ చేస్తూ, వేదం పఠిస్తూండేవాడు. మనుశాస్త్రాన్ని అనుసరించి సమయానుసారంగా శ్రేష్ఠమైన మంత్రాలను పఠిస్తూ తేజస్సున సూర్యునిమల్లే ప్రకాశింపసాగాడు.

3. శిశువైన శ్రీ శంకరుని కలుసుకొని యువకులు గర్వం, కోపంలేక ప్రసన్నభావంతో నమస్కరించేవారు. అలాగే వృద్ధులు కూడా అమిత గౌరవ భావంతో ఆసనాల నిచ్చేవారు. ఈ విధంగా జనులందరు పవిత్ర భావంతో నమస్కరించసాగారు.

4. శ్రీ శంకరుల మృదుమధురమైన పలుకులను తనివిదీర వింటూ, పవిత్రమైన చరిత్రకు, నిశితమైన బుద్ధికి నిలయమైన దేహాన్ని చూసే తల్లియైన ఆర్యాంబ అంతులేని ఆనందం పొందింది.

5. ఒకనాడు ఆర్యాంబ స్నానానికై మట్టమధ్యాహ్నపు వేళ పూర్ణానదికి వెళ్లింది. ఎండ తీవ్రంగా ఉండటంచే ఇంటికి రాజాలకపోయింది.

6. బాలశంకరులు ఇంటి వద్ద అధ్యయనం చేసుకొంటుండగా గ్రామస్థులు కొందరు వచ్చి తన తల్లి ఎండ వేడిమిచేత ఇంటికి రాలేక అక్కడే పడి ఉందని తెలిపారు. అప్పుడు శ్రీ శంకరులు గ్రామస్థులను

తోడు తీసుకొని పూర్ణానది వద్ద ఉన్న తల్లిని చూసి, తామరాకులతో ఆమెకు విసరి, సపర్యలు చేశాడు. వారి సహాయంతో ఆమెను ఎలాగో ఇంటికి తీసుకొని వచ్చారు. ఇందుమూలంగా జనులకు మాతృభక్తిని గూర్చి బోధించినట్లయింది.

7. స్నానానికి తల్లి పూర్ణానదికి పోలేదని తలచారు. అందువలన పూర్ణానదిని అనేక విధాలుగా స్తుతించారు. అనేక రసవత్తరమైన శ్లోకాలతో అలంకారాలతో, పూర్ణానదిని తన ఇంటికి సమీపంగా ప్రవహించాలని అమిత భక్తితో స్తుతించారు.

8. శ్రీ శంకరులు భక్తి ప్రపత్తులతో చేసిన స్తుతివాక్యాలకు మిక్కిలి ప్రసన్నురాలైన గంగాదేవి సాక్షాత్కరించింది. బాల్యంలోనే జనుల హితం కోరి సంసారబంధవిముక్తికై చేస్తున్న మహోపకారం, దీనజనుల పట్ల దయాస్వభావం ఎరిగిన గంగాదేవి "మీ మనోరథం రేపు ఉదయానికల్లా ఫలించగలదు" అని చెప్పి అంతర్ధానమయింది. ఈ విధంగా నదినుండి వరం పొంది తన ఇంటికి వెళ్లారు. తన తల్లి వృద్ధాప్యం చేత నదికి వెళ్ళలేదని తలచి, నదినే తన ఇంటి ప్రక్కగా ప్రవహించేట్లు వరం పొందారు. ఆ రోజంతా పూర్ణానదిని స్తుతిస్తూనే ఉన్నారు.

9. తెల్లవారుతూండగానే పూర్ణానది విష్ణు దేవాలయానికి సమీపంగా (శ్రీ శంకరుల ఇంటికి కూడ దగ్గరగా) ప్రవహించసాగింది. జనులు ఆ నూతన ప్రవాహంలోని చల్లని నీటిని తాకుతూ, జలకమాడుతూ మహానందాన్ని పొందారు. శ్రీ శంకరుల సత్యసంకల్ప మహిమ, సర్వదేవతానుగ్రహం వెల్లడి అవుతోంది.

10. ఈ విధంగా ఆశ్చర్యకరమై, మానవాతీత కృత్యాలను విన్న కేరళాధిపతియైన రాజశేఖరుడు శంకరాచార్యులవారిని ఆహ్వానించడానికి తన మంత్రి నొకరిని పంపాడు.

11. సర్వసమర్థుడూ, నిర్భయుడూ అయిన శ్రీ రాజశేఖర మహారాజు సమభావం గలవాడూ, మాంద్యాన్ని సహింపని శ్రీ శంకర గురువరులకు

శ్రేష్ఠమైన ఏనుగు నొకటి కానుకగా పంపి మంత్రి ద్వారా యిలా విజ్ఞాపన చేశాడు.

12. ఓ విప్రశ్రేష్ఠా! లోకంలో ప్రజ్ఞాపాటవాలతోను, జనరంజకం గాను పరిపాలిస్తూ, యుద్ధాలలో సదా విజయాన్నే పొందేవాడనైన కేరళ రాజేంద్రుడు పంపగా, నా పూర్వజన్మ సుకృతంచేత మిమ్మల్ని రాజమందిరానికి ఆహ్వానించడానికి వచ్చాను. పండితులు, జ్ఞానసంపన్నులతో పరివేష్టితుడైన రాజును సేవించటంచేత, నా పూర్వజన్మ సుకృతం చేత నేడు నాకు తమ దర్శనభాగ్యం కలిగింది. నా జన్మ ధన్యమైంది.

13. ఓ శ్రేష్ఠా! శ్రీ రాజశేఖరమహారాజు ఎల్లప్పుడు పట్టు పీతాంబరాలనే ధరిస్తూ పండిత ప్రవరులు చేసే అర్థవంతమైన వాదోపవాదాలందు పాల్గొంటూ, కాలం వ్యర్థం చేయనివాడై, నిర్భయుడై వారితో వర్తిస్తూంటాడు.

14. అంతేగాక మా ప్రభువు రాజులందరినీ జయించి విజయలక్ష్మిని చేబట్టి సకల జనులచే స్తుతించబడి, సామంతులచే పూజించబడుతూ వంశోద్ధారకుడై ప్రకాశిస్తూన్నాడు. అటువంటి మా మహారాజు, సర్వసంసార దుఃఖతాపాలకు రక్షకులైన తమ పాదాల చెంత అత్యాదరంతో ప్రార్థిస్తున్నాడు. తమ పాదధూళిచేత తాను, తన గృహమూ ధన్యమవుతుందని తలచు చున్నాడు. కనుక మా రాజప్రాసాదమందు తమ పాదపద్మాలుంచాలని వేడుకొంటున్నాము.

15. గురువరేణ్యా! తాము రాజప్రాసాదానికి రావడానికి వినయంతో కూడి మదించిన ఏనుగును మహారాజు పంపించారు. తాము దాని నధిరో హించి విచ్చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాము.

16. మంత్రివర్యుని రాయబారం ఫలించినది. సమయోచితం గాను, యుక్తియుక్తంగాను ఆతడు పలికిన పలుకులకు శ్రీ శంకర భగవానులు సంతృప్తులయ్యారు. మునులచేత, ఋషులచేత పొగడ్త లందుకొన్న ఆ మంత్రివర్యునితో శంకర భగవాను లిలా పలికారు:

17. మంత్రివర్యా! విను. వేదాధ్యయనం చేయడమే నా నిత్యకృత్యం. నైష్ఠికబ్రహ్మచర్యవ్రతాన్ని ఆచరిస్తూ సద్గురుని సన్నిధిలో ఉండే నాబోటి వారికి భిక్షావృత్తిచేత లభించేదే అన్నం, మృగచర్మాలే వస్త్రాలు. ముప్పూటలా సంధ్యావందనాది అగ్నికార్యాలనే కఠిన నియమాలను వేదం శాసిస్తున్నది. సద్గురువుల సేవ చేయటం, వేదాధ్యయనం మొదలైనవి బ్రహ్మచారుల హితం కోరి వేదమాత నిత్య సుఖాల నిస్తూ, దయగలదై సదనుష్ఠానాలను బోధిస్తున్నది.

18. అమాత్యశ్రేష్ఠా! బ్రహ్మచారులకు వేదవిహితమైన నిత్యాను ష్ఠానాలే సహజాలై పరమ ధర్మంగా ఉన్నది. అలాంటప్పుడు గజారోహణం, అశ్వారోహణాలు చేయటం మొదలైనవన్నీ విషయ భోగాలు. వీటివలన మాకెలాంటి ప్రయోజనం సిద్ధిస్తుంది? నువ్వు సుఖంగా ఇంటికి వెళ్లు. నువ్వు వచ్చిన కార్యం సఫలం కాలేదని విచారింపవద్దు. మీ రాజుకు ఈ క్రింది విధంగా నా మాటలు తెలుపు.

19. ఓ రాజవరేణ్యా! సుగుణాలతో కూడి ప్రజలను సుఖపెడుతూ రాజ్య పరిపాలన సాగించు. ప్రజలకు జీవనాధారం కల్పించటం రాజుల ప్రథమ కర్తవ్యం; అంతేగాక వారిని పితృ దేవ ఋషిఋణాల నుండి విడిపించి ధర్మమార్గాన నడిపించు. అంతేకాదు, స్వధర్మానుష్ఠానరూపకర్మల నెన్నడూ విడువకు.

20. శ్రీ శంకరుల ప్రబోధాన్ని శిరసావహించినవాడై, మంత్రివర్యుడు తన రాజును సమీపించి శంకర సూక్తులనన్నీ వినిపించాడు. తన మంత్రి ద్వారా శ్రీ శంకరుల పలుకులు విని ఆనందంతో అలాంటి మహాత్ముణ్ణి దర్శించుకోవాలని నిశ్చయించుకొన్నాడు.

21. శ్రీ రాజశేఖర మహారాజు శ్రీ శంకరులను దర్శించినప్పుడు ఆ రాజు ఇలా తలచాడు: వేదాధ్యయనం చేస్తూ, తోటి బ్రహ్మచారుల మధ్య నున్న శ్రీ శంకరులు నక్షత్రాలతో కూడివున్న చంద్రునిమల్లే ప్రకాశిస్తున్నాడు. తెల్లగా మెరిసిపోయే యజ్ఞోపవీతాన్ని ధరించిన ఆ శంకర వటూత్తముడు

కల్పవృక్షంలా ఉన్నాడు. గంగానది అంత పవిత్రుడుగాను, హిమాలయాల వలె స్వచ్ఛమైన కాంతితోను వెలుగొందుచున్నాడు.

22. అంతేగాక ఆ శంకరుడు తాను తెల్లటి దేహచ్ఛాయతో వెలుగొందుతూ, జింక చర్మాన్ని ధరించటంచేత మేఘం వలె ప్రకాశిస్తున్నాడు. తాను జింక చర్మాన్ని ధరించినా, శాస్త్రసమ్మతమైన సకలకర్మల నాచరిస్తూన్నాడు.

23. బంగారం మల్లే మెరసే ముంజయు, నూలుతో చేయబడిన మొలనూలు ధరించినవాడైన ఆ శంకరవటుడు పుణ్య పరిపాకంచేత లభించిన పసుపు వర్ణంతో కూడిన తీగలతో కల్పవృక్షంలా విరాజిల్లుచున్నాడు. దేవతలకు కల్పవృక్షంమల్లే భక్తజనులకు మందార వృక్షంలా ఉన్నాడు.

24. ఈ విధంగా ఉత్తమగుణసంపన్నుడు, ప్రసన్న భావంతో ఉండేవాడు, చిరునవ్వులు చిందించేవాడు అయిన శ్రీ శంకర భగవానులను శ్రీ రాజశేఖర ప్రభువు అమిత ఆశ్చర్యంతో చూడసాగాడు. బ్రహ్మదేవునిలా వరా లివ్వడంలో సమర్థులని తలచాడు.

25. శ్రీ రాజశేఖరుడు శ్రీ శంకర భగవానులకు భక్తి వినమ్రతలతో ప్రణమిల్లాడు. తనను చూడడానికి వచ్చిన మహారాజుతో శ్రీ శంకరుడు కుశలం విచారించాడు. తరువాత రాజశేఖరుడు తాను రచించిన మూడు నాటకాలను వారి ముందుంచి గుణదోషాలను తెలుసుకోగోరాడు. భక్తితో పది వేల దీనారాలను సమర్పించాడు.

26. ఆ మూడు నాటకాలను శ్రీ శంకరుల అనుజ్ఞతో చదువ నారంభించాడు. సుమనోరంజకాలని తెలుపుతూ తన సంతోషాన్ని వ్యక్తం చేశారు. సకల నాటక లక్షణాలు కలిగివున్నవనీ, శృంగారాది రసాలతో పాఠకుల హృదయాలను రంజింపచేస్తాయనీ తెలిపారు. మాధుర్యంతో కూడి కావ్య లక్షణాలు గలవై పండితుల ఆదరం పొందుతాయనీ సెలవిచ్చారు. వైదర్భీ, పాంచాలాది రీతులతో కూడిన ఆ మూడు నాటకాలు ప్రధాన లక్షణమైన ముఖ ప్రతిముఖాది శ్రేష్ఠమైన సంధులతో ఒప్పుచున్నవన్నారు. ఇన్ని

మాటలెందుకు? ఇతర కవుల ననుకరింపక, సర్వవిధాల స్వతంత్రాలై ఉన్నవన్నారు. ఇట్టి నాటకాలను శ్రీ శంకరులు సంతోషంగా ఆలకించారు. భగవత్పాదులు తన సంతోషాన్ని తెలియబరుస్తూ శ్రీ రాజశేఖరుని ఏదైనా వరం కోరుకొమ్మన్నారు.

27. మహామధురమై, అత్యంతమనోజ్ఞమైన శ్రీ శంకర భగవానుల నోటి నుండి వరం కోరుకొమ్మన్న పలుకులు రాజశేఖర మహారాజు చెవులకు అమృత బిందువుల్లా సోకాయి. అంతట ఆ రాజు సంతోషంతో సాష్టాంగ నమస్కారం చేసి, తనతో సమానుడైన పుత్రుణ్ణి ప్రసాదించమని ప్రార్థించాడు.

28. రాజు కోరికను విన్న శ్రీ శంకరులు ఇలా పలికారు: "రాజశేఖరా! పదివేల బంగారు నాణాలు బ్రహ్మచారినైన నాకు అవసరం లేదు. ఈ అగ్రహారంలో నివసించే గృహస్థులకు దానం చేయి. నీకు అతిత్వరలో పుత్రప్రాప్తి కలుగుతుంది. సంతోషంతో ఇంటికి వెళ్లు."

29. తరువాత ఆ రాజశేఖరునితో "రాజా! వేదాలందు చెప్పబడి నదీ, పరమాత్మునకు ప్రీతికరమైనదీ, సకల మనోరథాలను తీర్చేదీ, రాజ వంశాన్ని వృద్ధి చేసేదీ అయిన యాగం చేయి" అని తెలిపారు. అంతేకాక, ఆ యాగం చేసే విధివిధానమంతా ఆ రాజుకు బోధించారు. అప్పుడు ఆ రాజు పరమానందభరితుడై వెళ్లిపోయాడు.

30. సకలశాస్త్ర రహస్యాల నెరిగిన శ్రీ శంకరులు పండిత శ్రేష్ఠుడైన ఆ రాజును ఎంతో గౌరవించారు. అలాగే ఆ రాజశేఖరమహారాజు కూడా శ్రీ శంకరుల అనుగ్రహాన్ని పొంది తన నగరానికి వెళ్లిపోయాడు.

31. అనేక మంది పండితశిరోమణులు వేదాలను వేదాంగాలను, దర్శనాలను, సకల శాస్త్రాలను వారి వారి గురువుల వద్ద అభ్యసించినా, తృప్తి చెందనివారై శ్రీ శంకరుల నాశ్రయించి దురవగాహాలైన బహు శాస్త్రాలను అధ్యయనం చేసి ఆదిశేషుని విద్యానైపుణ్యాన్ని సంతరించుకొన్నారు.

32. శ్రీ శంకరభగవానులు తమ శిష్యులతో పరస్పర వాదోపవాదాలతో కూడిన శాస్త్రచర్చలు సలిపేవారు. వారి వారి నైపుణ్యాలను

నిశితంగాను, ఏకాంతంగాను పరిశీలించేవారు. అప్పుడు శిష్యుల అఖండ విద్యాభ్యాసాన్ని, నిరుపమపాండిత్యాన్ని, సకలశాస్త్రాలందలి బుద్ధికుశలతను పరీక్షిస్తూ శిష్యులను ఆనంద సాగరంలో ముంచేవారు. శిష్యులు కూడా శ్రీ శంకరులను సంతోషపెట్టి కృతార్థులయ్యేవారు.

33. శ్రీ శంకరులు సకల శాస్త్రాలను, శాస్త్రార్థాలను తెలిసి, పండితులచేత, దేవతలచేత, ఋషులచేత మిక్కిలి కొనియాడబడిన వారైనా, నిరహంకారులై వినయంతో, పరమభక్తితో మాతృసేవను చేశారు. మనుస్మృతిలో ఇలా చెప్పబడింది: ఉత్తమ విద్యను బోధించిన పది మంది ఉపాధ్యాయులను పూజించే విధంగా, గాయత్రీ మంత్రోపదేశాన్ని చేసిన ఆచార్యుని పూజించాలి. అంటే ఉపాధ్యాయునికన్నా పదిరెట్లు. అటువంటి ఆచార్యునికన్న తండ్రిని నూరురెట్లు సేవించాలి. అలాంటి తండ్రికన్న వేయిరెట్లు అధికంగా తల్లిని పూజించాలి. అంటే తల్లికన్నా పరదైవం లేదు.

ఈ విధంగా స్మృతివాక్యాన్ని తెలిసిన శ్రీ శంకరులు తన తల్లికి నానావిధాలైన సేవలు చేస్తూ, ఏ విధమైన కష్టం కలిగించక మాతృసేవ చేసి ధన్యులయ్యారు.

34. లోకంలో తల్లికి బిడ్డపట్ల పరమప్రీతి ఉండడం సహజమే. బిడ్డ తల్లిపట్ల అంతటి ప్రీతితో ఉండటం దుర్లభం. కానీ శంకరులకు తల్లియే పరమ శరణ్యంగా ఉంది. సతీదేవియే శ్రీ శంకరులకు పరమ రక్షణగా ఉంటున్నది. కనురెప్ప కూడ ఆర్పకుండా శంకరుని రక్షిస్తూన్నది. సర్వలోక రక్షకుడగు పరమశివుని రక్షించే భాగ్యం ఆ సతీదేవికి కలిగింది.

శ్రీ శంకరాచార్యులవారు మాతృసేవను కూడా లోకానికి బోధింప తలచి పరమ శివావతారుడై మాతృదేవికి సర్వవిధాల సేవచేశాడు. ఈ విధంగా మాతృభక్తి ఎట్టివారికైనా ఆవశ్యకమని ప్రకటించినట్లయింది. అదీగాక, తల్లిని పరమ దైవంగా భావించే సాధకులకు విషయాదులందు కోరిక నశిస్తుందని తెలుపుచున్నారు. కనుక శంకరులకు వివాహం చేసు కోవాలనే సంకల్పం ఏమాత్రమూ లేదు. లోకంలో అత్యధికోన్నతమైన మేరు శిఖరాన్ని అధిరోహించినవాడు అంతకన్నా తక్కువ శిఖరాలపై ఆశపడతాడా?

35. ఉపనయనమైన బాలురకు వివాహ ప్రయత్నం చేయటం ఆనాటి ఆచారం. అందులోను అతి చిన్నవయస్సులోనే వేదాధ్యయనం పూర్తిచేసి, సర్వశాస్త్రాలను, వేదార్థాలను గ్రహించిన వాడవడంచేత బంధువులు, బయటవారు తమ కన్యల నిచ్చి వివాహం చేయడానికి ప్రయత్నాలు సాగించారు. మహోన్నత కుటుంబాల నుండి కూడా తమ కన్యకారత్నాల నివ్వడానికి రాసాగారు.

36. శ్రీ శంకరవటుడు స్వగృహంలో మాతృసేవ చేస్తూండగా, దధీచి, గౌతమ, ఉపమన్యు, త్రితల, అగస్త్య మొదలైన మహర్షులు శంకర రూపంలో అవతరించిన మహేశ్వరుని దర్శింప వచ్చారు.

37. శ్రీ శంకరుడు దధీచి ప్రభృత మహర్షులను చూడగానే లేచి తల్లితో కలసి సాష్టాంగ దండప్రణామం చేశారు. తరువాత తపోధనులను మధుపర్కసమర్పణపూర్వకంగా భక్తితో పూజించారు. ఆ మహాత్ములకు తాను, తన తల్లి సకల సపర్యలు చేశారు. మహర్షులు కూడా ఎంతో సంతోషించారు. తాను పరమేశ్వరుడే అయినప్పటికీ, శాస్త్రవిధిని అనుసరించారు.

38. శ్రీ శంకరులు మునిశ్రేష్ఠులకు నమస్కరించి, వినయంతో "పూజనీయులారా! ఆసనం అలంకరించి మమ్ము ధన్యులను చేయండి" అని పలికి వారిని ఆసీనులను చేశారు. ఆ మహర్షులు కూడా పరమానంద భరితులై శంకరునితో పరమార్థ తత్త్వాన్ని, అప్రాకృత విషయాలను, కథా రూపంగా సంభాషించసాగారు. ఆ సంభాషణలో శ్రీ శంకరుల అవతార ప్రయోజనం కూడా ముఖ్యాంశమయింది.

39. మహర్షులందరు బాలుడైన తన పుత్రునితో వేదాంత సూక్తులు పలుకడం చూసిన ఆర్యాంబ ఆశ్చర్యం చెంది ఆనందం పట్టలేక వారితో ఇలా అంది: "ఓ మహాత్ములారా! ఓ మహర్షి పుంగవులారా! మీరు త్రికాలజ్ఞులు, సర్వలోక పూజ్యులు. మీరందరు స్వయంగా మా ఇంటికి రావడం అన్నది మా పూర్వజన్మ సుకృతం. తమ రాక వలన మా వంశమే పావనమైనది.

40. దయామయులైన మహాత్ములారా! కలుపు మొక్కలతో కూడిన కలియుగ మెక్కడ? కృతయుగాదులందుండిన పరమపుణ్యాత్ములు, విజ్ఞా నాత్ముల దివ్య పాదపద్మాల దర్శన భాగ్య మెక్కడ? అయినా మీ బోటి మహర్షుల పాదధూళిచే మేము, మా గృహమూ, మా వంశమే పావనమైనది. మే మాచరించిన పూర్వజన్మ సుకృతమేనని భావిస్తాము. అంతే కాదు, మీ పాదదర్శన భాగ్యంచేత మా ముందు జన్మలందు కూడా అనంతాలైన పుణ్యాలు పొందగలము.

41. మహర్షులారా! మీ పాదాల వద్ద కూర్చుని మాట్లాడుతున్న ఈ శిశువు చర్యలు ఆశ్చర్యం కలిగిస్తున్నవి. బాల్యంలోనే సకల శాస్త్రాలందు ప్రావీణ్యం పొందాడు. మానవమాత్రులకు సాధ్యం కాని మహిమలెన్నో చూపు తున్నాడు. లోకంలో సాధ్యం కాని చేష్టలను అవలీలగా చేస్తున్నాడు. నూతన రూపం ధరించినట్లున్నది. వీని వాక్కులు అలౌకికమైనవి. ఏ విధమైన లోపంలేక మధురమైన పలుకులతో జనుల హృదయాలను రంజింపచేస్తున్నాడు. ఒకానొక బ్రాహ్మణ స్త్రీ దారిద్ర్యం పోగొట్టడానికి బంగారు ఉసిరిక ఫలాలతో కూడిన వర్షం కురిపించినాడు. ఈ విధంగా చెప్పుకుంటూ పోతే ఈతడి లీలలకు అంతే లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే, త్రిమూర్తులకు కూడా ఇలాంటి ప్రజ్ఞావిశేషాలు ఉండవు. మహాపండితులను విద్వాంసులను కూడా అవలీలగా జయిస్తున్నాడు. ఇటువంటి మహాశ్చర్యకరమైన మానవాతీత కృత్యాలెలా సాధ్యమవుతున్నవి? తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది.

42. మహానుభావులారా! మీ రా మహర్షులు. మహేంద్రాది దేవ తలకు కూడ మీ దర్శనం బహు కష్టసాధ్యం. అటువంటిది, మీరే స్వయంగా వచ్చి ఈ శిశువుతో మహాతత్త్వరహస్యాలను సంభాషిస్తున్నారు. అంతే కాదు, వీని యందు మీ దయాదృష్టి నిరంతరం ప్రసరిస్తున్నది. అంతేగాక మీరందరు ఈ బాలుని అనుగ్రహం కోసం పరితపిస్తున్నట్లు తెలుస్తూన్నది. నాకు అమిత ఆశ్చర్యం కలిగించే ఈ రహస్యాన్ని నేను తెలుసుకోవడానికి యోగ్యురాలనైతే సెలవివ్వండి. నన్ను కృతార్థురాలను చేయండి.

43. సతీదేవి (ఆర్యాంబ) యీ విధంగా ప్రార్థించగా మహర్షులందరు సావధానంగా ఆలకించారు. వారిలో పెద్దవాడైన అగస్త్య మహర్షి తక్కిన మునిపుంగవుల అనుమతితో శ్రీ శంకరాచార్యుల వృత్తాంతాన్ని ఆర్యాంబకు ఇలా చెప్పసాగాడు.

44. ఓ సాధ్వీ! చాలకాలం వరకు మీకు సంతానం కలుగలేదు. సంతానం కోరి నువ్వు శివగురునితో ఈశ్వరుని గురించి కఠోరమైన తపస్సు చేశావు. అప్పు డా పరమశివుడు మీ తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమయ్యాడు.

45. అంతట ఆ శివుడు చిరునవ్వుతో శివగురుతో, “వత్సా! నీ తపస్సుకు మెచ్చాను. ఇక నీ ఘోరతపస్సు చాలించు. నువ్వు కోరిన వరమిస్తాను. సర్వజ్ఞులు కాని నూరుగురు పుత్రులు కావాలా? లేక సర్వజ్ఞుడు, లోకోత్తర పురుషుడై అల్పాయుష్కుడైన ఒక్క పుత్రుడు కావాలా” అని అడుగగా, అప్పుడు నీ భర్తయైన శివగురు లోకోత్తరుడైన ఒక్క కుమారునే కోరుకొన్నాడు.

46. మహేశ్వరుడు శివగురు అభీష్టం నెరవేర్చదలచాడు, కానీ సర్వజ్ఞత కలిగినవాడు తాను తప్ప మరొకరు లేనందున నీ పూర్వజన్మ పుణ్యంచేత మహేశ్వరుడే నీకు పుత్రుడుగా జన్మించాడు. అందువలన ఈ బాలశంకరుడు సాక్షాత్తూ ఆ మహేశ్వరుని అవతారమవడంచేత సర్వజ్ఞత్వాలను, మహాద్భుత కార్యాలను ఆచరిస్తున్నాడు. పరమేశ్వరునకు అసాధ్యమైన దేదీ ఉండదు గదా!

47. అగస్త్య మహాముని బాలశంకరులు అల్పాయుష్కులని పలకడం విన్న ఆర్యాంబ మనస్సు వణికిపోసాగింది. తరువాత ఆమె అగస్త్యునితో “ఓ మహామునీ! మీరు సర్వజ్ఞులు, మీకు తెలియని విషయాలుండవు. ఈ బాలుని ఆయువు పరిమితితో కూడినదని తెలిపినారు. ఆ పరిమితి యెంతో నాకు సెలవిండు” అని మరీ మరీ ప్రార్థించింది.

48. “ఓ సాధ్వీ! ఈ బాలుని ఆయుఃప్రమాణాన్ని విను. మొదట ఈతడి ఆయువు ఎనిమిది సంవత్సరాలు. దాని తదుపరి మరొక ఎనిమిది సంవత్సరాలు, మరి కొన్ని కారణాలచేత మరొక పదునారేండ్లు జీవిస్తాడు.

అంటే మొత్తం ఆయుఃపరిమాణం 32 సంవత్సరాలు” అని అగస్త్య మహాముని చెప్పాడు.

49. ఈ ప్రకారం అగస్త్య మహర్షి శ్రీ శంకరుల ఆయుఃపరిమాణాన్ని గూర్చి ఆర్యాంబకు తెలిపి జరుగబోయే విషయాలను మరింత స్పష్టంగా చెప్పబోయేటంతలో తక్కిన మహర్షులు చెప్పవలదని వారించారు. యథార్థ మైనా, అనిష్ట విషయాలను చెప్పడం మంచిది కాదని సూచించారు. కనుక యీ కథను అంతతో ముగించి మునులందరూ తమ తమ నివాసాలకు వెళ్లిపోయారు.

50. ఏనుగు కుంభస్థలంపై అంకుశంతో పొడవడంచేత ఆ గజం దీనంగా ఘీంకారం చేసినట్లు, కుమారుని అల్పాయుస్సును తలచుకొని ఆర్యాంబ బిగ్గరగా ఏడ్వసాగింది. గ్రీష్మకాలమందు నీరులేక ఎండిపోయేట్లు, పుత్రుని విషయమైన దుర్వార్త వినగానే ఆర్యాంబ మనసంతా శుష్కించి పోయింది. పెనుగాలి వీచినప్పుడు అరటి చెట్టు ఊగిపోయేట్లు, బాలశంక రుల అల్పాయువు వార్త వినటంచే ఆర్యాంబ మనస్సు ఊగిపోతున్నది. భర్త మరణించినా ప్రాణాలన్నీ పుత్రుని మీదనే పెట్టుకొని బ్రతుకుతున్న ఆర్యాంబ ఇక పుత్రుని విడిచి ఒక్క క్షణం కూడా ఉండలేకపోయింది.

51. ముని వాక్యాలు విన్న మాతృమూర్తి దుఃఖితురాలవటంచేత బాల శంకరులు తల్లి వద్ద చేరి ప్రసన్నవదనుడై మృదువైన పలుకులతో “ఓ తల్లీ! ప్రాణికోటికి పుట్టటం గిట్టటం సహజం కదా? జ్ఞానసంపన్నురాలవైన నువ్వు ఇలా విచారింపదగునా? అంతేగాక నేను ఇంకా జీవించి ఉండగానే నువ్వు శోకించటం తగునా?

52. అమ్మా! పెనుగాలి వీచినప్పుడు వస్త్రం కొస గాలికి రెపరెపలాడు తుంది. అట్లాగే ఈ దేహం కూడా అతిచంచలమైనది. అటువంటి శరీరం శాశ్వతమైనదని యే మూఢుడైనా తలస్తాడు? నువ్వు జ్ఞానవంతురాలవు, మూఢులమల్లే నువ్వు ఏల దుఃఖిస్తున్నావు? అదీకాక, నువ్వు నా తల్లివైయై నందున ఎంతమాత్రమూ దుఃఖించరాదు. అలాకాక, శవంవంటి దేహంమీద

ఎవరైనా అభిమానం పెంచుకొంటే మూఢుడనే శాస్త్రం చెబుతున్నది. కనుక మూఢమార్గం కూడా సమంజసం కాదు.

53. జననీ! నా కుమారుడనే వ్యామోహం తగునా? మీరు ఎన్నో జన్మలు పొంది ఉంటారు. ఆ జన్మలన్నింటిలోను చాలామంది పుత్రులు, పుత్రికలు కలిగి ఉంటారు. వారందరినీ గుర్తుపెట్టుకొని చెప్పగలరా? వారిలో ఎవరికోసం దుఃఖిస్తావు? ఆ విధంగా ఈ జన్మలో నే నొక్కడినే జన్మించాను. అంతేకాకుండా మనమంతా ఎక్కడ నుండి వచ్చామో, మరల అక్కడికే వెళుతూ ఉంటాము. ఇది సత్యం. సంసార మనేది ఒక చలివేంద్రం వంటిది. అందులో బాటసారులు కలుస్తూ ఉంటారు. కొద్దిసేపు విశ్రాంతి తీసుకుంటారు. కష్టసుఖాలు మాట్లాడుకుంటారు. ఆ తర్వాత ఎవరి దారిన వారు వెళ్లిపోతారు. అదే విధంగా జీవులందరు కర్మఫలానుసారం ఒక చోట చేరుతూ కర్మఫలం తీరిపోగానే విడిపోతూ ఉంటారు. ఇదే సంసారచక్రం. కనుక, తల్లీ! జీవుల ఆయుఃప్రమాణం గురించి దుఃఖించడం తగదు.

54. సంసారమార్గం ఒక సుడిగుండం వంటిది. అజ్ఞానం చేత దానిలో పడి తిరుగుతూనే ఉంటారు. జీవులకు నిజమైన సుఖమనేది లేనే లేదు. జననమరణ వలయమైన సంసారంలో శాంతి ఉండనే ఉండదు. కనుక నాలుగు ఆశ్రమాల్లోను సన్న్యాస ఆశ్రమమే సకల బంధాల నుండి విముక్తికి తరణోపాయం. కాబట్టి నేను నివృత్తి మార్గమైన సన్న్యాసాన్ని స్వీకరించి ఆత్మబంధాల నుండి విముక్తుడ నవుతాను. సంసారబంధాల నుండి విడివడి ముక్తుడు కావాలంటే వైరాగ్యాన్నే ఆశ్రయించాలని శ్రుతి వాక్యం చెబుతున్నది. సన్న్యాసాన్ని గురువు నుండి పొందాలి. అందుకై ప్రయత్నిస్తాను.

55. ప్రపంచమంతా అశాశ్వతమైనదనీ, సంసారమందు సుఖం ఎంతమాత్రమూ లేదనీ, నివృత్తి మార్గమే ఉత్తమ మయినదనీ, సన్న్యాస స్వీకరణ పట్ల శ్రీ శంకరులు అత్యంతాసక్తి చూపారు. తల్లిని ఓదారుస్తూనే తీవ్ర వైరాగ్యం ప్రదర్శించారు. కాని ఆర్యాంబకు శ్రీ శంకరుల ఓదార్పు

మాటలకన్నా ఆతడి తీవ్రవైరాగ్యమూ సన్న్యాస స్వీకరణాశయమూ తీవ్రంగా కలచివేసింది. ఆమె దుఃఖం రెట్టింపయింది. పుత్రభ్రాంతిని వదలలేనిదై గద్గదస్వరంతో ఇలా అంది:

56. నాయనా! జ్ఞానమనేది తనకు తానుగా సంపాదించుకోవాలేగాని, ఇతరుల నుండి పొందేది కాదు. ఎవరికి ఆకలి వేస్తే వారే ఆకలిని తీర్చు కోవాలి. ఎవరు రోగంతో బాధపడతారో వారే ఔషధ సేవనం చేసి వ్యాధి నివారణ చేసుకున్నట్లు, సంసార వ్యాధి జ్ఞానం చేతనే నివారించదగును.

(ఆర్యాంబ మహేశ్వరుడే తన పుత్రుడన్న స్పృహను కోల్పోయి మాట్లాడు తున్నది. పూర్వం దేవహూతి కూడా కపిల ముని తన కడుపున జన్మించినప్పుడు జ్ఞానం కలుగనిదై ఇలాగే తలచినది. ఇప్పుడు శ్రీ శంకరుల తల్లి కూడ అట్లే మోహంచేత ఇలా పలుకుతున్నది.)

నాయనా! బ్రహ్మచర్యం నుండి సన్యాసం స్వీకరించటం శాస్త్ర సమ్మతం కాదు. అన్ని ఆశ్రమాలలోను గృహస్థాశ్రమం పరమశ్రేష్ఠమైనది. ఎలాగంటే, గృహస్థుడై పుత్రుణ్ణి పొంది పితృఋణాన్ని తీర్చాలి. అదీకాక, నువ్వు పూర్ణా యుష్కుడవు గావని తెలుస్తున్నది. కనుక త్వరగా గృహస్థుడవవు. పుత్రుని పొందు. అందువలన వంశం వృద్ధి అవుతుంది. తరువాత యాగాలుచేసి దేవతలను తృప్తిపరచి దేవఋణం తీర్చుకో. అట్లే వేదాధ్యయనం చేస్తూ ఋషి ఋణం కూడా తీర్చు. "ఋణాని త్రీణ్యప్రాకృత్య మనో మోక్షే నివేశయేత్" అనే శ్రుతివాక్యం అనుసరించి మూడు ఋణాలను తీరిస్తే గాని సన్న్యాసాశ్రమానికి అర్హుడవు కావు. ఈ ప్రకారం సత్పురుషులచే ఆచరించబడే శాస్త్రసమ్మతమైన మార్గాన్ని అనుసరించు. అలా చేస్తే శాస్త్రోల్లంఘనం కాదు. వంశం వృద్ధి చెందుతుంది.

కనుక తల్లినైన నా మాటలు విశ్వసించు. సన్న్యాసం స్వీకరించే ఆలోచన కట్టిపెట్టు. నీకు ఇట్టి నివృత్తిమార్గబుద్ధి తగదు.

57. నాయనా! మహేశ్వరుని అనుగ్రహం వలన చాలాకాలం తర్వాత జన్మించిన ఏకైక బిడ్డవు. నువ్వు సన్న్యసించి ఇల్లు విడిచిపోతే ఇక ఒంటరిగా నేనెలా జీవించగలను. పుత్రశోకం నన్ను క్రుంగదీయదా?

ఇక నాకు జీవితంపై తీపి ఎలా మిగులుతుంది? నువ్వు లేని ప్రపంచం నాకు శూన్యమే అవుతుంది. అంతేకాకుండా తల్లి మరణించిన తరువాత పరలోక క్రియల నాచరించటం పుత్రునికి పరమధర్మం గదా? నువ్వు సన్న్యసిస్తే నాకు ఊర్ధ్వగతులు ఎలా కలుగుతాయి? కనుక అన్ని విధాలుగా ఆలోచించు. శాస్త్రమర్యాదను పాటించు.

58. నాయనా! లోకంలో సామాన్యుడు కూడా తల్లిని విడిచి వెళ్లడు. అన్ని విధాలుగా రక్షిస్తూ ఉంటాడు. ఒకవేళ ఎవరైనా మూర్ఖుడొకడు తల్లిని విడిచిపోతే పోతాడుగాక! సర్వజ్ఞుడవైన నీకు అలాంటి మూర్ఖుని మార్గం ఉచితమా? గోవు తన దూడపై అత్యంత ప్రేమను కలిగి ఉంటుంది. దానిని విడిచి ఉండలేదు. కనుక మా తపస్సుల పంటవైన నిన్ను నే నెలా విడిచి ఉండగలను? అంతకన్నా మరణమే మేలు! దయలేనివాడవై తల్లిని, వృద్ధురాలను, వేరే దిక్కులేని దానను, నన్ను విడిచి వెళ్లటం నీకు ధర్మం కాదు.

ఎంతగా విలపించినా శ్రీ శంకరుల మనస్సు కరుగలేదు. అది గమనించిన ఆర్యాంబ, తిరిగి యిలా అన్నది. "వత్సా! సాధుపురుషులు ఇతరుల కష్టాలు చూసి సహించలేరు గదా! అలా అయితే దీనురాలను, వృద్ధురాలను, ఒక్కడే పుత్రుడు గలదానను, విశేషించి తల్లిని అయిన నా పట్ల ఎందుకు దయచూపవు? ఇది నా దౌర్భాగ్యం కాక మరేమంటాను? లేకుంటే సర్వజ్ఞుడవు, దయామయుడవు, అయిన నీకెందుకు నాపై దయ కలుగటం లేదు? ఇది అంతా నా దౌర్భాగ్యమే సుమా!" ఈ విధంగా తల్లి ఆర్యాంబ బాలశంకరుల సమీపాన కన్నీరుమున్నీరుగా విలపించినది.

59. "యదహరేవ విరజేత్ తదహ రేవ ప్రవ్రజేత్" అంటే 'ఎప్పుడు వైరాగ్యం కలుగుతుందో, అప్పుడే సన్న్యసించాలి' అన్నది శ్రుతి వాక్యం. ఎనిమిది సంవత్సరాలు వచ్చేవరకు బాలురు మాలిన్యం లేనివారై ఉంటారు. ఆ తరువాత ప్రపంచవిషయాలందు ప్రవేశిస్తారు. శ్రీ శంకరులకు ఎనిమిదవ సంవత్సరం వచ్చినా, దృఢసంకల్పుడై ఇతర విషయాలందు ప్రవేశింపక ఉన్నారు.

సమస్తం భరించే సర్వేశ్వరునకు సతీదేవి దుఃఖాన్ని పోగొట్టడం అసాధ్యమా? జీవులకు కర్మఫలానుసారం క్షణంలో సుఖదుఃఖాలను పరమేశ్వరుడు కల్పిస్తున్నాడు. పరమేశ్వరుని లీలలు ఎవరు తెలుసుకో గలరు? సుపుత్రుని తలచుకొంటూ దుఃఖిస్తున్న ఆర్యాంబ శ్రీశంకరులు జ్ఞానరూపమైన తన మృదుమధుర సూక్తిజాలంతో శోకమోహాలను పూర్తిగా పోగొట్టి శాంతపరచారు.

60. శ్రీ బాలశంకరులు తన ఎనిమిదవ యేటనే ఆత్మవిచారణ చేయనారంభించారు. నా మనస్సు నివృత్తి మార్గాన్ని కోరుకోవడంచేత మోక్షాన్నే కోరుకొంటున్నదని స్పష్టమవుతున్నది. కనుక ప్రవృత్తి మార్గమైన సంసారాన్ని కోరుకోవడం లేదు. కానీ నా తల్లి ఎలాగైనా ప్రవృత్తి మార్గంలో ప్రవేశపెట్టదలచినది. మోహంచేత నన్ను విడువలేకున్నది. నేను పరమ వైరాగ్యమందున్నా నన్ను విషయ ప్రవృత్తిలోనికి ప్రవేశింప చేయగోరుతున్నది. తన వాదాన్ని సమర్థించే ప్రమాణాలనెన్నో పలుకుచున్నది. ఆమెను కాదని సన్న్యసిస్తే అది ధర్మవిరుద్ధం, శాస్త్రవిరుద్ధం అవుతున్నది. అదీగాక, గురువు నాశ్రయించి సన్న్యసించాలంటే తల్లి అనుజ్ఞ పొందే తీరాలి. నా కిప్పుడు నివృత్తి మార్గాన సన్న్యసించటమూ, అందుకు తల్లి అనుమతి పొందటమూ అనేవి రెండూ అత్యావశ్యకాలై ఉన్నవి. నాకు కర్తవ్యం తోచటం లేదు; మనస్సు వ్యాకులం చెందుచున్నది.

61. శ్రీ శంకరులు ఎలాగైనా తల్లి నుండి అనుమతి పొందాలని కృతనిశ్చయులై ఉన్నారు. ఒకనాడు శ్రీశంకరులు పూర్ణానదిలో స్వేచ్ఛగా మునకలు వేస్తున్నారు. ఈ విధంగా స్నానం చేస్తున్న శ్రీ శంకరుల రెండు పాదాలను మొసలి ఒకటి గట్టిగా పట్టి పీడించసాగింది.

62. అలా శ్రీశంకరులను మొసలి పట్టుకొని తల మాత్రం నీటిలో ముంచనీయక కాళ్లు పట్టుకొని నదీమధ్యానికి ఈడ్చుకొనిపోసాగింది. శ్రీశంకరులు తల్లిని సంబోధించి, "అమ్మా! పెద్ద మొసలి నా రెండు పాదా లను పట్టుకొని నీటిలోనికి ఈడ్చుకొనిపోతున్నది. నా బలం చాలటం లేదు.

కనుక ఒక అడుగు కూడా ముందుకు వేయలేకపోతున్నాను. నన్ను కాపాడువా రెవరు?" అని బిగ్గరగా ఏడ్వసాగారు.

63. బాలుని ఏడుపు విన్న ఆర్యాంబ చేతిలో ఉన్న పనిని అక్కడే వదలి, పూర్ణానదివైపుగా పరుగుపెట్టింది. బాలుడు నీటిలో మునిగిఉండటం చూసి యిలా రోదించసాగింది. "అయ్యో! విచారించగా నాది ఒంటరి జీవితంలా తెలుస్తున్నది. ఎందుకంటే, మొదట నా భర్తే శరణ్యమని నమ్ముకొన్నాను, ఆయన కుమారుని ఉపనయనం కూడా చేయకుండా మూడవ యేడు రాగానే మరణించాడు. పోనీ కుమారుణ్ణి చూచుకొంటూ వాని రక్షణలో ఉండగలనని తలచాను. ఇప్పుడదీ గంగపాలవుతున్నది. ఇక నాకు దిక్కెవరు?"

64. కుమారుడైనా నాకు తోడుగా ఉంటాడన్న నమ్మకంతో జీవిస్తున్నాను. ఇప్పు డా బాలుని కూడా మొసలి నోట కరుచుకొని పోతున్నది. ఇప్పుడిక నాకేమి గతి? నేను జీవితమంతా పరమశివుణ్ణే ఆరాధిస్తూ వచ్చాను. శివుడు శుభాల నిస్తాడంటారు. నా కేమో అన్నీ అశుభాలే జరుగుచున్నవి. ఓ శివా! నీ కిది న్యాయమా? అందరికన్నా ముందుగా నాకే మరణం సంభవిస్తే నాకీ కష్టాలు తెలిసేవి కావు. ఈ విధంగా ఆర్యాంబ నదీతీరం నుండే ఏడవసాగింది.

65. మొసలి బారిన పడిన శంకరులు తల్లివద్ద అనుమతి పొందడానికి ఇదే సరియైన సమయమని తలచి తల్లితో, "తల్లీ! ఈ మొసలి క్రమక్రమంగా నన్ను మ్రింగివేస్తున్నది. క్రమంగా నీటి లోనికి మునిగిపోతున్నాను. నువ్వు సన్న్యసించడానికి అనుమతి యిస్తే ఈ మొసలి నా పాదాలను విడిచిపెడు తుంది. ఇది సత్యం తల్లీ! నేను జీవించటం నీ కిష్టమైతే నేను సన్న్యసించ డానికి అనుమతి ఇవ్వు. నువ్వు అంగీకరిస్తే, నేను సన్న్యసిస్తాను. ఈ మొసలి నన్ను విడుస్తుంది. నేను బ్రతుకుతాను. అలా కాదని, నా మాటలు కపట మని తలచితే ఈ మొసలి కొద్ది క్షణాలలో నన్ను భక్షిస్తుంది. నా జీవితం వ్యర్థమైపోతుంది. కనుక ఓ తల్లీ! నన్ను రక్షించు, రక్షించు" అంటూ ఏడ్చారు. "ఓ తల్లీ! నేను ఈశ్వరానుగ్రహంచే జన్మించానని నీ నుండి విన్నాను.

అట్లా అయితే, ఈశ్వరానుగ్రహంచేత నేను బ్రతికితే సన్న్యసించడానికి అంగీకరిస్తానని ప్రార్థించు. ఇందుకు ప్రమాణం చెబుతున్నాను విను."

66. శ్రీ శంకరులు తనకు సన్న్యాసాశ్రమ స్వీకారానికి అనుమతి ఇవ్వవలసినదిగా రోదిస్తూ తల్లిని కోరగా, ఆర్యాంబకు కాళ్లు చేతులు ఆడ లేదు. ఏం చెయ్యాలో, ఏం మాట్లాడాలో పాలుపోలేదు. సన్న్యాసియైనా ఎక్కడో ఒకచోట ప్రాణాలతో ఉంటాడు. దర్శన భాగ్యమైనా కలుగుతుంది. అలా కాదని ప్రాణాలే పోతే కళ్లతో చూసే భాగ్యం కూడా కలుగదు గదా అని తలచి శ్రీశంకరులు సన్న్యాసం స్వీకరించడానికి అనుమతి ఇచ్చింది. అంతట శ్రీ శంకరులు ప్రవృత్తి బంధాల నుండి విముక్తుడయ్యారు. తనను కృతకృత్యునిగా తలచారు.

67. శ్రీశంకర భగవత్పాదులు తల్లి వద్ద నుండి అనుమతి పొందిన వెంటనే మానసిక సన్న్యాసం స్వీకరించారు. సన్న్యాసం స్వీకరించగానే మొసలి కూడా శంకరుల పాదాన్ని విడిచింది. తరువాత శ్రీశంకరులు నదీ తీరానికి చేరి తన అభీష్టం నెరవేరినందుకు ఎంతో సంతోషించారు. వెంటనే తల్లి వద్దకు చేరి యిలా అన్నారు: "అమ్మా! అజ్ఞానమనే పెద్ద మొసలిచే పట్టుకొనబడినవారు సంసారసముద్రంలో మునిగిపోతారు. దానినుండి బయటపడదలచితే సన్న్యాసమనే నౌకను ఆశ్రయించాలి.

68. తల్లీ! నేను సన్న్యాసినయ్యానని విచారించవద్దు. నేను సన్న్యసించినా కూడా, ఒక పుత్రుడు తల్లికి చేయవలసిన కార్యాలన్నీ చేస్తాను. అంతే కాదు, నువ్వు ఏం ఆజ్ఞాపిస్తావో వాటన్నింటినీ శిరసావహిస్తాను. ఈ విష యంలో ఏ విధమైన సందేహాలు పెట్టుకోవద్దు. మీ సంరక్షణ విషయంలో కూడా తగిన ఏర్పాట్లు చేస్తాను. అదెలాగంటే, నా తండ్రి నుండి సంక్ర మించిన ధనమంతా దాయాదుల కిస్తాను. నీకు కావలసిన వసతులన్నీ వారు ఏర్పాటు చేస్తారు. నేను సన్న్యాసినవడంచే ఇక్కడ ఉండటం ఎంత మాత్రమూ తగదు. కనుక నన్ను ఆశీర్వదించి ముందుకు సాగిపోవడానికి అనుజ్ఞ ప్రసాదించు.

69. తల్లీ! నువ్వు వ్యాధిచేత బాధపడితే, జ్ఞాతులు నీకు అన్ని విధాలుగా సేవలు చేయగలరు. మరణించినా దహనసంస్కారాది క్రియలను కూడా వారే చేయగలరు. వారందరు జ్ఞాతులవటంచేత నీపట్ల సహజ ప్రేమతో నీకు సేవలు చేస్తారు. అలా కాదంటే, లోకనిందకు భయపడి అయినా నిన్ను పోషిస్తారు. సద్గతి పొందిన తర్వాత పరలోక క్రియలు కూడా చక్కగా చేస్తారు."

70. శ్రీశంకరుల పలుకులు విన్న ఆర్యాంబ యిలా అంది: "నాయనా! నిన్ను మొసలి పట్టి పీడించినప్పుడు నువ్వు సన్న్యాసాశ్రమం తీసుకోవడానికి అనుమతించాను. నీ అభీష్టమే నాకూ పరమ సంతోషం. మరణానంతరం నాకు దేహసంస్కారాలు జ్ఞాతులు చేస్తారని చెబుతున్నావు. దిక్కులేని వారికే పరులు దేహసంస్కారాలు చేస్తారు. అట్టి ఏర్పాటు నాకు అంగీకారం కాదు. ఎక్కడ ఉన్నా, నువ్వే ఆ సంస్కారాలను చేయాలి. 'నేను సన్న్యాసిని గదా, ఇది లోకవిరుద్ధం గదా' అని ఆలోచించవద్దు. ఎందుకంటే నువ్వు సాక్షాత్పరమశివుడవు. సర్వస్వతంత్రుడవు. అదీగాక నేను అనేక కఠినమైన నియమాలతో తపస్సు చేసి పరమశివుని మెప్పించి నిన్ను పొందాను. భగవంతుడవైన నీ చేతుల మీదుగా నా దేహ దహన సంస్కారాలను తప్పక నిర్వర్తించు. ఇతరులచేత దహన సంస్కారాలు చేయించటం తగదు. ఇదే నా చివరి కోరిక."

71. అంతట శ్రీశంకరులు తల్లి అభీష్టాన్ని తెలుసుకొని యిలా అన్నారు: "ఓ జననీ! నేను ఎక్కడ ఉన్నా నీ అభీష్టాన్ని నెరవేరుస్తాను. సంశయించవద్దు. తల్లీ! పగటి వేళగాని, రాత్రి వేళగాని, ఏ సమయంలోనైనా నువ్వు అనారోగ్యంచే బాధపడుతున్నా, అవసానకాలం సమీపించినా నన్ను తలచుకో. నేను ఎంత దూర ప్రాంతాలలో ఉన్నా, చేసే కార్యాలు ఎంతటి కఠినమైనవైనా అన్నిటినీ అక్కడకక్కడే వదలి నీ వద్దకు వచ్చి వాలతాను. తల్లి అభీష్టం నెరవేర్చటం కంటే శ్రేష్ఠమైనది లోకంలో వేరొకటి ఉండదు. మరణించిన తరువాత దహన సంస్కారాలు కూడా నేనే చేస్తాను.

నన్ను నమ్ము. వీడు సన్న్యాసి, దయలేనివాడై తల్లిని విడిచి వెళుతున్నాడని తలచవద్దు. నీ ముద్దుల కుమారుడను. నీకు అత్యంత ప్రీతిపాత్రుడను. నా మాటలయందు విశ్వాసముంచు" అని శంకరులు తల్లికి ప్రార్థనాపూర్వక అభయం ఒసగారు.

72. శ్రీశంకరులు తిరిగి తల్లితో ఇలా పలుకుతున్నారు: "జననీ! నువ్వు కోరిన కోరిక లన్నిటినీ నెరవేరుస్తాను. ఏకైక కుమారుడు, అతడు సన్న్యసించి దేశాంతారాలకు పోయి వృద్ధురాలైన తల్లిని నిరాదరణకు గురిచేసినాడని ఎన్నటికీ తలచవద్దు. నేను నీ ప్రక్కనే ఉంటే ఎలాంటి సేవలు చేస్తానో, దూరంగా ఉండి కూడ దానికి నూరురెట్లు అధికంగా సేవిస్తాను. కనుక ఓ తల్లీ, నన్ను మన్నించు. నా ప్రయాణానికి ఆజ్ఞ ఇవ్వు" అని వేడుకొన్నారు. ఎంతటి సర్వజ్ఞుడైనా తల్లి జీవించి ఉండగా ఆమె అంగీకారం పొందే సన్న్యసించాలి.

73. శ్రీశంకరులు తల్లి బాధ్యతను జ్ఞాతుల సంరక్షణలో ఉంచి వారితో ఇలా పలికారు: "నాయనలారా! నా తండ్రియైన శివగురు నా చిన్నతనంలోనే పరమపదించారు. అప్పటి నుండి నా తల్లి నా మీదనే ప్రాణాలు పెట్టుకొని జీవిస్తున్నది. నేను సన్న్యసించి సద్గురుని ఉపదేశం పొందడానికి ఈమెను వదలి బహుదూరదేశాలకు పోతున్నాను. ఆమె భర్తకు దూరమై పుత్రుడు లేక బహు దీనురాలై ఉంది. అట్టి పరిస్థితులలో ఈమెను మీ సంరక్షణలో ఉంచి వెళుతున్నాను. ఆమె మనస్సుకు ఎట్టి కష్టం కలుగకుండా పరమప్రేమతో సంరక్షించవలసిన"దని జ్ఞాతులను ప్రార్థించారు.

74. శ్రీ శంకరులు మాతృపోషణ బాధ్యతలను జ్ఞాతులకు అప్పగించి వారి చేతులు పట్టుకొని నమస్కరిస్తూ, నన్ను ఆదరించినట్లుగానే నా తల్లిని కూడా ఆదరించమని ప్రార్థించారు. తనను విడిచి బ్రతుకవలసివచ్చినందుకు కన్నీరుమున్నీరుగా ఏడుస్తున్న తల్లికి వినమ్రుడై నమస్కరించి ఆమె సకల సంరక్షణ మీ అధీనమని మాటమాటకు చెబుతూ జ్ఞాతుల చేతులలో పెట్టి అప్పగించారు.

75. శ్రీశంకరుల మాతృదేవి పూర్ణానదిలో స్నానం చేయడానికి చాలాదూరం నడచిపోవలసి ఉండేది. ఆమెకు సౌకర్యం చేయాలని తలచి పూర్ణానదిని మిక్కిలి ప్రాథేయపూర్వకంగా స్తుతించి ఆమె అనుగ్రహం పొందారు. శంకరులను అనుగ్రహించిన ఆ నది తన ప్రవాహ దిశను మార్చు కొని శ్రీశంకరుల ఇంటి ప్రక్కగా ప్రవహించసాగింది. అలా ఆ నది తన దిశ మార్చుకొని ప్రవహించటంచేత మార్గమధ్యంలోని ముకుందస్వామి దేవాలయం శిథిలమై పూర్ణానదిలో పడిపోయేట్లున్నది. శ్రీశంకరులు ఆ దేవాలయం పూర్ణానదీ ప్రవాహంచే నష్టపడకుండేట్లు ఉద్ధరింపదలచారు. ఆ విధంగా ఇకపై దైవానుగ్రహం కూడా పొందబోతున్నారు.

76. పూర్ణానదిలో వర్షాకాలం నీరు అధికంగా వచ్చి చేరి అలల ఉద్ధృతి పెరగడం కద్దు. అలల తాకిడికి శ్రీ కృష్ణ దేవాలయ గర్భగుడిలోనికి నీరు ప్రవహించి గుడి క్రుంగిపోసాగింది. అందుచేత ఆ దేవాలయం పతనావస్థకు చేరింది.

77. శ్రీశంకరులు తల్లియైన ఆర్యాంబ పాదాలకు పలుమార్లు మ్రొక్కి, మిక్కిలి కష్టంతో ఆమెను అంగీకరింపచేశారు. లోకాన్ని ఉద్ధరించా లనే దృఢసంకల్పంతో సన్న్యాసి బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాడు. అంతలోనే, శ్రీముకుందస్వామివారు అశరీరవాణిగా శ్రీశంకరులతో ఇలా పలికారు:

78. “ఓ శంకరా! నువ్వు సత్యసంకల్పుడవు. మాతృ సేవాపరాయణుడవు. పరోపకారమే పరమ ధర్మంగా పెట్టుకున్నవాడవు. ఎక్కడో దూరాన ప్రవ హించే పూర్ణానదిని నీ తల్లి సౌకర్యం కోసం దగ్గరగా ప్రవహింపచేశావు. అంతవరకు బాగానే ఉన్నది. అందువల్ల మీ కందరికీ ఉపకారమే జరిగినది. కానీ, ఈ మహానది అలలచేత నన్ను నెట్టివేస్తున్నది. అందువలన నా ఆలయం కదలి క్రుంగిపోయింది. నేడో రేపో నదిలో కలిసిపోవడం తథ్యం. నువ్వు సమర్థుడవే అయినా దేశాంతరం పోతున్నావు. ఇక నన్నెవరు ఉద్ధరిస్తారు? నువ్వు దీని కేదైనా మార్గం నాలోచించు.”

79. అశరీరవాణి శ్రీశంకరుల నుద్దేశిస్తూ “ఈ కార్యం చేయాలి” అని నొక్కి చెప్పటంచేత శ్రీశంకరులకు తన కర్తవ్యం బోధపడింది. జగద్గురువులైన శ్రీశంకరులు తమ స్వహస్తాలతో అంగభంగ మేమీ కలుగకుండ మెల్లగా శ్రీకృష్ణ విగ్రహాన్ని గైకొని చలింపనీయక, నదిచే ఎన్నటికీ బాధ కలుగని రీతిలో నదీతీరానికి కొద్ది దూరంలో దృఢంగా ప్రతిష్ఠించారు. “ఓ కృష్ణా నువ్వు ఇక్కడే సుఖంగా బహుకాలముంటావు.”

80. శ్రీశంకరులు సంసారసాగరం నుండి విముక్తులు కాగోరి, శబ్దాది విషయ సుఖాలలో ఆసక్తుడుకాక అనాత్మ బంధాల నన్నీ వదలి మోక్షం పొందడానికి యుక్తమైన సన్న్యాసాన్ని స్వీకరించారు. అందులకై బంధువుల, మిత్రుల మాతృదేవి నుండే గాక శ్రీకృష్ణదేవాలయాన్ని ఉద్ధరించి శ్రీముకుంద స్వామి నుండి కూడా అనుజ్ఞ పొందారు. దేశాంతరాలకు పోవడానికి సంసిద్ధు డయ్యాడు.

81. శ్రీ అగస్త్య మహాముని వలన తాను సాక్షాత్తూ పరమశివుడని యెరిగిన శ్రీ బాలశంకరులు లోకంలో జ్ఞానకాండ నుద్ధరింప యికపై జరుగ బోయే కార్యక్రమాన్ని గూర్చి ఆలోచించసాగారు. తల్లియొక్క, శ్రీకృష్ణుని యొక్క పరిపూర్ణమైన అనుగ్రహాన్ని పొంది ఏకాంతంలో పరబ్రహ్మమందు రమింప నిర్జన ప్రదేశాలను కోరారు.

‘కృష్ణ’ అన్న పదంలో ‘కృషి’ అనే శబ్దం సకల హృదయ క్షేత్రాలను సూచిస్తుంది, “ణ” అనే శబ్దం కేవలం ఆనందాన్ని సూచిస్తున్నది. అంటే ఆనందస్వరూపుడే ఆ కృష్ణభగవానుడు. ఆయనే పరబ్రహ్మ. కనుక పరబ్రహ్మ మైన శ్రీకృష్ణునియందు మనస్సు నిలిపి సర్వప్రపంచాన్ని స్వస్వరూపమైన పరబ్రహ్మగా చింతిస్తూ ఇల్లు వదలి దేశాంతరాలకు వెళ్లారు.

82. కామ మంటే విషయబుద్ధి. సకల సంసారబంధాలకు ఇదే బీజం. ఇది మోక్షానికి ద్వారంలా అడ్డు నిలుస్తుంది. ఇటువంటి విషయ వాంఛలన్నీ శ్రీ శంకరులకు బాల్యం నుండే దూరంగా ఉన్నవి. అంతేగాక

శ్రీ శంకరులు మహేశ్వరుని అవతారమవటంచే కామం దగ్గరకు రాలేక పోయింది. సూర్య, చంద్ర, అగ్ని అనే త్రేతాగ్నులే పరమశివుని మూడు నేత్రాలై ఉన్నవి. పరమశివుడు తన మూడవ నేత్రంతో మన్మథుణ్ణి భస్మం చేసిన విషయం జగద్విదితమే. ఇక కామం పరమశివుని అవతారమైన శంకరుల నెలా తాకగలదు?

83. మహేశ్వర అవతారుడైన శ్రీశంకర భగవత్పాదులు సకల దేవతల కన్నా, పరమశివుని కన్నా కూడా పరమపవిత్రులు. సర్వదేవతలు మన్మథుని ప్రభావానికి లోబడినవారే. బ్రహ్మదేవుడు విషయాసక్తిచేత కుమార్తె యైన సరస్వతినే కామించాడు. చంద్రుడు గురుపత్నియైన తారను మోహించాడు. సాక్షాత్తూ పరమశివుడే విష్ణుమాయకు లోనై, పార్వతి ప్రక్కనే ఉన్నా కూడా, మోహిని వెంటపడ్డాడు. ఈ విధంగా సమస్త దేవతలు విషయాసక్తులై దోషపూరిత చరితులైనారు. కానీ, యిప్పు డీ శంకరాచార్య నామధేయులు, సన్న్యాసాశ్రమంలో ఉన్న యతిపుంగవులు జితేంద్రియులు, పరిశుద్ధులు, పరమ పవిత్రులు. శ్రీ శంకరులు మాత్రమే కాముని (కామాన్ని) అవలీలగా జయించారు.

84. విజేతలలో మన్మథుడు అగ్రగణ్యుడు. ఆతడు దేవతలను, మానవులను, సమస్త జీవరాసులను జయించాడు. ఈతడు అయిదు బాణాలు ప్రయోగిస్తాడని ప్రసిద్ధి. అవి కూడా వాడియైనవి కావు. పూలతో చేసినవి. అతడు వాటిని వాడే విధానం ఎట్లాంటిదంటే-

నిష్పత్రాకురుత - అంటే అట్టి బాణాలు ఎదుటి వ్యక్తిని దూసుకొని, ఆవలి ప్రక్కకు పోతాయి. వీటిని రాక్షసులపై ప్రయోగిస్తాడు.

సపత్రాకరోత్ - అంటే యీ బాణం శరీరాంతర్భాగాలందు నాటుకొంటాయి. సహ నిష్కలాకృత తరాం, అంటే గంధర్వ విద్యాధరాదులపై ఈ బాణాన్ని ప్రయోగిస్తాడు; ఈ బాణాన్ని దేవతలపై ప్రయోగిస్తాడు. ఇక మానవుల విషయం చెప్పాలా? ఈ విధంగా దేవతలు, రాక్షసులు, మహర్షులు, మానవులు మొదలైన వారందరినీ జయించి ముల్లోకాలు

జయించాడు. త్రిమూర్తులు కూడా ప్రకృతిశక్తికి వశులైనారు. కనుక ఎట్టి దోషమూ లేకుండుటకై మహేశ్వరుడు శ్రీదక్షిణామూర్తి అవతారంలో సనకాదుల నుద్ధరించి దోషరహితుడు గాను, పావనమూర్తిగాను వెలుగొందు చున్నాడు.

85. వేదాంతజ్ఞాన సుస్థిరతకు ఆత్మానుభూతి మూలకారణం. పరమ వైరాగ్యవిభూషితులైన శ్రీశంకరులను శమదమాదిమహోత్తమగుణాలన్నీ ఆశ్రయించినవి. సూర్యోదయం కాగానే కిరణాలు సూర్యుని ఆశ్రయించేట్లు లోకోత్తరగుణాలన్నీ శ్రీశంకరుల నాశ్రయించినవి.

శాంతి అంటే అంతరింద్రియ రూపశాంతి శ్రీశంకరుల మనస్సును స్వాధీనపరచుకొన్నది. అజ్ఞానులకు సర్వవ్యాపారాలు మనస్సుకు లోబడి ఉంటాయి. అంటే మనస్సు ఆడించినట్లు ఆడుతుంటారు. జ్ఞానుల విషయం అలాగాక వారి సద్వ్యాపారాలకు మనస్సు లోబడి ఉంటుంది. శ్రీశంకరులు చిత్తాన్ని వశపరచుకొని, బుద్ధివ్యాపారాలను నిరోధించి పరమ సాధనమైన శమంతో విభూషితుడయ్యారు. శాంతి = వేదాంత శ్రవణం తప్ప మిగిలిన అంతరింద్రియ వ్యాపారాలన్నిటిని నిగ్రహించటం. దీనినే శమమని కూడా అంటారు. శాంతిదాంతి కూడ శంకరుల నలంకరించాయి. [దాంతి = దృశ్యానికి సంబంధించిన బాహ్యేంద్రియ వ్యాపారాలన్నింటినీ నిష్ఫలత్వ బుద్ధితో నిరోధించటం.] సకల బాహ్యేంద్రియ నిగ్రహం, శాంతి మల్లే శ్రీ శంకరులకు వశమై సర్వవ్యాపారాలను నిరోధించింది. ఇదే స్థితప్రజ్ఞుని లక్షణమని భగవద్గీత చెబుతోంది.

86. నిస్సంగమైన పరబ్రహ్మమందు రమించటమే ముక్తికాంత తోటి సమాగమమని వేదాంతశాస్త్రం వచిస్తున్నది. శ్రీశంకరులు కూడా నిస్సంగవృత్తి అనే దివ్యకాంతతో కలిసి అపరిమితానందం పొందుతున్నారు. పరమ వైరాగ్యశీలురై శ్రీశంకరులు 1. పరమపవిత్రులైన పుణ్యపురుషులుండే ప్రదేశాలనే సందర్శించసాగారు. 2. దైవవశాత్తు దొరికిన దేదో తిని దాని తోనే తృప్తి చెందుతున్నారు. 3. 'నాది, నేను' అనే మమకారాన్ని వదలి

జీవించసాగారు. 4. ఎల్లవేళలందు మనస్సులో భగవంతుణ్ణే చింతించసాగారు. ఈ విధంగా ఒక చోటనే స్థిరంగా ఉండిపోక సర్వత్రా బ్రహ్మభావం కలిగి విహరించసాగారు. ఈ విషయాన్నే భగవద్గీత "అనికేతస్థిరమతిః" అని బోధించింది.

87. శ్రీశంకరులు దేశాటనం చేస్తూ మార్గమధ్యంలో కారడవులను, స్వచ్ఛమైన నీటితో పారుతున్న నదులను, పర్వతాలను, అందమైన పట్టణాలను, అనేక వేషభాషలతో కూడిన మనుష్యులను, రకరకాలైన జంతుజాలం మొదలైనవన్నీ దర్శించారు. దేశ పరిస్థితులను, మనుష్యుల ఆహారవ్యవహారా లను పరిశీలిస్తూ ప్రయాణం కొనసాగించారు. ఇదంతా పరిశీలించిన శ్రీశంకరులు 'ఆహా! ఇదంతా పరమేశ్వరుడు తన మాయాశక్తిచేత సర్వాన్ని సృష్టిస్తున్నాడు. ఇదంతా ఆ సర్వేశ్వరుని విభూతియే; అంతా పరబ్రహ్మ స్వరూపమే' అని తలచారు.

88. శ్రుతి అనే గోవును భేదవాదులు (ప్రతివాదులు) తమ తమ సంకుచిత ధోరణులతో హింసించసాగారు. ఆ హింసామార్గంలో ప్రయాణించిన ఆ గోవు ఎంతో కృశించిపోయి ముదుసలి కూడా అయింది. విరుద్ధమత ప్రచారకులు వేదానికి వక్ర భాష్యాలు చెబుతూ, అదే సరియైన అర్థా లని జనులను తప్పు దోవను పట్టిస్తున్నారు. అందుచేత వేదార్థాలు తప్పు దోవల పడి వేదం మరుగున పడిపోయింది. దారితప్పిన వేదాలను, శ్రుతి అనే గోవును తిరిగి సన్మార్గంలో నడిపించడానికే పరమశివుడు శ్రీశంకరులుగా అవతరించారు. శ్రుతుల యథార్థ తత్త్వమైన అద్వైతత్త్వాన్ని పునరుద్ధరించారు. అందుకోసం శ్రీశంకరులు దండము నొకటి చేత ధరించారు. పశువుల వంటి మనుష్యులను సరియైన దారిలో నడిపించడానికి దండం అవసరమే కదా! ఆ విధంగా అద్వైతత్త్వాన్ని చేతబూని శ్రీశంకరులు జగద్గురువులయ్యారు.

89. అజ్ఞానంలో పడి కొట్టుకొంటున్న జనులను ఉద్ధరించడమే శ్రీ శంకర మునివరుల అవతార రహస్యం కనుక, ఆ మహాత్ముడు జ్ఞానదండాన్ని ధరించి, తప్పు మార్గాన ప్రయాణించే మతప్రచారకులను

ఆ మార్గం నుండి తప్పిస్తున్నారు. వేటకు పోయేవారు తమతో వేట కుక్కలను కూడా తీసుకొని పోతారు. జంతువులను వేటాడడానికి వాటిని స్వేచ్ఛగా వదలుతారు. అప్పు డవి పెద్దగా అరుచుకుంటూ, అడవి నాలుగు మూలలా తిరిగి మృగాలు కనిపించగానే భయంకరంగా వాటి మర్మ స్థానాలందు కరచి తమ నాలుకకు పట్టిన దురదను పోగొట్టుకొంటాయి. అదే విధంగా పాషండమతస్థులు తామే గురువులమని ప్రగల్భాలు పలుకుతూ సాధు స్వభావం కలిగి సన్మార్గాన పోయే వైదికులను పీడిస్తుంటారు. శుష్కవాదాలచే వేదార్థాలను తప్పు దోవన పట్టించి, కుతర్కాలతో వారి నాలుకలకు పట్టిన దురదను తీర్చుకొంటుంటారు. వైదికుల ప్రసంగాలే అడుగంటినవి. కనుకనే ఆదిశంకరులు అవతరించారు. తిరిగి వైదిక మార్గాలు ప్రవర్ధమానమయ్యాయి.

90. శ్రీశంకరులు నర్మదా నదీతీరాన ఉన్న శ్రీ గోవిందయతీశ్వరుల ఆశ్రమాన్ని చేరుకొన్నారు. అప్పుడు సూర్యుడు అస్తమించే వేళ అవడంతో ఆకాశమంతా కాషాయపు రంగు విస్తరించుకొని ఉంది. అలాంటి సమయంలో బాలశంకరులు కాషాయ వస్త్రం ధరించి తేజస్సుతో ఆశ్రమంలో ప్రవేశించారు.

91. నర్మదానదీతీరాన్ని చేరిన శ్రీశంకరులు నదిలో స్నానం చేసి, అనుష్ఠానాలు పూర్తి చేసుకొని, ఆశ్రమంలో ప్రవేశించారు. అక్కడ వృక్షాలకు కట్టిన దణ్ణెములపై జింక చర్మాలు, కౌపీనాలు, నారచీరలు తగిలించి ఉండటం చూచి అదొక మునుల ఆశ్రమమని తలచారు.

92. అలాంటి ఆశ్రమంలో శ్రీ గోవిందభగవత్పాదులకు శిష్యుడయి బ్రహ్మోపదేశం పొందాలని నిశ్చయించుకొన్నారు. తరువాత ఆ తపస్వియైన గోవింద యతీశ్వరులు తపస్సు చేసుకొనే గుహను చూశారు. ఆ గుహలోనికి పోయే మార్గం బెత్తెడు రంధ్రంలా (చూపుడు వ్రేలు బొటన వ్రేలు యీ రెండూ కలిపితే ఆ మధ్య నుండే పరిమితి) ఉన్నది. అలాంటి రంధ్రం గుండా ప్రవేశించి శ్రీ గోవిందయతీశ్వరులు తపస్సు చేసుకొనే స్థలాన్ని చేరుకొన్నారు.

93. శ్రీ గోవిందభగవత్పాదాచార్యులు తన్ను చేరిన ముముక్షువులకు సంసారతాపాలు తొలగించి బ్రహ్మతత్త్వం ఉపదేశిస్తూ మహానందాన్ని కలిగిస్తూంటారు. అట్టి మహాత్ముడు తపస్సు చేసుకొనే గుహను దర్శించి శ్రీశంకరులు తన జన్మసార్థకమయిందని తలచారు. బ్రహ్మోపదేష్టయైన సద్గురువు లభించాడు గదా అని సంతసించారు. ఆ గుహకు బయటనుండి చేతులు జోడించి నమస్కరిస్తూ ప్రదక్షిణలు చేశారు. తపోధను లెందరో వచ్చి శ్రీ గోవిందయతీశ్వరుల దర్శనానికై యీ గుహవద్ద నిరీక్షిస్తూం టారు.

ఆ గోవిందయతీంద్రులను భావగర్భితమైన తన శ్లోకాలచే స్తుతించారు. శ్రీ శంకరులు సాక్షాత్తూ మహేశ్వరుడే అయినా, లోకమర్యాదను పాటించి తాను కూడ శిష్యుడయ్యాడు. గురుదేవుల వద్ద శిష్యుడైనవాడు ఏ విధంగా వినయం, విధేయత, భక్తిప్రపత్తులతో మెలగాలో లోకానికి బోధించారు.

94. శ్రీ శంకరాచార్యులు తమ గురుదేవులైన శ్రీ గోవిందయతీంద్రులను పరమభక్తితో, సాక్షాత్తూ ఆదిశేషునిగా, పతంజలిగా నిర్ణయించి స్తుతిస్తున్నారు.

ఓ గురుదేవా! లోకనాథుడైన శ్రీ మహావిష్ణువునకు పాన్పువై సుఖనిద్రపోయేట్లు చేసే ఆదిశేషుడవు నీవే! మహేశ్వరునికి పాదభూషణమై శోభించే ఆదిశేషుడవు నీవే! ఇలా హరిహరు లిరువురి అపారదయకు పాత్రు డైనవాడవు. ఓ గురుదేవా! ఈ భూదేవి అపారమైన సముద్రాలు, మహోన్నత మైన పర్వతాలు అనేక జీవరాసులు, వస్తు సముదాయాలను భరిస్తున్నది. అట్టి భూమాతను అవలీలగా నీ శిరస్సున ధరించి భరిస్తున్న ఆదిశేషుడవు నీవే! ఓ గురుదేవా! తమకు నమస్కరిస్తున్నాను. శ్రీ ఆదిశేషుడే లోకమందు బ్రహ్మజ్ఞానాన్ని వ్యాపింపచేయడానికి శ్రీగోవింద యతీంద్రులనే పేర భూమిపై అవతరించి ఉన్నాడు. ఓ దేశికేంద్రస్వామి, పరమ దయానిధీ, అట్టి మిమ్మల్ని సేవిస్తాను. నన్ను అనుగ్రహించండి.

95. మహాత్మా! పూర్వం ఆదిశేషుడు బ్రహ్మ విద్యావ్యాప్తికై వేయి ముఖాలతో అవతరించి తన శిష్యులకు వ్యాకరణశాస్త్రం బోధింప తలపెట్టాడు.

అంతట శిష్యులందరు భీకరమైన వేయి ముఖాలను గాంచి భయభ్రాంతులయ్యారు. తరువాత దయామయుడైన ఈ ఆదిశేషుడు ఒకే ముఖం దాల్చి పతంజలి అనే నామం స్వీకరించి వ్యాకరణ 'మహాభాష్యా'న్ని ప్రవచించాడు. ఆ పతంజలి మహర్షియే మీరుగా అవతరించి ఉన్నారని భావిస్తాను.

96. పాతాళంలో ప్రవేశించిన ఆదిశేషుడు వేదవేదాంగాలన్నీ అధ్యయనం చేసి, తరువాత భూలోకంలో జనులకు ఉపకారం చేయదలచి యోగశాస్త్రాన్ని, వ్యాకరణ భాష్యాలను రచించాడు. పతంజలి అంటే ఆ ఆదిశేషుడే! మరల అట్టి పతంజలి మహర్షే గోవిందనాథ నామాన్ని దాల్చి మీరుగా అవతరించారు. అట్టి సద్గురుమూర్తిని ఆశ్రయిస్తున్నాను.

97. ఓ గురువర్యా! మీరు పతంజలి అవతారమే కాక, వేదవ్యాసుని కుమారుడైన శ్రీ శుక మహర్షికి, శ్రీ గౌడపాదాచార్యులవారికి ప్రియశిష్యులై ఉన్నారు. అటువంటి గౌడపాదాచార్యుల వారి ప్రియశిష్యులైన మిమ్మల్ని శరణు జొచ్చాను. నేను అనన్యగతితో తమ వద్ద బ్రహ్మనిష్ఠను పొందడానికి వచ్చాను, నన్ననుగ్రహించండి.

98. శ్రీశంకరుల స్తుతి వాక్యాలను చక్కగా ఆలకించిన శ్రీగోవింద యతీంద్రుడు, ప్రసన్నదృష్టితో 'నీ వెవ్వడవు' (కస్త్వమితి) అని ప్రశ్నించారు. మహామహితాత్ముడు, అద్వైతమూర్తి అయిన శ్రీబాలశంకరులు ఈ విధంగా పలికారు.

99. శ్రీ శంకరులు స్వయంప్రబోధ జ్ఞానంచేత, అఖండపరబ్రహ్మ స్వరూపులు కనుక, గురుదేవులకు తన నిజస్వరూపాన్ని ఈ క్రింది పది శ్లోకాలలో తెలుపుతున్నారు. ఈ శ్లోకాలే 'నిర్వాణదశకం' మనీ 'దశశ్లోకీ' అనీ ప్రసిద్ధి చెందాయి.

**న భూమిః, నతోయం, న తేజో, న వాయుః,**<br>
**న ఖం, నేంద్రియం వా, న తేషాం సమూహః,**<br>
**అనైకాంతికత్వాత్, సుషుప్త్యేకసిద్ధః**<br>
**తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్. 1**

నేను - భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, ఇంద్రియం, ఇంద్రియ సమూహం - ఇవేవీ కాను. కారణం వీటి అనైకాంతికత్వం. అంటే ఇవేవీ ఏకాంతికత్వం - ఏకత్వస్థితి కలిగినవి కావు. మార్పునకు లోనయ్యే స్వభావం కలిగినవి; వినాశ శీలమైనవి. అయితే నేను సుషుప్తికి (గాఢనిద్రకు) ఏకమాత్ర సాక్షిగా సిద్ధుడనై ఉన్నాను. కనుక ద్వైత వస్తువులన్నీ తొలగిపోగా అవశిష్టమైన - మిగిలినదేదో అదే అద్వితీయమైన - ఏకమైన - నేను. ఆ నేను కేవల శివ (శుభ-జ్ఞాన) స్వరూపుడను.

**న వర్ణా న వర్ణాశ్రమాచారధర్మా**
**న మే ధారణా ధ్యానయోగాదయోఽపి,**
**అనాత్మాశ్రయాహంమమాధ్యాసహానా -**
**త్తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్. 2**

నాకు బ్రాహ్మణాది జాతులు లేవు. జాతులకు, బ్రహ్మచర్యాది ఆశ్రమాలకు సంబంధించిన ఆచార ధర్మాలు లేవు. ధారణాయోగం, ధ్యానయోగం మొదలైనవి లేవు. అంటే బాహ్యలక్షణాలు గాని, అంతఃకరణ లక్షణాలు గాని ఏవీ నాకు లేవని అర్థం. దీనికి కారణం అనాత్మ (అవిద్య)కు ఆశ్రయమైన అహం-మమ (నేను-నాది) అనే అధ్యాస (భ్రాంతి) తొలగిపోవడమే. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన కేవల శివస్వరూపుడనే నేను.

**న మాతా, పితా వా, న దేవా, న లోకా,**
**న వేదా, న యజ్ఞా, న తీర్థం బ్రువంతి,**
**సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వాత్,**
**తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్. 3**

నాకు తల్లి లేదు, తండ్రి లేదు; దేవతలు లేరు, లోకాలు లేవు, వేదాలు యజ్ఞాలు లేవు, తీర్థం లేదు. దీనికి కారణం గాఢ నిద్రలో అతిశూన్యస్థితి కూడా లేకపోవడం. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన నేను కేవల శివస్వరూపుడను.

**న సాంఖ్యం, న శైవం, న తత్పాంచరాత్రం,**
**న జైనం, న మీమాంసకాదేర్మతం వా,**
**విశిష్టానుభూత్యా విశుద్ధాత్మకత్వాత్**
**తదేకో౽వశిష్టః శివః కేవలో౽హమ్. 4**

నాకు – సాంఖ్యం, శైవం, పాంచరాత్రం, జైనం, మీమాంసకం మొదలైన మతాలు ఏవీ లేవు. దీనికి కారణం వీటికంటే విశిష్టమైన అనుభూతితో విశుద్ధమైన ఆత్మ సిద్ధించి ఉండడం. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన నేను కేవల శివస్వరూపుడను.

**న శుక్లం, న కృష్ణం, న రక్తం, న పీతం,**
**న పీనం, న కుబ్జం, న హ్రస్వం, న దీర్ఘమ్,**
**అరూపం తథా జ్యోతిరాకారకత్వాత్**
**తదేకో౽విశిష్టః, శివః కేవలో౽హమ్. 5**

నాకు తెలుపు, నలుపు, ఎరుపు, పసుపు (రంగులు) లేవు. మరుగుజ్జుతనం, బలుపు, పొట్టి, పొడుగు (కొలతలు) లేవు. దీనికి కారణం అరూపం – రూపమే లేకపోవడం; అంతేగాక రూపాన్ని తోపింపజేసే సూర్యాది జ్యోతులకు ఆకారాన్నిచ్చింది కూడా అదే కావడం. కనుక అద్వితీయంగా మిగిలిన ఆ కేవల శివస్వరూపమే నేను.

**న జాగ్రత్, న మే స్వప్నకో వా సుషుప్తిః**
**న విశ్వో, న వా తైజసః, ప్రాజ్ఞకో వా,**
**అవిద్యాత్మకత్వాత్త్రయాణాం తురీయం**
**తదేకో౽వశిష్టః, శివః కేవలో౽హమ్. 6**

నాకు జాగ్రత్, స్వప్న, సుషుప్తులు లేవు. వాటిని అభిమానించే విశ్వుడను గాను. తైజసుడను గాను, ప్రాజ్ఞుడను గాను. దీనికి కారణం – ఈ త్రయం అవిద్యా కల్పితం కావడం. నేను వీటికి అతీతుడనైన తురీయుడను (నాల్గవ వాడను) కనుక ఆ మిగిలిన అద్వితీయమైన కేవల శివస్వరూపుడనే నేను.

**న శాస్తా న శాస్త్రం, న శిష్యో, న శిక్షా,**
**న చ త్వం, న చాహం, న చాయం ప్రపంచః,**
**స్వరూపావబోధాద్వికల్పాసహిష్ణుః -**
**తదేకో౽ వశిష్టః శివః కేవలో౽ హమ్. 7**

నాకు గురువు, శాస్త్రం, శిష్యుడు, శిక్షణ - ఇవేవీ లేవు. నువ్వు లేవు. నేను లేను. ఈ ప్రపంచమే లేదు. దీనికి కారణం తన సహజస్థితిని తెలుసుకోవటం. అది ఈ విభేదాలను పొందని స్థితి. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన కేవల శివస్వరూపమే నేను.

**న చోర్ధ్వం, న చాధో న చాంతః, న బాహ్యం**
**న మధ్యం, న తిర్యక్, న పూర్వా పరా దిక్,**
**వియద్ వ్యాపకత్వాదఖండైకరూపః**
**తదేకో౽ వశిష్టః శివః కేవలో౽ హమ్. 8**

నాకు - పైన, క్రింద, లోపల, వెలుపల, మధ్య, అడ్డము తూర్పు, పడమర (అనే ప్రదేశ భేదాలు) లేవు. దీనికి కారణం అఖండ - ఏక - రూపంతో నేను ఆకాశమంతటా వ్యాపించి ఉండడం. కనుక ఆ మిగిలిన అద్వితీయమైన కేవల శివస్వరూపమే నేను.

**అపి వ్యాపకత్వాది తత్త్వాత్ ప్రయోగాత్**
**స్వతస్సిద్ధభావా దనన్యాశ్రయత్వాత్,**
**జగత్తుచ్ఛమేతత్సమస్తం తదన్యః**
**తదేకో౽ వశిష్టః, శివః కేవలో౽ హమ్. 9**

సర్వవ్యాపకత్వం సర్వజ్ఞత్వం మొదలైన తత్త్వాలవల్ల, అనుభవం వల్ల స్వతస్సిద్ధమైనందువల్ల, అది తప్ప మరొక ఆధారం లేనందువల్ల, సాక్షిగాక తక్కిన ఈ జగత్తంతా తుచ్ఛమైంది - మిథ్య కనుక అద్వితీయంగా మిగిలిన కేవల శివస్వరూపమే నేను.

**న చైకం తదన్యద్ద్వితీయం కుతస్స్యాత్**
**న చాకేవలత్వం, న వా కేవలత్వమ్,**
**న శూన్యం, న చాశూన్య మద్వైతకత్వాత్**
**కథం సర్వవేదాంతసిద్ధం బ్రవీమి. 10**

ఆత్మ అద్వైతం (రెండు కానిది) అవడంవల్ల – ఏకత్వసంఖ్యా విశిష్టం కాదు. ఇక దానికంటె వేరుగా రెండవ వస్తువు ఎక్కడి నుండి వస్తుంది? అది ఏకత్వం కాదు; అనేకత్వము కాదు. అది శూన్యం కాదు, అశూన్యమూ కాదు. అయితే అది ఉపనిషత్తులలో ప్రసిద్ధమైన వస్తువు. దాన్ని గురించి ఎలా (మాటలలో) చెప్పగలను? అది అనుభవైకవేద్యమని భావం.

*(డా॥ వింజమూరి విశ్వనాథమయ్యగారి సౌజన్యంతో)*

100. శ్రీ గోవిందపాదాచార్యులు శ్రీ శంకరుల పలుకులు అత్యంతా సక్తితో విన్నారు. శ్రీబాలశంకరుల పలుకులన్నీ విజ్ఞానంతోను, బ్రహ్మసాక్షాత్కారంతోను కూడివున్నవి. వేదాంతశాస్త్రంలో ప్రతిపాదించబడిన తత్త్వబోధ అంతా అమృతంలా ఉంది. శ్రీశంకరుల పలుకులు అప్రాకృతాలనీ మానవాతీత విజ్ఞానభరితాలనీ తలచారు. ఈ సూక్తులు కేవలం పరమేశ్వరుడే పలికినట్లున్నాయి. "సర్వలోక శుభకరా! శంకరా! నీ స్వరూపావిర్భావాన్ని యోగదృష్టిలో చూశాను. నువ్వు దివ్యపురుషుడవు. లీలామానుష విగ్రహుడవు. లోకాల నుద్ధరించడానికి వచ్చిన మహాత్ముడవు. లోకంలో జ్ఞానకాండను ఉద్ధరించడానికి అవతరించిన పరమశివుడవు. నీ దర్శన మెవ్వరికైనా సర్వశుభాలు చేకూరుస్తుంది."

101. శ్రీ శంకరులు గురుదేవుని పాదాలు పూజించాలని ప్రార్థించారు. అందుకు దయతో అంగీకరించిన శ్రీ గోవిందనాథ యతీశ్వరులు గుహలో నుండే తమ పాదాలను చూపారు. శ్రీశంకరులు ఆ మహాత్ముని దివ్యపాద పద్మాలను భక్తితో పూజించారు. తరువాత శ్రీ శంకరులకు గురుశిష్య సంప్రదాయం గూర్చి బోధించారు. శ్రీగురుసేవ ముక్తి హేతువు.

102. శ్రీ శంకరులు అమిత భక్తిశ్రద్ధలతో గురువునకు సపర్యలు చేస్తూ గురువును ఆనందపరచారు. గురుదేవులు ప్రసన్నులై శంకరుని అనుగ్ర హింపదలచారు. శిష్యుడు ఎంతటి ప్రజ్ఞావంతుడయినా సంప్రదాయాన్ని అనుస రించి గురుముఖతా పరబ్రహ్మతత్త్వాన్ని పొందాలని శాస్త్రాలు తెలుపుతున్నాయి. అందువలన ఎట్టి వారికైనా గురువు అనుగ్రహంలేక బ్రహ్మతత్త్వం లభ్యం కాదని శాస్త్రాలు వచిస్తున్నాయి.

103. శ్రీ శంకరులు గురుదేవులకు పరిపూర్ణమైన భక్తితో సకలోప చారాలు చేయసాగారు. శ్రీ గోవిందనాథయతీశ్వరులు కూడా శ్రీశంకరుల పట్ల పరిపూర్ణమైన అనుగ్రహంతో చతుర్విధాలైన మహావాక్యాలను ఉపదే శించారు. వేదాలన్నిటికీ సారాలు ఉపనిషత్తులే. ఉపనిషత్తులే వేదశిఖరాలనీ, వేద శిరస్సులనీ, వేదాంతాలనీ పిలువబడుచున్నవి. ఉపనిషత్తులందలి చతుర్విధ మహావాక్యాలు జీవబ్రహ్మైక్య ప్రతిపాదకాలవడంచే సారాతిసారాలై ఉన్నవి.

1. ప్రజ్ఞానం బ్రహ్మం = విశేషమైన జ్ఞానమే బ్రహ్మం (లక్షణవాక్యం; ఋగ్వేదం; ఐతరేయోపనిషత్తు)

2. అహం బ్రహ్మాస్మి = నేను బ్రహ్మనై ఉన్నాను. (అనుభవవాక్యం; యజుర్వేదం; బృహదారణ్యకోపనిషత్తు)

3. తత్త్వమసి = బ్రహ్మమే నువ్వు.
(ఉపదేశవాక్యం; సామవేదం; ఛాందోగ్యోపనిషత్తు)

4. అయమాత్మా బ్రహ్మ = ఈ ఆత్మే బ్రహ్మం.
(సాక్షాత్కార వాక్యం; అథర్వవేదం; మాండూక్యోపనిషత్తు)

104. శ్రీ శంకర భగవానుడు గురుముఖతా సర్వవేదసారాలను గ్రహించాడు. వ్యాసమహర్షి రచించిన బ్రహ్మసూత్రాలలోని బ్రహ్మవిద్యా సర్వస్వమైన అద్వైతతత్త్వాన్ని పూర్తిగా గ్రహించారు. ఆ విధంగా బ్రహ్మ సూత్రాల తాత్పర్యమంతా కరతలామలకమైపోయింది. సాక్షాత్తూ విష్ణుమూర్తి అవతారమైన వ్యాసులవారు జీవబ్రహ్మభేదరూపమైన అద్వైతాన్ని ఉపదేశిం చారు. శ్రీ శంకరులకు పూర్వం బ్రహ్మసూత్రాలు వివాదగ్రస్తమై ఉండేవి.

తరువాత శంకరులు బ్రహ్మసూత్రాలలోని నిగూఢార్థాలన్నీ చక్కగా తెలుసు కొన్నారు. ఇప్పుడు సంశయాలన్నీ తీర్చాయి. కేవలం అద్వైతభావాన్ని స్థాపింప వచ్చిన ఆ పరమశివుడే ఈ శంకరుడు.

105. శ్రీ వ్యాసమహర్షి పరాశరమహర్షికి సత్యవతియందుద యించారు. ఆ మహానుభావునికి పరమవైరాగ్యశీలియైన శ్రీశుకమహర్షి జన్మించాడు. ఆతడు బాల్యం నుండే దిగంబరుడై తిరుగుతూండేవాడు. శ్రీ శుకమహర్షి చిదంబర వీథుల్లో తిరుగుతూండగా శ్రీ గౌడ పాదాచార్యులు ఆయనకు శిష్యుడయ్యాడు. ఈ గౌడపాదాచార్యులే మాండూక్యకారికాకర్త. అట్టి గౌడపాదాచార్యులకు శ్రీ గోవిందనాథయతీంద్రులు శిష్యులైరి. ఈ గోవిందయతీంద్రులవారే శ్రీ పతంజలి అవతారమని ప్రసిద్ధి చెందారు. ప్రస్తుతం శ్రీశంకరాచార్యుల వారు గోవిందయతీంద్రుల వద్ద బ్రహ్మోపదేశం పొంది ఉన్నారు. తరువాత శ్రీ శంకరాచార్యులవారు మూడు సంవత్సరాలు గురుసన్నిధానంలో వేదాంతమభ్యసించి జ్ఞానసిద్ధులయ్యారు. ఈ మహర్షుల గురుపరంపరను తెలిపే శ్లోక మిది.

**శ్లో. నారాయణం పద్మభువం వసిష్ఠం ।**
**శక్తిం చ తత్పుత్రపరాశరం చ ॥**
**వ్యాసం శుకం గౌడపదం మహాంతం ।**
**గోవిందయోగీంద్ర మథాస్య శిష్యం ॥**

**శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యం ।**
**తం తోటకం వార్తికకారమన్యా నస్మద్గురూన్ సంతతమానతోఽస్మి ॥**

1. నారాయణుడు (విష్ణువు) 2. బ్రహ్మ, 3. వసిష్ఠుడు 4. శక్తి 5. పరాశరుడు 6. వ్యాసుడు 7. శుకుడు 8. గౌడపాదుడు 9. గోవిందుడు 10. శంకరుడు.

106. ఏ ఆదిశేషుడు సకలభువనాలను తన శిరస్సున భరిస్తూ లోకోపకారం చేశాడో, ఏ ఆదిశేషుడు శబ్దశాస్త్రాన్ని భూలోకంలో ప్రవేశ

పెట్టాడో, వ్యాకరణశాస్త్రాన్ని రచించి పతంజలి అనే పేరుతో ప్రసిద్ధి చెందాడో అట్టి మహాత్ముడైన శ్రీ గోవిందనాథ యతీశ్వరుల వద్ద శుశ్రూష చేసి శ్రీ శంకరులు సర్వవేదాంతశాస్త్రాన్ని శ్రవణం చేశారు.

107. సకలవిషయభోగాలను త్యజించి పరమహంసస్థితిని పొందగలుగడం పూర్వజన్మల సుకృతం. అట్టి మహనీయులు సన్న్యాసం స్వీకరించటం సహజంగానే సిద్ధిస్తుంది. శంకరులు శ్రీ గోవింద భగవత్పాదాచార్యుల వారి నుండి సన్న్యాసం స్వీకరించి, ధ్రువునిమల్లే సూర్యమండలం కన్నా మహోన్నత స్థానం పొందారు. శ్రీ శంకరులు అత్యున్నత స్థితిని పొంది, లోకోద్ధరణకై వేదాంత తత్త్వభేరిని మ్రోగించి, జనులకు మోక్షసామ్రాజ్య మార్గాన్ని చూపారు. ఈ విధంగా శ్రీ శంకరులు సర్వబంధాలను త్యజించి అద్వైతతత్త్వాన్ని సుస్థిరం చేసి పరబ్రహ్మసాక్షాత్కారమార్గాన్ని చూపి జగద్గురువయ్యారు.

108. శ్రీ శంకరుల దేహచ్ఛాయ హిమాలయాలమల్లే తెల్లగా స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నది. ఆయన ధరించిన వస్త్రాలు మేఘాలను కప్పివేసిన సాయం సూర్యుని మాదిరి ఎర్రని కాషాయరంగులో మనోజ్ఞంగా వెలుగొందినది. శ్రీ శంకరుల మనోభావాలు అత్యున్నతమై హిమాలయ శిఖరాలను తాకుచున్నవి.

109. మహేశ్వరుడు గజాసురుని సంహరించి రక్తసిక్తమైన ఆతడి చర్మాన్ని ధరించాడు. అదే ప్రకారం శ్రీ శంకర యతిరాజు అజ్ఞానమనే గజాసురుని సంహరించి రక్తవర్ణమైన లేత కాషాయ వస్త్రాలను ధరించారు. ఆ విధంగా ఈ శంకరుడు సాక్షాత్తూ మహేశ్వరుడే.

110. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అన్న శ్రుతివాక్యం ప్రకారం బ్రహ్మాన్ని తెలుసుకున్నవాడు బ్రహ్మమే అవుతాడు. శ్రీ శంకరులు పరమహంస పరివ్రాజకులతో కూడి సకల వేదాలందూ క్రీడిస్తున్నారు. అంటే సమస్త వేదాలు ఆయన శిష్యమండలి. సచ్చిదానంద పరతత్త్వంలో రమించటం చేత పరబ్రహ్మమై ఉన్నారని అర్థం.

'సర్వే వేదా యత్పద మామనంతి' అనే శ్రుతి వాక్యం ప్రకారం, బ్రహ్మం సకల వేదాలందూ పరమపద స్థానమై భాసిల్లుతున్నదని అర్థం. సర్వవేదాలు పరబ్రహ్మం నివాసస్థానమై ఉండటంచేత ఆ వేదాల ద్వారా ఆ పరబ్రహ్మను తెలుసుకోవడమే తత్త్వవేత్తలైన పరమహంసలకు మోక్షమార్గమై ఉన్నది. ఇట్టి శంకరులు హిరణ్యగర్భుడైన బ్రహ్మదేవుని కన్నా మిన్న అని చెబుతున్నారు. ఎలాగంటే, వేదార్థాల నెరిగిన బ్రహ్మ జడాలైన లోకాల నతిక్రమించక సత్యలోకంలోనే ఉన్నాడు. కనుక శంకరులు బ్రహ్మదేవుని కన్నా గొప్పవాడై విరాజిల్లుతున్నారు.

111. శ్రీ శంకరులు విష్ణుమూర్తికన్నా అధికులని చెప్పబడుచున్నది. ఎలాగంటే, శ్రీ మహావిష్ణువు వామనావతారం దాల్చి రెండు పాదాలతో మూడు భువనాలను ఆక్రమించగా శ్రీ శంకరులు జ్యోతి రూపంలో (సర్వ తేజోమయమైన) శ్రీ శంకర పరబ్రహ్మం సత్త్వాన్ని ధరించి త్రికాలాలందూ సృష్టి స్థితి లయాలు త్రిగుణాతీతమై తేజరిల్లుతుండగా, శ్రీ విష్ణుభగవానుడు సత్త్వగుణాన్ని దాల్చి స్థితియందు మాత్రమున్నాడు. శ్రీ విష్ణుభగవానుడు మత్స్యాది పది అవతారాల అవస్థలతోను, ఆకారాలతోను కూడివుండగా, శ్రీ శంకర పరబ్రహ్మమలాగాక అవస్థలకు, ఆకారాలకు అతీతుడై నిర్వికార నిరాకారమై ప్రకాశిస్తున్నది. శ్రీశంకరపరబ్రహ్మ విష్ణుదేవునికన్నా అన్ని విధాలుగా అధికుడననీ త్రిగుణాతీతుడనీ వచించారు.

112. శ్రీ శంకరులు మహేశ్వరుని కన్నా అన్ని విధాల మహోన్నతు డని తెలుపుతున్నారు. మహేశ్వరుడు కైలాసాన ప్రమథగణాలతో నందీశ్వరుని అధిరోహించి భూతప్రేతాదులతో సంబంధాలు కలిగి శ్మశానాలందు విహరిస్తూ న్నాడు. అయితే శ్రీ శంకర పరబ్రహ్మం కైలాసాన మాత్రమే కాక పంచ భూతాలలోను, సర్వప్రాణులలోను సర్వత్రా వ్యాపించి సంసర్గంలేక అపరి చ్ఛిన్నమై వెలుగుచున్నది. శ్రీ మహేశ్వరులు శరీరమంతా విభూతితో అలంక రించుకొని పాములను ఆభరణాలుగా ధరించి తిరుగుతున్నారు. కానీ శ్రీశంకర పరబ్రహ్మం విషయసుఖాలన్నీ త్యజించి, భోగపురుషులతో సహవాసం

చేయక నిస్సంగంగా ప్రకాశిస్తున్నాడు. శివుడంటే త్రిపుర దాహకత్వ సామ్యంచే మూడు దేహాలను అతిక్రమించిన పరతత్త్వసంపన్నుడు. కనుక అట్టి పరబ్రహ్మంగా శ్రీ శంకరులు ఉన్నారని స్పష్టం చేశారు. శివమంటే శ్రీ శంకర పరబ్రహ్మం.

113. త్రిపుర సంహారమందు మహేశ్వరుడు మేరు పర్వతాన్ని ధనుస్సుగా చేసుకొని శ్రీ మహావిష్ణువునే బాణంగా స్వీకరించాడు. విష్ణువే ఫలంగా గల బాణ మందు ఆసక్తుడయ్యాడు. శ్రీ శంకర భగవత్పాదులవారు ఐహిక ఆముష్మిక సుఖాలను త్యజించారు. సూర్యచంద్రులను చక్రాలుగా చేసుకొని భూమినే రథంగా చేసుకొన్నారు. అహంకారాది లక్షణాలనే శత్రువులతో కూడివున్న దేహమనే రథాన్ని పూర్తిగా విసర్జించారు. అహంకార మమకారాలు లేనివాడై దేహాతీత స్థితిని పొందారు. శ్రీశంకరులు ఏ విధమైన సహాయమూ స్వీకరింపక, 1. పంచ ప్రాణాలను 2. అయిదు కర్మేంద్రియాలను 3. అయిదు జ్ఞానేంద్రియాలను 4. అంతఃకరణ చతుష్టయాన్ని 5. అవిద్యను 6. కామాన్ని 7. కర్మను 8. వాసనలతో కూడిన శరీరాన్ని అవలీలగా జయించారు. శ్రీ శంకరులు యతీశ్వరులై బ్రాహ్మణాది వర్ణధర్మాల నతిక్రమించారు. ఐహికాముష్మికాలలో విరక్తులయ్యారు. అహంకార మమ కారాలను విడనాడారు. సూక్ష్మదేహాన్ని కూడా జయించి బ్రహ్మవిద్యాభూషితు లయ్యారు. సర్వజీవులందు సమభావం కలిగి త్రిగుణాతీతులై స్వస్వరూప పరబ్రహ్మ మందు రమించేవారయ్యారు. శ్రీ శంకర పరబ్రహ్మం సర్వవేద ప్రతిపాద్యమై, శివమై, శాంతమై, శుద్ధ అద్వైతమై విరాజిల్లారు.

114. హంసలలో అమిత శ్రేష్ఠమైన రాజహంసలు వర్షాకాలం రావ డానికి ముందుగానే, స్వచ్ఛమైన జలాలతో నిండివున్న మానససరోవరాన్ని చేరుకొంటాయి. అచ్చటకు చేరి పచ్చటి తామర తూండ్లను భక్షిస్తూ విహ రిస్తాయి. అట్లే శ్రీ శంకర పరమహంస కూడా సామాన్య పండితులు వేద విరుద్ధంగా ప్రతిపాదించే సిద్ధాంతాలను మొదలంట ఖండిస్తూ, యథార్థమైన అద్వైత తత్త్వాన్ని బోధించి సత్పురుషుల పరిశుద్ధ హృదయమనే మానస

సరోవరంతో క్రీడించే సన్మార్గులకు, వేదాంతులకు సంతోషాన్ని కలిగిస్తు న్నారు.

115. క్షీరమూ, బ్రహ్మమూ అత్యంత మధురమైన పదార్థాలు. అందు వలననే ఆ రెండింటినీ అమృతమని చెబుతున్నారు. అట్లే నీరు, జగత్తు సారం లేని వస్తువులు; నీరసాలు, అస్థిరాలు. క్షీరం అమృతప్రాయమైనది కాగా జలం దుఃఖజనితమైన అస్థిర జగత్తు అని తెలుసుకోవాలి. నీరు పాలు కలిసిపోయినట్లు జగత్తు బ్రహ్మం కలసి ఉంటాయి. సృష్టిలో పాల నుండి జలాన్ని వేరు చేసే సామర్థ్యం హంసకు మాత్రమే ఉంది. అదే విధంగా తత్త్వ దృష్టితో జగత్తు నుండి బ్రహ్మాన్ని విడదీసి గ్రహించడంలో శ్రీశంకరులు పరివ్రాజక పరమహంసలలో శ్రేష్ఠుడు. అంతేగాక శ్రీశంకరులు రాగద్వేషాది విషయాలచే కలుషితమై తత్త్వజ్ఞానాన్ని గ్రహించలేక, తన నాశ్రయించిన వారికి జ్ఞానం ఉపదేశించి పరిశుద్ధుల నొనరిస్తున్నారు. కనుక ఈ మహాత్ముడే జగద్గురువు; పరమహంసలకు తలమానికం; నిరుపమ ప్రజ్ఞాశాలి. ఎవరు జగత్తును బ్రహ్మాన్ని వేరుచేసే సామర్థ్యం లేకున్నారో వారు నిజంగా పరమహంసలు కాలేరు, వారు వట్టి కొంగలు మాత్రమే.

116. జలంలో పాలు కలిసిపోయినట్లు, మిథ్యా జగత్తులో బ్రహ్మం కలసిపోయినది. సామాన్య పండితులందరూ ప్రాకృత దృష్టి గలవారవడం వలన జలం నుండి పాలను వేరుచేసే సామర్థ్యం కోల్పోయారు. వారందరు కాకులు కొంగలు వంటివారు. వివేక, విజ్ఞానాలు కలిగిన శ్రీ శంకరులు సూక్ష్మబుద్ధితో జగత్తును వదలి బ్రహ్మాన్ని గ్రహించారు. 'ఇది సత్యమైనది, ఇది సత్యమైనది కాదు' అని క్షణంలో గ్రహించి లోకానికి ప్రబోధించారు. అంటే అజ్ఞానాన్ని వదలి సర్వం బ్రహ్మంగా చూడగలిగే జ్ఞానదృష్టిని స్వీక రించటంచేత శ్రీ శంకరులు పరమహంసగా విరాజిల్లుతున్నారు. ఆత్మవివేకం లేనివారు కాషాయ దుస్తులు ధరించినా, వారందరూ కాకులు, కొంగల వంటివారే. వివేకంతో విచారణ చేసే పాలు నీరుల మల్లే జగత్తు బ్రహ్మం కలిసిపోయి లేవు. జగత్తు ధర్మాలు వేరు. బ్రహ్మం ధర్మాలు వేరుగా ఉన్నవి.

అజ్ఞానంచేత రెండూ కలసిపోయి ఉన్నవని తలస్తున్నారు. వారికి తత్త్వజ్ఞానం లేదు. ఎందుకంటే, రెండు వస్తువులుంటే ఏకత్వాన్ని గూర్చి మాట్లాడవచ్చు. అక్కడ దృశ్యం తప్ప మరొకటి లేదు. ఆత్మ, అనాత్మ అనే జ్ఞానాన్ని పొంద గోరే ముముక్షువులు ఇటువంటి వివేకంతో ఆలోచించాలి. బాగా విచారణ చేస్తే బ్రహ్మవస్తువు ఒక్కటే. అజ్ఞానులకు జగత్తుమల్లే, జ్ఞానులకు బ్రహ్మం మల్లే తెలుస్తున్నది. బ్రహ్మం ఉన్నది కాబట్టి భావపదార్థమై భాసిల్లుతుంది. బ్రహ్మాన్ని వేరుచేయటం అంటే బ్రహ్మాన్ని బ్రహ్మంగానే చూడాలని అర్థం. జగత్తు అనే భ్రాంతిని విడిచిపెట్టాలి.

117. లోకమంతా కారు చీకట్లలతో నిండిపోయి ఉంది. కళ్లు వస్తువులను గుర్తించలేకపోతున్నాయి. సూర్యభగవానుడు ఉదయించగానే చీకటి అంతా పటాపంచలై వెలుగుతో ప్రకాశిస్తూంటుంది. ఆ ప్రకాశంలో వస్తువులను స్పష్టంగా చూడగలుగుచున్నాం. ఆ విధంగా ఆంతరంగికంగా వ్యాపించివున్న అజ్ఞానం వలన ఆత్మను చూడలేకపోతున్నాం. శ్రీ శంకర భగవానులు లోకానికి ఆత్మదృష్టిని ప్రసాదించి విజ్ఞానవంతం చేస్తున్నారు. అజ్ఞానం నశించగానే ఆత్మజ్ఞానదృష్టితో నిండిపోతుంది. సూర్యభగవానుడు బయట అంధకారాన్ని అంతమొందించేట్లు, శ్రీశంకర భగవానులు ఆంతరిక అంధకారాన్ని పారద్రోలి విజ్ఞానాన్ని ప్రసరింప చేశారు.

సూర్యభగవానుడు కమలాలకు మిత్రుడు. లోకానికి కూడా వెలుగును ప్రసాదించి (చీకట్లను పారద్రోలి) మిత్రుడగుతున్నాడు. శ్రీ శంకర భగవానుడు కూడా తన జ్ఞానంచేత లోకానికి శాశ్వతంగా మిత్రుడగుతున్నారు.

అంతేగాక భాస్కరుడు మిత్రులైన చక్రవాక పక్షులకు రాత్రులందు ప్రియావిరహ దుఃఖాన్ని పోగొట్టి సంతోషాన్ని కలిగిస్తున్నాడు. అలాగే శ్రీ శంకరుడనే భాస్కరుడు తన నాశ్రయించిన మిత్రులకు సంసారబంధాలను నశింపచేసి వారికి పరమశాంతిని కలిగిస్తున్నాడు.

సూర్యభగవానుడు తన ప్రకాశం చేత ఘటపటాదులను ప్రకాశింప చేస్తూండగా శ్రీశంకర భగవానులు అజ్ఞానాన్ని నశింపచేసిన బ్రహ్మతత్త్వార్థా లను బోధిస్తున్నారు.

ఆ విధంగా సూర్యుని లక్షణాలన్నీ ఈ శంకరయతీంద్రులయందు ప్రకాశించటంచేత ఈ మహాత్ముని హంస అని చెబుతున్నారు. శ్రీ శంకర భగవానులు అవతరించిన నాటి నుండి శబ్దాది విషయాలందు విషయ సుఖాలందు ప్రీతి నాశనమై లోకంలో సంసార తాపం చల్లారి పరమశాంతి చేకూర సాగింది. బ్రహ్మతత్త్వార్థం స్పష్టమయింది. అద్వైత విజయం విశృంఖలంగా విరాజిల్లింది.

118. శ్రీ శంకరులు పరమహంస అని అనేక విధాలుగా వర్ణించి చెప్పబడినది. ఆ విధంగా పరమహంసత్వాన్ని పొంది (సన్న్యాసం) ఇంద్రియ చపలత్వాన్ని నిరోధించి శ్రీ గోవిందనాథస్వామి మల్లేనే నిరంతరం ధ్యానంలోనే గడిపారు. శబ్దాది ఇంద్రియ సుఖాలు మెరుపు తీగలా క్షణంలో జనించి మరుక్షణంలో మాయమగుచున్నవి.

119. గ్రీష్మకాలంలో భూమిపై నీరంతా హరించిపోతుంది. అంటే వర్షాకాలం రానున్నదని తెలియవస్తుంది. వర్షాలు కురవగానే భూమి అంతా నీటితో నిండిపోతుంది. ఆకాశమంతా నిండిపోయిన మేఘాలు సూర్యుని కప్పివేస్తూ ఇలా తలస్తూన్నవి. "ఈ సూర్యుడు మేము భూమికి ఇచ్చిన నీటినంతటినీ హరింపజేశాడు. అందువల్ల నేలతల్లి దుఃఖిస్తున్నది. కనుక మేము ఈ సూర్యుని కప్పివేస్తాము. భూమిపై జనులను సూర్యతాపం నుండి రక్షిస్తాము. మమ్మల్ని ఆయన కాలితో తంతే తంతాడుగాక! మేము లెక్కచేయం."

120. మేఘమండలాన మెరుపుతీగలు కన్నులకు మిరుమిట్లు గొలుపుతూ క్షణంలో మాయమైపోతున్నాయి. ఆ ప్రకారం ఇంద్రియ సుఖాల ననుభవించే వాడు పండితుడైనా బ్రహ్మవిద్యా వైభవాన్ని పొందినా శాశ్వతంగా నిలుపుకోలేక పోతున్నాడు. గాలిలో దీపంలా స్తిమితంగా ప్రకాశించటం లేదు. పండితుని అంతరంగంలో జ్ఞానముదయించినా, విషయాలు అడ్డుగా నిలుస్తున్నవి. చిత్తాన్ని నిశ్చలం చేసే గాలి లేని దీపంవలే స్థిరంగా ఉంటుంది.

121. ఆకాశాన మేఘాలు మృదుమధుర గంభీరంగా ఉరుము తున్నాయి. ఆ ధ్వనులు విన్న జనులు వర్షం రాబోతున్నదని సంతోషంతో

కేరింతలు కొడతారు. మేఘాలు విష్ణుపాదాల నాశ్రయించి ఉండడంచే తమ రాకను కోరే జనులకు బ్రహ్మోపదేశం చేసే వ్యక్తిలా ఉండినవి. భగవంతుని పాదాల నాశ్రయిస్తే బ్రహ్మత్వాన్ని పొంది పరమానందం పొందుతారని బోధిస్తున్నట్లున్నది. వర్షాకాలం ప్రారంభమై గ్రీష్మతాపాలు చల్లబడ్డాయి.

122. లోకంలో యతీశ్వరులు గర్వితులై తాము జ్ఞానులమనీ, యజ్ఞాలు చేయవలసిన అవసరం లేదనీ తలస్తున్నారు. దేవతలకు ప్రభువైన ఇంద్రుడు మేఘాలను రథంగా చేసుకొని ఇంద్రధనుస్సును ధరించి ఉన్నాడు. ఆ సమయంలో యతీశ్వరులకు దేశాటనం నిరోధించబడినది.

123. వనాలలో వీచే గాలులు వివిధ రకాలైన పుష్పసువాసనలను మోసుకొనిపోతున్నవి. మాయచే కల్పించబడిన త్రిగుణాలతో విజృంభిస్తున్నవి. మల్లెపూవుల సువాసనలు గుబాళిస్తూ సత్త్వగుణ వ్యాపారాలను, పుష్పరజో రేణువులతో కూడి రజోగుణచేష్టలను, వనాలతో సంబంధించిన తమోగుణ విజృంభణం మల్లే సంచరించినవి. అడవులందు వర్షాకాలంతో గిరిమల్లికా పుష్పాలు, నల్ల గోరంట పుష్పాలు విరివిగా ఉంటాయి. మేఘాలు గాలితో కూడి వర్షిస్తాయి కనుక త్రిగుణాలతో కూడినంత వరకూ జగద్వ్యాపారాలతో నిండివున్నవి. త్రిగుణాతీత స్థితి కలిగితే వ్యాపారాలన్నీ నశించి నిర్వ్యాపార స్థితి సంభవిస్తుంది.

మేఘాలు రాక్షసులమల్లే తపోధనుల యజ్ఞాలను భంగపరుస్తున్నవి. ఉరుములు, మెరుపులతో మహాభయంకరంగా గర్జిస్తూ దిక్కులన్నీ చీకట్లు క్రమ్మే విధంగా ఘోరంగా వర్షిస్తున్నాయి. యతీశ్వరులు ధ్యానానుష్ఠానాలు చేయజాలకపోయారు.

125. ఆకాశమంతా దట్టమైన మేఘాలు కమ్ముకొని, తమ వద్ద నిలవ ఉన్న జలాలన్నింటినీ భూమిపై కురిపించాయి. తపశ్శాలియైన శ్రీ శంకరులు ఇంద్రియ ప్రవృత్తు లన్నింటినీ నిగ్రహించి పరమాత్మతో విలీనమయ్యారు. నిర్వికల్పసమాధిని పొందారు.

126. వేదవ్యాస మహాముని రచించిన బ్రహ్మసూత్రాలను, ఉపనిషత్తు లందలి జ్ఞానవైరాగ్యాలను, బ్రహ్మ ప్రతిపాదక వాక్యార్థాలను శ్రవణం చేసి, మననం చేస్తూ, ధ్యానం ఆచరించారు. జన్మ జన్మాంతరాల నుండి వెన్నంటి వచ్చే దేహాభిమానాన్ని విసర్జించినవారయ్యారు. నిర్వికల్ప సమాధిని పొంది స్వస్వరూపపరబ్రహ్మమందు విలీనమయ్యారు.

**127. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి – కుతోఽ యమగ్నిః న తద్భాసయతే సూర్యో న "శశాంకో న పావకః"**

అన్నది స్మృతి వాక్యం. అంటే చిదాకాశ పరమాత్మ యందు సూర్యచంద్ర, నక్షత్రాలు ప్రకాశించవు. ఇక అగ్ని, వర్షం, మెరుపు రేఖలు, సంధ్యాది సమయాల గూర్చి చెప్పవలసిన పనిలేదు గదా! సర్వదృశ్య రహితమై, స్వయంప్రకాశవంతమై చిదాకాశ పరబ్రహ్మమందు శ్రీ శంకరులు బుద్ధి లయించి ఉన్నది. ఆ బుద్ధికూడా పరబ్రహ్మమే అయిపోయి బుద్ధిస్వరూపమే నశించింది. అంతా పరబ్రహ్మస్వరూపమై శ్రీ శంకరులు రమిస్తున్నారు.

128. శ్రీ శంకరులు నిత్యం స్వస్వరూపంలో కేవల మానంద సముద్రాన విహరిస్తూ, సర్వమాయాజనిత మాలిన్యాలను నిశ్శేషంగా నాశన మొనరించారు. అంతా తానే అయి ఉండగా గ్రహించవలసినదిగాని, విసర్జించ వలసినదిగాని లేకపోతుంది. కంటికి కనిపించే వస్తువులయితే గ్రహించ వచ్చు లేక విసర్జించవచ్చు. ఇంద్రియాలకు అతీతమైన పరబ్రహ్మమందు విడవడం, గ్రహించడం అనేది ఉండదు. శ్రీ శంకరులు నిరంతరం దృశ్య రహితమైన జ్ఞానసమాధిలో ఉన్నారు.

129. విష్ణుపాదాల వద్ద ఉన్న మేఘ సముదాయాలు విద్యావంతులతో వెలుగుతూ, అంతకు పూర్వం స్వచ్ఛంగా ఉన్న భూమిని మాలిన్యమయంగా చేస్తున్నవి. అటువంటి వర్షాకాలం ఎవరికీ సుఖాల నివ్వదు. దుష్టుల సహవాసంలో కలిగే బాధలన్నీ వర్షాలవల్ల జనులు అనుభవిస్తున్నారు. ఎంతటి పరిశుద్ధాత్ముడైనా, బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతున్నా, విషయాలందు

ఆసక్తులైన వారితో స్నేహం చేస్తే పతనం తప్పదని మేఘ వృత్తాంతాన తెలియచేస్తున్నారు.

130. తాము అంతవరకు ఆశ్రయించివున్న సరస్సులు వర్షాకాలం వలన కలుషితం కాగా రాజహంసలన్నీ మానససరోవరానికి పోయినవి. ఆశ్రయ నాశనంచేత జీవులు స్వస్వరూపాన్ని మరచి అనేక మానసిక వ్యధల ననుభవిస్తున్నారు. స్వస్వరూపం నుండి భ్రష్టులు కాకుంటే శాశ్వతానందం పొందేవారు.

131. షోడశకళలందు పూర్ణుడై పరిశుద్ధమైన కాంతితో ప్రకాశించే చంద్రుడు మేఘం కప్పివేయటంచేత ప్రకాశింపలేకున్నాడు. అట్లాగే సర్వ విద్యాసంపన్నుడైనా మురికి వస్త్రాలను ధరిస్తే అతడు గౌరవించబడడు. కనుక విషయాది దోష ప్రదేశాలలో నివసిస్తే ప్రకాశించడు.

132. చాతకపక్షులు మేఘాల నుండి వర్షించే జలాన్నే త్రాగుతాయి. ఎంత దప్పికగా ఉన్నా, ఇతర జలం త్రాగవు. అట్లే మహాత్ముల నాశ్ర యించేవాడు ఏదో ఒక రోజు అమృతపానం చేయగలడు. ముముక్షు వులు మహాత్ముల నాశ్రయిస్తే తప్పక జ్ఞానం పొందగలరు.

133. నీలి మేఘాలతో, పెనుగాలులతో, వృక్షాలను కూకటి వేళ్లతో పెకలించేదీను, జనుల రాకపోకలకు అంతరాయం కలిగిస్తూ, కారుచీకట్లను వెదజల్లుతూ వర్షాకాలం తనరారుచున్నది.

134. బ్రహ్మజ్ఞానులు, బ్రాహ్మణులు మొదలైనవారు పవిత్ర నర్మదానదీ తీరాన శ్రీ గోవిందనాథ యతీంద్రులను సేవిస్తున్నారు. ఇంద్రియాలన్నీ నిగ్రహించి శ్రీ శంకరులు పరమాత్మ ధ్యానం చేస్తూ నివసించసాగారు.

135. అసంఖ్యాకమైన మెరుపులతో, ఉరుములతో సకల జీవరాసులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని, అయిదు రాత్రులు, అయిదు పగళ్లు వర్ష బాధ ననుభవించాయి.

136. ఆ విధంగా తెరపి లేకుండా కురిసిన వర్షాలకు వృక్షాలు నేలకూలాయి, అగ్రహారాలన్నీ నీట మునిగాయి, నర్మదానది భయంకరంగా కట్టలు తెంచుకొని ప్రవహించసాగింది.

137. నర్మదానదీ చరిత్రయందు ఎన్నడు ఇలాంటి వరద కని, విని ఎరుగరైరి. ప్రజలు భయభ్రాంతులై ప్రాణాలు గుప్పెటబెట్టుకొని బ్రతుకసాగారు. అట్టి విపత్సమయంలో జనులు శ్రీ గోవింద యతీంద్రులను శరణు వేడుకొన్నారు. శ్రీ గోవింద యతీంద్రులవారు యోగసమాధిలో ఉండటంచేత వారి మొర ఆలకించలేకపోయారు. అప్పుడు శంకరులు వారి ప్రార్థనలు విని ఊరక ఉండిపోయారు.

138. తరువాత శ్రీ శంకరులు దీనజనులను ఉద్ధరించదలచారు. పూర్వం అగస్త్య మహర్షి సముద్ర జలమంతా త్రాగినట్లు, తానొక కమండలం తీసుకొని నదీ తీరానికి వెళ్లారు. మంత్రోచ్చారణ చేసి ఆ కమండలాన్ని నదిలో పడవేశారు. ఆశ్చర్యం! ఆ నదీజలాన్నంతా ఆ కమండలం త్రాగివేసింది. మరికొద్ది క్షణాలలో వరద నీరంతా పోయి సాధారణ నర్మదానది మిగిలింది. శ్రీ శంకరులు సామాన్యమానవులు కారనీ, సాక్షాత్తూ భగవంతుడేననీ జనులు వేయి నోళ్లతో పొగడారు. కష్టాలన్నీ తీరి సుఖంగా ఉన్నారు.

139. ఆ తరువాత శ్రీ గోవిందనాథ యతీశ్వరులు సమాధినుండి బాహ్య స్థితికి వచ్చి తన ప్రియశిష్యులైన శ్రీ శంకరులు తన కమండలం ద్వారా, నదీ జలాలన్నిటినీ ఉపసంహరించి ప్రాణులన్నింటినీ రక్షించినాడని తెలుసుకొన్నారు. జనులంతా వచ్చి శ్రీ శంకరులను స్తోత్రం చేస్తూండడం చూసి విషయమంతా గ్రహించారు. తాను లేని సమయంలో కరుణామయుడై జనులను రక్షించటంచేత అటువంటి శిష్యుని పొందటం తన అదృష్టమని భావించారు. అంతేగాక శ్రీ శంకరులా సంఘటనపై అనాసక్తులుగా ఉండటం చూసి అమితానందం చెందారు. ఈ శంకరులు సామాన్య మానవమాత్రులు కారని పలుకుతూ గాఢాలింగనం చేసుకొన్నారు. మంచి లక్షణాలు గలిగి బ్రహ్మవిద్య నభ్యసించే శిష్యులను చూసి గురుదేవులు ఎంతో సంతోషిస్తారు. వారికి బ్రహ్మవిద్యారహస్యాలన్నీ బోధిస్తారు. ఈ ప్రకారం శ్రీగోవింద, శ్రీశంకరులు గురుశిష్య సంప్రదాయాన్ని లోకానికి చాటారు.

140. కొంత కాలానికి వర్షం తగ్గి ఆకాశం నిర్మలమైనది. శ్రీ గోవింద యతీంద్రులు తన ప్రియశిష్యులైన శ్రీశంకరులతో ఇలా పలికారు: “నాయనా! శరదృతువు వచ్చింది. ఆకాశమంతా నిర్మలంగా ఉంది. అట్లే బ్రహ్మవిద్యచే బ్రహ్మతత్త్వం గ్రహించడమైనది. శరత్కాలం రాక మునుపు ఆకాశమంతా మలినమై ఉండేది. ఇప్పుడు ఆ మాలిన్యమంతా తొలగిపోయి నిర్మలంగా ఉంది. ఇటువంటి స్థితిని ప్రాణులందరూ కోరుకొని సుఖ శాంతులతో జీవిస్తారు. అదేవిధంగా కష్టకాలంచే ఆవరించబడితే హృదయా కాశమంతా మలినమై ఉంటుంది. ఆత్మ అనే భాస్కరుడు ఉదయించడు. అలాకాక శరత్కాలంమల్లే పుణ్యకాలం వస్తే హృదయాకాశాన జ్ఞానసూర్యు డుదయిస్తాడు. అంటే బ్రహ్మవిద్య చేత పరమతత్త్వజ్ఞానం స్పష్టంగాను, నిర్మలంగాను ప్రకాశిస్తుంది. కనుక బ్రహ్మవిద్య సకల జనులకు ఆనందాన్ని చేకూరుస్తుంది.

141. మేఘాలు నలు దిక్కులా యథేచ్ఛగా కుంభవృష్టిన వర్షం కురిపిస్తున్నవి. వృక్షాదులు, సకల ప్రాణికోటిని తృప్తిపరచి యథేచ్ఛగా విహరిస్తున్నవి. యతీశ్వరులు కూడా వర్షాకాలాన సంచారం చేయక తమకు ఇష్టం వచ్చిన ప్రదేశాలందు ధర్మప్రచారం చేస్తుంటారు. శిష్యులను కృతార్థు లను చేస్తారు. వర్షాకాలం మేఘాలకు యథేచ్ఛ సంచారానికి యోగ్యమైన కాలం కాగా, యతీశ్వరులకు ధర్మ ప్రచారం చేయడానికి యోగ్యమైనకాలం. ఈ విధంగా శ్రీశంకరులకు గురుదేవు లుపదేశించారు.

142. వర్షాకాలం తరువాత శరత్కాలంలో చంద్రుడు మేఘాల నిరోధం తొలగినవాడై లోకానికి చల్లని అమృతకిరణాలను ప్రసారం చేస్తుంటాడు. అట్లే తత్త్వవేత్తల బోధామృత కిరణాలచే మాయ అనే మేఘాలు తొలగి పరిశుద్ధుడై ప్రకాశిస్తున్నాడు. శరత్కాలంలో చంద్రుడు మేఘాల అడ్డు తొలగించుకొని తన శీతల కిరణాలతో లోకానికి ఆనందం కలిగించే విధంగా బహుజన్మలందు సంపాదించుకొన్న సుకృతాలచే భక్తి జ్ఞాన వైరాగ్యాలు ఫలించే సమయం వచ్చినప్పుడు మాయావరణం తొలగి తత్త్వబోధలు ప్రభావితా లవుతవి. ఈ తత్త్వాన్నే శరత్కాలం ఉపదేశిస్తున్నది.

అన్నిటికీ పూర్వజన్మలందు చేసిన కర్మఫలాలే కారణాలు. కనుక జీవుడు అజ్ఞానం చేత తన నిజస్వరూపాన్ని తెలుసుకోలేకున్నాడు. దుఃఖాల ననుభవిస్తూ ప్రకాశంలేక మలినాత్ముడై, మేఘాలచే కప్పివేయబడిన చంద్రునిమల్లే ప్రకాశంలేక ఉంటాడు; సద్గురువుల కరుణ వలన బ్రహ్మోపదేశం పొంది అజ్ఞానావరణం తొలగిపోయి శరత్కాల చంద్రుని మల్లే ప్రకాశిస్తాడు. స్వస్వరూప జ్ఞానం శరత్కాల చంద్రోదయంలా, పరమహంస జగత్తుకు పరమానందం ఒసగుతాడు.

143. ఆకాశాన మేఘాలు తొలగిపోగానే చంద్రుడు, నక్షత్రాలు ప్రకాశవంతమై జనులకు ఆనందాన్ని కలిగిస్తున్నవి. ఆ ప్రకారంగా హృదయమందు రాగద్వేషాది కాలుష్యాలు నాశనమయ్యే సమయం రాగానే ప్రేమ, కరుణ అనే పరిశుద్ధమైన గుణాలతో ప్రకాశిస్తుంది. చిత్తమందు రాగద్వేషాలున్నప్పుడు హృదయకమలం వికసించక బురదలోనే ఉండిపోతుంది. అటువంటి మలినమైన మనస్సు గలవారు శాంతిని పొందలేరు. ఇహపరాలలో కూడా సుఖపడలేరు. రాగద్వేషాది మాలిన్యాలను మనస్సునుండి తొలగిస్తే, పుణ్యాత్ములతో మైత్రీ, దీనజనులపట్ల కరుణ, తనకన్న గొప్పవారిని చూసి అసూయపడకుండటం, పాపాత్ముల పట్ల ఉదాసీనత అనే సద్గుణాలు వృద్ధి చెందుతాయి. అట్టి మహాత్ములను దర్శించినంత మాత్రానే పరమ పవిత్రులై, పరమ శాంతిని పొందుతారు. దీనినే పతంజలి మహర్షి యిలా వచించారు.

**సూ॥ మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యా పుణ్యవిషయాణాం భావనాతశ్చిత్త ప్రసాదనమ్.**

ఆకాశాన తారల ప్రకాశానికి శరత్కాలంమల్లే, మైత్రి, కరుణ వంటి సద్గుణాలకు బ్రహ్మవిద్యే ప్రకాశకం. రాగద్వేషాలను నాశన మొనరించి సద్గుణాలతో ఉంటుందని శరత్కాలం బోధిస్తున్నది.

144. శరత్కాలంలో నర్మదానది శ్రీ విష్ణుమూర్తి స్వరూపాన్ని సంతరించుకొంటుందని పూజనీయులైన పరమహంసలు తెలుపుతున్నారు.

మీన కూర్మాది రూపాలను ధరించి సుదర్శన చక్రధారీ, నాభియందు కమలం గలిగి, లక్ష్మీదేవితో సర్వశాంతిప్రదమైనవాడూ అయిన శ్రీవిష్ణు భగవానుని పరమహంసలు నిత్యం సేవించి పరమశాంతిని పొందుతున్నారు. ఆ ప్రకారంగానే, శరత్కాలమందు నర్మదానది ప్రవాహవేగం తగ్గించటంచేత జలాలు నిర్మలంగా ఉండి, మత్స్యాలవంటి వివిధ జలజంతువులతో కూడి, సుడిగుండాలేర్పడి, వివిధాలైన కలువలతో విలసిల్లుతూ సర్వజనులకు ఆనందాన్ని కలిగిస్తున్నవి. అట్టి నిర్మల నర్మదా నదీప్రవాహాన్ని రాజహంసలు సేవిస్తున్నవి. పరమహంసలు కూడా ఆ నర్మదానదీతీరాన సంధ్యావందనాది అనుష్ఠానాలు చేస్తూ శ్రీవిష్ణుమూర్తి అనే భావనతో సేవిస్తూంటారు. శరత్కాలంలో నర్మదానదీ జలాలు నిర్మలమై ఉన్నవి. ఇందు మూలంగా బ్రహ్మవిద్యాభ్యాసం చేతా, గురూపదేశం చేతా సకల మాలిన్యాలు తొలగి పోయాయి. ఈ శరత్కాలజ్ఞానోదయంచే అంతఃకరణం నిర్మల మవుతున్నది. ఇదే పరమహంసలు విష్ణుమూర్తిని సేవించే విధానం. ఆ మహాత్ములను దర్శించినంత మాత్రానే పరమశాంతి లభిస్తుంది. శరత్కాలం బోధించేది ఇదే.

145. మేఘాలు చాలాకాలం నుండి సంపాదించి దాచుకొన్న నీటి నిలువ లన్నింటినీ సకల ప్రాణికోటికి పంచి యిచ్చి మెరుపు లనే రత్నాభరణాలను ధరించి తెల్లటి కాంతులతో ఆకాశమందు విహరిస్తున్నవి. శరత్కాలంలో తమ వద్ద నీటి నిలువలు అయిపోవటంచేత ఇక ఎటువంటి ఉరుములు మెరుపులు లేకుండా తెల్లగా ప్రకాశిస్తాయి. అట్లే సన్న్యసింప దలచినవారు శరత్కాలంమల్లే తమ సర్వస్వాన్ని ఉత్తములకు దానం చేసి, మెరుపుల మల్లే అస్థిరాలైన కాంతులను వదలినవారై, వైరాగ్యం పొంది మఠాలు, దేవాలయాలను ఆశ్రయించి పరమహంసలై సర్వత్రా సంచ రిస్తున్నారు. సన్న్యాసులు, మేఘాలు కూడా తమ వద్దనున్న సర్వసంపదలను లోకహితం కోసం దానం చేసి, తమ కాంతులను మెరపు తీగలను వదలి పరమహంసాశ్రమాన్ని స్వీకరిస్తున్నారు. సన్న్యాసమన్నది బ్రహ్మవిద్యా కార్యమని గ్రహించాలి.

146. శరత్కాలంలో ఆకాశాన మేఘాలు లేనివై, చంద్రమండల కాంతులు దాసాని పువ్వులతో కలసి భూమండలమంతా వ్యాపించి ఉన్నవి. శరత్కాలంలో సన్న్యాసి కూడా చేతిలో కమండలం, ఒడలెల్ల విభూతి అలదుకొని, కాషాయ వస్త్రాలను ధరించి, నిర్మలమైన అంతఃకరణంతో లోకానికి ఆనందం కలుగజేస్తూ విరాజిల్లుతాడు. అంటే అవిద్యామాలిన్యాలన్నిటినీ బ్రహ్మవిద్య పూర్తిగా తొలగించి జ్ఞానస్వరూపమైన సన్న్యాసం ఒసగి లోకాన పరమ శాంతిని కలిగిస్తున్నది.

147. శరత్కాలంలో సరోవరాలలోని నీరు అతిస్వచ్ఛంగాను, నిర్మలంగాను ఉన్నాయి. అందు రాజహంసలు క్రీడిస్తున్నవి. అట్లే శ్రీ శంకరుల హృదయ సరోవరం కూడా ఎట్టి మాలిన్యాలు లేక స్వచ్ఛంగాను, నిర్మలంగాను ఉన్నది. అందు హంసలమల్లే పరమహంసలు క్రీడిస్తున్నారు.

148. శరత్కాలమందలి ఆకాశం మేఘాలులేక తెల్లగా విశాలంగా ప్రకాశిస్తున్నది. మహోజ్జ్వలకాంతులతో సూర్యభగవానుడు ధగధగ మెరసిపోతున్నాడు. అట్టి ఆకాశం చందనంతో అలదబడి, అతి విశాలమై కౌస్తుభ మణితో వెలిగిపోతున్న శ్రీ మహావిష్ణువు వక్షఃస్థలంలా ఉంది. ఆ విధంగా బ్రహ్మవిద్యా పరిపూర్తితో జ్ఞానభాస్కరుడు మాయావలయాన్ని ఛేదించి మహోజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాడు. శరత్కాలం నిర్మలత్వం చేత, నిరావరణత్వం చేత, చిదాకాశాన విహరిస్తున్నదని చెప్పుచున్నారు.

149. శరత్కాలంలో కమలాలు సూర్యుని ప్రభావంచే వికసిస్తున్నవి. ఆ ప్రకారం యోగవిద్యచే మునీశ్వరుల హృదయకమలాలు భగవంతుడనే సూర్యుని ఉపాసించి జ్ఞానవికాసంచే ఆనందామృతాన్ని పొందుతున్నవి. అట్టి వారి కీర్తి నలు దిశలందూ వ్యాపిస్తున్నది.

150. పరమహంసలు విభూతిని, కాషాయ వస్త్రాలను, జపమాలికలను, కమండలాన్ని ధరించేట్లుగా ఈ శరత్కాలవృక్షాలు కూడా పరాగ ధూసరితాలై, చిగుళ్లతో నిండి, మొగ్గలతో వికసితాలై, సన్న్యాసులను పోలి ఉన్నవి. అచేతనాలైన వృక్షాలు కూడా సన్న్యాస స్వీకరణాన్ని, నివృత్తి మార్గమే శ్రేయోదాయకమని సమర్థిస్తున్నవి.

151. శ్రీ గోవిందనాథయతీశ్వరుడు సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన శ్రీ శంకరులకు శరత్కాలమందు పరమహంస ధర్మాలను తెలుపుతున్నారు. సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన మహాత్ములందరూ వర్షాకాలమంతా చాతుర్మాస్య వ్రతాన్ని పూని శ్రవణం, మననం, నిధిధ్యాస సాక్షాత్కారాలచేత, ధ్యాన ధారణాదులచేత, రాత్రింబవళ్లు పవిత్రం, బ్రహ్మమయంగా గడిపి పరిపూర్ణ జ్ఞానాన్ని పొంది బ్రహ్మవిద్యా ప్రచారం చేయాలి. తాము సందర్శించే ప్రదేశాలన్నింటినీ పవిత్రం చేస్తూ, ఈ శరత్కాలమందు సంచరిస్తూ పరమశాంతి ఒసగుతున్నారు.

152. సాధుసత్తమా! మహాపురుషులు జగత్తును వారి పాదధూళిచేత పవిత్రం చేస్తుంటారు. వేదసమ్మతమైనదీ, సంసార దావానలాన్ని చల్లార్చే మేఘమండలం వంటిదీ, ముందెన్నడూ ఎవరు చక్కగా విచారణ చేయబడని దైన తత్త్వపద్ధతిని బోధించడానికి కాశీక్షేత్రానికి వెళ్లు. వేదాలలో జ్ఞానకాండ కర్మకాండ రూపాన రెండు మార్గాలున్నవి. వానిలో జ్ఞానమార్గం సారవంత మైనది. అది ఉపనిషత్తులందు చక్కగా ప్రతిపాదించబడినది. అంతేగాక ఆ తత్త్వమార్గం సంసార దావాగ్నియందు చిక్కుకొని పరితపించే జీవులకు కుంభవృష్టిమల్లే ఉపశమనం కలిగిస్తున్నది. ఈనాడు ఆ అద్వైతతత్త్వం సంపూర్ణంగా విచారించక భేదాభిప్రాయాలు, భిన్నాభిప్రాయాలు వెలువడు తున్నవి. అందువలన అనేక సంశయాలు బయలుదేరినవి. నువ్వు సర్వశాస్త్రాలు బాగా గ్రహించినవాడవు, జ్ఞానపరిపూర్ణుడవు. కనుక నువ్వు వారణాసికి పోయి అద్వైతతత్త్వాన్ని బాగా విచారించి సుస్థిరంగా స్థాపించు.

153. “వత్సా! బ్రహ్మవిద్యా వివేచనాపద్ధతియందు శ్రీ వేదవ్యాసులవారి ఆదేశం ఒకటి ఉంది. నీకు దానిని తెలుపుతాను” అని పలికారు. ఈ విధంగా బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయడానికి శ్రీ గోవిందపాద యతీంద్రుల వారు శ్రీ శంకరులకు సంకల్పం కలిగించారు. గోవింద మునీంద్రులు ఈ విధంగా తెలుపుతున్నారు. “పూర్వకాలంలో అత్రి మహాముని, దేవేంద్రాది దేవతలతో కూడి ఒక మహాయజ్ఞాన్ని హిమాలయాల్లో నిర్వర్తించారు.”

154. ఆ వృత్తాంతాన్ని తెలుపుతున్నారు. "ఆ యజ్ఞానికి పరాశర మహర్షి పుత్రుడూ, అనేక పురాణాలను వ్రాసినవాడూ అయిన వ్యాసుడు, వేదాలను విభజించి, గంభీరమైన వేదార్థాలను ఆ సభయందు బోధిస్తున్నాడు. అప్పుడు ఆ మహర్షిని ఈ విధంగా ప్రశ్నించారు."

155. గోవింద యతీంద్రులు శ్రీ వ్యాసభగవానుని ప్రశ్నించిన విధానాన్ని శ్రీ శంకరులకు చెబుతున్నారు. "సర్వపూజ్యతమా! తాము లోకకల్యాణానికై వేదాలను చక్కగా విభజించారు. పంచమ వేదంగా ప్రసిద్ధి పొందిన మహాభారతాన్ని రచించారు. యోగశాస్త్రాన్ని కూడా రచించారు. పతంజలి మహర్షి యోగశాస్త్రానికి భాష్యం వ్రాశారు. అంతేగాక సకల ఉపనిషత్తుల వేదాంతసారాన్ని గ్రహించి బ్రహ్మసూత్రాలను రచించారు."

156. "ఈ విధంగా ఎన్నో రచించారు. అన్నింటిలోనూ అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించేవి బ్రహ్మసూత్రాలై ఉన్నవి. వాటికి జనులు విపరీతార్థాలను సృష్టించి వారి వారి మతాలకు అనుకూలంగా రకరకాలైన వ్యాఖ్యానాలను ప్రతిపాదిస్తున్నారు. ఎవరూ యథార్థమైన అద్వైతత్త్వాన్ని ప్రతిపాదించటం లేదు. నిగూఢమైన ఆ బ్రహ్మసూత్రాలను ఎవరూ సరిగా అర్థం చేసుకోలేకున్నారు. ఎందువల్లంటే, ఆ గ్రంథం అన్ని మతాలను అన్వయించడానికి వీలు కలుగిస్తున్నది. ఏ మతమైనా అభివృద్ధి చెందాలంటే బ్రహ్మసూత్రాలకు అర్థాన్ని వెంటనే నిర్ణయించడం అత్యవసరం. కనుక ఓ భగవానుడా! బ్రహ్మసూత్రాలకు ఉన్నదున్నట్లు అర్థం చేసుకొనే విధంగా గ్రంథరచయితలైన తమరే భాష్యాన్ని వ్రాయాలని ప్రార్థిస్తున్నాను" అని గోవిందయతీంద్రులు, వ్యాసభగవానుని వేడుకొన్నారు.

157. శ్రీ వ్యాస భగవానులు శ్రీ గోవింద యతీంద్రులకు తెలిపిన విషయాలను శ్రీ శంకరులకు తెలుపుతున్నారు. "యతివరేణ్యా! విను. పూర్వం కైలాసంలో పరమేశ్వరుని సన్నిధిలో దేవతలు సమావేశమై ఉండగా బ్రహ్మసూత్ర భాష్యరచనావిషయమైన చర్చ వచ్చింది."

158. వేదవ్యాసులు తిరిగి శ్రీ గోవిందయతీంద్రులతో ఇలా పలుకుతున్నారు: "నాయనా! కొంత కాలం తరువాత నాతో సమానుడు,

సర్వజ్ఞుడు అయినవాడు నీకు శిష్యుడు కాగలడు. ఎవరు నర్మదానదీజలాలన్నీ తన కమండలంలో బంధిస్తాడో ఆతడు నీకు శిష్యుడు కాగలడు. ఇదే గుర్తుగా పెట్టుకో" అన్నాడు.

వేదవ్యాసులు శ్రీ మహావిష్ణువు అవతారమని అందరికీ తెలిసిన విషయమే. శ్రీ శంకరులు కేవలం పరమశివుని అవతారమనీ తెలుసు. పై శ్లోకంలో "మత్సమః" నాతో సమానుడు అని చెప్పటంచేత శ్రీ వేద వ్యాసుల వారే శ్రీ శంకరులని నిస్సందేహంగా తెలుపుతున్నారు. అందువలన విష్ణువు, శివుడు ఒక్కరేననీ, లోకరక్షణార్థమై అవతరించారనీ తెలుస్తున్నది.

అందుచేత శ్రీ వేదవ్యాసులు బ్రహ్మసూత్రాలను, శ్రీ శంకరులు భాష్యాన్ని రచించి లోకంలో జ్ఞానతత్త్వాన్ని ప్రబోధించి సంసారంలో చిక్కుకు పోయిన జీవులను రక్షించారు.

కనుక మహేశ్వరావతారమైన శ్రీ శంకరులు, శ్రీ మహావిష్ణువు అవతారమైన శ్రీ వేదవ్యాసులు ఒక్కరేనని (సమానులు) తెలుస్తున్నది.

159. మరల శ్రీగోవిందయతీంద్రులు ఇలా పలుకుచున్నారు: ఆ శిష్యుడు లోకంలో విరుద్ధ మతాలన్నిటినీ ఖండించి, అద్వైతసిద్ధాంతాన్ని సుస్థిరంగా స్థాపించి బ్రహ్మసూత్రాలు సులభంగా అర్థమయ్యేట్లు భాష్యం వ్రాయబోతున్నాడనీ తెలిపారు. కార్తీకమాస చంద్రకిరణాలమల్లే, స్వచ్ఛంగానూ, తెల్లగానూ, చల్లగానూ ఉండే ఆ శిష్యుని కీర్తి లోకాల్లో విస్తరిస్తుంది."

160. సభామధ్యంలో వ్యాసభగవానులు నాతో ఈ విధంగా పలికి యుగాంతంలో వారు కైలాస పర్వతానికి వెళ్లారు. కనుక ఓ ప్రియతమా! నేను ముందు శ్రీ వ్యాసుల వారి నుండి విన్న లక్షణాలన్నీ నీలో కనిపిస్తు న్నాయి. కనుక నువ్వు సాక్షాత్తూ పరంధాముడవు.

161. మరల శ్రీ గోవింద యతీంద్రులు శ్రీ శంకరుల గూర్చి ఇలా పలికారు: ఓ తత్త్వజ్ఞా! శ్రేష్ఠా! నువ్వు మహోత్తమపురుషుడవు. శ్రీ వ్యాసమహర్షి చెప్పిన మహనీయుడవు. సర్వవిలక్షణ పురుషుడవు. సర్వజ్ఞుడవటంచేత నీతో సమానమైనవాడు మరొకరు లేరు. కనుక నువ్వు తక్షణమే లోకసంరక్షణ

గావింపు. సంబంధిత గ్రంథాలను రచించు" అని శ్రీ శంకరుల కర్తవ్యాలను అతిస్పష్టంగా తెలిపారు.

162. శ్రీ గోవిందయతీంద్రులు శ్రీ శంకరులను కాశీ నగరానికి వెళ్లవలసినదిగా తెలుపుతున్నారు. "నాయనా! దేవనదియైన గంగ ప్రవహించే మనోహరమైన ఆ పవిత్ర క్షేత్రం విశ్వేశ్వరులకు నివాసస్థానం. నువ్వు ఆ క్షేత్రానికి వెళ్లు. శ్రీ విశ్వేశ్వరుడు, మిగిలిన దేవతలందరు నిన్ను అనుగ్రహిస్తారు. నీకు శుభాలు చేకూరగలవు."

163. ఈ ప్రకారంగా మృదుమధురమూ, జ్ఞానయుక్తమైన పలుకులతో శ్రీ పతంజలి అవతారుడైన శ్రీ గోవింద యతీంద్రులవారు పరమశివుని అవతారుడైన శ్రీ శంకరులను కాశీక్షేత్రానికి పోవలసిందిగా ఆదేశించారు. శ్రీ శంకరులు పరమభక్తితో గురుపాద పద్మాలను తన హృదయంలో నిలుపుకొని ధ్యానించగా, గోవింద యతీంద్రులు శంకరుని తన విజ్ఞానపూరిత దృష్టితో అమిత పవిత్రునిగా చేసి పంపారు. పరమశివావతారు డయిన శ్రీ శంకరులు తన గురుదేవుల సన్నిధానంలో ఉపాసించుచుండిరి.

164. శ్రీ గురుదేవుల పాదపద్మాలకు సాష్టాంగ దండ ప్రణామం చేసి, గురువరులను విడువలేక విడువలేక ఎలాగో కాశీక్షేత్రానికి బయలుదేరారు. బ్రహ్మజ్ఞానసంపన్నుడై స్వస్వరూప పరబ్రహ్మంలో రమిస్తున్నారు.

165. శ్రీ శంకరులు కడిమి వృక్షాలతో నిండినదీ పవిత్ర గంగానది ప్రవహించేదీ, బంగారు కాంతులతో ధగధగ మెరుస్తూ విజ్ఞసంఘాలతో కూడినదీ అయిన ఆ కాశీక్షేత్రాన్ని చేరుకొన్నారు. మంచులా చల్లగాను, స్ఫటికం మల్లే స్వచ్ఛంగాను, మహాపవిత్రమైనదీ, చక్కగా కదంబవనాలతో కూడినదీ, యజ్ఞయాగాదులచే సర్వదేవతలను తృప్తిపరచేదీ, సుశిక్షా పరిపూరితమైనదీ, సర్వసమృద్ధితో నిండి ఉన్న ఆ కాశీక్షేత్రాన్ని శ్రీ శంకరులు మహానందంతో చూశారు. కాశీక్షేత్రం సాధువులకు, సన్న్యాసులకు పుట్టి నిల్లవటంచేత అనేకమంది సన్న్యాసులక్కడ నివసిస్తున్నారు. అంతేకాక సర్వవిద్యాపీఠాలుండడం వలన అనేక మంది కవిపండితులకు నిలయమై ఉన్నది. కాశీక్షేత్రాన గెలుపొందితే అట్టి పండితుడు తక్కిన జగత్తు నంతటినీ

అవలీలగా జయించగలడు. కనుక శ్రీ శంకరులు తన అద్వైతతత్త్వాన్ని ముందుగా కాశీక్షేత్రాన ప్రతిపాదించదలచి ఆ శివక్షేత్రానికి వచ్చారు.

166. కపిల మహాముని శాపవశాన సగర చక్రవర్తి కుమారులు భస్మమై సద్గతులు లేకుండాపోయారు. భగీరథుడు తన వంశీయులను ఉద్ధరింపదలచి మహేశ్వరుని గూర్చి కఠోరంగా తపస్సుచేసి ఆ మహాదేవుని మెప్పించి దేవగంగను పాతాళానికి తీసుకొనిపోయి తన పూర్వీకులకు సద్గతులు కలిగేట్లు చేశాడు. ఆ విధంగా భూలోకానికి తీసుకొనిరాబడిన గంగానదీతీరాన యోగీశ్వరులు తమ ఆశ్రమాలను నిర్మించుకొని అనుష్ఠానాలు చేసుకొంటుంటారు.

167. బ్రహ్మ విష్ణుపాదాలు కడిగిన జలం గంగానదియై దేవలోక మంతా ప్రవహిస్తూన్నది. భగీరథుని ప్రయత్నం వలన శివుని శిరస్సు నుండి, హిమాలయ శిఖరం మీదికి దుమికి అక్కడ నుండి క్రమంగా భూలోకాన ప్రవహించి కాశీక్షేత్రం మీదుగా పాతాళలోకానికి ప్రవహించినది. కాశీక్షేత్ర మందలి గంగాజలం ఉన్నంత స్వచ్ఛంగా, మరేచోటా కానరాదు. అందుకు మూడు కారణాలను పండితులు ఊహిస్తున్నారు.

1. విష్ణుపాదం నుండి ప్రవహించటంచేత ఈ పరిశుద్ధత ఏర్పడినదని చెబుతున్నారు.

2. చంద్రమౌళి శిరస్సు నందు గంగాదేవితోపాటు చంద్రుని గూడ ధరించటంచేత అతిశీతలంగాను, పరిశుద్ధంగాను ఉన్నదని చెబుతున్నారు.

3. పరమశివుని జటాజూటాల నుండి మంచుకొండపై పడి భూమికి ప్రవహించటంచేత పరిశుద్ధత, శీతలం అబ్బినవని చెబుతున్నారు.

ఈ విధంగా గంగానది స్వర్గలోకంలో ప్రవహిస్తూ ఆకాశ గంగగానూ, భూలోకంలో భాగీరథిగానూ, పాతాళంలో ప్రవహిస్తూ భోగవతిగాను పిలువ బడుతున్నది. ఈ గంగానదీ జలాలు స్వచ్ఛాలు, శీతలాలు, పవిత్రాలై ప్రకాశిస్తున్నాయి. శివవిష్ణు రూపంలో ఉండటంచేత అందరిచేత పూజించబడు చున్నవి. ఆ నది సర్వప్రాణుల తాపాలను చల్లారుస్తున్నది.

168. గంగానది యందు నిరంతరం కలువలనుండి వ్యాపించిన మధుర శీతల వాయువులకు భ్రమరాలు గానం చేస్తుంటాయి. గాలికి ఎగసిపడే అలలచేత నాట్యం చేస్తున్నట్లుంటుంది. నురుగు మిక్కిలి తెల్లనివైన పలువరసలమల్లే ఉండి నవ్వుచున్నట్లుంటుంది. తరంగాలు చలించనివై సూర్యహస్తాలతో కౌగిలించుకొన్నట్లుంటాయి. ఒక స్త్రీ గానం చేస్తూ, నృత్యం కూడా చేస్తూ, చక్కగా నవ్వుతూ అభినయహస్తంతో ఆలింగనం చేసుకొన్నదిగా గంగానది ఉంటుందని తెలుపుతున్నారు.

169. ఆ గంగానదిలో దేవతా స్త్రీలు జలకమాడి పవిత్రులవుతున్నారు. అలా దేవకాంతలు జలకాలాడుతున్నప్పుడు కుంకుమ ద్రవ్యాల చేత శ్వేతరక్తవర్ణాలు కలసినట్లుంది.

170. మహేశ్వరుని జటాజూటాల నుండి జాలువారి ఏర్పడిన ఆ గంగానదీ ప్రవాహమందు చంద్రునిమల్లేనే శ్రీ శంకరులు చక్కగా స్నానం చేశారు. ఆ ప్రకారం విశ్వేశ్వరుని నగరమైన వారణాసియందు గంగాస్నానం చేసి శ్రీ శంకరులు ధన్యులైనారు. గంగానదీస్నానం చేయగలిగినందులకు ధన్యునిగా తలచారు.

171. గంగాస్నానంచేత శ్రీ శంకర యతీంద్రుల శరీరమందలి నీటి బిందువులు చంద్రకాంతితో మెరిసి చంద్రకాంతమణిమల్లే ప్రకాశించాయి.

172. శ్రీ విశ్వేశ్వరుని పాదపద్మాలను అనుదినం విష్ణువు మున్నగు దేవతలందరు పూజిస్తూంటారు. అట్టి కాశీక్షేత్రంలో వ్రతనిష్ఠుడై భక్తితో శ్రీ విశ్వేశ్వరుని సేవించుకొంటూ శ్రీ శంకరాచార్యులు ఆ నగరంలో కొంత కాలం నివసించారు. శ్రీ శంకరులు తాను సాక్షాత్పరమశివుడయినా, సర్వజ్ఞు డయినా, యతీశ్వరుడయినా, శ్రీ గురుదైవాలను భక్తితో పూజించేవారు.



# సర్గము - 7

## శ్రీ శంకరులకు వేదవ్యాస సందర్శనం

1. ఒకానొకప్పుడు శ్రీ శంకరులు పద్మపాదుడు మున్నగు శిష్యులచేత గంగా తీరాన సూత్ర భాష్యం పఠింపజేయసాగారు. ప్రజ్ఞావంతులైన శిష్యులు వేసే ప్రశ్నలకు, సందేహాలకు తగిన విధంగా సమాధానాలు చెబుతూ, శంకరులు వారందరినీ వేదాంత నిష్ణాతులనుగా చేయసాగారు. ఆ విధంగా మధ్యాహ్నమయ్యే వరకు భాష్య పఠనం కొనసాగింది.

2. మధ్యాహ్నమవటం చేత శిష్యులకు విశ్రాంతి నీయదలచి పాఠాలను విరమించి లేచి వెళ్లడానికి ప్రయత్నిస్తుండగా, అంతలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు అచ్చటకు వచ్చాడు. ఆతడు శ్రీ శంకరులతో "అయ్యా! తమ రెవరు? శిష్యుల కేదో పాఠాలు బోధిస్తున్నట్లున్నది. నా కా వివరాలను తెలుపండి" అని పలికాడు.

3. శిష్యులు వృద్ధ బ్రాహ్మణునితో ఇలా పలికారు: ఆర్యసత్తమా! మా గురుదేవులు సర్వజ్ఞులు. లోకపూజనీయులు. ఉపనిషత్తులన్నింటినీ యథార్థంగా గ్రహించి వ్యాఖ్యానిస్తారు. అందుచే వీరు "సర్వోపనిషత్స్వతంత్రా చార్య"లని ప్రఖ్యాతి పొందారు. అంతేకాక, విష్ణుమూర్తి అవతారులైన శ్రీ వేదవ్యాసులచే రచింపబడిన బ్రహ్మసూత్రాలకు ఉపనిషత్తులందలి ప్రమా ణంతో నిరూపిస్తూ సవిస్తరంగా భాష్యం వ్రాశారు. జీవబ్రహ్మ భేదవాదం పూర్తిగా నశించినది. 'తత్త్వమసి' అనే మహావాక్యార్థమైన జీవబ్రహ్మైక్య తత్త్వాన్ని కరతలామలకమయేట్లు వివరించారు. ఈ విధంగా బ్రహ్మవిద్య నశించకుండా యీ భాష్యం ద్వారా తిరిగి ప్రాణ ప్రతిష్ఠ గావించారు. ఇదే మా గురువుగారి రోజువారీ కార్యక్రమం. వీరు మా గురుదేవులు. మహా ప్రజ్ఞాపాటవాలతో బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాసి మా చేత పఠింప జేస్తుంటారు.

4. వృద్ధ బ్రాహ్మణుడు శంకరులతో ఇలా పలికాడు: బుధవర్యా! బహు కష్టతరాలైన బ్రహ్మసూత్రాలకు తాము భాష్యం వ్రాస్తున్నారని తమ శిష్యులు తెలుపుచున్నారు. మహాత్ములైన పండితులు కూడా ఆ బ్రహ్మసూత్రాలను అర్థం చేసికొనలేకున్నారు. అందువలననే ఎవరూ భాష్యం వ్రాయడానికి సాహసించలేదు. మీ ప్రయత్నం అమితమైన ఆశ్చర్యాన్ని ఆనందాన్ని కలిగిస్తున్నది. శ్రీ వేదవ్యాస మహర్షిచే వ్రాయబడిన బ్రహ్మసూత్రాలలో ఏదైనా ఒక సూత్రానికి చక్కగా అర్థం తెలుపండి. స్ఫుటంగా ఉచ్చరించగలిగితే ఉచ్చరించి చూపండి. విన కుతూహలంగా ఉన్నది.

5. శ్రీ శంకరులు వృద్ధ బ్రాహ్మణునితో ఇలా పలికారు: మహర్షీ! నమస్కారం. సూత్రార్థాలు తెలిసిన గురువరులకు నమస్కారాలు తెలుపుతూ మహర్షులందరినీ ప్రార్థిస్తున్నాను. బ్రహ్మసూత్రాలు బాగా తెలుసునన్న అహంభావం నాకు లేదు. అయినా తమరు ప్రశ్నించారు. కాబట్టి, నా శక్తికి తగినట్లుగా పలుకుతాను. తమరు నన్ను ఏ సూత్రానికి అర్థం తెలుపమని ఆదేశిస్తారో నేనా సూత్రానికి అర్థం వచిస్తాను. ఆనతివ్వండి.

6. వృద్ధ బ్రాహ్మణుడు శ్రీ శంకరులతో ఇలా పలికాడు: పరమహంస శ్రేష్ఠా! పరమ వేదాంత సిద్ధాంతరూపమైన బ్రహ్మసూత్రాలకు అర్థం తెలిసిన సర్వజ్ఞుడవు. బ్రహ్మసూత్రాలందలి మూడవ అధ్యాయంలో "తదంతర ప్రతిపత్తౌ...." అనే సూత్రం ఉంది. ఈ సూత్రం నీకు ఏమాత్రం తెలిసినా, దానిని స్పష్టంగా ఉచ్చరించు. ఈ సూత్రార్థ రహస్యాను తెలియజేయి.

(జీవుడు ఈ దేహం నుండి సూక్ష్మభూతాంశాలతో కూడి నిష్క్రమిస్తాడా లేక ఇంద్రియ ప్రాణాలతో కూడి వెడలుతాడా? లేక జీవుడొక్కడే వెడలుతాడా? మున్నగు సంశయాలను తెలుపుచున్నది)

7. వృద్ధ బ్రాహ్మణునితో శ్రీ శంకరులు ఇలా పలికారు: ఓ మహర్షీ! మరణం సంభవిస్తున్నప్పుడు జీవుడు ఇంద్రియాల నుండి విడివడి మరొక సూక్ష్మ దేహంలో ప్రవేశిస్తాడు. ఆ సమయంలో జీవుడు సూక్ష్మదేహోత్పత్తికి కారణాలైన సూక్ష్మభూతాంశాలతో చేరి వెళతాడు. ఈ అర్థాన్నే తాండి శ్రుతీ, గౌతమజైమినులు ప్రశ్నోత్తరాలచేత స్పష్టపరచారు. ఆ సూత్ర వాక్యాలను

వివరిస్తాను. చిత్తగించండి. గౌతమముని ఇలా ప్రశ్నించాడు. "వేత్థ యథా పంచమ్యామా హుతావాపః పురుషవచసో భవన్తీతి" పంచమాహుతి యందు ఉదకాలు పురుష రూపం ధరిస్తున్నవని ఎలా చెప్పగలవు?

జైమిని మహర్షి సమాధానంగా ఇలా పలికాడు: "ద్యుపర్జన్య పృధివీ...." ఆకాశం, మేఘం, భూమి, పురుషుడు, స్త్రీ అనే అయిదు విధాలైన అగ్నుల యందు క్రమంగా శ్రద్ధా, సోమ, వృష్టి, అన్నం, రేతస్సు అనే అయిదు ఆహుతులను చూపించి, పంచద్రవ్యాలను హోమించగా అయిదవదయిన రేతోరూపమైన ఆహుతి యందు ఉదకాలే పురుషరూపం చెందుచున్నవి. (అంటే, జీవుడు దేహమందు ప్రవేశించడానికి శరీర బీజాలైన సూక్ష్మబీజాలతో చేరి, ముందుగా ఆకాశాన శ్రద్ధారూపంగా ప్రవేశించి, చంద్ర కిరణాల ద్వారా మేఘాలను చేరుకొని, వర్షం రూపంలో భూమిపైకి వచ్చి, అన్న రూపాన పురుషుని యందు ప్రవేశించి, రేతస్సు రూపంగా స్త్రీ గర్భమందు ప్రవేశించి పురుషుడవుతున్నాడు.)

ఈ అర్థాన్నే "తదన్తర....." అనే బ్రహ్మసూత్రం ప్రతిపాదిస్తున్నది. అంటే, జీవుడు శరీర కారణభూతాలను తీసుకొనే పరలోకానికి పోతున్నాడు. వేదాలందు పంచాగ్నుల విద్యను ఉపదేశించే సమయంలో జరిగిన ప్రశ్నకు, దాని సమాధానం ఈ విషయాన్నే స్పష్టం చేస్తున్నవి. అది ఎలా గంటే, ప్రవాహణుడనే రాజు తన సభలోని శ్వేతకేతు మహామునిని చూసి "అయిదవదయిన జలం ఆహుతి యందు పురుష రూపం చెందుతుందని తమకు తెలుసా?" అని ప్రశ్నించాడు. అంతట ఆ ముని తండ్రియైన గౌతమునకు చెప్పాడు. తరువాత గౌతమ శ్వేతకేతువులిరువురూ ప్రవాహణ రాజునే ఆశ్రయించి బదులు కోరారు.

ప్రవాహణ రాజు ఇలా పలికాడు: ఆకాశం, మేఘం, భూమి, పురుషుడు, స్త్రీ అనే పంచాగ్నులను ఉపాసించాలి. ఈ పంచాగ్ని విద్యయందు స్త్రీరూపమైన అయిదవ అగ్ని యందలి ఆహుతిని గూర్చి శ్రుతివాక్యమీ రీతిగా తెలుపుచున్నది. 'జలం వంటి ద్రవపదార్థాలు అగ్ని యందు హోమం చేయబడి, ఆ ద్రవపదార్థాలన్నీ విరాడ్రూప యజమానుని జేరి,

పిమ్మట ఇంద్రియాధిపతులైన ఇంద్రాదులకు చేరుతుంది. ఆ తరువాతే వారిచే మొదటి అగ్ని అయిన ఆకాశమందు హోమం చేయబడుచున్నవి. తదనంతరం రెండవ అగ్నియైన మేఘమందు జలరూపం దాల్చి, మూడవ అగ్ని అయిన భూమియందు ఓషధి రూపం దాల్చి, నాలుగవ అగ్నియైన పురుషుని యందు వీర్యమై అయిదవ అగ్ని అయిన స్త్రీ యందు హోమం చేయబడి గర్భరూపం దాల్చి పురుషుడనే పేరు పొందుచున్నవి. ఈ విధమైన విచారణ చేత, జీవుడు భూత సూక్ష్మాలతో కలసే దేహాంతర ప్రయాణం చేస్తున్నాడని స్పష్టమవుతున్నది.

ఈ విధంగా శంకరుల వారు సూత్రార్థాన్ని స్పష్టంగా విశదీకరిస్తూ, సుస్పష్టమైన స్వరంతో చెప్పారు.

8. శ్రీ శంకరులు సూత్రార్థాన్ని స్పష్టంగాను, యుక్తియుక్తంగాను, వచనసామర్థ్యంతోను, ప్రతిభాపాటవాలతోను ప్రతిపాదించగా, 'మన గురువుకు సాటియైన వాడెవ్వరూ లేరుగదా!' అని శిష్యులందరూ ఆనందపర వశులయ్యారు.

శ్రీ శంకరుల వాదనయంతా సావధానంగా విన్న ఆ వృద్ధ బ్రాహ్మణుడు (వేదవ్యాసుడు) శత విధాలుగా ఖండించాడు. సభాస్థలంలోని పండిత విద్వద్వరేణ్యులందరూ శ్రీ శంకరోక్తులను ఖండించటం చూసి ఆశ్చర్యపోయారు. ఓహో! మహేశ్వరుని అవతారమైన యీ శంకరుని వాక్యాలను ప్రతిఘటించే యీ మహాత్ము డెవ్వరని ఆశ్చర్యపడసాగారు.

వ్యాస భగవానుడు ఇలా ఖండించాడు: 1 జీవుడు దేహాంతర ప్రయాణం చేస్తుప్పుడు, కర్మబలంచేత సూక్ష్మ సంస్కారాలు ఏర్పడగా వ్యాపించే స్వభావంకల ఇంద్రియాలకు, ఆత్మకు ఈ రెండింటికీ వాటి వాటి వ్యాపార ప్రవృత్తి సంభవిస్తున్నదా? 2. లేక కేవలం ఆత్మకే మరొక దేహాన్ని ధరించేటప్పుడు వృత్తి లాభం కలుగుతుందా? అప్పుడు దేహం మల్లేనే ఇంద్రియాలు కూడా భోగస్థానంలో పుడుతున్నవా? 3. లేక మనస్సొక్కటే భోగస్థానాన్నాశించి వెళుతుందా? 4. లేక పక్షి ఒక చెట్టుపై నుండి

మరొక చెట్టు పైకి ఎగిరిపోయేట్లుగా, జీవుడు కూడా ఒక శరీరం నుండి మరొక శరీరం లోపల ప్రవేశిస్తున్నాడా?

జీవుడు శరీరాన్ని వదలి వెళ్లేటప్పుడు జీవునితోపాటు ఇంద్రియాలు కూడా పోతున్నాయంటే అది శ్రుతి విరుద్ధమవుతున్నది. ఎందువల్లనంటే, పురుషుడు మరణించగానే, వాక్కు అగ్నిలో, ప్రాణాలు వాయువునందు, నేత్రాలు సూర్యునియందు, మనస్సు చంద్రుని యందు, చెవులు దిక్కులయందు లయమగుచున్నవని వేదం చెబుతున్నది. కాబట్టి ఇంద్రియాలు జీవునితో కూడా పోతాయని చెప్పటం సహేతుకం కాదు. అంతేకాక, ప్రథమాగ్ని (ఆకాశం) యందలి ద్రవాల వినికిడి లేకపోవటంచేత శ్రద్ధయే వినబడటం వలన, పంచమాహుతి యందలి ఉదకాలు పురుష రూపం చెందుచున్నవని నిరూపించడానికి సాధ్యం కాదు. ఇది అసమంజసం. ఇచ్చట ద్యులోకాది పంచాగ్నులు శ్రద్ధాసోమాది పంచాహుతులకు ఆధారంగా పఠింపబడినవి. కాబట్టి ప్రథమాగ్ని యందు వినబడిన శ్రద్ధను వదలి వినబడని ద్రవాలను కల్పించటం గొప్ప సాహసం. శ్రద్ధ అంటే, విశ్వాసంతో ఆచరించబడిన కర్మల సమూహం, దృఢతర విశ్వాసం. శ్రద్ధాది ద్రవ్యాల ననుసరించి పంచమాహుతి అయిన స్త్రీ యందు ఉదకం పురుష రూపాన్ని ధరిస్తుంది. సూక్ష్మభూతాలతో కూడిన జీవుని గమనం శ్రుతి సమ్మతం కాదు. ఈ విధంగా వ్యాసుల వారు శ్రీ శంకరుల వాక్యాలను శతవిధాలుగా ఖండించారు.

9. శ్రీ శంకరులు ఇలా బదులు పలికారు: ఓ మహానుభావా! "న తావత్సాంఖ్య....." ఇప్పుడు మీరు ప్రశ్నించిన నాలుగు ప్రశ్నలు సాంఖ్య, బౌద్ధ, వైశేషిక, దిగంబరులచే కల్పించబడటం చేత, శ్రుతి విరుద్ధాలవటం చేత అవి యేవీ గణనీయాలు కావు. అంతేకాక కేవలం ఉదకాలు దేహ నిర్మాణాన్ని చేయజాలవు. జలం, తేజస్సు, పృథివి అనే యీ మూడు భూతాల చేతనే దేహం ఉత్పన్నమగుచున్నది. ఈ విషయాన్ని 'త్రివృత్కరణ' శ్రుతి ధ్రువీకరిస్తున్నది. పంచభూత సూక్ష్మాంశములే దేహానికి ముఖ్య కారణా (ఉపాదానం) లని సర్వశ్రుతులచే అంగీకరించబడినది. అంతేకాక ప్రాణాలు జీవులను అనుసరిస్తున్నవి.

"కించ ప్రాణానాం ........" జీవుడు శరీరంలో ప్రవేశించే సమయంలో ప్రాణాలు జీవుని అనుసరించి పోతున్నవని శ్రుతి యందు తెలుపబడినది. జీవాత్మను అనుసరించిపోయే ప్రాణాన్ని ఇతర ప్రాణాలు కూడా అనుసరిస్తాయి. అట్లే ఇతర భూతాలచే యేర్పడిన సూక్ష్మభూతాంశాలు జీవునితో ఉత్క్రమిస్తాయి. కాబట్టి ప్రాణగమనం శ్రుతి ప్రసిద్ధం.

"న హి నిరాశ్రయాః......" ప్రాణాలు జీవుని ఆశ్రయించే ఉంటాయి. వేరుగా ఉండవు. జీవించివున్నప్పుడు కూడా ప్రాణాలు నిరాశ్రయాలవటం లేదు.

"వాగాదీనామగ్న్యాదిగతి శ్రుతిస్తు......" వాగాదులు అగ్న్యాదులను చేరుచున్నవని చెప్పే శ్రుతి అయితే అది ముఖ్యం కాదు. మరణించిన తరువాత రోమాలు ఓషధులలోను, కేశాలు వృక్షాలలోను లయమవుతున్నవని అచ్చట చెప్పబడుచున్నది. కేశాదులు జీవునితోపాటు పైకి ఎగిరి పోవటం లేదు. ఇవన్నీ ప్రత్యక్షాలు కావు కాబట్టి యీ శ్రుతులు ముఖ్యమైనవి కావు (గౌణం). మరణ సమయంలో వాగాదీంద్రియాలకు అగ్న్యాది దేవతలుపకరించలేకపోవుచున్నవని భావం. అంటే ఆ సమయమందు ఆయా కార్యాలను చేయజాలవు. ఇదే ఔపచారిక ప్రయోగం.

"యత్తు ప్రథమేఽ గ్నా విత్యాది....." ప్రథమాగ్ని యందు శ్రద్ధాశబ్దంచే ఆ ఉదకాలే చెప్పబడుతున్నాయి. ఇట్లు చెప్పుటచే ఆది, మధ్య, అంతిమాలందు అన్వయింపబడి ఏక వాక్యముపపన్నమైనది. ఆ శబ్దమే అన్నిచోట్లా అన్వయింపబడి శ్రద్ధ, వృష్టి, రేతస్సులతో ఏకవాక్యత ఘటించుచున్నది. ఆయా ఆహుతుల రూపంలో అప్పుడు హోమం చేయబడి రేతస్సు రూపాన పురుషుడగుచున్నాడని ఏకవాక్యత సంభవిస్తుంది.

అలాగాక ప్రశ్న సమాధానాలలో శ్రద్ధను చెప్పినచో ప్రశ్న వేరుగా జవాబు వేరుగను అగుటచే ఏకవాక్యత కుదరదు. శ్రద్ధను వివరిస్తున్నారు.

"న చ శ్రద్ధాఖ్యః......." శ్రద్ధ అంటే విశ్వాసం లేక జీవుని ధర్మం, ధర్మం నుండి ఆ శ్రద్ధను వేరుజేసి హోమం చేయ సాధ్యం కాదు. అందు

వలన వైదిక ప్రయోగం వలన శ్రద్ధా శబ్దంచే నప్పులే వచించబడుచున్నవి. ఈ విషయానికి దృష్టాంతం చెబుతున్నారు.

"గచ్ఛన్తీ నామపాం బీజరూపతయా......" బాలకుని యందు శూరత్వాది లక్షణాలు చెప్పవలసి వచ్చినప్పుడు 'సింహబలుడు' అని చెప్పే ప్రయోగాన్ని ఔపచారికమని చెబుతారు. "శ్రద్ధాపూర్వక కర్మసమ...." 'మంచాఃక్రోశంతి' అనే ప్రయోగమందు మంచస్థ పురుషులు లక్షణావృత్తిచే వచింపబడేట్లుగా, (కర్మలన్నీ శ్రద్ధతో ఆచరించబడడం చేత సూక్ష్మభూతాలను ఆశ్రయించి కర్మలుండటం వలన) శ్రద్ధ అంటే ఉదకములని లక్షణావృత్తిచే గ్రహించ బడుచున్నది. ఇందుకు స్వతఃప్రమాణం శ్రుతివాక్యం. "ఆపో హాస్మై......" పుణ్యకర్మలు చేసే వారికి ఉదకములే శ్రద్ధను కలిగిస్తున్నవనే శ్రుతి చేత ఉదకములు శ్రద్ధకు హేతువులవుతున్నవి. కాబట్టి శ్రద్ధ చేత ఉదకములు చెప్పబడుచున్నవి. ఇవి లక్షణావృత్తిచే సూక్ష్మభూతాంశములను చెప్పు చున్నవి.

"యద్యప్యత్ర జీవానాం......" ఒకవేళ ప్రాణ ప్రయాణమందు జీవుల యొక్క శ్రవణం లేకపోయినా, ఇష్టా పూర్తాది కర్మలచేత పితృయాన మార్గాన పోయే వారే యిచ్చట గ్రహింపగలరు. అంటే మరణించిన తరువాత జీవుడు ప్రాణాది వాయువులతోను, సూక్ష్మభూతాంశాలతోను నిష్క్రమించి, సూక్ష్మ శరీరంలో ప్రవేశిస్తున్నాడు. ఇందు మూలంగా ముందు జనించిన వికల్పాలన్నీ ఖండించబడినవి. శ్రీ వ్యాసమహర్షి శతవిధాలుగా ఖండించగా శ్రీ శంకరులు సహస్ర విధాలుగా ఖండించి సూత్రార్థాలను చక్కగా ప్రతిపాదించారు.

10. బ్రహ్మసూత్ర సూక్తులపై ఉపనిషత్తులను ప్రమాణంగా చేసుకొని వాదోపవాదాలు జరుగుచుండగా సమీపాననే వినమ్రుడైయున్న పద్మపాదుడు శ్రీ శంకరులతో ఇలా పలికాడు. "ఓ మహాత్మా! ఈ మహనీయాత్ములు సాధారణ బ్రాహ్మణమాత్రుడు కాదు. సకల వేదాలను విభజించి, సర్వతత్త్వార్థాలూ తెలిసిన శ్రీ వ్యాసమునీంద్రుడే కాగలడు. లేకుంటే తమతో ఇంతకాలం వాదం చేయడానికి సాహసిస్తాడా? కాబట్టి ఈ బ్రాహ్మణ

శ్రేష్ఠుడు శ్రీమన్నారాయణావతారుడైన వేదవ్యాసుల వారే! తమ బ్రహ్మసూత్ర భాష్యాన్ని పరీక్షింప వచ్చి ఉంటారు. ఇందులో ఎంతమాత్రమూ సందేహం లేదు.”

11. శ్రీ పద్మపాదుడు వినమ్రుడై శ్రీ వ్యాసమహర్షిని శ్రీ శంకర మునీంద్రులను స్తుతించాడు. “ఓ గురుదేవా! మీరు సాక్షాత్తూ పరమశివులు. ఈ బ్రాహ్మణోత్తముడు శ్రీమన్నారాయణుడైన శ్రీ వేదవ్యాస భగవానులు. శివకేశవులైన మీరిరువురూ వాదించుకొంటుండగా, శ్రవణం చేయడం మా బోటి సేవకుల భాగ్యమే భాగ్యం. సర్వవేదాలు వాటి యథార్థమైన తత్త్వం, అర్థాన్ని మీరలే యెరుగుదురు. ఆ తత్త్వాన్ని నిర్ణయించే సామర్థ్యం మరెవ్వరికీ లేదు. శివకేశవులైన మీ ముందు ఈ వాక్యాలు పలుక సాహసించినందుకు నన్ను మన్నించండి.”

12. ప్రజ్ఞావంతుడు, వినయశీలి, పరమభక్తుడు, దివ్యజ్ఞాన సంపన్నుడు అయిన పద్మపాదుడు పలికిన పలుకులకు శ్రీ శంకరులు పరమానందం చెంది యిలా తలచారు. “వీని వాక్యాలు యథార్థాలు. శ్రీ వ్యాసభగవానులే తన భాష్యాన్ని పరీక్షించడానికి వచ్చివుంటారు. లేనియెడల యింతటి జటిల మైన వాదాన్ని ఇంతకాలం విరామం లేకుండా వాదించగలమా? కాబట్టి యీ భూసుర మునివర్యుడు శ్రీ వేదవ్యాసులే అయి ఉండాలి” అని నిశ్చ యించుకొన్నారు. మృదుమధురమైన పద్యరత్నాలను ఆశువుగా నివేదించారు.

13. శ్రీ శంకరులు శ్రీ వ్యాసభగవానులను ఈ విధంగా స్తుతించారు. “మహాత్మా! నీవు సర్వలోకాలకు పూజనీయుడవు. మహర్షీ! తమ స్వరూపం అప్రాకృతం, నిరుపమం. సర్వపాపక్షయకరం. మీరు మానవమాత్రులైన సామాన్య బ్రాహ్మణులు కారు. మెరుపు తీగలవలె మెరుస్తున్న మీ జటలు రత్నఖచిత కిరీటాల మల్లే ప్రకాశిస్తున్నవి. పరిశుభ్రమైన యజ్ఞోపవీతం, కృష్ణాజినం ధరించిన తమరు దర్శనమాత్రాననే సర్వపాపాలను నాశనం చేసే వ్యాసులై సాక్షాత్కరిస్తున్నారు. విష్ణుస్వరూపులైన తమకు నమస్కరిస్తున్నాను. తమరు వ్యాసభగవానులు తప్ప వేరొకరు కాదు” అని భక్తిప్రపత్తులతో శ్రీ శంకరులు స్తుతించారు.

14. శ్రీ శంకరులు శ్రీ వ్యాసభగవానుల దర్శనాన్ని కోరుతూ ఎంతో ప్రార్థించారు. "ఓ మహనీయాత్మా! సర్వజ్ఞా! బ్రహ్మసూత్రాలు సర్వోపనిషత్సారమై, విస్తృతమైన అర్థాలతో, సర్వవేదాంత తత్త్వాలను తెలుపుచున్నది. అందలి ప్రతిపాదం తత్త్వాంశాలతో సమ్యగ్విచారణలతో మహానదివలె ప్రవహిస్తున్నది. నిర్విశేష నిర్గుణ తత్త్వాన్ని, సవిశేష గుణ తత్త్వాలతో కార్యబ్రహ్మాన్ని, కారణ బ్రహ్మాన్ని, సవిశేష పరబ్రహ్మ మందు జగత్స్వరూపాన్ని కేవల బ్రహ్మస్వరూపాన్ని, జీవబ్రహ్మైక్యాన్ని, ఈ విధంగా పరాపరార్థాలను ప్రతిపాదిస్తున్నది. కేవల బ్రహ్మ సత్తా సిద్ధాంత స్వరూపమై ఉండే అద్వైత భాష్యాన్ని దయతో పరిశీలించండి. గ్రంథకర్త తామే కనుక దోషాలుంటే మన్నించండి; భావమందు విరుద్ధాలుంటే సవరించండి. తమకు సమ్మతమయితే పరిశీలించండి" అని నిరహంకార భావంతో, శ్రీ వ్యాసుల వారి ముందు విన్నవించుకొన్నారు. అంతే గాక శీఘ్రంగా పరమ దయతో నా ముందు సాక్షాత్కరించి నన్ను ధన్యుని చేయమని ఎంతో ప్రార్థించారు.

15. శ్రీ శంకరులు ఈ విధంగా ప్రార్థించగా, బంగారు తీగలమల్లే కళ్లు మిరుమిట్లు గొలుపుతూ, మనోహరంగాను, జ్ఞానసముద్రమైన చిన్ముద్రచే జీవబ్రహ్మైక్య సిద్ధాంతాన్ని, శ్రీ దక్షిణామూర్తిలా, ప్రకటిస్తూ శ్రీ వ్యాస భగవానులచ్చట ప్రత్యక్షమయ్యాడు.

16. శ్రీ వేదవ్యాసులు తన శ్యామ దేహకాంతులతో, కమండలు తేజఃపుంజంచే విరాజిల్లారు. శరత్కాలీన చంద్రబింబం కూడా శ్రీ వ్యాసులవారి దేహకాంతి ముందు వెలవెలబోతోంది. శ్యామాయమాన ద్యుతి ప్రవాహంతో నీలమేఘశ్యామ దేహంగలవాడై శ్రీ వ్యాస భగవానులు అనుగ్రహ దర్శనమిచ్చారు.

17. అత్యంత స్వచ్ఛమై, మూర్తీభవించిన సత్యస్వరూపునిలా ప్రకాశిస్తూ, 27 ముత్యాలు గల మాలను ధరించి సాక్షాత్కరించారు. లోకప్రసిద్ధమైన చంద్రవంశం వృద్ధిగాంచక ముందు అశ్విని మున్నగు 27 నక్షత్రాలు తనను శరణు పొందగా, ఆ నక్షత్ర పంక్తిని అనునయిస్తూ అభయహస్త మొసగుతూ ఆ ముత్యాల జపమాలను కంఠమందు ధరించాడు.

18. పులిచర్మాన్ని ధరించి, శరీరాన విభూతి రేఖలతో రుద్రాక్ష మాలను ధరించి, జడలు విరబోసుకొని, పరమశివునిలా ప్రత్యక్షమై శ్రీ శంకరులకు దర్శనమిచ్చి శివకేశవుల సమైక్యాన్ని చాటారు.

19. మదించిన ఏనుగును తన అంకుశంచేత మావటివాడు లోబరచుకొనే విధాన, శ్రీ వ్యాస భగవానులు అవివేకాన్ని ప్రబలాహంకారాన్ని నశింపజేసి జీవబ్రహ్మైక్య సిద్ధాంతమనే అంకుశం ద్వారా అద్వితీయ పరబ్రహ్మమై ప్రకాశించారు. అంతేగాక అద్వైత సిద్ధాంతాన్ని స్వయంగా ప్రతిపాదించి ఈ మహోజ్జ్వలమైన వేద వాక్యాలను, ఇతరులచే దూషింపబడని విధంగా బ్రహ్మసూత్రాలను రచించాడు. గోవులను త్రాడుతో స్తంభానికి కట్టినట్లుగా, సకల వేదాలను బ్రహ్మవిద్య అనే స్తంభాన్ని బ్రహ్మసూత్రాలనే త్రాడుచే నియంత్రించి రక్షించారు.

ఈ విధంగా బ్రహ్మతత్త్వజ్ఞానంచే మూలాహంకారాన్ని నాశన మొనరించి నిరహంకార తత్త్వజ్ఞుడై, బ్రహ్మసూత్ర రచయితయైన శ్రీ వేదవ్యాసులు తన ఎదుట నిలచినట్లుగా శ్రీ శంకరుల దృష్టిపథాన గోచరించింది.

20. శ్రీ వ్యాసమహర్షి బ్రహ్మజ్ఞాన సంపన్నులైన శిష్యులతో నిరంతరం, పైలుడు, సుమంతుడు, శుకుడు మున్నగువారే తనను సేవిస్తుండగా ప్రసన్న దృష్టితో పరబ్రహ్మస్వరూపుడై జ్ఞానమృతాన్ని వర్షించి వారికి ముక్తిధామానికి మార్గం చూపుచున్నారు. అంటే వారి పూర్వజన్మల పుణ్యఫలాన శ్రీవేదవ్యాసుల వారిని సందర్శించినంత మాత్రాననే సంసార తాపత్రయాలు నశించి ముక్తిధామాన్ని చేరి ధన్యులగుచున్నారు. అట్టి వేదవ్యాసమహర్షిని శ్రీ శంకరులు దర్శించారు.

21. వసిష్ఠాది మునులకు కూడా గురువైనవాడు, ఇంద్రియాలను జయించిన వాడు, పరమశ్రేష్ఠుడు, చక్రవర్తిలా ప్రకాశించే శ్రీ వ్యాస భగవానులను శ్రీ శంకరులు దర్శించి, అది తమ పూర్వజన్మల సుకృతమని తలచారు. శిష్యులతో కూడి లేచి పాదాభివందనం చేశారు.

22. శ్రీ వేదవ్యాసుల వారికి శ్రీ శంకరులు సాష్టాంగంగా నమస్కరించి భక్తిప్రపత్తులతో ఇలా స్తుతించసాగారు.

23. కృష్ణద్వీపమందు నివసించే మహానుభావా! మహర్షిసత్తమా! ప్రణామాలు. పుణ్యాత్ములు, మహాత్ములు, బ్రహ్మవిద్యాస్వరూపులైన మిమ్ము లను చూసినంతనే నా పురుషార్థం సిద్ధించినట్లయినది. తమకు ఎల్లవేళ లందూ స్వాగతం పలుకుచున్నాను. నేను చేయవలసిన కార్యాలన్నీ తమ రాకవలన సిద్ధించినవి. నేను కృతార్థుడనైనాను. మహాత్ములంటే, కోరకుండానే, ఇతరుల మనోగతాలను నెరవేర్చే దయార్ద్రహృదయులు. అందువలననే తమ దర్శనం వలన సర్వశుభాలు, శాంతి చేకూరినవి.

24. దయామయా! పరోపకార వ్రతపరాయణా! తమ మహిమలను తెలుసుకొనే సామర్థ్యం ఎవరికి ఉంటుంది? వేదాలన్నిటినీ విభాగాలు చేశారు. పదునెనిమిది పురాణాలను రచించారు. తమ కవితాపటిమకు సాటియైన రెండు శ్లోకాలు చెప్పగల వాడు నేటివరకు కానరాదు గదా!

25. మహాత్మా! దురవగాహాలైన వేదాలన్నీ విభాగం చెందక మహాసముద్రంలా అగాధాలై ఉండేవి. అట్టి వేదాన్ని ఋగ్యజుస్సా మాథర్వాలనే నాలుగు భాగాలుగా చేశారు. ముందు యుగాలవారు మందభాగ్యులవుతారని ఊహించే వేదవిభాగాన్ని గావించారు. దయామయులైన తాము లోకహితం కోరి యిట్టి పరిశ్రమ చేశారు. అందువలననే మిమ్ములను అష్టాదశ పురాణాలకు కర్తయనీ వేదవిభాగ కారకుడవనీ, బ్రహ్మసూత్ర రచయితవనీ వేయి విధాలుగా మహర్షులు స్తుతిస్తున్నారు.

26. సర్వజ్ఞా! మునిసత్తమా! తమను తెలుసుకోవడం యెవరికీ సాధ్యం కాదు. ప్రాకృత జనుల కసలే సాధ్యం కాదు. తమవంటి వారిని స్మరించినంత మాత్రాననే పవిత్రులై బ్రహ్మజ్ఞాన సంపన్నులవుతా రనటంలో సందేహమే లేదు. తమకు తెలియని విషయం, తాము పలుకని ధర్మం లోకాన కానరాదు. సర్వమూ తెలిసిన తాము వారి వారి యోగ్యతలను బట్టి అందరూ తరింప ఎన్నో మార్గాలను బోధించారు. లోకాల నుద్ధరించ డానికి శ్రుతులను, స్మృతులను, పురాణాలను రచించారు. తమరు వర్తమాన భూత భవిష్యత్తుల నెరిగినవారు. లోకాన తాము దర్శించనిది లేదు. అందుచే తాము త్రికాలజ్ఞులై విరాజిల్లుతున్నారు.

27. మహాత్మా! సర్వప్రకాశకా! జ్ఞానస్వరూపులు, పూజనీయులైన తమరు భారత చంద్రులై ప్రకాశిస్తున్నారు. ఆకాశాన ప్రకాశించే చంద్రుడు రాత్రి సమయాలందు మాత్రమే ప్రకాశిస్తాడు. కానీ, యీ భారతచంద్రుడు అలాగాక చిదాకాశమందు నిరంతరం ప్రకాశిస్తూ, మాయచే కళంకితుడు కాక జ్ఞానాంధకారాన్ని పారద్రోలుచున్నాడు. మహాభారతం అజ్ఞానాన్ని అంత మొందించి బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదిస్తున్నది. అట్టి మహాభారతం రచించిన మహానుభావులు తమరే కదా! భారతం శివతత్త్వమైన పరమాత్మ తత్త్వాన్ని ప్రతిపాదిస్తూ ఈ నవీనచంద్రుడు స్వయంప్రకాశమానుడై ఉన్నాడు. పంచమ వేదమైన భారత రచయితలై మీరు వినూత్న చంద్రునివలె భాసిస్తున్నారు. ఆ విధంగా పరమశివుని శిరస్సు ప్రకాశింపజేసే ప్రసిద్ధ చంద్రుని కంటే ఎన్నో రెట్లు అధికంగా ప్రకాశిస్తున్నారు.

తమరే క్షీరసాగరం వంటివారు. మీ నుండి ఉద్భవించినదే భారత (మహాభారతం) చంద్రుడు. ఈ మహాగ్రంథం వేదాంత తత్త్వాన్ని ఉపదేశించే కార్య, కారణ, స్థూల, సూక్ష్మ, బాహ్య, అంతరాలైన సర్వవిషయాలను ప్రతి పాదిస్తున్నది. మహా ఉపనిషత్సారమైన వేదాంత తత్త్వజ్ఞానాన్ని ప్రతిపాదించి ముక్తిదాయకమై వెలసినది. ఈ మహాగ్రంథం అతిసులభమై, వేదాంత సారమంతా పొంది పంచమ వేదమని ప్రసిద్ధి గాంచినది.

28. ఓ జ్ఞాననిధీ! సర్వవిద్యాసాగరా! శత సహస్ర వందనాలు. నాలుగు వేదాలను, శిక్షవ్యాకరణాది షడంగాలను, సముద్రం పోలిన మహాభారతాన్ని, సర్వశాస్త్రాలు, పురాణాలు లోకహితం కోరి రచించినారు. జ్ఞానానికి భాండవంటి వాడవు. ఏది కావాలన్నా ఆ భాండనుండే గ్రహించాలి. ఇవన్నీ శ్రీ మహావిష్ణువు అవతారుడవైన నీ అనుగ్రహం చేతనే సంప్రాప్తమగుచున్నవి. అంతా దైవానుగ్రహం. వ్యాసులవారంటే పరమాత్మయే.

29. ఒకానొక వేదాంతపరమైన ద్వీపమందు, సత్యస్వరూప పరబ్రహ్మాత్మకమై, మిగుల శ్రేష్ఠుడై ఒప్పే శ్రీ వ్యాస భగవానుడు వేదాంత కల్పతరువు. ఆ కల్పతరువు వివిధాలైన శాఖోపశాఖలై, వేద శతసహస్ర

శాఖలై, శుక మహర్షి అనే శుకముల సమూహంచే సేవించబడుచున్నది. తమ పాదాలనే మూలభాగాన్ని ఆశ్రయించి ముముక్షు జనులకు జ్ఞానఫలాలందిస్తూ అద్వైతామృతానంద రసాన్ని అందిస్తున్నది. అందువలన ముముక్షువులు కూడా దేవతలమల్లే అమృతపానం చేస్తున్నారు. ఆ రసాన్ని త్రాగినవారు అమృతులవుచున్నారు. శ్రీ వ్యాస మహర్షి లోకంలో వేదాలను వ్యాపింపజేసి, బ్రహ్మవిద్యాతత్త్వంచే అందరినీ తరింపజేస్తున్నారు.

30. శ్రీ శంకరులు వేదవ్యాసులవారిని శ్రీ కృష్ణునితో పోల్చి చెబుతూ, వ్యాసులవారే అధికులని నిరూపిస్తున్నారు.

శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమెత్తి గోపకులను మాత్రమే వర్ష బాధ నుండి రక్షించగా మీరు సర్వజనులను సంసార తాపాల నుండి రక్షింప బూని మృదువైన మహేశ్వరుని హృదయాన్ని ధరించారు.

శ్రీకృష్ణుడు పంచ భూతాత్మకమైన మానవ దేహాన్ని ధరించి గోవులను పాలించాడు. మీరు జ్ఞానమూర్తులై అప్రాకృత రూపాన్ని ధరించి పురాణాలు, శ్రుతులనే గోవులను పాలించారు.

శ్రీకృష్ణుడు యుద్ధమందు నరకాసురుని సంహరించాడు. మీరు అజ్ఞాన రూపమైన నరకాసురుని వధించారు. అందువలననే మీరు మహా అద్భుత కృష్ణమూర్తివని పిలువబడుచున్నారు. ఈ విధంగా శ్రీ శంకరులు శ్రీ వేదవ్యాసులను శ్రీకృష్ణునితో చమత్కారంగా పోల్చిచెప్పారు. సర్వరక్షకుడైన ఆ శ్రీకృష్ణ పరమాత్మయే తామని చెబుతున్నారు. శ్రీకృష్ణునకు నమస్కారం. ఆ విధంగానే సర్వజనులను సంసార తాపాల నుండి రక్షించే శ్రీ వ్యాసభగవానులకు నమస్కారం.

31. శ్రీ వ్యాస భగవానుడంటే, బాహ్యాంతర భేదంలేక సర్వవ్యాపి అనీ, సర్వపరిపూర్ణుడనీ అర్థం, ఒకే చైతన్యం. తాము చేతనా స్వరూపీ, సచ్చిదానందుడూ, కార్యకారణాదినారాయణ పరబ్రహ్మమే! నారాయణ శబ్దార్థ మేమంటే; జీవులు 'నార' శబ్దంచే చెప్పబడుచున్నారు. అంటే శరీర సమూహం భోగ్యవస్తు సముదాయం నార అనబడుతుంది కాబట్టి, అట్టి

చరాచర జగత్తుకు అధిష్ఠానాన్ని నారాయణ శబ్దం చెప్తుతుంది. అట్టి శ్రీమన్నారాయణమూర్తి మీరే, అభివృద్ధి మున్నగునవి లేకుండటంచేత షడూర్ములు, షడ్భావాలను వికారాలు లేనివాడవై ఉండటంచేత సనాతనుడవు. దేహమందున్న వాడవటంచేత పురుషుడని చెప్పబడే జీవుడూ మీరే. అంటే జీవేశ్వరులు కూడా మీరే. జీవుడు అనాది, పరమేశ్వరుడు పురాణపురుషుడు.

32. శ్రీ శంకరులు అతిభక్తిశ్రద్ధలతో పలికిన స్తుతి వాక్యాలను విన్న శ్రీ వ్యాస భగవానులు ఎంతో సంతోషించి తన కీయబడిన ఆసనంపై ఉచితరీతిన ఆసీనులైనారు. అతివినయవిధేయతలతో శ్రీ వ్యాసుల వారి శాసనాన్ని శిరసావహింప శిరస్సు వంచి సమీపాన నిలబడిన శ్రీ శంకరుల గూర్చి యీ విధంగా పలికారు.

33. వత్సా! పాండిత్య ప్రతిభావిశేషాలందూ, వేదాంతవైరాగ్యాలందూ, నిఖిల నియమాలందూ నా బోటి వారి స్థానాన్ని ఆక్రమించావు. పండిత ప్రవరా! బ్రహ్మ సూత్రాలను నీ వేపాటి అర్థం చేసుకొన్నావోనని పరీక్షించి చక్కగా తెలుసుకొన్నాను. వైరాగ్యధురంధరా! నీవు శుక మహర్షిమల్లే నాకు పరమ ప్రీతిపాత్రుడవై, పుత్రసమానుడవైనావు. నీతో వాదానికి దిగినానని నీవు గాని, నీ శిష్యులు గాని తలచవద్దు. ఈ విధంగా శ్రీ వ్యాసమునీంద్రులు శ్రీ శంకరులను తనతో సమానంగా గ్రహించి పలికారు. అందువలననే శ్రీ శంకరుల కీర్తి ప్రతిష్ఠలు శ్రీ వ్యాసభగవానుల మాదిరిగానే చిరస్థాయిగా నిలిచినాయి. శ్రీ వ్యాసమహర్షి ప్రతిపాదించిన అతికష్టసాధ్యమైన వేదాంత తత్త్వార్థాలన్నింటికీ భాష్యం వ్రాశారు. లోకంలో శ్రీ వ్యాస వాఙ్మయం వలెనే శ్రీ శంకర వాఙ్మయం కూడా సమానంగా ఆదరించబడినది. గురువులు శిష్యులను పుత్రులుగాను, సమానులుగాను చూస్తారు గదా!

34. వత్సా! నేను వ్రాసిన బ్రహ్మసూత్రాలకు నీవు భాష్యం వ్రాసి పఠింపజేస్తున్నావని మహేశ్వరుని సభయందు సిద్ధపురుషులు మాట్లాడు కొంటుండగా విన్నాను. ఇంతకాలానికి బ్రహ్మవిద్య లోకంలో వ్యాపిస్తున్నదిగదా అని ఎంతో సంతోషించాను. శ్రుతిమాత నిన్ను చూసి పరమానందం

చెందుచున్నది. చిరకాలానికి నా పరిశ్రమ అంతా ఫలించబోతున్నది గదా అని తలచినాను. వెంటనే నిన్ను చూడాలన్న ముచ్చట కలిగి నీ ముందుకు వచ్చి నిలబడ్డాను.

35. ఈ ప్రకారం శ్రీ వ్యాసభగవానుని వాక్యాలు శ్రీ శంకరుల చెవులకు అమృతప్రాయంకాగా ఆయన పరమానందభరితుడయ్యాడు. శ్రీ వ్యాసమునీంద్రుల వారి శ్రవణం చేత తన పరిశ్రమ సఫలమయింది గదా అని పులకితుడయ్యాడు. నీలమేఘ శ్యామ శరీరధారియైన శ్రీ వేదవ్యాసుల ప్రశంసావాక్యాలచే రోమాంచితుడైన శ్రీ శంకర భగవానులు గద్గదకంఠంతో ఇలా పలికారు.

36. మహాత్మా! నిరంతరం స్వానుభవజ్ఞాన మహిమతో అచింత్య ప్రభావులై ముక్తిధామ మధిష్ఠించిన సుమంత, పైల, సూత మహర్షు లందరూ తమకు శిష్యులై తమను సేవించి ధన్యులయ్యారు. వారిలో నేనెంతటి వాడను? అయినా నా భాష్యం విని సంతోషించి 'నాతో సమానుడ'వని పలకటం ఎంతో ఆశ్చర్యకర విషయం. మహాత్ములు దీనులను కరుణించి బ్రహ్మవిద్యా ప్రోత్సాహాన్ని కలుగచేయటం సహజమవటం చేత, నన్నలా అనుగ్రహించారు. మరల శ్రీశంకరులు ఇలా పలికారు.

37. మహాత్మా! తేజోరాశి సమీపంలో మిణుగురు పురుగు వంటి వాడను. తమ బ్రహ్మసూత్ర తేజస్సు యెదుట నా భాష్యప్రవచనం కాంతి హీనమవుతున్నది. బ్రహ్మసూత్ర మహాగ్రంథం, ఉపనిషత్, వేదాంతార్థాలతో కూడి, సహస్ర కిరణాలతో కూడిన సూర్యభగవానునివలె ప్రకాశిస్తున్నది. మహర్షిపూజ్యా! నేను భాష్యం అనే ప్రదీపంతో బ్రహ్మసూత్ర భాస్కరునికి నీరాజనమివ్వడానికి సాహసించాను. ప్రచండ సూర్య భగవానుని కాంతిని ఇనుమడింపజేయడానికి తన దీపాన్ని చూపే మందమతి ఉంటాడా? అయినా నే నట్టి సాహసానికి ఒడిగట్టాను. సూర్యరశ్మి చేత లోకమంతా ప్రకాశించేట్లుగా, బ్రహ్మసూత్రాలనే సూర్యుని కాంతిలో నా భాష్యం ప్రకాశం కూడా కలసిపోయినది. అంతే కాని నా భాష్యం చేత సూత్రాలు

ప్రకాశించటం లేదు. అయినా, బిడియపడక, నేను కూడా కీర్తిని పొందాలని ఆ మహాపురుషుని మార్గాన్ని అనుసరించాను.

38. మహాత్మా! సూర్య భగవానుడు భక్తితో సమర్పించే ఆరతులందుకొం టున్నాడు. అట్లే తాము కూడా తాము రచించిన బ్రహ్మసూత్రాలకు నాచే వ్రాయబడిన భాష్యాన్ని స్వీకరించండి. మహనీయా! సర్వజ్ఞా! నేను కూడా తమ శిష్యకోటిలో చేరదలచి దురాశతో భాష్యగ్రంథాన్ని రచించాను. లోకంలో సమర్థుడై కార్యాన్ని చేస్తే అభినందిస్తారు. సామర్థ్యం లేనివాడు అట్టి కార్యాన్ని తలపెట్టితే పరిహసిస్తారు. అయినా, శక్తి లేనివాడనని తెలిసి కూడా, కీర్తి పొందాలని పేరాశచేత బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాశాను. వడ్లను ఎంత దంచినా, బియ్యంలో వడ్లగింజలు కనిపిస్తూనే ఉంటాయి. అదే విధంగా భాష్యసూక్తులందు, ఎక్కడో ఒక చోట దోషాలు రాకమానవు. అవి ప్రజ్ఞావంతులు మాత్రమే గుర్తించగలరు. కనుక నా గ్రంథాన్నంతా బాగా పరిశోధించి దోషాలు లేని విధంగా చేసి నన్ను కృతార్థుని చేయండి. కవి యశస్సును కోరి గ్రంథాలు రచిస్తాడని కాళిదాసు చెప్పి ఉన్నారు. “పొడవుగా ఉండే వాడికి అందే పండును కోరి మరుగుజ్జు (వామనుడు) పైకెగిరితే జనులు పరిహసిస్తారు. కాని, కవి యశస్సు కోరి ప్రయత్నిస్తాడని సగర్వంగా చెబుతాడు.”

39. ఇలా శంకరులు శ్రీ వ్యాసుల వారిని స్తుతించగా, శ్రీ వ్యాసుల వారు స్వయంగా శ్రీ శంకరుల చేతనున్న భాష్యగ్రంథాన్ని రెండు చేతులతో గ్రహించి, భాష్యగ్రంథమంతా పరిశోధించారు. ఆ గ్రంథ రాజం గంభీరంగాను, అర్థయుక్తంగాను, దోషరహితమై శ్రీ వ్యాసమహర్షికి కానవచ్చింది. భగవంతుని సూక్తులందు దోషాలుంటాయా?

40. భాష్యగ్రంథాన్ని పరీక్షించిన శ్రీ వ్యాసభగవానులు ఎంతో సంతోషించారు.

సాక్షాత్తూ శ్రీమన్నారాయణమూర్తి బ్రహ్మసూత్రాలను వ్రాయగా, సాక్షాత్పరమ శివుడు ఆ సూత్రాలకు భాష్యం వ్రాశాడు. అటువంటి వారి రచనలను పరీక్షించగల సమర్థు లెచ్చటనైనా ఉన్నారా? ఇలా సూత్రార్థాల

ననుసరించి తన సొంత పదజాలంతోను, పూర్వపక్ష దూరీకరణాల చేత, దృష్టాంతాల చేత వేదాంత సిద్ధాంతాలను సులభంగా అర్థమయ్యే విధాన శ్రీశంకర భాష్యాన్ని శ్రీ వ్యాసమునీంద్రులు పఠించి ఎంతో కొనియాడారు. "ఓహో! ఇంత కాలానికి బ్రహ్మసూత్రాలకు అర్థం చెప్పి లోకోపకారం జరుగుచున్నది గదా!" అని తలచారు. తరువాత శ్రీ శంకరుల నుద్దేశించి ఇలా పలికారు.

41. శ్రీ వ్యాస భగవానులు ఇలా పలికారు: నాయనా! మహామహిమా సంపన్నుడు, నిర్వికల్ప సమాధిని పొందినవారు పతంజలి. ఆదిశేషుల అవతారం అయిన శ్రీ గోవింద భగవత్పాదాచార్యుల వద్ద చక్కగా శిక్షణ పొందినావు. నీవు వారి ఆజ్ఞను శిరసావహించి యీ భాష్యం రచించావు. అందువలన నీవు ఈ భాష్య రచనకు ఎంతైనా సమర్థుడవు. ఇతరులకు ఈ కార్యం సాధ్యం కాదు. నీ రచన రమణీయమై, వేదాంశాలతో కూడినదై, వేదాంతామృతాన్ని బంధిస్తూ మృదుమధురంగా ఉన్నది. అటువంటి మహద్గ్రంథాన్ని పరీక్షించమనటం నీ నిరాడంబరతను తెలియజేస్తున్నది. పరమ శివావతారుడవైన నీవు, ఏమీ తెలియని బాలునివలె పలకటం ఎంతో సాహసం గదా!

42. వత్సా! బ్రహ్మవిద్య యందు అన్ని శాస్త్రాలలోను, ఉత్తర మీమాంసా శాస్త్రం తలమానికమై ఉంది. నీవు ఆ ఉత్తర మీమాంసా శాస్త్రాన్ని శ్రీ గోవింద యతీశ్వరుల ద్వారా క్షుణ్ణంగా అధ్యయనం చేసిన మహానుభావుడవు. అంతేకాక, లోకంలో సర్వవ్యాకరణశాస్త్రాలు బాగా ఎరిగిన పరమహంస చంద్రుడవు.

43. పురాణాలందు విష్ణువు శివుని, శివుడు విష్ణువుని స్తుతించుకోవటం అందరూ ఎరిగినదే. అదేవిధంగా శ్రీ వ్యాస భగవానులు శ్రీ శంకరుని పరమశివునిగా భావించి స్తుతిస్తున్నారు – "మహాత్మా! పరమశివా! నీవు ప్రకృతికి వరమైన దివ్యపురుషుడవు. సర్వజ్ఞుడవు. కేవలం శివస్వరూపుడవు. సూర్యుడు అంధకారాన్ని నశింపజేసినట్లుగా, నీవు సమస్త విషయ సుఖాలను

నిశ్శేషంగా నశింపజేసి, బ్రహ్మచర్యం నుండి సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించావు. కాబట్టి మహానుభావా! నీవు సాక్షాత్తూ పరమశివుడవు. నీకు నమస్కారం.

44. శ్రీ శంకరులు గాక యితరు లెవ్వరూ ఈ భాష్యాన్ని వ్రాయ జాలరు. శ్రీ వ్యాసుల వారు పలుకుచున్నారు. "నాచే రచించబడిన బ్రహ్మ సూత్రాలు అనేక రకాలైన అర్థాలను కల్పిస్తూ, చదువరులకు అర్థం కాక కష్టపడుతుంటారు. చిన్న చిన్న పదాలతో కూడి అనేక విశేషార్థాలతో కూడి ఉన్నవి. సర్వ విషయాలందూ విరక్తిగలవారు మాత్రమే దీనియం దధికారులవు తున్నారు. కాబట్టి అట్టివారికే యీ సూత్రార్థాలు గోచరమవుతాయి. ధీశాలీ! పరమహంసవరేణ్యా! పరమశివుడవైన నీవు తప్ప మరెవ్వరూ సమర్థులు కారు. అద్వితీయ బ్రహ్మతత్త్వాన్ని అద్వితీయ పరబ్రహ్మ స్వరూపులు మాత్రమే తెలుసుకోగలరు. కనుక బ్రహ్మసూత్రార్థాలు శ్రీ శంకరులకు మాత్రమే గోచరిస్తాయి.

45. నాయనా! బుధసత్తమా! బ్రహ్మసూత్రాలు వ్రాయడానికి నేను ఎట్టి పరిశ్రమను అనుభవించానో, అట్టి సూత్రాలందలి నా భావాన్ని గ్రహించి దానికి తగినట్లుగా అర్థాన్ని ప్రతిపాదిస్తూ భాష్యం వ్రాయడానికి నీవు కూడా అంతే పరిశ్రమను అనుభవించావు. కనుక నీవు అన్ని విధాలుగా నాతో సమానుడవు. భయంకర కీకారణ్యమందు మృగరాజైన సింహం మాత్రమే స్వేచ్ఛగా, నిర్భయంగా సంచరించగలదు. ఇతర జంతువులు అంత నిర్భయంతో సంచరించజాలవు. అట్లే యీ సూత్రాల యథార్థ భూతవేదాంత తత్త్వార్థాల నెరిగిన నీవు లోకానికి మహోపకారం గావించి ధన్యాత్ముడవైనావు.

ఈ విధంగా శివకేశవావతారులైన శ్రీ శంకర వ్యాస మహర్షులు లోకంలో నాస్తికత్వం చేత, భేదవాదుల చేత, అద్వైతతత్త్వరూపమైన బ్రహ్మవిద్య నశించకుండా ప్రతిష్ఠించి లోకాన్ని ఉద్ధరించారు. సంసార తాపాల నుండి రక్షించి ముక్తిధామానికి రాజమార్గం చూపారు.

46. లోకమంతటా యథార్థమైన వేదాంత సిద్ధాంతాలు తెలియక సాంఖ్య; మీమాంస మున్నగు అనేక మతాలవారు వేదశిరాలైన ఉపనిషత్తులను

ప్రక్కదోవల పట్టిస్తూన్నందువల్ల బ్రహ్మవిద్యాపథం శిథిలావస్థకు చేరుకొంది. లేక తద్భిన్నమా అని విచారిస్తూ సంశయాల మధ్య కొట్టుమిట్టాడుచున్నారు.

ఇట్టి తరుణంలో శిథిలమయ్యే బ్రహ్మవిద్య నుద్ధరింప, నీవు నా యొక్క యథార్థమైన భావాలను తెలుసుకొని భాష్యం వ్రాయగలిగినావు. ఇతరు లెవ్వరికీ సాధ్యం కాని బ్రహ్మవిద్యారూప భాష్యాన్ని నీవు రచించి సర్వజనులను సంసార తాపాల నుండి ఉద్ధరించి శాంతి ప్రసాదించిచావు.

47. శ్రీ శంకరులు 'అద్భుత కృష్ణ' అని శ్రీ వ్యాసుల వారిని స్తుతించిన రీతిగానే, ఇప్పుడు శ్రీ వ్యాసులవారు శంకరులను 'అద్భుత శంకరస్త్వం' అని స్తుతిస్తున్నారు.

అద్భుత శంకరా! మహేశ్వరుడు రజోగుణాన్ని ధరించి శిరస్సున చంద్రకళను ధరించి విషమ నేత్రధారియై ఉన్నాడు. నీవు రజోగుణం లేనివాడవై కామక్రోధాది దోషాలన్నింటినీ విసర్జించి పరమ శాంత మూర్తివై ఉన్నావు. హృదయమందు స్వానుభవ పరిపూర్ణ చంద్రామృతమనే కళలను ధరిస్తుండడం చేత మహేశ్వరుని కన్నా నీవే అధికుడవు.

శివుడు పర్వతపుత్రియైన పార్వతికి అర్ధశరీర మిచ్చి భరిస్తున్నాడు. నీవు వేదవాక్కులచే జన్మించిన (అశరీరమైన) బ్రహ్మ విద్యారూప గిరిజా మాతను గ్రహించావు. కనుక నీవు పరమ శివునికంటే అధికుడవు.

ఈ విధంగా శ్రీ వ్యాసుల వారు చమత్కారంతో శ్రీ శంకరులను అభినందించారు.

48. సర్వజ్ఞా! నీవలె నా హృదయంలోని నిగూఢార్థాలను తెలుసు కొని వ్రాయడానికి మరొకరు సమర్థులు కారు. నీవు వ్రాసిన భాష్యం నా భావాలకు అద్దం పట్టినట్లున్నది. నీవా సర్వజ్ఞుడవు. వారా అల్పులు. నీవు సర్వేశ్వరుడవు, సర్వస్వతంత్రుడవు. వారు సామాన్య మానవమాత్రులు. ఈనాటికి నా బ్రహ్మసూత్రాలకు సరి అయిన వ్యాఖ్యానం లభించినది. అందువల్ల సూత్రాల ద్వారా భాష్యానికి, భాష్యం ద్వారా సూత్రాలకు అన్యోన్యత లభించినది.

49. యతివరా! నీ భాష్య వివరణాలకు సంతోషించాను. బ్రహ్మ విద్యకు సింహద్వారమై శోభిస్తున్నది. అద్వైత సిద్ధాంతాన్ని ముఖ్యాయుధంగా చేసుకొని భేదవాదులను, కుపండిత వర్గాలను జయించు. అంతేగాక, మరికొన్ని విషయ, ప్రయోజన, సంబంధ, అధికారులను, బంధ చతుష్టయంతో కూడిన స్వతంత్ర గ్రంథాలను రచించు. ఈ విధంగా ఉపనిషత్తుల వలనా, స్వతంత్ర గ్రంథాల చేత బ్రహ్మవిద్య సుస్థిరంగా ప్రకాశిస్తుంది – అని శ్రీ వ్యాస మహర్షి తన ఇష్టం వచ్చిన చోటుకు పోదలచారు.

50. వేదమయా! మహాత్మా! వివిధాలైన భాష్యాలను రచించి శిష్యుల చేత పఠింపజేశారు. జగత్తులోని కుమతాలన్నింటినీ విధ్వంసం కావించాను. భూమిపై నేను చేయవలసిన కార్యాలన్నీ ముగించాను. (అట్టి సమయంలో శ్రీ శంకరుల వయస్సు పదునారు సంవత్సరాలు.)

51. శ్రీ శంకరులు వ్యాస భగవానునితో ఇలా పలికారు: కృపాసాగరా! నేను చేయవలసిన కార్యాలన్నీ పూర్తి చేశాను. నా యందు కృప జూపి మణికర్ణికా క్షేత్రమునందొక క్షణం రండి, చిరంజీవులైన తమ పాదపద్మాల వద్ద ఈ శరీరాన్ని వదలి కైవల్యం పొందుతాను.

52. శ్రీ వ్యాస మహర్షి శంకరులతో ఇలా పలికారు: పరమహంస శ్రేష్ఠా! నీవిప్పుడు దేహత్యాగం చేయవలదు. లోకక్షేమానికై నీవు చేయ వలసిన కార్యాలు పెక్కుగలవు. లోకంలో పాండిత్యం లేని పండితులు అనేకమంది గర్వితులై విజృంభిస్తున్నారు. వారందరూ వేదాంత విరుద్ధ తత్త్వాన్నే ప్రచారం చేస్తున్నారు. వారందరినీ నీవు అద్వైత తత్త్వ సిద్ధాంతాల చేత జయించాలి. లేని యెడల జనులు బ్రహ్మ సూత్ర భాష్యాల వలన ప్రయోజనం పొందజాలరు. బ్రహ్మవిద్య ప్రచారం లేక అంతరిస్తుంది. కువిద్వాంసులు వేదాంత విరుద్ధ ప్రచారాలచే పేట్రేగిపోతారు. కనుక వారందరినీ జయించి ప్రతిబంధాలన్నిటినీ తొలగించి బ్రహ్మవిద్యను పరిరక్షించు. అందువలన ప్రాణత్యాగం చేయవలసిన సమయం ఇంకా ఆసన్నం కాలేదు.

53. మరల వ్యాసుల వారు ఇలా పలుకుచున్నారు: ధీరవరేణ్యా! గ్రంథ రచనతో కర్తవ్యం పూర్తి కాలేదు. వాదోపవాదాలు చేసి విరుద్ధ మత ప్రచారం చేసే పండితులను జయించినప్పుడే నీ కర్తవ్యం పూర్తి అవుతుంది. ఇంకా కొన్ని సంవత్సరాలు స్వసిద్ధాంత తత్త్వాలను ప్రతిపాదిస్తూ జీవయాత్ర సాగించు. అలా కాని యెడల, అద్వైత తత్త్వ విద్యను వ్యతిరేకించే వారు మిగిలి ఉంటే, తల్లి లేని బిడ్డ వృద్ధి చెందని విధంగా, బ్రహ్మవిద్య కూడా ప్రచారంలేక క్రమంగా క్షీణిస్తుంది. అందువలన నీవు ఇంత కష్టపడి వ్రాసిన సూత్ర భాష్యం నిష్ఫలమవుతుంది. కనుక నీవు నీ సిద్ధాంత ప్రతిపాదనలు కొనసాగించు. అప్పుడే శుక్లపక్ష చంద్రునివలె బ్రహ్మవిద్య కూడా వృద్ధిచెంది దిగంతాల వరకూ వ్యాపిస్తుంది. అందువలన ముముక్షువుల సంఖ్య శతసహస్రాలై వర్ధిల్లి సంసార తాపాల నుండి విముక్తులవుతారు.

54. మళ్లీ వ్యాసుల వారు ఇలా పలుకుచున్నారు: మహర్షిశ్రేష్ఠా! ఆత్మతత్త్వజ్ఞవరా! నీ భాష్యగ్రంథాన్ని ఆసాంతం తిలకించాను. నీ గ్రంథ రచనాపాటవం అద్భుతం. అందు నీ పలుకుల తీపిదనం, అర్థములందలి గాంభీర్యం, తత్త్వ ప్రతిపాదనలన్నీ చిన్నచిన్న పదాలచే మిక్కిలి అర్థవంతంగాను, సందర్భ శుద్ధి కలిగి, పూర్వపక్ష సిద్ధాంతాలు చేసే విధానమంతా చక్కగా పరిశీలించాను. అమితానందం పొందాను. ఆ హర్షాతిశయంచే నీకు ఏదైనా వరం ఇవ్వాలని సంకల్పం వృద్ధి అవుతోంది.

55. మరల శ్రీ వ్యాసుల వారు ఇలా పలికారు: వత్సా! ముందు బ్రహ్మదేవుడు నీకు ఎనిమిది సంవత్సరాలనే ఆయుర్దాయంగా ప్రసాదించి నాడు. తరువాత నీ తపోమహిమ చేత, ప్రజ్ఞాపాటవాల చేత మరొక ఎనిమిది సంవత్సరాలు ఆయుష్యము సంపాదించుకొన్నావు. ఇంతమాత్రం చేత జ్ఞానకాండోద్ధరణం పూర్తి కాలేదు. పరమేశ్వరుడు ముందుగానే నిన్ను అల్పాయుష్కునిగా పలికివుండడం చేత, పరమ దయాళువైన ఆ మహేశ్వరుని అనుజ్ఞ చేత మరొక పదునారు సంవత్సరాల ఆయువు వృద్ధియగుగాక అని వరం ప్రసాదిస్తున్నాను. అంతేకాక నీ భాష్యం సూర్యుడు చంద్రుడు,

నక్షత్రాలున్నంతవరకు సుస్థిరమై ఉండుగాక! లోకంలో అజ్ఞానాంధకారమున్నంత వరకు నీ బ్రహ్మవిద్యాప్రచారం భాస్కరునివలె ప్రకాశిస్తుందిగాక!

ఈ విధంగా శ్రీ శంకరులకు వ్యాస భగవానులు రెండు వరాలను అడుగకయే ప్రసాదించారు. అందువలననే లోకంలో బ్రహ్మసూత్రం, వాటి భాష్యం సుస్థిరాలై ఉన్నవి.

56. శ్రీ వ్యాస మహర్షి ఇలా పలికారు: నిగమాంతసారజ్ఞా! మీ ఆయువు ఉన్నంతవరకు, వేద విరోధుల, ఉపనిషత్తులకు వ్యతిరేకంగా ప్రచారం చేసే గర్విష్టులైన పండితుల గర్వమణచనున్నావు. నీవు విజృంభించి కొదమ సింగం, మదపుటేనుగు కుంభస్థలాన్ని భేదించేట్లు యీ కుమతులైన పండితులందరనూ జయించు. అంతేగాక వేదాంత గ్రంథాలనేకం రచించి లోకాన్ని ఉద్ధరించు.

57. శ్రీ శంకరులు ఇలా బదులు పలికారు: మహాత్మా! గురుదేవుల ఆజ్ఞ ఎల్లవేళలా శిరోధార్యమేగదా! మహోత్తరాలైన తమ బ్రహ్మ సూత్రాల సంసర్గంచేత నా భాష్యం కూడా, మహాత్ముల సంసర్గం చేత సామాన్యులు కూడా గౌరవించబడేట్లు, లోకంలో జనాదరణ పొందగలదు. సూర్యకాంతి మణి సూర్యకిరణాల చేత మహోజ్జ్వలంగా ప్రకాశిస్తున్నది. బంగరు త్రాటి చేత బంధించబడిన రత్నమాలికవలె, తమ బ్రహ్మసూత్ర గ్రంథం కూడా మిక్కిలి సుస్థిరంగా ఉంది. సాధారణ దారంతో బంధించిన యెడల మాల పెరిగిపోయి రత్నాలు చిందరవందర కాగలవు. కనుక సుస్థిరమైన బ్రహ్మసూత్రాలనే బంగరు త్రాటి చేత సుస్థిరమై, తద్ద్వారా నాచే విరచితమయిన భాష్యం కూడా సుస్థిరమై వేదాంత తత్త్వజ్ఞులకు ఉపకరించగలదు.

58. అంతేకాక, తమ సూత్రాల నాధారం చేసుకొనటం చేత నా భాష్య గ్రంథం కూడా, పరుసవేది సంసర్గం చేత లోహం బంగారమయ్యే విధాన, మహోత్తమమై ప్రకాశిస్తున్నది.

తరువాత శ్రీ శంకరులు శ్రీ వ్యాస భగవానుల పాదపద్మాలకు సాష్టాంగంగా నమస్కరించారు. శ్రీ వ్యాస భగవానులు కూడా భాష్యగ్రంథాన్ని

పరిశోధించి దోషరహితంగా ఉండడటం చేత ఎంతో సంతసించి, సూర్యచంద్రుల మల్లే ప్రకాశిస్తుందని పలికారు.

59. శ్రీ వ్యాసమునీంద్రులు అంతర్ధానమైన పిదప, సందర్శనం చేతనే సర్వతాపాలను హరించే జ్ఞానామృతాన్ని ప్రసాదించే దయాసముద్రులైన శ్రీ వ్యాసుల వారి ఎడబాటును శ్రీ శంకరులు సహింపలేకపోయారు. శ్రీ వ్యాసుల వారి ప్రేమ సంభాషణం, నిరపేక్షభావం, సంభావనాతత్త్వం మున్నగు సర్వోత్తమ గుణాలను తలచుకొని మిక్కిలి మోహితులయ్యారు.

60. శ్రీ శంకరులు తమ హృదయ పీఠమందు శ్రీ వ్యాస భగవానుల పాదపద్మాలను ప్రతిష్ఠించుకొని ధ్యానించసాగారు. శ్రీ వ్యాసుల వారి ఆదేశానుసారంగా వేదాంత పరిధులను జయించి, బ్రహ్మవిద్యను సుస్థిరంగా నెలకొల్పి విజయలక్ష్మిని చేపట్టడానికి దృఢసంకల్పం చేసుకొన్నారు.

61. శ్రీ వ్యాస భగవానుల ఆజ్ఞానుసారం శ్రీ శంకరులు బ్రహ్మ విద్య నుద్ధరింప జైత్రయాత్ర చేయడానికి నిశ్చయించారు. మున్ముందుగా శ్రీ శంకరులు తన జైత్రయాత్రను దక్షిణ దిక్కువైపుగా ప్రారంభించారు. తన భాష్యగ్రంథానికి వార్తికాలు లేకుంటే సులభంగా అర్థం కావని తలచి శ్రీ కుమారస్వామి అవతారమైన కుమారిల భట్టాచార్యులవారి ద్వారా వార్తికాలు వ్రాయించడానికి సంకల్పించారు.

62. సమస్త వేద వేదాంతాల అర్థం బాగా తెలిసిన వారు, వేదవిరుద్ధాలైన కుమతాల వారందరినీ ఖండించేవారు, కేవలం పరమశివుని అవతారమయిన శ్రీ శంకరులు మొట్టమొదటగా ప్రయాగ పోవడానికి నిశ్చయించుకొన్నారు. సర్వయాగాలు చేసినచో లభించే పుణ్య ఫలమంతా ఆ క్షేత్రాన ఉండటంచే ఆ ప్రదేశం ప్రయాగ అనే పేరిట ప్రసిద్ధి చెందినది. అట్టి ప్రయాగ ఉద్దండ పండితులకు పుట్టినిల్లయినది. అట్టి ఉద్దండ పండితులలో శ్రీ కుమారిలభట్టు శ్రీ కుమారస్వామి అంశాసంభూతుడు మత్తగజంలా వెలయుచున్నాడు. శ్రీ శంకరులా మత్తగజం యొక్క దంతా లూడబెరికి, మదమణచి, (ఆ కుమారిల భట్టును) వేదజ్ఞానకాండాతత్పరు నిగా చేసి వేదాంత వార్తికాలను వ్రాయించదలచారు.

63. అటువంటి ప్రయాగ పుణ్యక్షేత్రమందు గంగాయమునా సరస్వతీ నదులొకటిగా సంగమించి ప్రవహించటం చేత అది త్రివేణీ సంగమమని ప్రసిద్ధి గాంచినది. అట్టి త్రివేణీ సంగమాన స్నానం చేసిన శివభక్తులు శివసాన్నిధ్యాన్ని, విష్ణుభక్తులు విష్ణుసాన్నిధ్యాన్ని, జ్ఞానులు బ్రహ్మకైవల్యాన్ని పొందుతారని శాస్త్రాలు తెలుపుచున్నవి. అంతేకాక త్రివేణీ సంగమమందు స్నానమాచరించిన పాపులు పాపాలన్నీ హరించి పరిశుద్ధమైన అంతః కరణం గలవారై మరణానంతరం ముక్తిధామాన్ని చేరుతారు. అట్టి త్రివేణీ సంగమమయిన ప్రయాగ క్షేత్రానికి శ్రీశంకరులు వెళ్లారు.

64. మహోజ్జ్వల వేగంతో ప్రవహించే గంగానది నూతన వరుని మల్లే ఉరకలు వేస్తుండగా, వేగంలేనిదై నిశ్చలంగాను, మందంగాను ప్రవ హించే యమునానది నూతన వధువులా సిగ్గుగలదయింది. అదృశ్యంగావున్న సరస్వతీనది వారిరువురకు ఆతిథ్యమిచ్చే గృహిణియైనది.

65. గంగానదీ తీరాన స్వచ్ఛమైన కాంతితో ప్రకాశించే శిష్యులు అధ్యయనం చేస్తున్నారా అన్నట్లు రాజహంసలు బారులు తీరివున్నవి. మరొక చోట తామర పత్రాల మధ్య అత్యంత అనురాగ, విరహాలచే నిండివున్న చక్రవాక జంటలు గుంపులుగా చేరి గుసగుసలాడుచున్నవి. ఆ విధంగా త్రివేణీ సంగమ తీరమంతా పక్షుల కలకల ధ్వనులచేత మనోజ్ఞంగా ఉన్నది.

66. ఈ త్రివేణీ సంగమమందు మిగుల భక్తితో స్నానమాచరించితే పవిత్రాత్ములవడమే గాక, వ్యాధుల వాతపడక ఆరోగ్యవంతులై స్వర్గాన్ని పొందుతారని "సితాసితే సరితే యత్ర సంగతే తత్రాప్లుతాసో దివముత్పతన్తి" అని శ్రుతి తెలుపుతున్నది.

67. పై శ్రుతినే మరొక విధంగా కూడా చెబుతున్నారు. గంగానది విష్ణుపాదాలందు జన్మించటంచేత విష్ణు స్వరూపాన్ని పొందివున్నది. భూలోకానికి చేరడానికి ముందు శివుని ఆశ్రయించి భూలోకానికి చేరటం చేత శివస్వరూపాన్ని పొందివున్నది. నీలవర్ణజాలాలతో వచ్చి యమునానది

కలవడం చేత విష్ణు స్వరూపాన్ని, ధవళ వర్ణంచే ప్రకాశించే గంగానది శివస్వరూపాన్ని పొందివున్నది. ఎలా అన్వయించి చెప్పినా, శివకేశవ సమైక్యత ముముక్షువులను ఏకముఖంగా చేస్తున్నది. అట్టి పవిత్ర జలాలందు శిష్యులతో కూడి స్నానమాచరించిన శ్రీ శంకరులు యీ విధంగా స్తుతించారు:

68. శ్రీ శంకరులు గంగాదేవిని యీ విధంగా స్తుతిస్తున్నారు. "సిద్ధ సిన్ధూ! నీవు సిద్ధస్వరూపిణివై సిద్ధులందరికీ కోరిన సిద్ధులను ప్రసాదిస్తావు. భగవంతుడైన పరమశివుని శిరస్సున చేరి జటలంతా చిందర వందర చేస్తూ విహరిస్తూ తరంగాలను సృష్టించి జటాజూటధారులైన అనేకమంది శివులను చూపుచున్నావు. శివుడొక్కడైనా, ప్రతిబింబరూపంలో అనేకమంది శివులను చూపుచున్నావు. నీ మహిమ అనంతం. నీ విజ్ఞాన మహిమను వర్ణింప ఎవరి తరం? నీ శీతల జలాలచే ప్రాణులన్నింటికీ ప్రశాంతిని ప్రసాదిస్తున్నావు.

69. తల్లీ! గంగాదేవీ! పూర్వం భగీరథుడు తన వంశీయులకు సద్గతులు కలుగడానికి నిన్ను స్వర్గలోకం నుండి పాతాళానికి చేర్చగా భగీరథుని పూర్వీకుల అస్థికలను నీలో కలుపుకొని వారికి స్వర్గప్రాప్తిని కలిగించిచావు. ఆ కారణంగానే భూలోకవాసులు కూడా మరణించిన తమ వారి అస్థికలను నీలో కలిపి వారికి స్వర్గగతులను కలిగిస్తు న్నారు. అదీగాక, శివుడు ఎముకలను ధరించేవాడు గనుక, నీవూ మరణించిన వారి అస్థికలను ప్రీతితో స్వీకరించి శివసాన్నిధ్యానికి చేరుస్తున్నావు. అమ్మా! నీ మహిమను వర్ణించ ఎవరి తరం?

70. తల్లీ! శ్రమజీవులు నీ యందు స్నానం చేసి తాపాలు నశించిన వారై సుఖనిద్రను పొందుతున్నారు. అట్లే మందమతులు కూడా నీ యందు స్నానం చేసి పవిత్రులవడం వలన నిద్రను వదలి ముముక్షువు లవు తున్నారు. మరొక విచిత్ర మేమంటే, విషయ మందు పూర్తిగా వైరాగ్యం కలిగిన సన్న్యాసులను కూడా ముఖముండన, దండధారణం వంటి వానిచే ధూర్తశిరోమణులను చేస్తున్నావు. ఇది తగునా? మరల అందుకు విరుద్ధంగా అలాటి సన్న్యాసులను శివస్వరూపులనుగా చేస్తున్నావు. ఆ విధంగా

గంగాస్నాన ఫలాలు అనంతాలు. నిద్ర, పాపబుద్ధి మొదలైన అవలక్షణాలను నశింపజేసి, పవిత్రాత్ములను చేస్తున్నావు. పరమశాంతిని పొందుతున్నారు. అట్లే యతీశ్వరులు నిన్ను ఆశ్రయించటం చేత బాహ్యా మాలిన్యాలను పోగొట్టి శివకేశస్వరూపమై వెలయునట్లు చేస్తున్నావు. అమ్మా! గంగాదేవీ! ఈ విధంగా విరుద్ధ భావాలను కలిగిఉండడం నీకే చెల్లుతుంది.

71. శ్రీ శంకరులు ప్రయాగ క్షేత్రంలో చక్కగా ప్రవహిస్తున్న త్రివేణిని ఎంతో పవిత్ర భావంతో స్తుతించారు. తన నడుమునకు వస్త్రం బాగా కప్పుకొని జ్ఞానదండాన్ని రెండు చేతులతో పైకెత్తి, పాప విముక్తిని కలిగించే మంత్రాలను పఠిస్తూ, స్నానమాచరించారు. ఈ విధంగా శ్రీ శంకరులు స్నానవిధిని లోకులకు తెలియజేశారు.

72. శ్రీ శంకరులు ప్రయాగలో తన శిష్యులతో కలసి త్రివేణీ సంగమంలో స్నానం చేశారు. స్నానం చేస్తూ తన మాతృమూర్తిని తలచు కొన్నారు. ఈ విధంగా శ్రీ శంకరులు లోకానికి పుణ్యతీర్థాలందు స్నానమాచ రించే సమయంలో ఆచరించవలసిన విధులను తెలియజేశారు. గృహస్థులైన వారు, తమ తల్లితండ్రుల నిమిత్తం శ్రాద్ధాదులు, దానాలు చేస్తారు. సన్న్యాసు లైనవారు తమ తల్లిదండ్రులను ఆ సమయంలో స్మరించి వారికి పుణ్యగతులు కలుగాలని ప్రార్థించాలి. వంశంలో ఒకడు బ్రహ్మజ్ఞానవేత్త అయితే తన వంశం ధన్యమవడమేగాక, లోకమంతా ధన్యమవుతుంది.

73. శ్రీ శంకరులు స్నానం చేసి అనుష్ఠానాలు పూర్తి చేసుకొని, తరువాత ప్రయాణ బడలిక తీర్చుకోవడానికి సమీపంలోని తమాల వనంలో, సాంద్రవృక్ష నీడలో విశ్రాంతి తీసుకొన్నారు. ఆ సమయంలో స్థానికుల వలన ఒక విషయం విన్నారు.

74. ఈ కథనంచే శ్రీ కుమారిలభట్టారకుల మహిమ స్పష్టంగా తెలుస్తున్నది.

కుమారిలభట్టు వేద కర్మమార్గాన్ని అనుసరించేవాడు. కర్మమార్గాన్ని పునరుద్ధరించాలని గట్టిగా కృషి చేసిన కర్మిష్ఠి. అయితే నాస్తికులైన బౌద్ధ

మత తత్త్వాన్ని తెలుసుకొనగోరి ఒక బౌద్ధమతాచార్యుని ఆశ్రయించి బౌద్ధమత తత్త్వాన్ని గ్రహించాడు. ఒక రోజు తత్త్వవిచారణ జరుగుతూండగా వేదనింద జరిగింది. వేదనిందను భరించలేని ఆ కుమారిలభట్టు కళ్ల నుండి నీరు ధారలుగా కారసాగాయి. అది చూసిన తక్కిన శిష్యులాతణ్ణి మేడపై నుండి క్రిందకు పడదోశారు. అప్పుడు కుమారిలభట్టు "వేదాలు యథార్థమైతే నన్ను రక్షించుగాక!" అని పలికాడు. ఆ సమయంలో ఆతడిలో వేదాల పట్ల సంశయభావముండటం చేత ప్రాణాలు దక్కాయి. కానీ ఒక కన్ను పోయింది.

75. కుమారిలభట్టు తన ఉనికిని కప్పిపుచ్చి గురువువద్ద విద్య నేర్చి నందుకు తనకు తానే శిక్ష విధించుకోదలచి చుట్టూ ఊక పేర్చుకొని దానికి నిప్పు ముట్టించి ప్రాణత్యాగం చేసుకొన్నాడు. "ప్రాణాలు శాశ్వతం కాదు. వేదమే శాశ్వతం. వేదమే సర్వ సంరక్షక"మని శిష్యులకు బోధించాడు. ఎంతటి మహాత్ములైనా గురుద్రోహం చేయరాదని లోకానికి చాటిచెప్పాడు.

76. శ్రీ కుమారిలభట్టు సకల వేదాలను సాంగోపాంగంగా చదివిన వాడు. మంత్రార్థాలన్నీ చక్కగా తెలిసినవాడు. అపౌరుషేయాలైన వేదాలను సమర్థిస్తూ, వేదవిరుద్ధాలైన దుష్టశాస్త్రాలను, వాటి సిద్ధాంతాలను ఖండించాడు. ఈ మహాపండితుణ్ణి ఎల్ల లోకాలూ కొనియాడుతున్నవి.

77. కుమారిలభట్టు చుట్టూ ఊకను పేర్చుకొని మధ్యన పరుండి ఆత్మత్యాగమూ చేసుకొంటున్నాడని తెలుసుకొన్న శ్రీ శంకరులు ఆందోళన చెందారు. అప్పుడు శంకరులు "అతడు ప్రాణ త్యాగమెందుకు చేసుకోవాలి? వేదాల నుద్ధరించిన పవిత్రాత్ముడు గదా! అతణ్ణి ప్రత్యక్షంగా చూసి మాట్లా డాలి" అని పలికి శీఘ్రంగా కుమారిలభట్టు ఉన్నచోటుకు బయలుదేరారు.

78. శ్రీ శంకరులక్కడ చేరే సమయానికే శ్రీ కుమారిలభట్టారకులు అగ్ని ప్రవేశం చేశారు. ఊక కాలటం చేత పొగతో కూడిన అగ్ని క్రమ క్రమంగా శ్రీ కుమారిలభట్టు నాక్రమించసాగింది. దట్టమైన పొగ వ్యాపించటం చేత కళ్ల వెంట ధారపాతంగా నీరు ప్రవహించసాగింది. అయినా ఆ మహాత్ముడు ఏమాత్రమూ క్లేశం అనుభవించక స్థితప్రజ్ఞుని స్థితిలో ఉన్నారు.

79. ఆ పరిస్థితిని చూసిన శ్రీ శంకరులు కుమారిలభట్టుతో "లోకోద్ధరణ కోసం చేసిన పని దోషం కాదు. మీకై మీరు యిట్టి శిక్ష విధించుకోవడం తగదు. మీరు సామాన్య మానవులు కారు. శ్రీ కుమార స్వామి అవతారులు. మిమ్మల్ని తిరిగి బ్రతికిస్తాను" అంటూ వారించారు.

గంభీర, ప్రసన్న దృష్టితో శ్రీ కుమారిలభట్టు శ్రీ శంకరులను చూశాడు. వేదం యొక్క జ్ఞానకాండయైన వేదాంత శాస్త్రాన్ని ఉద్ధరించిన మహానుభావుడైన శ్రీ శంకరులను గుర్తించాడు. వేద శత్రువులను (నాస్తికులను) జయించి వేదాన్ని రాజమార్గాన నడిపిస్తూ మహాగ్నిలా తేజస్సుతో నిలచిన శ్రీ శంకరులను దర్శించాడు.

80. శ్రీ కుమారిల భట్టాచార్యుల వారు ఇంతవరకు శ్రీ శంకరుల గుణగణాలను విని ఉన్నాడేగాని ప్రత్యక్షంగా ఆయనను దర్శించలేదు. శ్రీ శంకరుల దర్శనభాగ్యం చేత అపరిమితానందం పొంది శిష్యులతో కలసి సముచిత సపర్యలు గావించాడు. శ్రీ కుమారిలుని సపర్యలను శ్రీ శంకరులు ప్రీతితో గైకొన్నారు.

81. శ్రీ కుమారిల భట్టాచార్యులు భక్తిశ్రద్ధలతో యిచ్చిన భిక్షను ప్రీతితో గైకొన్నారు. అనంతరం శ్రీ శంకరులు తన బ్రహ్మసూత్ర భాష్యగ్రంథాన్ని చూపారు. సర్వ ప్రబంధం నిర్దోషంగా తనచే రచించబడినా, దానిని శిష్టులైనవారు చదివి ప్రశంసిస్తే బహుళ ప్రచారం జరిగి లోకోపకారం జరుగుతుంది. అందువలన శ్రీ శంకరులు తనచే విరచితమైన భాష్య గ్రంథాన్ని పరీక్షకై శ్రీ కుమారిలునిచే శ్రవణం చేయించారు.

82. అంతటి ప్రాణాపాయ స్థితిలో కూడా శ్రీ కుమారిలభట్టు శ్రీ శంకరుల భాష్య గ్రంథాన్ని అమిత శ్రద్ధతోను, ఆనందంతోను పరిశీలించాడు. "లోకంలో అల్పబుద్ధి గలవారు ఇతరుల గ్రంథాన్ని అసూయా దృష్టితోనే చూస్తారు. అందుచే వారికి దోషాలు లేకున్నా, దోషాలున్నట్లే కానవస్తుంది. అలాగే తన గ్రంథంలోని దోషాలను పరిశుద్ధమనీ భావిస్తారు. మహోత్తమ పండితుడైన వాడు మాత్రమే తాత్త్విక దృష్టితో చూసి, గుణాలను గ్రహిస్తాడు. దోషాలెక్కడైనా కనిపించినా వాటిని శుద్ధిపరుస్తాడు."

83. మహాత్మా! తమరు రచించిన యీ భాష్య గ్రంథాన్ని పరిశీలిం చాను. తమరు వ్రాసిన ఈ గ్రంథంలో తప్పుపట్టగల వాడెవడైనా ఉంటాడా? దోషరహితమై ఉన్నది. రామణీయకత, శబ్దార్థ గాంభీర్యం, పదప్రయోగాలతో కూడిన యీ గ్రంథం మరెవ్వరూ వ్రాయలేరు. ఈ భాష్యంలో ప్రథమాధ్యాయం లోనే ఎనిమిది వేల వార్తికాలున్నవి. నేను స్వయంకృతాపరాధం చేత మరణ శిక్షను విధించుకొన్నాను. లేకుంటే తమ భాష్యగ్రంథానికి నేను వార్తికాలన్నీ వ్రాసేవాడను. నాకా భాగ్యం లేదు.

84. లోకంలో బ్రహ్మజ్ఞాన సంపన్నులైన వారి దర్శనం అతి దుర్లభం. ఇటువంటి అవసాన దశయందు మీ బోటివారి దర్శన భాగ్యం కలుగటమే నా పూర్వజన్మ భాగ్యంగా భావిస్తాను. నేను ముందు జన్మలలో చేసుకొన్న పుణ్యఫలం చేతనే, ప్రాణ ప్రయాణ సమయంలో, నాకు మహేశ్వరుని దర్శన భాగ్యం కలిగింది. నా భాగ్యానికి అంతం లేదుగదా! మహాత్ము లెప్పుడూ కరుణాసముద్రులు గదా! మహాత్మా! నన్ననుగ్రహించండి; నా పరలోక యాత్రా సమయంలో తమ పాదారవిందాలనే ధ్యానిస్తాను. అవసాన సమయంలో భగవద్దర్శనం ముక్తిని ప్రసాదిస్తుంది గదా!

85. మహాత్మా! సముద్ర జలమంతా ఉప్పుమయమే. ఒక చుక్క సముద్ర జలం త్రాగినా దాహం పెరుగుతుందే కాని, దాహం తీరదు. ఆ విధంగానే సారంలేని ఈ సంసార సాగరమంతా ఉప్పువంటి దుఃఖాలతోనే కూడి ఉంది. సుఖశాంతులు మచ్చుకైనా కనిపించవు. అయితే ప్రాకృత బుద్ధి కలిగిన వారికిది లాభదాయకమే. ఎలాగంటే, ఈ సంసార సాగరాన్ని భగవద్భక్తి అనే దృఢమైన నౌకపై చేరి అమృత సాగరమైన బ్రహ్మపదాన్ని చేరవచ్చు. కనుక మహాత్మా! మీ బోటి దివ్యతత్త్వ, బ్రహ్మజ్ఞాన సంపన్నుల సందర్శన భాగ్యంచేత నన్ను సులభంగా తరింపజేయగలరు.

86. లోకపూజనీయ మహాత్మా! మీ దర్శనం చేసుకోవాలని చాలాకాలం నుండి కోరుకొంటున్నాను. ఈ సంసార మార్గంలో పయనించే మానవులకు వారి సంకల్పానుసారం కార్యాలు సిద్ధించవు. దైవానుగ్రహం చేతనే జరుగు తాయి. అందువలననే తమ దర్శనం కోరుకొన్నప్పటికీ లభించలేదు.

ఇప్పుడు దైవం అనుగ్రహించటం చేత నాకా భాగ్యం కలిగింది. తమ దర్శనంతో కృతార్థుడనైనాను. అంతా దైవేచ్ఛ ప్రకారమే జరుగుతుంది.

87. కాలరూపుడైన దైవమే ఒకప్పుడు ప్రియమైన వస్తువులను దగ్గరకు చేరుస్తూ మరల ఆ దైవమే వారిని విడదీస్తాడు. అది ఆయన కొక ఆట. వారి వారి కర్మఫలాలను లెక్కలుగట్టి సుఖదుఃఖాలను ఇస్తూంటాడు. దానిని నివారించే శక్తి ఎవరికీ లేదు. అందువలన లోకంలో ఏదీ స్థిరమైనది లేదు (దైవ మొక్కటే స్థిరమైనది). కాలగమనాన్ని తెలుసుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. కనుక ఈ తత్త్వం తెలిసిన మహాత్ములు దుఃఖాలకు వెరువరు. సుఖాలకు పొంగిపోరు.

88. మహాత్మా! నేను కర్మప్రతిపాదకమైన శ్రీ శాబర భాష్యాన్ని రచించాను. అది వేదప్రతిపాదకమై కర్మమార్గానికి దోహదం చేయ గలదు. తార్కికుల అనుమాన ప్రమాణ తర్కాలకు మొక్కపోవనిదిగా ప్రతిపా దించాను. ఆ మార్గమిక నిరాఘాటంగా వృద్ధి చెందగలదు.

89. వేదవాక్యాలే స్వతహాగా ప్రమాణాలై ఉన్నవి. ఆ శ్రుతి వాక్యాల ననుసరించి శాస్త్రాలకు అర్థాలు పలుకుతున్నారు. అందువలన వేదభిన్నమైన ఇతర శాస్త్ర ప్రమాణాలను కోరుచున్నవి. ఓ మహానుభావా! శ్రుతుల స్వతః ప్రమాణత తెలుపడానికి పలికానేగాని, సర్వత్రా వ్యాపించివున్న పరమేశ్వరుని ఔననడానికి గాని, కాదనుటకు గాని ఎవరికి లేదు. శ్రుతులు స్వతః ప్రమాణాలే నా ప్రతిపాదనలకు కేంద్రమై ఉన్నవి. అయినా స్వయంప్రకాశకు డైన పరబ్రహ్మ కర్మను దైవంగా తలుస్తాడు. వేదాలు పౌరుషేయాలు కావు, స్వతఃప్రమాణాలు, భాగవిద్విజ్ఞానస్వరూపాలు, సర్వధర్మ బోధకాలు.

90. మహాత్మా! లోకమంతటా నాస్తికవాదం వృద్ధి గాంచుతోంది. వేదమార్గం శిథిలమవుతున్నది. నేను వేదకర్మ మార్గానుసారి నవడం చేత, ఎంతో వ్యథ చెందాను. తరువాత వైదిక కర్మ సిద్ధాంతాలను ప్రచారం చేయడానికి నడుం బిగించాను, క్రమంగా నాస్తికవాదులందరినీ జయిం చాను.

91. నాస్తికుల గురువు అసంఖ్యాకమైన శిష్యులను వెంటబెట్టుకొని రాజాశ్రయం పొందుతారు. తరువాత రాజు తమ వాడనీ, రాజ్యం తమదనీ ప్రజలను నమ్మించి, నాస్తిక మత సిద్ధాంతాలను ప్రచారం చేస్తారు. వైదిక మార్గం దోషభూయిష్ఠమయినదనీ, ఆ మార్గాన్ని అనుసరింపరాదనీ ప్రచారం చేస్తారు. కనుక నాస్తిక సిద్ధాంతాలనే ఆచరించండని పలుకుతుంటారు. ఆ విధంగా పూర్వకాలం నాస్తికులు రాజులను తమ గుప్పిట్లో పెట్టుకొని తమ మత ప్రచారాలను వృద్ధి చేసుకొంటూ పోయేవారు.

92. నాస్తికుల ప్రచార ధోరణిని శ్రీ శంకరులకు తెలుపుతున్నారు: "వేదాలు కంటికి కనిపించే విషయాలను విస్మరించి, కనిపించని పారలౌకిక విషయాలనే ప్రతిపాదిస్తున్నవి. అట్లే వేదాలు "సత్యం వద ధర్మం చర, అహింసా పరమో ధర్మః" అనే పరమ ధర్మాలను ఉపదేశిస్తున్నవి. మరల అదే వేదం పశు హింసాత్మకమైన యజ్ఞయాగాదులను ఆమోదిస్తున్నది. కనుక పరస్పర విరుద్ధాలను బోధించే వేదాలు ప్రమాణం కాజాలవు. వేదాలు అసత్యాన్నే పలుకుతున్నవని నాస్తికులు ప్రచారం గావించసాగారు. పవిత్ర వేదమార్గం నానాటికీ బలహీనమై అదృశ్యం కాజొచ్చింది. అదీగాక వారిని ప్రతిఘటించేవారు లేకపోవడం చేత వారి ప్రచారాలకు అడ్డులేక పోయాయి.

93. మహాత్మా! నా శక్తి ఉన్నంతవరకు వారి వేదవిరుద్ధ ప్రచారాలను అడ్డుకొన్నాను. అయినా వారి నాస్తిక సిద్ధాంతాలు పూర్తిగా తెలియకపోవటం వలన వారిని సమర్థంగా నివారించలేకపోయాను. వారిని నివారించాలంటే ముందుగా నివారింపదగినదాని వస్తుతత్త్వాన్ని తెలుసుకోవాలి. తరువాత, ఆ మతాన్ని సులభంగా ప్రతిఘటించవచ్చు. కనుక నాస్తిక మత సిద్ధాంతాలను తెలుసుకోవాలనుకొన్నాను.

94. అందువలన నాస్తికమత సిద్ధాంతతత్త్వాన్ని సంపూర్ణంగా అధ్యయనం చేయదలచాను. అమిత కుశాగ్రబుద్ధీ, ప్రజ్ఞావంతుడూ అయిన, 'సుగత' గురువరుని ఆశ్రయించాను. ఆ గురువరుడు తన శిష్యగణంచేత వైదిక మార్గాన్ని బహు విధాలుగా దూషిస్తూ, తనచే కల్పితమైన కుతంత్రాలను

వ్యాఖ్యానించి బోధిస్తూ, అసత్యాలను బోధిస్తూ నాస్తికమత సిద్ధాంతాలను ప్రకటించేవాడు. సౌగతులు, తథాగతులు, మాధ్యమికులు, సౌత్రాన్తికులు మొదలైనవి నాస్తిక మతంలోని ముఖ్యమైన తెగలు. వారందరూ వైదిక మార్గాన్ని దూషించేవారే.

95. ఒకానొక రోజు నా గురువు యథేచ్ఛగా వేదాన్ని నిందించ సాగాడు. నేను వేదాన్ని సమర్థింప అసమర్థుడనై నిస్సహాయుడనై రోదించ సాగాను. నా కన్నుల వెంట నీరు ధారాపాతంగా వర్షించసాగింది. నాతోటి సహాధ్యాయులు కొందరు నా స్థితిని నిశితంగా గమనించారు. గురువుతో "వీడు నాస్తికుడు కాడు. వైదిక మార్గం అవలంబించే బ్రాహ్మణుడు" అని తెలిపారు. ఆనాటి నుండి నాకు పాఠాలు నేర్పడం నిలిపివేశారు. అంతవరకు నా పట్ల ఉన్న స్నేహభావం పోయి బద్ధశత్రువులైనారు. గురువూ తక్కిన శిష్యులూ నన్ను తుదముట్టించాలని తీర్మానించుకొన్నారు.

96. "వీడు మనకు సహపాఠి కాడు. వేదంపట్ల ప్రేమ కల వాడు. వీడు మనకు శత్రువు. మనలను వంచించి మన శాస్త్ర రహస్యాలను తెలుసుకోవడానికి వచ్చిన బ్రాహ్మణుడు. వీడు ప్రాణాలతో ఉంటే మన సిద్ధాంతాలకు బలమైన ప్రత్యర్థి కాగలడు. ఈ ధూర్తుని మరణం వలన గాని మనకు శాంతి లభింపదు" అని యీ ప్రకారం నాస్తికులు నన్ను చంపడానికే తీర్మానించుకొన్నారు. ఆ కాలంలో నాస్తికులు రాజులను తమ గుప్పిట్లో ఉంచుకొని మత బోధలు చేస్తుండేవారు. నాస్తిక మతవాదులు ప్రత్యర్థుల వాదనలను ఖండించడమేకాక, మాయోపాయాల చేత రాజుచే మరణ శిక్ష వేయించేవారు. లేని పక్షంలో వారే హతమారుస్తుండేవారు. ఈ విధంగా దేశమంతా మత కలహాలతో అశాంతి నెలకొని ఉండేది. అందుచేతనే నన్ను కూడా చంపడానికి తీర్మానించుకొన్నారు.

97. పైకి మాత్రం నాస్తికులు అహింసావాదాన్ని ప్రచారం చేసేవారు. ప్రత్యర్థులను హతమార్చడానికి మాత్రం వెనుకాడేవారు కారు. అందుచేత నన్ను చంపడానికే నిశ్చయించుకొన్నారు. ఒకానొక రోజు నేను గాఢనిద్రలో ఉండగా మహోన్నత ప్రసాదం నుండి క్రిందకు పడత్రోయించారు. వెంటనే

మేల్కొన్నాను, నిస్సహాయుడనై విలపించాను. నా స్థితి దుస్సంకటంగా ఉన్నది.

98. మహాత్మా! అలా నన్ను ఎత్తైన మేడపై నుండి పడత్రోయగా, వేరే మార్గాంతరం లేనివాడనై, కేవలం వేదాన్నే భగవంతుడని సుస్థిరంగా నమ్ముకొన్న వాడనవడం చేత, "వేదాలే స్వతః ప్రమాణాలయితే, వేదమాత నన్ను రక్షించుగాక! నేను జీవిస్తే నా వేదాలకు కూడా గతి కలుగు"నని ప్రతిజ్ఞావాచకం పలికాను. నేను క్రింద పడిపోయే విధానాన్ని, నేను చేసిన ప్రతిజ్ఞా వాచకాన్ని నాస్తికులందరూ మిక్కిలి ఆసక్తితో, "ఏమి జరుగుతుందో చూద్దాం" అని చూడసాగారు. నేను పలికిన వేదప్రమాణ్య ప్రతిపాదిత వచనాలతో నాస్తికుల హృదయాలు భీతి చెందారు.

99. మహానుభావా! నా ప్రతిజ్ఞా వాచకంలో వేదాన్ని పూర్తిగా విశ్వసించక "యది ప్రమాణం శ్రుతయః" అనే వాక్యంలో 'యది' అని సందేహాన్ని ప్రయోగించాను. "ప్రమాణాలయితే" అని సందేహించి పలికాను. నేను వేదాన్ని పరిపూర్ణంగా విశ్వసించకపోవడం చేత, గురువును మోసగించి విద్య నేర్చుకొన్న దోషం చేత అంత ఎత్తు నుండి పడిపోయినా, ప్రాణాలు దక్కినవి. కాని ఒక కన్ను పోగొట్టుకొన్నాను. వీటికంతటికీ దైవకృప, పూర్వ జన్మ సుకృతాలే కారణాలు. భగవంతునిపై భారం వేసిన భక్తులను భగవంతుడే కాపాడుతాడని భగవద్గీతా వాక్యం పూర్తిగా నమ్మితే శ్రుతి మాతయే రక్షిస్తుందని నమ్ముకున్నవాడిని.

100. "ఓ యతిపుంగవా! ఒక్క అక్షరం నేర్పినవానిని కూడా గురువుగా స్వీకరించాలని శాస్త్రాలు చెబుతున్నవి. నేను ఆ మహానుభావుని వద్ద నాస్తిక సిద్ధాంత రహస్యాలను మోసం చేత గ్రహించాను. అంతేకాక గురుదక్షిణ కూడా సమర్పించుకోలేదు. ఇంతకన్నా ఘోరాతిఘోరమైన తప్పిదం వేరొకటి ఉంటుందా? వారి విషయంలో గొప్ప తప్పదం చేశాను" అని శ్రీ శంకరులకు విన్నవించుకొన్నాడు.

కుమారిల భట్టాచార్యుడు మతాన్ని ఉద్ధరించడానికి అరుదెంచిన కుమారస్వామి అవతారం అయినా, గురుద్రోహం ఎంత ఘోరపాపమో

తెలిపి, దానికి శిక్షను స్వయంగా తానే విధించుకొని లోకానికి గురుద్రోహ మెంత పాపకార్యమో చాటిచెప్పాడు. కనుక ఎంతటి వారైనా గురువుపట్ల కృతజ్ఞులై మెలగాలి.

101. దేవా! గురువులైన 'సుగతు'ల వలన శాస్త్రార్థాలను గ్రహించాను. ఆ జ్ఞానంచేత 'సుగతు'ల వంశాన్నే సర్వ నాశనం చేయించాను. ఇది ఘోరమైన నేరం. అంతేగాక జైమినీ మహర్షి రచించిన శాస్త్రాలను విశ్వ సించి పరమేశ్వరునే ధిక్కరించాను. ఈ విధంగా అటు గురుద్రోహం ఇటు దైవద్రోహం కూడా చేశాను. శాస్త్రాలలో ఈ రెండూ ప్రబలమైన నేరాలే కనుక నా నేరానికి మరణం మాత్రమే కాదు, మహానరక మనుభవిస్తూ మరణించటమే సరియైన ప్రాయశ్చిత్తం.

102. మహాత్మా! ఈ రెండు దోషాలకు ప్రాయశ్చిత్తంకోసం శాస్త్రాలన్నీ పరిశీలించాను. ఊకను చుట్టూ పేర్చుకొని దానికి నిప్పు అంటించి దాని నడుమ పడుకొని ప్రాణత్యాగం చేయడంచేత లభించగలదని తెలుసుకొన్నాను. వస్తు తత్త్వమిదే! ఇప్పుడే తమ దివ్య పాదపద్మాల దర్శనం చేత నా పాపా లకు రెండవ ప్రాయశ్చిత్తం ఈడేరింది. మహాత్ముల పాదదర్శనంచే సర్వపాపాల నుండి విముక్తి లభిస్తుంది గదా! కనుక నా మరణ సమయంలో రెండూ పావన మొనరించబడినవి.

103. యోగివరేణ్యా! జైమినీయ సూత్రాలకు శ్రీ శబరముని భాష్యం రచించాడు. ఆ శబరముని భాష్యానికి నేను వార్తికాలను రచించాను. తమ భాష్యం విన్న తరువాత తమ భాష్యానికి కూడా వార్తికాలు వ్రాసి తమ ద్వారా సుస్థిరమైన కీర్తిని పొంది నా జన్మ సార్థకం చేసుకోవాలనే కోరిక కలిగింది. ఏ కార్యం సాధించాలన్నా శరీరం ప్రధానం కదా! నేనట్టి శరీరాన్నే త్యజించబోతున్నాను. కనుక నా కోరిక నిష్ఫలమవుతుంది. అన్నిటికీ దైవానుగ్రహం అవసరం గదా!

104. మహాత్మా! ఆర్యజనస్తుత్యా! లోకంలో అద్వైత సిద్ధాంతాన్ని పరిరక్షించి, ప్రచారం చేయడానికి అవతరించిన పరమ శివావతారంగా తమను దర్శిస్తున్నాను. బ్రహ్మజ్ఞానులైన తమ దర్శనం నేను ప్రాయశ్చిత్తం

విధించుకోవడానికి పూర్వం కలిగి ఉండే పక్షంలో నేను ధన్యుడనై ఉండేవాడను. ఈ ప్రాయశ్చిత్తాన్ని తలపెట్టేవాడను కాను. ఎందుకంటే, మహాపురుషుల దర్శన భాగ్యం చేత గురుద్రోహ, దైవ ద్రోహాల వలన కలిగిన పాపాలు కూడా సంపూర్ణంగా నశించగలవు. ఈ విషయమే మాఘ కావ్యంలో నారద శ్రీకృష్ణ సంవాదాన తెలుపబడినది.

105. ఆర్యోత్తమా! నా రెండు దోషాలకు ప్రాయశ్చిత్తంగా ఈ తుషాగ్ని యందు ప్రవేశించాను. ఇప్పుడిక వెనుకంజ వేయను వీలుపడదు. నా విధి యీ తీరున వ్రాసి ఉండడం చేత ఎవరూ తప్పించలేరు. నేను వ్రాసిన శబరభాష్య వార్తికాలన్నీ కర్మకాండ ప్రతిపాదకాలు. వేదాంత తత్త్వబోధకాలైన బ్రహ్మసూత్ర భాష్యాలకు వార్తికాలు వ్రాసే భాగ్యం నాకు కలగటం లేదు. అట్టి భాగ్యం నాకు కలిగి ఉంటే సుస్థిరకీర్తిని పొంది ఉండేవాణ్ణి. ఇప్పుడు చింతించి ఏం ప్రయోజనం?

106. శ్రీ కుమారిలభట్టాచార్యుల పలుకులు విని, ఎంతో ప్రసన్నులై శ్రీ శంకరులు ఇలా పలికారు: వత్సా! నువ్వు పరమేశ్వరుని ఆజ్ఞచేత, లోకంలో నాస్తికులను ధ్వంసం చేసి వేదవిభాగమైన కర్మకాండను పునః ప్రతిష్ఠ చేయడానికి వచ్చిన కుమారస్వామి అవతారుడవు. అంతేకాని సామాన్య మానవమాత్రుడవు కావు. ఈ విషయం ఎవ్వరూ ఎరుగరు. నువ్వు నీ కర్తవ్యాన్ని నెరవేర్చావు. అది సర్వలోకహితమైన కార్యమవడం చేత ఎట్టి దోషమూ నీకు అంటదు. నువ్వు వేద రక్షకుడవని తెలుసుకొని మనస్తాపాన్ని విడువు.

107. "లోకోద్ధరణదక్షా! ధన్యాత్మా! నువ్వు ఎలాటి దోషాన్ని చేయ లేదు. నీ కెలాటి పాపమూ అంటదు. లోకంలో సజ్జనులు ధర్మమార్గాన్ని అనుసరించడానికి, పాపకార్యాలు చేసేవారికి ఎలాటి కఠినమైన ప్రాయశ్చిత్త ముంటుందో, లోకులకు చాటి చెబుతున్నావు. అంటే సజ్జనుల చర్యలు లోకులకు మార్గదర్శకాలవుతవి. సజ్జనుల నుద్ధరించడానికి సత్యవ్రతాన్ని ఆచరిస్తున్నావు. వత్సా! సర్వవేదాలను ఉద్ధరించి లోకహితం చేసిన వానికి పాపం ఎక్కణ్ణుండి వస్తుంది? నువ్వు పుణ్యశీలివి; నిష్కల్మషుడవు. వత్సా!

నువ్వు శాబర భాష్యానికి వార్తికాలు వ్రాసినట్లే, నా భాష్యానికీ వార్తికాలు వ్రాయి. దాని వలన సాటిలేని పాండిత్యం, ప్రజ్ఞాశక్తి, ఆస్తికబుద్ధి ప్రకాశించ గలవు. నీ కీర్తి సుస్థిరమవుతుంది. సందేహింపకు. ఈ క్షణంలోనే నిన్ను బ్రతికిస్తాను.”

108. శ్రీ కుమారిలభట్టారకులు అతి వినయంతో “వేదాలు ధర్మమే ప్రధాన కారణంగా గలవి” అనే సూత్ర వాక్యాన్ని గూర్చి శ్రీ శంకరులకు తెలియబరచుకొంటున్నాడు.

109. శ్రీ కుమారిలభట్టు ఇలా పలికాడు: సర్వజ్ఞా! తమకు నేను చెప్పదగినంతటి వాడను కాను. గురుకుల నాశనం, భగవత్తత్త్వ నిరసన అనేవి సామాన్యమైన దోషాలు కావు. అట్టి దోషాల వలన నేను పరిశుద్ధ డను కాజాలను. ఆ దోషాలచే మనస్సు వికలమై ఉంది. మహోదార పురుషులు, మహాత్ములు, దయామయులైన తమరు ఈ విధంగా పలుకడం మీకు తగి ఉంది. పరుల దోషాల నెంచక గుణాలనే కొనియాడడం సజ్జనుల స్వభావం గదా!

110. మహాత్మా! సర్వలోక శుభంకరా! సృష్టి స్థితి లయాలను చేసే పరబ్రహ్మవు. తమరు సర్వసమర్థులు. తమకు వందనాలు. ఎన్నడో మృతి చెందిన వారిని కూడా క్షణంలో బ్రతికించగల సమర్థులు. శంకారావతారులైన తమకు సాధ్యం కానిదేమీ లేదు. నేను చేసిన రెండు పాపాలు నన్ను రేయిం బవళ్లు వేధిస్తున్నాయి. ప్రాయశ్చిత్తం కోసం ఆగమాలన్నీ గాలించాను. తుషారాగ్ని ప్రవేశమే (ఊకతో శరీరాన్ని కప్పివేసి నిప్పు ముట్టించుకొనే విధం) సరియైన ప్రాయశ్చిత్తం కనుక వ్రతాన్ని ప్రారంభించాను. ఈ పరిస్థితులలో నేనీ వ్రతాన్ని నిలిపివేస్తే ఈతడు వేదాన్ని ప్రబోధిస్తూ, ధర్మ పన్నాలను వల్లిస్తూ అధర్మ కార్యం చేస్తున్నాడని లోకులు పరిహసిస్తారు. అంతేకాదు. నా ఆత్మ ప్రబోధానికి విరుద్ధంగా ఈ వ్రతాన్ని నిలిపివేయలేను. నేను పరిశుద్ధాత్ముడనై పరమేశ్వరానుగ్రహానికి పాత్రుడనై విష్ణుపదాన్ని చేరాలన్నదే నా కోరిక. వినయపూర్వకంగా చేసుకొంటున్న నా ఈ విన్నపాన్ని మన్నించండి.

111. ఓ పరమేశ్వరా! సర్వభూతాలను తమోగుణంచే లయింప జేస్తావు. తిరిగి నీ సంకల్పం చేత ఆ భూతాలన్నింటినీ సృష్టిస్తావు. అట్టి తమరు నన్ను బ్రతికించటంలో ఆశ్చర్యమేమీ లేదు. కానీ నన్ను పరిశుద్ధునిగా చేసి దైవానుగ్రహపాత్రునిగా చేస్తే నా అభీష్టం సిద్ధించి విష్ణుపదాన్ని చేర గలను. తమ దివ్య ప్రభావం నే నెరుగుదును.

112. యతివరేణ్యా! శాస్త్రాలన్నీ పరిశోధించి యీ ప్రాయశ్చిత్త వ్రతాన్ని ప్రారంభించాను. నా యందు దయ చూపి నన్నీ వ్రతం నుండి విరమించమని ఆదేశించకండి. కాశీలో ప్రణవ మంత్రోపదేశాన్ని పొందిన జీవుల నందరినీ పరమేశ్వరుడు తరింపజేస్తున్నాడు. తమరు ఆ పరమశివుని అవతారమే కనుక తామూ నాకు ప్రణవ తారకమంత్రం ఉపదేశించి బ్రహ్మ తత్త్వాన్ని తెలిపి నాకు ముక్తిని ప్రసాదించండి.

113. మహాత్మా! మండనమిశ్ర శర్మ అనే బ్రాహ్మణోత్తము డొకడు మహిష్మతీ నగరంలో ఉన్నాడు. ఆతడు వైదికమార్గ ప్రవర్తకుడు, కర్మయోగా భ్యాసంలో దిట్ట, వేదార్థ భావాలను, తత్త్వాలను విపులంగా యెరిగినవాడు, పండితుడు, కర్మకాండ ప్రచార దక్షుడు. తమరు ఆతణ్ణి జయించండి. మండన మిశ్రుని జయిస్తే లోకంలోని పండితులందరనూ సులభంగా జయింపవచ్చు. ప్రభువును జయిస్తే ప్రజలెల్లరూ వశులయ్యేట్లు, తక్కిన పండితులేమీ చేయ జాలరు. వాని ద్వారా బ్రహ్మసూత్ర భాష్యాలలోని దుర్ఘట విషయాలను సంక్షిప్తంగా, అద్దం పట్టినట్లు స్ఫుటంగా చూపేవి వార్తికాలు. కనుక వార్తికాలు ఆవశ్యకాలు. భాష్యాలన్నీ వార్తికాలతో కూడి ఉన్నవి.

114. మండనమిశ్ర పండితుడు (విశ్వరూపుడు) "వేదాలు కర్మ మార్గానే ప్రతిపాదిస్తున్నవి. అట్టి వైదిక మార్గమే న్యాయమైనది. ఆచరింప వలసిన మార్గమనీ, గృహస్థాశ్రమమే సర్వశ్రేష్ఠమూ, సకల వైదికానుష్ఠానా లకు గృహస్థాశ్రమం ఆవశ్యక"మని ప్రవచిస్తూంటాడు. మహా గృహమేధియై, సత్కర్మల నాచరిస్తూంటాడు. ఆతడు అయిదు వందల మంది శిష్యులకు ప్రవృత్తి మార్గాలను బోధిస్తుంటాడు. నివృత్తి మార్గాన్ని ఉపనిషద్మార్గాన్ని నిరసిస్తాడు.

115. మహాత్మా! మండనమిశ్రుడు కర్మయోగంలో ఆసక్తి ఉన్నవాడు. కర్మిష్ఠి. ఎల్లప్పుడూ ప్రవృత్తి మార్గాన్నే ప్రబోధిస్తుంటాడు. నివృత్తి మార్గమంటే విముఖత గలవాడు. వేదాంతత్త్వమన్నా, జనన మరణ రాహిత్య బ్రహ్మపద మన్నా విమర్శిస్తాడు. తమరు ఆతణ్ణి జయించి నివృత్తి మార్గం వైపునకు ఆకర్షితుని చేయండి. అట్టి విశ్వరూపుని తమరు ఆకర్షించిన యెడల మీ సర్వకార్యాలు సిద్ధింపగలవు. కనుక మీరాతడిని కలుసుకోవాలి.

116. ఆ విశ్వరూపునే (మండనమిశ్రుడు) బాల్యంలో ముద్దుగా ఉమ్బేకుడని పిలచేవారు. వివాహనంతరం ఆతడి భార్యయైన ఉభయ భారతీదేవిని కూడ ఉంబయని పిలచేవారు. ఆ ఉభయభారతీదేవి సాక్షాత్తూ సరస్వతీ అపరావతారమే. కారణాంతరాల వలన దుర్వాస మహాముని చేత శాపగ్రస్తురాలై ఉభయభారతీదేవిగా జన్మించినది. వారిరువురూ సర్వ విద్యా స్వరూపులు, వేదమార్గం అనుసరించేవారు.

117. మహాత్మా! మండనమిశ్రుడంటే సామాన్య పండితుడు కాడు. వేదవేదాంగాలను, సకల శాస్త్రాలందూ, నా కంటే అన్నివిధాలుగా గొప్పవాడు. నా శిష్యులందరిలోనూ అగ్రగణ్యుడు. నాకు పరమ ప్రియతముడు. ఆతడి భార్య సాక్షాత్తూ సరస్వతీదేవియే, వేరు గాదు. తాము మండనమిశ్రునితో వాదించండి. ఆ వాదనా పరిశీలకురాలుగా, న్యాయ నిర్ణేతగా ఉభయభారతీ దేవిని నిర్ణయించండి. మీరు తప్పక మండనమిశ్రుణ్ణి జయించి తమ శిష్యునిగా చేసుకొని తమ మనోరథాలన్నిటినీ తీర్చుకోండి. మండనమిశ్ర, ఉభయభారతీదేవులంటే బ్రహ్మ సరస్వతులనియే గ్రహించండి.

118. ఓ పరమహంస శ్రేష్ఠా! విశ్వరూపనామధేయుడూ, సర్వవిద్యా శిరోమణీ అయిన ఆ మండనమిశ్ర పండితుణ్ణి శీఘ్రంగా కలుసుకోండి. ఈశ్వరావతారులైన తమ అభీష్టాలన్నీ నెరవేరతాయి. అవసాన కాలంలో నాకు తమ దర్శన భాగ్యం లభ్యమైనది. శరణు పొంది దీనుడనై ప్రార్థిస్తు న్నాను. నాకు తారమమంత్రం ఉపదేశించండి. బ్రహ్మతత్త్వజ్ఞాన నేత్రం తెరుచుకొనేట్లు అనుగ్రహించండి. సంసారం నుండి విముక్తుడనై బ్రహ్మపదాన్ని పొందేట్లు చేయండి. ఇదే నా చివరి ప్రార్థన.

119. శ్రీ కుమారిల భట్టారకులు శ్రీ శంకరులను యీ విధంగా తారకమంత్ర బ్రహ్మోపదేశాన్ని కోరి, యిక మాట్లాడటం నిలిపివేశాడు.

తారక బ్రహ్మోపదేశమంటే, ప్రణవ మంత్రోపదేశం, అట్టి వాక్యార్థం, దాని లక్ష్యాలను బాగా గ్రహించటం అని అర్థం. అంత్యకాలంలో ప్రణవ తత్త్వ మెరిగినవాడు తిరిగి జన్మించడు; ముక్తిధామం పొందుతాడు. అవసాన కాలంలో పరబ్రహ్మ భావన గూర్చి సర్వశాస్త్రాలు చెబుతున్నాయి.

పతంజలి మహర్షి "తస్య వాచకః ప్రణవః" "తజ్జప స్తదర్థ భావనమ్" అని వచించారు.

శ్రుతివాక్యాలు "ఓమిత్యేకాక్షరం బ్రహ్మధ్యేయం సర్వముముక్షుభిః, ఓమిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత" అని తెలుపుతున్నవి. భగవద్గీతలో భగవానుడు అర్జునునితో "ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః" అని పలికాడు.

120. జీవిత కాలమంతా వేదమార్గాన్ని ప్రతిష్ఠించడానికి కృషి చేసి, యజ్ఞయాగాదులనే కర్మలను చేసీ ఆత్మజ్ఞానంలేక పరితపిస్తున్న శ్రీ కుమారిల భట్టారకులపై శ్రీ శంకరులు దయాదృష్టి ప్రసరింపజేసి పరబ్రహ్మ తత్త్వోపదేశం విస్పష్టంగా ఉపదేశించారు.

ఈ ప్రకారం శ్రీ కుమారిలభట్టుని ధన్యుని జేసి, శ్రీ మండనమిశ్రుని జయించాలని తీర్మానించుకొని అమిత వేగంగా ఆకాశమార్గాన ప్రయాణమై మండనమిశ్రుని గృహాన్ని చేరడానికి నిశ్చయించుకొన్నారు.

121. అప్పుడు శ్రీ కుమారిలభట్టు వాక్కును ఉపసంహరించుకొని, సర్వేంద్రియ కార్యాలను నిలిపి, మనస్సును గురు పాదపద్మాలపై లగ్నం చేసి, జీవబ్రహ్మైక్యతత్త్వాన్ని పొంది బ్రహ్మజ్ఞాన సంపన్నుడయ్యాడు. ఎన్ని శాస్త్రాలు చదివినా గురూపదేశం లేనిదే బ్రహ్మజ్ఞానం కలుగదు. ఎన్ని జ్ఞానా లను సంపాదించినా శాంతి లభించదు. కేవలం బ్రహ్మజ్ఞానం చేతనే పరమ శాంతి లభిస్తుంది. అదే శివం.



# సర్గము - 8

## శంకర మండనమిశ్రుల సంవాదం

1-2. శ్రీ శంకరులు శ్రీ కుమారిలభట్టారకుని ముక్తుని జేసి, శిష్యులతో కలసి త్రివేణీ సంగమంలో స్నానం చేసి, మండనమిశ్రుని జయించి, ఆతడిచే వార్తికాలను వ్రాయించడానికి సంకల్పించి, ఆకాశమార్గాన మహిష్మతీపురాన్ని చేరుకొన్నారు. ఆ నగర సౌందర్యాన్ని ఆకాశం నుండి తిలకించి ఆశ్చర్య పోయారు. క్రమంగా శిష్యులతో ఆకాశం నుండి భూమిపైకి దిగారు. భూదేవిని చూడడానికి వచ్చిన విష్ణుమూర్తిమల్లే ఆయన ప్రకాశించారు.

3. ఆ పట్టణం అనేక ఉద్యానవనాలతో నిండినది. ఏపుగా ఎదిగి, చల్లని నీడనిచ్చే అనేక సాంద్ర వృక్షాలతో, రేవానది నుండి వీచే చల్లని గాలులతో, వనమందు అనేక విధాలైన పుష్ప జాతుల నుండి వీచే తీయని పవనాలతో, పండ్ల భారం చేత వంగి నేలను తాకుతున్న ఫలవృక్షాలతో నిండి ఉంది. అంతట శ్రీ శంకరులు శిష్యులతో కలసి ఒక సాలవృక్ష ఛాయలో విశ్రమించారు. వాయుదేవుడు శ్రీ శంకరులకు అన్ని విధాలుగా సేవలుచేసి ధన్యుడయ్యాడు.

4. శ్రీ శంకరులు రేవానదిలో స్నానం చేసి, విశ్రమించిన తరువాత మండనమిశ్రుని ఇంటికి వెళ్ళాలని తలచారు. మధ్యాహ్నకాల సూర్యుడు తాపం కలిగిస్తుండగా మండనమిశ్రుని దాసీజనులను ఆ నదీ తీరాన చూశారు.

5. ఆ దాసీజనులు మండనమిశ్రుని ఇంటికి నీరు చేరవేయడానికి ఆ నదీ తీరానికి వచ్చారు. శ్రీ శంకరులు వారిని మండనమిశ్రుని ఇంటికి దారి తెలుపమని అడగ్గా వారిలా పలికారు.

6. మహాత్మా! ఏ గృహ ద్వారంవద్ద చిలుకలు (శుకాంగనలు) వేదప్రామాణ్యాన్ని గూర్చి చర్చిస్తుంటాయో అదే ఆ మండనమిశ్రుని గృహమని

తెలుసుకోండి. ఆ ఆడచిలుకలు వేదాలు స్వతఃప్రమాణాలా? లేక పరతః ప్రమాణాలా? పౌరుషేయాలా? లేక అపౌరుషేయాలా? అని ప్రశ్నించు కొంటుంటాయి. పురుషుల చేత రచింపబడలేదు కనుక వేదాలు అపౌరుషేయాలే అని సిద్ధాంతీకరిస్తాయి. అదే మండనమిశ్రుని గృహమని తెలుసుకోండి.

7. అంతేగాక మరికొన్ని చిలుకలు, "సుఖదుఃఖరూపకర్మ ఫలప్రదాత కర్మ అవుతుందా? లేక జననమరణాలు లేని వారైన పరమాత్మే ఫలప్రదాయి అవుతున్నాడా?" అని పలుకుతూంటాయి.

ఇది చాలా క్లిష్టమయిన ప్రశ్న. వారి వారి మతానుసారం సిద్ధాంతీకరించుకొంటున్నారు. నిజానికి భగవంతుడు కర్మనుగాని, కర్మఫలాన్ని గాని ఇవ్వడు. వారి వారి కర్మఫలాన్ని గాని యిచ్చేవాడు కాడు. భగవంతునికి కర్మతో ఎలాంటి సంబంధమూ లేదు. భగవంతుడు సాక్షిమాత్రమే.

8. అంతేగాక ఆ ఆడ చిలుకలు "జగత్తు నిత్యమా? లేక అనిత్యమా?" అని కూడా ప్రశ్నిస్తుంటాయి. ఈ విధమైన వేదవాక్యాలు ఎక్కడ వినవస్తాయో అదే మండనమిశ్ర పండితుని గృహమని తెలుసుకోండి. ఈ విధంగా 1. వేదప్రమాణ వాదం 2. కర్మఫలప్రదాతృవాదం 3. నిత్యానిత్య జగత్తును గూర్చిన వాదం. ఈ మూడింటిని పలికే గృహమే మండనమిశ్ర పండితుని గృహమని గ్రహించండి.

9. శ్రీ శంకరులు ఆ పరిచారికల మధురమైనవీ, వేదాంత పరమైనవీ అయిన పలుకులు విని ఆశ్చర్యపోయారు. "ఓహో! ఈ పట్టణంలో అందరూ పండితుల మల్లేనే కనిపిస్తున్నారు" అనుకొని, మండనమిశ్రుని గృహాన్ని చేరుకొన్నారు. వారి ఇంటి తలుపులు మూసి ఉండటంచేత, యోగశక్తితో మండనమిశ్రుని ఇంట్లోనికి ప్రవేశించారు.

10. శ్రీ శంకరులు మండనమిశ్రుని భవనం చూశారు. దేవేంద్రుని ప్రసాదంలా మహోన్నతంగాను, సువిశాలంగాను ఉంది. సదా గాలి వెలుతురు ప్రసరిస్తూ ఆరోగ్యదాయకంగా ఉన్నది. పండితులకు చక్రవర్తియై భూలోకంలో దేవేంద్రునిలా పరిపాలిస్తున్నాడు.

11. మండనమిశ్రుని భవనం మహోన్నతమై ఆకాశాన్ని తాకుతున్నట్లుంది. ఇక మండనమిశ్రుడు బ్రహ్మదేవునిలా సర్వవిద్యలతో ప్రకాశిస్తూ, వైదిక కర్మానుష్ఠానతత్పరుడై వేదాలను ప్రవచిస్తూ భూలోకాన బ్రహ్మమల్లే విరాజిల్లాడు.

12. వైదిక కర్మలందు అమితాసక్తుడైన ఈ మండనమిశ్రుడు, పరమభక్తితో శ్రీ వ్యాస, జైమినీ మునుల పాదపద్మాలకు పాదప్రక్షాళన చేసి శ్రాద్ధకర్మ నిర్వర్తింప సిద్ధపడుతున్నాడు. ఆ సమయంలో శ్రీ శంకరులు మండనమిశ్రుని చూసి, ఆతడు దేవాంశ సంభూతుడనీ, లోకంలో వేదాల నుద్ధరింప అవతరించాడనీ గ్రహించారు. శ్రీ వేదవ్యాసులవారు వేదాలను విభజించగా, శ్రీ జైమిని మహర్షి వేదాలచే ప్రతిపాదించిన కర్మకాండకు సూత్ర గంథం వ్రాశారు. తరువాత జైమిని శిష్యుడైన కుమారిలభట్టు, ఆతడి శిష్యుడైన మండనమిశ్రులు వైదిక మార్గాన్ని స్థాపించారు.

13. మండనమిశ్రుని ఇంటికి ఆకాశమార్గాన వచ్చిన శ్రీ శంకరులు, శ్రీ వ్యాస, జైమిని మునులను అమిత పూజ్యభావంతో కలుసుకొన్నారు. వారిరువురూ శ్రీ శంకర పరమహంసను చూసి ఎంతో సంతోషించారు. సకల శుభ లక్షణాలు కలిగిన యతిపుంగవునిగా భక్తి భావంతో చూశారు.

14. శ్రీ శంకరులు సాధారణ మార్గాన తన ఇంట్లోనికి ప్రవేశింపక, తన యోగశక్తులను ప్రదర్శించటం చేత శ్రీ మండనమిశ్రుడు అమిత కృద్ధుడయ్యాడు. అంతేకాక, ఆ వచ్చిన ఆగంతుక సన్న్యాసి ప్రవృత్తి మార్గాన్ని, కర్మానుష్ఠానాలను విసర్జించి నివృత్తి మార్గావలంబియైన సన్న్యాసి అవటంచేత మిగుల కోపం చెందాడు. శాస్త్రప్రకారం పితృకర్మ చేసేవాడు కోపగించుకోక పరమశాంతుడై ఉండాలి. అయినా, తన అనుమతి పొందక ఆకాశమార్గాన తన ఇంట ప్రవేశించి, స్వేచ్ఛగా సంచరిస్తున్న శ్రీ శంకరులపై అమిత కోపం చెందాడు. శ్రాద్ధకర్మలందు అందరూ శుచిగాను, కోపం లేనివారై ఉండాలని శాస్త్రాలు వచిస్తున్నవి. ప్రవృత్తి మార్గాన పండితుడైన మండనమిశ్రుడు శాస్త్రవిరుద్ధంగా కృద్ధుడయ్యాడు.

15. ప్రవృత్తిమార్గ పండితుడైన మండనమిశ్రుడు అమిత కృద్ధుడు కాగా, నివృత్తి మార్గావలంబి అయిన శ్రీ శంకరులు పరమ శాంతమూర్తులై కుతూహలంతో మండనమిశ్రుని పరిశీలించసాగారు.

16. శ్రీ మండనమిశ్రుడు, శంకరులు కేవలం బ్రహ్మమహేశ్వర అవతారాలు. వారిరువురూ సకల శాస్త్రాలందూ మహా పండితులుగా వేదోద్ధరణకు భూలోకంలో అవతరించిన మహాత్ములు. మండనమిశ్రుడు కర్మమార్గం, గృహస్థాశ్రమాలే బహుళ శ్రేష్ఠమైనవని తలచేవాడు. శ్రీ వ్యాస, జైమిని మహర్షులు కూడా ఈతడి పట్ల వాత్సల్య భావం కలిగి ఉన్నారు. ఇంటి తలుపులు మూసి ఉండడం చేత శ్రీ శంకరులు యోగశక్తితో శ్రాద్ధకర్మ చేసే ప్రదేశానికి వెళ్లారు. అట్టి సమయంలో శ్రీ శంకరుల చర్య వలన మండనమిశ్రుడు, 'ఓహో! ఈతడు అనుమతి లేకుండానే ఇంట ప్రవేశించాడు. కనుక ఈతడు అతిథి కాజాలడు. అదీగాక, ఈతడు నివృత్తి మార్గాన్ని అవలంబించినాడు. కాబట్టి నా సిద్ధాంతాలకు విరోధి' అని తలచాడు. అందువలన శ్రీవ్యాస జైమినీ మహర్షులు సమీపాననే ఉన్నప్పటికీ, శ్రాద్ధ సమయంలో కోపగించుకోవడం శాస్త్ర విరుద్ధమని ఎరిగీ, శ్రీ శంకరులపై కోపగించుకొన్నాడు.

ఇది ఇలా ఉండగా, శ్రీ శంకరులు మండనమిశ్రుని గృహాన్ని పరిశీలించారు. ఆడ చిలుకల వేద వాక్యాలను విని ఎంతో సంతోషించారు. మధ్యాహ్న కాలమందు అతిథుల నాదరింపక ఇంటి తలుపులు మూసు కొన్నారు. ఏదో అవైదిక కర్మల నాచరిస్తున్నాడని తలచారు. మండనమిశ్రునికి తగిన గుణపాఠం చెప్పాలనుకొన్నారు. వేదాధ్యయనం చేసే బ్రాహ్మణునకు శిఖ, యజ్ఞోపవీతాలు పరమ ధర్మాలు. శిఖ అంటే ధర్మ శిఖ అనీ, జందెమంటే సత్యవ్రత సూత్రమని అర్థం. ఇవి రెండూ లేకపోవడంతో వేదవిరుద్ధంగా భావించి మండనమిశ్రుడు శ్రీ శంకరుల పట్ల కృద్ధుడయ్యాడు.

17. **మండన మిశ్రుడు:** (కోపంతో) 'త్వన్మాతా ముండా' అని పలికాడు.

**శ్రీ శంకరులు:** ప్రశాంతులై, "ఓ పండితుడా! 'త్వన్మాతా' అనే పదం ప్రశ్నించేవారికి చెందేది కాని, సమాధానం చెప్పేవారికి కాదు. (అంటే

'మా తల్లియే ముండ" అని స్పష్టంగా వల్లించబడినది) పండితుడవైన నీకు ఈ మాత్రం కూడా తెలియదా?

18. **మండనమిశ్రుడు:** (కోపంతో) ఏమి మద్యపానం చేసితివా? విపరీతార్థాలను పలుకుతున్నావు. ముండికి నీకు తగునా?

**శ్రీ శంకరులు:** మద్యము (కల్లు) ఎక్కడైనా పచ్చటి రంగులో ఉంటుందా? దాని వర్ణం తెలుపు గదా?

**మండనమిశ్రుడు:** ఓహో! నీకు కల్లు రంగు బాగా తెలిసినట్లున్నది. నీకు అలవాటు గనుక వెంటనే చెప్పగలిగావు. కానీ నాకు అలవాటు లేదు.

**శ్రీ శంకరులు:** ఔను. కల్లు వర్ణం నే నెరుగుదును. వర్ణాలను తెలుసుకోవడం నాకు అభ్యాసం. కానీ, నువ్వు దాని రుచియే ఎరుగుదువు. నేను కల్లు రంగును తెలుసుకోవడంలో నాకు ఎలాంటి దోషమూ అంటదు. కానీ కల్లు త్రాగినవాడవు కనుక నీకే దోషముండగలదు.

ఈ విధంగా మండనమిశ్రుడు కోపంతోను, శ్రీ శంకరులు శాంత చిత్తంతోను మాటల గారడీని ప్రదర్శించుకొన్నారు.

19. **మండనమిశ్రుడు:** కలంజాన్ని తినకూడదని శ్రుతివాక్యం. యతివరా! కలంజాన్ని తిని (మృగ మాంసం) ఉచితానుచితాలు పరస్పరవిరుద్ధమైన మాటలు మాట్లాడుచున్నావు. నీకేమైనా మత్తెక్కినదా? (కలంజమంటే మృగమాంసం, గంజాయి, ఉల్లిపాయ మొదలైన అర్థాలు ఉన్నవి. ఇక్కడ శ్రీ శంకరులను మృగ మాంసం తిని గంజాయి పట్టితివా అని నిందిస్తున్నారు.)

**శ్రీ శంకరులు:** ఔను. నువ్వు నిజాన్నే పలికావు. (అదే మాటకు విపరీతార్థాన్ని కల్పిస్తూ) నీలా తండ్రిమల్లే నువ్వూ కలంజ భక్షకుడవై విరుద్ధ ప్రేలాపనలు చేస్తున్నావు. అట్లాగే నీ పుత్రుడు కూడా 'కలంజాశనుడై' విరుద్ధ ప్రేలాపనలు చేస్తాడు. (నీ తండ్రి యజ్ఞాలు చేసి మాంసం భుజించాడు. నువ్వు యజ్ఞం చేసి మాంస భక్షణం చేశావు. అట్లే నీ కుమారుడు కూడా మాంసభక్షణ చేయగలడు)

20. **మండనమిశ్రుడు:** ఓయీ కపట సన్యాసీ! గాడిదలా ఒంటిపై బొంత కప్పుకొని తిరుగుతున్నావు గదా! మరి జందెం, పిలక నీకు బరువయ్యాయా?

21. **శ్రీ శంకరులు:** ధర్మ సూక్ష్మత నెరగనివాడా! మీ తండ్రి కూడా మోయలేని గంతను మోస్తున్నాడు. సర్వభోగాలను విసర్జించిన నా కిది పరమధర్మం. విషయాసక్తుడైన మీ తండ్రి గంతను మోయకుండు గాక, అంతేగాక శిఖ, యజ్ఞోపవీతం శ్రుతియే నిషేధించినది. "పరీక్ష్య లోకాన్కర్మచితాన్....." అందుచేత నేను శిఖ, యజ్ఞోపవీతాలను త్యజించాను. బుద్ధిసూక్ష్మత లేనివాడవు.

22. **మండనమిశ్రుడు:** అహో! నీ బ్రహ్మనిష్ఠనే చెప్పుకోవాలి! అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యను వదలి, నలుగురు శిష్యులను వెంటబెట్టుకొని, వారిచేత పుస్తకాలు మోయిస్తూ, పనీపాటూ చేయక సన్న్యాసి వేషంతో తిరిగే వాడివి, ఇంతకన్నా ఎక్కువ ఏం మాట్లాడగలవు?

23. **శ్రీ శంకరులు:** వేదార్థాలను తెలుసుకోవడానికి గురువు నాశ్ర యించి, గురుకులవాసం చేయలేక విషయ భోగాసక్తుడవై, స్త్రీకి శుశ్రూష చేస్తున్నవాడవు నువ్వు. నీ కర్మనిష్ఠ బట్టబయలైనది. అలాగాక, వైరాగ్య తత్పరులైన శిష్యులు గురుదేవుని ఆశ్రయించి వేదాంత శ్రవణం చేసి మనన, నిధి, ధ్యాసలచే బ్రహ్మసాక్షాత్కారం పొందుతున్నారు. అట్టి వారు బ్రహ్మచర్యం నుండే సన్న్యసిస్తున్నారు. ఇదే తత్త్వం.

24. **మండనమిశ్రుడు:** మూర్ఖుడా! కఠినాత్ముడవు. కృతఘ్నుడవు, నవమాసాలు మోసి, జన్మనిచ్చి, పోషించి, పెద్ద చేసిన స్త్రీనే నిందిస్తున్నావు. ఎంత సాహసం! ఎంత కృతఘ్నత? ఇంతకన్నా నిష్ఠురమైన వాక్యం మరొకటి ఉంటుందా?

25. **శ్రీ శంకరులు:** మూర్ఖాగ్రణీ! నా పలుకులు నీకు బోధపడక నోటికి వచ్చినట్లు ప్రేలుతున్నావు. నేను మాతృ దూషణం చేయలేదు. వైరాగ్యం తెలియని వారిని గూర్చి పలికాను. విషయ వాంఛలకు బానిసలైన వారిని గూర్చి తెలిపాను. బాగా ఆలోచించు. స్త్రీ యోని నుండి పుట్టి, స్త్రీ

స్తన్యం త్రాగుతూ పెరిగి, తిరిగి అదే స్త్రీ కుచాలను పీడిస్తూ, జన్మస్థానాన్నే తిరిగి వాంఛిస్తూ, స్త్రీలయందు పశువులా నువ్వు ఎలా రమిస్తున్నావు? ఇది తెలివిగల వాని లక్షణమా?

26. **మండనమిశ్రుడు:** "వీరహా వా ఏష....." అనే శ్రుతి ప్రమాణాన్ని అనుసరించి, త్రేతాగ్నులను ప్రయత్నపూర్వకంగా వదలినవాడు వీరహత్యను (murder of one's son) పొందుతున్నాడు. అగ్ని పరిరక్షణ చేయాలంటే వేదాధ్యయనం, సహధర్మచారిణిని గ్రహించాలి. అన్ని మార్గాలలోనూ వేదమార్గమే శ్రేష్ఠమైనది. నువ్వు అట్టి వేదమార్గాన్ని నిరాకరించావు. వీరహత్యను చేశావు.

**శ్రీ శంకరులు:** వీరహత్య కన్నా ఎన్నో రెట్లు అధమమైనది ఆత్మహత్య. వేదాంతతత్త్వాన్ని అధ్యయనం చేసి, పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకోలేకపోతే ఆత్మహత్యాపాపం వాటిల్లుతుందని శ్రుతి స్మృతులు తెలుపుతున్నవి. ఆత్మవధ అన్నిటికంటే అత్యధికమైన పాపం కదా!

27. **మండనమిశ్రుడు:** నువ్వు సన్యాసివి కావు. దొంగవు. కనుకనే ద్వారపాలకుల కన్నుగప్పి లోనికి ప్రవేశించావు. ధైర్యం గలవారూ, మహాత్ములైనవారూ సింహద్వారం గుండా ప్రవేశిస్తారేకాని, దొంగలా రహస్యమార్గాన ప్రవేశింపరు గదా!

**శ్రీ శంకరులు:** ఆకాశాన ఎగిరే డేగ తనకు లభించిన ఆహారాన్ని చాటుగా తీసుకొనిపోయి తింటుంది. అట్లే నువ్వు కూడా అతిథులకు ఆహారమీయక తలుపులు మూసుకొని నీ వొక్కడవే తింటున్నావు. అది దోషం కాదా? కర్మానుష్ఠానపరుడైన గృహస్థు అతిథిని సత్కరించే తాను భుజించాలని శాస్త్రాలు వచిస్తున్నాయి.

28. **మండనమిశ్రుడు:** కర్మానుష్ఠానపరులు శ్రాద్ధ సమయాలలో, శిఖ, యజ్ఞోపవీతంలేని, ఆచారభ్రష్టులతో మాట్లాడరు. ఈ శ్రాద్ధకర్మ చేసే సమయంలో నీ వంటి మూర్ఖునితో మాట్లాడవలసి రావడం దురదృష్టం. నా కిలాంటి స్థితి సంభవించినదేమిటి?

**శ్రీ శంకరులు:** ఆహా! నీ పాండిత్యం కూడా బయటపడింది. నువ్వు పండితుడవు గదా! నువ్వు పలికిన మాటలలో 'యతి' లోపించినది. విద్యా హీనులు మాత్రమే యతి భంగంతో వాక్యాలు పలుకుతారు. నువ్వు పలికిన "సంభాష్య అహం" అన్న వాక్య ప్రయోగంచే నువ్వు పండితుడవు కూడా కావని తెలిసిపోయినది.

29. **మండనమిశ్రుడు:** యతి భంగమందు ప్రవర్తించిన నాకు యతిభంగం దోషావహం కాదు. కనుక నా వాక్యంలో దోషం లేదు.

**శ్రీ శంకరులు:** యతీశ్వరులను అవమానించవచ్చా?

**మండనమిశ్రుడు:** యతీశ్వరుని పరాజయానికై ప్రయోగిస్తే అది దోషం కాదు.

**శ్రీ శంకరులు:** (బహు చమత్కృతితో) నీ వాక్యాన పంచమీ సమాసాన్ని ఆశ్రయించావు. అది దోషం కాదా? యథార్థంగా షష్ఠీసమాసాన్నే గదా నువ్వు ఆశ్రయించాలి? అంటే నీకు యతి వలన అపజయమే సంభవించినది.

30. **మండనమిశ్రుడు:** సదాచారులు, నిష్ఠాపరులు వేదాల నాశ్రయిస్తారు. అట్టివారిని దురాచార సంపన్నులు, దుర్మతులతో పోల్చదగునా? దుష్టబుద్ధి గలవారికీ, నిగమసంపన్నులకూ పరస్పర సంబంధముంటుందా? యోగులమని, సన్న్యాసులమని వేషాలు ధరించి రుచికరమైన పదార్థాలను తింటూ ప్రజలను మోసం చేస్తుంటారు. భోగాలనుభవింప కపట వేషాలు, మాటలతో లోకాన తిరుగుతుంటారు.

31. **శ్రీ శంకరులు:** ప్రబల దురాచారా లెక్కడ? స్వర్గమెక్కడ? కలికాల మెక్కడ? అగ్నిహోత్రాదు లెక్కడ? విషయసుఖాలపై ఆశను చంపుకోలేక కర్మిష్ఠులమనే ముసుగు కప్పుకొని విషయాల వెనుక పరుగులు పెడుతున్నారు.

32-33. **మండనమిశ్రుడు:** ఓ మందమతీ! నువ్వు జడుడవై వేదవిరుద్ధమైన మాటలు మాట్లాడుతున్నావు.

**శ్రీ శంకరులు:** మండనా! దేహమందు జడత్వమున్నది కాని చిదాత్మయందు కాదు.

**మండనమిశ్రుడు:** నువ్వు పవిత్రమైన నరజన్మను పొందీ జడత్వాన్నే కోరుకొంటున్నావు.

**శ్రీ శంకరులు:** యతీశ్వరుని పూజించలేనివాడే అభాగ్యుడు, జడుడు కాగలడు.

**మండనమిశ్రుడు:** దూషణవాక్యాలు పలుకుతూ నిన్ను నువ్వు మలిన పరచుకొంటున్నావు.

**శ్రీ శంకరులు:** పాపకర్మల చేతనే మానవులు దూషితులవుతున్నారు.

**మండనమిశ్రుడు:** చోరులచే ఆశ్రయించబడితివా? దస్యుశిఖామణి వయినావా?

**శ్రీ శంకరులు:** అరిషడ్వర్గాలచే పీడింపబడేవాడే దొంగలచే ఆశ్రయింప బడతాడని తెలుసుకో.

**మండనమిశ్రుడు:** నా అనుమతి లేకుండా నా ఇంట్లోకి ఎందుకు ప్రవేశించావు?

**శ్రీ శంకరులు:** అది సరియైన మాట కాదు. స్వయముగా విష్ణువే నీ ఇంటికి వచ్చాడని తెలుసుకో.

ఈ శంకర మండనమిశ్రుల మధ్య ఈ విధంగా సుదీర్ఘ వాదప్రతి వాదాలు నడచాయి. ఇదంతా చిరునవ్వుతో చూస్తున్న శ్రీ వ్యాసజైమిని మహర్షులు మండనమిశ్రునితో ఇలా పలికారు:

“వత్సా! స్వయంగా వచ్చిన అతిథిని, అందునా యతీశ్వరుని ఇలా దుర్భాషలాడ తగదు. ఆతడు ఆత్మతత్త్వాన్ని ఎరిగినవాడు. భార్యాపిల్లలను, సంపదలను త్యాగం చేసి సంపూర్ణ వైరాగ్యం పొంది సన్న్యసించినవాడు. కనుక పవిత్రాత్ములు, పండితులు యీ విధమైన పరుష, దూషణ వాక్యాలతో ఒకరినొకరు నొప్పించుకోరాదు. అది శాస్త్ర విరుద్ధం. ఇంటికి వచ్చిన అతిథిని గృహస్థు అయినవాడు తప్పక పూజించాలి. కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతుణ్ణి గూర్చి పలికిన వాక్యాలే ఇందుకు ప్రమాణం.”

34. "పవిత్రాత్మా! మండనమిశ్రా! స్వయంగా విష్ణువే నీ గృహానికి యతి రూపంలో వచ్చాడని భావించు. ఆ యతీశ్వరుని చక్కగా సత్కరించి పూజించు" అని వ్యాసమహర్షి మండనమిశ్రుని ఆజ్ఞాపించాడు.

35. శ్రీ వ్యాస మహర్షి ఆదేశానుసారం మండనమిశ్రుడు పరమ శాంతిని పొంది, శ్రీ శంకరులకు అర్ఘ్యపాద్యాదుల నొసగి భిక్ష స్వీకరించవలసి నదిగా ప్రార్థించాడు.

36. శ్రీ శంకరులు మండనమిశ్రునితో ఇలా పలికారు: శుభదర్శనా! పండితవరేణ్యా! నేను వచ్చిన కార్యం తెలుపుతాను, విను. నేను నీ ఇంట విందు భోజనానికై రాలేదు. తమతో వాద భిక్షను కోరివచ్చాను. వాదప్రతి వాదాలంటే గెలుపు ఓటమి ఉంటాయి గదా! ఈ వివాదమందు ఓడినవారు గెలిచిన వారికి శిష్యులై మెలగాలి. పణ వివర్జిత మైన వివాదం శోభించదు గదా!

37. **శ్రీ శంకరులు:** సన్న్యాసి సాధారణంగా వాదప్రతివాదాలకు దూరంగా ఉండాలి. అంతే కాకుండా ఏదో ఒక పక్షాన్ని అసలే సమర్థించ రాదు. అయితే అంతరించిపోతున్న వేదవిద్యను ఉద్ధరించడానికి యతీశ్వరులు వాదం జరుపవచ్చు. జ్ఞానకాండ ప్రతిపాదన ద్వారా, వేదాంత మార్గాన్ని సుగమంగా చేయడమే నా ముఖ్యోద్దేశం అలాంటి వేదాంత సారం సంసార తాపాల నుండి రక్షించే దివ్యామృతం లాంటిది. చల్లని కిరణాలను ప్రసరింప జేసే చంద్రుడు లోకానికి శాంతిని ప్రసాదించేట్లు, ఉపనిషత్తు శ్రవణం సర్వత్రా వ్యాపించి ఆనందామృతాన్ని పంచుతూ సర్వజనులకు బ్రహ్మపదాన్ని ప్రసాదిస్తున్నది. అటువంటి ఉపనిషత్తులు వేద విరోధుల కువిమర్శలకు లోనై క్షీణించిపోతున్నవి. మహావిజ్ఞానివి, శాస్త్రాలన్నీ చక్కగా అధ్యయనం చేసినవాడవైన నువ్వు కర్మమార్గివై ఉండటంచేత జ్ఞానమార్గాన్ని నిరాకరించావు.

38. శాశ్వతమూ, సర్వదుఃఖతాప విశేషహరమూ అయిన బ్రహ్మవిద్యను, నీ వంటి ప్రజ్ఞావంతులు నిరాకరించటంచేత శ్రుతి ధేనువు దుఃఖిస్తున్నది. వేదాంత మార్గాన్ని వ్యతిరేకించే వారినందరినీ జయించి లోకంలో వేదాంత సరళిని విస్తరింపజేయదలచాను. బ్రహ్మవిద్యా మార్గం రాజమార్గమై

ముముక్షువులు నిర్భయంగా సంచరించేట్లు చేయదలచాను. వేదాంత మార్గాన్ని నిరసించే వారందరినీ నాశనం చేసి బ్రహ్మవిద్యను ప్రతిపాదిస్తాను. నీవు కూడా అలాటి శాశ్వతానందాన్ని కూర్చే బ్రహ్మవిద్యను స్వీకరించు. అలా కాదంటే నాతో వాదించు. నా సిద్ధాంతాలను పరిశీలించు. నీకు అలాటి జ్ఞానం లేని యెడల ఓటమిని అంగీకరించు. 'నేను పరాజయ మొందితి'నని ఒక్క వాక్యం స్పష్టంగా తెలుపు.

39. మండనమిశ్రుడు ఇలా తలచాడు. 'ఈ యతీశ్వరుడు, బ్రహ్మ విద్యా రూపమైన ఉపనిషదర్థాల వివరణకై నన్ను వాదానికి ఆహ్వానిస్తున్నాడు. ఇంతవరకు పరాజయమన్నదే ఎరుగని నాతో ఓటమిని గూర్చి పలుకటం ఆశ్చర్యంగా ఉంది. లోకంలో పాండిత్య ప్రకర్షలందు ఎదురులేనివాడినై సంచరిస్తున్నాను. ఈ పరిణామానికి ఖిన్నుడను కారాదు. ధీరుడనై ఎదిరిస్తాను గాక! సర్వ విద్యలయందూ బృహస్పతితో సాటిగల పాండిత్యం గలవాణ్ణి. శంకించవలసిన పనిలేదు. ఈ సవాలును అంగీకరిస్తాను గాక!'

40. మండనమిశ్రుడు ఇలా పలికాడు: యతివర్యా! మండనమిశ్రుని జయించడానికి వేయి తలలు గల ఆ ఆదిశేషునికే సాధ్యం కాదు. అంతేగాక సర్వవేద సమ్మతమైన నా మతాన్ని వదలి ఇతర మతాల నాశ్రయించే మందమతిని కాను. అట్టి కార్యాన్ని ఈ మండనమిశ్రుడు ఎన్నటికీ చేయడని తెలుసుకో.

41. శంకరమునివరేణ్యా! సర్వ విశారదుడైన పండితునితో వాదించాలనే కోరిక చాలాకాలం నుండి నాలో బలీయంగా నాటుకొని ఉంది. కాని, ఇంత వరకు అట్టి పండితుడు నా ఎదుట నిలువలేదు. యుద్ధవీరులకు కండ బలంలా పాండిత్య ప్రదర్శన చేయాలన్న ఉబలాటం నన్ను తొందరపెట్టు తున్నది. ఇంత కాలానికి విద్యాపరీక్షలో దిగ్విజయం పొందే భాగ్యం కలిగినది. నా భాగ్యమే భాగ్యం. ఈనాటి వరకు కుపండితు లెందరో వాదోపవాద యుద్ధానికి సన్నద్ధులై రాసాగారు. నేను నా వాదనాపటిమ అనే వజ్రాయుధం చేత వారి వాదరూపమైన 'నాలుకయందలి దురదను' వదలగొట్టి పంపు

తున్నాను. శూరులకు శౌర్యంలా పండితులకు పాండిత్యమే అలంకారం కదా! వారికదే శాశ్వత భూషణం.

42. యతీశ్వరా! పండితులతో వాదించటం చేతనే చదివిన విద్యలను ప్రదర్శించుకొనే అవకాశం కలుగుతుంది. అపూర్వమైన శాస్త్రవాదాల చేత, సముద్రాన్ని మథించి అమృతాన్ని పొందినట్లు, అమృతాన్ని సృష్టింపవచ్చు. అమృతపానం దేవతలకు మాత్రమే సిద్ధిస్తుంది. మరి భూలోకంలో శాస్త్రమథనం చేతనే అమృతాన్ని సృష్టించి పానం చేయాలి. విద్యావాదన నా చిరకాల వాంఛ. అది నేటికి మీ వలన నెరవేరనున్నది గదా!

43. యతిశ్రేష్ఠా! వాదంలో, యమధర్మరాజును కూడా హరించే ఈశ్వరునే జయింపగల సమర్థుడను. నాతో వాదనకు సిద్ధపడడానికి ముందుగా నా సామర్థ్యాన్ని తెలుసుకోండి. మీమాంసకులు నిరీశ్వరవాదులై కర్మ ప్రధానులుగా ఉంటారు. ఈశ్వరుడు లేడనే అంటారు. అందుచేత వారు జగన్నియంత అయిన ఈశ్వరునే శమింపజేసేవారుగా ఉన్నారు. నేను వేదాలనే స్వతఃప్రమాణంగా స్వీకరించేవాడను. అటువంటి నాతో వాదానికి సిద్ధపడ్డారా? సంతోషం. మీ వాదామృతాన్ని ప్రారంభించండి.

44. పరమహంస సత్తమా! మీ ధైర్యానికి ఎంతో ఆశ్చర్యం కలుగు తున్నది. లోకంలో స్వమతాభిమానులైన పండితు లెందరో సునిశితమూ కఠినమూ, పరశుధారలా అనర్గళంగా పారే నా పాండిత్య ప్రవాహం ముందు నిలువ జాలకపోయారు. నా పాండిత్య ప్రకర్ష గూర్చి మీరు విని ఉండరు. అందువలననే సాహసానికి ఒడిగట్టినారు. అయినా నా కిది సంతోషింపదగిన వార్తే. ఎందుకంటే, ఇంత కాలానికి నాతో వాదనకు సిద్ధపడి నా ప్రక్కన నిలబడగల పండితుణ్ణి చూస్తున్నాను.

45. మునివర్యా! తమరు నా నుండి వాద దానాన్ని కోరినారు. ఇది నా బోటి పండితులకు అత్యల్పమైన విషయం. కోరినారు కనుక ఇప్పుడే వాదం చేయగల సమర్థుడను. ఇంత కాలానికి నా కది స్వయంగా లభించితే మహదానందంగా ఉంది.

46. తేజోనిధీ! వాద విషయమైన మీ సవాలును అంగీకరిస్తున్నాను. అందులో కించిత్తు కూడా సందేహం లేదు. వాదభిక్షువులై తాము రావడమూ, దానిని నేనంగీకరించటమూ సబబుగానే ఉన్నది. అయితే ఒకే ఒక్క విషయాన్ని తీవ్రంగా ఆలోచిస్తున్నాను. మన మిద్దరమూ చర్చిస్తే సకల విషయాలను నిర్ణయించే మధ్యవర్తి (న్యాయనిర్ణేత) అవసరం. అటువంటి విద్యాసంపన్నుడు ఎక్కడ దొరకుతాడా అని ఆలోచిస్తున్నాను. వాదాన్ని గ్రహించి న్యాయనిర్ణయం చేయగల సమర్థుడు లేని యెడల, మనకు కంఠశోషే మిగులుతుంది. మనం తీవ్రమైన వాదోపవాదాలు చేసుకొంటాము. అందు యెవరు జయించారు, ఎవరు ఓడిపోయారో అన్న విషయం స్పష్టం కావాలి గదా? న్యాయనిర్ణేత లేని వాదోపవాదాలన్నీ వ్యర్థమే. కనుక న్యాయనిర్ణేత అత్యవసరం.

47. పండిత ప్రవరేణ్యా! వాదమంటే అందు వాది, ప్రతివాది ఉంటారుగదా! అందు వాది వచనాలను స్వపక్షమంటారు. ప్రతివాది వచనాలను విపక్షమంటారు. వాది విపక్ష వాదాలను గ్రహించి ఖండిస్తుంటాడు. ప్రతివాది వాది ఖండనాలను నిరాకరిస్తుంటాడు. ఆ విధంగా మనం ప్రతిపాదించే వాద విహితాలకు ఏదైనా ప్రమాణమేమిటి? అందులో ప్రతిజ్ఞయేమిటి? కనుక, వాదప్రతివాదాలకు మన మిద్దరం ఉన్నాం. మరి మధ్యవర్తీ, ప్రతిజ్ఞా అవసరం కదా? మీరే మంటారు? ఈ విషయాన్ని వాదం ప్రారంభింపక పూర్వమే నిర్ణయించుకోవాలి.

48. యతిశ్రేష్ఠా! మన వాదప్రతివాదాలను గ్రహించి న్యాయనిర్ణయం చేసే మధ్యస్థుని నిర్ణయించి చెప్పండి. అదేవిధంగా జయాపజయాలకు ఫలమైన బహుమతిని నిర్ణయించండి. అంతేగాక మన ఇరువురి ఆశ్రమాలు భిన్నములై ఉన్నవి. అందలి శ్రేష్ఠత గూర్చీ, తక్కువతనం గూర్చీ చక్కగా తెలిసినవారై ఉండాలి. నేను గృహస్థాశ్రమం ఆచరించేవాడను. తమరు తత్త్వప్రచార మొనరించే పరమహంసలు. కనుక వాదప్రతివాదాలందలి బహుమతిని గూర్చి ముందుగా నిర్ణయించుకోవాలి. ఆ విషయం నిర్ణయమైతే మనమిరువురం మహోన్నత భావాలతో, మహదానందంగా వాదించుకొందాము. ఇదే విద్వాంసుల పరిశ్రమకు తగిన ఫలమవుతుంది.

49. ఆచార్యవర్యా! సర్వలోక పూజ్యులైన తమరు నాతో వాదంచేయ కోరుతున్నారు. మహాత్ములతోడి సద్గోష్ఠి బహుజన్మల పుణ్యఫలం. నేను ధన్యాత్ముడను. నా భాగ్యమే భాగ్యం. రేపే మన వాదాన్ని ప్రారంభిద్దాం. మధ్యాహ్నిక కార్యాలను నిర్వర్తించుకొందాం.

50. మండనమిశ్రుని పలుకులు విని, వాదానికి రేపే రంగం సిద్ధమవుతుంది గదా అని శ్రీ శంకరులు ఎంతో సంతోషించారు. అప్పుడు మండనమిశ్రుడు అక్కడే ఉన్న వ్యాస జైమిని మునులను (మధ్యస్థులుగా) న్యాయ నిర్ణేతలుగా ఉండవలసిందిగా అభ్యర్థించాడు.

51. మహర్షులు ఇలా పలికారు: పండిత ప్రవరా! మీ వివాదానికి న్యాయనిర్ణేత లేదని విచారించవద్దు. నీ ధర్మపత్నియైన ఉభయభారతీదేవి జయాపజయాలను ఎంతో నిష్పక్షపాతంగా నిర్ణయించగలదు. ఆమె సాక్షాత్తూ సరస్వతీదేవి అవతారమే కనుక ఆమెను మధ్యస్థురాలుగా చేసుకొని మీ వాదాన్ని కొనసాగించండి.

52. ఆ విధంగా మహర్షుల ఆదేశానుసారం ఉభయభారతీదేవిని మధ్యస్థురాలుగా నియోగించడానికి అందరూ అంగీకరించారు. తరువాత యీ విశ్వరూపుడు ఆ ముగ్గురు మహాత్ములను త్రేతాగ్నులుగా విశ్వసించి పవిత్ర భావంతో పూజించాడు. శ్రీ శంకరులకు ఆతిథ్యమివ్వడం చేత తన పితృదేవతలు సంతృప్తి చెందగలరని శ్రీ మండనమిశ్ర పండితుడు తలచాడు.

53. ఆ ముగ్గురు మహనీయులను అర్ఘ్యపాద్యాదుల చేత పూజించి వారికి ఆహారం సమర్పించాడు. మండనమిశ్ర పండితుని శిష్యులు ఆ ముగ్గురు అతిథులకు సపర్యలు చేసి వారికి శ్రమ లేకుండజేశారు.

54. శ్రాద్ధ కర్మలన్నీ ముగించుకొన్న తరువాత ముమ్వురు మహనీయులూ వేదవేదాంగం గూర్చి ముందు మధురంగా కొంతసేపు చర్చించుకొన్నారు. వేదవ్యాసుల వారు వేదాలను విభజించి, బ్రహ్మసూత్రాలను వ్రాసిన మహనీయులు. జైమిని మహర్షి శ్రీవ్యాసుల వారికి ప్రధాన శిష్యుడై ఉన్నాడు. శ్రీ శంకరులు బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాసి జగత్ప్రసిద్ధి పొందినవారు.

55. ఆ విధంగా ఆ ముగ్వురు మహనీయులు చర్చించుకొనిన తరువాత శ్రీ వ్యాస, జైమిని మహర్షులు అంతర్ధానమయ్యారు. శ్రీ శంకరులు మాత్రం రేవానదీతీరాన దేవాలయంలో శిష్యులతో కలసి బసచేశారు.

56. ఆ రాత్రంతా శ్రీ శంకరులు తమ శిష్యులతో రేవానదీతీరాన దేవాలయంలో గడిపారు. నాడు శ్రీ వ్యాస జైమినీ మహర్షుల దర్శన భాగ్యం కలుగడమూ, వారితో కూడా జరిగిన మధుర సంభాషణలు, పూర్వజన్మల సుకృతం చేతనే జరిగాయని తలచారు. ఆ సంభాషణలన్నీ మననం చేసు కొంటూ శిష్యులకు కూడా తెలుపుతూ ఆ రాత్రి గడిపారు.

57. శ్రీ శంకరులు తమ శిష్యులతో కలసి రేవానదిలో స్నాన మాచ రించి, అనుష్ఠానాలు ముగించుకొని మండనమిశ్రుని గృహానికి వచ్చారు. జ్ఞానభాస్కరుని మల్లే ప్రకాశిస్తూ, శ్రీ శంకరులు పండిత సభలో ఆసీనులైనారు.

58. మండనమిశ్ర పండితుడూ, శారదాదేవిగా ప్రఖ్యాతి గాంచిన ఉభయభారతీదేవి కూడా సభా స్థలాన్ని చేరుకొని ఆసీనులైనారు. సకల విద్యాపారంగతురాలైన ఉభయభారతీదేవిని మధ్యస్థురాలినిగాజేసి ఉభయులూ విజయోత్సాహభరితులయ్యారు.

59. పరమ పతివ్రతయైన ఆ ఉభయభారతీదేవి సభానాయకత్వం వహించి ఆసీనురాలయింది. ఆ మహాపరిషత్తులో శ్రీ శంకర మండనమిశ్రుల, సర్వశాస్త్ర తరతమ భావాలను, వాదాలందలి నిపుణత్వాన్ని సత్యాసత్య నిర్ణ యాన్ని, జయాపజయాలను నిర్ణయించే అధికారియై సాక్షాత్తూ సరస్వతీదేవి మల్లే ప్రకాశించింది. స్త్రీయే కదా అని శ్రీ శంకరులు గాని, తన భార్యేకదా అని మండనమిశ్రులు గాని తలచలేదు. సాక్షాత్తూ న్యాయదేవతగానే తలచి వాదనలకు సిద్ధపడ్డారు.

60. శ్రీ మండనమిశ్ర పండితుడు వాదనకై మహోత్సాహపూరితు లైనారు. పరావరజ్ఞాన సంభరితులూ, జ్ఞాన కుశలురూ అయిన శ్రీ శంకరులు పరావరపరమైన తన ప్రతిజ్ఞను ప్రకటించారు. పరమంటే కారణం. అపరమంటే కార్యం. కార్యకారణ జ్ఞానభూషితులు.

పరావరాలంటే భూత భవిష్యత్తులు తెలిసిన త్రికాలజ్ఞులు.

పరావరాలంటే శ్రేష్ఠులైన బ్రహ్మాది దేవతలు కూడ దేనికంటే (అవరులో) కనిష్ఠులో, అట్టి సర్వశ్రేష్ఠమైన బ్రహ్మస్వరూపం స్పష్టంగా ప్రతిపాదించగల వారు, అట్టి బ్రహ్మస్వరూపం తనకంటే భిన్నం కాదని తెలుసుకొనిన వారు.

పరావరులంటే జీవేశ్వరులు. వాటి అభేద తత్త్వాన్ని తెలిసిన మహాను భావులు.

సర్వ ఉపనిషత్తుల సారం, అద్వైత సిద్ధాంతమైన జీవేశ్వర ఐక్యతను ప్రతిపాదించే స్వకీయ ప్రజ్ఞను ప్రతిపాదించారు. ఆ కాలమందు అద్వైత రూపమైన బ్రహ్మవిద్య జ్ఞానకాండ, కర్మకాండ ప్రతిపాదనచే శిథిలమై పోతున్నది. అట్టి అద్వైత విద్యను ఉద్ధరించడానికై శ్రీ శంకరులు ప్రతిజ్ఞ గావించారు.

61. వేదాంత పరతత్త్వమైన జీవబ్రహ్మైక్య సిద్ధాంతంలో పండితు లందరూ వారి వారి ప్రజ్ఞ ననుసరించి వివాదం చేస్తున్నారు. వారి బుద్ధి సూక్ష్మత ననుసరించి ప్రతిపాదనలు చేస్తున్నారు. శ్రీ శంకరులు సర్వమతాలకు అతీతంగాను, సంశయాలులేని విధంగాను వస్తుతత్త్వాన్ని దృఢంగా ప్రతిపా దిస్తున్నారు. నిర్గుణ పరబ్రహ్మమొక్కటే సచ్చిదానందమనీ, పరమార్థమనీ, శాశ్వతమనీ, పరిపూర్ణమూ, సర్వాతీతమూ, సర్వ దృశ్యరహితమూ, అద్వయమనీ దృఢంగా ప్రతిపాదించారు. ఇదే స్వయంప్రబోధం, అఖండం, అనంతం, అవ్యయం. ఈ సత్యాన్ని తెలియని అవివేకులు ముత్యపుచిప్పను చూసి వెండి అనే భ్రమ చెందేట్లు, ఈ దృశ్యప్రపంచమే పరబ్రహ్మమని తలచుచున్నారు. వివేకం లేని మూఢులు ఆత్మను మరచి, (తనను మరచి ప్రలాపించే ఉన్మాదిలా) దృశ్యవస్తువులనే స్మరిస్తూ, వాటియందే తన్మయు లవుతున్నారు. అంటే సచ్చిదానంద పరబ్రహ్మాన్ని ఈ దుఃఖాత్మకమూ, జడమూ అయిన ప్రపంచమని ప్రవచిస్తున్నారు. ఇది వారి బుద్ధి దోషం చేత పలికే మాటలు. నిజతత్త్వమైన అధిష్ఠాన వస్తువు శక్తిలా ఒకే రీతిగా ఉన్నది.

ముత్యపు చిప్పయన్న జ్ఞానం కలిగిన తరువాత వెండియన్న భ్రాంతి తొలగిపోతున్నది. అట్లే సర్వాధిష్ఠాన పరబ్రహ్మ స్వరూపాన్ని గూర్చిన జ్ఞానం కలుగగానే దృశ్య వస్తువులన్నీ నశిస్తున్నవి. జీవ బ్రహ్మల యందు భేదభావం పూర్తిగా తొలగిపోయి, దుఃఖాలతో కూడిన అజ్ఞానం నశించి పరావరజ్ఞాన సంపత్తి చేత బ్రహ్మానందం కలుగుతున్నది. ఇదే జనన మరణాలు లేని ముక్తి పదం. దీనిని వేదాంతతత్త్వజ్ఞులు అంగీకరిస్తున్నారు, నిజ సుఖాన్ని పొందుతున్నారు. ఇందుకు ఉపనిషత్తులందలి ప్రమాణ వాక్యాలు యీ విధంగా పలుకుతున్నవి.

శ్లో. 'ఏకమేవా ........ న చ పునరావర్తతే' ఈ విధంగా శ్రీ శంకరులు జీవబ్రహ్మలు భేదంలేని కేవల బ్రహ్మైకతను ప్రతిజ్ఞ (తప్పక సిద్ధిస్తుందని దృఢంగా పలికారు) చేశారు.

62. శ్రీ శంకరులు ఇలా ప్రతిజ్ఞ చేశారు: మండనమిశ్రా! పండితవరా! అసత్యాలైన పూర్వపక్షాన్ని ఖండించి సత్యమైన బ్రహ్మతత్త్వాన్ని సుస్థిరంగా సిద్ధాంతీకరిస్తాను. ఇది నిశ్చయం. ఇది సత్యం. ఇది నా ప్రతిజ్ఞ. అలా కాక నేను అపజయం పొందితే, పరమ పవిత్రమైన ఈ పరమహంసాశ్రమాన్ని (సన్న్యాసాశ్రమాన్ని) త్యజించబోతున్నాను. పరమ పవిత్రాలైన కాషాయాలను, దండ కమండువులను విసర్జిస్తాను. వాటిని అపవిత్రాలని తలుస్తాను. తెల్లటి వస్త్రాలను ధరించి, గృహస్థుడనై, గృహస్థ ధర్మాల నాచరిస్తూ, తమకు శిష్యునిగా మెలగుతాను. మీచే ప్రవచింపబడే వేద కర్మకాండాలను ప్రతిపాదిస్తాను. సర్వజ్ఞురాలు వేదవేదాంతాలను తెలిసిన ఈ ఉభయభారతీదేవి మన వాదంలోని జయాపజయాల నిర్ణేతగా వ్యవహరించుగాక! ఇదే నా ప్రతిజ్ఞ.

63. శ్రీ శంకరులు ప్రతిపాదించే వేదాంత సిద్ధాంతం నివృత్తి మార్గమైనది. జనన మరణాలు లేనిది. అంటే పునరావృత్తాలు లేనిది. శాశ్వతమై సౌఖ్యాలను ప్రసాదించేది.

మండనమిశ్రునిది ప్రవృత్తి మార్గం, పునరావృత్తి గలది. శాశ్వత సౌఖ్యాలు లేనిది. కర్మమార్గాన్ని పూర్వమనీ, జ్ఞానమార్గాన్ని – పరమనీ గ్రహించాలి. కర్మకాండ వలన నిశ్చల మనస్సు ఏర్పడుతుంది. జ్ఞానకాండ

వలన పరతత్త్వవిజ్ఞానం ప్రవర్తిస్తుంది. ఈ విధంగా శ్రీ శంకర మండన మిశ్రులు వేదబద్ధమైన నివృత్తి, ప్రవృత్తి సిద్ధాంత బోధకులు. వేదాలందలి అంతాన్ని బోధించేది వేదాంతం కాగా, వేదాలందలి దృశ్యభాగాన్ని ప్రతిపాదించేది ప్రవృత్తి మార్గం. వేదాంతాలు దృశ్యాతీతాలను బోధిస్తాయి.

64. మండనమిశ్రులు ఇలా పలికారు: వేదాంతాలు శబ్దరూపాలు, కనుక పరబ్రహ్మాన్ని గూర్చి బోధింపజాలవు. ప్రత్యక్ష, అనుమాన, ఉపమానం, శబ్ద, అర్థాపత్తి, అనుపలబ్ధి అనే ఆరు ప్రమాణాలలో శబ్దప్రమాణం సర్వోత్తమైనది. కానీ శబ్దానికి అతీతమైన వస్తువులందు శబ్దాన్ని ప్రమాణంగా తీసుకోలేము. కనుక శబ్ద ప్రమాణమైన ఉపనిషత్తులు పరబ్రహ్మాన్ని ఉపదేశింపలేవు. ఆ విధంగా వేదపూర్వభాగమే పరవస్తువును తెలుసుకోవడంలో పరమ ప్రమాణమై ఉన్నది; వేదాంతం కాదు.

శబ్దానికి కార్యరూపమైన శక్తి ఉంది. (ఉ.దా. ఆ కుండను తీసుకొని రా!) అందువలన పరిశుద్ధమైన కర్మలను ఆచరించటం వలన ముక్తి లభిస్తున్నది. ఆయుర్దాయం ఉన్నంతవరకు సత్కర్మలు చేస్తూనే ఉండాలి. ఆయుస్సు తీరిన తరువాత కర్మఫలం చేత మోక్షం ప్రాప్తిస్తుంది. అందువలన వేదాల వలననే ముక్తి లభిస్తుంది. వేదాంతం వలన ముక్తి లభించదు. కాబట్టి ముక్తిమార్గాన వేదమే పరమ ప్రమాణం; వేదాంతాలు కావు.

(**వివరణ:** మండనమిశ్ర పండితుడు మొదలైనవారు పూర్వమీమాంసా ప్రవర్తకులు. వారు అగ్నిహోత్రాది కర్మలను దైవంగా భావిస్తారు. ప్రమాణాలన్నింటిలోనూ 'శబ్ద' ప్రమాణం ఉత్తమమైనది. ఆ శబ్దం లౌకికాలు, అలౌకికాలు అని రెండు విధాలు. శాస్త్రాలన్నీ లౌకికాలే. వేదం మాత్రం అలౌకికం. వేదాలు ప్రళయ కాలంలో కూడా నశింపవు. వేదాలందు పరా, అపర అనే రెండు రూపాలు ఉన్నవి. పరావిద్య అంటే వేదాంతం. అపరవిద్య అంటే వేదాలు. పూర్వమీమాంసా పండితులు, మహర్షులు వేదపూర్వకమైన కర్మల చేతనే ముక్తి లభిస్తుందని తెలుపుతున్నారు. వేదంలోని వేదాంతం కార్యాలన్నిటికీ అతీతమూ, బుద్ధికి గోచరించేదీయైన పరబ్రహ్మాన్ని స్పష్టంగా

తెలుపుతున్నది. కనుకనే వేదాంతాలు పరతత్త్వ బోధలో పరమ ప్రమాణాలై ఉన్నవి.)

65. శ్రీ మండనమిశ్రులు ఇలా ప్రతిజ్ఞ చేశారు: యతివర్యా! నేను ఇంతవరకు వేదాలే స్వతఃప్రమాణాలనీ, కర్మయే ముఖ్యమైన అనుష్ఠానమనీ విశ్వసించాను. వాదంలో జయం లభించని యెడల, తాము చేసిన ప్రతిజ్ఞకంటే భీకరమైన ప్రతిజ్ఞ చేస్తున్నాను. వినండి. నా వాదన జయించకుంటే వేదాలు పరమప్రమాణం కాకుండా పోగలవు. నా విశ్వాసమంతా సారం లేనిదవుతుంది. వేదాంతంలో విశ్వాసం అధికం కాగలదు. వేదాంతమే పరబ్రహ్మాన్ని బోధిస్తుందని నమ్ముతాను. అప్పుడు నేను మీకు శిష్యుడనవుతాను. నా శిఖ, యజ్ఞోపవీతాన్ని విసర్జించి పరమహంసాశ్రమం స్వీకరిస్తాను. వేదాంతాన్ని లోకంలో ప్రవచిస్తాను. నా వాదానికి కూడా అపర సరస్వతీదేవియైన ఉభయ భారతీదేవియే న్యాయనిర్ణేతగా ఉండడానికి అంగీకరిస్తున్నాను.

66. శ్రీ శంకర మండనమిశ్రు లిరువురూ తమ తమ ప్రతిజ్ఞలను పలికి వాదానికి సిద్ధమయ్యారు. వాదంలో ఓడినవారు, జయించిన వారి ఆశ్రమాన్ని స్వీకరించి శుశ్రూష చేయాలి. జగన్మాతయైన శ్రీ సరస్వతీదేవిని నిష్పక్షపాత న్యాయనిర్ణేతగా ఉభయులూ అంగీకరించారు.

67. శ్రీ ఉభయభారతీదేవి తన నిత్యానుష్ఠానాలను నిర్వర్తించుకొని, యతీశ్వర గృహస్థులను పూలమాలాలంకృతులను గావించి తన న్యాయపీఠంలో కూర్చుని ఇరువురి వాదనలను శ్రద్ధతో ఆలకించసాగింది.

68. శ్రీ మదుభయభారతీదేవి తన పాతివ్రత్య మహిమను చాటుతూ, రెండు పూలదండలను వారి కంఠసీమన అలంకరించింది. “ఎప్పుడు ఎవరి మెడలోని పూలమాల వాడిపోతుందో, వారు వాదంలో ఓడిపోయినట్లుగా నా తీర్పు” అని పలికింది. మండనమిశ్ర శంకరులు సాక్షాత్తూ బ్రహ్మమహేశ్వరులు. వారిని పరీక్షించటం ఎవరి తరం? శ్రీ మదుభయభారతీదేవి నిరుపమ పాండిత్య సామర్థ్యాలకు తోడుగా ఆమె పాతివ్రత్య బలిమి కూడా తోడైనది. తరువాత ఆ ఉభయభారతీదేవి తన భర్తకు భోజనాది సదుపాయాలను, యతీశ్వరులకు భిక్షా ఏర్పాటు చేయడానికి గృహంలోనికి వెళ్లింది.

69. శ్రీ శంకర మండనమిశ్రుల వాదనలలో ఒకరిని మించి మరొకరు తమ వాదనాప్రతిమను చాటసాగారు. బ్రహ్మాది దేవతలు ఆకాశం నుండి కుతూహలంతో, పరమానందంతో వాదనను తిలకించసాగారు. ఆ వాద మందలి జయాపజయాలు నిర్ణయింప ఎవరికీ సాధ్యం కాకున్నది.

70. శ్రీ శంకర మండనమిశ్రులు తమ తమ సిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ, సకల వేదాలను ప్రమాణాలుగా చూపుతూ, అత్యధిక సామర్థ్యంతో వాదించసాగారు. వాదనలన్నీ సహేతుకంగాను, మిగుల మనోజ్ఞంగాను, వినేవారల చెవులకు విందు కలిగిస్తూ, అత్యధిక ధీపటిమతో సాగినవి. కర్మసిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ శ్రీ మండనమిశ్రులు వేదప్రమాణ వాక్యాలతో వాటిని స్థాపించసాగారు. శ్రీ శంకర భగవానులు వేదాంతాలను ప్రమాణంగా తీసుకొని వేదాలకు అతీతమైన బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించారు. ఈ విధంగా వేదవేదాంగ, వేదాంతాది సర్వశాస్త్రాలను పూర్తిగా విచారణ చేస్తూ పూర్వ పక్షాన్ని స్వీకరించారు. ఇరువురూ క్లిష్టమైన విషయాల నెల్ల విశదపరచుకొంటూ ఒకరిని మించి మరొకరు వాదనలు సాగించారు. ఈ సభయందు పాల్గొనిన పండితు లందరూ ఆనందాతిశయంచే హర్షం ప్రకటించసాగారు.

71. ఆ మహాత్ములిరువురూ వాదప్రతివాదాలందు ఔచిత్యాన్ని చక్కగా పాటిస్తూన్నారు. ఇరువురూ సాధుస్వభావులై, రాగద్వేషాలులేక తమ వాదాలను ప్రతిపాదిస్తూన్నారు. అనేకమంది ఉద్దండ పండితులు ఆ పండిత సభకు వచ్చి వారి విద్యా వివాదాన్ని, చమత్కృత విశేషాలను తిలకిస్తూ మహదానంద పడసాగారు. ఈనాటి సభ యే తీరున ఉంటుందోనని ఉత్సుకత ప్రదర్శించ సాగారు. అందుచేత పండితులలో సమ్మర్ద మేర్పడి ముందు వరుసలో కూర్చోవడానికి పోటీపడసాగారు. ఇక వాద ప్రతివాదాలు యథేచ్ఛగా కొన సాగుతూన్నవి. ఇరువురూ జయానికై సర్వశక్తియుక్తులను చాటుచున్నారు. వారిలో ఎవరికి జయమో నిశ్చయం కాకున్నది. వాదప్రతివాదాలెంత తీవ్రతర మైనా, వాదనియమాలను అతిక్రమించక, ప్రసన్న భావంతో ఉండటం చేత శ్రోతలు కూడా పరమానందభరితులయ్యారు.

72. శ్రీమదుభయభారతీదేవి తన గృహ కృత్యాలను నిర్వర్తించుకొంటూ, వాదప్రతివాదాలందు పాల్గొసాగింది. మధ్యాహ్న సమయమందు మాత్రం వారిరువురకూ భోజన విరామ సమయాన్ని తెలియబరచేది. తాను ఎంత సమర్థురాలైనా భర్తకు యుక్తులుగాని, ప్రమాణాలను గాని తెలియబరచేది కాదు. అట్లే శ్రీ శంకరుల పట్ల మత్సరాన్ని ప్రదర్శింపక సమభావం ప్రదర్శించింది. అటువంటి ధీమంతురాలవడం చేతనే శ్రీ వ్యాసజైమినీ మహర్షులు ఆమెను న్యాయనిర్ణేతగా ఉండడానికి యోగ్యురాలని నిర్ణయించారు.

73. యతిశ్రేష్ఠుడైన శ్రీ శంకరులు, గృహస్థ ప్రవరుడైన శ్రీ మండన మిశ్రులు చిరునవ్వులు చిందించుకొంటూ, వారి వాదనలను శ్రేష్ఠంగా సమర్థించుకొంటూ ప్రతివాదుల సిద్ధాంతాలను ఖండిస్తూ తమ సిద్ధాంతాలను ప్రతిపాదించసాగారు.

74. రోజులు గడచిన కొద్దీ శ్రీ మండనమిశ్రుని వాదనలు బలహీన పడసాగాయి. శ్రీ శంకరులు తమ ఆధిక్యతను ప్రతిష్ఠాపించసాగారు. మండన మిశ్రుడు కొన్ని సందర్భాలలో తన వాదాన్ని ప్రతిపాదించలేక నిరుత్తరుడు కాసాగాడు. ప్రతిభావంతులైన శ్రీ శంకరుల ముందు తలవంచుకోవలసి వచ్చింది. చివరకు మహేశ్వరావతారుడైన శంకర భగవానుడే జయించాడు. సత్యం స్థిరంగా స్థాపించబడినది.

*వివరణ:* శ్రీ శంకర మండనమిశ్రుల వాదప్రతివాదాల లోనికి ప్రవేశించడానికి ముందుగా వేదాల గూర్చి సూక్ష్మంగా అవగాహన కలిగి ఉండటం ఎంతైనా అవసరం. వేదాల సారమంతా మానవజాతి అభ్యున్నతికే అన్న పరమ సత్యాన్ని ఇరువురూ సంపూర్ణంగా అంగీకరిస్తారు. అయితే పూర్వమీమాంస ద్వారా వేదాలను గ్రహించాలని శ్రీ మండనమిశ్రుల మతం. అంటే వేదాలలో నిర్దేశించబడిన కర్మకాండ ఆచరణే మానవులకు పరమ ధర్మమని ఆయన వాదన. వేదం నిర్దేశించిన యజ్ఞయాగాది కర్మలు చేస్తూ స్వర్గాది సౌఖ్యాలను అనుభవించాలి. కర్మ పుణ్యఫలం క్షయం కాగానే మరల భూమ్మీద జన్మించి, కర్మలు మరింత ఉద్ధృతంగా చేస్తే, ఇంద్రాది పదవులు కూడా పొందవచ్చు. కర్మలన్నీ వేదం చెప్పిన రీతిలోనే ఆచరించాలి; ఈ విషయంలో

మానవునికి ఎలాటి స్వతంత్రత ఉండదు. వేదం చెప్పిన విధంగా కర్మలు చేయడమే మానవుని కర్తవ్యం; పరమ లక్ష్యం. అలా వేదాలు చెప్పినట్లుగా కర్మలు చేయని పక్షంలో వేదాలు నిరర్థకాలై నశిస్తాయి.

ఈ వాదానికి పూర్తిగా విరుద్ధమైనది ఉత్తరమీమాంసా మతం. దీనినే జ్ఞానకాండ అంటారు. వేదాల సారమంతా ఉపనిషత్తుల ద్వారా సంగ్రహపర చారు. అటువంటి ఉపనిషత్తులకు వేదాంతం శిరస్సు లాంటిది. వేదాంతం ద్వారా మానవుడు తన పరమలక్ష్యమైన మోక్షపదాన్ని చేరాలని వీరి సిద్ధాంతం. కర్మకాండ అనేది మోక్షానికి దారిచూపుతుందేగాని, మోక్షం ఇవ్వలేదు. జ్ఞానమార్గాన సాధకుడు (ద్వంద్వ) భేదభావాన్ని విడిచి, ఆత్మసాక్షాత్కారాన్ని పొంది జనన మరణ సంసారం నుండి విముక్తుడై బ్రహ్మపదాన్ని పొందుతాడు. అదే మోక్షం; జన్మరాహిత్యం.

75. మహావిద్వాంసులలో శ్రేష్ఠుడైన శ్రీ మండనమిశ్రుడు శ్రీ శంకరుల వాదనల ముందు, సూర్య ప్రకాశం ముందు చంద్రునిలా ప్రకాశాన్ని కోల్పో యాడు. అయినా తన కర్మ సిద్ధాంతాన్ని సమర్థించుకొంటూ, జీవబ్రహ్మైక్య తత్త్వాన్ని ఖండిస్తూ తన వాదనను వినిపించాడు.

76. ఓ యతిసార్వభౌమా! జీవుడు, ఈశ్వరుడు రెండు వస్తువులు కావు; తత్త్వజ్ఞానం లేనివారు మాత్రమే భేదాన్ని తలుస్తారని పలికారు. వేదాలన్నిటినీ పరిశీలించగా జీవబ్రహ్మైక్య ప్రతిపాదనకు ముఖ్యమైన ప్రమా ణాలు అవి చూపలేదు. అందువలన వేదాంతాలు జీవబ్రహ్మైక్య ప్రతిపాదనకు ప్రమాణాలు కావు. ప్రమాణా లెల్లప్పుడూ సాపేక్ష వస్తువులనే తెలుపుతవి. కాని పరబ్రహ్మం నిరపేక్షం, శుద్ధం, నిరాలంబనం, సిద్ధవస్తువు. కనుక ఇటు వంటి సిద్ధవస్తువును గూర్చి ఉపనిషత్తులు ఉపదేశించటం లేదు. పురుషార్థాన్ని ఉపదేశించని తత్త్వాన్ని అంగీకరించలేం. ప్రత్యక్ష వస్తువు లేవీ స్వతఃప్రమాణాలు కాజాలవు. వేదం మాత్రమే స్వతః ప్రమాణం. ఆ విధంగా తమ సిద్ధాంతాలు లౌకిక పదార్థాలనే సూచిస్తూ స్వతఃప్రమాణాలు కానందు వలన, వేదాంతాలు కూడా పరబ్రహ్మం విషయంలో స్వతఃప్రమాణాలు కాజాలవు.

77. పండిత ప్రవరా! పరమాత్మ అంటే తానేనని, జీవుడంటే పరబ్రహ్మయేనని ఉద్దాలక మహర్షి తన శిష్యుడైన శ్వేతకేతువునకు తెలిపాడు. విచారణ చేత తానే పరబ్రహ్మ అని తెలుసుకొంటున్నాడు. ఇవి అన్నీ ఉపనిషత్తులలో ప్రతిపాదించబడినవి. ఉద్దాలక శ్వేతకేతువుల గురు శిష్య సంప్రదాయంమల్లే, బ్రహ్మవిద్యా పరంపర సంవాదం కూడా జీవ ఈశ్వర ఏకత్వాన్నే బోధిస్తున్నది. ఇవన్నీ ఉపనిషత్తుల సారాంశమే.

ప్రత్యగభిన్న పరబ్రహ్మమందు అంతరాత్మ పరమాత్మల ఐక్యత గూర్చి ప్రమాణాలు లేవని పలికినారు. బ్రహ్మస్వరూపం ప్రత్యక్ష ప్రమాణాలచే తెలుసుకోదగినది కాదు. అలౌకిక పదార్థమవడం చేత వేదాంతాలే జీవేశ్వర ఐక్యతకు పరమ ప్రమాణాలు. వేదాంతాలు ప్రతిఫలాపేక్షతో కూడిన తత్వాలను బోధింపవు. కనుక స్వతఃప్రమాణాలు. జననమరణా (సంసారం)లు లేని పరమ పదాన్ని చేర్చేట్టివి. కాబట్టి వేదాంతాలే బ్రహ్మతత్వాన్ని తెలిపే ముఖ్య ప్రమాణాలు.

తత్త్వమసి మొదలైన మహావాక్యాల చేత అవిద్యచే కల్పించబడిన జననమరణ దుఃఖాదులు నశిస్తాయి. అట్టి తత్త్వజ్ఞానం కలుగనంతవరకు బ్రహ్మానందం లభించదు.

78. **శ్రీ మండన మిశ్రుడు:** యతివర్యా! తత్త్వమసి మొదలైన వేదాంత వాక్యాలకు ప్రత్యేకమైన అర్థమేదీ లేదు. అవి కూడా 'హుంఫట్', 'స్వాహా' వంటి అర్థరహితమైన వాక్యాలే. మించిపోతే, అలాటి వాక్యాలు జపం చేసేటప్పుడు ఉపయోగిస్తే పాపాలను కొంతవరకు హరించవచ్చు. అంతకు మించిన ప్రయోజనమేమీ లేదు. కనుక ఈ మహావాక్యాలు, పరమ పురుషార్థమైన జీవేశ్వర ఐక్యమును ఏ విధంగా బోధించగలవు? అదీగాక ఈ వేదాంత వాక్యాలు అపౌరుషేయాలు కావు. పురుష నిర్మితాలే అవుతున్నవి.

79. **శ్రీ శంకరులు:** ఓ ప్రాజ్ఞవరా! పండిత శ్రేష్ఠా! తత్త్వమసి వంటి మహావాక్యాలను అర్థం లేనివి, జపంలో మాత్రమే వాడబడే 'హుంఫట్', 'స్వాహా' వంటి పదాలతో పోల్చి చెప్పటం మీవంటి పండితులకు తగదు. పండితులైనవారు పూర్తిగా అర్థం తెలుసుకోకుండానే దృష్టాంతాలు పలుక

వచ్చునా? జీవేశ్వర ఐక్యమును ప్రతిపాదించే 'తత్త్వమసి' వంటి మహావాక్యా లను 'హుంఫటా'ది సామాన్య పదజాలంతో పోల్చి చెప్పటం హాస్యాస్పదమే అవుతుంది. "తత్–త్వం–అసి" అంటే, నిర్గుణ పరబ్రహ్మం నీవేనని తెలుపుతూ అఖండ పరమార్థ అభేద జ్ఞానాన్ని వేదాంత సూక్తులు ఉపదేశిస్తున్నవి.

80. **శ్రీ మండనమిశ్రుడు:** ఓ యతీశ్వరా! తత్త్వమసి అనే వాక్యం వినడానికి జీవబ్రహ్మైకత్వాన్ని తెలుపుతున్నట్లు కనిపించినా, బాగా విచారించిచూస్తే ఏకత్వాన్ని తెలుపక భేదాన్నే తెలుపుతున్నది. అది ఎలాగంటే, యజ్ఞయాగాదులు చేసేటప్పుడు "ఈశాభిన్నోఽయం మఖాది కర్తా" (ఈ యజ్ఞకర్త ఈశ్వరుని కన్నా వేరైనవాడు కాడు) అనే స్తుతివాక్యాన్ని పలుకుతున్నారు. దీని ద్వారా జీవునికీ ఈశ్వరునికీ భేదం తెలుస్తున్నది. ఇటువంటి వాక్యాలు మీమాంసాశాస్త్రంలో అర్థవాద వాక్యాలుగా చెప్పబడినవి. యజ్ఞయాగాదుల ప్రశంసలకై వేదాలందు "వాయుర్వైక్షేపిష్ఠా దేవతా" మొదలైన అర్థవాద వాక్యాల మల్లే తత్త్వమసి మొదలైన వాక్యాలు విధిశేష వాక్యాలవు తున్నవి. జీవుల ప్రశస్తి కోసం ఉపనిషత్తులలో ఈ వాక్యాలు ప్రయోగించి నారు. అంతేగాక వేదాంతాలు ముఖ్యమైన అపూర్వాన్ని ప్రతిపాదిస్తున్నవి. అపూర్వం యాగాది అనుష్ఠానాల వలన కలుగుతుంది. జీవుడు దేహాన్ని వదలి పోయేప్పుడు కర్మఫలాలతోపాటు ఈ అపూర్వమూ కూడా అనుసరించి స్వర్గాది సుఖాలను అనుభవిస్తుందని పూర్వమీమాంసకులు వచిస్తారు. అంతేకాక వేదం (కర్మలనే) యజ్ఞయాగాదులనే ప్రతిపాదిస్తున్నది. విధి వాక్యాలతోపాటు అర్థవాద వాక్యాలను అన్వయించి దేవతాది స్తుతిరూపమైన ప్రమాణాల మల్లే, తత్త్వమసి మొదలైన వాక్యాలు కూడా జీవేశ్వరుల స్తుతి రూపం మాత్రమే అయి ఉన్నవి. స్తుతిరూపా లెప్పుడూ యజ్ఞయాగాది కర్మల గూర్చి ప్రతిపా దించవు. అయినా బ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదించేవి కనుక విధి వాక్యా లవుతున్నవి. అంతేకాని అర్థవాక్యాలు కానేరవు.

81. **శ్రీ శంకరులు:** విధివాక్యాలు గాని, అర్థవాద వాక్యాలుగాని, నిరర్థకాలు గాని, పౌరుషేయాలు గాని కావని విధివిశేషమని చెప్పబడే

విషయాలన్నీ కర్మకాండకు సంబంధించినవి. అవి జ్ఞానకాండకు వర్తించవు. అవి అన్నీ ప్రశంసాపూర్వకమైన పదాలే. ఉదాహరణకు: "ఆదిత్యోయూపః యజమానః ప్రస్తరః" ఇవి అన్నీ స్తుతిపరమైనవి. యజ్ఞాలందు యూప, ప్రస్తరం మున్నగునవన్నిటినీ సూర్య యజమాన రూపాలుగా ప్రశంసించారు. "యూప" మంటే యజ్ఞస్తంభం; దానిని సూర్యునిగా ప్రశంసించారు. 'ప్రస్తర' మంటే దర్భాసనం; దానిని యజమాన స్వరూపంగా ప్రశంసించారు. ఇటువంటి స్తుతి రూపమైన ప్రశంసా వాక్యాలన్నీ, కర్మకాండలో ఉండడం చేత కర్మలను ప్రశంసించే విధి విశేష వాక్యాలు. కానీ జ్ఞానకాండలో తెలిపిన "తత్త్వమసి", 'అహం బ్రహ్మాస్మి" వంటి మహావాక్యాలు పరబ్రహ్మస్వరూపాన్ని ప్రతిపాదిస్తుండగా, అవి ఎలా ప్రశంసాపూర్వక స్తుతి వాక్యాలవుతవి? కనుక మహావాక్యాలు స్తుతిరూపమైనవి కావు. జీవేశ్వరుల అభేదాన్ని ఉపదేశిస్తున్నవి. వాటి తాత్పర్యం అద్వితీయమైన పరతత్త్వంలోనే ఉన్నది.

82. **శ్రీ మండనమిశ్రుడు:** యతివరా! పూజ్యతమా! తత్త్వమసి మొదలైన మహావాక్యాలు పరబ్రహ్మాన్ని స్తుతిస్తున్నవి కానందున విధిశేష వాక్యాలని చెప్పజాలం. అభేదబుద్ధి వాస్తవం కాకపోవటం చేత జీవబ్రహ్మైకతను ప్రతిపాదించటం లేదు. కేవలం జీవుని యందు పరమాత్మ దృష్టిని ఉంచి ఉపాసించటం కోసం తత్త్వమస్యాది వాక్యాలు ఏర్పడినవి. కర్మలు బాగా వృద్ధిపరచడానికే ఈ అభేదోపాసనలను ప్రతిపాదించారు. జీవునియందు పరమాత్మ దృష్టిని ఉంచి ఉపాసించడానికే తత్త్వమస్యాది వాక్యాలు ఏర్పడినవి. జీవుని యందు పరమాత్మ భావన ఉపాసనా, ఉపాసనాది కర్మల అభివృద్ధి కోసమే అని తెలుసుకోవాలి. వేదాలలో ఈ విధమైన అభేదోపాసనలు అనేకం ఉన్నవి. ఉదాహరణకు 1. 'అన్నముపాస్వ' (అన్నాన్ని పరబ్రహ్మంగా ఉపాసించు) 2. 'ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః' (సూర్యభగవానుడు పరబ్రహ్మమే). 3. 'ప్రాణోవావసంవర్గః (ప్రాణము పరబ్రహ్మమే) ఇవి అన్నీ కర్మలను ఉపాసించడానికి, వృద్ధి చేయడానికి మాత్రమే తెలిపారని స్పష్టమవుతున్నది.

వాస్తవంగా, ఆయా పదార్థాలు పరబ్రహ్మం కానట్లే, జీవుడు కూడా పరబ్రహ్మం ఎన్నటికీ కాజాలడు. అందువలన ఆరోపిత బ్రహ్మభావంతో ఉండే జీవుని తెలిపే వాక్యాలవుతాయి. కాబట్టి తత్త్వమస్యాది వాక్యాలు జీవబ్రహ్మైక్య విషయాన ప్రమాణాలు కావు.

సాధకుడు సమస్త ప్రపంచాన్ని ఇష్టదేవతా రూపాలుగాను, ఆ దేవుణ్ణి సృష్టి స్థితి లయకారునిగాను భావించి ఉపాసిస్తున్నాడు. అంత మాత్రంచేత ప్రపంచమంతా దేవతా స్వరూపం కాజాలదు. భగవంతుని మహిమలను ఆ విధంగా ఊహిస్తూ ఉపాసిస్తున్నాడు. అంటే తాను ఉపాసకుడు. తాను ఉపాసించే వస్తువు వేరుగా ఉన్నది. కనుక ఇందులో ఏకత్వం సిద్ధించదు. కాబట్టి తత్త్వమస్యాది వాక్యాలు కల్పితమైన పరబ్రహ్మోపాసనాపరాలవుతున్నవి.

83. **శ్రీ శంకరులు:** ఓ బుద్ధిమంతుడా! ఉపాసనా కాండయందు 'మనోబ్రహ్మేత్యుపాసేత' మొదలయిన వాక్యాలలో మనస్సుయందు బ్రహ్మభావన విధించే విజ్ఞు మొదలయినవి వినబడుచున్నవి. కాని తత్త్వమసి మొదలయిన వాక్యాలందు బ్రహ్మభావనను విధించే విజ్ఞాదులు లేవు. కావున ఉపనిషత్తులు జీవుని యందు బ్రహ్మత్వమును ఉపాసన కోసం విధించేవి కావు. అవి జీవుడు బ్రహ్మస్వరూపుడని తెలిపేవి.

84. **శ్రీ మండనమిశ్రుడు:** తత్త్వమస్యాది వేదాంత వాక్యాలకు జీవబ్రహ్మైక్య తత్త్వం పరమ ప్రమాణమే అయినా, వేదాంతాలకు జ్ఞానవిధిని అంగీకరించి తీరాలి. వేదాంతులు జ్ఞానం చేతనే మోక్షప్రాప్తి కలుగుతుందని పదేపదే చెబుతున్నారు. ఓ యతీశ్వరా! తమకు మీమాంసాశాస్త్రం తెలుసు గదా! అందు రాత్రి సత్రయాగాన్ని గూర్చి ప్రతిష్ఠా ఫలదర్శనంచే విధి కల్పించ బడుతున్నది. ఆ ప్రకారం జీవబ్రహ్మల ఐక్యమును గూర్చి ప్రతిపాదించినా, ముక్తి ఫలం స్పష్టంగా శ్రుతమవటం చేత విధి కల్పించబడుతున్నది. రాత్రి సత్రయాగమందు విధి కల్పితమైన విధాన, తత్త్వమసి వాక్యాలందు 'బ్రహ్మం ఎరిగిన మహాత్ముడు బ్రహ్మమే అవుతున్నా"డనే ముక్తి రూపమైన శాశ్వత ఫలం స్పష్టంగా వినబడుతుండగా బ్రహ్మన్ని తెలుసుకోవడానికి ఇచ్ఛగించేవాడు

బ్రహ్మాన్ని తెలుసుకోవడాన్ని చేయవలెననే జ్ఞానవిధిని కల్పించాలి. జ్ఞానపూరిత మైన వాక్యాలంటే – ఆత్మను తెలుసుకోవాలి, ఆత్మనే ఉపాసించాలి, ప్రపంచాన్నే ఆత్మస్వరూపంగా ఉపాసించాలి, బ్రహ్మవేత్త బ్రహ్మమే అవుతున్నాడు. బ్రహ్మ స్వరూపాన్ని తెలియక పరబ్రహ్మ స్వరూపాన్ని ఉపాసింపజాలం. బ్రహ్మ స్వరూపం తెలిసినంత మాత్రాననే మోక్షం లభింపదు. మననం, నిధి ధ్యాసన లను కూడా చేయాలి. అంటే వేదాంతాలు జ్ఞానవిధి ద్వారా పరబ్రహ్మను తెలుపుతున్నవి. ఆ విధంగా జీవబ్రహ్మైక్యమును తెలుపనందున అవి అన్నీ అవాంతర వాక్యాలే అవుతున్నాయి.

85. **శ్రీ శంకరులు:** మోక్షమనేది శ్రవణ, మనన, నిధి, ధ్యాసనాలచే సిద్ధించేది కాదు. యాగాది కర్మలచే సిద్ధించే స్వర్గాది ఫలాలమల్లే అశాశ్వత మైనది కాదు. వేదాంతాలు దేవతలను ఉపాసించడానికే పరిమితమైతే అవీ శాశ్వతం కావు. కనుక వేదాంతాలు జీవబ్రహ్మైక్యమునే ప్రతిపాదిస్తూ, శాశ్వతమైన మోక్షం సిద్ధింపజేస్తున్నవి. మోక్షం శాశ్వతానంద స్వరూపం. ముక్తి అంటే క్రియారూపులేని పరమతత్త్వం. జ్ఞానానికి ఉపాసనలకు ఎంతో వ్యత్యాసమున్నది. జ్ఞానం చిత్తధర్మం మల్లే ఉన్నా, దృశ్యరహితమై కేవలం బ్రహ్మతత్త్వ స్వరూపాన్ని తెలిపేదై ఉన్నది. అందువలన జ్ఞానమన్నది చేయడానికి గాని, చేయకుండటం గాని, లేక మరొక విధంగా చేయడం గాని సాధ్యం కానిది. జ్ఞానం క్రియారహితం. ప్రేరణ పురుషునికి వ్యాపార శూన్యమైనది.

మోక్షమంటే ప్రాప్య వస్తువు కాదు, సర్వదా సిద్ధమయినది. తానే పరబ్రహ్మ స్వరూమన్న దృఢ జ్ఞానం కలిగి ఉండడం. జ్ఞానం వేరుగాను, ముక్తి వేరుగాను లేవు. అట్టి బ్రహ్మతత్త్వాన్నే మహావాక్యాలు బోధిస్తున్నవి. జ్ఞానం చేత కైవల్యం లభించడం అంటే ఇదే!

"క్షీయంతే చాస్య కర్మాణి" మొదలైన వేదాంత సూక్తులు, బ్రహ్మజ్ఞానం కలిగిన తరువాతనే మోక్షం కలుగుతుందని బోధిస్తున్నవి. మోక్షమనేది జ్ఞానం చేత పొందిన అపూర్వాలచే జనించేది కాదు. వేదాంతాలు అపూర్వాలను నిషేధిస్తున్నవి.

ఈ ప్రకారం బ్రహ్మజ్ఞానంచే జీవత్వం నశించి తాను పరబ్రహ్మ స్వరూపియై బ్రహ్మానందాన్ని పొందుతాడని శ్రుతులు, స్మృతులు వచిస్తున్నవి. బ్రహ్మజ్ఞానంచే శాశ్వతముక్తి లభిస్తున్నది. కనుక, తత్త్వమస్యాది వాక్యాలు జీవబ్రహ్మైక్యాన్నే తెలుపుతున్నవని సిద్ధాంతం.

86. **శ్రీ మండనమిశ్రుడు:** ఓ యతీశ్వరా! తత్త్వమసి మొదలైన మహావాక్యాలు పరబ్రహ్మ ఉపాసనను విధించేవి కావని సెలవిచ్చి నారు. అట్లే అనుకోండి. అయినా, జీవబ్రహ్మల ఏకత్వాన్ని ప్రతిపాదించటం సమంజసంగా లేదు. ఎందుకంటే సామ్యమనేది రెండు వస్తువులున్నప్పుడే సాధ్యపడుతుంది. ఆ రెండిటిలోనూ సమానధర్మముంటే అలా చెప్పవచ్చు. కనుక పరమాత్మ యందు చైతన్యం ఉంది. ఈ సామ్యంచేత తత్త్వమసి అనే మహావాక్యం జీవుడు పరమాత్మతో సమానుడని తెలుపుతున్నది. అంతమాత్రంచేత జీవుడే పరబ్రహ్మమని చెప్పజాలం కదా! లోకంలో సమానధర్మం గల వారిద్దరుంటే వాడే వీడని భ్రమపడతాం. అది భ్రాంతియే కాని వాడు, వీడవడం లేదు కదా! కనుక తత్త్వమసి అనే వాక్యం కూడా అటువంటి భ్రమకు లోనుకావద్దని హెచ్చరిస్తున్నది.

87. **శ్రీ శంకరులు:** పండితవరా! జీవునకు, పరమాత్మకు చైతన్యంలో మాత్రమే సామ్యం ఉందంటారా? లేక సంపూర్ణ జ్ఞానమందును, *(omni science)* సర్వశక్తి సంపన్నత *(omni potence)* మొదలైన అనేక విషయాలలో సామ్యం ఉందా? జీవుడు పరమాత్మ ఒకే చైతన్య స్వరూపులనేది జగమెరిగిన సత్యమే! రెండవ పక్షమున జీవునికి పరమాత్మ స్వరూపం సిద్ధిస్తోంది. జీవేశ్వరులకు భేదం ప్రతిపాదించే మీ అభిప్రాయానికిది విరుద్ధం. కనుక సాదృశ్య ప్రతిపాదనం సమంజసం కాదు. సర్వజ్ఞతలో కూడా సామ్యాన్ని తెలుపలేము. ఎందుకంటే జీవుని ఉపాధి ఖండం; పరమాత్మ ఉపాధి అఖండం. ఈ విధంగా జీవేశ్వరులకు సామ్యం కనిపించటం లేదు. విచా రించగా జీవేశ్వరులు వేరు కాదని తెలుస్తున్నది. అంతేగాక భ్రాంతి చేతనే ఒక వస్తువు రెండుగా తెలుస్తున్నది. ఆ విధంగా ఒకే సద్వస్తువుగా తెలుసుకోవడమే జీవబ్రహ్మైక్యం.

88. **శ్రీ మండనమిశ్రుడు:** మహర్షిసత్తమా! పరమాత్మ యందు సుఖ భోగాది అనంతాలైన గుణాలు ఉన్నవి. అయితే జీవునిలో కూడా అలాటి గుణాలున్నా, అవిద్యచేత ప్రకాశింపకున్నవి. జీవుడు ఎల్లప్పుడూ అవిద్యచే ఆవరింపబడి ఉంటాడు. కాని పరమేశ్వరుడు సంపూర్ణ విద్యాస్వరూపుడు. ఇది పరమోత్కృష్టమైన సామ్యముండటం వలన తత్త్వమసి అనే వాక్యాన్ని పలికి ఉంటారు. అందువలన అవిద్యచే ఆవరించివున్న జీవుని బ్రహ్మంతో పోల్చి ఏకత్వాన్ని నిరూపిస్తారు.

89. **శ్రీ శంకరులు:** విద్వద్వరేణ్యా! అవిద్య చేత జీవుని యందు పరతత్త్వమైన సుఖబోధానంద స్వరూప ప్రకటితమవడం లేదని పలికారు. అంటే జీవుడు పరమాత్మస్వరూపుడే కాని, అజ్ఞానం చేత వేరుగా కనిపిస్తున్నాడని చెబుతున్నారు. మేము కూడా అదే ప్రతిపాదించాం. జీవాత్మ పరమాత్మల స్వరూపం తత్త్వమసి వాక్యం చేత బోధపడలేదంటే, భిన్నత్వమే తెలుస్తుంది. ఆ మహావాక్యం ఏకత్వాన్ని ఉపదేశించటం వలన భిన్నత్వం తొలగి అఖండ జ్ఞానం ఉదయిస్తున్నది. జీవ – పరమాత్మలు వేరనే భ్రాంతి తొలగిపోతున్నది. కనుక తత్త్వమసి వాక్యం జీవేశ్వర ఐక్యతనే తెలియజేస్తున్నది.

90. **శ్రీ మండనమిశ్రుడు:** ఓ యతివరేణ్యా! పరబ్రహ్మం జగత్తుకు కారణభూతుడు, చైతన్య స్వరూపుడు. జీవుడు కూడా చైతన్య స్వరూపుడే. కనుక ఇరువురిలో చైతన్యాన్ని సామ్యంగా చెప్పాలి. సాంఖ్యులు జగత్తుకు కారణం ప్రధానమనీ, తార్కికులు పరమాణువులనీ తెలుపుతున్నారు. ఈ విధంగా జగత్తు జడపదార్థమనే విషయాన్ని తెలుపుతున్నారు. అందువలన తత్త్వమసి అనే వాక్యం సామ్యాన్ని తెలుపుతూ భిన్నత్వాన్నే అంగీకరిస్తున్నది.

91. **శ్రీ శంకరులు:** పండితశ్రేష్ఠా! జీవేశ్వరుల యందు చైతన్యం సాధారణ ధర్మమవడం వలన ఇరువురు సమానులని వచిస్తున్నారు. ఎంత విషాదకరం! అన్యాయమే కాక ఆశ్చర్యాన్ని కూడా కలిగిస్తున్నది. మీ వాదం యథార్థమైతే వేదాంతాలందు 'తత్త్వమసి' అనే వాక్యం ఉండకూడదు. 'తత్త్వమస్తి' అనే ప్రయోగం ఉండాలి. (అప్పుడు జగత్కారణమైన పరబ్రహ్మం నీతో సమమై ఉన్నది అనే అర్థం వస్తుంది) అంటే 'అసి' అనే పదాన్ని వదలి

"అస్తి" అనే పదాన్ని చేర్చవలసి ఉంటుంది. 'తత్వమస్తి' అనే వాక్యం ఎక్కడా కానరాదు. పండితవరా! "అసి" అనే పదం జీవ-బ్రహ్మల ఏకత్వాన్ని స్పష్టంగా తెలుపుతూండగా అస్తిగా మార్చడం వలన ఏం ప్రయోజనం ఉంది?

అంతేగాక, "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అనేది శ్రుతి వాక్యం. (పరమాత్మే అన్ని రూపాలతో పుట్టాలనే సంకల్పించారు.) ఈ శ్రుతి జగత్తునకు ప్రధానము, పరమాణువులు కారణమేమో అనే సందేహాన్ని తొలగిస్తోంది. 'తత్త్వమసి' అనే మహావాక్యం కూడా జగత్తుకు కారణమైన పరమాత్మకూ చేతనాస్వరూపుడైన జీవునకూ అభేదాన్ని ప్రతిపాదిస్తున్నది. ఈ రెండు వాక్యాల చేత, జగత్తుకు జడం కారణమనే వాదం, జీవుడు ఘటాదులమల్లే జడం అనే వాదం నిరాకరించబడుతున్నాయి. ఈ విధంగా విచారించితే, ఏ విధంగాను జీవబ్రహ్మలకు సదృశత్వాన్ని ఆపాదించ సాధ్యం కాదు. తత్త్వమసి అనే మహావాక్యం జీవబ్రహ్మల ఏకత్వాన్నే ప్రతిపాదిస్తున్నది. ఇదే వేదాంత తత్త్వ సిద్ధాంతం. సర్వమూ బ్రహ్మ స్వరూపమని తెలుపడం వలన భేదవాదం పూర్తిగా నశిస్తున్నది.

92. **శ్రీ మండనమిశ్రుడు:** యతివరేణ్యా! జీవుడు పరమాత్మ ఎన్నటికీ ఒకటి కాదు. "నాహమీశ్వరః" "నేను ఈశ్వరుడను కాను" అని ప్రత్యక్షానుభవం ఉన్నది. సర్వజ్ఞుడైన ఈశ్వరుడెక్కడ? అల్పజ్ఞుడు, సుఖదుఃఖాలతో కూడుకొన్న జీవుడెక్కడ? జీవేశ్వర భేదబుద్ధి దృఢంగా ఉన్నందుననే జీవబ్రహ్మైక్యతత్త్వం సిద్ధించటం లేదు. తత్త్వమసి అనే వాక్యం జీవబ్రహ్మైక్య వాదాన్ని ఉపదేశింపజాలదు. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" వేదాధ్యయనం ఎల్లవేళలా ఆచరించాలనే విధి వాక్యం ప్రకారం తత్త్వమసి అనే వాక్యం జపం చేయడానికి ఉపయోగమవుతున్నది. అంతేకాని మహావాక్యం కాదు. జీవ - పరమాత్మల ఏకత్వాన్ని బోధింపజాలదు. జీవుడు వేరు, పరమాత్మ వేరనే ద్వైతతత్త్వాన్ని వేదం బోధిస్తున్నది. అదే వేదసారం.

93. **శ్రీ శంకరులు:** పండితవర్యా! విచారించితే "నాహం మీశ్వరః" (నేను ఈశ్వరుడను కాను) అనేది ప్రత్యక్షజ్ఞానం కాదు. ఈ కారణం చేత తత్త్వమసి

అనే వాక్యతత్త్వం అభేదమే. "అయమర్థః........" భేదమనేది ప్రత్యక్ష ప్రమాణం కాదు. ఇంద్రియం భేదాన్ని గ్రహించలేదు. భేదానికి, ఇంద్రియానికి ఎట్టి సంబంధమూ లేదు. "ఆద్యేన తావత్సమ.... ఇంద్రియానికి భేదానికి (సమ వాయ సంబంధం) అభిన్న పదార్థాలకుండే నిత్య సంబంధముండదు. భేదేంద్రి యాలు భిన్న పదార్థాలవడం చేత వాటికి సమవాయ సంబంధముండదు.

అంతేగాక సమవాయమన్నది ఏకమా? లేక అనేకమా? అనేకమయితే అప సిద్ధాంతమై శాస్త్రవిరుద్ధమవుతుంది. ఏకమయితే, రూపానికి రూపికి, జ్ఞానానికి జ్ఞానికి ఉండే సమవాయము, వాయు ఘటాదులకుండు సమవాయము ఏకమగుట వల్ల "రూపవాయువులకు, జ్ఞాన, ఘటములకూ సమవాయం సిద్ధమగుచున్నది. అందుచే "రూపీవాయుః" (రూపంతో కూడినది వాయువు) 'ఘటో జ్ఞానవాన్" ఘటం జ్ఞానం గలదనే ప్రతీతి కలుగుతుంది. ఇది విరుద్ధ ప్రతీతి అవుతుంది. వాయువునందు రూపం లేదు. అట్లే ఘటమునందు జ్ఞానం లేదు. అందువలన సమవాయ సంబంధం సంభ వించకపోవటం వలన పూర్వోక్త విరుద్ధ జ్ఞానం ప్రతీయమానం కాదని చెప్పరాదు. వాయ్వాదులందలి సమవాయము వాయ్వాద్య భావములందును కలుగుచున్నది. వాయువుకు స్పర్శకు సమవాయ సంబంధమున్నట్లే, వాయువుకు అభావమునకు సమవాయమున్నది. కనుక వాయు ఘటా దులందు రూపాదులు లేనందున సమవాయముచే ముందు తెలిపినట్లుగా విరుద్ధజ్ఞాన ప్రతీతి గలుగదనేది బాగా నిరాకృతమయింది. ఈ కారణంచే సమవాయ సంబంధం సిద్ధించదు. అవయవం, అవయవి మొదలయిన వాటికి తాదాత్మ్య సంబంధం కూడా చెప్పరాదు. ఆ తాదాత్మ్యం భిన్న రూపంలో ఉందా? అభిన్న రూపంలో ఉందా? విచారణ చేస్తే తాదాత్మ్య సంబంధం కూడా కుదరడం లేదు. పరస్పర విరుద్ధాలయిన భేదం, అభేదం ఒక చోట ఉండవు. కాబట్టి ఆ తాదాత్మ్యం భిన్నరూపమై అభిన్న రూపమై ఉందనడానికి అవకాశం లేదు. తాదాత్మ్యం అనిర్వాచ్యంగా ఉంది. రూపఘటాదులకు సంయోగ సంబంధం అప్రసిద్ధము. సమవాయాది సంబంధాలు అభిన్న వస్తువులకే సంభవించకపోవడం వల్ల భేదం, ఇంద్రియం

భిన్న వస్తువు లగుటచే వీటికీ సంబంధం సిద్ధించదు. ఇలా విచారం చేయగా 'జీవోబ్రహ్మ భిన్నః' అనే జ్ఞానమందు జీవునకూ బ్రహ్మానికీ ఉండే భేదం ప్రత్యక్షం కాదు. కాన తత్త్వమసి అనే వాక్యం బాధితం కాదు.

94. **మండనమిశ్రుడు:** ఓ ప్రజ్ఞాశాలీ! ఇంద్రియాలకు సంయోగ సంబంధం లేకపోయినా, చేరువగానయినా ఉంటున్నవి కదా! అందు చేత భేదమన్నది ఇంద్రియాలచే గ్రహింపబడటం చేత ప్రత్యక్షమైనదనే చెప్పాలి. ఇట్లు జీవేశ్వర భేదం స్పష్టంగా తెలియటం చేత తత్త్వమసి వాక్యం భేదం లేదని పలుకటం విరుద్ధంగా ఉన్నది. ప్రజ్ఞావంతులెవరూ దీనిని అంగీకరించరు. అందువలన ఎవరికీ తాము పరమేశ్వరుడనే జ్ఞానం కలుగడం లేదు. నేను వేరు భగవంతుడు వేరనే తలస్తున్నాడు. ఈ జీవేశ్వర భేదాన్ని మనస్సు, ఇంద్రియాలు గ్రహిస్తున్నవి గదా! అందువలన సామీప్య హేతువు చేత ఇంద్రియం 'భేదము'ను గ్రహిస్తున్నది. కనుక భేదభావం ప్రత్యక్షమేనని తెలుపుచున్నాను.

95. **శ్రీ శంకరులు:** ఓ మునివరా! ఇంద్రియాలకూ ఆత్మకూ సామీప్యం లేదు. ఈశ్వర భేదాశ్రయమైన ఆత్మయందు ఇంద్రియ సంబంధం సిద్ధించి నప్పుడు ఇంద్రియ భేదాలకు విశేషణతా రూపసన్నికర్షం అంగీకరించాలి. ఆత్మ ఇంద్రియాలకు కనిపించే వస్తువు కాదు. అన్యోన్య భావమైన భేదం ప్రత్యక్షం కాదు. కేవలం విశేషణత్వానికి మాత్రం సామీప్యాన్ని అంగీకరించితే సన్నికర్ష రూపహేతువు అతిప్రసక్తమవుతున్నది. కనుక ఆత్మేంద్రియాలకు ఎట్టి సంబంధమూ లేదు.

96. **శ్రీ మండనమిశ్రుడు:** రెండు ద్రవ్యాలు సంయోగం చెందుతవని నిరాఘాటంగా చెప్పవచ్చు. ఆత్మా ద్రవ్యం, చిత్తమూ ద్రవ్యం. ఆ విధంగా చిత్తం, ఆత్మలు రెండూ ద్రవ్యాలవడం చేత ఆ రెంటికీ సంయోగ సంబంధం తప్పక ఉంది. ఇందులో ఎంతమాత్రమూ సందేహం లేదు. తాము ఇంద్రియా లకు ఆత్మకు సంబంధం లేదని నొక్కి చెప్పారు. అది శాస్త్రసమ్మతం కాదు. ఆత్మ, మనస్సు, ఇంద్రియాలకు గోచరించటం చేత జీవబ్రహ్మల భేదం కూడా ప్రత్యక్ష సిద్ధమే. ఇందుచేత తత్త్వమసి వాక్యం అభేదాన్ని బోధింపజాలదు.

97. **శ్రీ శంకరులు:** యోగిసత్తమా! ఆత్మవిభుద్రవ్యం లేక అణుద్రవ్యం అనే రెండు పక్షాలను ఆత్మ నిరవయమవడం వలన నిరూప నిర్గుణాది స్వరూపమవడం చేత చిత్తం, ఆత్మలకు సంయోగమన్నది అసంభవమని సర్వ వేదాంత శాస్త్రాలు చెబుతున్నవి. ఇందులో సందేహ మెంత మాత్రమూ లేదు. కాగా తత్త్వమసి వాక్యం జీవాత్మల ఏకత్వాన్ని నిస్సందేహంగా ఉపదే శిస్తున్నది.

98. అంతేగాక, భేదం ఇంద్రియాలు గ్రహిస్తున్నందువలన భేద మందింద్రియం ప్రమాణమవుతున్నది. ఈ భేదం ప్రత్యక్ష సిద్ధమని వచించారు. భేదానికి ఇంద్రియానికీ ఏ విధమైన సామీప్యం కలుగదని, భేదమన్నది ఇంద్రియాలచే గ్రహించేది కానందున ప్రత్యక్షం కాదనీ, జీవాత్మ పరమాత్మలకు భేదమే లేదనీ మేము ప్రతిపాదించాం. ఇదంతా కూడా మనస్సును ఇంద్రియంగా అంగీకరించిన పక్షానే సంభవిస్తుంది. కనుక చిత్తమనేది ఇంద్రియం. ఈ ఇంద్రియం జీవబ్రహ్మాల భేదంలో ప్రమాణం కాదు. చిత్తానికీ, ఆత్మకూ ఏ సంబంధమూ లేదు. అవయవమైన మనస్సుతో అవయవం కాని ఆత్మకు సంబంధముండదు గదా! అందుచేత భేదమన్నది ప్రత్యక్ష సిద్ధమనటం సర్వదా అసంభవం. ఈ విచారం చేత తత్త్వమసి మహా వాక్య తాత్పర్యం వేదాంత సిద్ధాంతమైన జీవాత్మల ఏకత్వాన్నే తెలియజేస్తుంది. ఈ విధంగా భేదం నిరాకృతమయింది.

99. **శ్రీ మండనమిశ్రుడు:** భేదజ్ఞానం ఇంద్రియాలచే ప్రత్యక్షం కాకపోయినా, జీవబ్రహ్మాల భేదం సాక్షిగా ఉంది. అట్టి సాక్షిరూపమైన భేదజ్ఞానమే జీవపరమాత్మలకు వైరుధ్యం కలుగుచుండగా ఏ విధంగా అభేద తత్త్వమందు తత్త్వమస్యాది వాక్యాలు ప్రమాణాలవుతవి? జీవుడు శరీరంలో ఇంద్రియాలకు సాక్షియై మాయచే ఆవరించి ఉన్నాడు. జీవుడు వ్యష్టి సాక్షి కాగా, ఈశ్వరుడు సమష్టి సాక్షి. జీవేశ్వరులకు ఇంతటి భేదముంది. కనుక తత్త్వమసి మహావాక్యం జీవబ్రహ్మాల ఏకత్వాన్ని బోధింపజాలదు.

100. **శ్రీ శంకరులు:** జీవుడంటే అవిద్యచేత ఆవరించబడి శరీరానికీ, ఇంద్రియాలకూ సాక్షిగా ఉన్నాడు. ఈశ్వరుడు మాయచేత సమస్త జగత్తుకు

సాక్షిగా ఉన్నాడు. వ్యష్టి సమష్టి సాక్షులుగా జీవేశ్వరులు అవిద్యామాయలతో కూడి ఉండడంవలన భేదభావం తోచుచున్నది. అందువలన పరమాత్మ జీవునికన్న వేరు భావాన్ని కలిగిస్తున్నది. కాబట్టి ద్వైతమని భావిస్తాం. అద్వైతమని తలచటం లేదు. ప్రత్యక్ష సాక్ష్యం వలన జీవేశ్వరుల ఉపాధిభేదం కనపడుతున్నది. అయినా సాక్షిరూపంగా ఉండే భేదం యథార్థం కాదు. తత్త్వమసి మహావాక్యం చేత బ్రహ్మజ్ఞానం పొంది అవిద్య, మాయలు నశించగా ఒకే బ్రహ్మస్వరూపమవుతున్నది. తరువాత దృశ్యం లేదు. అదే శివం, శాశ్వతం, ఆనందం. అంటే బ్రహ్మజ్ఞానం పొందక మునుపు సాక్షి స్వరూపులుగా జీవేశ్వరుల భేదం స్పష్టంగా తెలిసినా, బ్రహ్మజ్ఞానముదయించ గానే సర్వదృశ్యం పోయి అఖండ తత్త్వం సిద్ధిస్తున్నది. అజ్ఞాన దశలో జీవేశ్వర భేదమున్నది; బ్రహ్మజ్ఞానం పొందగానే జీవేశ్వరుల అభేదం సిద్ధిస్తున్నది.

101. **శ్రీ శంకరులు మరల ఇలా పలికారు:** శ్రుతి ప్రత్యక్షాలకు వైరుధ్యం లేదు. తత్త్వమసి అనే వాక్యం అభేదమనీ, సాక్షి స్వరూపమైన ప్రత్యక్ష భేదాన్ని కలిగించటం చేత వ్యతిరేకతను (వైరుధ్యాన్ని) అంగీకరించినా, అపరిచ్ఛేద న్యాయాన్ని స్వీకరించాలి. ముందు ముత్యపుచిప్ప వెండి అనే భ్రాంతి కలిగింది. జ్ఞానం చేత వెండి అన్న భ్రాంతి తొలగిపోతున్నది. అట్లే మొదట అజ్ఞానం చేత తలచిన భ్రాంతి, తత్త్వమసి మహావాక్యంచేత జ్ఞానోదయమై భేదం తొలగిపోతున్నది.

“తద్వద్యథోక్తం ప్రత్యక్షమేవ.....” ఆ అపచ్ఛేద న్యాయం ప్రకారం తత్త్వమసి వాక్యంచే బాధితమగుతున్నది. ముందు ముత్యపుచిప్పను చూచుట చేత భ్రాంతిచే వెండి అనే జ్ఞానం కలుగుతున్నది. ఆ తరువాత కలిగిన సత్యజ్ఞానం చేత, ఆ భ్రాంతి తొలగిపోతున్నది. వెండి అనే భ్రాంతి నశించి పోతుంది. మొదటగా వెండి అనే జ్ఞానం తరువాత ముత్యపుచిప్ప అనే యథార్థ జ్ఞానం కలుగుతున్నది. ఆ విధంగా సాక్షిస్వరూపమైన ప్రత్యక్షజ్ఞానం జీవేశ్వరుల మధ్య మొదట భేదం కనిపించినా, ఈ యథార్థజ్ఞానం చేత జీవేశ్వర ఏకత్వం తెలుస్తున్నది.

అంటే భ్రాంతి కాలమందు జీవేశ్వరుల భేదం తెలుస్తున్నది. తరువాత తత్త్వజ్ఞానంచే భ్రాంతి తొలగి జీవేశ్వరుల ఏకత్త్వం తెలుస్తుంది. ఇదే యథార్థ జ్ఞానం.

102. **శ్రీ మండనమిశ్రుడు:** సంయమీశ్వరా! ప్రత్యక్ష ప్రమాణాలచే పదార్థాలు తెలుసుకోగలిగినా, తార్కికులు అనుమాన ప్రమాణాన్ని స్వీకరిస్తున్నారు. ఈ అనుమాన ప్రమాణంచే తత్త్వమసి అనే అభేద సిద్ధాంతం బాధించబడుతున్నది. అనుమాన ప్రమాణంచే జీవేశ్వర ద్వంద్వ సిద్ధాంతం బలపడుతున్నది. ఘటాదులు సర్వజ్ఞులు కావు; బ్రహ్మత్త్వం లేదు; జడాలు. కనుక ఘటాదులు బ్రహ్మకన్నా భిన్నమైనవి. కనుక భేదభావం స్పష్టమవుతోంది. అదే విధంగా జీవుడూ సర్వజ్ఞుడు కాడనే వాదనచేత బ్రహ్మభావానికి అనర్హుడవుతున్నాడు. కాబట్టి జీవుని యందు బ్రహ్మత్త్వం లేదు. ఘటాదులమల్లేనే జీవుడు కూడా పరబ్రహ్మతో భేదభావం కలిగి ఉన్నాడు. ఈ విశిష్టమైన అనుమాన ప్రమాణం వ్యతిరేకిస్తున్నది. జీవుడు పదార్థమవడం వలన పరబ్రహ్మచే నియమించినవాడు. కనుక జీవుడు పరబ్రహ్మం ఒక్కటి కాదు. జీవుడు పరబ్రహ్మ అంశ అవడం వలన ఈశ్వరునికన్నా భిన్నమైనవాడే అవుతున్నాడు. అభేదమనే తత్త్వమసి వాక్యం దోషితమవుతున్నది.

103. **శ్రీ శంకరులు:** పండితవర్యా! జీవేశ్వర భేదం పరమార్థమా? లేక కల్పితమా? అని ఆలోచించాలి. మీరు పలికినట్లు అనుమాన ప్రమాణాన్ని స్వీకరించితే భేదం సత్యమని చెప్పడానికి ఆధారాలు కనిపించటం లేదు. "ఘటాదేరుక్త........" అసర్వజ్ఞమవడం వలన పరబ్రహ్మ తత్త్వజ్ఞానంలో పరబ్రహ్మ వస్తువే అన్నిచోట్లా కనిపిస్తున్నది. పరబ్రహ్మ వస్తువు తప్ప వేరొక వస్తువు కనిపించదు. కనిపించేదంతా చైతన్య స్వరూపం, అఖండతత్త్వం, పరిపూర్ణం; ఇదే అద్వైత తత్త్వం. అదే ఉపనిషత్తుల సారాంశం.

ఒకవేళ జీవబ్రహ్మల భేదం కల్పితమైతే, ఆ కల్పితమైన భేదాన్ని మేము అంగీకరించాం. "పరస్పర ప్రతియోగిక........" అనేది కల్పితం. వ్యావహారికంగా దానిని అంగీకరించాం. ఈ విధంగా జీవేశ్వరుల భేదం వ్యావహారికాలందు కనిపిస్తుంటుంది. వ్యవహారాలకు అతీతమైనది. దృశ్యం

లేని అఖండ జ్ఞానంతో కూడిన ఏకత్వమే అద్వైత సిద్ధాంతం. అది అమృతమయం, ఆనందమయం, పరిశిష్టం, సిద్ధమైనది. కనుక తాము చెప్పిన అనుమాన ప్రమాణంచే కల్పిత భేదాన్ని సాధిస్తారా? అనుమాన ప్రమాణం వలన సిద్ధసాధన జరుగటం లేదని తెలుస్తున్నది. జీవేశ్వరుల కలయిక కల్పితమని, వ్యావహారికమని అంగీకరించితే, జీవేశ్వరుల ఏకత్వాన్ని అంగీకరించాలి. పరమేశ్వరునిచేత జీవుడు నియమింపబడినాడనే వాదాన్ని ఏ విధంగా సమర్థిస్తారు? భేదం వ్యావహారికమని అంగీకరించితే జీవుడు, ఈశ్వరుడు ఒకే కాలంలో ఉండటం, ఈశ్వరునిచే ప్రేరేపించబడటం మొదలైన అంశాలన్నీ యథార్థ తత్త్వంలో జీవబ్రహ్మలకు ఏ భేదం లేదని తెలుస్తున్నది. ఆ అభేదాన్నే తత్త్వమసి ఉపదేశిస్తున్నది.

104. **శ్రీ మండనమిశ్రుడు:** ఘటాదు లందలి భేదం ఆత్మజ్ఞానం చేత నశించేది కాదు. ఒకవేళ ఆత్మజ్ఞానం చేత జీవుడు వేరు, బ్రహ్మం వేరు అనే భేదబుద్ధి నశించినా, ఘటాదులయందుండే బ్రహ్మభేద దృష్టి నశించదు. ఈ ప్రతిపాదనను తాము అంగీకరించటం లేదు. "బ్రహ్మ నిరూపిత స్వజ్ఞానాబాధ్య భేదభావత్త్వం......." - ఆత్మజ్ఞానంచే ఘటాదుల యందుండే బ్రహ్మ భేదం నశించటం లేదు. ఈశ్వరునకు ఘటాదులకు పరమార్థ భేదమే ఉంది. ఆత్మజ్ఞానంచే ఘటాదులలో భేదం బాధించనందున, ఇది అనుమాన ప్రమాణ స్వరూపం. ఈ అనుమాన ప్రమాణ స్వరూపం చేత ఆత్మజ్ఞానాన్ని ఘటాదుల యందు అంగీకారంగా (ప్రతీయమానమైన) బ్రహ్మభేదం నశించటం లేదు. కనుక ఘటాదులకూ బ్రహ్మమునకూ ఆత్మజ్ఞానం వలన బ్రహ్మఘటాదిగత భేదం ప్రకాశిస్తున్నది.

105. **శ్రీ శంకరులు:** పండితవర్యా! తాము చూపదలచిన అనుమాన ప్రమాణమందు, సుఖదుఃఖాది ద్వంద్వాలతో కూడిన ఆత్మను తెలుపదలచారా? లేక సుఖదుఃఖాలు లేని ఆత్మను చెప్పదలచారా? మొదటి పక్షం మాకు ఎల్లప్పుడూ అంగీకారయోగ్యమే. అజ్ఞాన దశయందు భేదం తప్పక

ఉంటుంది. ఇక్కడ అనుమాన ప్రమాణం వర్తించదు. సుఖదుఃఖాది ద్వంద్వాలు లేని జ్ఞానాన్ని చెప్పదలచారా? జీవునకు సుఖదుఃఖాది ద్వంద్వాలు తెలిసేటప్పుడు పరిపూర్ణ జ్ఞానం కలుగక ఘటాదులందూ, బ్రహ్మమందూ భేదం తెలుస్తుంటుంది. సర్వ దృశ్యాలు స్ఫురిస్తూనే ఉంటాయి. (నేను పరమాత్మనన్న బోధ కలుగదు) కనుక దానిని వ్యవహార కల్పితంగా అంగీకరిస్తున్నాము.

ఇక రెండవ పక్షాన, ఆత్మజ్ఞానంచే అజ్ఞానం నశించి ఘటాదులు ప్రతీయమానాలు గాక సర్వభేదాలు నశిస్తున్నవి. దృశ్యాలన్నీ నశిస్తున్నవి. కనుక నీ అనుమాన ప్రమాణం వర్తించటం లేదు.

అంటే ఆత్మజ్ఞానంచే సర్వభేదదృష్టీ నశించి ఘటాదులకూ, బ్రహ్మానికీ ఎట్టి భేదం లేదని తెలుసు కనుక అనుమాన ప్రమాణం వర్తించదు. సర్వజ్ఞత లేని చోటులన్నింటిలోనూ భేదాశ్రయ తత్త్వముంటున్నది; వ్యాప్తి చెందుతున్నది. అట్లే ఆత్మజ్ఞానం వలన జీవునిలో బ్రహ్మభేద భావం నశిస్తుంది; వ్యాప్తి జరుగదు. కాబట్టి బ్రహ్మజ్ఞానంచే సర్వభేదాలు నశిస్తున్నవి.

106. **శ్రీ మండనమిశ్రుడు:** ఓ యోగివర్యా! తాము జీవేశ్వరులకు కల్పిత భేదాన్ని, ఘటాదులకూ ఈశ్వరునికీ అకల్పిత భేదాన్ని వచించారు. మేమట్లేగాక, జీవేశ్వరులకు నిరుపాధిక భేదాన్ని, జీవుని యందు (బ్రహ్మ నిరూపిత) భేదాశ్రయత్వాన్నే అంగీకరిస్తున్నాం. కనుక నిరుపాధిక భేదతత్త్వం సాధ్యమవుతుంది. అందువలన ఘటానికి ఈశ్వరునికి భేదమున్నట్లే, జీవునికి ఈశ్వరునికి భేదమున్నదని మా నిశ్చితాభిప్రాయం.

107. **శ్రీ శంకరులు:** ఘటేశ్వర భేదం అజ్ఞానం చేత కల్పించ బడినది. అది సత్యం కాదు. ఆత్మజ్ఞానం ఉదయించగానే ఆ భేదం నశిస్తున్నది. ఆత్మ పరబ్రహ్మంకన్న భిన్నం కాదు. చైతన్య స్వరూపుడవటం వలన అనుమాన ప్రమాణం చేత జీవేశ్వరుల ఏకత్వం సిద్ధిస్తున్నది. ఆత్మా, పరబ్రహ్మ చిత్స్వరూపులు. భేదం లేదు. తత్త్వమసి మహావాక్య బోధచేత అద్వైత సిద్ధాంతం పరి

పూర్ణంగా సిద్ధిస్తున్నది; శాశ్వతానందం లభిస్తున్నది. ఘటాదులమల్లే జీవుడు జడుడు కాదు; చైతన్యస్వరూపుడు. అందువలన అనుమాన ప్రమాణం వర్తించదు. ఘటేశ్వరుల దృష్టాంతం అవిద్యచేత పరబ్రహ్మానికి భేదం కల్పిత మవుతున్నది. నిజానికి ఆ భేదం లేదు. అంతేగాక ఘటాదులు జడాలవడం చేత, దృశ్యాలవడం చేత మిథ్యలవుతున్నవి. శాశ్వతాలు కావు. విచారించితే ఆత్మ స్వయంప్రకాశకమని, పరబ్రహ్మాంశమని శ్రుతి తెలుపుతున్నది. కనుక తాము ప్రతిపాదించిన అసర్వజ్ఞత్వ హేతువు ఆత్మచిత్తవడం వలన పరబ్రహ్మ భేదరహితం. కనుక అనుమాన అసిద్ధమయింది.

108. **మండనమిశ్రుడు:** ధర్మం కలది ధర్మి. దాని జ్ఞానం చేత జీవభేదం బోధింపబడదు. దీనిని బ్రహ్మ విషయంలో కూడా సాధించడం మాకు ఇష్టం. బ్రహ్మ సంసార రహితత్వం అనే ధర్మం కలది. దాని జ్ఞానం చేత జీవ భేదం తొలగిపోదన్న మాట.

బ్రహ్మజ్ఞానం చేత జీవభేదం బాధింపబడుతుంది. కుండ మొదలయిన వాటి జ్ఞానం చేత భేదం బాధింపబడదు అని మీ అభిప్రాయం. (ఇలా మీ అభిప్రాయానికి, మా అభిప్రాయానికి భేదం ఉన్నందువల్ల 'సిద్ధించిన దానిని సాధించుట' అనే దోషం ఉండదు. ( సిద్ధసాధన దోషం ఉండదు.) ఘటాది జ్ఞానం చేత జీవ భేదం బాధింపబడకపోవడం మీకూ అంగీకారమే. కనుక మేం చెప్పిన దానికి దృష్టాంతం ఉంది. (దృష్టాంత హాని అనే దోషం లేదు.)

109. **శ్రీ శంకరులు:** ఆ జీవభేదం సంపూర్ణ ధర్మిజ్ఞానంచే బాధింపబడనిదిగా ఉందా? కొంత ధర్మిజ్ఞానంచే బాధింపదగనిదిగా ఉందా? ఘటాదికమునందు, బ్రహ్మమునందు ఆత్మ భేదం ఒకటిగానే ఉన్నందువల్ల పూర్వం చెప్పిన దోషం మరల వచ్చింది.

(కుండ మొదలయిన వాటికి ఆత్మకు భేదం కనబడుతోంది. బ్రహ్మకు ఆత్మకు ఆ భేదమే గోచరిస్తోంది. బ్రహ్మజ్ఞానం వల్ల బ్రహ్మకు ఆత్మకు భేదం తొలగిపోయినట్లే, కుండ మొదలయిన వాటికి, జీవాత్మకు ఉండే భేదం కూడా పోతోంది. అపుడు దృశ్యం లేని అఖండ జ్ఞానమే ఉంది.

పరబ్రహ్మం తప్ప మఱి ఒకటి లేదు. ఘటాది జ్ఞాన దృష్టాంతం లేనందువల్ల దృష్టాంత హాని దోషం కలుగుతోంది.

110. **శ్రీ శంకరులు:** ధర్మి పదంచే నిర్గుణ పరమాత్మ చెప్పబడినదా? సగుణ పరబ్రహ్మ వివక్షింపబడుతున్నాడా? సగుణ పరబ్రహ్మపక్షమును గూర్చి చెప్పబడినచో జీవాత్మల భేదం అంగీకరించబడింది. నిర్గుణ పరబ్రహ్మ రెండు విధాలుగా దోషం సంభవిస్తున్నది. ఈ రెండవ పక్షాన సిద్ధసాధన రూప దోషం సంభవించింది. కాబట్టి ధర్మి పదంచే సగుణ నిర్గుణ పరమాత్మలను గ్రహించినా దోషం సంభవిస్తుంది.

111. **శ్రీ శంకరులు:** (నిర్గుణ బ్రహ్మమందు రెండు వికల్పాలను చూపి శ్రీశంకర భగవత్పాదులు వాటిని ఖండిస్తున్నారు.) నిర్గుణ బ్రహ్మజ్ఞానంచే బ్రహ్మాత్మ భేదం తొలగిపోదని మీరు చెప్పారు. ఈ నిర్గుణ బ్రహ్మం ప్రమాణాలచే సిద్ధించిందా? సిద్ధించలేదా? నిర్గుణ బ్రహ్మం ప్రమాణాలచే సిద్ధించకపోతే భేదానికి ఆశ్రయమయిన బ్రహ్మమే సిద్ధించనందువల్ల ఆశ్రయాసిద్ధి అనే దోషం కలుగుతోంది.

భేదానికి ఆశ్రయమయిన పరబ్రహ్మం ప్రమాణసిద్ధమయితే, ప్రమాణములయిన వేదాంత వాక్యాలు జీవాత్మ బ్రహ్మలకు అభేదాన్ని తెల్పడం చేత జీవాత్మ బ్రహ్మలకు భేదాన్ని చెప్పడం వేదాంత ప్రమాణ విరుద్ధ మవుతుంది.

112. **శ్రీ మండనమిశ్రుడు:** యతివరేణ్యా! “ద్వాసుపర్ణా......” అనే శ్రుతి వాక్య మొకటి ఉంది. అందు కర్మఫలాన్ని అనుభవించే జీవునకు, కర్మ ఫలమనుభవించని పరమాత్మకూ భేదం స్పష్టంగా ప్రతిపాదించబడినది. జీవేశ్వర ఏకత్వాన్ని బోధించే తత్త్వమసి వాక్యం కన్నా, ఈ ‘ద్వాసుపర్ణా’ అనే శ్రుతి వాక్యం బలవత్తరమవటం చేత జీవేశ్వర భేదం స్పష్టమైనది. ఉపనిషత్తులందు ఇలా వచించబడినది: ఒక వృక్షంమీద (శరీరమందు) అందమైన రెక్కలు గల రెండు పక్షులు (జీవేశ్వరులు) సఖ్యంతో జీవిస్తున్నవి. అందు జీవుడనే పక్షి కర్మఫలాల ననుభవిస్తున్నది. ఈశ్వరుడుగా ఉన్న పక్షి కర్మఫలాలను భుజింపక సాక్షిగా మాత్రమున్నది. జీవుడు కర్మఫలాలచేత

సుఖదుఃఖాది ద్వంద్వాలను పొందుతున్నాడు. ఈశ్వరుడు కర్మఫలాల ననుభవింపక సాక్షిగా ఉండి సుఖదుఃఖాల ననుభవింపక సర్వసాక్షియై ఉన్నాడు. కనుక తత్త్వమసి ప్రమాణం కాదు.

113. **శ్రీ శంకరులు:** నయతత్త్వజ్ఞా! ముండక శ్రుతి జీవేశ్వరుల భేదాన్ని ప్రతిపాదించటం లేదు. ప్రమాణాంతరాలచే లభించే అర్థంలో శ్రుతుల తాత్పర్యాన్ని శాస్త్రం అంగీకరించటం లేదు. అంగీకరిస్తే తాత్పర్యం లేని వేదంలోని అర్థవాదవాక్యాలన్నీ విధి వాక్యాల మల్లే ప్రమాణాలవుతవి. అంటే ముండక శ్రుతికి భేదమందు తాత్పర్యం లేదు. తాత్పర్యం లేని అర్థ వాద వాక్యాలు స్వార్థంలో అప్రమాణమయ్యేట్లే, శ్రుతివాక్యాలు అప్రమాణా లవుతున్నవి. కనుక శ్రుతిభేద విషయంలో ప్రమాణ మేవిధంగా అవుతుంది?

మోక్షాన్ని కోరక స్వర్గాన్ని ఎవరు కోరుకొంటున్నారో వాడు మృత్యువునే పొందుతున్నాడని శ్రుతివాక్యం. ముండక శ్రుతి భేదాన్ని ప్రతిపాదించటం లేదు. ఈ భేదం ప్రత్యక్షమని అంగీకరించటం చేత భేదం శ్రుతి ప్రమాణం కాజాలదు. భ్రాంతి కాలంలో ముత్యపుచిప్ప వెండిలా తెలుస్తున్నది. అదే విధంగా ఈశ్వరుని యందు జీవుడు గోచరిస్తున్నాడు. కనుక జీవేశ్వర భేదం భ్రాంతి కల్పితమవుతుంది. కనుక ఈ భ్రాంతి కల్పితమైన భేదంలో శ్రుతి ప్రమాణం వర్తించదు. శ్రీ జైమినీ మహర్షి కూడా అర్థం తెలియబరచని సందర్భాలందు శ్రుతి ప్రమాణాన్నే స్వీకరించారు. అట్టి సందర్భాన తాము శ్రుతి విరుద్ధంగా వచించవచ్చా? అలా ముండక శ్రుతి తత్త్వమసి శ్రుతిని బాధించదు. ఇది సిద్ధాంతం.

114. **శ్రీ మండనమిశ్రుడు:** యతివర్యా! తాము ప్రమాణాంతరంచే గ్రహించదగిన అర్థం అపూర్వత్వం లేనందున నిరపేక్ష ప్రమాణమైన శ్రుతి ప్రవర్తించదని పలికినారు. అట్టి సందర్భాలలో శ్రుతి వాక్యం ప్రమాణం కాదని సిద్ధాంతీకరించారు. స్మృతి అర్థానికి విఘాతం కలిగినప్పుడు శ్రుతివాక్యాలు స్వీకరించదగ్గవి. స్మృతులంటే తపోధనులు, మహర్షులు, మహాత్ములు వేదసారాన్ని వేదార్థాలను స్మరించిన రూపాలు. ఈ స్మృతులకు ప్రమాణాలు ఉపనిషత్తులవుతున్నవి. అందువలన స్మృతి ప్రమాణాలకన్న

శ్రుతి ప్రమాణాలు శిరోధార్యమని స్పష్టమయింది. ఆ విధంగా ఆలోచిస్తే "క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత" మొదలైన స్మృతులందు జీవబ్రహ్మైక్యాన్ని ప్రతిపాదించారు. అదే తత్త్వాన్ని తత్త్వమసి అనే వాక్యం కూడా బోధిస్తున్నది. ఈ భగవద్గీతా స్మృతి అర్థానికి మూలముగ అభేద శ్రుతియైన తత్త్వమసి వాక్యమున్నది. కనుక శ్రుతి వాక్యమైన తత్త్వమసి కూడా "క్షేత్రజ్ఞం చాపి" అనే భగవద్గీతా స్మృతిని సమర్థిస్తున్నది. ఆ ప్రకారంగా, ప్రత్యక్ష ప్రమాణం చేత జీవబ్రహ్మ భేదం సిద్ధించినా అదే అర్థాన్ని ప్రతిపాదించే ''ద్వాసుపర్ణా'' అనే భేదశ్రుతిని కూడా ప్రమాణంగా స్వీకరింపవచ్చు. "ద్వాసుపర్ణా" అనే శ్రుతి భేదాన్ని స్పష్టంగా ఉపదేశిస్తున్నది. ద్వాసుపర్ణా అనే శ్రుతి జీవేశ్వర భేదప్రతిపాదనలో ప్రబల ప్రమాణమవు తున్నది.

115. **శ్రీ శంకరులు:** ఓ పండితవర్యా! ప్రమాణమంటే అజ్ఞాతార్థాన్ని (గూఢార్థాలు) తెలిపేదని అర్థం. స్మృతులందు విపులంగా వివరించినప్పుడు ఇక శ్రుతులతో పనిలేదు. ఎందుకంటే శ్రుతులు ఏ అర్థాన్ని తెలుపుతున్నవో ఆ విషయాన్నే స్మృతి వాక్యాలు కూడా విపులంగా వివరిస్తున్నవి. అందువలన శ్రుతులను మరల ప్రమాణంగా తీసుకొనవలసిన అవసరం లేదు. అంటే సందేహాలు కలిగినప్పుడు మాత్రమే శ్రుతులను సంప్రదించవచ్చు. సామాన్యులు కూడా జీవేశ్వరుల భేదాన్ని సులభంగా తెలుసుకొంటున్నారు. కనుక ఈ ప్రత్యక్ష ప్రమాణం చేత తెలియబడిన విషయానికి 'ద్వాసుపర్ణా' అనే శ్రుతి వాక్యం ప్రమాణం కాజాలదు. యథార్థానికి వేదార్థాలను గ్రహించిన మహర్షులు జీవేశ్వర భేదాన్ని ఖండించి ఏకత్వాన్నే సమర్థిస్తున్నారు.

116. అంతేకాక 'ద్వాసుపర్ణా' అనే శ్రుతి జీవేశ్వరులను వచించటం లేదు; కర్మఫలమనుభవించే బుద్ధిని (భోక్త) తెలుపుతున్నది. 'ద్వాసుపర్ణా' అనే వాక్యం బుద్ధి కంటె పురుషుని వేరుగా జేసి పురుషునకు సుఖ దుఃఖాది సంసార రాహిత్యాన్ని ప్రతిపాదిస్తున్నది. జీవుడు సంసారి కాదు; పరిశుద్ధ చైతన్యాత్మక పరమాత్మ అని సిద్ధాంతం చేస్తోంది.

117. **శ్రీ మండనమిశ్రుడు:** యతివరా! బుద్ధి జడపదార్థం. జడ పదార్థం సుఖదుఃఖాలనుభవించజాలదు. కనుక "ద్వాసుపర్ణా" అనే శ్రుతి సర్వజ్ఞుడైన పరమేశ్వరుని, అల్పజ్ఞుడైన జీవుని గూర్చి మాత్రమే చెప్పుచున్నది. లోకంలో చైతన్య పదార్థాలకే సుఖదుఃఖాదులు సంభవిస్తున్నవి. ప్రత్యక్ష విరుద్ధమైన పదార్థాలను తెలుపుచున్నదనినచో "ద్వాసుపర్ణా" అనే శ్రుతి కూడా మీ అభిప్రాయము నంగీకరించి ప్రమాణం కాదు. కాబట్టి ఈ శ్రుతి జీవేశ్వరులనే వచిస్తున్నదవటం సమంజసం. "యజమానః ప్రస్తరః" అనే శ్రుతివాక్యాన్ని అనుసరించి కంబళి యజమానుడనే వాక్యం ప్రశంసను తెలిపే వాక్యమే కాని స్వతంత్ర ప్రమాణం గాక మరొక విధివాక్యంతో అన్వయించి క్రత్వంగోపయోగి అవుతున్నది. అదే ప్రకారం యీ శ్రుతే జీవేశ్వరులను వదలి అర్థాంతరమైన బుద్ధి జీవులను తెలిసిన యెడల అప్రమాణ మవుతుంది. కాబట్టి యీ శ్రుతి జీవేశ్వరులనే తెలుపుతూ స్వతంత్రంగా ప్రమాణమవుతోంది.

118. **శ్రీ శంకరులు:** విద్వాంసుడా! 'ద్వాసుపర్ణా' అనే శ్రుతి అర్థాన్ని పైంగ్య రహస్యబ్రాహ్మణం చక్కగా వ్యాఖ్యానించినది. "తయోరన్యః పిప్పలం....." బుద్ధి రుచికరమైన కర్మ ఫలాన్ని భుజిస్తున్నది. మరొకడైన జీవుడు సాక్షిగా ఉండి (అనుభవించక) చూస్తున్నాడు. వీరిద్దరూ సత్త్వ జీవులు. అందుచేత ద్వాసుపర్ణా అనే శ్రుతి సత్త్వజీవపరమని స్పష్టంగా తెలుస్తున్నది.

119. **శ్రీ మండనమిశ్రుడు:** యతీశ్వరా! "స్వాద్వత్తి - సత్త్వం" అనే ప్రయోగం ద్వారా సత్త్వపదం శరీరంలో ఉండే జీవుని గూర్చి చెబుతున్నది. "సత్త్వక్షేత్రజ్ఞౌ, అభిపశ్యతిజ్ఞం" అనే ప్రయోగం ద్వారా క్షేత్రజ్ఞ, జ్ఞశబ్దాలు జ్ఞానరూపుడైన పరమాత్మను తెలుపుతున్నవి. కనుక ఆ పూర్వోక్త బ్రాహ్మణంలో సత్త్వం శారీరవాచకమై జీవుని, క్షేత్రజ్ఞ శబ్దము పరమాత్మనూ చెప్పుచున్నవి. కాబట్టి ద్వాసుపర్ణా శ్రుతి సత్త్వజీవ పరార్థ బోధకము కాదు.

120. **శ్రీ శంకరులు:** ఓ విద్వాంసుడా! "తదేతత్స త్త్వం....." అనే బ్రాహ్మణ వాక్యంలో, సాధనమైన అంతఃకరణ ద్వారా స్వప్నం గాంచేవాడే

ఈ సత్త్వం. ఎవరు శరీరంలో సాక్షిగా ఉంటున్నాడో అతడే క్షేత్రజ్ఞుడు. సత్త్వం క్షేత్రజ్ఞులంటే చిత్తం, జీవుడు అని తెలుసుకోవాలి. ఇదే ఆ బ్రాహ్మణం తాత్పర్యం. కనుక ద్వాసుపర్ణా శ్రుతి ఆ బుద్ధి జీవులనే పేర్కొంటున్నది.

121. **శ్రీ మండనమిశ్రుడు:** "యేన స్వప్నంపశ్యతి" అనే ప్రయోగంలో 'యేన' అనే ప్రయోగం వలన స్వప్నాన్ని చూసేవాడు కర్త అని భావించాలి. అంటే ఆ కర్త జీవుడనీ, క్షేత్రజ్ఞ శబ్దం చేత ఈశ్వరుడు సాక్షియనీ గ్రహించాలి. ఈ విధంగా బ్రాహ్మణం జీవేశ్వరుల భేదాన్నే తెలుపుతున్నది.

122. **శ్రీ శంకరులు:** వ్యాకరణ రీత్యా కర్తగాని, కరణం గాని తిఙ్చే చెప్పబడనప్పుడు తృతీయ వచ్చును. "యేన స్వప్నం పశ్యతి" అనే వాక్యంలోని తిఙ్ ప్రత్యయం చేత కర్త అయిన జీవుడు చెప్పబడుట లేదు. కావున కర్తయైన జీవుడు చిత్తంచే స్వప్నాన్ని చూస్తున్నాడని అర్థం. శరీరంలో ఉండే ద్రష్ట అనే విశేషాన్ని ప్రతిపాదించటం చేత శరీరంలో సాక్షిగా ఉండే జీవుడు అని అర్థం. అంతేకాని, సర్వవ్యాపకుడైన ఈశ్వరుడు కాదు. సకల శాస్త్రజ్ఞుడవైన ప్రజ్ఞాశాలీ! వ్యాకరణాన్ని విరుద్ధంగా వ్యాఖ్యానించవద్దు. కనుక సత్త్వ శరీరపదాలు బుద్ధి, జీవుడు అని గ్రహించాలి.

123. **శ్రీ మండన మిశ్రులు:** ఓ యోగీ! శరీరమున ఉంటున్నాడు అనే అర్థంలో శారీర పదమునకు అర్థం కుదురుతుంది. కాబట్టి సర్వ వ్యాపకుడగుటవల్ల శరీరమందున్న ఈశ్వరుడు శారీర పదంచే ఎందుకు చెప్పబడడు?

124. **శ్రీ శంకరులు:** అంతటా వ్యాపించి ఉండడంవల్ల ఈశ్వరుడు శరీరమందు, ఇతర ప్రదేశములందు కూడా ఉన్నాడు. కాబట్టి శారీర పదంచే ఎలా చెప్పబడతాడు? ఆకాశం అంతటా వ్యాపించి ఉండడం వల్ల శరీరమునందు కూడా ఉంది. అయినా ఆకాశాన్ని ఎవరూ శారీరపదంచే చెప్పడం లేదే!

125. **శ్రీ మండనమిశ్రుడు:** ద్వాసుపర్ణా అనే వాక్యం జీవేశ్వరులకు కాక, బుద్ధిజీవులకు వర్తిస్తుందంటే, కర్మఫలానుభవం చైతన్య పదార్థమే అనుభవించాలి. అచేతన పదార్థం అనుభవింపజాలదు. జడమైన బుద్ధి

సుఖదుఃఖాత్మకమైన కర్మఫల మనుభవిస్తుందని శ్రుతి వచిస్తుందా? ఈ భోక్తృత్వ ప్రతిపాదిక అయిన శ్రుతి ప్రమాణమవుతుందా?

126. **శ్రీ శంకరులు:** సహజంగా ఇనుములో దహించే గుణం లేదు. కాని అగ్నితో చేరడం చేత ఇనుముకు కూడా దహించేశక్తి కలుగుతున్నది. అదేవిధంగా జడమైన బుద్ధి చైతన్యంతో చేరి చైతన్యవంతంగా ప్రకాశిస్తూ సుఖదుఃఖాల ననుభవిస్తున్నది. అంటే పరమాత్మ సంయోగం చేత బుద్ధిలో కర్మఫల భోక్తృత్వం సంభవిస్తున్నది.

127. **శ్రీ మండనమిశ్రుడు:** కఠవల్లీ శ్రుతి యందు ఋతం పిబన్తౌ అనే వాక్యం బ్రహ్మవేత్తలైన మహానుభావులు, జీవాత్మ పరమాత్మలను ఎండ నీడ వంటి వారని తెలుపుతున్నారు. కనుక జీవుడు ఈశ్వరుడు ఒక్కరు కారు. జీవుడు కర్మఫలభోక్త కాగా, కర్మఫలాన్ని అనుభవింపజేసేవాడు పరమేశ్వరుడు. కాబట్టి వారిరువురికి ఏకత్వం సంభవించటం లేదు. ఆ విధంగా అభేదాన్నే తెలుపుచున్న తత్త్వమసి వాక్యం ప్రమాణం కాదు.

128. **శ్రీ శంకరులు:** 'ఋతం పిబన్తౌ' అనే కఠవల్లి శ్రుతివాక్యం జీవేశ్వరులకు వ్యవహారసిద్ధమైన భేదాన్ని తెలుపుతున్నది. అజ్ఞానావస్థలో జీవేశ్వరుల భేదం తెలుస్తుంది. ఇది తెలిసిన విషయమే. ఇదివరకు తెలియని అర్థాన్ని తెలుపటం చేత అభేద శ్రుతి 'అజ్ఞాత జ్ఞాపకత్వం' కలది విశేషార్థం బోధిస్తుంది. అందువలన వ్యవహారసిద్ధమైన భేదప్రతిపాదక శ్రుతి బలమైనది కాదు. యథార్థం కాని భేదాన్ని ఆ శ్రుతి బోధిస్తున్నది. తత్త్వమసి శ్రుతివాక్యం అపూర్వార్థాన్ని జీవేశ్వరుల అభేదాన్ని స్పష్టంగా బోధిస్తున్నది. కనుక బలిష్ఠమైనది. కాబట్టి అభేదశ్రుతి భేదశ్రుతిని బాధిస్తుంది.

129. **శ్రీ మండనమిశ్రుడు:** "ఋతం పిబన్తౌ" అనే కఠవల్లీ శ్రుతి ప్రత్యక్షప్రమాణం చేత సమర్థనీయమై జీవేశ్వర భేదాన్ని స్పష్టం చేస్తున్నది. ఇక తమ జీవేశ్వర అభేద ప్రతిపాదనలు ప్రత్యక్షమయినవి కాదు; అనుమాన ప్రమాణం చేత సిద్ధించలేదు; ఉపమితి ప్రమాణం చేత కూడా సిద్ధం కాదు. అందువలన తత్త్వమసి ప్రతిపాదనం బలహీనమైనది; కనుక తత్త్వమసి వాక్యార్థాన్ని గ్రహింపక, కఠవల్లీ శ్రుతి వాక్యాన్నే ప్రత్యక్షంగా గ్రహించాలి.

130. **శ్రీ శంకరులు:** ఓ పండితవరేణ్యా! ఇతర ప్రమాణాలు శ్రుతులకు ప్రాబల్యాన్ని కలిగించలేవు. ఇతర ప్రమాణాలచే తెలిసిన అర్థాన్ని తెలపడంచేత ఆ శ్రుతులకు దౌర్బల్యమే కలుగుతుంది. (తెలియని అర్థాన్ని తెలపడం చేతనే వేదానికి వేదత్వం సిద్ధిస్తోంది. ప్రత్యక్షాది ప్రమాణాలకు శ్రుతి తోడుగా ఉండి వాటికి బలాన్ని కలిగిస్తుంది. కాని శ్రుతి ప్రమాణానికి ఇతర ప్రమాణాలు బలం కలిగించలేవు.)

131. శ్రీ శంకరులు చెప్పిన యుక్తులు దృఢంగా శోభిల్లాయి. వాక్కులకు దేవత అయిన సరస్వతీదేవి అవతారం ఉభయ భారతి శ్రీ శంకరుల వాదాన్ని అంగీకరించింది. భర్త అయిన మండన మిశ్రుని సంతోషసారాన్ని ఆకర్షించినట్లు అతడు సన్యాసం తీసుకోవాలని ఆమే చెప్పింది. శంకర మండన మిశ్రుల వాదానికి ఆమే సాక్షిగదా! ఆమె శంకరుల వాదాన్ని ప్రశంసిస్తూ తన చేతితో సుగంధం కల పూల తరంగాలను ప్రవహింపజేసింది.

**లఘు సమీక్ష:** బాగుగా విచారించితే అద్వైత, ద్వైత, విశిష్టాద్వైతాలు మూడు సిద్ధాంతాలకూ జీవేశ్వర తత్త్వమే ముఖ్యమైనదని తెలుస్తున్నది. జీవేశ్వర భేదాన్ని ఉపనిషత్తులు ప్రతిపాదిస్తున్నవని ద్వైతవాదుల మతం. జీవేశ్వర భేదాన్ని ఖండించి శ్రీ శంకరులు అభేదాన్ని స్థాపించారు. అదే అద్వైత మతం. ఈశ్వర ప్రకృతులను, చిద్విశిష్ట జీవుని అంగీకరిస్తూ ఉపని షత్తుల నుదహరించే వారు విశిష్టాద్వైతులు. ఈ మూడు సిద్ధాంతాలకు మూలం ఉపనిషత్తులే. వాటి నాధారం చేసుకొని శ్రీ వ్యాసులవారు సూత్రీ కరించి బ్రహ్మసూత్రాలను రచించారు. అన్ని ఉపనిషత్తులచే ప్రతిపాదించబడి మూడు మతాల వారికి అంగీకారయోగ్యమైన బ్రహ్మవిద్యాస్వరూప తత్త్వమే బ్రహ్మసూత్ర మహాగ్రంథం. బ్రహ్మసూత్రాలకు యథార్థమైన అర్థమగు అద్వైతతత్త్వ స్థాపనకై పరమశివుడు శ్రీ ఆదిశంకరాచార్య రూపంలో అవత రించారు. అట్లే బ్రహ్మదేవావతారుడైన శ్రీ మండనమిశ్రుని కర్మకాండతత్త్వాన్ని శతధా ఖండించి జీవబ్రహ్మల అభేదాన్ని స్థాపించారు. ఈ అభేద తత్త్వజ్ఞానం

చేతనే సర్వసంశయాలు నశించి అఖండ పరిపూర్ణ సచ్చిదానంద పరమాత్మ స్వరూప స్థితి కలుగుతున్నది. జీవుని జీవత్వం నశించటం చేత సాక్షాత్పరమశివుడవుతున్నాడు. ఇదే యథార్థ తత్త్వం, శివం, కైవల్యం, ఆనందం, పరిపూర్ణం. శ్రీ శంకర భగవత్పాదుల వారు దృఢమైన యుక్తులచేత, ఉపనిషత్ప్రమాణాల చేత జీవబ్రహ్మ అభేద తత్త్వాన్ని స్థాపించారు.

132. శ్రీ శంకర భగవత్పాదులు సర్వశాస్త్రార్థాలను యుక్తియుక్తంగా నిరూపించగా శ్రీ సరస్వతీదేవి ఎంతో సంతోషించింది. తన భర్తయైన మండనమిశ్రుని మెడలో స్వయంగా అలంకరించిన పూలహారం వడలి పోయింది. శ్రీ శంకరుల కంఠమందలి పూలహారం కించిత్తు కూడా వాడక అభ్యుదయంతో ప్రకాశించింది. ఆ విధంగా ఆమె నోటితో ప్రకటించకుండానే శ్రీ శంకరులను విజేతగా ప్రకటించింది. తరువాత ఆమె ఆదరంతో శ్రీ శంకర మండనమిశ్రులను భిక్షకు ఆహ్వానించింది.

133. **శ్రీ ఉభయభారతీదేవి:** శ్రీ శంకరులను మహేశ్వరునిగా గుర్తించి తన వృత్తాంతాన్ని ఇలా తెలిపింది: "ముందొక నాడు కోపిష్టియైన దుర్వాస ముని వేదోచ్చారణంలో స్వరం తప్పిపోగా నవ్వినాను. అందు కా ముని కోపించి నన్ను భూలోకంలో జన్మించమని శపించాడు. తరువాత శాప విమోచనకై ప్రార్థించగా, పరమశివులైన తమకు వాదమందు జయం కలిగే సమయంలో నాకు శాపవిముక్తి కాగలదని తెలిపాడు. కాబట్టి ఓ యతివరేణ్యా! నా శాపకాలం తీరింది. నేను బ్రహ్మలోకానికి వెళతాను."

134. శ్రీ శంకర భగవానులు తమ అద్వైత సిద్ధాంతాన్ని స్థాపించి మతైక్యత సాధింప శ్రీ సరస్వతీదేవిని కూడా వాదమందు జయింపదలచిరి. అందులకై శ్రీ శంకరులు వనదుర్గా మంత్రాన్ని పఠించి శ్రీ సరస్వతీదేవి బ్రహ్మలోకానికి తరలిపోకుండా నిలిపివేశారు. ఆ మంత్రం చేత శ్రీ సరస్వతీ దేవిని అక్కడే ఉండేట్లు ప్రార్థించారు. తమ అద్వైత సిద్ధాంత ప్రతిష్ఠాపనార్థం సరస్వతీదేవిని నిలిపివేసి ఆమె నిలా ప్రార్థించారు.

135. శ్రీ శంకరులు శ్రీ సరస్వతీదేవిని యిలా స్తుతించారు: ఓ జగజ్జననీ! పూజ్యురాలవైన నీవు బ్రహ్మదేవుని సహధర్మచారిణివి. త్రిపురాసుర

సంహారియైన మహేశ్వరుని సోదరివి. లక్ష్మి, పార్వతీ మొదలైన మూర్తు లన్నీ నీ అంశలే. ఇప్పుడు ప్రపంచాన్ని ఉద్ధరించడానికి శ్రీ ఉభయ భారతీదేవిగా అవతరించితివి. బ్రహ్మవిద్య అంటే సాక్షాత్తూ సరస్వతీదేవియే.

136. శ్రీ శంకరులు శ్రీ సరస్వతీదేవితో ఇలా పలికారు: ఓ జననీ! నేను తమ పరమ భక్తుడను. తిరిగి తమరు బ్రహ్మలోకానికి పోవడానికి నేను అంగీకరించేవరకూ భూలోకమందే ఉండవలసినదని ప్రార్థిస్తున్నాను. నా ప్రార్థన మన్నించి నన్ననుగ్రహింపుము.

ఈ ప్రకారం శ్రీ శంకరులు శ్రీ శారదాదేవిని ప్రార్థించగా ఆమెకూడా అందుకు అంగీకరించింది. తరువాత శ్రీ శంకరులు తమ దయాదృక్కులను శ్రీ మండనమిశ్రులపై ప్రసరింపజేశారు. శ్రీ మండనమిశ్రుల ముఖారవిందం అమితోత్సాహంతో ప్రకాశించింది.



# సర్గము - 9

## శ్రీ శంకరుల సర్వజ్ఞత

1. శ్రీ శంకరాచార్య మండనమిశ్రుల జ్ఞానకర్మకాండల సంవాదం సుదీర్ఘంగా సాగింది. శ్రీ శంకరుల వాదనాపటిమకూ యుక్తులకూ శ్రీ సరస్వతీదేవి తన ఆనంద ఆమోదాలను వ్యక్తం చేసింది. ఆమె శ్రీ శంకరుల కంఠమందలి పుష్పహారం వాడకుండా ఉండటం చేత, శ్రీ మండనమిశ్రుల పరాజయమూ, శ్రీ శంకరుల విజయమూ నోటితో చెప్పకే ప్రకటించింది. శ్రీ మండనమిశ్రుని అహంకారం పూర్తిగా పతనమయింది. కర్మ సిద్ధాంతం అడుగంటింది. అయినా సంశయం వీడక శ్రీ శంకరాచార్యులను ఈ విధంగా ప్రశ్నించాడు.

2. **శ్రీ మండనమిశ్రుడు:** ఓ యతిశ్రేష్ఠా! నాకు ఇదివరకెన్నడూ కలుగని పరాజయం కలిగినా, నేను విచారించటం లేదు. సర్వలోక పూజ్యుడూ, సర్వజ్ఞుడూ అయిన శ్రీ జైమిని మహర్షి వాక్యాలు కూడా ఖండించబడినవి కదా అని కడు విషాదంగా ఉన్నది.

3. **శ్రీ మండనమిశ్రుడు:** శ్రీ జైమిని మహర్షి లోకగురువై వేద మార్గాన్ని స్థాపించినవాడు. వేదాలు, వేదార్థాలు తెలిసినవాడు. వేదాధ్యయనాన్ని విధిపూర్వకమైన కర్మలను ఆశిస్తూ, వేదార్థాలను వ్యాఖ్యానిస్తూ లోకహితం కోరినవాడు. అంతేగాక ఆ మహనీయుడు త్రికాలజ్ఞుడు. అటువంటి మహనీయుడు వ్యర్థమైన సూత్రాలను వ్రాయజాలడు. కాని తాము ఈ రోజు వేదాంతార్థాలు పరమసత్యాలని చెప్పుట జైమిని అభిప్రాయానికి విరుద్ధంగా ఉంది. కాబట్టి నిశ్చితార్థాన్ని తెలుపండి.

4. **శ్రీ శంకరులు:** పండితవర్యా! జైమిని మహర్షి బోధలను శంకించ వద్దు. ఆయన మహనీయుడు, సర్వజ్ఞుడు. వేదార్థాలు బాగా తెలిసిన వాడు. వేదాలకు విరుద్ధంగాను, వ్యర్థంగాను ఏ ఒక్క సూత్రాన్ని రచించలేదు.

ఆయన రచనలందలి గూఢార్థం తెలియని వారు విరుద్ధంగా మాట్లాడు తున్నారు. కర్మకాండతత్పరులైన వారు కర్మపరమైన సూత్రాలచే ఆకర్షితులవు తారు. అలాగే వేదాంతతత్పరులు జ్ఞానార్హతను కలిగించే కర్మ కాండలను ప్రవర్తింపజేశారు.

5. **శ్రీ మండనమిశ్రుడు:** యతివరేణ్యా! వేదాలను, వేదార్థాలను బాగా తెలిసిన మహాత్ములకు కూడా బోధపడని నిగూఢ తత్త్వం జైమిని మహర్షి సూత్రాలలో ఉన్న పక్షంలో వాటిని నాకు తెలియజేయండి. నా పట్ల కారుణ్యం చూపండి. నా కా తత్త్వాన్ని తెలియజేయండి. తమ సూక్తి జాతమంతా గ్రహించి హృదయంలో పదిలపరచుకొంటాను. శ్రీ జైమిని మహర్షి తత్త్వం ఎరిగిన పండితులమన్న గర్వం, అహంకారం మా నుండి తొలగించండి.

6. శ్రీ జైమిని మహర్షి సర్వజ్ఞుడు. వేదాంతార్థాన్ని బాగా ఎరిగినవాడు. పరతత్త్వంలో పరిపక్వత చెందని వారిని, విషయాసక్తులై ఈ లోకమే సత్యమని నమ్మికొన్న పామరజనులను ఉద్ధరింపదలచారు. అటువంటి పామర జనులకు, పరలోకం ఒకటి ఉన్నదనీ, అక్కడ సుస్థిరమైన సుఖాలు పొంద వచ్చునని తెలుపుతూ వేద పూర్వకాండలో ప్రతిపాదించిన కర్మకాండను గూర్చి తెలిపారు. ఈ తత్త్వాన్ని ఆధారం చేసుకొనే ఉపనిషత్తులలో నిష్కామ కర్మయోగాన్ని మొట్టమొదటగా తెలియజెప్పారు. ఆ తరువాత ధ్యాన జ్ఞానయోగాదులను ఉపదేశిస్తున్నారు. ఈ విధమైన సాధనాక్రమంలో అంతా జీవబ్రహ్మైక్యాన్ని ప్రతిపాదించారు. దీనినే కైవల్యమనీ, శాశ్వతానంద పదవి అనీ, పరమశివమనీ చెబుతున్నారు.

7. మునులు, మహర్షులు వేదమార్గాన్ని అనుసరిస్తూ వేద విరుద్ధంగా ప్రవర్తించరు. శ్రీ జైమిని మహర్షి కూడా వేదార్థాలను సూత్రాల ద్వారా ప్రతిపాదించారు. "తమేతం ....." అనే శ్రుతి "ఆ పరమాత్మను సత్పురుషులు యజ్ఞాల చేత, వేదాధ్యయనం చేత, దానం చేత, తపస్సు చేత తెలుసుకోవడానికి ఇష్టపడుతున్నారు" అని తెలిపింది. తపస్సు, ధ్యానం, అనుష్ఠానం మొదలైన కర్మల వలనా, బ్రహ్మచర్యాది ధర్మాల చేతా మనస్సు

నిశ్చలమై, పవిత్రతత చెందుతుంది. బ్రహ్మజ్ఞానం పట్ల రుచిని కలిగిస్తుంది. కనుక బ్రహ్మజ్ఞానం పొందగోరేవారు తప్పక సత్య, బ్రహ్మచర్యాది ధర్మాలను పాటించాలి. ఈ తత్త్వాన్నే "తమేతం" అనే శ్రుతి వాక్యం స్పష్టం చేస్తున్నది. తదనంతరం ఆత్మ విచారణచే ఆత్మజ్ఞానం ఉదయిస్తున్నది. ఈ అభిప్రాయాన్ని మనస్సులో ఉంచుకొనే అహింస, బ్రహ్మచర్యాది ధర్మాలను తప్పక ఆచరించా లని శ్రీ జైమిని మహర్షి ప్రబోధించారు. కాని బ్రహ్మచర్యాద్యనుష్ఠానమే సాక్షాత్తు మోక్షసాధనమనో, కర్మయే మోక్షఫల మిస్తుందనో చెప్పలేదు. అంతేకాని కర్మమార్గమే మోక్ష హేతువని ప్రతిపాదించటం అత్యంత సాహసమే అవుతుంది. అది ప్రవచనం కాదు; ప్రలాపమే అవుతుంది.

8. **శ్రీ మండనమిశ్రుడు:** యతివర్యా! వేదంలో "ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్యమతదర్థానాం" అనే సూత్రవాక్యాన్ని శ్రీ జైమిని మహర్షులు రచించారు. అంటే "యాగాది ధర్మాలే ముఖ్య ప్రయోజనాన్నిచ్చేవి. సద్ధర్మాలతో కూడిన కర్మలే సార్థకతను సిద్ధింపజేస్తవి. పరబ్రహ్మ ప్రతిపాదకాలైనవన్నీ నిష్ప్రయోజనా"లని జైమిని మహర్షి సూత్రవాక్యం. వేదం, సద్ధర్మ ఆచరణను, కర్మకాండనే ప్రతిపాదిస్తున్నది. వేదం పరబ్రహ్మాన్ని ఉపదేశించటం లేదు. వేదం బ్రహ్మచర్యాది ధర్మాన్ని, యాగాది కర్మాచరణనే బోధిస్తున్నది. అట్టి సత్కర్మానుష్ఠానాల చేత పుణ్యలోకాలు ప్రాప్తిస్తున్నవి. అట్టి సత్కర్మానుష్ఠానాల చేత పుణ్యలోకాలు లభిస్తాయి. ఇలా క్రియార్థాలు కాక, సిద్ధవస్తువు ప్రతిపాదకాలయిన శ్రుతులు నిరర్థకమవుతున్నవి. శ్రీ జైమిని మహర్షులు పై సూత్రం ద్వారా స్పష్టంగా ఇలా ప్రతిపాదించారు.

9. **శ్రీ శంకరులు:** వేదాలు పరంపరగా అద్వైతాన్ని బోధించేవే. కర్మలకు ఫలం ఆత్మజ్ఞానం కాబట్టి వేదాలు కర్మలను గూడా తెలిపాయి. కనుక జైమిని కర్మకాండలో గల క్రియాపరములని తన సూత్రాలచే తెలిపాడు.

10. **శ్రీ మండనమిశ్రుడు:** వేదరాశి అంతా సచ్చిదాత్మపరమే అని జైమిని ముని అభిప్రాయమయితే ఆయన కర్మయే ఫలప్రదాత అని చెప్పి, ఈశ్వరుని కూడా ఎందుకు నిరాకరించాడు?

11. **శ్రీ శంకరులు:** శ్రీ జైమిని మహర్షి వేదప్రమాణమైన పరమేశ్వరుని నిరాకరించలేదు. "ఇదం జగత్......" కర్తతో కూడి కార్యరూపమైన ఈ జగత్తుకు (ఘటాది అనుమాన ప్రమాణంచేత) ఈశ్వరుడు ఉన్నాడని తార్కికులు తెలుపుతున్నారు. ఈ అనుమాన ప్రమాణంచే వేదవాక్యాలను అపేక్షింపకే పరమేశ్వరుడున్నాడని ప్రతిపాదిస్తున్నారు. ఆ అనుమాన సిద్ధ పరమాత్మను వేదం అనువదించేది మాత్రమేనని కాణాదులు (వేదవిదులు కానివారు) తెలుపుతున్నారు.

12-13. ఉపనిషత్తు చేత పరబ్రహ్మ తెలిసికొనదగినది. "వేదమును తెలిసికొననివాడు పరబ్రహ్మను తెలిసికొనలేడు' అని వేదవాక్యాలు తెలుపుతున్నాయి. కావున కాణాదులు చెప్పిన అనుమాన ప్రమాణము పరమాత్మ నెలా తెలుపగలదను భావాన్ని మనస్సులో బెట్టుకుని, యుక్తులతో ఈశ్వరుని తెలిపే అనుమాన ప్రమాణాన్ని జైమిని ఖండించాడు. ఈశ్వరుని నుండి జగత్తు ఉత్పత్తిని, ప్రళయాన్ని, ఈశ్వరుని నుండి కర్మలకు ఫలం లభించడాన్ని కూడా ఆయన నిరాకరించాడు.

14. **శ్రీ శంకరులు:** శ్రీ జైమిని మహర్షి వేదవేదాంత విరుద్ధంగా ఏమీ తెలిపి ఉండలేదు. ఆయన రచనలను సరిగా అర్థం చేసికోనివారు 'నిరీశ్వరవాది అనీ, కర్మవాది అనీ' పలుకుతున్నారు. అది యథార్థం కాదు.

15. **శ్రీ శంకరులు:** శ్రీ జైమిని మహర్షి అనుమాన ప్రమాణాన్ని సూత్రీకరించినంతమాత్రాన ఆ మహామునిని నిరీశ్వరవాది అని పలుకటం న్యాయం కాదు. ఆయన బ్రహ్మవిద్వరేణ్యుడు. రాత్రి పూట సంచరించే గుడ్లగూబల వంటి జీవులు పగటి వేళలందు చెట్ల తొర్రలలోను, గుహలలోను నివసించినంతమాత్రాన పగలు రాత్రి అవుతుందా? అట్లే ఆ మునీశ్వరుని యథార్థాభిప్రాయం గ్రహింపని పండితుల ప్రేలాపనలు సర్వవేద భాస్కరుడైన ఆ మునిని కించపరచలేవు. శ్రీ జైమిని మహర్షులు సర్వవేదార్థ తత్త్వజ్ఞులు, సేశ్వరవాదులని తెలుసుకోవాలి.

16. ఈ విధంగా శ్రీ శంకరాచార్యుల వారు శ్రీ జైమిని మహర్షుల నిగూఢ తత్త్వాన్ని తెలుపగా, వేదాంతార్థాలను నిస్సంశయంగా తెలుసు

కొని శ్రీ మండనమిశ్రుని వేదన నశించి ప్రామాణ్యబుద్ధి ఇనుమడించింది. ఉభయభారతీదేవి, సభాసదులును మహదానందం పొందారు.

17. శ్రీ శంకరుల వేదాంతార్థాలను తెలుసుకొన్నా, శ్రీ మండన మిశ్ర పండితుని సంశయాలు నిశ్శేషంగా నశింపనందున శ్రీ జైమిని మహర్షిని మనస్సున ధ్యానించాడు. తరువాత ఆ జైమిని తపోధనుడు ఆ మండనమిశ్ర పండితునికి సాక్షాత్కరించి యిలా పలికాడు.

18. శ్రీ జైమిని మహర్షి శ్రీ మండనమిశ్రునితో ఇలా పలికారు: ఓ పండితప్రవరా! శ్రీ వేదవ్యాసమునిసత్తముడు సర్వ వేదార్థాలను గ్రహించి బ్రహ్మసూత్ర గ్రంథం రచించారు. ఆ వేదార్థాలను విస్తరింపజేయడానికి శ్రీ శంకర యతీంద్రులు భాష్యం వ్రాశారు. శ్రీ శంకరులంటే సర్వ వేద, వేదాంగ, వేదాంత అర్థాలన్నీ యథార్థంగా గ్రహించి ప్రతిపాదించిన ప్రజ్ఞాశాలురు. ఆ విధంగా వారు శ్రీ వ్యాసుల వారికి శిష్యులై, అటు బ్రహ్మసూత్రాలను, ఇటు జైమిని సూత్రాలను గ్రహించి యథార్థంగా అర్థం తెలిపిన మహాత్ములు. కనుక ఈ శంకర యతీశ్వరుల విషయమై సంశయాలు పరిత్యజించు. శంకరుల సూక్తి జలాలు పరమ ప్రమాణాలై వెలయుచున్నవి. ఈ మహాత్ముడు నా (జైమినీ) సూత్రజాలాలకు ఏ అర్థాన్ని వివరించి తెలిపాడో అదే నా హృదయమని తెలుసుకో. అదే సత్యం.

19. ఓ పండితవర్యా! ఈ శంకరులు సర్వసంయమి చక్రవర్తి. నా హృదయాన్ని పూర్తిగా ఎరిగినవాడు.

సర్వ వేదాంత అర్థాలను, వేదాంగ శాస్త్రాల రహస్యాలను సంపూర్ణంగా ఎరిగిన వాడు. అంతేగాక ఈతడు భూత భవిష్యద్వర్తమానాలను తెలిసినవాడు. ఈ విధంగా ఈతడు సకల శాస్త్ర వేద వేదాంత శ్రుతుల రాసి. ఇటువంటి వ్యక్తి లోకంలో మరొకరు లేరు. కేవలం ఆ మహేశ్వరుని అవతారమే.

20. పండితవర్యా! శ్రీ వేదవ్యాసులవారు వేదాంత వాక్యాలన్నిటికీ పరబ్రహ్మ తత్త్వాన్ని సిద్ధాంతీకరించారు. ఈ తత్త్వమంతా చిద్రూప పరబ్రహ్మ తత్పరత్వమే; జ్ఞానతత్త్వం కాక మరొకటి కాదు. నేను కూడ ఆ మహర్షి అనుగ్రహానికి పాత్రుడనై బ్రహ్మజ్ఞాన సంపన్నులలో అగ్రగణ్యుడనైనాను.

కనుక వేదాంత విరుద్ధంగా ఒక్క వాక్యం కూడా నేను పలుకజాలను. శ్రీ వేదవ్యాసులు అపర నారాయణావతారులు. నేను వారి శిష్యుడనై సర్వాన్ని నిస్సంశయంగా గ్రహించాను. నేను ఆ అర్థాలనే తెలుపుతూ సూత్రాలు వ్రాశాను. లోకంలో వివేకం నశించి చిత్త నిశ్చలత కోల్పోయి నాస్తికమత ప్రచారం ప్రబలుతున్నది. వారి నందరిని నిలువరించి జనులకు జ్ఞానార్హత కలిగించడానికి బ్రహ్మచర్యాది సద్ధర్మాలను, పుణ్యకార్యాది అనుష్ఠానాలను, వేదాధ్యయనాదులను బోధిస్తూ సూత్రాలను వ్రాశాను. వేదవిరుద్ధంగా ఒక వాక్యం కూడా వ్రాయలేదు. నా రచనల తాత్పర్యమంతా పరబ్రహ్మాన్ని గూర్చే అని తెలుసుకో.

21. ఓ సుస్థిర యశోనిధీ! నీ సంశయాలన్నీ కట్టిపెట్టు. ఈ శంకరులు సంసార సాగరాన మునిగిన జనులను ఉద్ధరించడానికి వచ్చిన పరమ శివుడని తెలుసుకో. ఈ పరమ రహస్యాన్ని నీకు తెలియజేస్తున్నాను, గ్రహించు.

22. ఓ సుమతీ! శ్రీ శంకరులు అద్వైత మతాన్ని లోకంలో సుస్థిరం చేయడానికి ఏతెంచిన పరమశివుడు. నువ్వు ఆయన అద్వైత మత ప్రచారంలో పాల్గొను. సులభంగా సంసార సాగరాన్ని దాటు. కృతయుగంలో శ్రీ కపిలాచార్యులు సత్పురుషులకు జ్ఞానం ఒసగారు. త్రేతాయుగంలో శ్రీ దత్తాత్రేయులు వేదాంత తత్త్వజ్ఞానాన్ని బోధించారు. ద్వాపరయుగంలో ప్రజ్ఞాశాలియైన శ్రీ వ్యాస భగవానులు వేదాంతార్థాలను, బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించారు. కలియుగంలో శ్రీ శంకరులు ఉపనిషద్విద్యయైన బ్రహ్మవిద్యను బోధిస్తున్నారు.

23. అంతట శ్రీ జైమినీ మహర్షులు శ్రీ శంకరాచార్యుల వారిని మనస్సులోనే ఆలింగనం జేసుకొని ఎంతో సంతోషించి అంతర్ధానమయ్యారు. తరువాత ఆ మండనమిశ్ర పండితుడు శ్రీ శంకరుల పాదపద్మాలందు తల ఉంచి ఈ విధంగా ప్రార్థించాడు.

24. **శ్రీ మండనమిశ్రుడు:** మహాత్మా! సర్వలోకాలకు కారణభూతుడవు; సర్వసముడవు. నాబోటి సంసారుల నుద్ధరింప అవతరించిన కరుణామూర్తివి.

సాక్షాత్తూ పరమశివుడవు. సర్వ జగత్తుకు చైతన్యస్వరూపుడవైన పరమశివుడే తాముగా ఉన్నారని తెలుసుకొన్నాను.

25. **శ్రీ మండనమిశ్రుడు:** ఓ యతివరేణ్యా! తాము అవతరించి బ్రహ్మతత్త్వాన్ని స్థాపించటం చేత, నాస్తికుల వాదాలకు అడ్డుకట్టపడినది. తాము అద్వైత తత్త్వాన్ని ప్రతిపాదించకుంటే లోకం అంధకారకూపంలో పడివుండేది. వారి శుష్క వాక్యాల చేత బ్రహ్మవిద్య అడుగంటి ఉండేది. బ్రహ్మవిద్యకు ఇట్టి దుస్థితి కలుగకుండా రక్షించితివి.

దేశంలో మూడు మతాలు వేదమార్గాన్నే అనుసరిస్తూ, ఉపనిషత్తులనే ప్రమాణంగా స్వీకరించినా, లక్ష్యంలో భేదమేర్పడినది. అట్టి సమయంలో తాము జీవబ్రహ్మైక్యాన్ని తత్త్వమసి అనే మహావాక్యం చేత తెలుసుకొని, ఆ ప్రమాణంచే ద్వైత మతాన్ని ఖండించారు. పదునైన ఆయుధంచే జీవబ్రహ్మ భేదవాదా లన్నిటినీ తుత్తినియలు గావించారు. అజ్ఞానాన్ని ధ్వంస మొనర్చి జ్ఞానాన్ని స్థాపించినారు. కేవలాద్వైతతత్త్వమే పరమ శివం, కైవల్యం.

26. **శ్రీ మండనమిశ్రుడు:** స్వప్నంలో ఉపస్వప్నాలు సంభవిస్తుంటాయి. అంటే ఒక స్వప్నం నుండి మేల్కొని జాగ్రదవస్థకు రాకుండానే మేల్కొన్నానని స్వప్నావస్థలోనే భ్రాంతి చెందుతూ మరొక స్వప్నం లోనికి జారుకోవడం. ఈ విధంగా భ్రాంతి నశించక పోవటం వలన యథార్థ జ్ఞానం లేనివారు కర్మవశులై స్వర్గాది లోకాలను పొందటమే 'ముక్తి' అని తలస్తున్నారు. వీరు మోహవశులై, అవివేకులై సంసార పాశబద్ధులై జననమరణాలందు చిక్కుకొంటున్నారు. కర్మ, యోగోపాసనల చేత లోకాంతర గమనం చేస్తూ మరల భూలోకంలోనే జన్మిస్తున్నారు. (స్వప్నం నుండి) జాగ్రదవస్థకు వచ్చిన తరువాత పూర్వం పొందిన స్థితి స్వప్నమనీ, కల్పితమనీ తెలిసే విధాన, బ్రహ్మజ్ఞానముదయించిన తరువాత, సమస్త దృశ్యాలు, పరలోక గమనాలు శాశ్వత సౌఖ్యాలు కావని తెలుసుకొంటారు. దృశ్యమంతా నశించేదనీ, బ్రహ్మ మొక్కటే సత్యమనీ తెలుసుకొంటారు. పరమ గురువైన శ్రీ శంకరుల దర్శనం చేతా, సంవాదం చేతా, జైమిని మహర్షి అనుగ్రహం

చేతా తత్త్వమసి మహావాక్య బోధయే సత్యమూ, శాశ్వతమైనదనీ తెలుసు కొన్నాను.

27. **శ్రీ మండనమిశ్రుడు:** జీవబ్రహ్మల భేదాన్ని ప్రతిపాదిస్తూ తత్త్వమసి వాక్యార్థాన్ని గ్రహింపనైతిని. కర్తృత్వ భోక్తృత్వాది రూప భేద భ్రాంతిని కలిగి ఉన్నాను.

ఓ బ్రహ్మ విద్వరిష్ఠా! తమ అనుగ్రహం చేత దృశ్యరూప పూర్వకమైన సంసారం సారం లేనిదని గ్రహించాను. తత్త్వమస్యాది మహావాక్యాల ద్వారా తాముపదేశించిన జీవబ్రహ్మైక్య జ్ఞాన మహిమచేత సిద్ధించిన పర బ్రహ్మమే శాశ్వతమైనదని తెలుసుకొన్నాను. మోక్షమంటే జనన మరణ రహితమైన పరమానంద ప్రాప్తి అని తాము సూత్రీకరించారు. ఈ పరతత్త్వాన్ని విశ్వసింపక కేవలం భేదవాద ప్రలాపాన్నే ముక్తిగా భావిస్తున్నారు. స్థిరం కాని లోకాంతరగమనం ముక్తి అని తలుస్తున్నారు. తమ అనుగ్రహం చేత సంశయాలన్నీ నశించినవి. జీవత్వ భావం నశించి శివత్వం స్థిరపడింది. అద్వైతమే శాశ్వతానందమని తెలుసుకొని అమితంగా సంతోషిస్తున్నాను. శ్రీ పరమ గురువరుని అనుగ్రహంచే శిష్యుడు పొందే స్థితిని అనుభవిస్తున్నాను.

28. **శ్రీ మండనమిశ్రుడు:** ఓ పరమగురూ! రాక్షస స్త్రీలచే చుట్టుముట్టబడినది, శ్రీరామునికి ప్రియమయినది అయిన సీతాదేవిని చూచి వచ్చిన హనుమంతుడు జనులకు ప్రశంసనీయుడు. అవిద్య అనే రాక్షసి మ్రింగిన పరమేశ్వరుణ్ణి (ఆత్మను) ఆ రాక్షసి పొట్టచీల్చి దాని పొట్టలో నుండి వేగంగా తీసుకువచ్చిన మీ మహత్త్వమెంతటిదో!

29. ఓ సర్వలోకార్తిహరా! సర్వేశ్వరా! బ్రహ్మానందాన్ని ప్రసాదించే మహానుభావా! తమను శరణువేడుతున్నాను. ఈ దాసుని అపరాధాలన్నీ మన్నించండి. మీ స్వరూపతత్త్వం తెలియక పామరుని మల్లే ప్రేలాపన చేశాను. కనుక కరుణాసాగరుడవైన నువ్వు నా యందు అనుగ్రహముంచి, విజ్ఞానతత్త్వ దృష్టిని ప్రసరింపజేయండి.

30. ఓ యతిశ్రేష్ఠా! వేదతత్త్వ నిర్ణయం ఇతరులకు సాధ్యమయ్యేది కాదు. సాంఖ్యతత్త్వకర్తలైన శ్రీ కపిలాచార్యులూ, న్యాయదర్శన కర్తలైన

శ్రీ గౌతమ మహర్షులూ, వైశేషిక దర్శన ప్రణేతలైన కణాదమునివర్యులూ, యోగశాస్త్రకారులైన పతంజలి మహర్షులూ అపరిమిత ప్రతిభాశాలురైనా, శ్రుతుల యథార్థ గూఢార్థాలను తెలియరైరి. ఈ ప్రకారం యథార్థ తత్త్వాన్ని తెలియకపోవడం చేతనే ద్వైతమతాన్ని స్థాపించారు. తమరు కేవలం శివస్వరూపులవడంతో ఆ శ్రుతి తత్త్వ యథార్థాన్ని గ్రహించారు. నేను సర్వశాస్త్రాలను అధ్యయనం చేసినా, అద్వైత తత్త్వాన్ని తెలియకుంటిని. తమ సాన్నిధ్యంచే ఈ తత్త్వాన్ని గ్రహింపగలిగాను.

31. శ్రీ కపిల, కాణాద, గౌతమాది మహర్షులు వేదార్థాలను ప్రతిపాదించినా, దృశ్య ప్రబోధకాలవడం చేత మానసిక మోహాంధకారాన్నే ప్రతిపాదించారు. ఆ విధంగా దృశ్య ప్రబోధకాలవడం వలన వేదాంత తత్త్వం మరుగున పడింది. అందువలన ముక్తి పదవికి యోగ్యం కాకపోయింది. ద్వైతబుద్ధినే ప్రవర్తింపజేయడం చేత శాశ్వతానందం (ముక్తి) లభ్యం కాకపోయింది. ఉపనిషత్తులచే ప్రతిపాదించబడిన తమ సర్వవృత్త్యుపశమరూప సూక్తులవల్ల సర్వ తాపాలు పోయి అఖండజ్ఞానం ఉదయిస్తున్నది. శ్రీ శంకరుల సుధా సూక్తులు ఉపనిషత్తుల గూఢార్థాలను తెలియబరచేవై, సర్వభేదాలను హరించేవై, జీవబ్రహ్మైక్యాన్ని ప్రబోధిస్తున్నవి.

32. శ్రీ శంకర సూక్తి ప్రవాహం ప్రవహించడానికి ముందుగా దేశమంతా నాస్తికులచే నిండిపోయింది. భూభారం అధికమై మాలిన్యంతో నిండి ఉంది. నాస్తిక ప్రభావం చేత దేవాలయాలు పడగొట్టసాగారు, దేవతా ప్రతిమలను విరుగగొట్టసాగారు. గోవులను నిర్దాక్షిణ్యంగా చంపారు. భూమండలమంతా యవన దేశీయులచే ఆక్రమించబడినది. హిందూ మతం అడుగంటింది. దేశమంతటా పరమాత్మతత్త్వాన్ని దూషించే నాస్తికులు ప్రబలిపోయారు. వైదికతత్త్వం పూర్తిగా నశించింది. సూక్తులు తెరమరుగై దురుక్తులు ప్రబలినాయి. ఈ పరిస్థితులకు నా మనస్సెంతో చింతిల్లి వికల హృదయుడనైనాను. ఇట్టి సమయంలో భూదేవి అదృష్టవశాన, మాలిన్య మంతా నశింపజేసి పవిత్ర జలాలచే క్షాళనం గావించబడి భూమాత పరిశుద్ధురాలయినది. పరమాత్మ తత్త్వాన్ని ప్రతిపాదించే తమ నాశ్రయించి

భూమి నాలుగు చెరగుల నుండి శిష్యులు వచ్చి చేరుతున్నారు. వారందరూ శ్రుతి తత్త్వ రహస్యవేదులు; ధన్యాత్ములు. నా హృదయమంతా అమృతా నందంతో విహరిస్తున్నది. శ్రీ శంకరావతారం చేత వైదికతత్త్వమే కాక వేదాంతతత్త్వం కూడా సుస్థిరమై ప్రకాశిస్తూన్నది. కలియుగంలో శుభోదయ మైనది.

33. పరమేశ్వరా! కొందరు పండితులు వేదాలకు విపరీత వాఖ్యానాలను చేశారు. అట్టి వ్యాఖ్యానాలు ప్రజలను సర్పాలమల్లే కాటువేసి ఎంతో బాధించినవి. మహాత్మా! తమ విజ్ఞానమయ సూక్తులే లేకుంటే జనులు అవిద్య చేత మూర్ఛిల్లి తేరుకొనెడివారు కారు.

34. సర్వసంతాపహరా! జనుల దుర్భరమైన సంసార తాపాన్ని తమ విజ్ఞానామృత సూక్తులనే చంద్రకిరణాలు హరిస్తూన్నవి. లోకంలో సూర్యరశ్మిచే కలిగే తాపాలు చంద్ర కిరణాల వలన చల్లారేట్లు శ్రుతి తత్త్వం ఎరుగని సంతప్త హృదయులకు తమ వాక్యసుధలు చంద్రకాంతుల మల్లే ఉపశమనం కలిగిస్తున్నవి.

35. అయ్యో! నేనింతవరకు కర్మకాండను నమ్ముకొన్నాను. కర్మ తత్పరుడనై యజ్ఞయాగాది క్రతువులను, చాంద్రాయణాది వ్రతాలను, తపస్సు, వేదాది శాస్త్రాల అధ్యయనాన్నే ఆచరిస్తూన్నాను. అంతేకాక, భార్యపుత్రులు, సేవకులు సిరిసంపదలున్నందున నా కెలాటి కొరతా లేదని విర్రవీగేవాణ్ణి. సర్వ సౌఖ్యాలు ఉన్నవని సంతోషపడుతున్నాను. అదంతా దురభిమానమని తెలుసుకొన్నాను. సుఖదుఃఖాలు, జననమరణాది ద్వంద్వాలతో కూడిన సంసారంలో తగులుకొని ఉన్నాను. తమ దివ్యబోధ చేత అట్టి అభిమానాలన్నీ నశించాయి. సంసారకూపం నుండి బయటపడ్డాను. పరవస్తు జ్ఞానంచే ధన్యాత్ముడనైనాను. పరమ గురువు సందర్శనం, సంభాషణాదులచే అభిమానం నశించినది.

36. పరమ గురువరేణ్యా! నేను పూర్వజన్మములలో అనేక సుకృతాలు చేశాను. అలా కాని పక్షంలో పరమ కరుణామయులు, జగదీశ్వరులు అయిన తమ సందర్శన భాగ్యం, తమతో సంభాషణం, దివ్యప్రబోధం

ప్రభృతులు లభించవు. శ్రీ సద్గురుని కరుణ సర్వబంధాల నుండి విముక్తుణ్ణి చేస్తుంది.

37. ముందు జన్మలలో చేసుకొన్న పుణ్యఫలం చేత శమదమాదు లను, పరాపర వైరాగ్యాన్ని, తితిక్ష, ఏకాగ్రమయిన మనస్సు, వేదాంత శ్రవణంలో పరమశ్రద్ధ కలుగుతున్నవి. అంతేకాక పరమ గురువుల దర్శనభాగ్యం పొంది దివ్యోపదేశాన్ని కూడా లభింపజేస్తుంది. కనుక ఎన్నో జన్మలనుంచి చేసిన పుణ్యఫలం చేత ఈనాడు సద్గురు దర్శన, శ్రవణ, సంవాద భాగ్యాలు కలిగినాయి. అంతేగాక సద్గురు దర్శన భాగ్యమే, సాధన చతుష్టయ సంపత్తికి హేతువగుతున్నది. వేదాంత సంవాదనార్హతను కలిగించి నది. మనన నిధి ధ్యాసనలచే బ్రహ్మసాక్షాత్కారం పొంది ముక్తుడవుతాడు.

38. మహాత్మా! పరమగురువరేణ్యా! దేవతలు కూడా పరమ శివుడవైన తమ కృపాకటాక్షాన్ని కోరుతున్నారు. జీవుల బంధాలన్నిటినీ తమ జ్ఞాన ఖడ్గం ఒక్క క్షణంలో ఛేదిస్తున్నది. తమ కరుణాకర దివ్యదృష్టి పారినంత మాత్రంచేతనే ధన్యాత్ముడగుచున్నాడు. తమను సేవించేవారు అజ్ఞానం నశించి శాశ్వతానందాన్ని పొందుతున్నారు. మహాపురుషుల అనుగ్రహం సర్వార్థ ప్రదాయకం; పరమ శాంతిమయం.

39. లోకంలో విషయ లోలురు, విషయ విరక్తులు ఉన్నారు. విషయాసక్తులు చంచల మనస్కులై కాంతాలోలురై సంసారంలో దృఢంగా బంధింపబడుతున్నారు. వారు దుఃఖజీవులు. అలాకాక విషయ సుఖాలను త్యజించి, సాధన చతుష్టయం చేత జితేంద్రియులై సద్గురు బోధామృతం గ్రోలేవారు పవిత్రజీవులు, ధన్యాత్ములు. మహాత్మా! ముముక్షువులందరూ తమ జ్ఞానామృతాన్ని పానం చేస్తూ, అజ్ఞానాన్ని హరింపజేసుకొని పరమా నందభరితులవుతున్నారు. కనుక తమ కృపాకటాక్షం సర్వబంధాలను ఛేదించి శాశ్వతానందాన్ని ప్రసాదిస్తున్నది.

40. వేదాంతస్థాపనాచార్యా! పరమహంసాగ్రణీ! తమ వేదాంత సూక్తులను కంఠస్థం చేసుకొని, తత్త్వాన్ని గ్రహించినవారు తక్షణమే పరిశుద్ధులవుతున్నారు. తరువాత జీవబ్రహ్మైక్య తత్త్వాన్ని పొంది అజ్ఞానం

నశించి సంతోషభరితులవుతున్నారు. దేవేంద్రాది పదవులను స్వర్గ సౌఖ్యాలను తిరస్కరిస్తున్నారు. తమ దివ్యప్రబోధం వలన పండితులు సర్వ దృశ్య విషయాలు నశించి ప్రగాఢపర వైరాగ్య సంపన్నులవుతున్నారు. సుకృతముంటేగాని తమ దర్శనం లభింపదు. ఇక తమతో సంభాషణా భాగ్యం గూర్చి ప్రత్యేకంగా చెప్పాలా?

41. మహాత్మవర్యా! భగవంతా! తమ శిష్యులందరూ బుద్ధిని అతిక్రమించి బ్రహ్మతత్త్వ విచారణ చేసి ధీరులైనారు. వారందరూ ధన్యాత్ములు. సర్వప్రకృతి శూన్య ధీరత్వంలో విహరించే ఆ ధీరత్వాన్నే ఉపదేశిస్తూ, శిష్యులను కూడా ధీరులనుగా చేసే మహామహిమా సంపన్నులైన శ్రీ శంకరాచార్యుల వారికి పాదాభివందనం చేస్తున్నాను. నా యీ శరణాగతి చేతనే నా మాయాంధకారాన్ని నాశనం చేసి శాశ్వతానందాన్ని ప్రసాదించండి. అలాకాక కొందరు ఖలులు మాయచే మోహితులై, దేదీప్యమానంగా ప్రకాశించే సూర్యకాంతిని చూడజాలక గుడ్లగూబల్లా గుహలలోనూ, చెట్ల తొర్రలలోనూ దాగుకొంటున్నారు. కనుక ఓ మహాత్మా! తమ దివ్యప్రబోధం మహదానంద దాయకం. తమకు శరణాగతులైనంత మాత్రాననే ముక్తులవుతున్నారు. ఆ విధంగా నేను కూడా తమ తత్త్వాన్ని తెలుసుకొన్నాను, ధన్యుడనైనాను.

42. ఓ శంకరాచార్య స్వామీ! నీ ధ్యానం కల్పవృక్షం. నీ పాదపద్మాలకు వందనం నందనవనం. నిన్ను గురించి (పూజాదులను చేయాలని) సంకల్పించుట కల్పవల్లి. నీ సుగుణాల స్తుతి గంగ. నీ కడకంటి చూపు ప్రసరించడం స్వర్గం. నీ భక్తి ఇలాంటిదని ఆలోచించి సదాచారం గల భక్తులు స్వర్గాన్ని గడ్డిపోచలా చులకనగా చూస్తారు.

43. మహాత్మా! కరుణామయా! జ్ఞానసింధో! తమ పాదపద్మాలను ధ్యానించటం చేతనే అఖండానందం పొందుతున్నాను. ఇంతవరకు భార్య పుత్రాదుల వలనా, సత్కర్మలు చేయటంచేతా స్వర్గసౌఖ్యాలను కోరుకొన్నాను. అవన్నీ అనిత్యమని తెలుసుకొన్నాను. మిమ్మల్ని ఆశ్రయించటం చేత నిజతత్త్వాన్ని తెలుసుకొన్నాను. భార్యాపుత్రులు, యజ్ఞయాగాది కర్మలు, సంపదలు మోక్షానికి ప్రతిబంధకాలని తెలుసుకొన్నాను. కనుక వీటన్నిటినీ

త్యజిస్తున్నాను. తమ పాదపద్మాలనే శరణు పొందుతున్నాను. తమ పాదపద్మాలే భవసాగరాన్ని సురక్షితంగా దాటించే దృఢమైన నౌక. దీనుడనైన ఈ సేవకుని శాసించండి; రక్షించండి.

44. శ్రీ మండనమిశ్రులు శ్రీ శంకరులను స్తుతించి వారికి శరణుజొచ్చి శరణాగతుడయ్యాడు. శ్రీ మండనమిశ్రుల స్తుతి వాక్యాలకు శ్రీ శంకరులు సంతోషించారు. శ్రీ మండనమిశ్రుని అనుగ్రహింపదలచి శ్రీ శంకరులు ఆయన భార్యయైన ఉభయభారతీదేవిని చూశారు. శ్రీ శంకరుల మనోభావాన్ని ఎరిగిన ఆమె శంకరులతో యిలా అంది:

45. మహాత్మా! పరమహంసశ్రేష్ఠా! తాము నా వంక చూడడంలోని అంతరార్థాన్ని నేను పూర్తిగా గ్రహించాను. తాము వేద కర్మకాండను ఖండించి, జ్ఞానమార్గాన్ని సుస్థిరంగా స్థాపించడానికి అవతరించిన పరమశివులు. ఈ సందర్భాన నా జన్మవృత్తాంతాన్ని సంక్షిప్తంగా యీ సభలో తెలియజేస్తాను. వినండి.

46. మహనీయా! యతిప్రవరా! నా చిన్నతనంలో, మెరసిపోయే దేహకాంతితో శరీరమంతా విభూతి పూసుకొని రుద్రాక్షలను ధరించి సాక్షాత్తూ పరమశివునిలా ఉండే మహనీయుడొకడు మా గృహానికి విచ్చేశాడు.

47. నా తల్లి ఆ మహర్షికి భక్తితో నమస్కరించి అర్ఘ్యపాద్యాదుల నొసగి తగిన రీతిగా సపర్యచేసింది. తరువాత ఆ ముని పాదాలకు భక్తి పూర్వకంగా నమస్కరించి నా భవిష్యత్తు గూర్చి తెలుపమని వేడుకొంది.

48. ఓ మహర్షి సత్తమా! తమరు త్రికాలజ్ఞులు. తమకు తెలియని విషయాలుండవు. నా కుమార్తె భవిష్యత్తును తెలుసుకోగోరుతున్నాను. ఓ మహాత్మా! దయానిధీ! నా కుమార్తె వృత్తాంతమంతా ఎలాటి దాపరికం లేకుండా సర్వవిషయాలను వివరంగా తెలుపగోరుతున్నాను, అనుగ్రహించండి.

49. మహాత్మా! నా కుమార్తెకు ఏ విధమైన భర్త లభించనున్నాడు? ఆమెకు కలుగబోయే సంతానం గూర్చి తెలుపవలసింది. నా కుమార్తె ఎంతో ధనధాన్యాలతో, సిరిసంపదలతో వర్ధిల్లగలదా? ఆమె సంపూర్ణ ఆయుష్కురాలేగదా! యజ్ఞయాగాది కర్మలుచేస్తుందా?

50. నా తల్లి నా భవిష్యజ్జీవితాన్ని గూర్చి అత్యంత ఆసక్తితో ప్రశ్నించగా, ఆ యోగీశ్వరుడు కళ్లు మూసుకొని దీర్ఘంగా ఆలోచించి కొద్దిసేపు ధ్యానంలో గడిపాడు. తరువాత నా విషయమంతా గ్రహించినవాడై అతి గోప్యమైన యీ విషయాలన్నీ తెలిపాడు.

51. శ్రీ ఉభయభారతీదేవి తన భర్తయైన మండనమిశ్రుడు సాక్షాత్తూ బ్రహ్మదేవుడని తెలుపుతూ, భూమిపై అవతరించడానికి గల కారణాన్ని కూడా వివరిస్తున్నది. లోకంలో వేదవిరుద్ధమైన నాస్తికమతాలు ప్రబలిపోయి వైదిక మార్గం శిథిలమవుతూండడం చేత ఆ వైదిక మార్గాన్ని తిరిగి సుస్థాపితం చేయడానికి బ్రహ్మదేవుడే శ్రీ మండనమిశ్రుని రూపంలో భూమిపై అవత రించాడు.

52. అమ్మా! ఈ బాలిక లక్ష్మీ, పార్వతుల మల్లే పరమ పతివ్రతయై సుస్థిరమైన కీర్తిని గడిస్తుంది. ఈమె అనుకూలుడైన భర్తను పొంది అనేక యజ్ఞాలు చేస్తుంది. అనుకూలవతియైన భార్యయై చక్కని సంతానాన్ని కని చాలాకాలం సుఖాలను పొందుతుంది. లోకంలో భార్య భర్త ఆదరానికి పాత్రురాలవడమూ, భర్తా అనుకూలవతియైన భార్యతో సుఖాలను పొందడమూ బహుదుర్లభం. కాని యీ భారతీదేవి మండనమిశ్రుల విషయంలో అలాగాక పార్వతీపరమేశ్వరుల దాంపత్యం మల్లే, లక్ష్మీనారాయణుల దాంపత్యంలా లోకాన ఆదర్శ దాంపత్యంగా మిగులుతుంది.

53. బ్రహ్మమే శ్రీ మండనమిశ్రునిగా అవతరించి వైదిక మారాన్ని సుస్థిరపరచాడు. కానీ, ఉపనిషత్తుల సారమైన వేదాంత మార్గం భేదవాదుల వలన క్షీణించిపోతుంది. అట్టి వేదాంత మార్గాన్ని సుస్థిరం గావింప జ్ఞాన ప్రబోధం చేస్తూ సాక్షాత్పరమశివుడే లీలామానుష విగ్రహాన్ని ధరించి శ్రీ శంకరాచార్య నామంతో భూమిపై అవతరించనున్నాడు.

54. ఈ బాలిక భర్తయైన శ్రీ మండనమిశ్ర పండితుడు యతిరాజైన శ్రీ శంకర భగవత్పాదులతో చాలాకాలం మహోత్కృష్టంగా సర్వవేదాంతాల గూర్చి వాదోపవాదాలు చేయనున్నాడు. అందు శ్రీ మండనమిశ్రుడు పరాజయ

మొందుతాడు. భార్యాసుతులను, సర్వ సంపదలను పరిత్యజిస్తాడు. సర్వజగత్తులను పావనం చేయడానికి అవతరించిన పరమ శివావతారుడైన శ్రీ శంకరులను శరణు పొందబోతున్నాడు.

55. ఓ మహాత్మా! ఆ మహర్షి చెప్పినదంతా ఇప్పుడు యథార్థమైనది. మహాత్ముల వాక్యాలెన్నడూ అసత్యాలు కావు కదా! అందువలన ఈ పండితవర్యుడు తమకు శిష్యుడై కీర్తిమంతుడు కాగలడు.

56. యతివరా! నేను నా భర్త యందు అర్ధ శరీరమవడంచేత, తమరు ఈ పండితవర్యులను సంపూర్ణంగా జయించలేదు. కనుక నన్ను కూడా వాదనలో జయించి ఈ మహాత్ముని తమ శిష్యునిగా స్వీకరించండి. అదే ధర్మమవుతుంది.

57. మహాత్మా! చరాచర సృష్టి కంతటికీ కారణభూతుడవు. సృష్టి స్థితి లయా లొనరించే పరమశివుడవు. సర్వజ్ఞుడవు. పరమ పురుషుడవు. అట్టి తమతో వాదించాలని మనస్సు తొందరపడుతున్నది. తాము ప్రారంభించిన ఈ పండిత సభను నా వాదంతో పరిసమాప్తం చేయవలసినదని కోరుతున్నాను. నా ధైర్యసాహసాలను మన్నింపగలరు.

58. శ్రీ ఉభయభారతీదేవి పలికిన ఈ పలుకులు విన్న శ్రీ శంకరులు అమితాశ్చర్యానందాలను పొందారు. తరువాత ఆ యతివరేణ్యులు శ్రీ ఉభయ భారతీదేవితో ఇలా అన్నారు.

59. **శ్రీ శంకరులు:** ఓ దేవీ! నాతో వాదించడానికి నీ మనస్సు ఆరాటపడుతున్నదని తెలిపావు. అది యుక్తం కాదు. నా బోటివారు నీతో వాదించడం ధర్మబద్ధం కాదు. అంతేగాక అది నాకు అపకీర్తి కూడా తెచ్చి పెడుతుంది. కనుక నీ కోరికను విరమించుకో.

60. **శ్రీ ఉభయభారతీదేవి:** యతిప్రవరా! తాము పలికిన పలుకులు సమంజసం కావు. విచారించితే నాతోటి వాదన ధర్మవిరుద్ధం కాదు; న్యాయ విరుద్ధమసలే కాదు. తమవంటి వారు వ్యక్తుల బాహ్యలక్షణాలను పరిగణించరు. ఇన్ని మాటలెందుకు? ఎవరు వాద భిక్షువులై ఇతర మతాలను

ఖండింపదలచినా, అట్టివారు స్త్రీలైనా, నపుంసకులైనా, బాహ్యాచిహ్నాలను చూడక వాదంలో జయించాలి. వారి మతాన్ని స్థాపించాలి. ఇందులో దోషం లేదు అప్పుడే సిద్ధాంతం సుస్థిరంగా, చిరస్థాయిగా విరాజిల్లగలదు.

61. మహాత్మా! సమయం వచ్చినప్పుడు మహాత్ములు ఎదుటి వ్యక్తిని గ్రహింపక, వారి పాండిత్యం, వాదనాపటిమ వంటి మహోన్నత గుణాలనే పరిగణిస్తారు. పూర్వం జనకమహారాజు సభలో, నైష్ఠిక బ్రహ్మచారిణియైన గార్గి యాజ్ఞవల్క్యమహర్షితో బ్రహ్మవిద్యావిషయమై మహావాదం చేసింది. ఆ సంవాదంలో ముందెన్నడూ ఎవరూ ప్రశ్నించని విధంగా శ్రీ యాజ్ఞవల్క్య మహర్షిని క్లిష్టమైన ప్రశ్నలు అడిగింది. బ్రహ్మజ్ఞానియైన ఆ మహర్షి సమస్త సంశయాలన్నిటినీ తీర్చి యథార్థ వేదాంత తత్త్వాన్ని బోధపరచారు. ఈ ఉదంతమంతా బృహదారణ్యకోపనిషత్తులో ఉంది. అదేవిధంగా మహా భారతంలో కూడా శ్రీ జనక చక్రవర్తి సులభాయోగినితో గొప్పవాదం చేశాడు. ఇవన్నీ అసత్యాలు కావు. కనుక ఓ మహాత్మా! వాదవిషయంలో సందేహించవద్దు. పాండిత్యంగల వారందరూ వాదన కర్హులే. కాబట్టి నాతో వాదానికి సిద్ధపడండి.

62. శ్రీ ఉభయభారతీదేవి పలికిన పలుకులన్నీ పూర్వకథా దృష్టాంతాలతోను, యుక్తియుక్తంగాను, యథార్థంగాను ఉండడం చేత శ్రీ శంకరులు ఆమెతో వాదానికి తమ అంగీకారం తెలుపుతున్నారు. నదులన్నీ సముద్రాన్ని చేరేట్లుగా, వేదవేదాంత విషయాలన్నింటికీ నిలయమైన, ఆ ద్వైతబ్రహ్మను చేరవలసినదే గదా! అంతేగాక, సర్వవిద్యలకు అధిష్ఠానమైన ఆ సరస్వతీదేవిని జయించితే అద్వైత వేదాంత తత్త్వానికి లోకంలో ప్రతిద్వంది యే లేకపోతాడు గదా అని తలచారు. కనుక ఆ పండిత సభలో ఆమెతో వాదానికి సంసిద్ధులయ్యారు.

63. శ్రీ శంకర, ఉభయభారతీదేవులు వాదానికి అంగీకరించిన తరువాత ఇరువురిలోనూ విజయంపై ఆకాంక్ష ద్విగుణీకృతమయింది. ఇరు వురు ప్రతిభాశక్తి చేత, శబ్దప్రవాహం చేత శ్రోతలందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తారు. వారివాదనలో స్త్రీ పురుష భేదమే తెలియరాలేదు. శ్రీ ఉభయ

భారతీదేవి అంటే సాక్షాత్తూ సర్వవిద్యలకు అధిష్ఠాన దేవతయైన సరస్వతీ దేవియే. అట్లే యతిపుంగవుడైన శ్రీ శంకరులు సాక్షాత్తూ పరమశివుడే. అందువలన తమ వాదనా సామర్థ్యాల చేత విజయాన్ని సాధించాలనే వారి మనోరథం స్పష్టమయింది.

64. అక్కడ ప్రజ్ఞాశాలురైన మహాపండితు లందరూ, వారిరువురి పదగుంభనలు, అర్థగాంభీర్యాన్ని, మృదుమధుర సంభాషణలను, వారు సమకూర్చే ప్రతిపదార్థ సంపత్తితో కూడిన వారి వాద కథాపరంపర లను, చెవుల పండువగా ఆలకించారు. కానీ వారిరువురినీ ఆధిక్యత యందు ఆదిశేషుని గాని, సూర్య భగవానునిగాని, బృహస్పతి గాని సములని భావించలేకపోయారు. మహాప్రజ్ఞాశాలియైన శుక్రాచార్యులను కూడా స్మరించలేకపోయారు. ఎందుకంటే - ఈ వాదం అప్రాకృతం, అభినవం, సర్వోత్తమం, యుక్తిభరితాలయి దేనితోనూ పోల్చి చెప్పలేకపోవడం.

65. ఆ అపర సరస్వతీదేవీ, శ్రీ శంకరావతారుడూ సర్వ వేదవేదాంగాల నుండి ప్రతిపాదింపదగిన విషయాలన్నింటినీ స్పష్టంగా ప్రతిపాదిస్తూన్నారు. సంధ్యావందనాది నిత్యకృత్యాలకు మాత్రం విరామం పొంది తక్కిన సమయమంతా, రాత్రనక, పగలనక పదిహేడు రోజులు వాదప్రతివాదాలను కొనసాగించారు.

66. వారు వాదించే విషయాలన్నీ అలౌకిక పరమాత్మను ప్రతిపాదించే వేదాలందూ, కేవలం నిర్గుణ పరబ్రహ్మ తత్త్వమైన వేదాంత వాక్యాలందూ శిక్షావ్యాకరణాది అంగాలందూ, న్యాయ వైశేషికాది షడ్దర్శనాలందూ బ్రహ్మసూత్రానుసారంగా చర్చించుకొన్నారు. చిట్టచివరగా, ఏ విధంగానూ పరమేశ్వరుడైన శ్రీ శంకరులను జయింపజాలనని శ్రీ ఉభయభారతీదేవి నిశ్చయించుకొంది. అయినా ఏదైనా మార్గాంతరం దొరకకపోతుందా అని వెదుకసాగింది.

67. శ్రీ శంకరులను జయించడానికి శ్రీ ఉభయభారతీదేవి మనస్సులో ఒక ఆలోచన మెరపులా మెరసింది. అది ఏమంటే - "శ్రీ శంకరులు నైష్ఠిక బ్రహ్మచర్యం ఆచరిస్తూ, బాల్యంలోనే సన్న్యసించారు. సర్వదా వేదాంత

శాస్త్రాన్నే విచారిస్తూ, విషయ ప్రపంచానికి దూరమై నివృత్తి మార్గపరాయణులై ఉన్నారు. ఎల్లప్పుడూ పరబ్రహ్మతత్త్వంలోనే విహరిస్తున్నారు. కనుక ఈ మహాపురుషునికి మదన శాస్త్రంలో ప్రవేశమే లేదు. ఆ విద్యలో ప్రవేశమే లేకుంటే ప్రావీణ్యం ఎక్కడ నుండి వస్తుంది? ఇప్పుడే కామశాస్త్ర చర్చ చేత శ్రీ శంకరులను జయింపవచ్చు" అని గట్టిగా నిశ్చయించుకొంది.

68. ఈ విధంగా మనస్సున చింతించినదై ఆ ఉభయభారతీదేవి శ్రీ శంకరులతో కామశాస్త్ర విచారం చేయదలచింది. ఈ విచారం వలన ఈ యతీశ్వరుడు అపజయం పొందగలడని దృఢంగా నిశ్చయించు కొంది.

69. "మహాత్మా! శుక్లపక్షమందు, కృష్ణ పక్షమందు స్త్రీ పురుషులలో కామకళ లేవిధంగా ప్రవర్తిస్తాయి? వాటి స్వరూపమేమిటి? వాటి స్థానాలేవి?" అని ప్రశ్నించింది.

70. ఈ ప్రకారం శ్రీ ఉభయభారతీదేవి కామ శాస్త్ర రహస్యాల గూర్చి ప్రశ్నించగా, శ్రీ శంకరులు వెంటనే బదులు పలుకక, తనలో యిలా యోచింపసాగారు: నేను సమాధానం చెప్పకపోతే అల్పజ్ఞుడననే అపఖ్యాతి ఏర్పడుతుంది. ఒకవేళ బదులు చెబితే యతిధర్మాలకు భంగం వాటిల్లుతుంది. అదొకవైపు, పరమహంసాశ్రమాన్ని స్వీకరించిన నేను ఇలాటి క్షుద్ర ప్రశ్నలకు సమాధానమీయవచ్చా? ధర్మవిరుద్ధంగా ప్రవర్తించానని పెద్దలు ఆక్షేపించవచ్చునని శ్రీ శంకరులు తనలో తానే వితర్కించుకొన్నారు. అందువలననే స్త్రీలతో వాదానికి దిగరాదని పెద్దలు వచించి ఉంటారు.

71. దీర్ఘంగా ఆలోచించిన తరువాత "ఇప్పుడు పరమహంస ధర్మాన్ని తప్పక పరిపాలించాలి; ధర్మాన్ని రక్షించాలి" అని శ్రీ శంకరులు దృఢంగా తలచారు. ఏదైనా ఉపాయం చేత ఈ పరిస్థితి నుండి బయటపడాలను కొన్నారు.

72. శ్రీ శంకరులు శ్రీ భారతీదేవి అడిగిన ప్రశ్నలన్నిటినీ సమగ్రంగా ఆలోచించి ఆమెతో ఇలా అన్నారు: "ఓ భారతీదేవీ! వాదమధ్యంలో తగు మాత్రం వ్యవధి కోరటం సంవాదాలందు పరిపాటే. కనుక ఒక మాసకాలం

వాదానికి విరామమిద్దాం. తరువాత నీ వడిగిన ప్రశ్నలన్నిటికీ సమాధానాల నిచ్చి నీ కామశాస్త్ర నిపుణత్వాన్ని కూడా తొలగిస్తాను.”

73. శ్రీ శంకరులు శ్రీ భారతీదేవి వద్ద ఒక మాసం వ్యవధి పొంది, తన శిష్యులతో కలసి గగన మార్గాన పోసాగారు.

74. శ్రీ శంకరులలా గగన మార్గాన ప్రయాణిస్తూండగా ఒకానొక అరణ్య ప్రదేశంలో ఒక మృత దేహాన్ని చూశారు. ఆ మృతుడు శాప వశాన భూలోకానికి వచ్చిన దేవతలా అమిత తేజోవంతుడై ఉన్నాడు. ఆ మృతదేహంపైబడి ఆతడి రాణులు విలపిస్తున్నారు. ఆ దేహానికి సమీపంలోనే ఆతడి మంత్రులు ఇతర ఉద్యోగులు కూడా దుఃఖిస్తున్నారు. శ్రీ శంకరులా మృతదేహాన్ని చూశారు.

75. ఆ మహారాజు రాత్రి సమయంలో వేటకై తన రాణులతోను పరివారంతోను ఈ అడవి ప్రాంతానికి వచ్చాడు. వేటకై వచ్చిన ఆ అమరక మహారాజు మిక్కిలి శ్రమ చెంది ఒక వృక్షం క్రిందపడి మరణించాడు. తన శిష్యుడైన సనందునితో (పద్మపాదాచార్యులు) శ్రీ శంకరులు యిలా పలికారు.

76. ఓ సనందనా! ఈ మృతుని పేరు అమరక మహారాజు. ఈతడికి దేవకన్యలను మించిన అందచందాలు గల భార్యలు నూరు మంది కన్నా అధికంగానే ఉన్నారు. ఈతడు వారందరితోను సర్వసౌఖాలను అనుభవించాడు. ఇప్పుడాతడు కాలవశాన మరణించాడు.

పరకాయప్రవేశ విద్య ద్వారా నేను ఈ మృతుని దేహంలో ప్రవేశిస్తాను. ఈ రాజ్యానికి ఈతడి కుమారుని పట్టాభిషిక్తుని చేస్తాను. నేనాశించిన ఫలితం పొంది తిరిగి నా యతి దేహంలో ప్రవేశిస్తాను. ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలని నా మనస్సు ఉత్సాహపడుతున్నది.

78. అంతేగాక లావణ్యవతులైన ఈతడి రాణులతో సర్వవిలక్షణమైన శృంగార చేష్టలను నేను 'సోఽహం' స్వరూపుడనై ఉన్నా, సాక్షిగా ఉండి అనుభవిస్తాను, అలా చేయటంవలన లోకంలో నా సర్వజ్ఞత ప్రకటిత మవుతుంది. మహాపురుషులు కూడా సంస్కారం ఎదురైనప్పుడు ఆ విధంగానే ప్రవర్తిస్తారు.

79. శ్రీ శంకరులు పద్మపాదునితో (సనందుడు) ఈ విధంగా చెబుతుండగా, పద్మపాదుడు అత్యంత ఆశ్చర్యాన్ని ప్రకటించాడు. తన సంశయాన్ని మనస్సులో ఉంచుకోరాదని తలచి దృఢ సంకల్పంతో "మహాత్మా! తమరు సర్వజ్ఞులు. తమకు తెలియని దీలోకంలో ఏదీ లేదు. అయినా, గురుభక్తి చేత నేనిలా పలుకడానికి సాహసిస్తున్నాను" అన్నాడు.

80. "పూర్వం మత్స్యేంద్రుడనే మహాత్ముడు పరకాయ ప్రవేశం జేసి, తన నిజశరీర రక్షణకై గోరక్షుడనే శిష్యుణ్ణి నియమించి, మృతుడయిన ఒకానొక రాజు శరీరంలో ప్రవేశించాడు. తరువాత ఆ నగరంలో ప్రవేశించి నిరాఘాటంగా ఆ రాజ్యం పాలించసాగాడు."

81. "ఆ యోగీశ్వరుడు రాజైనది మొదలుకొని ప్రజలందరకూ సకల శుభాలు చేకూరసాగాయి. సకాలమందు వర్షాలు కురిసినవి. పంటలన్నీ చక్కగా పండి రైతులందరూ సుఖశాంతులతో ఉన్నారు. ధర్మం నాలుగు పాదాల నడవసాగింది. ప్రజలు ఈతిబాధలులేక సుఖంగా ఉన్నారు. యజ్ఞయాగాదుల వలనా, ధర్మనిష్ఠవలనా దేవతలు సంతృప్తులైనారు. ప్రజలు దైవంపట్ల భక్తితత్పరులై ఉన్నారు. ఉభయ లోకాలు సంతృప్తమవడం చేత మానవులు, దేవతలు పరస్పరం సఖ్యభావంతో మెలగారు. దీనికంతటికీ ప్రభువే కారణమవుతున్నాడు. ధర్మం రక్షించబడటంచే సర్వమూ సిద్ధిస్తున్నది."

82. "కొంత కాలానికి విజ్ఞానవంతులైన మంత్రులు రాజుగారి దేహంలో ఎవరో మహాత్ముడు ప్రవేశించాడని తెలుసుకొన్నారు. అందువలననే సర్వ శుభాలు జరుగుతున్నవని గ్రహించారు. శాశ్వతంగా దేశం సుఖ శాంతులతో, సిరి సంపదలతో తులతూగుతూండాలంటే ఆ మహాత్ముడు మహారాజు దేహాన్ని విడిచి వెళ్లరాదు. అలా ఉండాలనే తలంపుతో మహారాజును సుఖాసక్తుని చేయాలి. అందులకు ఆటపాటలందూ, శృంగార చేష్టలందూ ఆరితేరిన యువతులను నియోగించారు. మంత్రులు రాజ్యక్షేమం కోరేవారవటంచేత వారలా చేశారు. ఈ విధమైన ప్రేయస్సు, శ్రేయస్సు రెండూ ప్రజలను వరిస్తున్నవి. శ్రేయస్సనేది అందరికీ లభించేది కాదు.

ఎన్నో జన్మల పుణ్య ఫలంచే అది లభిస్తుంది. దీనినే "శ్రేయశ్చ ప్రేయశ్చ" అని కఠోపనిషత్తు వచిస్తున్నది."

83. "సర్వదా నిశ్చల యోగసమాధిలో నెలకొనే ఆ మత్స్యేంద్రుడు విషయాసక్తుడై పరకాయంలో ప్రవేశించాడు. సంగీత, నృత్య, నర్తనాదులకు, ప్రణయకాంతల శృంగార చేష్టలకు వశుడై పరమాత్మను మరచినాడు. మనస్సు విషయాల వైపు మరల్చినాడు. పవిత్ర గంగానది స్వర్గం నుండి పాతాళానికి పోయి పతనమయ్యేట్లు, మహోన్నత చిదాకాశాన విహరించే ఆ మత్స్యేంద్రుడు, పామరుడయ్యాడు. నిర్మల చిద్విహారి అయిన పరమహంసం, కొంగయై బురదలో పడి పొర్లాడుతున్నట్లు ఆ యోగివరుడు పతనం చెందాడు. ప్రమాదవశాన విషయాలందు పడితే ఎంతటి మహాత్ములకైనా ఇట్టి గతే సంభవిస్తుందని తెలుసుకోవాలి."

84. "ప్రియ శిష్యుడైన గోరక్ష మునీంద్రుడు తన గురువైన మత్స్యేంద్రుని దృశ్య విషయాల నుండి మరలించాలని ఉపాయం వెదుకసాగాడు. చివరకు అంతఃపుర స్త్రీలకు నాట్యం నేర్పే గురువుగా అంతఃపురంలో ప్రవేశించాడు." పూర్వకాలంలో గురువునకు విస్మృతి కలిగినప్పుడు శిష్యులు కూడా ఉపదేశించి గురువులను ఉద్ధరించేవారు. అందుచేతనే బ్రహ్మవిద్యా సంప్రదాయం క్షుణ్ణంగాక ఉండినది.

85. "ఈ ప్రకారం గోరక్షకుడు అంతఃపురకాంతలకు నాట్యమందు శిక్షణ నిస్తూ గురువును కలుసుకొనే సమయానికై నిరీక్షిస్తున్నాడు. తదనంతరం గురువును చేరి ఆత్మతత్త్వం ఉపదేశించాడు. దృశ్య విషయాల్లో విరక్తి కలుగేట్లు చేశాడు. గురువును తనచే రక్షింపబడుతున్న గురువు శరీరమందు ప్రవేశింపజేశాడు. శిష్యుని గురుభక్తి చేత గురుదేవుడు సమాధి పొందాడు." ప్రజ్ఞావంతులై శిష్యులు గురువులు విపరీత ధోరణి నవలంబించినప్పుడు ధైర్యంతో సత్యాన్ని తెలుపుతారని తెలుస్తున్నది.

86. "మహాత్మా! తమరు బాల్యం నుండి నైష్ఠిక బ్రహ్మచర్య మందు విహరిస్తున్న మహాపురుషులు. బ్రహ్మచర్యవ్రతం సులభసాధ్యం కాదు గదా! అది మహా పవిత్రం, విజ్ఞానకరం. అట్టి దృఢత్వమైన ఊర్ధ్వరేతస్సును చెరపటంచేత ఏం ప్రయోజనం? ప్రమాదవశానైనా ఆ వ్రతం భంగపరచు

కొంటే ఘోరపాపాన్నే పొందగలడు. ఈ కామప్రవృత్తి నీచాతినీచమైనది. విషయాసక్తి మహాత్ములను కూడా పామరులను చేస్తున్నది. తాము సర్వజ్ఞులు. తమకు తెలియనిది లేదు. సమర్థులైన తామే కర్తవ్యం నిర్ణయించుకోండి.

87. మహాత్మా! మన మాచరించే ఈ బ్రహ్మచర్య వ్రతం నివృత్తి మార్గగామి అవడం చేత ముక్తిహేతువై ఉన్నది. దీనికి సాటియైనది ఏ లోక మందునా కానరాము. మహోత్తమమైన ఈ నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతమెక్కడ? నీచమగు కామప్రవృత్తి యెక్కడ? కామధేనువును వదలి పంది వెంటపడి నట్లుంటుంది. ధర్మతత్పరులైన తామే సెలవివ్వండి. సర్వలోక జ్ఞానప్రదాతలు, భగవత్స్వరూపులైన తామే అంధునిలా కామకూపంలో పతితులైతే, లోకంలో యిక ఎవ్వరూ బ్రహ్మచర్యాన్ని, యతి ధర్మాన్ని పాలించరు.

88. మహాత్మా! తాము సర్వజ్ఞులు. తమకు తెలియని విషయాలు లేవు. నేను తమకు మంచి చెడు చెప్పదగినంత వాడను కాను. వేదాంతంలో ఏర్పడిన శ్రద్ధచేతా, బ్రహ్మచర్య వ్రత దీక్షయందున్న వాడనవడం చేతా, లోకానికి ఎలాటి అవిష్టాలు కలుగారదన్న దృఢ నిశ్చయంతో పలుకుతున్నాను. తమ దయవలన కలిగిన దివ్యవిజ్ఞాన సంపత్తిచే విన్నపం చేసుకొన్నాను. కార్యాకార్యాలు తెలుపడానికి నే నెంతటి వాడను? నన్ను క్షమించండి.

89. శ్రీ శంకరులు ఇలా పలికారు: తేజోనిధీ! బ్రహ్మచారీ! నిష్కపట బుద్ధితో, పవిత్రతా భావంతో, పరమ భక్తితో నువ్వు పలికిన పలుకులన్నీ హర్షింపదగినవే. ధర్మాలన్నిటికీ అతీతమైన దొకటి ఉంది. అదే పరతత్త్వం. అదే పరమ సత్యం. విధినిషేధాలు బ్రహ్మజ్ఞానం కోరే ముముక్షువులకే గాని, ముక్తపురుషులకు కాదు. శ్రీ శుకమహర్షి, సనక సనందనాదులు, శ్రీకృష్ణుడు మొదలైన వారందరూ ముక్తపురుషులు. వారాచరించే లోకోద్ధరణ కార్యాలన్నీ సామాన్య జనులకు ధర్మవిరుద్ధమైనవిగా కనిపిస్తాయి.

90. సంకల్పరహితులకు విషయాలపై ఆసక్తి ఉండదు. సంకల్పాలు ముక్తపురుషుని ఏమీ చేయజాలవు. శ్రీకృష్ణుడు గోపికలతో విహరించినా, సంసర్గం లేని వాడవటం చేత, కామం ఏమీ చేయలేకపోయినది. అంటే భగవంతుని లీలలే. వేలకొలది భార్యలు గలవాడని పురాణాలు పలుకుచున్నా,

ఆయన నిత్య బ్రహ్మచారియని మహాత్ములు స్తుతించారు. కనుక యీ విధి నిషేధాల కతీతమైన పరతత్త్వం ఒకటి ఉంది. ఈ రహస్యం తెలియక మహాత్ములను ఆక్షేపించితే అది వారి అజ్ఞానమే కాక, పాప హేతువు కూడా అవుతుంది. పరశురాముడు మొదలయిన వారందరూ శాస్త్రమర్యాద నతిక్రమించారు.

పరకాయ ప్రవేశమనేది ఉపనిషత్తులలో 'వజ్రోలీ" యోగంగా చెప్పబడినది. ఈ వజ్రోలి వ్రతమాచరించేవాడు వ్రతభ్రష్ఠుడు కాకపోగా, అమిత తేజోవంతుడవుతున్నాడు. కనుక పరకాయ ప్రవేశం చేసి భోగాలనుభవించినా అవి సాక్షీభూతాలే గాని యథార్థం కావు. కాబట్టి వత్సా! మనకు బ్రహ్మచర్య వ్రతభంగం లేదు.

91. కామనా విషయా లన్నింటికీ సంకల్పాలే కారణాలు. బీజం లేని యెడల కామమనే వృక్షమే ఉండదు. నేను శ్రీకృష్ణునితో సమానమైన వాడనవటం చేత నాకూ ఏ విధమైన సంకల్పమూ లేదు. కనుక సంకల్పమే సంసారానికి మూలం. బీజం భూమిని ఛేదించుకొని శాఖోపశాఖలుగా విస్త రించుకొని మహావృక్షమై పూలు పండ్లతో నిండి ఉంటుంది. అదేవిధంగా సంకల్పమనే బీజం హృదయంలో అంకురించి, వాసనలతో చిగురించి కామక్రోధాలనే కొమ్మలతో విస్తరించి భ్రాంతి అనే మూలంతో కలసి సంసార మనే వృక్షంగా పరిణమించి వృత్తిరూపమైన పుష్పాదులతో, సుఖదుఃఖాత్మక ఫలాలతో సంపూర్ణమవుతున్నది. కనుక సంకల్పమనే బీజాన్ని సమూలంగా నాశనం చేసేవాడు ముక్తాత్ముడవుతున్నాడు. ఈ విధమైన సంకల్పాలను నాశనం చేయడానికి అష్టాంగ యోగాలతో కూడిన స్వస్వరూపజ్ఞానాన్ని పొందాలి.

92. ఈ విధినిషేధాలన్నీ, జడమైన దేహమే 'నేను' అని తలచే అజ్ఞాని కొరకు విధించబడినవి. పరమాత్మతత్త్వంలో విహరించే మహాత్ములపట్ల విధినిషేధ శాస్త్రాలు నిరుపయోగాలు. శాస్త్రాలు శబ్దరూపాలు. శబ్దానికి అతీత పరబ్రహ్మ స్థితిలో ఉండేవారిని శాస్త్రాలు నియంత్రించలేవు. అట్టి

మహాత్ముడు శాస్త్రాలనే నియంత్రిస్తాడు. వారికి పరకాయ ప్రవేశ విద్య పరిగణించదగినది కాదు.

93. బ్రహ్మజ్ఞానం కలిగిన పరిపూర్ణుడైన మహాత్ముడు బ్రహ్మచర్యం మొదలైన ఆశ్రమాలను, బ్రాహ్మణాది వర్ణాలను అతిక్రమించి పరమాత్మ తానేనని తెలుసుకొన్నవాడు విధికి లోనై ఉండడు. అంటే, సర్వాతీత తత్త్వజ్ఞుడైన మహాత్మునకు శాస్త్రవిధి అనవసరం.

94. "అఖండ జ్ఞాన సంపన్నుడైన మహాత్మునకు శాస్త్రాలు, కర్మఫలాలుగాని, కర్మాచరణాలు గాని వర్తించవు. సర్వభూతాలలోని పరమాత్మ తానే అయి అఖండ తేజోమయునిగా, ఆనందస్వరూపునిగా ప్రకాశిస్తున్నాడు. బాగా విచారించితే బ్రహ్మమెన్నడూ ఒక దానికి కారణమవటం లేదు. నిరాకారుడవటం చేత కార్యకారణ భావం పరమాత్మయందు సంభవింపదు. దీనిని పరిణామ వాదమంటారు. వివర్త వాదాన్ని మాత్రమే వేదాంతులు అంగీకరిస్తారు. "సర్వం ఖల్విదం బ్రహ్మం" అనే మహావాక్యం ప్రకారం సర్వమూ బ్రహ్మంగా గాంచే అద్వైతజ్ఞానికి శాస్త్ర వాసనలు కర్మఫలాలు అంటవు."

95. "జగత్తు మిథ్యావస్తువు. పరమాత్మే సత్యం. అట్టి పరబ్రహ్మమే నేను. మరొకటి లేదు, అనే నిశ్చితాభిప్రాయం గల జ్ఞానసంపన్నుడు లోకహితం కొరకు అనేకమైన కర్మల నాచరిస్తున్నా, వానికి కర్మబంధాలుండవు. సర్వం మిథ్య అని తలచేవానికి ఇక కర్మలు ఎక్కడివి? అంతా బ్రహ్మమే కదా! స్వప్నంలో అనేకమైన చెడ్డపనులు, మంచి పనులు చేసినట్లు భావిస్తాడు. కాని అవన్నీ యథార్థం కాదు; ఎటువంటి ఫలితాలను కలిగించవు.

96. "కర్తృత్వ బుద్ధి లేని మహాత్మునికి ఏ విధమైన కర్మలు అంటవు. కర్తృత్వ భోక్తృత్వాది అజ్ఞాన బుద్ధి నశించిన జ్ఞాని, లోకహితాన్ని కోరి అశ్వమేధయాగాలను చేసినా, నానావిధాలైన బ్రహ్మహత్యలు చేసినా, పరమాత్మతత్త్వం తెలిసిన వాడవటం చేత, సుకృత దుష్కృత కర్మల చేత లిప్తుడు కాదు. సామాన్యంగా అట్టి మహాత్ములు హింసారూప కర్మలు చేయనే

చేయరు. ఒకవేళ చేస్తే, వారు లోకాతిక్రాంతులవటం చేత ఆ విచారణ మనకు గోచరం కాదు.

97. పూర్వం దేవేంద్రుడు ద్వాదశాదిత్యులలో ఒకడైన 'త్వష్ట' కుమారుడు, ఆత్మతత్త్వ మెరుగనివాడై గర్వంతో లోకాన్ని పీడిస్తుండగా దేవేంద్రుడాతణ్ణి పరిమార్చాడు. ఆ విధంగా కపట సన్న్యాసులను పెక్కు మందిని పరిమార్చినా దేవేంద్రుని కెలాటి హానీ కలుగలేదు. ఈ విషయాన్నే "త్రిశీర్షాణాం....." అనే ఋగ్వేద వాక్యం తెలుపుతున్నది. అంటే "పరబ్రహ్మను తెలిసిన మహనీయుడు భ్రూణహత్యాది మహాపాతక కర్మలు చేసినా, కర్తృత్వ బుద్ధి నాశనమయినందున ఏ హానీ సంభవింపదు." కనుక నిస్సంగుడు సర్వస్వతంత్రుడు; కర్మరహితుడు.

98. "జనకోహ వై దేహో......" అనే శ్రుతి ప్రమాణాన్ని అనుసరించి కాణ్వాదు లీ దృష్టాంతాన్ని తెలుపుతున్నారు. అంటే, "పూర్వం జనక మహారాజు, విదేహముక్తిని పొంది, మహర్షులలో పరమ మహర్షిగా ప్రసిద్ధిగాంచాడు. ఆయన అనేక యజ్ఞాలు చేసి దేవతల నందరినీ తృప్తిపర చాడు. విరివిగా దక్షిణలిచ్చి అనేకమంది పండితులను సంతృప్తిపరచాడు. అయినా కర్మఫలాన్ని నలుసంతయినా పొందక, మరణానంతరం మోక్షం పొందాడు."

99. బ్రహ్మజ్ఞాని దుష్కృతాలు చేశానని కృంగిపోడు. సత్కర్మలు చేశానని పొంగిపోడు. కర్తృత్వబుద్ధి నాశనమవటం చేత సుఖదుఃఖాది ద్వంద్వాలన్నిటినీ సమంగా గ్రహించి బ్రహ్మతత్త్వంలో ఎల్లప్పుడూ విహరిస్తుంటాడు. నానావిధాలైన దుష్కృతాలు చేసిన దేవేంద్రుడు కానీ, అనేక సత్కర్మలు చేసిన జనక మహారాజుగానీ, తత్త్వజ్ఞానులవటంచేత, (కర్మాతీత; గుణాతీత; కాలాతీత) పరబ్రహ్మన్నే పొందుతున్నారు.

100. ఓ సౌమ్యా! మన్మథశాస్త్ర పరిశీలనం ఈ దేహంతో చేసినా నాకు దోషములంటవు. దావాగ్నిచే చుట్టుముట్టబడిన క్షేత్రంలో బీజాలు మొలకెత్తవు. అదే విధంగా నా హృదయ క్షేత్రంలో కూడా ఆ నిషిద్ధ

సంస్కారాలు అంకురించవు; దగ్ధమైపోతవి. ఈ దేహంతో కర్మలు చేసినా, పరకాయ ప్రవేశం చేత సంభవించే సుకృత, దుష్కృత కర్మరాసులు మహాగ్నిలా నన్నంటజాలవు. ఈ పరకాయ ప్రవేశమనే ప్రక్రియ వజ్రోలి, హంసోలి యోగాలతో సమానం. శిష్టులైన యతీశ్వరుల మార్గాన్ని సంరక్షించడానికి ఆ పరకాయ ప్రవేశం చేయబోతున్నాను. ఇందులో ఎంతమాత్రమూ ప్రమాదం కానీ, దోషం కానీ లేదు. కనుక మహాత్ముల విషయమై సందేహాలు గాని కువిమర్శలు గాని చేయతగదు. ముముక్షువులైనవారు శాస్త్ర ప్రకారమే ఆచరించాలి.

101. శ్రీ శంకరులు పద్మపాదుని సందేహాలన్నీ సంపూర్ణంగా ధ్వంసం చేసి, అకారణమైన భయాన్ని సంసారాతి భయాలను పాపభీతిని నశింప జేశారు. సర్వకర్మ బంధాలను ఛేదించే పెక్కు దృష్టాంతరాలను తెలిపారు. ఈ విధంగా స్వయంప్రకాశకుడైన శ్రీ శంకరులు శిష్యులతో మృదుమధురంగా ప్రవచిస్తూ నిర్మానుష్యమైన ఆ పర్వత శిఖరాగ్రంపై కాలుమోపారు.

102. ఓ శిష్యసత్తములారా! ఈ గుహ ముందు భాగమంతా ఎత్తుపల్లాలులేక సమంగా ఉన్నది. అంతేగాక సమీపంలోనే స్వచ్ఛమైన నీటితో కూడిన సరస్సు కూడా ఉన్నది. ఈ జలాలు స్నాన జపానుష్ఠానము లకు కడు యోగ్యంగా ఉన్నవి. ఈ పరిసర ప్రాంతాలన్నిటా పూలు, పండ్లతో నిండివున్న అనేక వృక్షాలున్నవి. అన్ని విధాలుగా ఈ గుహాప్రదేశం తపోధనులకు నివాసయోగ్యంగా ఉన్నది.

103. సద్గుణ శోభిత యశస్సంపన్నులారా! నేను సూక్ష్మ రూపాన యీ ప్రభువు మృతదేహంలో ప్రవేశిస్తాను. తదనంతరం కామశాస్త్ర ప్రావీణ్యతను కూడా సంతరించుకొని సర్వజ్ఞుడనవుతాను. తద్వారా సర్వకళా తత్త్వ విశారదుడనై లౌకిక, అలౌకిక విజ్ఞానమందు పరిపూర్ణుడనై వచ్చేవరకూ ఇక్కడే ఉండి ఈ దేహాన్ని సంరక్షించండి.

104. ఈ విధంగా శ్రీ శంకరులు తన శరీర రక్షణ భారాన్ని శిష్యులపై నుంచి, పరకాయ ప్రవేశ విద్యచేత పంచ కర్మేంద్రియాలను, పంచజ్ఞానేంద్రియాలను, పంచ ప్రాణాలను, మనస్సు, బుద్ధులతో కూడిన

లింగశరీరాన్ని దాల్చి ఆ అమరక రాజు శరీరంలో ప్రవేశించారు. అంటే తమ అప్రాకృత దివ్యవిజ్ఞానమయ యోగశరీరాన్ని వదలి నానా విధ సుఖానుభవయోగ్య భోగశరీరాన శ్రీ శంకరులు ప్రవేశించారన్నమాట.

105. శ్రీ శంకరులు ప్రాణవాయువును తన దేహమందలి సిరిపాదం నుండి బ్రహ్మరంధ్రం ద్వారా సూక్ష్మ రూపాన బయటకు వచ్చి, మరణించిన అమరక రాజు శరీరంలో బ్రహ్మరంధ్రం ద్వారా పాదం వరకు ప్రవేశించారు. తాను రాజు భోగయోగ్య దేహమందు ప్రాణవాయువును ప్రవేశపెట్టినా, చలించని బుద్ధి మనస్సు గలవాడై తన లక్ష్యసాధనలో ఏకాగ్రతను నిలిపారు. సర్వత్రా తన కిరణాలను ప్రసరింపజేసే సూర్యభగవానుని ఏ మలినాలు అంటని విధంగా, శ్రీ శంకరుల పరకాయ ప్రవేశానికి ఎట్టి కామపురుషార్థాలు అంటవు. శ్రీ శంకరులు సర్వవిద్యావిభూషితులు, సర్వజ్ఞులు.

106. శ్రీ శంకరులు ప్రవేశించగానే ఆ మృత దేహంలో హృదయానికి మెల్లగా చలన మేర్పడింది. కళ్లు మెల్లగా తెరుచుకోబడినవి. క్రమంగా నిద్రనుండి మేల్కొన్నట్లుగా లేచి కూర్చున్నారు.

107. శ్రీ శంకరులు సూక్ష్మరూపంలో ఆ మృత శరీరంలో ప్రవేశించగానే ముఖం కాంతివంతమైనది. తరువాత శ్వాస పీల్చడం చేత ముక్కులందు కదలిక స్పష్టమయింది. శ్వాసతోపాటు కాళ్ళు చేతులందు సత్తువ ఏర్పడింది. నేత్రాలు వికాసం పొందాయి. దేహంలో శక్తి ఏర్పడింది. ఈ విధంగా మరణించినాడని తలచిన శరీరంలో తిరిగి ప్రాణప్రతిష్ఠ కలిగింది.

108. రాణులు, "మేము అనాథలమైతిమి గదా! మమ్ము రక్షించిన దెవరు?" అని దుఃఖించసాగారు. మంత్రులు "రాజ్యానికి నాథుడు లేక పోయాడే! మమ్ములను, ప్రజలను ఎవరు పాలిస్తారు?" అని శోక సాగరంలో మునిగి విలపించే సమయాన, శ్రీ శంకరుల ప్రభావం చేత, రాణులందరూ, తమ ప్రియుని ముఖంలో జీవకళ చూసి, నిశ్చయంగా తమ భర్త జీవించాడని తెలుసుకొన్నారు. హర్షాతిరేకంతో ప్రియుని శరీరాన్ని చేతులతో స్పృశిస్తున్న వారికి కూడ ప్రాణాలు లేచివచ్చాయి. వారు హర్షాతిశయంతో నాథుని

అక్కున జేర్చుకొన్నారు. వారి ముఖాల నుండి సంతోషధ్వనులు వెలువడగా వారందరూ తిరిగి సనాథులయ్యారు.

109. శ్రీ శంకరుల ప్రవేశం చేత ఆ అమరక మహారాజు జీవించగా, ఆయన రాణులు, మంత్రులు హర్షక సూచకంగా శంఖాలను పూరించారు; భేరీ, ఢక్కా మొదలైన వాద్యాలన్నింటినీ మ్రోగించారు. ఆ నృపవరేణ్యుడు తిరిగి ప్రాణాలు పొందటంచేత "మన భాగ్యమేమనవచ్చు"నని తలచారు.

శ్రీ శంకర యతీంద్రులు ప్రభువవడమూ, మంత్రులకు నేత అవడమూ, స్త్రీజనులందరికీ ప్రియతమ నాథుడవడమూ వారి పూర్వజన్మల సుకృతాలనవచ్చు. శ్రీకృష్ణ పరమాత్మ గోపికలతో రాసలీలలు జరుపటంమల్లేనే ఈ రాజస్త్రీ లందరూ శ్రీ శంకరులను సేవించటం బహు పూర్వజన్మల సుకృతమే అవుతుంది. లేకపోతే యతీశ్వర దివ్యవ్రత మెక్కడ? ఈ కాంతా భోగాలెక్కడ? భగవత్సంకల్పం వృథా అవుతుందా?



# సర్గము - 10

## శ్రీ శంకరుల సర్వవిద్యా విస్తారము

1. శ్రీ అమరక మహారాజు నిద్రనుండి లేచిన వ్యక్తిమల్లే లేచి కూర్చోగా, రాణులు, మంత్రులు మహానందం పొందారు. ప్రజలు నానా విధాలైన శాంతి కర్మలు చేయిస్తూ, నృత్య గీతవాద్యాదులతో వేడుకలు జరుపుకొన్నారు. అమరక మహారాజు దేహాన్ని ధరించి శ్రీ శంకరులు నగరమంతా భద్రగజంపై ఊరేగారు.

2. ఆ విధంగా శ్రీ శంకరులు అంతఃపురాన్నిచేరి కాంతాజనులంద రినీ అమిత సంతోషపరస్తూ, వారితో ప్రియసంభాషణాలను చేయసాగారు. మంత్రులందరూ సంతోషభరితులై ఆంతరంగికులైనారు. సామంతులందరూ శాసనాలను శిరసావహిస్తున్నారు. బృహస్పతిలా మేధాసంపత్తితో రాజ్యపాలన చేయగా, జనులందరూ భూలోకపురంధరుడని కొనియాడారు. లౌకిక వ్యవహారాలే ఎరుగని ఆ యతివరుడు, అమరక దేహాన్ని పొంది సర్వ భోగాలను అనుభవించసాగాడు. ప్రజల హృదయ తత్త్వమెరిగి, వారిని శాసిస్తూ, లాలిస్తూ, రాజ్యపాలన చేయసాగాడు. ఈ విధంగా రాజనే శబ్దానికి సార్థకత చేకూర్చాడు.

3. అప్పుడా మంత్రులు రాజు పరిపాలనా శైలిలో సాధారణ జనులకు గోచరం కాని ఒక విధానాన్ని గమనించారు. ఈతడు తమ అమరక మహారాజు కాడేమో అని సందేహిస్తూ పరస్పరం సంప్రదించుకోసాగారు.

4. అత్యంత ప్రజ్ఞాశక్తితో మంత్రులు ఇలా ఆలోచించారు: “మన ప్రజల అదృష్టవశాన మరణించినాడని తలచిన మహారాజు తిరిగి జీవించి వచ్చాడు. అయినా ఈ రాజు మునుపటి కంటే భిన్నంగా ప్రవర్తిస్తున్నాడు. అన్ని విధాలా విలక్షణుడిగానే కనిపిస్తున్నాడు. ఈతడి దేహం దివ్య తేజస్సుతో ప్రకాశిస్తున్నది. మాటలు, పలుకులు, చేష్టలు సర్వమూ నిశితంగా పరీక్షిస్తే భిన్నంగా తెలుస్తున్నాయి. దివ్యగుణరత్నాకరుడై విరాజిల్లుతున్నాడు.

ఆ అమరక మహారాజు యయాతి మహారాజులా ప్రజలకు కల్పవృక్షమై కోరినవన్నీ సమకూర్చసాగాడు. బృహస్పతిలా అఖండ మేధాసంపత్తితో సర్వవిద్యలయందు ప్రతిభావంతుడై వెలుగుచున్నాడు. అర్థవంతమైన సంభాష ణల చేత ఎదుటివారి మనస్సును దోచుకొంటున్నాడు. సాహస పరాక్రమంలో అర్జునునిలా శత్రువులను నిశ్శేషంగా జయించి విజయలక్ష్మిని కైవశం చేసుకొనేవాడయ్యాడు. సర్వజీవులలో సాక్షిరూపంలో ఉండే మహేశ్వరుని మల్లే గూఢచారులు లేకుండానే, జనుల హృదయాలందలి విషయాలను గ్రహించసాగాడు. ఎదుటి వారి హావభావాల చేతనే వారి అంతర్గత విషయా లను తెలుసుకొంటున్నాడు. చూడగా ఇవన్నీ అసాధారణాలైన మానవాతీతగుణ గణాలుగా తెలుస్తున్నవి.

6. ఈ ప్రభువునందు యయాతి చక్రవర్తి దాతృత్వం, బృహస్పతి మేధాసంపత్తి, అర్జునుని ధైర్యసాహసాలు మహేశ్వరునిలా సాక్షీభూతంగా ఉంటూ దేవ, మానవాంశలు స్పష్టం కాసాగాయి. ఈ అమరక భూపతి దేహాన సర్వవిలక్షణమైన ధర్మాలు కలిగి దివ్యపురాణపురుషుడు ప్రవేశించి ప్రకాశిస్తున్నాడు.

7. పరమ పురుషుడైన నభి మహారాజు పరిపాలించే కాలంలో ప్రజలు సర్వధర్మాలను పాటిస్తుండేవారు. వృక్షాలన్నీ నిండుగా పూతపూసి ఫలించేవి. గోవులు సమృద్ధిగా పాలనిచ్చేవి. సకాలంలో వర్షాలు కురిసి, పంటలు సమృద్ధిగా పండేవి. భూమాత కూడా సర్వవస్తు సమృద్ధిచే మహా కుటుంబినిలా ఉండేది. ప్రజలందరూ సర్వసౌఖ్యాలను పొందుతూ శాస్త్ర సమ్మతాలైన స్వధర్మాల నాచరిస్తూ ఉండేవారు.

అలాగే యీ నూతన అమరక మహారాజు పాలన కూడా ఎన్నడూ కనీ వినీ ఎరుగని విధంగా సర్వవస్తు సమృద్ధితో, ధర్మానుష్ఠాన నిరతితో మహోత్తమ గుణాలు కలిగి విరాజిల్లడంతో జనులు సుఖంగా జీవించ సాగారు. పూర్వం ఏ దేశమందైనా క్షామాలు సంభవించేటప్పుడు రాజర్షులను,

మహర్షులను దేశానికి ఆహ్వానించి సత్కరించేవారు. వారి పాదస్పర్శచే ఈతిబాధ లన్నీ తొలగిపోయి దేశం సుభిక్షమయ్యేది.

ఈతిబాధలు ఆరు రకాలు: 1. అతివృష్టి 2. అనావృష్టి 3. ఎలుకల వలన బాధలు 4. మిడుతల వలన బాధలు 5. చిలుకల వలన బాధలు 6. సమీపస్థరాజుల వలన కలిగే బాధలు. ఈ నూతన అమరక మహారాజు ప్రభావం చేత ప్రజలు ఈతిబాధలులేక సుఖాలనుభవిస్తున్నారు.

8. నూతన అమరక మహారాజు పరిపాలనా పద్ధతిని దేశకాల పరిస్థితు లను సమీక్షించిన మంత్రులు ఇలా తలచారు: "మన మహారాజు దేహంలో దివ్యపురుషుడెవరో ప్రవేశించి ఉంటాడు. ఆ మహాపురుషుడు దైవాంశల నతిక్రమించిన అప్రాకృతపురుషుడై ఉండవచ్చు, దేశమంతా శివాత్మకమై ఉన్నది. సర్వదోషాలకు నిలయమై ఉండవలసిన యీ కలికాలం త్రేతాయుగ లక్షణాలతో విలసిల్లుతున్నది. అమరక మహారాజు ఎంత సమర్ధంగా పాలించినా, కలి దోషాలు స్పష్టంగా కానవచ్చేవి. ధర్మదేవత నాలుగు పాదా లతో ఉండేది కాదు. ఈ నూతన అమరక మహారాజు రాజ్యంలో కాలుమోపి నది మొదలు కలి ధర్మాలు పూర్తిగా నశించి కృతయుగ ధర్మాలు తెలుస్తు న్నాయి. ఈతని పాలనం కృతయుగంలో మాంధాతాది ప్రభువుల పాలనను తలపింపజేస్తూ సర్వసౌఖ్యాలతో ప్రజలు జీవిస్తున్నారు. అందువలననే అమరక మహారాజు దేహంలో దివ్యపురుషుడెవరో ప్రవేశించి ఉంటాడని తలచుచున్నాం."

9. "ఈ రాజ్యంలో ఈతిబాధలు లేవు. రాజ్యం ప్రశాంతంగా ఉంది. శత్రుభయం అసలే లేదు. ఏది తలపెట్టినా విజయలక్ష్మి మన మహారాజునే వరిస్తున్నది. ధర్మం నాలుగు పాదాల మీద నడుస్తున్నది. ఇన్ని కారణాలచే మన మహారాజు దేహంలో ఎవరో మహాపురుషుడు ప్రవేశించి ఉన్నా డనటం సత్యం. ఈ మహాత్ముడు మన మహారాజు దేహాన్ని విడిచి పోకుండా చూడాలి. అలా అయితే దేశంలో సర్వశుభాలు శాశ్వతంగా ఉండిపోతవి. మన దేశం దేవలోకం, బ్రహ్మలోకాల కన్నా ప్రకాశవంతంగా ఉంటుంది. మనం ఈ మహాభాగ్యాన్ని జారవిడుచుకోరాదు" అని మంత్రివర్యులందరూ

చక్కగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. ఈ మహాత్ముని దేహమెక్కడ ఉన్నా వెదకి నాశనం చేయిస్తే ఈ నూతన అమరక మహారాజును పరిరక్షించు కోవచ్చని తీర్మానించుకొన్నారు.

10. అమరక మహారాజు శరీరాన్ని రక్షించుకోదలచి, మంత్రు లందరూ, తమ సేవకులను పిలచి రాజ్యంలో ఎక్కడ మృతదేహం కనిపించినా, వెంటనే దహనం చేయవలసినదని రహస్యంగా భటులందరినీ ఆజ్ఞాపించారు.

11. లోకంలో ప్రభువులు రాజ్యభారాన్ని మంత్రులపై ఉంచి, తాము విషయభోగాలందు మునిగి తేలుతుంటారు. ఈ నూతన అమరక మహారాజు కూడా అలాగే రాజ్యభారమంతా ఆప్తులూ, బుద్ధిమంతులూ అయిన మంత్రు లకు వదలి తాను రాణులందరితోను స్వేచ్ఛగా విషయసుఖాల ననుభవింప సాగాడు.

12. ఆ కపట అమరక మహారాజు రాజప్రాసాదంలో పాలరాతితో నిర్మించిన జూద మండపాలందు తన స్త్రీల నడుమ సరససల్లాపాలు జరుపుతూ కాలం గడుపసాగాడు.

13. అంతేగాక ఆ భూపతి ప్రియురాళ్ల అధరామృతాన్ని పానం చేయసాగాడు. ఉన్మాదం కలిగించే మద్యాన్ని బంగరు పాత్రలందు పోసుకొని తాను త్రాగుతూ వారిచేత త్రాగించాడు.

14. ఆ భూసురుడు తన ప్రియురాళ్లతో కూడి (మద్యాన్ని పానం చేస్తూ, వారిచేత పానం చేయిస్తూ) ఎనిమిది సాత్త్విక భావాలనుభవించాడు. ఆ ఎనిమిది సాత్త్విక భావనలేవంటే – 1. స్తంభం (స్తంభంలా స్తబ్ధమవడం) 2. ప్రళయం (బాహ్యాంతర్గతచేష్టలు స్తంభించటం) 3. రోమాంచం 4. చెమట 5 వివర్ణత (రూపాంతరప్రాప్తి) 6. దేహకంపం 7. కన్నీరు 8. గద్గదస్వరం.

15. ఆ కపట భూసురుడు తన ప్రియతమ కాంతలతో కూడి విషయ సుఖాలన్నీ అనుభవిస్తూ, బాహ్యస్మృతి మరచి చెప్పనలవికాని సుఖాలను అనుభవింపసాగాడు.

16. ఆ మహారాజు ఆ విధంగా తన ప్రియ కాంతలతో యథేచ్ఛగా విహరిస్తూ, కామ కళలయందు నిష్ణాతుడయ్యాడు. నానావిధ శృంగార చేష్టలందలి మెలకువలన్నీ నేర్చిన వాడై ఇంద్రియచయంతో విషయానుభవాలందు మైమరచాడు. బాహ్యస్పృహ పూర్తిగా కోల్పోయినవాడై, విషయానందం కూడా బ్రహ్మమే అనే తత్త్వంతో విషయసుఖాలను అనుభవించాడు. విషయసుఖాలందలి ఆనందం కూడా 'తనదే' నని భావించాడు. విచారించితే ఆనందమనేది స్వాత్మ సుఖమే అవుతున్నది. ఎలాగంటే, విషయప్రవృత్తి నశిస్తే ఆనందమే నిత్యమై స్వస్వరూప సిద్ధిని పొంది, దుఃఖరహితమై ముక్తిపదమవుతున్నది.

17. ఆ కపటభూపతి, తన రాణులతో ప్రవర్తిస్తుప్పుడు ఏ విధమైన అనుమానానికి తావీయక మునుపటి మాదిరే వారితో ప్రవర్తించసాగాడు. అందుచే రాణివాసమంతా తాము తమ నిజపతితోనే జీవిస్తున్నట్లు భావించింది. ఆ విధంగా ఎలాటి అరమరికలు లేనందున వారితో సకల భోగాలను అనుభవిస్తూ కామశాస్త్ర ప్రావీణ్యంతో వారి పట్ల ప్రవర్తించాడు. అంటే కామశాస్త్రాలన్నీ (వాత్స్యాయన, మన్మథ) స్వయంగా ప్రయోగాత్మక దృష్టితో చూశారు. ఈ విధంగా బాహ్యంగా విషయ ప్రవృత్తులందు ప్రవర్తిస్తున్నా, శ్రీకృష్ణునిలా దోషరహితుడై ప్రకాశించాడు.

18. అమరక నామధేయులైన శ్రీ శంకరులు వాత్స్యాయనమనే కామశాస్త్రమందలి తత్త్వాన్ని బాగా అధ్యయనం చేశారు. తరువాత తన అనుభవాలకు క్రొత్త అర్థాలను తెలుపుతూ 'అమరక కావ్య'మనే శృంగార కావ్యం రచించారు. తన స్వీయ అనుభవాలను, వాత్స్యాయన శాస్త్రాన్ని సంవిధానపరచి ఆ అమరకకావ్య రచనను చేశారు.

19. పరాశరమహర్షి రచించిన భిక్షాసూత్ర గ్రంథాన్ని అనుసరించేవారు 'పారాశరు' లవుతారు. అంటే యతీశ్వరులని భావం. యతి శ్రేష్ఠుడైన శ్రీ శంకరులు ఆ మహారాజు శరీరంలో ప్రవేశించి, ఆతడి ప్రియురాంద్రందరితోనూ శృంగార చేష్టలందు మైమరచి కాలమే మరచిపోయాడు. ఆ కారణాన గురునాజ్ఞను పాలించే ఆతడి శిష్యులు, గడువు దాటిపోయినా తమ గురువు

తిరిగిరానందుకు ఎంతో దుఃఖించసాగారు. గురుదేవుల శరీరాన్ని పరి రక్షించటంలో అప్రమత్తులై ఉన్నారు. వారిలా తలపోశారు:

20. "గురువరేణ్యులు ఒక మాసంలో తిరిగి వస్తానని దేహాన్ని వీడి వెళ్ళారు. ఇప్పుడు మాసం దాటి ఆరు దినాలైనది. ఇంకా వారు తమ నిజ శరీరంలో ప్రవేశింపలేదు. ఆయన దర్శనం కాక మనమిక్కడ అనాథల మైనాము. ఈ ఆలస్యానికి కారణమేమై ఉంటుంది?"

21. "శ్రీ శంకరులు ఒక మాసకాలంలోనే తిరిగి వస్తానన్నారు. శ్రీ గురుదేవులు ఎప్పుడు వస్తారో అన్న ఉత్కంఠతో శిష్యులందరూ ఎదురు చూస్తున్నారు. వ్యవధి తీరటంచేత ఎప్పుడు తిరిగి వస్తారో తెలియక దిక్కు తోచనివారై విలపించసాగారు. "మా గురుభక్తి పవిత్రమైనది కాదా? మేము ఎల్లవేళలా గురుదేవుని పాదపద్మాలనే హృదయంలో నిలుపుకొని ధ్యానిస్తున్నాం. అట్టి గురుదేవుల పాదపద్మాలు దూరమైనవి. గురు దేవులను ఎక్కడున్నారని వెదుకగలం? ఇప్పుడెక్కడకు పోవాలి? దిక్కు తోచడం లేదు. అష్టసిద్ధులతో మహిమాసంపన్నులైన గురుదేవులు ఇప్పుడు ఏ రూపంలో, ఏ దేశంలో, సముద్ర పర్వతాదులలో ఉన్నారని ఊహింప గలం? ఇదంతా మా దురదృష్టం తప్ప వేరుగాదు."

22. "శ్రీ గురుదేవుల దర్శనభాగ్యం లేని మా జీవితమంతా వేదాంత జ్ఞానశూన్యమై, మాయామోహాంధకారంలో పడి గతిలేని వారమవుతాం. మాకు ఇహ, పరలోకాలలో ఎక్కడా గతులు లేవు. గురుదేవుల జ్ఞానబోధల చేత నిర్భయంగా ఉన్నాం. ఇప్పుడు మాకా మోక్షమార్గాన్ని చూపే వారెవ్వరు? గురుకటాక్షం లేని మా జీవితాలు వ్యర్థం. ఇక మేమీ దుర్భరసంసారారణ్యంలో చిక్కుకొని పోవలసినదేనా! మాకు దారి చూపే ఆప్తుడేడీ? గురు సందర్శన భాగ్యహీనులమైనాం."

23. "శ్రీ గురుధ్యానంచేత సర్వపాపాలు నశిస్తున్నవి; ఇంద్రియాలు పరిశుద్ధాలవుతవి; శాశ్వతానందానుభూతి లభిస్తుంది; హృదయం పరిశుద్ధమై సంస్కారాలు ఏర్పతాయి. ఇంతెందుకు, గురు పాదాల నాశ్రయించిన మాకు

గురుపదభజనమే ధ్యానం, జ్ఞానం, జపం, వేదాధ్యయనం నిత్యకృత్యం; పరమశివం."

24. "శ్రీ గురుతేజస్సు ఎన్నటికైనా మాపై ప్రసరిస్తుందా? మేము పవిత్రులమవుతామా? అట్టి భాగ్యం కలుగుతుందా? శ్రీ శంకరుల దివ్య తేజోరాశియే మాకు జ్ఞానయోగాదిసిద్ధులు. వేదాధ్యయనాది తపఃపవిత్రాలు, తత్త్వజ్ఞాన ప్రదాలు. తలచినంతమాత్రం చేతనే మాకు సర్వమనోరథాలు సమకూరేవి."

25. "శ్రీ గురుదేవుల తేజస్సు ప్రసరించినంత మాత్రంచేతనే సకల పాపం హరించి, జ్ఞానలాభం కలుగుతున్నది. ముక్తికాంత వరిస్తుంది. పరమ శాంతి ఏర్పడుతుంది. సర్వాత్మ భావం సిద్ధిస్తుంది. అట్టి దివ్యజ్ఞానమయుని కరుణావీక్షణాలు మాకు ఎప్పుడు లభిస్తాయి? ఇదివరకంతా ప్రత్యక్షంగా దర్శించగలిగాం. ఇప్పుడు దర్శనభాగ్యం నశించి కేవలం, జ్ఞాపకాలపై జీవించవలసివచ్చినది. ఇంతకన్నా దౌర్భాగ్యమింకెక్కడైనా ఉంటుందా? శ్రీ శంకరగురువరేణ్యులు సర్వతేజోమయులు, విజ్ఞానానంత స్వరూపులు, పరమ శాంతిస్వరూపులు, కరుణామయులు. అట్టి గురుదేవుల అప్రాకృత కృపాదృష్టి మాపై ప్రసరిస్తుందా?"

26. "శ్రీ గురుదేవుల జాడ తెలియక ఎంతో పరితాపం చెందు తున్నాం. ఆయన తోడి సాహచర్యంలేక జీవితమే దుర్భరంగా ఉంది. మేము ఆ మహనీయుని గూర్చి ఎవరిని విచారించగలం? ఆయనే మా పట్ల కృపచూపాలి. ఆయన పాదపద్మాలను ప్రార్థించటంకన్న మాకు వేరే మార్గాంతరం తెలియటం లేదు."

27. "ఆ మహనీయుని పాదపద్మాలనే నౌకను ఆశ్రయించినవారు తప్పక సంసారసాగరాన్ని దాటగలరు. అటువంటి ఆ గురుదేవుల దర్శన మెప్పటికి కలుగుతుందో గదా! ఆయన సన్నిధానమే మాకు పరమ ముక్తిపదం. శ్రీ గురుదేవులను శరణు పొంది భజించి, ధ్యానించినంత మాత్రాననే మాయను జయిస్తున్నారు. విజ్ఞానవంతులై పరమహంస

లవుతున్నారు. బ్రహ్మజ్ఞానాన్ని పొంది శోక, మోహాలను విడనాడుతున్నారు. శ్రీ గురుకృపాదృష్టి సకల దుఃఖసముద్ర సంతారకం."

28. "శుభాశుభాలను, నివృత్తి ప్రవృత్తి మార్గాలను వేరు చేసి చూపగల మహనీయాత్ముడవు. పుణ్యపాపాలను అతిక్రమించి అనిత్య వస్తువులన్నిటినీ దూరంచేసే విజ్ఞానదృష్టి కలిగిన మహామహిమాశాలివి. ఈ జగత్తే నిత్యమనీ, దేహసౌఖ్యాలే శాశ్వతమనీ, మోక్షమంటూ ఏదీ లేదని వాదించే నాస్తికుల వాదాన్ని సమూలంగా నాశనం చేసే తత్త్వ ప్రబోధకుడవు. నిజతత్త్వమైన ఉపనిషత్తులలోని రహస్యాలన్నీ ఉపదేశించే పరమ గురువులైన తమ దర్శన భాగ్యం మాకు ఎన్నడు కలుగనున్నది? ద్వైతమతాన్ని నశింపజేసి, సంసార భయాన్ని నశింపజేసే జీవేశ్వరైక తత్త్వాన్ని మాకెన్నడు ఉపదేశిస్తారు? మా సంశయాలన్నీ నాశనం చేసి, నిత్యానందాన్ని సమకూర్చే వేదాంతోప న్యాసాలను మా కెన్నడు బోధిస్తారు? అట్టి పరమదివ్యోపదేశం శ్రవణం చేసే భాగ్యం మాకు కలుగుతుందా?"

29. "మహాత్మా! పరమ గురూ! సకలాచార్యసత్తమా! మమ్మల్ని అనుగ్రహించు. తమ దివ్యదర్శనం కలిగించి తాపాల నుండి మమ్మల్ని రక్షించు. ఈ దేహం విడిచిన తరువాత మోక్షం సిద్ధిస్తుందని చెప్తూ తత్త్వ వేత్తలున్నారు; ఉపనిషద్వాక్యాలున్నవి. కాని తమ దివ్యబోధలను శ్రవణం చేయటం చేత ఈ దేహముండగానే ముక్తి ప్రసాదిస్తున్నారు. మహానుభావా! తాము శీఘ్రంగా దర్శనమీయకుంటే ఈ పండితులందరూ మమ్మల్ని పరిహ సిస్తారు. కనుక మేము నిజంగా మీ శిష్యులమైతే, మమ్మల్ని ఈ అవమాన భారం నుండి రక్షించండి. మమ్మల్ని కరుణించండి."

30. ఈ విధంగా గురుశిష్య సంప్రదాయం ఏ విధంగా ఉండాలో విశదపరస్తున్నారు. గురుదేవుల కెలాటి ఆపద సంభవించినదో గదా అని శోకాక్రాంతులయ్యారు. శ్రీ పద్మపాదాచార్యుడు శ్రీ గురుదేవుల మహిమను సంపూర్ణంగా తెలిసిన వాడవటంచేత, మిత్రులతో తగిన విధంగా స్వాంతన వాక్యాలు పలుకసాగాడు:

31. **శ్రీ పద్మపాదాచార్యులు:** మిత్రులారా! దుఃఖించవద్దు. దుఃఖించి ఏం సాధింపగలం? దుఃఖించినది చాలు. అది నపుంసకుల లక్షణం. గురుదర్శనం పొందడానికి మనం ఎలాటి ప్రయత్నమూ చేయలేదు. ఇప్పుడా ప్రయత్నం చేద్దాం. ముందుగా భూలోకమంతా గాలిద్దాం. అలాకాకపోతే స్వర్గానికి కూడా పోయి వెతకుదాం. యోగీశ్వరులు తమ యోగప్రభావం చేత సూక్ష్మబుద్ధితో పరమాత్మను తెలుసుకొంటున్నారు. అట్లే మనం కూడా ఏకాగ్రచిత్తులమై సూక్ష్మబుద్ధితో వెదకి శ్రీ గురుదేవుల జాడ తెలుసుకొందాం.

32. "మిత్రులారా! నిరాశ నిస్పృహలతో ఏమీ సాధించలేం. దీక్షతో కృషి చేస్తే ఎంతటి కష్టసాధ్యమైన పనినైనా సాధించవచ్చు. పూర్వం దేవతలు రాక్షసులు కలసి క్షీరసాగరాన్ని మథించి అమృతాన్ని పొందలేదా? అట్లాగే మనమంతా కలసికట్టుగా అన్ని ప్రదేశాల్లోనూ అన్వేషించగలిగితే తప్పక గురుదేవులను సందర్శించగలం. సంశయం లేదు."

33. "మన గురుదేవులు తమ దేహాన్ని వదలి వేరొక దేహాన్ని ఆశ్రయించారుగదా, ఎలా కనుగొనగలమని నిరుత్సాహపడవద్దు. చంద్ర భగవానుడు రాహువు చేత మ్రింగబడినా, ఆయన సహజ గుణాలను కప్పిపెట్ట లేడు. అట్లే మన గురువుగారు పరకాయంలో ఉన్నా, చంద్రకాంతిలా పరమహంస లక్షణాలు బహిర్గతమై ప్రకాశిస్తూనే ఉంటవి. అట్టి విలక్షణ ధర్మాలచే మన మాయనను తేలికగా గుర్తించగలం."

34. "ప్రియతమమిత్రులారా! నే నొక ఉపాయం చెబుతాను, వినండి. మన గురువరేణ్యులు కామశాస్త్రం అధ్యయనం చేయడానికి ఒకానొక మహారాజు శరీరంలో ప్రవేశించారు. ఆయన శరీరధర్మాలననుసరించి మన్మథ కళలను అధ్యయనం చేస్తుంటారు. కామనా బుద్ధి సంపూర్ణంగా నశించిన వారవడం వలన ఆ మహాత్ముని తేలికగా గుర్తించగలం."

35. "మిత్రులారా! కేవల పరబ్రహ్మ స్వరూపుడూ, నిత్యసంతృప్తుడూ అయిన మన గురువరేణ్యులున్న దేశం మహాపవిత్రమై ఉంటుంది. ఆ దేశంలోని సకల ప్రాణులు వ్యాధిగ్రస్థులు కాక ఆరోగ్యవంతులై ఉంటారు. మోహశోకాలు లేనివారై నిత్యానందం పొందుతూంటారు. ఈతిబాధలు

లేనివారై ఉంటారు. స్వధర్మానుష్ఠానపరులై యజ్ఞయాగాదులు చేస్తూ దేవ మానవులను సంతృప్తిపరస్తూంటారు.”

36. ఏ దేశంలో జనులు శోకగ్రస్థులు కాక సుఖశాంతులతో, సర్వ సంపత్తులతో తులతూగుతారో, అట్టి రాజ్యంలో మన గురువరేణ్యులు తప్పక కపటభూపతి రూపంలో ఉంటారు. కనుక, మిత్రశ్రేష్ఠులారా! మనమందరం శీఘ్రంగా బయలుదేరిపోదాం. ఆ దివ్యతేజఃపుంజాన్ని గాంచి మనం కూడా తేజోవంతులమవుదాం. కాలాన్ని వృథా చేయవద్దు.”

37. శ్రీ పద్మపాదాచార్యులవారి ప్రబోధం చేత కొంతమంది శిష్యులను శ్రీ శంకరగురువరుల శరీరాన్ని రక్షింప నియోగించి, తక్కిన వారందరూ ఆయనను అన్వేషింప బయలుదేరారు.

38. తరువాత శ్రీ పద్మపాదాచార్యులతో కలసి శ్రీ శంకరులను కనుగొనడానికి భూమండలమంతా గాలించసాగారు. చివరకు వారు అమరక భూపాలుని రాజ్యం చేరుకొన్నారు.

39. వారావిధంగా అమరకుని రాజ్యం చేరుకొని తమ గురువరుని వృత్తాంతం తెలుసుకొని మనస్సు కుదుటపరచుకొన్నారు. ఆ రాజ్యంలో ప్రవేశించగానే, అమరక మహారాజు వేటకు పోయి మరణించాడనీ, మరల నిద్ర నుండి మేల్కొన్నవానిలా లేచికూర్చుని తిరిగి జీవించాడనీ, తరువాత పృథుచక్రవర్తి, దిలీప మహారాజులలా ధర్మపరిపాలన చేస్తున్నాడనీ, రాజ్య మంతా సకాలంలో వర్షాలు కురిసి సుభిక్షంగా ఉందనీ తెలుసుకొన్నారు.

40. ఈ విశేషాలన్నీ వారికి మహదానందాన్ని కలిగించటమేగాక, తమ గురువరులు ఈ రాజు శరీరాన్నే ఆశ్రయించి ఉన్నారని నిశ్చయించు కొన్నారు.

41. ఆ కపట భూపతియైన అమరకుడు నిరంతరం యువతులతో కూడి సరససల్లాపాలతో గానానందంలో మునిగి తేలుతున్నాడని తెలుసు కొన్నారు. కనుక తమ గురువరేణ్యుని సమీపింప గానమే తగిన సాధనమని ఎంచారు. శ్రీ పద్మపాదాచార్యులు గానంలో విశేష ప్రతిభ గలవాడవడంతో, వారందరూ గాన బృందంగా ఏర్పడి, ఆ భూపతి అనుజ్ఞను పొంది అంతః

పురంలో ప్రవేశించారు. తారల నడుమ ప్రకాశించే చంద్రునిమల్లే, నూరుమంది రాణులతో కూడి వారిచే నానావిధాలైన సేవలు అందుకొంటున్న ఆ కపటభూపతిని శిష్యులు చూశారు.

42-43. భోగపురుషుడైన ఆ మహారాజునకు కొందరు సుందరీమణులు శ్రేష్ఠాలైన వింజామరాలచే వీస్తూండగా, వారి చేతి గాజుల సవ్వడి మనోహరంగా విరాజిల్లింది. ఆ ధ్వనులకు సరిపోయే విధంగా గాయకులు, గాన నిపుణులు శ్రవణానందకరంగా సంగీతం వినిపించసాగారు. ఆ అమరక మహారాజు తెల్లని వస్త్రాలు, రత్నకిరీటం ధరించి మూర్తీభవించిన మన్మథునిలా ప్రకాశిస్తున్నాడు. భూమిపైకి దిగివచ్చిన మహేంద్రుడా అన్నట్లుగా ఉన్నాడు. అట్టి దివ్య సుందర విగ్రహుడై ఉన్న తమ గురువరుని శిష్యులు చూశారు.

44. పద్మపాదాచార్యులు, మిత్రబృందం రాజానుగ్రహం పొంది, గాయకవేషాలు ధరించి గానం చేయడానికి తమకు నియోగించిన స్థానాలలో కూర్చొన్నారు. గానం ప్రారంభించారు. ఆరోహణ అవరోహణ పద్ధతులన్నీ శాస్త్రవిధిననుసరించి గానం చేసి రాజును మెప్పించారు.

45. శ్రీ పద్మపాదాది శిష్యులందరూ శ్రీ శంకరులకు గోరక్షకుడు మత్స్యేంద్రనాథుని సంరక్షించిన కథను జ్ఞాపకపరచి, తమ దుఃఖాన్ని యీ విధంగా వెలిబుచ్చారు:

"ఓ భ్రమరసత్తమా! నీవు నిరంతరం మకరందానికి దాసుడవై స్వస్వరూపాన్ని మరచినావు. తేనెలొలికే మహోన్నతపుష్పజాతులను వదలి ఈ క్షుద్ర పుష్పాలందు వెదకుతున్నావు. అందు నీ కేమి ఆనందం చేకూరుతున్నదో తెలియకున్నది. కనుక నీవు వెనుకటిమల్లే సంచరించు; మాకు సంతోషం కలిగించు. మహాత్మా! తాము గండు తుమ్మెదగా ఉంటూ, శ్రుతి, బ్రహ్మసూత్రాది, సూక్తులచేత వేదాంతమనే మకరందం గ్రోలేవారు. అది విజ్ఞానాత్మకం. శాశ్వతానందాన్ని కలిగించేది. అంతేకాక, మిమ్మల్ని ఆశ్రయించిన (మాబోటి) తుమ్మెదలకు కూడా వేదాంతామృతం పంచుతూ, సంసారతాపం నుండి కాపాడేవాడవు. అంతేగాక భ్రమరకీట న్యాయాన మా కీటకావస్థయైన అజ్ఞాన స్థితిని నిర్మూలం చేసి వేదాంతతత్త్వజ్ఞానమకరందా

మృతాన్ని పానం చేసే విధంగా మమ్మల్ని జ్ఞానభృంగాలనుగా చేయసాగారు. మీ ఎడబాటు వలన మాకు ఆ ఆనందం దూరమైనది. ప్రభో! మమ్మల్ని కరుణించండి. తమ దేహాన్ని ఆ కొండ శిఖరంలోని గుహలో నిక్షేపం చేసివచ్చారు. శరీరరక్షణకు మమ్మల్ని నియోగించారు. గండు తుమ్మెద లేని తక్కిన తుమ్మెదలన్నీ కర్తవ్యం తెలియనివై దుఃఖించే విధంగా, తమ దర్శనం లేని మేమందరమూ ఎంతో దుఃఖిస్తున్నాం. అనాథలమైనాం."

యథార్థంగా, శ్రీ శంకరులు కామనాతీతులు, లోకహితాభిలాషులవడంచేత వారు విషయాలచే బంధితులు కారు. అయినా, ముముక్షువులు జాగ్రత్తతో మెలగాలనే తత్త్వాన్ని తెలియబరచడానికే శంకరు లీ విధంగా బోధించారనడం స్పష్టం. లేకుంటే వారు పరకాయ ప్రక్రియ తోడ్పాటు లేకుండానే కామకలా కౌశలమంతా గ్రహించగల సమర్థులు.

46. "మహాత్మా! తాము సర్వజ్ఞులు. స్వస్వరూప తత్త్వం ఎరిగినవారు. లోకహితం కోరి, మన్మథ శాస్త్రంలో ప్రావీణ్యం పొందడానికి తమ తండ్రి శ్రీ శివగురునిచే ఒసగబడిన యోగానుకూలమైన శరీరాన్ని విడిచి భోగానుకూలమైన ఈ రాజశరీరాన్ని పొందారు. ఆ కార్యం పరిసమాప్తమైనా, తాము ఈ శరీరంలోనే సంచరిస్తున్నారు. తాము కోరిన వ్యవధి కాలం తీరిపోయింది. ఆ కారణాన మాకు ఎంతో దుఃఖంగా ఉన్నది.

మానవులలో శ్రేష్ఠుడవైన ఓ దేవా! మాయామోహం చెందినవానిలా ఉన్నారు; తమ స్వస్వరూపాన్ని మరచినారు. సర్వానికి మార్గం చూపే తామే ప్రకృతికి వశులైతే ఇక మాబోటి వారి గతి యేమిటి?

47. "పరిపూర్ణ చంద్రముఖా! చంద్రభగవానుడు తన చల్లని కిరణాల చేత జగత్తునంతటినీ సంతోషపరస్తున్నాడు. తాము కూడా పరిపూర్ణ చంద్రునిలా అమృతమయమైన సూక్తిసుధలచేత సర్వజగత్తునకు పరమ శాంతిని, ఆనందాన్ని ప్రసాదిస్తున్నారు. శాంతిదాంత్యాది సర్వమూ వదలి, ఈ దేహాన్ని ధరించి 'నేను' అనే అహంకారంతో మెలగుతున్నారు. శివస్వరూపులైన తమకిది తగునా? కనుక తాము ఇప్పటికైనా, తమ స్వస్వరూపాన్ని పొందండి. తాము

సర్వకామాలను జయించిన జితేంద్రియులు. ఇప్పటికైనా మా ప్రార్థన మన్నించి నిజ శరీరంలో ప్రవేశించండి."

48. "నేతి నేతి" అనే మహావాక్యాలను బోధించే తామే పరబ్రహ్మ స్వరూపాన్ని మరచినారు. ఇది మహావిషాదకరం. తత్త్వమసి మహావాక్యార్థమైన పరబ్రహ్మయందే విహరించే తాము, ఆ నిర్వికల్ప పరతత్త్వస్వరూపులై ఉన్నారని ఉపదేశిస్తున్నారు.

i. ఈ కనిపించే దృశ్యమేదీ నువ్వు కాదు. ఆ పరమాత్మే నువ్వని శ్రుతి పలుకుతున్నది.

ii. శబ్దస్పర్శ రూపాలు లేనిది, నాశం కానిది అయిన ఏ పరమాత్మ వస్తువు ఉందో, అది అనాది, అనంతం, మహాతత్త్వంకన్నా విలక్షణం, నిశ్చయాత్మకం, స్థూలం - అణువు కానిది, పొడుగు పొట్టి అనే భేదం లేనిది, లోపల బయట కానిది, పూర్వాపరాలు లేనిది.

iii. "ఈ పరబ్రహ్మాన్ని తెలుసుకొన్న బ్రహ్మజ్ఞాని మృత్యుముఖం నుండి బయటపడుతున్నారు" - మొదలైన యీ శ్రుతి వాక్యాలన్నీ ఆ పరమాత్మను తెలియజేస్తున్నవి. తత్త్వమసి మహావాక్యార్థాన్ని మాకు బాగా తెలిపి నిద్ర నుండి మేల్కొల్పినారు. ఆ పరబ్రహ్మమే తమరు. అందులో సందేహ మేమాత్రమూ లేదు."

49. "పంచకోశ విలక్షణంగా ఏ ఆత్మతత్త్వం తెలియబడినదో, ఆ పరతత్త్వమే నీవని, తత్త్వమసి మహావాక్యం చేత ఉపదేశిస్తున్నారు. ఆ పరమాత్మ ఆకాశాది తత్త్వాలతో ఈ ప్రపంచాన్ని సృజించి, తాను అందులోనికి ప్రవేశిస్తున్నాడు. వడ్లలో బియ్యపు గింజలా నిగూఢంగా ఉండే ఆ పరబ్రహ్మాన్ని, దంచటం అనే యుక్తి చేత ధాన్యం నుండి బియ్యాన్ని వేరు చేస్తున్నారు. అట్లే ఉపనిషత్తులచేత, దృష్టాంతాలచేత కనిపించే వస్తువుల నుండి వేరు చేసి పరమాత్మను గ్రహిస్తున్నారు. ఉపాధిరహితమైన శాశ్వతానందమైన ఆ పరబ్రహ్మం నీవై ఉన్నావు."

50. "కొండకోనల యందు స్వేచ్ఛగా సంచరించే అశ్వాలను, రౌతు వాటిని కొరడాతో కొట్టుతూ పగ్గంతో బిగించి తన స్వాధీనంలోనికి

తెచ్చుకొంటున్నాడు. అదేవిధంగా ముముక్షువు, ఇంద్రియాలనే అశ్వాన్ని విషయాలనే కొండ కోనలందు స్వేచ్ఛగా సంచరించే మనస్సును, నిగ్రహ బుద్ధితో, వైరాగ్యాన్ని ఆశ్రయించి, బ్రహ్మజ్ఞానమార్గమందు ప్రవేశింపజేసి, పరమాత్మ అనే స్తంభంలో నియమించాలి. అప్పుడా ఇంద్రియాలు బ్రహ్మతత్త్వ విచారణచే పరమాత్మ యందు లయమవుతాయి. ఇంద్రియాలన్నీ నశించగా సాక్షిగా ఉండే నీవు నీ స్వస్వరూపాన్ని గ్రహిస్తావు. అదే నువ్వు."

51. "పుష్పహారంలోని పుష్పాలన్నీ దారాన్ని ఆధారం చేసుకొని ఉంటాయి. అట్లే, పరబ్రహ్మమందు యీ జగత్తత్వం ఆధారపడి ఉన్నది. కనుక ఓ మహాత్మా! జాగ్రదాది అవస్థలన్నిటిలోనూ, పుష్పహారమందలి దారంలా, ఆ పరమాత్మ వస్తువున్నది. అంతేకాదు అది పుష్పాలు దారం కంటే కూడా విలక్షణమై ఉన్నవి. ఈ జాగ్రదాది అవస్థలు జరుగుతుండగా, ఆత్మ సాక్షిగా ఉంటున్నది. మూడు అవస్థలలో సాక్షిగా ఉండే ఆ పరమాత్మ వస్తువు నువ్వే. ఇదే యథార్థతత్త్వం; ఆ పరమాత్మే సర్వసాక్షి. ఇదే సత్యం."

52. "ఓ సౌమ్యా! భూత భవిష్యద్వర్తమానకాలాలు మూడూ పరమాత్మయే. సమస్తమూ దాని నుండి జనించి లయమవుతున్నది. సమస్త మూ పరబ్రహ్మమే. సత్పదార్థం, ఏకమైనది, అద్వితీయం, అంతా ఆ పరబ్రహ్మమే. లోహంతో చేసిన ఆయుధాలు కూడా లోహమే అయినట్లు అనేక నామరూపాలలో ఉండే యీ జగత్తు యావత్తు పరబ్రహ్మమే. కారణం కన్నా కార్యం భిన్నం కాదు గదా! ఇవన్నీ శ్రుతి వాక్యాలు. ఉపక్రమ, ఉపసంహారాది ఆరు లింగాలచే (1. ఉపక్రమ – ఉపసంహారం 2. అభ్యాసం, 3, అపూర్వత 4. ఫలం 5. అర్థవాదం 6. ఉపపత్తి.) ఈ విషయం నిరూపించబడింది. కారణమైన బంగారం కార్యమైన అనేక రూపాలను పొందుతున్నా, అవి ఏవీ కార్యంకన్నా భిన్నం కావు. అట్లే జగత్తు కంతటికీ కారణమైన పరబ్రహ్మ స్వరూపమే కాని భిన్నం కాదు. ఆ సర్వకారణమైన పరబ్రహ్మమే నీవని తత్త్వమసి మహావాక్యం బోధిస్తున్నది.

53. "ఈ దేహంలో సాక్షిగా ఉండే ఆత్మే సూర్యమండలంలో కూడా ప్రకాశిస్తున్నాడు. అట్టి పరబ్రహ్మమే 'నేను' అని సోఽహమనే మంత్రం

బోధిస్తున్నది. అదే తత్త్వాన్ని తత్త్వమసి అనే మహావాక్యం కూడా బోధిస్తు న్నది. కనుక ఓ మహాత్మా! తాము సర్వజ్ఞులు సాక్షాత్తూ పరమశివులు. ఆ పరబ్రహ్మమే నీవై ఉన్నావు. నాశనరహితుడవు. నిరంతరం వేదాంతతత్త్వాన్ని మాకు ఉపదేశించే తమకు మేము చెప్పదగినంత వారమా? లౌకిక వ్యాపారా లను కట్టిపెట్టి యోగశరీరంలో ప్రవేశించండి. తమను ఆశ్రయించి ఉన్నవారం తాము లేక బ్రతుకలేము."

54. "ఆత్మతత్త్వాన్ని కోరుకొనే ముముక్షువులు పరిశుద్ధాంతఃకరణులై, రాగద్వేషాలను విసర్జించి, పరమ శ్రద్ధతో వేదాధ్యయనం చేస్తూ, దానధర్మాల నాచరిస్తూ, ఆ నిర్గుణ పరబ్రహ్మాన్ని తెలుసుకొంటున్నారు. అట్టి పరబ్రహ్మం నువ్వే."

55. "సర్వప్రాణులను సమభావంతో చూసేవారే ధీరులైన మహాత్ము లవుతున్నారు. శరీరం ఉండగానే పరమాత్మను తెలుసుకోవాలి. ఆత్మతత్త్వాన్ని గ్రహించాలని ఉపనిషత్తులు తెలుపుతున్నవి. కనుక శమ, దమ, ఉపరతి, తితిక్ష, శ్రద్ధా, సమాధానరూపాలతో, నిత్యానిత్యవివేకం కలిగి సాధన చతుష్టయాలను సాధన చేసి అఖండ బ్రహ్మజ్ఞానాన్ని పొంది ముక్తిని పొందుతున్నారు. జన్మను సార్థకం చేసుకొంటున్నారు. ఆత్మజ్ఞానం పొందిన మహాత్ములు సచ్చిదానందపరబ్రహ్మాన్ని తెలిసి బ్రహ్మానందాన్ని పొందుతున్నారు. ఆ పరబ్రహ్మమే నువ్వు. ఇది ఇలావుండగా, నువ్వు రాజు శరీరంలో ప్రవేశించి విషయసుఖాలను పొందుతూ, లోకోద్ధరణ కార్యాన్ని మరచావు. మమ్మల్ని కృతార్థులను చేయకున్నావు. ఈ విధంగా విలాసాలలో మునిగి తేలడం తమకు న్యాయమా? ఓ మహాత్మా! ఇతరుల మృతదేహంతోటి సంబంధం విడవండి. నిత్యానందం చెందండి. స్వస్వరూప జ్ఞానంతో మెలగండి. తత్త్వమసి మహావాక్యార్థాన్ని గ్రహించండి" అని శిష్యులు జ్ఞానబోధ చేస్తూ గురుదేవునికి పూర్వస్మృతులను జ్ఞాపకపరచారు.

56. శ్రీ పద్మపాద బృందం ఈ విధంగా బ్రహ్మతత్త్వంతో కూడిన గానం చేయగా సభాసదులందరూ తలలూపారు. శ్రీ శంకరులు మాత్రం

అందలి యథార్థమైన అర్థాన్ని గ్రహించారు. తన స్థితిని తెలియజేస్తూ, ఆత్మ తత్త్వప్రతిపాదనాన్ని చక్కగా గ్రహించారు. ఈ గానమంతా తనను ఉద్దేశించే చేశారనీ, ప్రియశిష్యుల మనోరథాలను చక్కగా గ్రహించారు. అప్పటి కప్పుడే, శిష్యులను, ఆ అమరక రాజదేహాన్ని విడిచి గగనమార్గాన ప్రయాణమయ్యారు.

57. పద్మపాదాదిశిష్యప్రముఖులు చేసిన తత్త్వమసి వాక్యార్థాన్ని గ్రహించారు. తన స్వస్వరూప జ్ఞానాన్ని పొందారు. అజ్ఞాన నిద్ర నుండి మేల్కొన్నారు. వెంటనే మూర్ఛపోయారు. పూర్వం మల్లేనే పరకాయప్రవేశ విద్యచేత రాజదేహం విడిచారు. అప్పటికే రాజభటుల చేత దహింపబడుతున్న తన నిజశరీరంలో ప్రవేశించారు. శ్రీ శంకరులు వెంటనే నిద్ర నుండి మేల్కొన్నట్లుగా లేచి కూర్చున్నారు. దివ్యకాంతితో కూడి యథాస్థితిని పొందారు.

58. శ్రీ శంకరులు, తమ శరీరాన్ని రాజభటులు దహిస్తూండడం చూశారు. తమ నిజశరీరాన్ని పరిరక్షిస్తున్న శిష్యులందరూ నిస్సహాయులై ఉండటం చూశారు.

59. జ్ఞానసంపన్నులలో శ్రేష్ఠులైన శ్రీ శంకరులు తన శరీరాన్ని పూర్వం మల్లే సర్వాంగ సుందరంగా చేయదలచి విష్ణు భగవానుడైన శ్రీ నృసింహరూపాన్ని మధుర పదజాలాలతో స్తుతించారు. నృసింహ స్వామి కృప చేత శరీర తాపాలన్నీ ఉపశమించాయి. పూర్వంలా తేజోవంతమైన శరీరాన్ని పొందారు. (ఎంతటి మహాత్ములకైనా భగవద్భక్తి చేత సర్వమూ సిద్ధిస్తుందని యీ తత్త్వం తెలియజేస్తున్నది. ఈ తత్త్వాన్ని లోకానికి తెలియజేయడానికి శ్రీ శంకరులు ఈ స్తుతి వాక్యాలను బోధించారు)

1. క్షీరసాగర నిలయా! చక్రపాణి! యోగీశ్వరులకు శాశ్వత రక్షకా! సంసార సాగరాన్ని దాటించే నౌకవు! లక్ష్మీనృసింహా! నాకు చేయూత నిచ్చి కాపాడుమా! నన్ను ఈ సంసార కూపం నుండి ఉద్ధరింపుమా!

2. బ్రహ్మాది దేవతల శిరస్సులయందుండు కిరీటాలచే సేవించు పాదపద్మాలు గలవాడా! ఆ కిరీటాలందలి మణుల కాంతిచేత ప్రకాశించే పాదాలు గల మహాత్మా! లక్ష్మీ కమలరాజహంసా! లక్ష్మీ నృసింహా! దీనుడనైన నాకు చేయూతనివ్వు.

3. సంసారమనే భయంకరమైన అరణ్యంలో తిరుగుతూ, మన్మథుడనే భయంకర మృగరాజు చేత ఎల్లప్పుడూ పీడించబడుతూ భయభ్రాంతుడనై ఉన్నాను. ఓ దేవా మత్సర గ్రీష్మకాల సంతప్తుడనైనాను. లక్ష్మీనృసింహా! నాకు చేయూతనిచ్చి రక్షించుమా!

4. అమిత దుఃఖకరమైన సంతాపతాపంచేత సంసారంలో పడి నానావిధాలైన దుఃఖాలనే విషసర్పాల మధ్యపడి ఉన్నాను. దీనుడనైనాను. మోహగ్రస్తుడనై అజ్ఞానంలో పడి ఉన్నాను. నీ జ్ఞానపూరితమైన హస్తాలతో నన్ను దగ్గరకు చేర్చుకో. దయామయా! లక్ష్మీనృసింహా! నాకు చేయూత నిచ్చి రక్షించు.

5. సంసారమనే మహాసముద్రంలో కాలమనే మహాబలమైన మొసలి మింగడానికి సిద్ధంగా ఉంది. ఈ దేహం వ్యసనాలనే మహాతరంగాల్లో తగులు కొని దారి తెలియటం లేదు. నాకు జ్ఞానతీరానికి చేరే దారి చూపి ఈ సంసార సాగరం నుండి రక్షించు. లక్ష్మీనృసింహా! నాకు చేయూత నిచ్చి రక్షించు.

6. ఈ సంసార మొక వృక్షం. పాపమే విత్తనం. అంతులేని కర్మలే కొమ్మలు. ఇంద్రియాలే ఆకులు. కోరికలే పుష్పాలు. దుఃఖమే ఫలాలు. అలాటి ఈ సంసార వృక్షాన్ని ఎక్కి అధోగతి పాలగుతున్నాను.

ఓ దీనదయాళా! లక్ష్మీనృసింహా! నాకు చేయూతనిచ్చి రక్షించుమా!

7. సంసారమనే ఘోరసర్పపు భయంకరమైన విషపు కోరలు నన్ను దహించివేస్తున్నవి. అనంతమైన దుఃఖాలను అనుభవిస్తున్నాను. ఓ గరుడవాహనా! జననమరణాలతో కూడిన యీ సంసారమనే మహా సర్పాన్ని మ్రింగివేయి. అమృత సాగరంలో నివసించేవాడా! నీ జ్ఞానామృతంచే విషాన్నంతా రూపుమాపు. ఓ లక్ష్మీనృసింహా! నాకు చేయూత నిచ్చి రక్షించు.

8. సంసారమనే దావాగ్ని తాపత్రయాలనే అగ్నిజ్వాలల చేత రోమాలన్నీ దహించబడుతున్నవి. మోహంచేత భ్రాంతి చెందిఉన్నాను. నీ పాదపద్మాలనే తామర కొలనులోని చల్లని నీటితో నా తాపం చల్లార్చు. ఓ సర్వతాపహారీ! నిత్యానందా! ఓ లక్ష్మీనృసింహా! నాకు చేయూత నిచ్చి రక్షించు.

9. సంసారమనే పెద్ద వలలో చిక్కుకున్నాను. ఇంద్రియాలన్ని విషయాలనే గాలంలో చిక్కుకున్నవి. నా శిరస్సు సగభాగం ఇరుక్కుపోయి ఉన్నది. గాలం లాగటం చేత మిగతా సగం కూడా ఖండించబడి మృత్యువాత పడుతున్నాను. విషయాలపట్ల ఆశచేత మోహితుడనై జననమరణ సంసారంలో చిక్కుకొని ఉన్నాను. నీ అమృతహస్తాన్ని అందించి మరణం లేనివానినిగా చేసి శాశ్వతానందాన్ని కలిగించు. ఓ లక్ష్మీనృసింహా! నాకు చేయూత నిచ్చి రక్షించు.

10. సంసారమందలి దుఃఖపరంపరలు మదించిన ఏనుగు తొండంలో చిక్కుకొని నలిగిపోయే మర్మస్థానాలమల్లే, చివరి గడియలలో మరణ భయంచే పీడించబడుచున్నాను. ఆ భయాల నుండి కాపాడి అభయహస్తమివ్వు. ఓ లక్ష్మీనృసింహా! చేయూతనిచ్చి నన్ను రక్షించు.

11. స్వామీ! అజ్ఞానంచే గుడ్డివాడనైతిని. ఇంద్రియాలనే బలమైన దొంగలచేత బంధించబడ్డాను. నా వద్దనున్న వివేకమనే ధనమంతా దోచుకుపోయినారు. మోహాంధకార రూపమైన కూపంలో పడవేసిపోయారు. ఓ లక్ష్మీనృసింహ స్వామీ! చేయూతనిచ్చి నన్ను రక్షించు.

12. ఓ కమలనాథా! తామర పుష్పాన్ని నాభియందు ధరించిన ఓ వైకుంఠవాసా! మహావిష్ణూ! మధుసూదనా! కమలనయనా! సర్వశరణ్యా! కేశవా! జనార్దనా! వాసుదేవా! దేవదేవా! అజ్ఞానంచే దీనుడనైనాను. నాకు జ్ఞానభిక్ష పెట్టు. ఓ లక్ష్మీనృసింహా! నాకు చేయూతనిచ్చి రక్షించు.

60. శ్రీనృసింహదేవులు శ్రీ శంకరుల భక్తిపూర్వకమైన స్తుతి వచనాలకు ఎంతో సంతసించి అనుగ్రహించాడు. వెంటనే దేహాన్ని దహించే మహాగ్ని చల్లారింది. తరువాత శ్రీ శంకరులు సర్వతేజోమయులై స్వదేహాన ప్రవేశించారు. మనోరథాలన్నీ పరిపూర్ణంగా పొంది బ్రహ్మతేజస్సుతో ఆ పర్వతగుహ నుండి బయటకు వచ్చారు. రాహువుచే మ్రింగిబడి వాని ముఖం నుండి బయటకు వచ్చే చంద్రునిలా, అధికమైన కాంతిసంపదతో గుహ నుండి బయటకు వచ్చారు. ఈ విధంగా శ్రీ శంకరులు పరమశివుని కృపచేత సర్వజ్ఞులై, సర్వవిజయియై వెలుగొందారు.

61. ఈ ప్రకారంగా శ్రీ శంకరులు మన్మథ కళ యందు ప్రావీణ్యులై సర్వజ్ఞతను పొంది, తమకై పరితపించే పద్మపాదాది శిష్యులకు పరమానందం కలిగించారు. నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతధారులూ, నివృత్తి మార్గం అనుసరించేవారూ అయిన శ్రీ శంకరులు శిష్యులతో కలసి శ్రీ సనక మహర్షిలా దివ్యతేజస్సుతో కూడి శ్రీ మండనమిశ్రుని గృహానికి పోవడానికి సిద్ధమయ్యారు.

62. శ్రీ శంకరులు శిష్యులతో కలసి ఆకాశ మార్గాన శ్రీ మండన మిశ్రుని గృహాన్ని చేరుకొన్నారు. అక్కడ వినమ్రుడైన శ్రీ మండనమిశ్రుని చూశారు. ఆతనిలో "నేను కర్మిష్ఠి" నన్న గర్వం నశించినది. పరిశుద్ధాత్మ తత్త్వంతో కూడి ప్రసన్నచిత్తుడైన శ్రీ మండనమిశ్రుడు గురూపదేశానికై నిరీక్షిస్తున్నాడు. అట్టి మండనమిశ్రుని చూసి, శ్రీ శంకరులు మహా సంతోషంతో తత్త్వముపదేశించడానికి సిద్ధపడ్డారు.

63. అంతట శ్రీ మండనమిశ్రుడు శ్రీ శంకరులకు సాష్టాంగ నమస్కారం చేసి, అర్ఘ్యపాద్యాది బహువిధ పూజలు గావించి గురుదేవుల ఆదేశానికై నిరీక్షించాడు. వినయ విధేయతలతో చేతులు కట్టుకొని నిలబడి ఉన్నాడు.

64. పరతత్త్వాన్ని తెలిసిన ఆ మండనమిశ్ర పండితుడు భక్తి ప్రపత్తులతో తన శరీరం, ధనం, మనస్సును గురుదేవులైన శ్రీ శంకరులకు సమర్పించుకొన్నాడు. త్రికాలాలందూ ఆయనే శరణ్యమని శరణుజొచ్చాడు. ఆ విధంగా అహంకార, మమకారరహితుడై, కర్తృత్వ భోక్తృత్వ బుద్ధిని విడనాడి పరతత్త్వాన్ని గ్రహించి జ్ఞానభరితుడయ్యాడు.

65. నిరుపమ తేజోరాశీ, విజ్ఞానందరూపుడూ, దివ్యతేజస్సుతో మహేశ్వరునిలా వెలుగొందుతూన్న శ్రీ శంకరులను చూసి ఆ ఉభయ భారతీదేవి, తన పూర్వజన్మల సుకృతంచే తన మనోరథం నెరవేరిందని సంతోషించింది. తన భర్త చేత, పండితుల చేత కొనియాడబడిన ఆ శంకరులను చూసి వినయంతో ఇలా పలికింది:

66. మహాత్మా! పరమశివా! తాము సర్వవిద్యలకు ప్రభువులు. సర్వప్రాణులకు నియామకులు. తాము బ్రహ్మదేవునకూ హిరణ్యగర్భునకూ ఈశ్వరులు; సాక్షాత్తూ పరమశివులు.

67. మహాత్మా! మన్మథకళాప్రసంగాన నన్ను జయింపగల సామర్థ్యం కలిగి ఉండికూడా, లోకానికి చాటిచెప్పడానికి, తాము ఆ విజ్ఞానాన్ని స్వయంగా అభ్యసించారు. తాము సర్వజ్ఞులు. దేవదేవులు. ఇది సత్యం.

68. పరాత్పరా! పరమశివా! సర్వజ్ఞా! తాము నన్ను వాదంలో జయించి తమ సర్వజ్ఞతను ప్రకటించారు. మేము ఉభయులమూ వాదంలో ఓడిపోయాం. అయినా అది మాకు అవమానం కాదు. భక్తులమైన మేము పరమశివుడవైన నీ శాసనాన్ని పరిపాలించటం ఆనందదాయకమే కాని, అవమానం కాదు. మానవ రూపాన్ని ధరించి మాతో వాదించటం లోక మర్యాదకేగాని మరొకటి కాదు. ఎంతటి వారైనా భగవత్తత్త్వాన్ని అతిక్రమించగలరా? సహస్ర కిరణాలతో ప్రకాశించే సూర్యభగవానుని ప్రకాశం ముందు చంద్రుని కాంతి వెలవెలబోతుంది. అంతమాత్రాన చంద్రునికది అవమానం కాదు. ఎందుకంటే, సూర్యప్రభావం చేతనే చంద్రాదులు ప్రకాశిస్తున్నారు. అట్లే, పరమశివుడవైన నీ స్వరూప తేజస్సు చేతనే మేమంద రమూ చైతన్యవంతులమవుతున్నాం. అందువలన మాకు అపకీర్తిగాని, పరాజయం కాని లేవు. బ్రహ్మతత్త్వముపదేశింపవచ్చిన తమకు ఏదీ అడ్డుగా నిలువలేదు. సూర్యరశ్మిలా అంతా జ్ఞానమయం చేస్తున్నారు.

69. "మహాత్మా! తమ దర్శన భాగ్యం చేత నాకు శాపవిమోచనమైనది. నా జన్మ ధన్యమైనది. నేను బ్రహ్మలోకానికి పోతున్నాను" అని పలికి ఆ ఉభయభారతీదేవి అంతర్ధానమయింది.

70. ఓ దేవీ! నువ్వు ఎల్లప్పుడూ అప్రాకృత తేజస్సుతో విరాజిల్లుతూం టావు. ఆ హిరణ్యగర్భుని ఇల్లాలివి. పరమేశ్వరునికి సహోదరివి. సర్వవిద్యలకు అధిష్ఠాన దేవతవు. సర్వవిద్యాస్వరూపిణివి. మహాదేవివి. జగజ్జననివి. వేదాం తాది బ్రహ్మవిద్యావిహారిణివి. లోకాలలో అజ్ఞానాన్ని రూపుమాపి విజ్ఞాన రసాన్ని ప్రసాదించే విద్యాజ్యోతివి. కేవలం చిద్రూపిణివి. నీ యథార్థ స్వరూపాన్ని తెలుసుకొన్నాను.

71 ఓ మాతృదేవీ! ఋష్యశృంగాది క్షేత్రాలలో పీఠాలు స్థాపించ దలస్తున్నాను. నన్ను అనుగ్రహించి ఆ పీఠాలలో నువ్వు అధిష్ఠాన దేవతవై

'శారదా' రూప నామాలను ధరించి పూజలందుకో. సకల జనులను కాపాడుతూ ఉండు. సత్పురుషులకు శరణ్యమై జ్ఞానాన్ని ప్రసాదించు.

72. శ్రీ శంకరుల ప్రార్థనను మన్నించిన ఆ దేవి 'తథాస్తు' అని పలికి సత్యలోకానికి పోయి తిరిగి పండితసభయందు తన పీఠాన్ని అలంక రించింది. సభాసదులందరికీ శ్రీ శంకరుల అద్భుత సిద్ధాంతాన్ని శ్రీ మండన మిశ్ర - ఉభయభారతీదేవుల సంవాదాన్ని తెలిపి వారినందరినీ ఆశ్చర్య పరచింది.

73. శ్రీ శంకరుల విజయాన్ని, శ్రీమండనమిశ్రుల వారి పరా జయాన్ని ప్రకటించి శ్రీ ఉభయభారతీదేవి తన నిజరూపాన్ని ధరించి బ్రహ్మ లోకానికి వెళ్లింది. తరువాత ఆ మండనమిశ్రుడు సన్న్యాసాశ్రమ స్వీకారానికి అర్హుడయ్యాడు.

74. శ్రీ మండనమిశ్రులు తానింతవరకు పరిరక్షిస్తున్న అగ్ని హోత్రాలను పరిత్యజించి, కర్మకాండలన్నీ విసర్జించి బాహ్యాభ్యంతరశుద్ధులై, జ్ఞానమార్గాన్ని స్వీకరించారు. శ్రీ శంకరుల పాదాలనాశ్రయించారు. అంటే కర్మానుష్ఠానాలు తాపాలను చల్లార్చవనీ, శ్రవణ మననాదులను ఆచరిస్తూ సద్గురుదేవుల శరణు పొందాలని అర్థం. పరబ్రహ్మ సాక్షాత్కారాన్ని పొంద డానికి ఇదే మార్గం. అప్పుడే శాశ్వతానందం లభ్యమవుతుంది.

75. శ్రీ శంకరులు సన్న్యాసాశ్రమ పరమధర్మాలను గృహ్యసూత్రాలలో చెప్పబడిన విధంగా శ్రీ మండనమిశ్రులకు ఉపదేశించారు. వత్సా! జనన మరణాలు లేవు. సంసారగతీ లేదు. దృశ్యాలతో కూడిన జగత్తు సత్యం కాదు. మూడు కాలాలందు ఏ సద్వస్తువుంటున్నదో అదే పరబ్రహ్మం. ఆ పరబ్రహ్మం నీవే. ఇది పరమసత్యం.

76. శ్రీ శంకరులు శాస్త్రోక్తరీతిగా మండనమిశ్రుని సన్న్యాసాశ్రమానికి అర్హుని చేయగా, విధి ననుసరించి శ్రీ మండనమిశ్రులు జ్ఞానభిక్షను కోరారు. తరువాత, శ్రీ శంకరులు తన ప్రియశిష్యునకు ఆత్మతత్త్వాన్ని ప్రబోధించారు. మహావాక్యాలలో ప్రధాన వాక్యమైన 'తత్త్వమసి' మహావాక్యాన్ని అర్థసహితంగా ఉపదేశించారు. ఈ మహావాక్యార్థం ఒక్కటీ తెలుసుకొంటే తక్కిన వాక్యార్థాలన్నీ

చాలా తేలికగా బోధపడతాయి. అదే జీవబ్రహ్మైక్యతత్త్వం. విచారించగా, జీవుడు, బ్రహ్మం అని రెండు వస్తువులు లేవు. ఉన్నదంతా బ్రహ్మమొక్కటే. అజ్ఞానంచే బ్రహ్మాన్ని జీవుడంటున్నాడు. విలువైన రత్నాన్ని చూసిన ఒక అజ్ఞాని కేవలం అది ఒక రాయి అని భావిస్తున్నాడు. అదే రత్నాల గూర్చి జ్ఞానవంతుడైనవాడు ఆ రత్నం విలువను గుర్తిస్తున్నాడు. అదే విధంగా సుఖదుఃఖాలతో కూడివున్న జీవుని అవివేకియైన వాడు బ్రహ్మమని తలస్తున్నాడు. జగత్తుకు అతీతమైన దృష్టితో చూసే తత్త్వజ్ఞాని బ్రహ్మాన్ని తెలుసుకొని పరమానంద పరమాత్మే అవుతున్నాడు. ఇదే అద్వైత సిద్ధాంతం; వేదాంతం ప్రతిపాదించే పరమశివం.

77. శ్రీ శంకరులు మరల ఇలా ఉపదేశిస్తున్నారు. "కుండలు మొదలైన దృశ్యపదార్థాల మల్లే శరీరం కూడా జడపదార్థమే. కాబట్టి చూసే 'నీవు' చూడబడే ఘటం (శరీరం) ఒకే తత్త్వమని చెప్పరాదు. శరీరం నామరూపాలతో కూడుకొని ఉన్నది. ఆత్మ నామరూపరహితం. కనుక దేహం ఎన్నటికీ ఆత్మ కాదు. ఘటాదులు చైతన్యరహితాలు. ఆత్మ చైతన్యవంతం. కాబట్టి నీవు శరీరం కాదు. అజ్ఞానం చేత 'నేను మనిషిని' 'నేను స్థూలంగా ఉన్నాను' 'నేను చిక్కిపోయాను' మున్నగు భావాలచేత ఈ దేహమే ఆత్మగా తలస్తున్నాడు. అట్టి అభేదభావం అజ్ఞానం చేత జనిస్తున్నది. 'నేను' అంటే ఆత్మ అని అర్థం. ఈ నేను అనేది సర్వ జగత్తునకు (సర్వదృశ్యాలకు) విలక్షణమైనది."

78. లోకంలో లోప్యపదార్థాలు, లోపక పదార్థాలు అని రెండు విధాలున్నాయి. లోప్యపదార్థాలంటే కార్యరూపమైనవి. అంటే ఘటాదుల వంటివి. అట్లే లోపకపదార్థాలంటే కారణరూపమైనవి. ఇవి ఘటాలు తయారుచేయడానికీ అవసరమైన దండచక్రాదుల వంటివి. అంటే లోప్య పదార్థాలు, లోపకపదార్థాల కన్నా భిన్నమైనవని తెలుస్తున్నది. అట్లే ఘటాల మల్లే దేహం కూడా లోప్యపదార్థమే. అంటే దేహం కార్యమవుతున్నది. అట్టి కార్యరూపమైన దేహానికి కారణం ఆత్మ అవుతున్నది. కనుక ఆత్మ దేహంకన్నా విలక్షణమైనది. కాబట్టి దేహం – దుఃఖం, అనృతం, నామ

రూపాత్మకమైనది. ఆత్మ - చైతన్యం, ఆనందం, సత్యం. ఈ రెండింటి ధర్మాలు పరస్పర విరుద్ధం కనుక దేహం ఆత్మకాదనేది సిద్ధాంతం.

79. ఓ మండనమిశ్రా! ఇంద్రియాలను ఆత్మగా తలచి కర్మిష్ఠుడవు కాబోకు. ఘటం 'నాది' అనే వ్యక్తి ఘటజ్ఞానం కలిగి తాను వేరుగా ఉన్నాడు. ఘటం జడమైనట్లే, నేత్రేంద్రియాలు నావి, అనే వ్యవహారంలో కూడా నేత్రాలు 'నావి' అని తెలిసే ఆత్మ వేరుగా ఉన్నది. ఆత్మకు ఇంద్రియాలు విషయాలవుతున్నవి. ఘటాదుల మల్లే ఇంద్రియాలు కూడా జడాలవడం చేత, మనుజునిలా ఆత్మను చూడజాలవు. దృష్టాంతం: జాగ్రదవస్థలో జీవుడు ఇంద్రియా లన్నిటితోనూ వ్యవహరిస్తాడు. స్వప్నావస్థలో బాహ్యేంద్రియాలన్నీ విశ్రమిస్తాయి. అయినా స్వప్నాలు మానసిక వ్యవహారం వలన కలుగుతున్నవి. సుషుప్తిలో మనస్సు కూడా విశ్రమించటంచే ఆత్మ ఒక్కటే ఉంటుంది. స్వప్న, సుషుప్తులలో ఇంద్రియాలు విశ్రమించటంచే జడాలై ఆత్మకంటే భిన్నంగా ఉన్నవి. దీనివలన ఇంద్రియాలు ఆత్మకాదని తెలుస్తున్నది. ఆత్మ అంటే చైతన్య పదార్థం. ఆత్మను ఆశ్రయించి ఉండటంచేత ఇంద్రియాలు కూడా చైతన్యవంతమై వ్యవహారాలందు ఆత్మకు సాధనాలై ఉపయోగపడు తున్నవి. కనుక ఆత్మ చైతన్యపదార్థమవటంచే జడాలైన ఇంద్రియాలను ఆత్మగా తలచరాదు.

80. ఇంద్రియాలన్నీ చేరి ఆత్మగా వచించ తగునా? లేక ప్రతి ఇంద్రియాన్నీ ఆత్మగా చెప్పదగునా? ఇంద్రియాల సమూహం ఆత్మ అని చెప్పడానికి వీలులేదు. ఎందుకంటే ఏదైనా ఒక ఇంద్రియం నష్టమైతే అట్టి ఇంద్రియంలో ఆత్మబుద్ధిని ఆపాదించలేము. విచారించగా, ఇంద్రియాలు జడాలు. అలాకాక ఒక్కొక్క ఇంద్రియాన్నీ ఆత్మగా చెబితే, ఈ వాదన కూడా సరియైనది కాదు. అలా అయితే దేహంలో బహునాయకత్వం ఏర్పడుతుంది. ఒక్కొక్క ఇంద్రియమూ విరుద్ధంగా ప్రవర్తించితే దేహవ్యాపారం సక్రమంగా జరగదు. కనుక ఇంద్రియాలు విడివిడిగా కూడా ఆత్మవస్తువు కాదు. ఆత్మ అనేది ఇంద్రియాలన్నింటికీ అతీతమైనది, ఇంద్రియాలను నియంత్రించేదీ, సర్వసాక్షి, నిర్వికారి, చైతన్యాత్మకం, శుద్ధం, బుద్ధం.

81. ఇంద్రియాలలో ఒక ఇంద్రియానికి ఆత్మతత్త్వాన్ని ఆపాదించవచ్చు నని అనవచ్చు. ఎందుకంటే "బహునాయకత్వదోషం ఉండదు. ఈ ప్రకారంగా ఒకటి నశించితే తక్కిన వాటి యందు ఆత్మబుద్ధి జనించదు" అని చెప్పవచ్చు. ఈ వాదన కూడా సమంజసంగా లేదు. నేత్రేంద్రియాన్ని ఆత్మగా అంగీ కరించితే, తానిదివరకు నేత్రంతో చూసిన వస్తువు స్మరణం, నేత్రనాశం చేత పోయివుండాలి. (అనుభూత వస్తువు స్మృతియే స్మరణం) కానీ కంటి చూపుపోయినా వెనుకటి స్మృతులు తెలుస్తున్నాయి. అందువలన ఇంద్రియాత్మ వాదం యథార్థం కాదు. కనుక ఇంద్రియాలు స్థిరాలు కావు. ఇంద్రియాలచే సుఖాలను పొందవచ్చు కాని, ఆత్మయని ఉపాసించడానికి వీలులేదు. ఇదంతా శాస్త్రజ్ఞానం కొరవడి, సద్గురుసన్నిధి లేకపోవడంచే సంభవిస్తున్నది.

82. "మనస్సు మానవ మనుగడకు ప్రభువు లాంటిది. అది చైతన్య స్వరూపం. దీనికి బహునాయకత్వపు దోషముండదు" అని వాదించవచ్చు. విచారించితే మనస్సు కూడా ఆత్మ కాజాలదు. అది ఎలాగంటే, "ఇది నా మనస్సు" అనేటప్పుడు మనస్సు వేరు, తాను వేరు అని తెలుస్తున్నది. లోకవ్యవహారంలో "నా మనస్సు ఇక్కడ లేదు" అని పలుకుతాం. అదీగాక, సుషుప్తి – స్వప్నం లేని – సమయాల్లో మనస్సు లయిస్తున్నది. అప్పుడు కూడా ఆత్మ సాక్షిగా ఉంటూ మనస్సుతో సంబంధం లేకుండా ఆనంద రూపాన ప్రకాశిస్తున్నది. మనస్సనేది బాహ్యేంద్రియం కాదు. అంతరంగంలో ఉండడంచే దానిని "అంతఃకరణ"మని కూడా పిలుస్తారు. కనుక మనస్సు కన్నా భిన్నమైన సద్వస్తువు వేరొకటి ఉంది. మనస్సు కూడా ఇతర ఇంద్రి యాలమల్లే మరొక ఇంద్రియం. అయితే ఇది సూక్ష్మమైన ఇంద్రియం.

83. బుద్ధి కూడా ఆత్మవస్తువు కాదు. మనస్సు మాదిరే బుద్ధి కూడా ఆత్మకు ఆంతరంగిక సాధనమై ఉన్నది. ఒకే అంతరంగాన సంకల్ప వికల్పాలు చేసేటప్పుడు మనస్సు అని వ్యవహరిస్తారు. ఒక విషయాన్ని నిశ్చయాత్మ కంగా నిశ్చయించేటప్పుడు బుద్ధి అని వ్యవహరిస్తారు. అందువలన బుద్ధి కూడా జడమే అవడం వలన ఆత్మ కాదు. బుద్ధి కూడా సాధనమే అవడం వలన 'నీవు' కాదు. ఆ బుద్ధికి సాక్షియైన ఆత్మే నీవు. అట్టి ఆత్మ చైతన్యాత్మకం.

పరిశుద్ధం. ఈ విషయాన్నే వేదాంతశాస్త్రం మనోబుద్ధులంతరింద్రియాలని స్పష్టం చేస్తున్నది. బాహ్య, అంతరింద్రియాలకు సర్వసాక్షియై ఆత్మ ప్రకాశిస్తున్నది.

84. బహిరింద్రియాలు, అంతరింద్రియాలు ఆత్మ కాకపోవచ్చు. మరి అహంకారమో, ప్రాణమో ఆత్మ కావచ్చు గదా అని నీవడుగవచ్చు. అవీ ఆత్మ కావు, ఎలాగంటే–

*అహంకారం:* అంతరంగం రజోగుణంచే వికారం చెందినప్పుడు అహంకారమని చెప్పబడుతున్నది. లోకంలో "పూర్వంలా కాదు. నా అహంకారమంతా నశించినది" అని పలుకుతాం. ఈ విధంగా అహంకారానికి, ఆత్మకు భేదాన్ని ప్రతిపాదించటం చేత అహంకారం కూడా జడమే అవుతున్నది. వేదాంతశాస్త్రంలో కూడా దీనిని అంతరంగచతుష్టయమని చెబుతున్నారు. ఈ విధంగా అహంకారం కూడా ఆత్మ కాదు.

*ప్రాణం:* సుషుప్తి యందు అహంకారం లేకున్నా, ప్రాణమున్నది గదా; అదే ఆత్మ అని పలుకరాదు. సత్త్వగుణంతో కూడిన అహంకారం అంతరంగ పరిణామమవటం చేత, అట్టి అవికారీ అపరిణామీయైన ఆత్మ కాదు. అంటే ప్రాణం కూడా ఆత్మ కాదు. ఆ ప్రాణాలు ఉండటం చేతనే ఉచ్ఛ్వాసనిశ్శ్వాసాలను చేస్తున్నవి. అంతవరకే దాని పని. ఎందుకు అలా చేస్తున్నదో తెలియదు. అందుచే అదీ జడమే. కనుక ఆత్మ కాజాలదు. అంతేగాక వ్యవహారంలో "నా ప్రాణాలు పోయినా" అని పలుకుతూంటాం. అంటే భేదం ప్రస్ఫుటంగా తెలుస్తున్నది కనుక ప్రాణం ఆత్మ కాదు.

85. ఆత్మ దేహేంద్రియాలతో కూడి సాక్షిగా ఉంటూ చైతన్యాత్మకమై దేహంలో ప్రకాశిస్తున్నది. తత్త్వమసి అనే మహావాక్యమందలి "త్వం" అనే పదంచే ఇలా చెప్పబడుతున్నది దేహేంద్రియాది విశిష్టమైన ఆత్మవస్తువు; ఆ దేహేంద్రియాదులకు సర్వసాక్షియై స్వయంప్రకాశమానమై, చైతన్యస్వరూపమై, కేవల ఆనంద స్వరూపమై విలసిల్లే ఆత్మే నీవై ఉన్నావు. ఇక తత్పదాన్ని గూర్చిన వాక్యార్థం ఇలా ఉన్నది. తత్పదం సర్వజగత్కారణమైన పరబ్రహ్మాన్ని ప్రతిపాదిస్తున్నది. వ్యష్టికి (ఒంటరికి) సాక్షి ఆత్మ అవుతున్నది. సమష్టికి

సాక్షి పరబ్రహ్మం. ఇంద్రియాలన్నీ ఆత్మచైతన్యంపై ఆధారపడి ఉంటవి. అట్లే లోకాలన్నీ పరబ్రహ్మ చైతన్యంపై ఆధారపడి ఉన్నవి. సర్వజగత్తులకు విలక్షణమై సర్వసాక్షియై, సర్వజ్ఞమై పరిపూర్ణమై, సచ్చిదానందమై విరాజిల్లే పరబ్రహ్మమే 'తత్పదము'నకు లక్ష్యార్థం. 'అసి' అనే పదానికి అర్థం ఇలా తెలుసుకో. ఈ 'అసి' అనే పదం దేహోపాధిని, జగదుపాధిని దూరంచేస్తూ, కేవల చైతన్య రూపాలైన ఆత్మ పరబ్రహ్మల ఏకత్వాన్ని తెలుపుతున్నది. ఇదే 'తత్త్వం' పదాలకు లక్ష్యార్థమైన జీవబ్రహ్మైక్యం.

86. **శ్రీ మండనమిశ్రుడు:** మహాత్మా! పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వవ్యాపి, నిర్వికారి. జీవుడు దేహంలో ఉండేవాడు. వికారి. అల్పజ్ఞుడు. వీరిరువురి ధర్మాలు పరస్పరవిరుద్ధం. కానీ తాము తత్త్వమసి మహా వాక్యార్థంగా జీవేశ్వర ఏకత్వాన్ని ప్రతిపాదిస్తున్నారు. వారిరువురిలో కేవలం చైతన్యం తప్ప మరే యితర విషయాలందూ సామ్యం లేదని బోధించారు. ఈ విధంగా పరస్పర విరుద్ధ ధర్మాలతో ఉండే వారి యందు ఏకత్వం ఎలా పొసగుతుంది? జీవుని స్వభావం అజ్ఞానం, అంధకారమయం. పరమాత్ముని తత్త్వం జ్ఞానం, పరిశుద్ధం, ఆయన స్వయంప్రకాశకుడు. అపరిచ్ఛిన్నుడు. పరిచ్ఛిన్నమూ, అపరిచ్ఛిన్నమూ ఒకే వస్తువులో ఉండడం అసంభవం కాదా? జీవేశ్వరుల ఏకత్వాన్ని తత్త్వమసి వాక్యం ఏ విధంగా సమర్థిస్తున్నది. అందువలన నాకు ఆ పరతత్త్వం బోధపడ లేదు. తాము సర్వ రక్షకులు. నా సందేహాన్ని నివృత్తిచేసి, నన్ను జ్ఞానవంతునిగా చేయండి.

87. **శ్రీ శంకరులు:** తత్త్వమసి వాక్యార్థాన్ని లక్షణావృత్తి ననుసరించి విచారణ చేయాలి. ఉపనిషత్తులు లక్ష్యార్థాన్ని గ్రహింప "వాడే యీ పురుషుడు" అని ప్రయోగిస్తున్నవి. అంటే దేశకాలాదులతో నిమిత్తంలేక పురుషుడొక్కడే అని తెలిస్తే, తత్త్వమసి వాక్యార్థమందలి జీవేశ్వరతత్త్వానికి భేదం లేదని తెలుసుకోగలవు. కేవలం చైతన్య రూపమైన జీవేశ్వరులను మాత్రం గ్రహించి, వారి ఉపాధులను విసర్జించితే 'తత్త్వం' అనే ఆ రెండు పదాలు జీవేశ్వరులకు లక్ష్యమైన ఐక్యాన్ని బోధిస్తున్నవి. జీవునియందు శరీరం ఉపాధి; పరమేశ్వరుని యందు జగత్తు ఉపాధి. ఈ రెండూ కల్పితాలే. విచారించగా మిగిలేది

ఒకే చైతన్యమని తెలుస్తున్నది. ఇదే మూడు కాలాలలోనూ సత్యంగా ఉండేది. స్వయంప్రకాశంగా ఉండేది. ఇదే జీవబ్రహ్మైక్యం. ఇదే అద్వైతం. ఇక్కడ జీవబ్రహ్మైక్యమంటే రెండు పదార్థాల కలయికని తలచరాదు. ఆ రెండు ఉపాధులను తొలగించితే, అంటే దేహమందలి సాక్షి, జగత్తునందలి సాక్షితాలు తొలగిపోతే రెండింటిలోనూ మిగిలి ఉన్నది చైతన్యం మాత్రమే. దీనినే జీవబ్రహ్మైక్య తత్త్వమని అంటారు.

88. దేహేంద్రియాల యందు 'నేను' అనే అహంకారం బహు జన్మల నుండి వెంటవస్తున్నది. మానవుని కష్టాలన్నింటికీ ఈ అహంకారమే మూలం. కర్మలు చేసేవారందరూ ఈ అహంకారం నుండి తప్పించుకోలేరు. దీని నుండి బయట పడాలంటే ఒక్కటే ఉపాయం ఉంది. 'నేను' అనే బుద్ధిని దేహంపై ఉంచక భగవంతునిపై నిలిపితే ఈ దుష్టాహంకారం నశిస్తుంది. అప్పుడు జన్మకు కారణమైన అహంకారం పూర్తిగా నశిస్తుంది. మనస్సు తీగవంటిది. అది ఆలంబనం లేకుండా ఉండలేదు. జగత్తునందలి విషయాల (దృశ్యాల) పై ఉండే మనస్సును దృశ్యరహితమైన ఆ పరమాత్మపై నిలిపితే అట్టి చిత్తం చిద్రూపమవుతుంది. అప్పుడు అహంకారాలన్నీ నశిస్తాయి. సంశయాలు విడచి ఆత్మను పరమాత్మగా ధ్యానించు. అహంకారం సంసారానికి మూలకారణం.

కనుక ఓ ధీశాలీ! పూర్వం మల్లే కర్మలపై ధ్యాసను విడచి, ఆ పరమాత్మే నీవనే తత్త్వమసి మహావాక్య ప్రబోధం చేత పరమాత్మను తెలుసుకో. ముక్తిపదాన్ని పొంది శాశ్వతానందం పొందు.

89. ఈ శరీరం మీది మమకారాన్ని విడువు. జననమరణ రూపమైన సర్వానర్థాలకు మూలమైనది ఈ దేహం. ఈ మృతదేహం కాకులు, గ్రద్దలు, నక్కలకు ఆహారమై ఉన్నది. మరణానంతరం ఈ దేహాన్ని దహిస్తారు. మాతృగర్భాన పిండరూపంలో ఉండి నానాయాతనలు అనుభవిస్తుంది. అట్టి ఈ దేహంపై మమకార అహంకారాలు ఎందుకు? మమకారం వీడితే, అహంకారం కూడా నశిస్తుంది. దేహం మీది మమకారం విడిస్తే దృశ్యవస్తువులైన సిరిసంపదలపై కూడా మమకారం నశిస్తుంది. కనుక పరమాత్మ

ధ్యానంతో సుస్థిరుడవై, సర్వసంకల్పాలను నశింపజేయి. సంకల్పాలు నశింపకుంటే బ్రహ్మం కాజాలదు. కాబట్టి పరమాత్మ స్వరూపుడవై ఉండు. ఎంతవరకు మనస్సు దృశ్యవస్తువులపై ఆరాటపడుతుంటుందో, అంతవరకు హృదయమందు అగాధా లేర్పడతాయి. కనుక దృశ్యాలను వదలి ఆత్మను ధ్యానించు.

90. ఓ ప్రజ్ఞానిధీ! జాగ్రదాది అవస్థలతో చేరి, అవస్థారూప ధర్మా లందుండే ఆత్మను పరమాత్మగా తెలుసుకో. ఆత్మవస్తువు జాగ్రదాది అవస్థలయందు సాక్షియై సర్వవిలక్షణమై ఉన్నది. అది ఎలాగంటే, నదు లందు, తటాకాలందు చేపలు ఈ తీరం నుండి ఆ తీరానికి, మరల ఆ తీరం నుండి ఈ తీరానికి ఈదుతూంటాయి. అయినా, ఆ తీర ధర్మాలను అంటదు. అదే విధంగా, ఈ ఆత్మ కూడా సంసారమనే మహానదియందు జాగ్రదాది మూడు అవస్థారూపమైన తీరాలను తాకక సంచరిస్తుంటుంది. జడాలైన ఆ మూడు అవస్థల కంటే, చైతన్యవంతమైన ఆత్మ అవస్థారూప ధర్మాలను అంటదు. కనుక ఆత్మను పరమాత్మగా తెలుసుకొని పరమాత్మ స్వరూపుడవవు. ఆత్మ ఆ మూడు అవస్థలకూ సాక్షి మాత్రమే. ఇది శ్రుతివాక్య ప్రమాణం.

91. ఆత్మను గూర్చిన అజ్ఞానం చేత ఈ మూడు అవస్థలు కల్పితమై ఉన్నవి. జాగ్రత్స్వప్నసుషుప్తుల గూర్చి వివరిస్తాను, విను.

*1. జాగ్రదవస్థ:* అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారాలు జాగ్రదవస్థయందు వ్యవహరిస్తున్నవి. ఈ జీవుని విశ్వుడని చెబుతున్నారు. ఇది సత్త్వగుణం.

*2. స్వప్నావస్థ:* కేవలం ఒక్క మానసిక వ్యవహారం చేతనే స్వప్నావస్థ ఏర్పడుతున్నది. ఈ జీవుని తైజసుడని వ్యవహరిస్తారు. ఇది రజోగుణం.

*3. సుషుప్త్యవస్థ:* ఈ అవస్థ యందు బాహ్యాంతర వ్యాపారాలన్నీ, అవిద్యావ్యాప్తి చేత, నిద్రిస్తాయి. ఈ జీవుడు ప్రాజ్ఞుడని పిలువబడతాడు. ఇది తమోగుణం.

ఈ మూడు అవస్థలలోను వర్జితమైనది తురీయావస్థ. స్వస్వరూప జ్ఞానం కలిగినది. ఈ జీవుడే పరిశుద్ధాత్మ. పరమాత్మలో ఐక్యమవుతున్నాడు. శుద్ధజీవుడే పరబ్రహ్మమని గ్రహించాలి. ఈ మూడు అవస్థలు బుద్ధి ధర్మాలై ఉన్నాయి. ఈ అవస్థలు స్థిరం కావు. జాగ్రదవస్థలో ఉన్నప్పుడు స్వప్నావస్థ సంభవింపదు. సుషుప్తిలో ఉన్నప్పుడు జాగ్రత్తు, స్వప్నాలు సంభవించవు. కానీ ఆత్మమాత్రం (నీవు) మూడు దశలలోనూ సాక్షిరూపంలో స్థిరంగా ఉన్నావు. "ఇది తాడు" అని చెప్పినప్పుడు, 'ఇది' అనేది సామాన్యాంశం. 'తాడు' అనేది విశేషాంశం. 'తాడు' అజ్ఞానం చేత పాముగా భ్రమపడటం కల్పితమవుతుంది. అదేవిధంగా చైతన్యస్వరూపుడవైన నీలో అజ్ఞానం చేత ఈ మూడు అవస్థలు కల్పించబడినవి. 'ఇది ఆత్మ' అనేటప్పుడు 'ఇది' సామాన్యాంశం. 'ఆత్మ' అనేది విశేషాంశం. ఈ సామాన్యాంశంలో 'ఆత్మజ్ఞానం' మరుగున పడినప్పుడు ఈ మూడు అవస్థలు భ్రాంతి చేత కల్పితమవుతున్నవి. కనుక ఈ మూడు అవస్థలకు సాక్షియైన ఆ పరబ్రహ్మమే నువ్వు. ఆత్మే పరమాత్మ. పరమాత్మయే ఆత్మ. ఉన్నది ఒకే ఒక్క చైతన్య స్వరూపం. ఇదే పరమశివం.

92. సర్వత్రా సచ్చిదానందమై, పరమ శాంతిప్రదమై వ్యాపించివున్న పరబ్రహ్మాన్ని తెలుసుకోలేక జనులు మూఢమతులై సంసారంలో చిక్కుకొంటున్నారు. విద్వాంసులకు పరిశుద్ధాత్ములైన జ్ఞానవంతులకు అది వారి ప్రక్కనే ఉండగా అజ్ఞానులైన మూఢజనులకు ఎంతో దూరంగా ఉన్నది. అంధులు వస్తువులు వారికి సమీపంలో ఉన్నా చూడలేరు గదా! అట్లే అవివేకులు కూడా ఆత్మను చూడలేరు. ఆత్మశక్తిమహిమ అత్యద్భుతం; అనిర్వచనీయం.

93. వైరాగ్యంతో కూడిన జ్ఞానం లేని పక్షంలో ముక్తి లభించదు. బాటసారులు చలివేంద్రాలందు ఒక్కసారిగా గుమిగూడతారు. తమకు తోచినదంతా మాట్లాడుతూ, వారి పనులు పూర్తి చేసుకొని ఎవరి దారినవారు పోతారు. అట్లే అవివేకులు అనేక నామరూపాలతో వారి కర్మానుసారం నివసిస్తున్నారు. చివరకు కర్మఫలం పూర్తి కాగానే (మరణమాసన్నమై)

విడిపోతున్నారు. ఈ శరీరం అనిత్యమైనప్పుడు వారి బంధుత్వాలు శాశ్వతమవు తవా? కనుక కర్మల విడిచి స్వస్వరూపాన్ని తెలుసుకో.

94. మానవుడు సుఖాల నాశించి దుఃఖాలనే పొందుతున్నాడు. దేహాన్ని, భార్యాపిల్లలను, బంధుమిత్రులను, సంపదలను ఆశ్రయించి సుఖాలు పొందాలని తలస్తున్నాడు. ఆత్మవిచారం చేయక పూర్వంమల్లేనే సుఖాల కోసం పరితపిస్తున్నాడు. ఇహాన సుఖాలు పొందాలంటే పుణ్యకర్మలు చేయాలి. అట్టి పుణ్యాలు కూడా పూర్వజన్మలలో ఆచరించి ఉండాలి. అట్టి పుణ్యకర్మలు పరిశ్రమలేక లభింపవు గదా? కనుక కష్టాలులేక సుఖాలు పొందలేరు. విచారించితే సుఖాలు కూడా దుఃఖరూపంగానే ఉన్నవి.

95. బ్రహ్మసాక్షాత్కార జ్ఞానం సంపాదించాలంటే సంసారం నుండి విముక్తి పొందాలి. అట్టి పరిశుద్ధాత్ముడు గురుని కృపచేత సర్వదోషాలు నశించి తత్త్వమసి వాక్యార్థాన్ని సూక్ష్మబుద్ధితో గ్రహించి స్వస్వరూపాన్ని తెలియగలుగుతున్నాడు. నిత్యముక్తుడవుతున్నాడు. ఇట్టి ముముక్షుని వేదాంత శాస్త్రం ఉత్తమాధికారిగా వచిస్తున్నది. అలాకాక, విషయాలందు సంపూర్ణంగా విరక్తి చెందని మధ్య తరగతి ముముక్షువులు (మందమతులు) ఆత్మస్వరూపాన్ని తెలుసుకోగలిగే సూక్ష్మబుద్ధికోసం గురుదేవుని పాదాల నాశ్రయించి శుశ్రూష చేయాలి. ఈ విధంగా పరిపక్వబుద్ధి కలిగితే తత్త్వమసి మహావాక్యార్థం వలన జీవబ్రహ్మైక్యతత్త్వం తెలుస్తున్నది. తత్త్వమసి వాక్యతత్త్వాన్ని తెలుసుకొంటే, క్రమక్రమంగా సంపూర్ణజ్ఞానం కలుగుతుంది.

96. మందబుద్ధి గలవారు తత్త్వజ్ఞానాన్ని పొందాలంటే కొన్ని నియమనిష్ఠలను ఆచరించాలి. ఎందుకంటే, ఆత్మశుద్ధి లేనిదే జ్ఞానం ఉదయించదు. పరిశుద్ధమైన ఆత్మ కడిగిన అద్దం లాంటిది. అప్పుడే వేదాంత తత్త్వాలు చక్కగా గోచరిస్తవి. కనుక ప్రతిదినం ప్రణవాన్ని జపించాలి. ప్రణవం సర్వవేదాలకు మూలం. కేవల పరబ్రహ్మ వాచకం. కనుక మూడు పూటల స్నానం చేసి ప్రణవానికి తరువాత ఉపనిషత్తులను పఠించాలి. ఇంద్రియాలను జయించి జితేంద్రియుడు కావాలి. గురువే పరమ దైవమని భావించి ఆయన పాదపద్మాలను పూజిస్తూ, శుశ్రూష చేయాలి. సద్ధర్మాలను

ఆచరించటం వలన మనస్సు నందలి మలినాలన్నీ కడిగివేయబడతాయి. సర్వపాపాలు హరించి పరిశుద్ధమవుతుంది. మనస్సు తేలికపడుతుంది. అలా తేలికయైన మనస్సు గురువు ద్వారా పొందే వేదాంత తత్త్వసారమంతా గ్రహించే సామర్థ్యం పొందుతుంది. ఆ విధంగా వేదాంత శ్రవణాలచే ఉత్తమాధి కారి అవుతున్నాడు. ముముక్షువులంతా ఆత్మశుద్ధిని పొందాలని మనుస్మృతి తెలుపుతున్నది.

97. ముముక్షువులందరూ గురుస్వరూపాన్ని తెలుసుకొని పరమ భక్తితో గురువును సేవించాలి. గురుభక్తే (సేవ) తత్త్వసాధనకు మొదటి మెట్టు. కనుక రాత్రింబవళ్ళు మనస్సును గురువు మీదనే నిలపాలి. బ్రహ్మజ్ఞానతత్త్వం తెలిసిన గురువు సాక్షాత్తూ పరమశివుడే. సద్గురునికృపచేత సర్వాభీష్టాలు సిద్ధిస్తున్నవి.

శ్లో... గురుర్బ్రహ్మ....................."

శిష్యుడు ఎల్లవేళలా గురుసన్నిధిలోనే ఉండి శుశ్రూషాతత్పరుడు కావాలి. సంతుష్టుడైన గురువు అప్రాకృతమైన కృపాదృష్టిని శిష్యునిపై ప్రసరింపజేస్తాడు. అప్పుడు శిష్యుని సర్వబంధాలు తొలగి, బ్రహ్మవిద్యచేత ముఖం విజ్ఞాన తేజస్సుతో నిండిపోతుంది.

98. శ్రీ గురుదేవుని పరమ దైవంగా ఎంచి, తదాజ్ఞలను పరిపాలిస్తూం డాలి. గురుదేవుని కృపచేత, సర్వదురితాలు నశించి, అమృతత్త్వమూ సిద్ధిస్తుంది. కనుక శ్రీ గురుదేవుని ఆజ్ఞను పరమానందంతో, నిష్కపటభావంతో పరిపాలించాలి.

99. మొదట గురుదేవులు తన శిష్యునకు ఇష్టదేవతారూపాన్ని మంత్రపూర్వకంగా ఉపదేశిస్తాడు. కారణాంతరాల చేత ఆ ఇష్టదైవం శిష్యునిపై కోపగిస్తే అప్పుడా గురుదేవులే శిష్యుణ్ణి కాపాడతాడు. అంతేకాదు, ఎంత కాలమైనా, శిష్యునికి దైవానుగ్రహం కలుగని పక్షంలో, ఆ గురుదేవులే మరల మంత్రోపదేశం చేసి శిష్యుని భగవదున్ముఖుని చేస్తాడు. ఒకవేళ ఆ గురుదేవులే శిష్యునిపై కోపగిస్తే, ఆ ఇష్టదైవం కూడా రక్షింపలేదు. గురువంటే లోకంలో సంసారతాపంలో పడి ఉండే జీవులకు పరమతత్త్వాన్ని

ఉపదేశించి, వారిని ఉద్ధరించడానికి భగవంతుడే పంపిన సచ్చిదానంద స్వరూపుడు. గుర్వాజ్ఞను మీరితే దైవాజ్ఞ మీరినట్లే. గురువుకు కోపం కలిగిస్తే, అట్టి శిష్యుని రక్షించగల సమర్థుడు ఏ లోకంలోనూ లేడు. అందువలన గురువుకు కోపం రాని విధంగా శిష్యుడు నడుచుకోవాలి. గురువుచే తిరస్కరించబడినవానిని ఈ లోకంలో పరిహసిస్తారు; పై లోకాలు తిరస్కరిస్తాయి.

100. గురువు విధినిషేధాల నుపదేశించి శిష్యుని శాస్త్ర విహితునిగా చేస్తాడు. ఈ విధినిషేధాలను శాస్త్రాలను చదివి నేర్చుకోలేమా? అని ప్రశ్నించవచ్చు. శ్రీ గురుకృపలేకుంటే అదీ సాధ్యపడదు. అట్టి విధినిషేధ శాస్త్రాలను గురువు సులభతరం చేసి, సంశయాలు తీర్చి ఉపదేశిస్తాడు. పరమదయతో శిష్యునికి తన చేయూతనిచ్చి గమ్యం చేరుస్తాడు. గురుకులంలో శిష్యుని నిశితంగా పరీక్షించి తపస్సు, ధ్యానం మొదలైన కర్మలందు సన్మార్గ వర్తనుడయ్యేట్లు తోడ్పడతాడు. ఆ విధంగా శిష్యుని ధర్మాచరణ ప్రవృత్తి అంతా గురుదేవుని అధీనంలో ఉంటుంది. నిరంతరం కర్తవ్యాకర్తవ్యజ్ఞానం ఉపదేశిస్తూ, అనర్థరూపమైనవిషయాలను పొందకుండాను, ఆనంద ప్రాప్తిని చేకూర్చే విషయాలందు ప్రోత్సహిస్తూ పరమ కారణమై ఉంటాడు. కనుక గురుపరబ్రహ్మకన్నా అధికుడు లేడు.

101. గురువు దేవోపాసకుడూ, పరమభక్తుడూ అవటం వలన, గురుకృపచేత శిష్యునకు దేవతానుగ్రహం కూడా సిద్ధిస్తుంది. దేవతా స్వరూప జ్ఞానం, మంత్రప్రాప్తి, జప విధానం మున్నగునవన్నీ గురుకృప చేతనే పొందగలరు. వేదాంతమార్గాన గురుదేవుని మహోపదేశాలు లేక అతీంద్రియ జ్ఞానాన్ని, ధ్యానవిధిని తెలుసుకోజాలడు. ఎన్ని విధాలుగా ఆలోచించినా, శ్రీ గురుదేవుని శరణు పొందే తీరాలి. అదే ముక్తిపదం.

102. గురుదేవుడు సంతోషిస్తే సర్వదేవతలూ సంతోషిస్తారు. సర్వదేవతల అనుగ్రహాన్ని పొందవచ్చు. గురుదేవుని కోపానికి పాత్రుడైన దౌర్భాగ్యుణ్ణి ఏ దేవుడూ రక్షించలేడు; పదభ్రష్టుడవుతాడు. ఆ శ్రీ గురుదేవుడంటే ఎల్లప్పుడూ మాతృభావంతో వాత్సల్యం చూపే కరుణామయుడు. సర్వ దేవతలను,

ఆత్మస్వరూపాన గాంచుతూ, సర్వాత్మకుడై ఉంటాడు. సర్వం శ్రీ గురుపరబ్రహ్మ మయం.

103. **శ్రీ మండనమిశ్రుడు:** పరమ గురువరేణ్యా! తమలా లోకహితం కోరేవారు ముల్లోకాలలోనూ లేరు. తమ విజ్ఞానమయ దృష్టి ప్రసరణ చేత, జన్మజన్మల నుండి పేరుకుపోయిన నా తమస్సు పూర్తిగా నశించినది. నన్ను భయంకర సంసార సాగరంనుండి ఉద్ధరించారు. సకల సంతాపాలు ఉపశమించాయి. పరమశాంతి లభించినది. పరమానందం పొందాను. నా స్వరూపం చిన్మయం. కేవల మానందమయం. ధన్యుడనయ్యాను. జనన మరణాది ద్వంద్వాల నుండి బయటపడి ముక్తిపదం లభించినది. తమ అనుగ్రహం చేత పొందవలసినదంతా పొందాను. తమకు సాష్టాంగంగా ప్రణమిల్లుతున్నాను. కృతకృత్యుడనైనాను.

104. శ్రీ శంకరులు శ్రీ మండనమిశ్రుని తన ప్రియశిష్యునిగా చేసుకొని తురీయాశ్రమం ఒసగారు. సన్న్యాసాశ్రమ స్వీకరణసమయంలో ప్రఖ్యాత సురేశ్వరాచార్యులనే పవిత్ర నామం ఒసగారు. తరువాత శ్రీమండన మిశ్రులు సురేశ్వరాచార్య నామధేయంతో శ్రీ శంకరాచార్యుల శిష్యగణంలో ముఖ్య శిష్యపదవి నధిష్ఠించారు; ఆనాటి నుండి శ్రీ శంకరులకు సర్వకార్యాలందూ, భాష్య ప్రవచనాలందూ ప్రియతములైనారు; శ్రీ గురు చరణాల సేవాభాగ్యం చేత నిత్యానందులై, బ్రహ్మజ్ఞాన సంపత్తి బ్రహ్మ పదవికన్నా కడు యోగ్యమైనదని తలచారు.

105. శ్రీ మండనమిశ్రులు మగధ దేశంలో నర్మదానదీ తీరాన చాలాకాలం నివసించారు. నిరహంకారులలో ఉత్తములుగా పేరొందారు. అటువంటి శ్రీ మండనమిశ్రులు శ్రీ శంకరుల కృపాకటాక్షాలచేత సర్వసంపద లను త్యాగం చేసి సురేశ్వరాచార్యులనే నామం స్వీకరించి సన్న్యసించారు. శ్రీ శంకరుల అద్వైత బోధలకు ఆకర్షితులై సర్వకర్మ సంబంధిత శాస్త్రాలను విడనాడారు. వేదాలకు తలమానికాలైన ఉపనిషత్తులను జీవబ్రహ్మైక్యతత్త్వంతో అనుసంధానం చేసి పరబ్రహ్మంలో నిరంతరాయంగా క్రీడించారు.

106. శ్రీ శంకరులు లోకంలో వేదాంత విద్యను సుస్థిరం చేయడానికి అవతరించిన పరమశివులు. శ్రీ మండనమిశ్రులు, లోకంలో నాస్తికవాదం మితిమీరిపోయి వేదాలు అంతరించిపోవటం చేత, వైదిక విద్యను ఉద్ధరింప అవతరించిన సాక్షాత్తూ బ్రహ్మదేవులు. శ్రీ మండనమిశ్రులు లోకమందు కర్మ నిష్ఠలను ప్రతిపాదించి వేద పథాన్ని శాఖోపశాఖలుగా విస్తరింపజేశారు.

అటువంటి (సంధి) సమయంలో జనులు కర్మిష్ఠులై మోక్షాన్ని పొంద జాలరైరి. అట్టి సమయంలో శ్రీ ఆదిశంకరాచార్యుల వారు జీవబ్రహ్మైక్య తత్త్వాన్ని బోధించి ఆశ్రితులను తరింపజేశారు. అట్లే కర్మసిద్ధాంతంలో ప్రవీణులైన శ్రీ మండనమిశ్రులను, వారి భార్య ఉభయభారతీదేవిని, వాద మందు సర్వశాస్త్రాలను చర్చించి జయించారు. అద్వైత తత్త్వాన్ని సిద్ధాంతీ కరించారు. ఈ విధంగా వేదాంతమార్గాన్ని వ్యతిరేకించిన శ్రీ మండనమిశ్రులను వాదంలో జయించి తమ శిష్యునిగా చేసుకొన్నారు. తరువాత శ్రీ మండన మిశ్రునితోకూడి, అద్వైతసిద్ధాంతాన్ని సుస్థిరం గావింప జైత్రయాత్రకై, మాహిష్మతీపురం నుండి బయలుదేరారు.

107. శ్రీ శంకర గురుదేవులు శిష్యపరివారంతో కలసి యమధర్మరాజ పాలితమైన దక్షిణదిక్కుగా దిగ్విజయయాత్రకై బయలుదేరారు. ఆ దేశ మంతా ధర్మభూమిగా చేయదలచారు.

108. శ్రీ శంకరులు దక్షిణ దిక్కుగా జైత్రయాత్రను ప్రారంభించి మొదటగా మహారాష్ట్ర దేశమందు కాలుమోపారు. మతాంతరవాదాలన్నీ ఖండించారు. విమతమతాహంకారుల మదమణచారు. వేదాంత తత్త్వాన్ని బోధిస్తూ, బ్రహ్మసూత్రభాష్యాన్ని ప్రచారం చేస్తూ విజ్ఞానామృతాన్ని వర్షింపజేశారు. అక్కడ నుండి శ్రీ శైలానికి చేరి శ్రీ మల్లికార్జున స్వామిని సేవించుకొన్నారు.

109. ఆ శ్రీశైలపర్వతరాజం సుదూరాలకు విస్తరిస్తూ ఆకాశాన్ని అంటుకొనే వృక్షాలతోను, సువాసనలు వెదజల్లే మల్లికా పుష్పాలతోను, మత్తగజాలతోను, ఆ గజాల కుంభస్థలాలు చీల్చే సింహరాజాలతోను విలసిల్లుతూన్నది. ఆ పర్వతరాజం పాదాలను కడుగుతూ మహాతరంగాలతో

వేగంగా ప్రవహిస్తూన్న పాతాళగంగను చూసి శ్రీ శంకరులు మహా సంతోషంతో భక్తి ప్రపత్తులతో స్నానం చేశారు.

110. శ్రీ శంకరులు శిష్యులతో కలసి పాతాళగంగయందు స్నానమాచరించి, ఆకాశాన్ని స్పృశించే శిఖరాలతో కూడి, సర్వపాపాలను హరించే మల్లికార్జునలింగాన్ని కడు భక్తిశ్రద్ధలతో అభిషేకించారు.

111. శివస్వరూపులయి ఉండే శ్రీ శంకరులు భ్రమరాంబా - మల్లికార్జున స్వాములకు భక్తితో ప్రణామం చేసి ఎంతో సంతోషించారు.

113. నానా విధాలైన వృక్షాలతో, మహానదీ ప్రవాహంతోను, ఆ మహోన్నతపర్వతరాజమందు, యోగులు, సిద్ధపురుషులు తపస్సు చేసుకోవడానికి యోగ్యమైన అనేక గుహలు ఉన్నవి. అట్టి పాతాళగంగా తీరాన శ్రీ శంకరులు నివసించారు.

114. ఆ మహానదీ తీరమందు శ్రీ శంకరులు సాధన చతుష్టయ సంపత్తితో కూడి వేదాంత శ్రవణం చేశారు. పండిత ప్రవరులు, జిజ్ఞాసువుల కొరకు, తాను రచించిన బ్రహ్మసూత్రాది గ్రంథాలందలి అంశాలను వ్యాఖ్యానించి ప్రబోధించారు.

115. శ్రీ శంకరులు వేదవిరుద్ధమైన మతాలను ఖండిస్తూ వేదాంత ప్రతిపాదక విజ్ఞానామృతాన్ని ఉపదేశించసాగారు. కుమతులైన పాశుపత, వైష్ణవ, వీరశైవ, మాహేశ్వరాది మత ప్రవర్తకులు అనేకమంది విచ్చేసి శ్రీ శంకరుల అద్వైత తత్త్వాన్ని ఆక్షేపించారు. శ్రీ శంకరుల ప్రియశిష్యులైన శ్రీ సురేశ్వరాచార్యులు పాశుపతాది మతప్రవర్తకులందరినీ సమర్థంగా ఖండించారు. వారి వాదాలన్నింటినీ జయించి అద్వైతతత్త్వాన్ని స్థిరంగా స్థాపించారు. ఈ విధంగా శ్రీ శంకరులు తమ ప్రత్యర్థులను ఎదుర్కోవడానికి శిష్యులను సమర్థవంతులుగా రూపొందించారు.

116. శ్రీ శంకరుల ప్రబోధకాలంలోనే ఆయనను సమర్థించే వారు విభేదించే (స్వపక్షవిరుద్ధ) మత ప్రచారకులున్నారు. కొందరు పండితులు యథార్థ తత్త్వాన్ని తెలిసికొని, రాగద్వేషాదులను విసర్జించి, తమ మతం సత్యం కాదని గ్రహించారు. శ్రీ శంకరులకు శిష్యులై వేదాంతజ్ఞానాన్ని పొంది

కృతార్థులయ్యారు. మరికొందరు దుష్ట పండితులు శ్రీ శంకరుల సిద్ధాంతాలను ఖండిస్తూ జ్ఞానం లేనివారైనారు. శ్రీ శంకరుల జీవితకాలంలో తాము ఆయనను ఎదుర్కోలేమని తీర్మానించుకొని, ఆయన మరణానికి ఎదురుచూడసాగారు.

117. సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపులైన శ్రీ శంకరులు వేదాంత ప్రతిపాదిత అద్వైత తత్త్వాన్ని బోధించసాగారు. శ్రీకృష్ణుని కాలమందలి పౌండ్రక వాసుదేవునిలా, కొందరు వేద విరోధులైన దుష్టపండితులు ఆచార హీనులై అసత్యాలను సత్యాలని వాదిస్తూ (స్వకల్పితాలు) వేదాంత ప్రతిపాదితమైన ఆత్మతత్త్వాన్ని విరోధభావంతో దూషింపసాగారు. ఆ పాషండమతవాదులందరూ పౌండ్రకునిమల్లే సంసారగతిని పొందుతున్నారు. అజ్ఞానాంధులై భాస్కరునిలా ప్రకాశించే శ్రీ శంకరులను చూడలేకున్నారు.

118. సమర్థులైన శ్రీ సురేశ్వరాచార్యులు శ్రీ గురుదేవుల వేదాంత సూక్తులందు కేవలాద్వైత సిద్ధాంతాన్ని ప్రబోధిస్తుండగా, ముముక్షువులు అంతు తెలియని ఆనందం పొందసాగారు. శ్రీ శంకరుల శిష్యులు వేదాంత ప్రబోధాలు చేస్తుండగా:-

1. కాణాదులు - తర్కశాస్త్రవాదులు గణింపబడకపోయారు.
2. కాపిలవాణివాదులు - సాంఖ్యశాస్త్రవాదులు అదృశ్యమైనారు.
3. శైవులు - శివతత్త్వవాదులు అమంగళాన్ని పొందారు.
4. అర్హత్పదము - జైనమతస్థులు గర్హ్యస్థానాన్ని పొందారు.
5. దౌర్గములు - శాక్తేయమతస్థులు. మిగుల దుర్గతిని పొందారు.
6. వైష్ణవులు - వైష్ణవమతస్థులు. ఆదరణే కరువైనది.

ఈ విధంగా ప్రముఖులైన ఆరు మతాలు ప్రకాశించలేకపోయినవి. శ్రీ శంకర, సురేశ్వరాచార్యుల వేదాంతవచనాలతో విజ్ఞానసంపన్నులైన వారు ముక్తులైరి. పై ఆరు మతాలు అసత్యమైనవవడం చేత ఆదరించేవారు లేక కనుమరుగైనవి. లోకమంతా వేదాంతతత్త్వమయమై, కేవల శివమై ప్రకాశించింది.

119. గౌతమాది మహర్షులచే ప్రతిపాదించబడిన న్యాయశాస్త్ర సూక్తులు వితథాలయినవి. కుమారిలభట్టుచే ప్రతిపాదించబడిన మీమాంసా శాస్త్రం మౌనం దాల్చింది. కపిలమహర్షి ప్రతిపాదనలు కూడా అస్థిరాలయ్యాయి. ఈ విధంగా సకల మతాలు ఖండించబడినవి. లోకహిత మొనరించే శ్రీ శంకరుల అద్వైత సిద్ధాంతం, సూత్రభాష్యాది గ్రంథాలను శిష్యులు ప్రతిపాదిస్తూండగా, ఆనందామృతమయాలై తేజరిల్లినవి. లోకమంతటా పరమశాంతి నెలకొంది.



# సర్గము - 11

## మహోగ్ర భైరవ నిర్ణయం

1. శ్రీ శంకరులు పరకాయ ప్రవేశం చేయటం, శ్రీ ఉభయభారతీ దేవి తమ పరాజయాన్ని అంగీకరించి శ్రీ మండనమిశ్రుల సన్న్యాసాశ్రమ స్వీకారానికి అంగీకారం తెలిపి బ్రహ్మలోకానికి వెళ్లడం, శ్రీ శంకరులు జైత్రయాత్ర ప్రారంభించి శ్రీశైల క్షేత్రాన శ్రీ భ్రమరాంబామల్లికార్జునులను దర్శించటం, పాతాళ గంగ వద్ద నివాస మేర్పాటు చేసుకొని వేదాంత శ్రవణం చేయటం మొదలైన అంశాలన్నీ పదవ సర్గంలో వివరంగా చర్చించబడినవి.

శ్రీ శంకరులు పాతాళగంగ నదీతీరాన శిష్యులతో కూడి ఉన్నప్పుడు, ఒక మాయావి, కపటి అయిన కాపాలికుడొకడు తన అంతరంగంలో కోరికను కప్పిపుచ్చి, శ్రీ శంకరుల వద్దకు వచ్చాడు.

2. కామక్రోధాది అరిషడ్వర్గాలను జయించినవారూ, జితేంద్రియులూ వ్యాసాది మునిపుంగవులచే ప్రశంసింపబడినవారూ అయిన శ్రీ శంకరులు తనచే రచింపబడిన బ్రహ్మసూత్రభాష్యాన్ని శ్రవణం చేస్తున్నారు.

3. దుష్టుడైన ఆ కాపాలికుడు శ్రీ శంకరులను చూసి ఎంతో సంతోషించినవాడై, చిరకాలం నుండి తాను ఎదురుచూస్తున్న యతి శ్రేష్ఠుడు దొరికాడు గదా అని సంతోషించాడు. బ్రహ్మజ్ఞానీ, సర్వదా సంతుష్టి కలిగిన శ్రీ శంకరులతో తన మనసులోని కోరికను ఈ విధంగా వ్యక్తం చేశాడు.

4. **కాపాలికుడు:** మహాత్మా! మునివర్యా! సదయాత్మా! తమ సర్వజ్ఞతను, దాక్షిణ్య కృపాగుణాలను, నిర్దోషమైన నడవడికను గూర్చి జనులు విస్తారంగా చెప్పుకొంటుండగా విన్నాను. అట్టి అసాధారణ వ్యక్తిని చూసి జన్మధన్యత చెందాలనే కోరికతో వచ్చాను.

5. మహనీయాత్మా! ద్వైతవాదులందరినీ సమూలంగా నాశనం చేసి, అద్వైత సిద్ధాంతాన్ని స్థాపించారు. ఇట్టి ఘనచరిత్ర ముందెన్నడూ ఎవరికీ దక్కలేదు. తమకు తమరే సాటి. ఆ విధంగా తమకు సర్వజ్ఞులనే బిరుదు సార్థకమై ఉన్నది. తాము అహంకార మమకారాలను పూర్తిగా జయించారు. తాము ఇతరుల నుండి ఎట్టి గౌరవాన్నీ ఆశించరు. కానీ తాము అందరినీ గౌరవిస్తారు. తాము అద్వైత సిద్ధాంతాలను ప్రతిపాదించడమే గాక, ఉపనిషత్ప్రమాణాలను చూపగల సమర్థులు. ఈ విధంగా తాము పరి శుద్ధాత్ములు; పరమాత్ములై ప్రకాశిస్తున్నారు.

6. తాము లోకహితం కోరి శరీరాన్ని ధరించిన లీలామానుష విగ్రహులు. స్వర్గలోకాది సమస్త లోకాలందూ తమ ఖ్యాతి వ్యాపించింది. తాము సజ్జనుల దుఃఖాలను బాపి ముక్తిని ప్రసాదిస్తున్నారు. కరుణామయులు, దివ్యదృష్టి కలిగినవారు. ఉపనిషత్తులందలి నిగూఢార్థాలన్నీ తెలిసిన అఖండ జ్ఞానస్వరూపులు.

7. రత్నాల వంటి గుణాలు గల మిమ్మల్ని రత్నాకరుడనీ, నిరహం కారులవటంచే సర్వజ్ఞులనీ, వాదనాప్రతిభచేత విజయశీలురనీ, జ్ఞానదానంచేత మహాదాతలనీ కొనియాడతారు. ఈ విధంగా తాము అన్ని గుణాలలోను సర్వోత్కృష్టులు.

8. తాము పరాపరతత్త్వజ్ఞులవటం చేత మిమ్మల్ని ఆశ్రయించినవారి మనోరథాలు పూర్తిగా నెరవేరగలవు. మహాత్ములు సిద్ధసంకల్పులవటం వలన వారి దయాదృష్టి ఎన్నటికీ వ్యర్థం కాదు.

9. మహాత్మా! చల్లకు వచ్చి ముంత దాచదగునా? కనుక నా మనోరథాన్ని సార్థకపరతురు గాక! తమ వలన నే నొక కార్యాన్ని సాధింప దలస్తున్నాను. అందులకు తమ అనుగ్రహం నాకు లభించుగాక! అలా అయితే నేను కాలభైరవస్వామిని మెప్పించి నా జన్మను సార్థకపరచుకొంటాను.

10. మహాత్మా! నా వృత్తాంతమంతా తమ పాదపద్మాల ముందు యథార్థంగా విన్నవించుకొంటాను. దయతో ఆలకించండి. నేను ఈ భౌతిక

శరీరాన్ని దాల్చి కైలాసానికి పోయి మహేశ్వరుని సందర్శించాలని సంకల్పించాను. అది ఎంతో కష్టసాధ్యమైనా, నా కోరిక బలమైనదవటంచే కాలభైరవస్వామి కొరకు ఘోరంగా తపస్సు చేశాను.

11. ఆ కాలభైరవస్వామి నా తపస్సుకు మెచ్చి నాకు ప్రత్యక్షమై ఇలా పలికారు: "తపోవ్రతశాలీ! నీ తపస్సు నన్ను తృప్తిపరచినది. దుర్లభమైన నీ మనోవాంఛను తెలుసుకొన్నాను. నీ కోరిక ఈడేరాలంటే నీ వొక దుర్లభమైన కార్యం చేయవలసి ఉంది. అది ఏమంటే, సర్వజ్ఞుడైన ఒక మహాత్ముని శిరస్సుగాని, ఒక సార్వభౌముని శిరస్సుగాని నా నిమిత్తమై అగ్నియందు హోమం చేయాలి. అలా చేస్తే దుర్లభమైన నీ కోరిక తీరగలదు."

12. ఆ విధంగా పలికి భైరవస్వామి అంతర్హితుడయ్యాడు. ఆనాటి నుండీ దైవప్రీతి కోసం ఈ భూలోకమంతా గాలిస్తున్నాను. సర్వసల్లక్షణాలు గల రాజేంద్రుడు ఒక్కడైనా కనిపించలేదు. తాము తప్ప సర్వజ్ఞుడైన మహాత్ముడు కూడ కానరాలేదు. నా పరిశ్రమ అంతా వృథా అవుతుందానని శోకిస్తున్నాను. మహాత్ముల ఆశీర్వాద బలం చేత, నా పూర్వజన్మల సుకృతం చేత నా ఆశలు నెరవేరే కాలమాసన్నమైనది.

13. దైవానుగ్రహంచే, సర్వలోక పూజ్యులూ, లోకహితం కోరి అవతరించిన వారూ, సర్వజ్ఞులు అయిన తమరిని ఇంతకాలానికి దర్శించాను. తమరు అంగీకరిస్తే నా మనోరథం సిద్ధించగలదు. దర్శనమాత్రాననే స్నేహమేర్పడుతుందని పెద్దలు చెబుతారు. ఆ విధంగా మహనీయులైన తమ దర్శన భాగ్యంచే మైత్రీ భావమేర్పడినది. మహాత్ముల దర్శనమెప్పుడూ సత్ఫలితాలనే ఇస్తుంది.

14. ఈ దేహంతో నేను కైలాసానికి వెళ్లాలంటే, ఒక సార్వభౌముని శిరస్సు వలనగాని, సర్వజ్ఞుడైన మహాత్ముని శిరస్సు వలన గాని సిద్ధిస్తుంది. ఈ రెంటిలో సార్వభౌముని శిరస్సు ఎందైనా సాధ్యపడదు. ఇక రెండవది యతీశ్వరుని బలి యిచ్చి, అగ్నియందు హోమం చేయాలి. తమరు తప్ప నా మనోరథం తీర్చగల సమర్థుడు ఏ లోకానా కానరాడు.

15. మహాత్మా! తాము సర్వజ్ఞులు. నిరభిమానులు. దేహాన్ని గడ్డి పరకలా చూస్తారు. తమకు చెప్పదగినవాడను కాను. అయినా మనవి చేసికొంటాను. ఈ దేహం శాశ్వతం కాదు. సర్వజ్ఞులైన తమ బోటి వారు శరీరంపట్ల ఆసక్తి చూపరు. కనుక తమరు దయతో ఆలోచించి నా కోరికను మన్నించి తమ శిరస్సు దానం చేయండి. దాని వలన లోకంలో అఖండ కీర్తి లభిస్తుంది. కేవలం అశాశ్వతమైన దేహత్యాగం వలన శాశ్వతమైన కీర్తి లభిస్తుంది. ఓ మహాత్మా! తమ చిత్తానికి ఏది యోగ్యమని భావిస్తారో దానినే ఆచరించండి.

16. మహాత్మా! లోకంలో ఎవరైనా తన శరీరాన్ని త్యాగం చేయడానికి ఇష్టపడరు. ఎందుకంటే ఎట్టి సుఖాలనైనా శరీరముంటే పొందగలరు. అందువలన తమ శిరస్సును దానమియ్యమని కోరడానికి నాకు కూడా దుఃఖంగానే ఉంది. అయినా, తాము సర్వసంగ పరిత్యాగులు, వైరాగ్య పరిపూర్ణులు. తామెల్లప్పుడూ శరీరం అశాశ్వతమైనదని తలస్తారు. దేహాభిమానం పూర్తిగా విడిచిన మహానుభావులు. అంతేకాక, తామీ శరీరాన్ని లోకహితానికే ధరించారు. తాము సర్వం ఎరిగిన మహానుభావులు. తేజోమూర్తులు. త్యాగధనులు.

17. లోకంలో స్వార్థపరులు తమ స్వలాభాన్నే కాంక్షిస్తారు. పరుల కష్టాలను పరిగణించరు. కానీ పరార్థ జీవులలా కాదు. పరుల శ్రేయస్సే వారి సుఖం. వారికి స్వార్థమంటే ఎలా ఉంటుందో కూడా తెలియదు. మునుపు దేవేంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించడానికి దధీచి మహర్షి వెన్నెముకను కోరి తీసుకొన్నాడు. ఆ వెన్నెముకను వజ్రాయుధంగా చేసుకొని వృత్రాసురుణ్ణి సంహరించాడు. దేవేంద్రుడు స్వార్థంతో మహర్షి మరణాన్ని గూర్చి చింతించలేదు. అయినా, ఆ మహర్షి ఇతరుల సౌఖ్యమే తన సౌఖ్యమని ఎంచి శరీర త్యాగం చేసి సుస్థిర కీర్తిని పొందాడు. మహాత్మా! దేహాభిమానంతో ఉండే వారికి నా ప్రార్థన అంగీకారయోగ్యం కానేరదు. దేహాభిమానం లేని పుణ్యాత్ములు ఒక్క నిమిషమైనా ఆలోచింపరు. కనుక ఓ మహనీయాత్మా! దయామయా! దీనజనసంరక్షణదక్షా! సాత్త్విక స్వభావులైన

దేవేంద్రాదులే స్వార్థపరులగుచుండగా, తామసప్రవర్తనులమైన నాబోటి వారి విషయం చెప్పాలా? నా కోరిక మన్నించి శాశ్వత కీర్తిని పొందండి!

18. మహాత్మా! దధీచి మహర్షి, శిబిచక్రవర్తి, జీమూతవాహనుడు మొదలైన వారందరూ శరీరాలు అస్థిరాలని బాగా ఎరిగినవారు. కనుక పరుల సుఖానికై తమ అశాశ్వతమైన శరీరం అర్పించి శాశ్వత కీర్తిని పొందారు. సూక్ష్మబుద్ధి గలవారై నిశితంగా లాభనష్టాలను బేరీజు వేసు కొన్నారు. తాము కూడా పరమహంస పరివ్రాజకులు. త్యాగశీలురు. అశాశ్వతమైన ఈ శరీరాన్ని భైరవస్వామికి అర్పించి నన్ను కృతార్థుని చేయండి. తమకూ కీర్తి చిరస్థాయిగా ఉండిపోగలదు.

19. లోకంలో సజ్జనులైనవారు శమదమాది గుణసంపన్నులై పరోప కారం చేయడంలోనే ఆనందాన్ని పొందుతున్నారు. మా వంటి వారందరూ స్వార్థపరులే, దయాదాక్షిణ్యాలు లేనివారే. మా స్వార్థప్రయోజనానికై ఇతరులను హింసిస్తూంటాం. మా వంటి వారి వలన లోకానికి ఎలాటి ప్రయోజనమూ చేకూరదు.

20. తాము దేహాభిమానాన్ని విడనాడి, యుక్తాయుక్త జ్ఞానంతో సంచరిస్తారు. తమకు పరోపకారం తప్ప వేరొక పరమార్థం లేదు. సర్వప్రాణుల సౌఖ్యమే తమ సౌఖ్యం. కానీ మేమలా కాదు. కోరికలతో కోరికలలో జీవిస్తాం. యుక్తాయుక్త వివేకం లేనివారం. కనుక నన్ను ఏం చేయమంటారో తామే సెలవివ్వండి. తాము ఎంతమాత్రమూ సంశయింపవద్దు. తాము యోగీశ్వరులు, సర్వమూ తెలిసినవారు.

21. మహానుభావా! గరుత్మంతునినుండి శంఖచూడుడనే సర్పాన్ని కాపాడడానికి జీమూతవాహనుడు తన శరీరాన్నే అర్పించాడు. దధీచి మహర్షి తన వెన్నెముకను దేవేంద్రున కర్పించాడు. ఈ విధంగా వారిరువురూ శాశ్వత కీర్తిని పొంది విఖ్యాతులైనారు. ఇంకా ఇటువంటి వారు అనేకమంది ఉన్నారు. వారి కథలన్నీ మనం ఇప్పటికీ చెప్పుకొంటున్నాం. మహాత్మా! తాము వారి మల్లేనే శాశ్వతకీర్తిని పొంది నన్ను కృతార్థుని చేయండి.

22. మహనీయాత్మా! దేహాభిమానం ఉన్న వారందరికీ దేహం అత్యంత విలువైనది. ఎవరూ దేహాన్ని త్యాగం చేయడానికి సిద్ధపడరు. అంతే కాదు. నా కోరిక వినగానే నన్ను పరిపరి విధాల దూషిస్తారు. అలాగని నా కోరిక నిరాకరించదగినదని పలుకవద్దు. ఎందుకంటే, తాము దేహాభిమానం లేనివారు. త్యాగధనులు, సర్వజ్ఞులు, బ్రహ్మజ్ఞానులు. తలచినంత మాత్రాననే తాము దేనినైనా త్యాగం చేయగల సమర్థులు. దేహమనేది మీ దృష్టిలో మట్టితో సమానం. సంసారకూపంలో పడి ఉండే మాకు ఎన్ని జన్మలెత్తినా వైరాగ్యముదయించదు. పరోపకారతత్పరులైన తమరు ఈ దీనుని విన్నపాన్ని మన్నించండి.

23. భగవన్! తమ వంటి పరమపురుషులు ఎన్ని లోకాలు వెదకినా కనిపించరు. అద్వితీయ సత్పురుషులు. భైరవోపాసనకు తమరు కడు యోగ్యులై ఉన్నారు.

24. భగవన్! పూజనీయా! దయామయా! నా మొర ఆలకించండి. మీరు సర్వలోకసర్వజ్ఞులు. నా భాగ్యం తమ కరుణ మీదనే ఆధారపడి ఉంది. నా పట్ల కృపాభావం చూపి తమ శిరస్సు నొసగండి. తమ పాదాల నాశ్రయిస్తున్నాను. అంతా శాంతభావంతో విన్న శ్రీశంకరులు కాపాలికునితో ఇలా అన్నారు:

25. **శ్రీ శంకరులు:** కాపాలికోత్తమా! భయపడకు. నువ్వు కోరిన విషయం గూర్చి నేను కొంచెం కూడా విచారించటం లేదు. లోకంలో జీవుల మనోరథాలను నెరవేర్చడానికే ప్రాజ్ఞులు కృషి చేస్తారు. ఎంతో సంతోషంతో నా శిరస్సును నీకు ఒసగుతాను. వివేకులు ఈ శరీరం అశాశ్వత మని తెలియటంచేత దేహాన్ని అర్పించడానికి వెనుకాడరు.

26. ఈ దేహం ఎంతకాలం పోషించినా, ఏదో ఒకనాడు నేల వాలవలసిందే. అటువంటి దేహం వలన ఇతరులకు మేలు కలుగటం కన్నా పరమార్థమేమున్నది? శరీరం శాశ్వతం కాదని గ్రహించడంచేత ప్రాజ్ఞులు లోకోపకారకార్యాలు శీఘ్రగతిన పూర్తి చేస్తారు. ఇది మహాపురుషుల స్వభావం.

27. ఓ సిద్ధపురుషా! నా శిరస్సు నివ్వడంలో ఎలాటి సందేహమూ లేదు. కానీ, నీవీ కార్యాన్ని బహు జాగ్రత్తతోను, అతి గుంభనంగానూ పూర్తి చేయాలి. నేను జనులు తిరుగాడని ప్రదేశంలో సమాధినిష్ఠుడనై ఉంటాను. ఆ సమయంలో నీ వొక్కడవే రా. నీ మనోరథాన్ని పూర్తి చేసుకో. ఎలాటి సంశయాలు పెట్టుకోక నా శిరస్సు ఖండించి అగ్నిగుండంలో వేసి హోమం చేసుకో. ఈ కార్యమంతా నా శిష్యులకు తెలియనీయవద్దు. అత్యంత గుంభనంగా కార్యం పూర్తి చేసుకో. కనుక నా శిరస్సును పొందడానికి అనువైన నిర్జన ప్రదేశాన్ని ఎంపిక చేసుకో.

28. కాపాలికోత్తమా! నా పలుకులు శ్రద్ధగా విను. నీ కార్యం సఫలం కావాలంటే, ఈ విషయం మన యిరువురకు తప్ప ఇతరులకు తెలియకూడదు. ముఖ్యంగా నా అంతరంగ శిష్యులకు తెలిస్తే నిన్ను కూడా చంపగలరు. కనుక నువ్వు అతిచాకచక్యంతో వ్యవహరించాలి.

29. ఈ విధంగా శ్రీ శంకరులు కాపాలికుడూ తమ కార్యక్రమాన్ని అతి గోప్యంగా ఉంచారు. ఇరువురూ సంతోషించినవారై ఎంతో మైత్రితో మెలగసాగారు. తన చిరకాల మనోరథం నెరవేరటంచే సంతోషంతో కాపాలి కుని మనస్సు తేలికబడినది. తక్కిన ఏర్పాట్లు పూర్తి చేసుకోవడానికి తన నిజగృహానికి వెళ్లాడు. శ్రీ శంకరులు కూడా తమ కుటీరాన్ని చేరుకొని, నిశ్చింతతో మౌనం దాల్చారు. ఆంతరంగిక శిష్యులకు కూడా ఈ విషయం తెలుపక గోప్యంగా ఉంచారు.

30. ఆ కాపాలికుడు త్రిశూలం చేత ధరించి, నుదుట విభూతి రేఖలు ప్రకాశిస్తూండగా, మెడలో ఎముకల దండ ధరించి ఉన్నాడు. అతడు చిత్తుగా మద్యపానం చేసినవాడవటంచే కన్నులు ఎర్రబడి రక్తగోళాల మల్లే ఉన్నవి. ఇలాటి రూపురేఖలతో ఆ కాపాలికుడు శ్రీ శంకరులుండే ప్రదేశాన నిర్భయంగా ప్రవేశించాడు. ఆ కాపాలికుడే, కాలభైరవుడా అన్నట్లున్నాడు.

31. శ్రీ పద్మపాదాది శిష్యులందరూ స్నాన, జపాలాచరింప దూర ప్రాంతాలకు వెళ్ళారు. శ్రీ శంకరులు కాపాలికునకు చేసిన వాగ్దానం నెరవేర్చ

డానికి అతని వెంట వెళ్లారు. కాపాలకుని ప్రయత్నాలకు భంగం కలుగరాదన్న తలంపుతో శ్రీ శంకరులు తన శరీరం గూర్చి పద్మపాదాది శిష్యులకు తెలియనివ్వక రహస్యంగా ఉంచారు. శ్రీ శంకరులు, కాపాలికుడు ఏర్పాటు చేసుకొన్న నిర్జనప్రదేశానికి అతణ్ణి అనుసరించి వెళ్లారు.

32. భయంకరాకారుడై సమీపించిన ఆ కాపాలికుని శ్రీ శంకరులు తేరిపార చూశారు. తన శరీరాన్ని త్యాగం చేయడానికి సిద్ధపడ్డారు. తదనంతరం ఇంద్రియవ్యాపారా లన్నిటినీ ఉపశమింపజేశారు. పరమాత్మ యందు మనస్సును లయం చేస్తూ నిశ్చలాంతఃకరణులైనారు. ప్రణవంచే పరబ్రహ్మాన్ని ధ్యానిస్తూ, ఆత్మను పరబ్రహ్మలో చేర్చారు. అంటే తత్త్వమసి వాక్యార్థమైన జీవబ్రహ్మైక్యాన్ని ఎరిగి ఆత్మను పరమాత్మగా భావించారన్నమాట. ఆ పరమాత్మే తాననే పరోక్షజ్ఞాన పరిపూర్ణుడయ్యారు. ఆత్మారాముడు దేహాన్ని విడిచి దేహాతీతస్థితిలో విహరించాడు. అట్టి సమయంలో సంపూర్ణంగా దృశ్యాలను మరచి పరబ్రహ్మ స్వరూపియై, స్వయంప్రకాశుడయ్యారు.

33. నిర్వికల్పసమాధి సంపన్నులై, కేవలం నివృత్తిమార్గ పరాయణులైన శంకరులను ఆ కాపాలికుడు దర్శించాడు.

34. శ్రీ శంకరులు కంఠం క్రిందుగా గడ్డముంచి, మోకాళ్ళపై హస్తాలుంచి, నేత్రాలు సగం తెరచి, సగం మూసుకొని ముక్కు కొన భాగాన్ని చూస్తూ కూర్చొన్నారు.

35. కేవలబోధస్వరూపులై, అఖండజ్ఞాననిధులై, స్వయంప్రకాశులై, చిన్మాత్రస్వరూపులై, సర్వదృశ్య ప్రపంచాన్ని మరచి, విశుద్ధతత్త్వ ప్రజ్ఞాభాసితులైన శ్రీ శంకరులను ఆ కాపాలికుడు దర్శించాడు.

36. శ్రీ శంకరులు చిన్ముద్ర వహించి సమాధినిష్ఠులై ఉండగా, క్రూరుడు, కపటి అయిన ఆ కాపాలికుడు భీతిలేనివాడై ఖడ్గంతో శ్రీ శంకరుల శిరస్సును ఖండించడానికి సమీపించాడు. ఇది ఇలా ఉండగా, అక్కడ ధ్యానంలో ఉన్న శ్రీ పద్మపాదాచార్యులు తన యోగబలంచే జరుగబోయే ఈ అకృత్యాన్ని తిలకించాడు.

37. శ్రీ పద్మపాదాచార్యులవారు మొదటినుండీ శ్రీ శంకరులకు ఆంతరంగిక శిష్యులుగా ఉంటూ, గురుదేవుల సంరక్షణను కోరుకోసాగాడు. కాపాలికుడు తన త్రిశూలాన్ని పైకెత్తి శ్రీ శంకరుల శిరస్సు ఖండించటం శ్రీ పద్మపాదులు తమ యోగశక్తిచేత గ్రహించారు. శ్రీ పద్మపాదులు శ్రీ నృసింహస్వామి భక్తుడు; అట్లే గురుదేవులకు కూడా పరమభక్తుడు.

38. శ్రీ పద్మపాదాచార్యులు శ్రీ నృసింహస్వామి మంత్ర సిద్ధులవడంచే వెంటనే మంత్రపూర్వకంగా ధ్యానించి శ్రీ నృసింహస్వామి దివ్య తేజస్సును ధ్యానించారు. వెనువెంటనే ఆ స్వామి శ్రీ పద్మపాదులను ఆవహించి మహా తేజస్సుతో వెలిగిపోతూ, క్షణకాలంలో శ్రీ గురుదేవులు సమాధిస్థితిని పొందిన ప్రదేశంలో  ప్రత్యక్షమైనాడు.

39. మహాభయంకరస్వరంతో, వృద్ధి చెందుతున్న క్రోధాగ్నితో, లోకాలన్నీ భయపడే రీతిగా నృసింహస్వామి హావభావపరాక్రమాలను సంతరించుకొన్న శ్రీ పద్మపాదాచార్యులు కాలయమునిలా ఆ కాపాలికునిపై దుమికాడు.

40. అంతట ఆ నృసింహస్వామి, మెడ జూలు విదల్చుకొంటూ భయంకర గర్జనలతో భూమ్యాకాశాలు కంపింప చేస్తూండగా దేవతలందరూ "ఇదియేమిటి" అని ఆశ్చర్యపడసాగారు. శ్రీ శంకరుల సన్నిధిని సాక్షాత్కరించిన ఆ పద్మపాదుడు మహావేగంతో ఆ కాపాలికునిపై కురికారు.

41-42. శ్రీ పద్మపాదులు (నృసింహస్వామి అంశతో) ప్రళయ కాలరుద్రునిలా, కోపోద్రిక్తుడై, పూర్వం హరిణ్యకశిపుని వక్షస్థలాన్ని చీల్చే విధంగా, ఆ కాపాలికుని వక్ష స్థలాన్ని చీల్చివేశాడు. తన వాడియైన కోరతో ఆ కాపాలికుని హృదయాన్ని చీల్చి పేగులన్నిటినీ బయటకు లాగి మెడలో మాలగా  ధరించాడు.

43. మహావాడియైన గోళ్ళతో మహాశ్రేష్ఠమైన ఆ సింహరాజం కాపాలికుని దేహాన్ని కోపోద్రేకంతో క్రిందకు పడదోసినది. స్వర్గమందలి కోట బురుజులు విరిగిపడినట్లు భయంకర శబ్దంతో ఆతడి దేహం నేలకూలింది.

44. సర్వలోక భయంకరమైన ఆ శబ్దానికి శిష్యులందరూ గుమికూడి అక్కడకు చేరుకొన్నారు. మరణించిపడివున్న కాలభైరవుని, ప్రక్కనే నిశ్చల సమాధిలో ఉన్న గురువరేణ్యుని చూశారు. దుష్టశిక్షణ, శిష్టరక్షణకై అవతరించిన నృసింహస్వామిని సందర్శించారు. స్వామి అనుగ్రహానికై ఈ విధంగా స్తుతించారు.

45. మహాత్మా! నృసింహ భగవంతుడు ఎల్లవేళలా భక్త సులభుడు. ఆనాడు పరమభక్తుడైన ప్రహ్లాదునికి వశీభూతుడైనాడు. ఆ ఉగ్రమూర్తిని చూసి దేవతలందరూ భయభ్రాంతులైనారు. ప్రహ్లాదునికి మాత్రం ప్రసన్న రూపంలో దర్శనమిచ్చాడు. మిత్రమా! ఆ దేవదేవుని అనుగ్రహాన్ని ఎప్పుడు పొందావు? ఎప్పుడు, ఎక్కడ తమకు ప్రసన్నుడయ్యాడు? అని తోటి శిష్య గణమంతా పద్మపాదుణ్ణి ప్రశ్నించారు.

46. **పద్మపాదుడు:** ముందు నేను అహోబిల పర్వతశిఖరంలో నివాస మేర్పరచుకొని నృసింహ భగవంతునికై ఘోర తపస్సు చేయసాగాను. చాలాకాలం ఆ విధంగా తపస్సు చేశాను.

47. సోదరులారా! నృసింహ భగవంతుని, అనుగ్రహం కోరి, అనన్య గతికుడనై, నిష్ఠతో ఆ అహోబిలపర్వతాన తపస్సు చేయసాగాను. ఒకానొక రోజు ఒక కిరాతకు డొకడు వచ్చి “అయ్యా! ఈ ఘోరారణ్య మందలి యీ గుహలో ఏల నివసిస్తున్నారు?” అని తరచి తరచి ప్రశ్నించాడు. అప్పుడు నేనతనితో “కిరాత శ్రేష్ఠా! నే నొక సింహశ్రేష్ఠానికై పరితపిస్తున్నాను. ఇంతవరకు దాని జాడ నాకు తెలియరాలేదు. అందువలన ఇక్కడే నివసిస్తూ నిరీక్షిస్తున్నాను” అని పలికాను.

48. “కంఠం వరకూ సర్వతేజోమయమైన మానవాకారంతోను, తల మాత్రం సింహాకృతి కలిగిన ఒక సింహరాజం ఈ ప్రాంతాన సంచరిస్తున్నది. కిరాతశ్రేష్ఠా! ఎంత వెదకినా ఆ సింహరాజం కనిపించటం లేదు. నేనా సింహరాజానికై పరితపిస్తున్నాను. ఎప్పటికైనా ఆ మృగరాజాన్ని చూడాలనే పట్టుదలతో ఇక్కడే కాపురమున్నాను” అని తెలిపాను.

49. "ఈ విధంగా చెబుతుండగా, ఆ కిరాతుడు అడవి లోనికి పోయి, రకరకాలైన తీగలన్నింటినీ కలిపి త్రాడుగా పేని, శిరస్సు మాత్రం సింహం, తక్కిన శరీరమంతా మానవాకారం కలిగి ఒక విశిష్టమైన మృగరాజును ఆ త్రాటితో బంధించి తెచ్చి నా ముందుంచాడు.

50. ఇలా శ్రీ పద్మపాదుడు చెబుతుండగా తక్కిన శిష్యులందరూ, ఈ పద్మపాదుడు నిశ్చయంగా విష్ణ్వంశసంభూతుడని తలచారు.

51. అంతట ఆ కిరాత శ్రేష్ఠుడు "నువ్వు పరమ భక్తితో వీడని పట్టు దలతో నన్ను ధ్యానించావు. ఈ విధంగా ముందెన్నడూ బ్రహ్మాది దేవతలు కూడా ధ్యానించలేదు" అని పలుకుతూ అంతర్హితుడయ్యాడు.

52. ఈ విధంగా వారందరూ శ్రీ పద్మపాద నృసింహస్వామి వారి చరితాన్ని విని పరమానందభరితులయ్యారు. తదనంతరం ఆ పద్మపాదుల వారు ఒక్కసారిగా బ్రహ్మాండమంతా మారుమ్రోగేట్లుగా గర్జించాడు.

53. శ్రీ శంకరులు స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలను అతిక్రమించి నిర్వికల్పసమాధిలో పరబ్రహ్మంతో విహరిస్తున్నారు. అఖండ జ్ఞాన తేజోమయులైన ఆ మహాత్ములు, నృసింహస్వామిచే గావించబడిన సింహ గర్జనానికి లోకాలన్నీ కంపించి బ్రహ్మపదాన్ని చేరగా, ఆ నాదం ఆలకించిన శ్రీ శంకరులు సమాధి స్థితి నుండి బయటకు వచ్చారు. తరువాత కళ్లు తెరచి సర్వలోక భయంకరమైన రూపుతో నిలబడ్డ శ్రీ నృసింహస్వామిని దర్శించి యిలా స్తుతిస్తున్నారు.

54. "చంద్ర కిరణాల వంటి మెడ జూలుతోను, నుదుట మిక్కిలి ప్రకాశవంతమై ఒప్పారే నేత్రంతోను, అప్పుడే ఉదయించిన నూరుగురు సూర్యుల ప్రచండ కిరణాలతో భేదిస్తూ, మహాట్టహాసం చేసేవాడూ, సర్వ తేజోవిలక్షణుడూ

55. మహాపాషాణంమల్లే కఠినమైన ఆ కాపాలికుని వక్షస్థలాన్ని పగులగొట్టగా, ఆ రక్తంతో నీ శరీరమంతా తడిసిపోయినది. శ్రీవత్సం, కౌస్తుభమణులచే ప్రకాశించే నీవు ఆ కాపాలికుని నరాలను మెడలో ధరించి అమిత భయంకరాకారుడవై ప్రకాశిస్తున్నావు.

56. దేవదానవులకు తన భీకరమైన ఆకారంతో బ్రహ్మాండాన్నంతా భీతిగొల్పే విధంగా చేసేవాడూ, పృథులాకార దేహ విభాసితుడూ, తీక్ష్ణమైన కోరలతో నోటి నుండి ఎగసిపడే అగ్నిజ్వాలలు ఆకాశమంతా వ్యాపిస్తూండగా–

57. తన రోమకూపాలనుండి బయల్వడే అగ్నికణాలతో సర్వలోకాలను దహింపజేసేవాడూ, యుద్ధభూమియందలి దేవేంద్రుని దర్పాన్ని స్తంభింపజేసే దంతాలతో, ప్రళయకాలరుద్రుని మల్లే ఉండేవాడూ (అగు)

58. మహాత్మా! అకాలంలో ప్రళయం సంభవించకుందుగాక! లోకాలను దహించే నీ కోపాన్ని ఉపసంహరించండి” అంటూ శ్రీ శంకరులు బ్రహ్మాది దేవతలతో కూడిన నృసింహదేవుని ప్రార్థించారు.

59. భయంకరమైన నాలుకను బయటకు జాపి అటునిటు త్రిప్పుతూన్న ఆ నృసింహ స్వామిని వారందరూ సమీపానికి పోయి దర్శించి ఆనంద బాష్పాలు స్రవించారు. పరమ భక్తితో, నిర్భయులై గద్గదస్వరంతో శ్రీ శంకరులు ఈ విధంగా ప్రార్థించారు.

60. **శ్రీ శంకరులు:** ఓ నృసింహస్వామీ! మా పట్ల దయ వహించు. మహోగ్రభైరవుడు మృతి చెంది నేలపై పడివున్నాడు. తమ కోపాన్ని ఉపశమింపజేయండి. నా పట్ల తమ కృపాకటాక్షాన్ని ప్రసరించండి. నీ కోపతాపాలకు ఈ లోకం భీతి చెందుతున్నది; గడగడ వణకుతున్నది. లోకకల్యాణా! దయామయా! సర్వలోకశరణ్యా! శాంతించు. శాంతించు.

61. మహాత్మా! తమ దేహం సాత్త్వికం. విష్ణుభగవానుడైన తమను సత్త్వగుణాధిపతిగా వేదాలు వచిస్తున్నవి. తమ స్వరూపం పరమశాంతమైనది. నిత్యశాంతి ఒసగి సర్వలోకాలను రక్షించు. సర్వలోకసౌఖ్యానికై శాంతించు. ఉగ్రరూపం తమ స్వభావం కాదు. భక్తులను రక్షింప వివిధాలైన రూపాలను ధరిస్తావు. లయకారుడైన మహేశ్వరుని కార్యం తాము చేయదగునా? సత్త్వగుణాఢ్యుడైన తమకు తమోగుణం నప్పుతుందా? సత్త్వగుణ స్వరూపా! కోపం విడువు.

62. దేవా! తమ నామం తలచినంతనే భక్తుల భయాన్ని పోగొట్టేవాడవు. అటువంటి తమను స్వయంగా దర్శించే భాగ్యం కలిగినవారి

అదృష్టాన్ని వర్ణింపగలమా! కృప కలిగిన వారందరికీ అనర్థాలన్నీ తొలగి పరమశాంతి లభిస్తున్నది. యోగీశ్వరులకు కూడా దుర్లభమైన తమ అప్రాకృత దర్శనం, ప్రాకృత జనులకు కూడా లభ్యమైతే వారి భాగ్యమేమని చెప్పగలం. మా పూర్వజన్మల సుకృతం చేత మాకు సాక్షాత్కరించావు.

63. తమ పాదారవిందాలు స్మరిస్తూ మరణించిన వారు తిరిగి జన్మించరు. తమ హస్తస్పర్శ పొందినవారు ముక్తిని పొందుతారు. ఈ కాపాలికుడు తమచే హతుడయ్యాడు. కరుణామయులు, ఈ కాపాలికునికి ముక్తిని ప్రసాదించండి.

64. ముందు ప్రహ్లాదుడు తన తండ్రిచేత కష్టాలను పొందగా, తమరు హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుణ్ణి కాపాడినారు. అంతమాత్రమే గాక హిరణ్యకశిపునకు ముక్తిని కూడా ప్రసాదించారు. తమ అపార దయ నేమని వర్ణింపగలం?

65. పరబ్రహ్మమొక్కడే. తనలో మూడు గుణాల నాపాదించుకొని మూడు విధాలైన కార్యాలను చేస్తూ, బ్రహ్మ విష్ణు మహేశ్వర నామాలను ధరించారు. సత్త్వగుణాన్ని ఆశ్రయించి విష్ణు నామరూపాన్ని ధరించి పరిపాలిస్తున్నావు. రజోగుణాన్ని ఆశ్రయించి బ్రహ్మ అనే నామం దాల్చి జగత్తు లన్నింటినీ సృజిస్తున్నావు. తమోగుణాన్ని ఆశ్రయించి లోకాల నెల్ల లయింపజేస్తున్నావు.

66. మహాత్మా! విచారించగా నువ్వు నామరూపాలు లేని నిర్గుణుడవు. అందువలన నీకు జననమరణాలు లేవు. మా గుణాలు నీ మాయచేత సృజింపబడినవే. నువ్వు శాశ్వతుడవు. స్వయంప్రకాశకుడవు. నేతి, నేతి అనే మహావాక్యాన్ని అనుసరించి అధిష్ఠానస్వరూపుడవు నీవే. కేవలం వేదాంత తత్త్వస్వరూపుడవు. దయామయా! నన్ననుగ్రహించి శాంతించు.

67. నృసింహస్వామీ! తమ నామం వినినంతమాత్రానే ప్రమథులు, గుహ్యకులు, పిశాచాలు పరుగిడుతవి. రాక్షసులు నీ ముందు నిలువజాలరు. నృసింహమంత్రశ్రవణం సర్వపాపవినాశకమయి జనులు ముక్తులవుతున్నారు.

68. మహాత్మా! నువ్వు సర్వలోకనాయకుడవు. నువ్వే ఏకైక కారణభూతుడవు. నిర్మల హృదయంతో ధ్యానింపదగినవాడవు. చిత్స్వరూపుడవు. నిన్ను శరణు వేడుతున్నాను.

69. ఈ కాపాలికుడు కడు దీనుడు; మరణించాడు. వాణ్ణి తమ పాదపద్మాల వద్దకు చేర్చుకొన్నారు. కోపాన్ని ఉపసంహరించండి. సర్వ తేజోభాసురా! లోకానికి అభయమొసగండి. దేవతలు కూడా తమ శాంత స్వరూపాన్నే కోరుతున్నారు. తమ ఉగ్రరూపాన్ని చూసి భీతి చెందుతున్నారు. సౌమ్యరూపాన్ని చూపి రక్షించండి.

70. కరుణామయా! తేజోభాసురా! కోటి విద్యుల్లతలు కూడా తమ దివ్యకాంతి ముందు దిగదుడుపే. తమను నిరంతరం ఉపాసించే యోగీశ్వరులు కూడా నీ మనోవాగతీతప్రదీప్తిని తెలియలేకున్నారు. ఆత్మ స్వరూపా! చాలా ఉగ్రమైన నీ భయంకరమూర్తిని ఉపసంహరించండి.

71. ప్రళయకాలంలో ప్రమథగణాలతో పరివేష్టితుడైన మహాకాల రుద్రుని లలాట భాగంలో వెలిగే అగ్నిజ్వాలలతో సమమైన శ్రీ నృసింహ భగవానుని మహాట్టహాసం మహాగ్నియై, సమూల నాశం చేస్తూ ఆ అనంత దురితాలను త్రుంచుగాక, పరమ సుఖాలనిచ్చుగాక!

72. వాసుకిని త్రాడుగా చేసుకొని దేవదానవులు క్షీరసాగర మథనం చేసేటప్పుడు హాలాహలం పుట్టి లోకాలన్నీ భస్మమైపోతుండగా, శంకర భగవానులు తమ డమరుకాన్ని మ్రోగించి, ఆ హాలాహలాన్ని మ్రింగి జగత్తును కాపాడాడు. శ్రీ నృసింహదేవుల సింహగర్జన కూడా సకల లోకాలను రక్షించుగాక! సకలపాపాలు నశించుగాక! కనుక దేవా, నన్ను గ్రహించు.

73. శ్రీ నృసింహస్వామీ! తమ గంభీరగర్జనలచేత లోకంలో సకల పాపాలు నశించుగాక! అజ్ఞానాన్ని హరించు హరించు హరించు.

74. ఈ విధంగా శ్రీ శంకరులు శ్రీ నృసింహస్వామిని స్తుతింపగా, శ్రీ పద్మపాదాచార్యులు ప్రశాంతులై ప్రాకృతదేహాన్ని పొందారు. శ్రీ పద్మ పాదులకు జరిగినదంతా ఒక స్వప్నంలా తోచింది. తరువాత తన గురుదేవులైన శ్రీ శంకరులకు ప్రణమిల్లాడు.

75. శ్రీ నృసింహస్వామి వారి యీ చరితాన్ని ముప్పూటల ఎవరు పరమభక్తితో శ్రవణం చేస్తారో అట్టి పుణ్యాత్మునికి అకాల మృత్యు భయ ముండదు. ఇహమందు భోగాలనుభవిస్తాడు. మరణానంతరం ముక్తిని పొందుతాడు.



# సర్గము - 12

## హస్తామలక తోటకాచార్యుల వృత్తాంతాలు

1. గత సర్గంలో భైరవోపాసకుడైన కాపాలికుడు శ్రీ శంకరుల శిరస్సును కోరటం, శ్రీ పద్మపాదాచార్యులు నృసింహ రూపంలో రావడం, శ్రీశంకరులు నృసింహస్వామిని స్తుతించటం మొదలైన విషయాలను తెలియబరచారు. తరువాత శ్రీశంకరులు తమ శిష్యగణంతో కలసి గోకర్ణ క్షేత్రాన్ని సందర్శించారు.

2. ఈ జగత్తు అంతా ఒక నాటక రంగం. అటువంటి నాటకంలోని పాత్రలు అనేకం. ఆ పాత్రలన్నింటినీ సక్రమంగా నడిపించేవాడే సూత్రధారి. అతడే జగన్నాటక సూత్రధారి – పరమేశ్వరుడు. మనమంతా పాత్రధారులమే. దృశ్య ప్రపంచమంతా ఆ నాటకానికి రంగమే. అట్టి నాటకరంగంలోని కథాగమనాన్ని బహు నేర్పరితనంతో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు పోషిస్తూ ఉంటారు. వారి ముగ్గురిలోను, అందరికీ వందనీయుడై, కామక్రోధాదులకు అతీతుడై, జితేంద్రియుడై, సర్వమంగళ అయిన పార్వతీదేవితో కూడి, సర్వ ప్రపంచానికి నాట్యాచార్యుడైన ఆ పరమేశ్వరుని సందర్శించిన శ్రీ శంకరులు ఈ విధంగా స్తుతిస్తున్నారు.

3. దక్షిణభాగంలోని మేఘసముదాయంతో కలసి ఉండే విద్యుల్లత (మెరుపు) వామ భాగంలో ఒక్క క్షణకాలం మెరసి తిరిగి ఆ మేఘసము దాయంలో కలసిపోయే సర్వవిలక్షణమైన ఆచార్యుడైన ఆ పరమ శివుని దివ్యదేహంగా స్మరిస్తున్నాను. (అంటే మెరుపులు శాశ్వతంగా మేఘాలతో ఉండవు. క్షణకాలం కనిపించి తిరిగి మేఘాలందు సంలీనమవుతుంటాయి. అదే విధంగా నిత్యమూ పార్వతీదేవితో కలసి ఉండే ఆ పరమేశ్వరుని స్మరిస్తున్నాను.)

4. అర్ధనారీశ్వరవిగ్రహంలోని శివభగవానుని చెయ్యి సదా అదురుతూనే ఉంది. ఎందుకంటే, రెండవ సగ భాగమైన పార్వతీదేవి శరీరం నుండి వెలువడే కాంతి కిరణాలు పచ్చగడ్డి అని భ్రమపడి శివుని చేతిలోనున్న దుప్పి తలపైకి క్రిందకు ఆడిస్తున్నది. అలాగే శివుని శరీరం నుండి ప్రసరించే కాంతికిరణాలు జొన్న కంకెలని భ్రమచెంది పార్వతిచేతిలోనున్న చిలుక సతతం కదలుతూనే ఉంది. ఆ కారణాన పార్వతీదేవి చేయి కూడా అదరుతున్నది.

**అర్ధనారీశ్వర తత్త్వం:** ప్రకృతి పరమాత్మ యందు లీనమై విచారించిన ఒకే సద్వస్తువని తెలుస్తున్నది. భేదరహితమై జీవబ్రహ్మైక్య తత్త్వాన్ని, అద్వైతతత్త్వాన్నే శ్రీశంకరులు బోధిస్తున్నారు. ద్వైత భావంతో చూచిన శివ పార్వతులుగా కనబడుతున్నారు. చైతన్యాది ధర్మాలచే, పరమేశ్వరుడై; జగత్కల్పనాధర్మాలచే కర్తృత్వ భోక్తృత్వాది ధర్మాలచే, ప్రకృతియైన, పార్వతీదేవి, ఒకే పరమాత్మమై వెలయుచున్నాడు. సృష్టినిమిత్తమై పరమాత్మయే స్త్రీపురుష రూపాన్ని ధరిస్తున్నాడు. ఇదే పార్వతీపరమేశ్వర అర్ధనారీశ్వరతత్త్వం.

5. క్షీరసాగరమథనంలో ఉత్పన్నమైన హాలాహలం ఎంతో భయంకరమైనది. సర్వప్రపంచాలను దహింప సమర్థమైనది. అటువంటి కాలకూట విషాన్ని, లోకోద్ధరణకై, పరమశివుడు మ్రింగి తన కంఠంలో నిలుపుకొన్నాడు. కానీ ఆ విషం వలన శివునికి ఎలాటి హానీ వాటిల్లలేదు. కారణ మేమంటే లోకమాతయైన పార్వతీదేవి పాతివ్రత్య మహిమచే కంఠం శీతలమై తాపం చెందలేదు. పార్వతీదేవి మాంగళ్య మహిమచే మహేశ్వరుని కంఠమందలి విషం శక్తిహీనమైనది. మాంగళ్యం సర్వ అశుభాలను నశింపజేసేది కనుక పార్వతీదేవి 'సర్వమంగళ' అనీ, కంఠమందు గరళం నిలుపటంచేత గరళకంఠుడనీ ప్రసిద్ధి చెందారు.

6. శ్రీ శంకరులు శ్రీ గోకర్ణ క్షేత్రనాథుడైన అర్ధనారీశ్వరస్వామిని వాక్కుతో స్తుతించారు. పార్వతీ పరమేశ్వర, (అర్ధనారీశ్వర స్వరూపం) అభేద తత్త్వజ్ఞానాన్ని శిష్యులందరకూ బోధించారు. త్రిగుణాతీతుడూ, దేవదేవుడూ అయిన అర్ధనారీశ్వరస్వామిని స్తుతించారు.

7. శ్రీ శంకరులు గోకర్ణ క్షేత్రంనుండి, కలియుగ వైకుంఠ కైలాసాలుగా ప్రసిద్ధి చెందిన హరిహర క్షేత్రానికి శిష్యులతో కలసి వెళ్లారు; క్షేత్రనాథులైన హరిహరులను సేవించుకొన్నారు.

8. ఆ క్షేత్రంలో హరిహరులు ఒకే చిన్మాత్రులై వెలయుచు, భేదవాదు లైన ద్వైతవాదుల వాదాలన్నింటినీ ఖండించి అద్వైతత్త్వాన్ని ప్రతిపాదిస్తు న్నారు. శాశ్వతమైనదేదైనా ఏకమే అని ప్రబోధిస్తున్నది. చిన్ముద్రను చూపుతూ, జీవబ్రహ్మైక్యాన్ని చేష్టల చేతనే ప్రబోధిస్తున్నారు. గుణాలు మూడూ ప్రకృతి స్వరూపాలు. పరబ్రహ్మం ప్రకృతికి అతీతుడు. యథార్థ తత్త్వాన్ని జ్ఞానముద్ర చేత ఉపదేశించే హరిహరులను భక్తితో పూజించారు. హరిహరు లిరువురికీ వర్తించే విధంగా రెండు అర్థాలు స్ఫురించేట్లు ఈ విధంగా స్తుతించారు.

9. **శ్రీ విష్ణుస్తుతి:** "ప్రళయ జలాలందు వేదాల నపహరించిన సోమకాసురుని సంహరించడానికి భూమిని నౌకగా చేసుకొని మీనరూపాన్ని దాల్చితివి. సర్వవ్యాపకుడైన అట్టి విష్ణు భగవానునికి నమస్కరిస్తాను."

**శ్రీ శివస్తుతి:** "శిరస్సుపై చంద్రకళను ధరించి, హిమాలయాలందు లభించే ఓషధుల తేజస్సుతో కూడిన మేనకా పుత్రియైన పార్వతీదేవిని వివాహమాడిన ఓ పరమశివా! నాకు మంగళాలు ప్రసాదించు. నన్ను రక్షించు."

10. **శ్రీ విష్ణుస్తుతి:** "దేవతలు రాక్షసులు మందర పర్వతాన్ని కవ్వంగా చేసుకొని, వాసుకిని తాడుగా చేసుకొని క్షీర సాగరాన్ని మథనం చేసేటప్పుడు, ఆ పర్వతరాజం నీట మునగకుండా కూర్మావతారమెత్తి దేవతలకు అమృతాన్ని పంచావు."

**శ్రీ శివస్తుతి:** "క్షీరసాగర మథనం చేయగా మహాకాలకూట విషం ఉత్పన్నమయినది. ఆ విషం నుండి సర్వలోకాలను కాపాడ ఏ హాలాహలాన్ని కంఠం నందు ధరించి దేవతలకు అమృతం ఒసగి రక్షించినట్టి శివభగవానుడు నన్ను కృపాదృష్టితో చూచుగాక!"

11. **శ్రీ విష్ణుస్తుతి:** "ఆదివరాహరూపాన్ని ధరించి భూదేవికి సంతోషం కలిగించి, చరాచర జీవరాసులన్నింటినీ రక్షించిన ఆ విష్ణుభగవానునికి చేతులు జోడించి నమస్కరిస్తున్నాను."

**శ్రీ శివస్తుతి:** సర్వలోక శుభంకరుడవై, ఆదిశేషుని దేహంలా స్వచ్ఛంగానూ, తెల్లగానూ ఉండి, జనుల భయాలనన్నీ పోగొట్టు వాడు, సర్పరాజైన వాసుకిని ఆభరణంగా ధరించిన పరమశివుడు సర్వదా మమ్ము రక్షించుగాక!

12. **శ్రీ విష్ణుస్తుతి:** అరుణ కాంతులతో ఆకాశాన్ని చూసే సుందరమైన జూలుతో, సింహాకృతిగల శిరస్సు గలవాడవై, వాడియైన గోళ్లు కలిగిన ఓ నరసింహమూర్తీ! నువ్వు దుష్టుడైన హిరణ్యకశిపుని నీ వాడి గోళ్ళతో చీల్చి చంపి, పరమభక్తుడైన ప్రహ్లాదుని రక్షించావు. సర్వలోకాలకు సంతోషాన్ని కలిగించిన నృసింహమూర్తి మమ్మల్ని రక్షించుగాక!

**శ్రీ శివస్తుతి:** నదులలో శ్రేష్ఠమైన గంగానదిని శిరస్సున ధరించినావు. మహా క్రూరుడైన గజాసురుని సంహరించి భువనాలన్నింటికీ ఆహ్లాదాన్ని కలిగించావు. నువ్వు పురాణపురుషుడవు. దయామయుడవు. అయిదు ముఖాలతో విరాజిల్లే శివభగవానుడు మమ్ము రక్షించుగాక!

13. **శ్రీ విష్ణుస్తుతి:** ప్రసన్నమూర్తివై వటురూపం దాల్చి వామనావతారంగా అవతరించావు. మృగచర్మం ధరించి బలిచక్రవర్తి నుండి ముల్లోకాలను గ్రహించి, సర్వదేవతలకు ప్రమోదం కలిగించావు. అట్టి పరమపురుషుడు మమ్మల్ని సదా రక్షించుగాక!

**శ్రీ శివస్తుతి:** దక్షయజ్ఞంలో గర్వాంధుడైన దక్షునిచే అవమానించబడి నీ సతీదేవి దేహత్యాగం చేయగా దక్షుని మదమణచి, మృగచర్మాలు ధరించి వనవాసియై, తపోభూములకు పోయిన ఆ పరమశివుడు మమ్మల్ని రక్షించుగాక!

14. **శ్రీ విష్ణుస్తుతి:** దర్పంతో లోకాలన్నింటినీ పీడిస్తున్న కార్తవీర్యార్జునుని సంహరించి విజయలక్ష్మిని చేపట్టినావు. సర్వలోకహితుడవై చంద్రునిలా ప్రకాశిస్తున్నావు. లోకనాథుడయిన ఆ శ్రీమన్నారాయణుడు మమ్మల్ని రక్షించుగాక! నీ కృపచేతనే సనాథులమై ఉన్నాం.

**శ్రీ శివస్తుతి:** ఓ పురాణ పురుషా! శిరస్సున స్వచ్ఛమైన గంగాజలాలు ధరించి, సర్వసంతాపహరుడవై వెలయుచు కపట కిరాతరూపంలో వరాహానికై అర్జునునితో యుద్ధానికి తలపడినావు; మమ్మల్ని కాపాడు! మాకు నాథుడవై అనాథులైన మమ్మల్ని కృపాదృష్టితో రక్షించు.

15. **శ్రీ విష్ణుస్తుతి:** మదాంధుడై, సర్వలోక భయంకరుడైన దశకంఠుని సంహరించి ఎవరు సీతాసాధ్విని చెరవిడిపించారో అట్టి శ్రీరామచంద్ర పరబ్రహ్మం మాకు బ్రహ్మానందానుభవం ఇచ్చుగాక! జ్ఞానభిక్షపెట్టి మమ్మల్ని కాపాడుగాక!

**శ్రీ శివస్తుతి:** దశేంద్రియ ప్రవృత్తితో ప్రవర్ధిల్లుతూ విద్వేషియైన మన్మథుని, ఎవరు తన మూడవ నేత్రం నుండి అగ్నిజ్వాలలు సృష్టించి భస్మం చేసి, విజితేంద్రియుడై పార్వతీదేవికి పతి అయ్యాడో అట్టి పరమ శివుడు మమ్మల్ని రక్షించుగాక! శ్రీ సీతారాములు, శ్రీ పార్వతీపరమేశ్వరులే మాకు సర్వ రక్షకులు.

16. **శ్రీ విష్ణుస్తుతి:** సదా సురాపానం చేసేవాడూ (మోహన రూపమైన అజ్ఞానమనే 'సుర'ను మ్రింగే వాడు), నాగలిని ఆయుధంగా చేసుకొని శత్రువులను చెండాడేవాడూ, రోహిణీదేవికి భర్తా, వసుదేవుని కుమారుడూ అయిన బలరామదేవులు మమ్మల్ని రక్షించుగాక!

**శ్రీ శివస్తుతి:** గానమందు మక్కువ, తాళము నందు తత్పరత కలిగిన వాడూ, నృత్యకళావిభుడూ, మోక్షస్వరూపుడూ గరళ పానంచే మహోగ్ర కంఠుడైనట్టి శివభగవానులు మమ్మల్ని రక్షించును గాక!

17. **శ్రీ విష్ణుస్తుతి:** సర్పాలకు భయం పుట్టించే గరుత్మంతుని వాహనంగా చేసుకొన్నవాడూ, పూతనకు మోహం కల్పించి పరిమార్చినవాడూ, శిరస్సున సదా నెమలి ఫించం ధరించినవాడూ అయిన శ్రీ కృష్ణ భగవానుడు మమ్మల్ని సదా రక్షించుగాక!

**శ్రీ శివస్తుతి:** గజాననుడు సదా తన తొండంతో నీరు గ్రహించి అభిషేకం చేయగా మిక్కిలి ప్రీతితో స్వీకరించేవాడూ, శంకర నామ జపం

చేసేవారిని సంరక్షించేవాడూ, చంద్రవంకను శిరస్సున ధరించిన వాడూ అయిన ఆ శివభగవానుడు మమ్మల్ని రక్షించుగాక!

18. **శ్రీ విష్ణుస్తుతి:** మన్మథ విజేతయైన జితేంద్రియులు, సర్వజ్ఞులు, అపార దయాసంభూతులు, కృపాతత్పరులు, సుకుమార హృదయులు, యజ్ఞాలను నిరసించి, నిర్వాణపదమే మానవజాతికి పరమార్థమని బోధించిన బుద్ధ భగవానులను హృదయమందు నిలిపి సదా ధ్యానిస్తారు. అట్టి బుద్ధ భగవానుడు మమ్ము రక్షించుగాక!

**శ్రీ శివస్తుతి:** మూడవ కంటి మంటలతో మన్మథుణ్ణి భస్మం చేసిన జితేంద్రియుడు, సర్వాత్మ భావంతో వెలయు దయానిధీ, నిస్సంకల్ప, నిస్సంగత్వవృత్తితో భాసించేవాడూ, దక్షయజ్ఞ ధ్వంసకుడూ అయిన ఆ పరమశివ భగవానుడు మమ్ము రక్షించుగాక!

19. **శ్రీ విష్ణుస్తుతి:** కలి మహాపురుషుడు అవతరించిన కారణాన జనులు అగమ్యగోచరులై ఉన్నారు. కలియుగంలోని అధర్మాలను నిర్మూలించి, సత్పురుషుల హృదయాలలో నివసిస్తూ, సత్యమైన కృతయుగంలో పరమాత్మ స్వరూపుడైన కల్కి దేవునకు నమస్కరిస్తున్నాను. ఆ కల్కిభగవానుడు మమ్ము రక్షించుగాక!

**శ్రీ శివస్తుతి:** పరబ్రహ్మాకారవృత్తితో యోగిపుంగవుల హృదయంలో నివసిస్తూ 'మాయ'ను నిర్మూల మొనరించేవాడూ, బ్రహ్మానంద స్వరూపీ, అయిన ఆ పరమశివునికి పదేపదే నమస్కరిస్తున్నాను. ఆ శివభగవానుడు మమ్మల్ని రక్షించుగాక!

20. శ్రీ శంకరులు హరిహర క్షేత్రంలో దశావతారాలను అత్యంత భక్తితో, హరిహరస్వరూపాలను మేళవించి స్తుతించారు. అనంతరం మూకాంబికాక్షేత్ర సందర్శనకై బయలుదేరారు.

21. శ్రీ మూకాంబికా క్షేత్రంలో ఒక బ్రాహ్మణదంపతులు తమ ఏకైక సంతానమైన కుమారుని మరణానికి రోదిస్తున్నారు. మూకాంబికా దేవి ఎలాగైనా తమ బిడ్డకు ప్రాణదానం చేస్తుందనే నమ్మికతో దేవీ

విగ్రహానికి ఎదురుగా కూర్చుని తెంపులేక ఏడుస్తున్నారు. దయామయుడైన శ్రీ శంకరులు వారి దైన్యస్థితికి ఎంతో చింతించారు.

22. శ్రీ శంకరులు ఆ బ్రాహ్మణ దంపతులను గాంచి శోకంతో కన్నుల నిండుగా నీరు పెట్టుకొని తాను కూడ బిగ్గరగా దుఃఖించసాగారు. అట్టి సమయంలో అశరీరవాణి దిక్కులు పిక్కటిల్లేట్లుగా ఇలా పలికింది: "రక్షించలేని వాని దయ దుఃఖాన్ని పెంచుతుందే గాని ఎలాటి ప్రయోజనాన్నీ చేకూర్చదు. అసమర్థులే నిస్సహాయులై శోకిస్తారు. సమర్థులైన యోగీశ్వరులకు దుఃఖం శోభించదు."

23. అశరీరవాణి పలుకులలోని నిగూఢ భావాన్ని గ్రహించిన శ్రీ శంకరులు పరమేశ్వరు నిలా ప్రార్థించారు. "ఓ దయామయా! పరంధామా! నీ కృపాకటాక్షం చేతనే ముల్లోకాలు సంరక్షించబడుతున్నవి. దీనజనులను కృపతో చూడు. మమ్ము రక్షించు."

24. శ్రీ శంకరులు సర్వరక్షకుడైన ఆ పరమేశ్వరుని ప్రార్థించగా, ఆ బ్రాహ్మణ బాలుడు నిద్రనుండి మేల్కొన్నవానిలా లేచి కూర్చొన్నాడు. ఈ విపరీతాన్ని చూసిన జనులందరూ శ్రీ శంకరులను భగవత్స్వరూపులుగా తలచి పరిపరి విధాలుగా స్తుతించారు. ఆ విప్ర దంపతుల ఆనందానికి అవధులు లేకపోయింది. వారు శ్రీ శంకరులకు శరణాగతులయ్యారు.

25. మూకాంబికా క్షేత్ర పరిసర ప్రాంతాలన్నీ మద్ది, మామిడి, పనస మొదలైన మహోన్నతాలైన వృక్షాలతో నిండి ఉన్నవి. ఆ ప్రదేశమంతా సాధకులకు, ముముక్షువులకు, యోగీశ్వరులకు నిలయమై పరమశాంతి నొసగుతూన్నది. అట్టి జగన్మాతయైన మూకాంబికాలయాన్ని శ్రీ శంకరులు దర్శించారు.

26. శ్రీశంకరులు దేవిని పరమ భక్తితో ప్రార్థించగా కన్నుల నుండి ఆనందబాష్పాలు జలజల రాలగా, రోమాంచితులయ్యారు. సర్వలోకపూజితురాలైన ఆ దేవిని శ్రీ శంకరులు అనేక విధాలుగా మహోత్తమశ్లోకాలతో స్తుతించారు. శ్రీ మూకాంబికాదేవిని స్తుతిస్తే మూగవారు కూడా రసవత్తరంగా

ఉపన్యసించగలరని ప్రతీతి ఉంది. మూగవారిచే కూడ పలికించేది కనుకనే ఆ తల్లికి మూకాంబిక అని పేరు సార్థకనామమైనది.

27. "దివ్యస్వరూపిణీ! ఓ దేవీ! తమ పాదపద్మాల నుండి వెలువడే కాంతి కిరణాల చేత సూర్యచంద్రులు 365 రోజులు దేదీప్యమానంగా వెలిగి పోతున్నారు. మహాదేవీ! నీవు స్వయంప్రకాశమానమైనా చిచ్ఛక్తి స్వరూపిణివి" అని స్తుతించారు.

28. "జగన్మాతా! దేవీ! నీ పూజావిధానాల నెరిగిన భక్తులు, అంతః కరణాన నీ దివ్యమంగళస్వరూపాన్ని నిలుపుకొని ఆవాహనం, ఆసనం, పాద్యం, అర్ఘ్యం మొదలైన వివిధాలైన ఉపచారాలను చేస్తారు. మలినవాసనలు నిన్ను చేరకుండుటకై తెరలు కట్టి శాస్త్రవిధిగా నిన్ను పరమభక్తితో ఆరాధిస్తారు."

29. "అంబా! 64 ఉపచారాలలో ఒక్కొక్క ఉపచారాన్ని విశుద్ధ ఆగ్నేయస్థానమందు, ధ్రువమండలసహస్రారమందు, సహస్రపత్ర కమల మందు, నీ అనుగ్రహానికై నీ భక్తులు ఆరాధిస్తున్నారు. ప్రతి ఉపచార మందు నీ స్వరూపాన్ని భ్రూమధ్యంలో నిలుపుకొని సహస్రారమందు ధ్యానించి నిన్ను సంతుష్టిపరస్తారు. నీ అనుగ్రహం పొంది ధన్యాత్ములవుతున్నారు."

30. ఓ దేవీ! నీ నిజతత్త్వం తెలియని వారు నీ ప్రతిమలను బాహ్య దృష్టితో పూజిస్తున్నారు. వీరందరూ సామాన్య భక్తులు. కొందరు నీ బాహ్య ప్రతిమలకు పూజలు చేస్తూ అంతరంగంలో కూడా ధ్యానిస్తున్నారు. వీరు మధ్యతరగతి భక్తులు. మరి కొందరు, బాహ్యస్మృతియే లేనివారై ప్రతిమలకు పూజలు చేస్తూ నిన్ను మానసికంగానే ధ్యానిస్తున్నారు. వారందరూ ఉత్తమ భక్తులు. ఓ తల్లీ! ద్వైత భావాన్ని వదలి ఆత్మానుభవాన్ని సంతరించుకొని నిర్వికల్ప సమాధిని పొంది జీవబ్రహ్మైక్య తత్త్వంతో వెలయుచున్నారు. వీరు మహోత్తములు. నిజానికి వీరే పరబ్రహ్మం యొక్క యథార్థ స్వరూపాన్ని తెలిసి ఉపాసిస్తున్నారు. తల్లీ! దేవీ! అట్టివారే నీవై ఉన్నావు. వారే నీవుగా ఉన్నారు. ఈ అభేద జ్ఞానమే అఖండం; పరిపూర్ణం."

31. ఓ మహాదేవీ! నీ ఆధారశక్త్యాది 38 కళలలో 1. బోధిని 2. దారిణి 3. క్షమ 4. అమృత 5. మానద అనే అయిదూ నివృత్తి

మార్గానికి చెందినవి. పండితులు, దేవతలు ఈ అయిదు కళలను ఉపాసించి ధ్యానించి చిత్స్వరూపిణివైన నీ దేవీ స్వరూపమే పరబ్రహ్మ స్వరూపమని, ఆ పరబ్రహ్మమే తామనే పరిపూర్ణజ్ఞానంతో ఉంటారు. సర్వదృశ్యరహితు లవుతారు. తక్కిన కళల నుపాసించేవారు సర్వవిషయ సుఖాలను పొందు చున్నారు.

32. ఓ జగదుత్పత్తిలయకారిణీ! ప్రళయకాలాగ్నివి నీవే. ప్రళయా నంతరం అమృతాన్ని ప్రవహింపజేసేదానవు నీవే. అమృతంతోనే సర్వాన్ని సృష్టిస్తున్నావు, పాలిస్తున్నావు తిరిగి లయింపజేస్తున్నావు. ఓ పరమేశ్వరీ! నీ నుండి జనించిన సత్త్వరజస్తమోగుణాత్మకమైన మాయాశక్తి చేత త్రిమూర్తులు ఆయా కార్యాలు చేస్తున్నారు. నీ మాయాశక్తితో బ్రహ్మ సృష్టిస్తున్నాడు, విష్ణువు పరిపాలిస్తున్నాడు, మహాదేవుడు లయింపజేస్తున్నాడు. నీ మహిమలు ఊహించ శక్యం కానివి; అనంతం.

33. మహాదేవీ! నీ ప్రత్యభిజ్ఞాన స్వరూపాన్ని ఉపాసించేవారు అద్వైతతత్త్వ సారాన్ని తెలిసినవారవుతున్నారు. వారే ధన్యాత్ములు. కృతార్థులు, అంటే చిత్స్వరూపిణియైన దేవియే పరబ్రహ్మమనీ, ఆ పరబ్రహ్మమే తామనీ భేదంలేని దృష్టితో ఉపాసిస్తున్నారు.

(**ప్రత్యభిజ్ఞానం:** అంటే స్మృతి జ్ఞానం. స్మృతి అంటే తాను ఇదివరకు అనుభవించిన విషయాలను మరల స్మరించటం. తాను కేవలం నిర్వికార సచ్చిదానంద (సత్‌చిత్ ఆనందం) పరబ్రహ్మ స్వరూపియే అయినా, భ్రాంతిచేత ఆ విషయాన్ని మరచిపోతాడు. భ్రాంతి అనేది ఎలాగైనా ఏర్పడవచ్చు. సద్గురువు వేదాంతశ్రవణం వలన తన శిష్యుని భ్రాంతిని నిశ్శేషంగా తొల గిస్తాడు. అప్పుడు తన నిజస్వరూపాన్ని తెలుసుకోగలుగుతున్నాడు. తరువాత తానే పరబ్రహ్మమనే నిశ్చిత జ్ఞానం ఉదయిస్తుంది. దీనినే 'ప్రత్యభిజ్ఞాన' మని అంటారు. ఈ జ్ఞానం వేదాంత శ్రవణం వలనా, గురుకృప చేతా, దైవానుగ్రహం చేతా తన పూర్వస్మృతి కలిగి తానే పరబ్రహ్మమని తెలుసు కొంటున్నాడు.)

అంబా! భక్తుడు నీ చిత్స్వరూపం బాగా తెలిసి, సర్వదృశ్యరహితమైన నిర్వికల్పసమాధిని పొంది, నీ యథార్థస్వరూపం తానే అనే అభేద జ్ఞానాన్ని పొందుతున్నాడు. నీ స్వరూపాన్ని తెలియనంతవరకు తాను వేరనే ద్వైతబుద్ధి కలిగి ఉన్నాడు. అట్టి అభేదబుద్ధి తొలగి ముక్తుడవుతున్నాడు.

34. దేవీ! ఇహలోకసుఖాలు కోరే నీ భక్తులు నిన్ను బంగరు వర్ణంతో ప్రకాశించే చతుర్దళాకార మూలాధార చక్రాన ధ్యానించి ఉపాసిస్తారు. అట్టి వారు కోరుకున్న ఇహలోక సుఖాలన్నింటినీ ప్రసాదిస్తున్నావు.

అలాగాక నీ మంగళ స్వరూపాన్ని గాంచుతూ, దేవీలోక నివాసం కోరేవారు, పగడపు వర్ణంతో ప్రకాశించే షడ్దళాకార స్వాధిష్ఠాన చక్రంలో నిన్ను ధ్యానిస్తారు. అంతేగాక ధూమ్ర వర్ణంతో ప్రకాశించే దశదళాకార మణిపూర చక్రంలో నిన్ను ఉపాసిస్తారు. నీ దివ్య మంగళ స్వరూపాన్ని కోరే నీ భక్తులు నీ దివ్యనగరానికి వెలుపల నివసిస్తుంటారు. దర్శనానంతరం దేవీలోక నివాసం సిద్ధిస్తుంది.

35. ఓ దయాస్వరూపిణీ! పింగళవర్ణంతో ప్రకాశించే పన్నెండు దళాల పద్మాన్ని అనాహత చక్రంలో (హృదయపద్మం) నిన్నుపాసించే భక్తులు నీ మహానగరంలో నివసిస్తారు. చంద్రధవళవర్ణంతో షోడశదళ పద్మాన విశుద్ధ చక్రంలో నిన్నుపాసించే అనన్యభక్తులు నీకు దగ్గరగా మెలగుతారు. కర్పూర వర్ణంతో ప్రకాశించే రెండు దళాల పద్మంలో ఆగ్నేయచక్రమందు నీ జ్యోతిర్మయ మంగళరూపాన్ని ధ్యానించే పరమభక్తులు నీతో సమానులవుతున్నారు.

36. ఓ దేవీ! విశుద్ధ వర్ణంతో ధ్రువమండలాఖ్యతో ఒప్పుతూ వేయి దళాల పద్మాకారాన ఉండే సహస్రాకారచక్రంలో నీ స్వరూపాన్ని ధ్యానిస్తూ, నీలో ఐక్యమయ్యే బ్రహ్మజ్ఞానులు మోహం నశించినవారై నీ సాయుజ్యాన్ని పొందుతున్నారు. బ్రహ్మస్వరూపులై నిత్యముక్తులవుతున్నారు. ఈ విధంగా దేవీధ్యానక్రమాన్ని, వాటి ఫలితాలను తెలిపారు. దేవీ ఉపాసకులు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యాలనే నాలుగు స్థానాలను పొందుతున్నారని తెలుపుతున్నారు.

37. శ్రీ దేవీ ఉపాసనా విధానంలోని నాలుగు అనుభవాలను తెలుపుతున్నారు. 1. శ్రీ చక్రమందు బోధించిన శ్రీ దేవీతత్త్వాన్ని షడాధారాలందు ఐక్యం చేసి, జ్యోతిర్మయదేవీస్వరూపాన్ని ధ్యానించాలి. 2. మంత్రంలో శ్రీ చక్రస్వరూపాన్ని బాగా తెలుసుకొంటూ ఉపాసన చేయాలి. 3. చక్రానికి, దేవికి ఏకత్వాన్ని భావిస్తూ ఉపాసన చేయాలి. 4. మంత్రానికి, మంత్రార్థమైన దేవికి ఏకత్వాన్ని కల్పించి ధ్యానించాలి. అంటే దేవీ స్వరూపాన్ని బాగా తెలుసుకొని అభేద భావంతో దేవిని ధ్యానిస్తూ పరబ్రహ్మాన్ని పొందుతున్నాడు.

సాధకుడు ఈ నాలుగు అనుభవాలను శ్రీ గురుముఖంగా శాస్త్ర రీతిగా తెలుసుకొని ఉపాసించాలి. ఆ విధంగా ఉపాసన చేసిన సాధకుడు దేవీకృపకు పాత్రుడవుతాడు.

38. శ్రీ శంకరులు పరమ భక్తితో, మంత్రాలతోను, సూక్తులతోను శ్రీ మూకాంబికాదేవిని స్తుతించి, పూజించి కొన్ని రోజులు ఆ క్షేత్రంలోనే నివసించారు. శ్రీ శంకరులు శిష్యగణమూ కేవల భిక్షాటనంచే దొరికినది భుజిస్తూ జీవించారు. పరిసరప్రాంతాల నుండి సాధకులు అనేకమంది వస్తూ ఉండడంచే, అత్యంత శాంతచిత్తులై వారందరికీ సూక్తిసుధలను బోధించసాగారు.

39-40. శ్రీ శంకరులు మూకాంబికాక్షేత్రం నుండి బలియనే అగ్రహారానికి వెళ్లారు. ఆ అగ్రహారమందలి జనులందరూ నిత్యాగ్ని హోత్రులు. శాస్త్రంచే నిషిద్ధాలైన కర్మలను చేయక, సద్ధర్మాలనే ఎల్లప్పుడు ఆచరిస్తూన్న శ్రోత్రియులైన బ్రాహ్మణులచే ఆ అగ్రహారం అమిత తేజోవంతమై విరాజిల్లింది. శ్రీ శంకరులు శిష్యులతో కలసి కొంతకాలం ఆ గ్రామంలో నివసించారు.

ఆ మహాపవిత్రాగ్రహారమందు అపమృత్యువు గ్రామంలోనికి ప్రవేశింపజాలక బయటనే సంచరిస్తున్నది. ఆ అగ్రహారికులందరూ మృత్యు భయంలేక, దీర్ఘాయుష్మంతులై ఉన్నారు.

41. నిత్యం అగ్నిహోత్రకార్యంచేత అగ్నిహోత్రుని తృప్తిపరస్తూ, వేదం పఠిస్తూ, వేదసమ్మతమైన కార్యాలనే చేస్తూ, కడు సామర్థ్యంతో కర్మల

నాచరిస్తూ, నిషిద్ధ కార్యాలు చేయకుండా ఉండే బ్రాహ్మణులు రెండువేల మంది ఆ అగ్రహారంలో నివసిస్తున్నారు.

42. ఆ అగ్రహారానికి మధ్య ఒక మహేశ్వరుని ఆలయం ఉంది. ఆ ఆలయం హారమందలి మధ్య మణిలా ప్రకాశిస్తున్నది. ఆకాశంలో ఎన్ని నక్షత్రాలున్నా, అవి వెలుగునీయలేవు. వాటి మధ్య ఒక్క చంద్రుడుండటంచేత చీకట్లను పారద్రోలి వెన్నెల కురిపిస్తున్నాడు. అట్లే ఆ ఆగ్రహారంలో ఎందరు సద్బ్రాహ్మణులున్నా, మహేశ్వరుని ప్రార్థించటంచేతనే అజ్ఞానాంధ కారం తొలగుతున్నది. ఆ విధంగా మహేశ్వరాలయం ఆ గ్రామానికి శోభను చేకూరుస్తున్నది.

43. ఆ అగ్రహారంలో సర్వశాస్త్రాలను చదివినవాడూ, అత్యంత ప్రతిభాసంపన్నుడూ శ్రీ కుమారిలభట్టు శిష్యుడూ, అయిన ప్రభాకరుడనే బ్రాహ్మణుడు ఉన్నాడు. అతనికి ప్రవృత్తి శాస్త్రమైన కర్మకాండయందు అత్యంత ఆసక్తి ఉంది. పూర్వమీమాంసా శాస్త్రానుసారం అనునిత్యం కర్మనిష్ఠలను ఆచరిస్తూ, శిష్యులకు బోధిస్తూ ప్రసిద్ధుడయ్యాడు. అనేక యజ్ఞయాగాదులను నిర్వర్తిస్తూ, దేవతలను తృప్తిపరచేవాడు. ఈ విధంగా శుద్ధవైదిక జీవితాన్ని గడుపసాగాడు.

44. ఆ బ్రాహ్మణోత్తముడు సర్వవిద్యాపరిపూర్ణుడే కాక, అఖండమైన సిరిసంపదలతో సమృద్ధిని పొంది ఉన్నాడు. సమృద్ధిగా పాలనిచ్చే గోవులనేకం ఆతడి గోశాలలో ఉన్నవి. ఆతని పంటభూములన్నీ పరిపూర్ణమైన పంటలు పండేవి. ఇక కనక, వస్తు, వాహనాలకు కొదువ లేదు. అతని శ్రేయస్సును కోరే అనేకమంది స్నేహితులు, బంధువులు ఉన్నారు. అయినా ఆ ప్రభాకర పండితునకు సంతోషం, సుఖశాంతులు కరువయ్యాయి. కారణమేమంటే చేష్టలుడిగి, ఉన్మత్తునిలా ఉండే ఒక పుత్రుడున్నాడు. ఆ బాలుడు వేదాధ్యయనం లేక, సత్కర్మలు చేయ అసమర్థుడై ఉన్నాడు.

45. ఆ ప్రభాకరపండితుని పుత్రుడు పిలిచినా పలుకడు. ఏ శబ్దాలను వినలేదు. మతిలేని వానిలా ఎల్లప్పుడు పరధ్యానంలోనే ఉండేవాడు. కాని ఆ బాలుని ముఖం బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించేది. సూర్యునిలా వెలిగిపోయే

ఆ బాలుని తేజస్సునూ, భూదేవి అంతటి సహనశీలాన్ని చూసినవారందరూ ఆశ్చర్యపోవడం కద్దు.

46. ఆ బాలుణ్ణి చూసి ప్రభాకర పండితుడు "ఈతడు గ్రహదోషం వలన ఇలా ఉన్నాడా? లేక స్వభావ సిద్ధంగానే మందుడై జన్మించాడా? లేక పూర్వజన్మ వాసనలచేత ఈ విధంగా ఉన్మత్తుడయ్యాడా?" అని పరిపరి విధాలుగా చింతించేవాడు. తనను సందర్శించే పండితులకు, తాను సందర్శించిన బహు శాస్త్రజ్ఞులకు బాలుని విషయమై విన్నవించుకొంటుండేవాడు.

47. ఈ విధంగా పుత్రుని గూర్చి చింతాక్రాంతుడై ఉన్న ప్రభాకర పండితునికి, అగ్రహారానికి సర్వలోక పూజ్యుడైన ఒక పరివ్రాజక మహాత్ముడు విచ్చేశాడని తెలిసింది. వెంటనే ఆ మహాత్ముని దర్శన భాగ్యం చేత తన కర్మనివృత్తి కాగలదని తలచి పుత్రుని వెంటబెట్టుకొని ఆ మహనీయుని దర్శింప వెళ్లాడు.

48. రాజు, దైవం, పండితుల, పరివ్రాజకుల వద్దకు వట్టి చేతులతో పోరాదనే శాస్త్రవాక్యం ప్రకారం సముచితమైన కానుకలతో శ్రీ శంకరులను దర్శించాడు. వినమ్రుడై, కడు భక్తితో శ్రీ శంకరులకు తాను తెచ్చిన కానుకలు సమర్పించి వారి పాదపద్మాలకు సాష్టాంగంగా నమస్కరించాడు.

49. ఈ విధంగా సాష్టాంగనమస్కారం చేసిన ప్రభాకర పండితుడు, జడునిలా ఉన్న తన పుత్రుని చేత కూడ సాష్టాంగ నమస్కారం చేయించాడు. ఆ బాలుడు శ్రీ శంకరులకు సాగిలపడి మ్రొక్కి తిరిగి లేవక జడునిలా అలాగే పడి ఉండిపోయాడు. ప్రభాకరపండితుడు పూర్వమీమాంసా ప్రవర్తకుడు. శ్రీ కుమారిలభట్టుల ప్రియ శిష్యుడు. వైదిక కర్మకాండము నందే అమితాసక్తి కలిగినవాడు. అట్టి పండితోత్తముడికి, పుట్టినప్పటి నుండీ మాయాప్రభావానికి అతీతుడై, సర్వదృశ్య ప్రపంచంపట్ల ఆసక్తి లేనివాడై, కేవలం పరబ్రహ్మం యందే విహరించే పుత్రుడు కలిగాడు. ఈ విషయం తెలుసుకోలేని ప్రభాకరపండితుడు, తన పుత్రునికై అమితంగా దుఃఖిస్తూన్నాడు.

50. శ్రీ శంకరుల పాదాలకు నమస్కరించి, జడునిలా పడి ఉన్న ఆ బాలుని శ్రీ శంకరులే లేవనెత్తారు. తరువాత ఆ ప్రభాకర పండితుడు

శ్రీ శంకరులతో "మహాత్మా! ఈ బాలుని జడత్వానికి కారణమేమిటో సెలవివ్వండి."

51. "మహాత్మా! నా పుత్రుడు పుట్టినప్పటినుండీ ఇలాగే జడునిమల్లే జీవిస్తున్నాడు. ఈతనికిప్పుడు 13 సంవత్సరాలు వచ్చాయి. అమ్మ, నాన్న అని కూడా పిలువడు. మాట్లాడకపోవడంతో మూగవానిగానూ, జ్ఞానమే మాత్రం లేనందున ఉన్మత్తునిమల్లేనూ ఉంటున్నాడు. ఆ కారణంగా వేదాధ్య యనం చేయించలేకపోయాను. అక్షరజ్ఞానం కూడా లేదు. గాయత్రీ మంత్రోపదేశం చేత కొంత ప్రయోజనముంటుందని ఆశించి ఉపనయనం చేశాను. దానివలన కూడా ఎలాటి ప్రయోజనమూ లేకపోయింది. ప్రపంచ స్మృతి లేదు. వీడు ఎలాగైనా జ్ఞానవంతుడయ్యేట్లు అనుగ్రహించండి."

52. "మహాత్మా! వీడు తోటి బాలురతో ఆటలాడడు. పిలిచినా మూగ వానిలా మాట్లాడడు. తోటి బాలురు వీనిని కవ్వించి ఏడిపించినా ఉలకడు పలకడు. పిచ్చివాడిగా జమకట్టి కొట్టినా కోపం రాదు."

53. "వీనికి ఆకలి తెలియదు. ఒకప్పుడు తింటాడు. మరొకప్పుడు తినడు. నా మాట అసలే వినడు. చెప్పిన పని చేయడు. అయినా వీణ్ణి కొట్టడానికో, తిట్టడానికో మనసు రాదు. శారీరకంగా మాత్రం పెరుగుతూనే ఉన్నాడు."

54. ప్రభాకరుడీ విధంగా ఆ బాలుని గూర్చి సర్వమూ శ్రీ శంకరు లకు వివరించి తెలిపాడు. అంతట శ్రీ శంకరులు ఆ బాలునితో ఇలా పలికారు:

**శ్రీ శంకరులు:** ఓ శిశువా! నీ వెవరవు? నీ వెవరికి సంబంధించిన వాడవు? నీ వెక్కడకు పోతావు? నీ పేరేమిటి?

55. ప్రభాకరుని పుత్రుడు ఇలా పలికాడు: "సద్గురుమహాదేవా! నేను జడుడను కాను. జడపదార్థం కూడా నా సాంగత్యంచేత చైతన్యవంత మవుతున్నది. ఓ సద్గురుమూర్తీ! ఇక మోహాది ఆరు అవస్థలకు అతీతుడను. ఆకలి, దప్పిక, వార్ధక్యం, మరణం మొదలైన వాటన్నిటికీ అతీతుడను. కేవలం నిర్విషయ, నిర్విశేష, నిరవధిక, ముఖైకధామమైన ఆ పరబ్రహ్మామే

నేనై ఉన్నాను. జీవబ్రహ్మైక్య స్వరూపమైన చైతన్యం నేనై ఉన్నాను ఇదే నా నిజతత్త్వం. అట్టి పరబ్రహ్మం నేనే. ఇది సత్యం.

ఓ సద్గురుమూర్తీ! నేను మానవుడను కాను, దేవతను, యక్షుడను, బ్రాహ్మణుడను, క్షత్రియుడను, వైశ్యుడను, శూద్రుడను, బ్రహ్మచారిని, గృహస్థు, వానప్రస్థుడను, సన్యాసిని కాను. కేవలం సచ్చిదానందస్వరూపుడను."

56. "ఓ సద్గురుమూర్తీ! సర్వజ్ఞుడవైన పండితప్రవరా! నేను పొందుతున్న ఈ అవిచ్ఛిన్న బ్రహ్మానందానుభవం ముముక్షువులందరకూ కలుగుగాక! నేను దృశ్యరహితుడనై, ఏ అఖండ విజ్ఞానంతో ఉన్నానో, అట్లే సద్గురువులైన తమ సందర్శనభాగ్యం చేత ముముక్షువులందరూ సంసార బంధాలనుండి విడివడి, ఆనందపదవిని పొంది, విజ్ఞాన సంపత్తితో తులతూగుతూ శాశ్వతానందాన్ని పొంది ముక్తులవుతారు గాక!" తరువాత ఆ బాలుడు శ్రీ శంకరుల పాదపద్మాల వద్ద చేరి పన్నెండు శ్లోకాలను ఆశువుగా పలికాడు. అవే జగత్ప్రసిద్ధి గాంచిన హస్తామలక శ్లోకాలు.

i. సూర్యభగవానుడు లోకంలో జరిగే సకల కార్యాలకు కారణ భూతుడైనా, నిర్లిప్తుడై సాక్షీభూతుడై ప్రకాశిస్తున్నాడు. అలాగే పరమాత్మ కూడా ఆకాశంలా సర్వవ్యాప్తుడై, స్వయంప్రకాశమానుడై, నిర్లిప్తుడై, సర్వసాక్షియై జడాలైన మనోనయనాది సర్వేంద్రియాలకు చైతన్యం కలిగిస్తూ, నానా వ్యాపారాలకు కారణభూతుడవుతున్నాడు. ఆ నిత్య సచిత్స్వరూపుడైన ఆత్మను నేనే; పరమాత్మను నేనే.

ii. అగ్ని సహజంగా వేడిని కలిగి ఉంటుంది. అదేవిధంగా, నిత్య బోధరూపంలో ఉండేది, జడాలు, జ్ఞానం లేనివైన మనోబుద్ధ్యాది సర్వేంద్రియాలకు చైతన్యం ఇచ్చేది, అయిన నిర్వికారాత్మనే నేను. నేను ఆ ఆత్మను, శివుడను.

iii. అద్దంలో ముఖం ప్రతిబింబిస్తున్నది. అద్దంలో కనిపించే ప్రతిబింబం ముఖంకంటే వేరైనది కాదు. వేరు వస్తువు లేదు. అదేవిధంగా, ప్రాణులన్నింటిలోను బుద్ధి ఉపాధులందు పరమాత్మే జీవుని రూపంగా ఉన్నాడు. కనుక ఆ జీవుడు కూడా పరమాత్మే. వేరు కాదు. సకల బుద్ధి -

ఉపాధులన్నింటిలోనూ పరమాత్మే ప్రతిబింబిస్తున్నాడు. వేరు వస్తువు లేదు. కాబట్టి ప్రతిబింబ రూపమైన పరమాత్మయే బింబరూప పరమాత్మ. ఆ నిత్య బోధస్వరూప పరమాత్మయైన ఆత్మే నేను. స్వయంప్రకాశకుడను.

iv. అద్దమనే ఉపాధి లేనప్పుడు, బింబరూపమైన ముఖం ఉండదు. కానీ బింబప్రతిబింబ రూపం (అద్దం లేని కారణాన) కనిపించటం లేదు. ఉపాధి (అద్దం) ఉండటంవలననే బింబ, ప్రతిబింబాలు తెలుస్తున్నవి. ఉపాధి తొలగటంచేత కల్పితమైన ప్రతిబింబం తొలగిపోయి, కేవలం (నిజ) ముఖం మాత్రమే మిగిలి ఉంది. అదేవిధంగా, పరమాత్మ బుద్ధి ఉపాధుల నుండి తొలగినప్పుడు ప్రతిబింబ రూప చిదాభాసుడు ఉండడు. కేవలం పరమాత్మ ఒక్కటే ఉంటుంది. బింబం మాత్రం తొలగిపోతున్నది. బుద్ధి ఉపాధుల వలన బింబం మాత్రం తొలగిపోతున్నది. బుద్ధి ఉపాధుల వలన పరమాత్మ రూపం కల్పితవ్యవహారమవుతున్నది. కనుక ఉపాధి తొలగిపోతే జీవ-బ్రహ్మ రూపమైన కల్పిత వ్యవహారం కూడా తొలగిపోతున్నది. అప్పుడు ఇక బింబ ప్రతిబింబ వ్యవహారా లుండవు. కేవలం చైతన్యవస్తువైన పరబ్రహ్మమే మిగులుతున్నది. జీవుడనే పదార్థముండదు. పరమాత్మ మూడు కాలాలందూ ఉండేవాడు. అట్టి సద్రూపనిత్యానందపరబ్రహ్మమే నేను. అదే ఆత్మవస్తువు. నేనే ఆ ఆత్మవస్తువును.

v. స్థూల ఇంద్రియాలు సూక్ష్మేంద్రియాలతో సంగమై ప్రవర్తింప జేస్తున్నవి. అంటే సూక్ష్మాలైన ఇంద్రియాలు విలక్షణమై, సూక్ష్మ స్థూల దేహాలకు వేరై, మనస్సునకు మనస్సై, మనస్సు సంకల్పిస్తున్నది. ఆ సంకల్పం కూడా ఆత్మకు తెలుస్తున్నది. అట్టి నేత్రరూపాన్ని కూడా ఆత్మ తెలుస్తున్నది. ఈ ప్రకారంగా స్థూలసూక్ష్మేంద్రియాల ప్రవృత్తులన్నిటినీ ఒకే ఆత్మ నిర్వికారియై తెలుస్తున్నది. ఏది ఈ ప్రకారం సర్వవిలక్షణమై సర్వసాక్షిగా ఉంటూ, ఆ సూక్ష్మేంద్రియాలకు కూడా కనిపించని స్వరూపంలో ఉంటున్నదో, ఆ సర్వాన్ని గోచరింపజేసే నిత్యానంద స్వరూప పరమాత్మే నేను.

vi. సూర్య భగవానుడు తానొక్కడే అయినా, అనేక కలశాలందు ప్రతిఫలించి అనేక సూర్యులుగా తెలుస్తున్నాడు. అట్లే స్వతశ్శుద్ధ చేతనాత్మక

పరమాత్మ ఒక్కటే అయినా అనేక ఉపాధులలో చేరి అనేకంగా తెలియ బడుచున్నది; అనేక జీవులుగా తెలియబడుచున్నది. ఆ శాశ్వతానంద పరమాత్మ యైన ఆత్మే నేను. సోఽహమ్.

vii. సూర్య భగవానుడు ఒకేసారి అందరి నేత్రాలకూ చూసే శక్తిని ప్రసాదిస్తూ, ప్రపంచమంతటినీ ప్రకాశింపజేస్తున్నాడు. అదేవిధంగా పరమాత్మ కూడ సర్వబుద్ధి ఉపాధులను ప్రకాశింపజేస్తూ, ప్రకాశింపదగిన వస్తువు లన్నింటినీ ప్రకాశింపజేస్తున్నాడు. సర్వ బుద్ధులకు ప్రకాశం, జ్ఞానం ఇచ్చి ఒకేసారి సర్వాన్ని ప్రకాశింపజేస్తున్నాడు. ఈ విధంగా సర్వప్రకాశమై స్వయంప్రబోధరూపమై సచ్చిదానంద పరమాత్మయైన ఆత్మే నేను. నేనే ఆ ఆత్మను.

viii. నేత్రాలు సూర్యుని ప్రకాశం పడిన వస్తువులనే చూడగలవు. సూర్యప్రకాశం పడని వస్తువులను చూడలేవు. ఎందుకంటే, సూర్యుడు నేత్రానికి అధిదేవత అయినందున సర్వరూపాలను నేత్రం గ్రహిస్తున్నది. నేత్రం కూడా సూర్యుని సహాయం చేతనే ప్రకాశవంతమై సర్వవస్తువులను చూస్తున్నది. అట్లే, పరమాత్మ చైతన్యం చేత ప్రకాశించే ప్రపంచాన్ని నేత్రం చూస్తున్నది. ఒక కన్నే కాదు, తక్కిన ఇంద్రియాలన్నీ కూడా విషయాలను గ్రహిస్తున్నవి. పరమాత్మ చైతన్యం ప్రసరించని చోట ఏదీ కనిపించదు; ఏ ఇంద్రియమూ ఏ విషయాన్నీ గ్రహించలేదు. కనుక సర్వప్రకాశకుడైన ఆ పరమాత్మ వస్తువు ఆత్మే. అట్టి పరమాత్మ రూపుడనైన ఆత్మను నేనే.

ix. సూర్యుడు ఒక్కడే అయినా నదిలో ప్రసరించినప్పుడు అలలపై పడి అనేకమంది సూర్యులలా కనిపిస్తున్నాడు. నిశ్చలమైన నీటిలో ప్రసరించినప్పుడు ప్రకాశంతో కూడిన ఒకే సూర్యుని చూడగలుగుతున్నాం. అంటే నిశ్చల మనస్సు గలవారు పరమాత్మ ఒక్కనిగానే తెలుసుకొంటున్నారు. చంచలమైన బుద్ధి గలవారికి పరమాత్మ అనేక రకాలుగా తెలుస్తున్నాడు. కనుక బుద్ధి, ఉపాధులన్నింటికీ చైతన్యవంతమై ఉన్న సచ్చిదానంద పరబ్రహ్మమైన ఆత్మే నేను. నేనే ఆ ఆత్మను.

x. సూర్యుడు మేఘాలచే ఆవరించబడి ఉండటం చేత సూర్యునిలోని ప్రకాశం నశించినదని తలచేవారు మూఢులు. అట్లాగే పరమాత్మను మాయాశక్తి ఆవరించి ఉండటం చేత అజ్ఞాని పరమాత్మను చూడలేడు. దృశ్యప్రపంచాన్ని మాత్రమే చూడగలుగుతున్నాడు. పరమాత్మ కూడా మాయాబంధాలచే బంధింపబడినట్లుగా కనిపిస్తున్నా చక్కగా విచారణ చేస్తే, సూర్యునిలా నిత్యప్రకాశకుడై వెలయుచున్నాడు. ఆ నిత్యబోధస్వరూపానంద పరమాత్మను నేనే. నేనే ఆ ఆత్మను.

xi. ఏ సద్వస్తువు, రత్నహారంలోని దారంలా ఆధారభూతమై ఉంటుందో, ఆ వస్తువులనంటక నిత్య స్వయంబోధానంద వ్యాపకమై పరిశుద్ధమై ఉన్నదో అట్టి పరమాత్మను నేనే. నేనే ఆ ఆత్మను.

xii. మణులలో ఉపాధిభేదముండటం వలన భేదం కనిపించేట్లుగానే, బుద్ధిభేదంచేత నీలో కూడా భేదమున్నదని భావిస్తున్నాడు. నీటిలో ప్రతిబింబచంద్రుడు చంచలంగా కనిపించటంచేత, చంద్రుడే చంచలస్వభావి అని భ్రమ చెందుతున్నారు. విచారిస్తే పరమాత్మ నిశ్చలం, ఉపాధి లేనివాడని, పరిశుద్ధమని, పరిపూర్ణుడని, స్వయంప్రకాశం, శివం అని తెలుస్తుంది.

57. ఆ బాలుడు శ్రీ శంకరుల సన్నిధిలో తన ఆత్మానుభవాన్ని స్పష్టంగా విన్నవించాడు. ఆ బాలకుని కవితాపటిమను, బ్రహ్మతత్త్వప్రతి పాదకాలైన శ్లోకాలను ఆలకించిన శ్రీ శంకరులు పరమాత్మతత్త్వ మంతా అరచేతిలో ఉసిరిక పండులా (హస్తామలక ఫలం) స్పష్టంగా తెలియజెప్పాడని ప్రశంసించారు. ఉపనిషత్సారమంతా ఆ శ్లోకాలలో కరతలామలకంగా ప్రతిబింబించటం చేత ఈ శ్లోకాలు కరతలామలకా లని ప్రసిద్ధి గాంచినవి. ఆనాటి నుండీ ఆ బాలకుని హస్తామలకుడని పిలువసాగారు. వానికి ఆ నామమే సార్థకమై హస్తామలకాచార్యులుగా ప్రసిద్ధి గాంచాడు.

58. ఆ కరతలామలకుడు గురూపదేశం లేకుండానే, పూర్వజన్మల శుభసంస్కారాల స్మృతిజ్ఞానం చేత ఇప్పుడు ఆత్మజ్ఞానతత్త్వాన్ని బోధించటం చూసిన శ్రీ శంకరులు ఎంతో ఆశ్చర్యం చెందారు. ఇతడు శుకదేవుడు

వామదేవుల మల్లేనే పుట్టుకతోనే బ్రహ్మజ్ఞాని అయ్యాడని ప్రశంసించారు. ఇదివరకెన్నడూ నోరు తెరచి ఒక మాట అయినా పలుకని ఆ బాలుడు శ్రీ శంకరులను దర్శించగానే అనర్గళంగా బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశించటం చూసిన జనులందరూ ఆశ్చర్యపోయారు. తరువాత శంకరులు తన చేతిని ఆ బాలుని శిరస్సు మీద ఉంచి హస్తమస్తక దీక్ష నొసగారు.

59. శ్రీ శంకరులు ఆ బాలునికి హస్తమస్తక దీక్ష నిచ్చిన తరువాత, ప్రభాకర పండితునితో ఇలా అన్నారు: "నాయనా! నీ కుమారుడు గృహస్థుల ఇంట జీవించడానికి అర్హుడు కాదు. పుట్టుకతోనే బ్రహ్మజ్ఞాని అవడం చేత నీ కెలాటి ప్రయోజనమూ వీని వలన కలుగబోదు."

60. అంతేగాక ఈ బాలుడు పూర్వజన్మలందు యోగాభ్యాసంచే సమాధి చెంది ఉన్నాడు. గురుకృప చేత, దైవానుగ్రహం చేత దివ్యప్రబోధంతో సర్వం తెలిసినవాడై ఉన్నాడు. ఎల్లవేళల ఆత్మారామునితో సంయోగం చెంది ఉండటం వలన ప్రపంచ విషయాలు బొత్తిగా లేనివాడై ఉన్నాడు. కేవల నిర్వికల్ప సమాధిలో ఉంటూ బాహ్యస్మృతి లేకుండా ఉన్నాడు. జీవన్ముక్తుని అవస్థలో ఉన్నాడు.

61. పండితవర్యా! నీ కుమారుడు నిరుపమ వైరాగ్యశాలి. సంసారాసక్తుడు కాదు. అతనికి తన దేహం పట్ల కూడా ఆసక్తి లేదు. ఆతడికి నేను, నాది అనే భావం కొంచెమైనా లేదు. ఈ హస్తామలకుడు సర్వదృశ్యరహిత, అఖండ జ్ఞానసంపత్తితో వెలుగొందుతున్నాడు. ఈతని వలన మీకు ఎట్టి ప్రయోజనమూ కలుగదు. ఈతణ్ణి నా శిష్యునిగా చేసుకొంటాను. నాతో పంపండి."

62. శ్రీ శంకరులు ఈ విధంగా పలుకగా, శ్రీ ప్రభాకరుడు, సహజంగానే పండితుడవడం చేత వెంటనే తన అంగీకారాన్ని తెలిపాడు. అంతేకాక తన కుమారుని దివ్యజ్ఞానం చేత తన వంశమంతా కృతార్థత చెందుతుందని తలచాడు. తరువాత శ్రీ శంకరులు ఆ బాలుని తన శిష్య పరివారంతో కూడ చేర్చుకొని మరల తమ జైత్రయాత్రను కొనసాగించారు.

63. పరిపూర్ణ కాముడైన శ్రీ శంకర పరమహంస పరమాచార్యుని దేవతలందరూ కొనియాడుతూండగా పద్మపాదాది శిష్యగణం వెంటరాగా, శృంగేరికి పయనమైనారు.

64. ఏ పర్వత శ్రేణులయందు శ్రీ ఋష్యశృంగ మహర్షి తపమాచ రించాడో, ఏ క్షేత్రం పరమపవిత్రమై సర్వపాపాలను నశింపజేస్తూ సర్వమంగళకరమైనదో, ఏ ప్రదేశాన్ని స్వచ్ఛమైన జలాలతో ప్రవహించే తుంగభద్రానది పావనం చేస్తున్నదో అట్టి మహాపుణ్యస్థలమై మనోజ్ఞమై విరాజిల్లే శృంగేరి క్షేత్రానికి శ్రీ శంకరులు చేరుకొన్నారు. అక్కడ సర్వ దేవతలూ నివసిస్తుంటారు.

65. అట్టి శృంగగిరి యందు, నివసించే పండిత ప్రకాండులందరూ నిత్యం వేదాధ్యయనం చేసేవారై, యజ్ఞయాగాదులచే దేవతలందరినీ తృప్తి పరచేవారై, అతిథి అభ్యాగతులను దేవతాస్వరూపులుగా భావించి పరమ భక్తిశ్రద్ధలతో పూజించేవారై సూర్యునిలా ప్రకాశిస్తున్నారు.

66. శ్రీ శంకరులు ఆ పవిత్ర శృంగేరియందు బ్రహ్మసూత్ర భాష్యాన్ని, ఉపనిషద్భాష్యాన్ని, ఇతర వేదాంత గ్రంథాలను వ్యాఖ్యానిస్తూ, శిష్యులచే పఠింపజేయసాగారు.

67. శ్రీ శంకరులు ప్రసన్నగంభీరస్వానుభవపూర్వకంగా బోధిస్తూండగా, సర్వవిద్యాసంపన్నుడైన ఆదిశేషుడే శిరస్సు వంచి అభివాదం చేసేవాడు. వాక్కున కధిపతియైన బృహస్పతి కూడా ఆశ్చర్యపడేట్లు కానవస్తున్నది. పండితులందరూ పతంజలి భాష్యానికన్నా మిన్నగా ఉన్నదని హర్షం వ్యక్తం చేశారు. ఆ శృంగేరిలోని పండిత ప్రవరులచేత జీవేశ్వరైక్యతత్త్వాన్ని, బ్రహ్మ సూత్ర భాష్యాన్ని, ఉపనిషద్భాష్యాన్ని గీతాభాష్యం మొదలైన మహోత్తమ గ్రంథాలను అధ్యయనం చేయించి వారికందరకూ అధ్యాపకులైనారు. మహోత్తము లెందరో శిష్యులవసాగారు. ఆ విధంగా భాష్యవిస్తృతిని లోకంలో విస్తరింపజేయసాగారు.

68. శ్రీ శంకరులు శృంగేరియందు మహేంద్రభవనానికి మించిన శిల్ప సంపదతో ఒక ప్రాసాదాన్ని నిర్మింపజేశారు. సర్వదేవతలచే పూజలందు

కొంటున్న శ్రీ శారదాదేవిని అక్కడ సుస్థిరంగా ప్రతిష్ఠించారు. అద్దాని నొక విద్యాపీఠంగా చేయాలని శాసించారు. ఆ పీఠానికి తమ శిష్యులలో ముఖ్యుడైన శ్రీ సురేశ్వరాచార్యులను అధ్యక్షునిగా చేసి, వేదాంతమతాన్ని స్థాపించారు.

69. శ్రీ శంకరుల కోరికను మన్నించిన శ్రీ సరస్వతీదేవి 'శారద' అనే ప్రఖ్యాతనామంతో శృంగేరి పీఠంలో భక్తుల కోరిన కోరికలన్నిటినీ ప్రసాదిస్తూ కొలువుదీరింది. శ్రీ పరమహంసల వాక్కునందు నిలిచి, ఆ దేవి విద్యాదాయినియై ఉన్నది.

70. శ్రీ శంకరుల శిష్యులలో ఒకడు శ్రీ శంకరుల మనసు ఎరిగి నడచుకొనేవాడు. గురుదేవులకు సంతోషం కలిగించటమే వ్రతంగా పెట్టుకొన్న ఆతడు సర్వభూతాల పట్ల దయగలవాడై, సత్కార్యాలను మాత్రమే చేస్తూండే వాడు. ఆతడు పరిపూర్ణ గురుభక్తి కలవాడే కాని, శాస్త్రజ్ఞానం లేనివాడు. ఆతడే శ్రీ శంకరుల ప్రియశిష్యులలో ఒకడైన శ్రీ తోటకాచార్యులని ప్రసిద్ధి గాంచాడు.

71. శ్రీ తోటకాచార్యులు, అందరికన్నా ముందుగా లేచి, స్నానాదుల నాచరించి, గురుదేవులకు దర్భలతో ఆసనం ఏర్పాటు చేసేవాడు. శ్రీ గురు దేవుల కాలకృత్యాలకు జలం సమకూర్చటం వంటి అనేక సేవలు అమిత భక్తితో, ప్రియంతో చేసేవాడు. పర్ణశాలను శుభ్రపరచేవాడు.

72. అంతేగాక ఆ బ్రహ్మచారి గురుదేవులకు పాదాలు ఒత్తటం, వస్త్రాలను శుభ్రపరచటం వంటి సేవలు చేస్తుండేవాడు. ఒక్క మాటలో చెప్పాలంటే గురుదేవులను నీడలా వెన్నంటి ఉండేవాడు.

73. శాస్త్రాలలో చెప్పిన విధంగా, ఎల్లప్పుడూ గురువు సన్నిధియందే ఉండేవాడు. కాళ్ళు చాచుకొనటం గాని, ఆవలించటం గాని గురు సమక్షాన చేసేవాడు కాదు. మితభాషిగా ఉంటూ, ప్రగల్భాలు పలుకక, గురువుకు ఎన్నడూ వీపు చూపకుండా సంచరించేవాడు. ఈ విధంగా సకల బ్రహ్మచారి ధర్మాలు నెరవేరుస్తూ, శ్రీ శంకరుల అనుగ్రహం పొందేవాడు.

74. గురుదేవులు లేచి నిలబడితే తాను కూడ లేచి నిలబడేవాడు. గురునాజ్ఞకై భయభక్తులతో నిరీక్షించేవాడు. గురుదేవుడు పలికిన పలుకు లన్నిటినీ శ్రద్ధతో వినేవారు. ఈ విధంగా ఆ బ్రహ్మచారి శ్రీ శంకరుల మనస్సును సంతోషపెట్టసాగాడు.

75. ఒకనాడు ఆ తోటకాచార్య ప్రముఖుడు గురుదేవుల వస్త్రాలు శుభ్రం చేయడానికి తుంగభద్రానదీతీరానికి వెళ్ళి తిరిగి రావడానికి ఆలస్యమైనది. భాష్యప్రవచనానికి సమయం మించిపోతున్నది. వేదాంత శ్రవణానికై శిష్యగణమంతా వచ్చిచేరుకొంది. ఈ తోటకాచార్య బ్రహ్మచారి మాత్రం రాలేదు.

76. అట్టి సమయంలో భాష్య శ్రవణం గావించక శ్రీ శంకరులు ఆ బ్రహ్మచారికై నిరీక్షిస్తున్నారు. సహనం లేని శిష్యులు కొందరు శ్రవణాన్ని ప్రారంభింప శాంతిపాఠాన్ని ప్రారంభించారు. అంతట శ్రీ శంకరులు, వారిని వారించి "గిరి వచ్చేవరకు నిరీక్షిద్దాం" అంటూ శిష్యులపై తనకు గల వాత్సల్యాన్ని చాటుకొన్నారు. శ్రీ శంకరులు ఇతర విషయాలందు సమయం వృథా చేయడానికి ఇష్టపడేవారు కారు. కానీ ఒక శిష్యునిపై గల ప్రేమ చేత భాష్యపాఠశ్రవణాన్ని కొద్దిసేపు నిలిపారు. అంటే, గురుభక్తి, గురువు పట్ల నిష్కపట వర్తనం గురువుల హృదయాన్ని కరిగించి వారి కృపకు పాత్రులను చేస్తుంది.

77. గురువర్యులు గిరి రాకకై పాఠాన్ని ఆలస్యం చేయటం శ్రీ పద్మపాదాచార్యుల వారికి నచ్చలేదు. అందువలన గురుదేవులతో "గురు దేవా! అతడొక మందబుద్ధి. భాష్యాది వేదాంత విషయాల అధ్యయనానికి అర్హుడు కాడు. ఎందుకంటే ఆ గోడకు పాఠం చెప్పినా, గిరికి పాఠం చెప్పినా సమమే అవుతుంది. అతడికై భాష్య శ్రవణం నిలుప సమం జసమా?" అన్న భావంతో పలుకగా శ్రీ శంకరులు అతని మనోభావాలను గ్రహించారు.

78. శ్రీ శంకరులు పద్మపాదుని ఆంతర్యాన్ని గ్రహించారు. "ఓహో! ఇతడు తానే సర్వజ్ఞుడనని గర్విస్తున్నాడు. అతడి గర్వాన్ని అణచాలి. గురుభక్తి

ఎంతటి మహిమాత్మకమైనదో అతడు తెలుసుకొనేట్లు చేస్తాను" అని తలచారు. వెంటనే తన కరుణామయదృష్టిని ఆ గిరిపై ప్రసరింపజేసి, ఆ క్షణాన్నే ఆతణ్ణి పదునాలుగు విద్యలయందు ప్రవీణుని గావించారు. గురుమహిమను తెలుసుకోవడం ఎవరి తరమూ కాదనే సత్యాన్ని పద్మపాదులకు చాటిచెప్పారు.

79. అంతట ఆ గిరి శిష్యవరుడు వస్త్రాలు శుభ్రపరచి నది నుండి బయటకు రాగానే ఆ క్షణాన్నే పరమ పండిత ప్రకాండుడయ్యాడు. సకల వేదాంతాదివిషయాలందు నిష్ణాతుడై మృదుమధురమైన కవితలతో శ్రీ గురుదేవులను స్తుతించాడు. తోటక వృత్తంతో కూడిన ఈ శ్లోకాలు ఆనందగిరి పేరుతో జగత్ప్రసిద్ధాలయ్యాయి.

i. ఓ పరమేశ్వరా! జనన మరణాలు, సుఖదుఃఖాలతో కూడిన యీ సంసార సాగరంలో మునిగి, దురాశ చేత ఆ ఉప్పు నీటినే త్రాగుతున్నాను. దిక్కు లేనివాడనై ఉన్నాను. నీ శరణాగతిని పొందుతున్నాను, కరుణించండి. నాకు చేయూతనిచ్చి జ్ఞాన మార్గాన్ని ప్రసాదించండి.

ii. ఓ బ్రహ్మజ్ఞానీ! ప్రాపంచికవిషయాలపై నాకు భోగ వాంఛ లేకుండేట్లు అనుగ్రహించండి. శరీర ధర్మాలైన అహంకార మమకారాలనూ భ్రాంతులన్నింటినీ పూర్తిగా నాశనం చేయండి. నిత్యం, సత్యం అయిన ఆ భగవానుని ప్రేమ కలిగేట్లు చేయండి. ఈ పలుకులన్నీ గురుకృపచేతనే పలుకగలుగుతున్నాను. ఇది గురువాక్యమనే భావిస్తున్నాను. తాము ఎల్లప్పుడూ ఆత్మతోనే రమిస్తూ, ఆత్మానందంలోనే ఉంటారు. తమరి కసాధ్యమేదీ ఉండదు.

iii. నిరంతరం అన్నమయాది కోశాల చేత అజ్ఞానంచేత నేను, నాది అని మోహం చెందుతున్నాను. నన్ను ఆ మోహం నుండి విముక్తుని చేయండి. శాశ్వతం, అఖండం, నిర్గుణం అయి ఎల్లవేళలా నా హృదయమందే నివసించే ఆ పరమాత్మను నేనేనని తెలుసుకునే జ్ఞానాన్ని ప్రసాదించండి. అట్టి పరబ్రహ్మమే నేననే అఖండ జ్ఞానం గురుకృప చేత నాకు కలుగుగాక! నా యీ పలుకులు గురువచనాలే అవుగాక!

iv. నీటిని ఉపాధిగా చేసుకొనటం చేత సూర్యునికి అనేక రూపాలు కలుగుతున్నవి. ఘటాదుల యందు ఆకాశం అనేకంగా కనిపిస్తున్నది. అట్లే

నిర్వికారుడవై, పరమాత్మ స్వరూపుడవైన ఓ గురుదేవా! బుద్ధి భేదం చేతనే నీలో అనేకత్వం గాంచుచున్నారు. యథార్థాన, నీవు అఖండ, నిర్గుణ పరబ్రహ్మావు.

v. సూర్యుడు తన ప్రకాశం చేత ప్రపంచమంతటికీ వెలుగు నిస్తున్నాడు. తాను మాత్రం సాక్షిగా నిర్లిప్తుడై ఉంటూ సర్వజనుల చిత్తమందలి సంకల్పాలను తెలుసుకొంటూ అందరిలోను ప్రకాశిస్తాడు. అదేవిధంగా, పరమాత్మ స్వరూపులైన తాము కూడా సర్వజనుల మనస్సులలోని ఆలోచనలు తెలిసికొనినవారైనా, నిర్లిప్తులై ఉన్నారు. అంటే సద్రూపమైన ఆత్మ తమరే.

ఈ విధంగా ఆ బ్రహ్మచారి గురుస్తుతి ద్వారా జ్ఞాన తత్త్వాన్ని ప్రబోధించాడు.

80. మనోహరమైన లత సారవంతమైన నేలలో మొలచి ఒక వృక్షాన్ని ఆశ్రయించి ప్రాకుచున్నది. ఆ లతకు నీరు సమృద్ధిగా లభించటం చేత చక్కటి ఫలాల నందిస్తున్నది. అట్టి ఫలాలను చిలుకలు తింటూ ఆనందిస్తున్నవి. అదే విధంగా బ్రహ్మచారియైన గిరి హృదయం నుండి పుట్టిన గురుభక్తి అనే లత, గురుదేవుల పాదపద్మాలనే వృక్షాన్ని అశ్రయించి ఆత్మవిచారణ చేస్తూ ఆత్మ వికాసమనే కొమ్మలతో కూడి, పుష్పించి బ్రహ్మజ్ఞానమనే ఫలాలను అందిస్తున్నది. అట్టి ఫలాలను ముముక్షువులనే చిలుకలు తింటూ మహానందం పొందుతున్నవి. జనన మరణాలు లేని మోక్షపదాన్ని పొందుతున్నారు. శ్రీ గిరి పరమ భక్తి జ్ఞానాత్మకమైన తోటక వృత్తాలు ప్రసిద్ధి చెందినవి. అట్లే శ్రీ శంకరాష్టకం కూడా శ్రీ తోటకాచార్యుల వారిచే రచింపబడినదే.

81. గురుసేవ అనేది ఎంతో ప్రఖ్యాతి గాంచినది. మూడు లోకాల్లోనూ గురుసేవకు సమానమైనదేదీ లేదు. గురువరేణ్యుని దివ్యపాద సేవ చేత సకలార్థాలు సిద్ధిస్తాయి; విజ్ఞానమయం; మోక్షప్రదం. చలించని పర్వతాన్ని కూడా చైతన్యవంతం చేసే శక్తి ఆ గురుసేవకు ఉంది. జడుడైన ఆ బ్రహ్మచారి గురుపదసేవ, గురుదేవుల సంకల్ప మాత్రాననే క్షణకాలంలో, అతణ్ణి బ్రహ్మ జ్ఞానసంపన్నునిగా చేశాయి.

82. శ్రీ శంకరుల శిష్యబృందంలో గిరి అనే బ్రహ్మచారి శాస్త్రాలేవీ చదివిన వాడు కాదు. మందమతియై, జడునిలా మెలగేవాడు. గురుసేవ తప్ప

మరే విషయాలూ అతడికి తెలియవు. అటువంటి ఆ బ్రహ్మచారి (గిరి) కేవలం గురుదేవుని అపారకృపావిశేషంచేత వేదార్థాలన్నింటినీ ప్రకటించగలిగాడు. వేదాంతతత్త్వనిపుణుడైనాడు. సర్వ వేదాంతమయమైన తోటకవృత్తాలను రచించ గలిగాడు. అట్టి గిరిని పద్మపాదాచార్యులు ప్రభృత శిష్యులందరూ ప్రత్యక్షంగా చూస్తున్నారు. సర్వవేదాంత తత్త్వంతో కూడిన తోటక వృత్తాలను సంపూర్ణంగా విని ఎంతో ఆశ్చర్యపడ్డారు.

83. పద్మపాదాచార్యులు మొదలైన శిష్యవర్గమంతా గిరి పలికిన విజ్ఞానామృతాన్ని శ్రవణం చేసి ఎంతో ఆశ్చర్యం పొందారు. అంతేకాక, గిరిని గూర్చి తాను పలికిన పలుకులు (అతనికి చెప్పినా, గోడకు చెప్పినా సమమే అన్న) తనకే కఠోరంగా వినిపించసాగాయి. తమకు ఈ విధంగా గర్వభంగ మయింది గదా అని తలచారు.

84. గురుపాదపద్మాలను సేవించటం తప్ప పాండిత్యమే ఎరుగని గిరి అనే బ్రహ్మచారి మహాజ్ఞానియై శ్రీ గురుదేవులను స్తుతించాడు. ఆ నాటి నుండీ తోటి శిష్యగణం, పండితప్రకాండు లందరూ ఆ గిరి వటుని తోటకా చార్యులని పిలువసాగారు. మందమతియే బహు ప్రజ్ఞాశాలి అయ్యాడు. అంతా శ్రీ గురుభక్తి మహిమే.

85. శ్రీ తోటకాచార్య విరచితమైన ఆ తోటక వృత్తాలు చిన్నవే అయినా, నానా విధ వేదాంత సిద్ధాంతాలతోను, మధుర శబ్దాలతోను, విపులార్థాలతోను వేదాంతతత్త్వజ్ఞానంతో నిండినవై బహుళంగా ఆదరించబడుచున్నా ఆ తత్త్వాన్ని నేటికీ వేదాంతతత్త్వ పండితులు పఠిస్తున్నారు.

86. ఈ విధంగా గురుదేవుల కృపచేత ఆ గిరి బ్రహ్మజ్ఞాని అయ్యాడు. శ్రీ శంకరులాతనికి తోటకాచార్య నామం స్థిరం చేశారు. శిష్యులలో పద్మ పాదాచార్యుల మల్లేనే, ప్రముఖుడయ్యాడు. అంతా గురుభక్తిచేతనే సిద్ధించినది. గురుభక్తి అమోఘం.

87. శ్రీ శంకరుల ప్రధాన శిష్యులైన హస్తామలక, పద్మపాద, సురేశ్వర, తోటకాచార్యుల గూర్చి దేవతలు, పండితులు విస్తారంగా స్తుతించారు.

విష్ణు భగవానుడు నాలుగు భుజాలతో వర్ధిల్లుతున్నాడని పురాణాలన్నీ తెలుపుతున్నవి. ఆ భగవానుడు ధర్మ, అర్థ, కామ, మోక్షాలను తన భక్తులకు ప్రసాదిస్తున్నాడు. శ్రీ శంకరులకు కూడా హస్తామలకాది శిష్యులు నలుగురూ నాలుగు భుజాల వంటివారు. వేదాల మల్లే పవిత్రులై, యోగ ఫలాలనబడే, 1. సాలోక్య 2 సామీప్య 3. సారూప్య 4. సాయుజ్యాలనే నాలుగు యోగాలను హస్తగతం చేసుకొన్నారు. వీరు కర్మదక్షులు, పరమ భక్తులు, యోగులు, జ్ఞానులు.

చతుర్ముఖ బ్రహ్మదేవుని మల్లేనే వీరూ ఎంతో ప్రకాశిస్తున్నారు. ఈ నాలుగు ముఖాలూ బ్రహ్మదేవుని వదలి ఎలా ఉండవో, అట్లే ఈ నలుగురు ఆచార్యులూ శ్రీ శంకరులను విడిచి ఉండరు. అంతేగాక బ్రహ్మదేవుని ముఖాలు వేదమయాలు. కేవలం జ్ఞానామృతాన్ని ప్రవచిస్తాయి. కానీ శ్రీ శంకరుల విషయం అలా కాదు. ఈ నలుగురు శిష్యులూ వేదమయులు. కేవల చైతన్యమూర్తులై విరాజిల్లుతున్నారు. బ్రహ్మదేవుని మానస పుత్రులైన సనక, సనంద, సనత్కుమార, సనత్సుజాతులూ వేదవ్యాప్తిని చేశారు. అదేవిధంగా శ్రీ శంకరులు అనే ఈ బ్రహ్మదేవుడు కూడా హస్తామలకాది శిష్యుల ద్వారా నాలుగు విధాలైన మహా వాక్యాలను ప్రబోధిస్తూ వేదాంత బ్రహ్మవిద్యను వ్యాపింపజేశారు. బ్రహ్మదేవుడు వేదమయుడే గాని వేదాంతమయుడు కాడు.

88. శ్రీ శంకరుల నాశ్రయించి వేదాంత శ్రవణం చేస్తూ ఉండే వైరాగ్యశీలురు శాశ్వతానందం పొందుతున్నారు. స్వర్గాది సుఖాలను తుచ్ఛంగా భావిస్తున్నారు. పై ప్రథమ శిష్యులు నలుగురేకాక, శ్రీ శంకరుల నాశ్రయించిన వారందరూ కృతార్థులైనారు.

89. శ్రీ శంకరులు అద్వితీయ పరమాత్ములై అన్ని మతాల వారిని జయించి, దుర్భేద్యులైన శిష్యులతో కలసి ప్రకాశించసాగారు; మునివరులకు చక్రవర్తియై విశేషంగా క్రీడించారు.



# సర్గము - 13

## సురేశ్వరాచార్యుల పట్ల తక్కిన శిష్యుల ఈర్ష్య

1. శ్రీ శంకరులు తమ శిష్యులతో కూడి బ్రహ్మవిద్యను సర్వజనులకూ బోధిస్తూ, జైత్రయాత్ర చేస్తున్నారు. ఇలా ఉండగా, ఒకానొక రోజు, మహా పండితుడైన శ్రీ సురేశ్వరాచార్యులు శ్రీ శంకరులను సమీపించి శ్రీ శంకరుల బ్రహ్మసూత్ర భాష్యానికి ఒక వృత్తిని వ్రాసి (వ్యాఖ్యానం) శ్రీ గురుదేవుల పాదారవిందాలకు సమర్పించి ఇలా విన్నవించుకొన్నాడు:

2. "మహాత్మా! నేను తమ శిష్యపరమాణువును. సదా తమ సేవల యందే జీవితం గడుపాలనుకొంటున్నాను. ఏదైనా ఒక కార్యం నన్ను శాసిం చండి. సంశయింపవద్దు. నన్ను ధన్యునిగా చేయగోరతాను. గురుదేవులకు సేవచేస్తూ జీవితం గడపడమే పరమభాగ్యంగా తలస్తున్నాను."

3. అంతట శ్రీ శంకరులు "వత్సా! నా బ్రహ్మసూత్రభాష్యానికి వార్తిక గ్రంథం రచించు. నువ్వు ఈ కార్యం చేస్తే నేను ఎంతో సంతుష్టుడనవుతాను" అని పలికారు.

4. పూర్వాశ్రమంలో శ్రీ మండనమిశ్రులనే పేరు కలిగిన సురేశ్వరా చార్యులు వేదవేదాంగాలందు నిష్ణాతులు. సర్వశాస్త్రార్థాలు కరతలా మలకంగా ఎరిగినవారు. అయినా, వినయంతో గురుదేవులతో "మహాత్మా! తమ బ్రహ్మసూత్రభాష్యం గంభీరమై, తర్కంతో కూడి ఉండటం చేత నాకు బోధపడుతుందా అని సందేహిస్తున్నాను. అయినా తమ కృపాకటాక్షాలుండటం చేత, నా శక్తివంచనలేక ఆ వార్తిక గ్రంథాన్ని వ్రాయడానికి ప్రయత్నిస్తా" అని విన్నవించుకొన్నాడు.

5. శ్రీ సురేశ్వరాచార్యులు భాష్యానికి వార్తిక గ్రంథం వ్రాయ బూనటం శ్రీ పద్మపాదాచార్యులు ప్రభృత శిష్యగణానికి అసూయ

కలిగించినది. వారందరూ శ్రీ చిత్సుఖాచార్యుల వారిని ముందుంచుకొని శ్రీ శంకరులను సమీపించి రహస్యంగా ఇలా విన్నవించుకొన్నారు.

6. "గురువర్యా! ఈ సురేశ్వరుడు సర్వశాస్త్రార్థాలను తెలిసిన విద్వాంసుడే! కానీ, బాల్యం నుండి బ్రహ్మతత్త్వవిద్యలో శిక్షణ పొందినవాడు కాడు. జీవితంలో అధిక భాగం కర్మకాండలోనే గడపడం చేత, సన్న్యసించినా అతడికి పూర్వవాసనలు నశించి ఉండవు. కనుక గ్రంథరచన చేసేటప్పుడు పూర్తిగా వేదాంతతత్త్వాన్ని ప్రతిపాదించక, కర్మప్రతిపాదనలు చేసి తన ప్రజ్ఞాపాటవం చూపగలడు. అందువలన తమ అద్వైత తత్త్వప్రచారానికి అవరోధం కలుగవచ్చు" అని ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా శ్రీ శంకరులకు విన్నవించుకొన్నారు.

7. "గురువర్యా! ఈ సురేశ్వరుడు నిరీశ్వరవాది. సృష్టి స్థితి లయ కారకుడైన మహేశ్వరుని అంగీకరింపడు. కుటిలయుక్తులతో తన వాదనను విన్నవిస్తాడు. జన్మతః కర్మవాది అవడంచేత, కర్మలచే ఉత్తమగతులు పొందవచ్చుననీ, స్వర్గాది సౌఖ్యాలు పొందవచ్చుననీ ప్రతిపాదిస్తాడు. అంతేకాని కర్మఫలాలనిచ్చే జగదీశ్వరుని అంగీకరించడు."

8. "మహాత్మా! లోకానికి ప్రళయాన్ని అంగీకరిస్తే సృష్టి స్థితి లయకారకుడైన పరమేశ్వరుణ్ణి అంగీకరించాలి. సకలపురాణాలు ఈ విషయాన్నే ధ్రువీకరిస్తున్నవి. ఈ పురాణాలన్నీ వేదవ్యాసులే రచించారు. జైమిని మహర్షి కూడా ఆయన శిష్యుడే అవడం వలన ఆయన కూడా ప్రళయాన్ని అంగీకరిస్తున్నాడు. కానీ ఈ సురేశ్వరుడు నిరీశ్వరవాదాన్నే ప్రతిపాదించేవాడు" అని పలికారు.

9. నిజానికి జైమినిమహర్షి తమ గురుదేవులైన వ్యాసభగవానులకు వ్యతిరేకం ఏదీ పలుకలేదు. గురుదేవులు ఉపదేశించే సమయంలో శిష్యులు తమ సందేహాలను అనేక విధాలుగా వ్యక్తం చేయడం కద్దు. గురువు ఆ సందేహాలన్నింటినీ తీర్చి, తన సిద్ధాంతాన్ని ఉపదేశిస్తాడు. ఈ విధంగా శిష్యులు వేసిన ప్రశ్నలన్నింటినీ పూర్వపక్షాలనీ, ఆ ప్రశ్నలన్నింటికీ సరియైన సమాధానాలిచ్చి శిష్యుని తృప్తిపరచిన తరువాత గురువు సిద్ధాంతీకరిస్తాడు.

ఈ రకంగా పూర్వపక్ష - సిద్ధాంతాలతో కూడిన సంవాదం వలననే సత్యమైన యథార్థతత్త్వం రూపొందుతుంది. కనుక పూర్వమీమాంసాశాస్త్ర ప్రతిపాదనలన్నీ పూర్వపక్షమనీ, పూర్వపక్షానికి తగిన సమాధానాలతో సిద్ధాంతీకరించడాన్ని ఉత్తరమీమాంసాశాస్త్రమనీ చెబుతారు. ఆ విధంగా కర్మకాండచే చిత్తశుద్ధి కలిగి, మనస్సు నిశ్చలమై ముముక్షువు జ్ఞానం పొందడానికి యోగ్యుడవు తున్నాడు. అదే విధంగా, జ్ఞానకాండం చిత్తవృత్తులన్నింటినీ నాశనం చేసి మోక్షాన్ని కలిగిస్తున్నది. అంటే పూర్వమీమాంస, ఉత్తర మీమాంసలు గురుశిష్య సంవాదాలై ఉన్నవి. మొదటిది పరవిద్య కాగా రెండవది అపరవిద్య అవడం వలన అందు దోషమే లేదు.

10. "మహాత్మా! చిన్నతనం నుండీ ఈ సురేశ్వరుని మనస్సు కర్మలయందే పూర్తిగా లగ్నమై ఉండేది. తాను కర్మిష్ఠుడవడమే గాక, కర్మకాండకు ప్రచారకుడుగా ఉన్నాడు. కర్మానుష్ఠానంచే స్వర్గాది భోగాలు ప్రాప్తిస్తాయని బోధించేవాడు. కర్మమార్గమే మానవులకు పరమ ధర్మమని నమ్మినవాడు."

11. "అంతేగాక ఈ సురేశ్వరుడు తమ ఆజ్ఞానుసారం తమ బ్రహ్మ సూత్రాలకు వార్తికాలు వ్రాసిన పక్షంలో, తప్పక కర్మసిద్ధాంతాలను ప్రతిపా దించగలడు. అలాగయితే తాము తలపెట్టిన అద్వైతతత్త్వం విస్తరించదు. ఈతని వార్తికాల వలన తమ బ్రహ్మసూత్రభాష్య మూలగ్రంథం ప్రకాశించక పోవచ్చు."

12. "గురుదేవా! ఈ సురేశ్వరుడు బుద్ధిపూర్వకంగా సన్న్యసించలేదు. వాదంలో ఓడిపోయి తమ షరతులకు బద్ధుడై సన్న్యసించాడు. తమకు ఈ విషయం తెలియనిది కాదు. ఈతడు జీవితకాలమంతా కర్మపరంగానే కృషి చేసినందువలన, తమకు విశ్వాసపాత్రుడు కాడు. ఇతడితో తమ సూత్రభాష్యానికి వార్తిక గ్రంథం వ్రాయించకండి."

13-14. "గురుదేవా! వాసనలు ఎంతటి వారినైనా విడువవు గదా! బాల్యం నుండీ ఈతడు కర్మనిష్ఠాపరుడవడం వలన కర్మలను అంత తేలికగా వదలలేదు. అంతేగాక కుమారిలభట్టు మతాన్ని స్వీకరించాడు. ఆ మతస్థులు సన్న్యాసాశ్రమానికి వ్యతిరేకులు. ఒకవేళ సన్న్యసించవలసిన అగత్యం ఏర్పడితే

అది పుట్టు గుడ్డివారు, చెవిటివారు మూగ మొదలైన బలహీనులైనవారు మాత్రమే సన్న్యాసం స్వీకరింపదగినవారని పలుకుతారు. ఈ సురేశ్వరుడు ఆ భట్టమతంలో ప్రచారకుడుగా ఉండి శ్రీ కుమారిలభట్టునకు ప్రధాన శిష్యుడయ్యాడు. గురుశిష్యసంబంధం విడదీయరానిది గదా! మాకు తెలిసిన యథార్థాన్ని తమకు విన్నవించుకొన్నాం. సర్వజ్ఞులైన తాము ఏది ఉచితమని భావిస్తారో అది చేయండి."

15. "మహాత్మా! తామొకనాడు గంగాతీరాన నిలబడి ఉండగా మేమందరమూ గంగానదికి ఆవలిగట్టున ఉన్నాం. మా భక్తిని పరీక్షింప తాము త్వరగా తమ వద్దకు రమ్మని ఆజ్ఞాపించారు. తమకు జ్ఞాపకమున్నది గదా!"

16. "మేమందరమూ వేగంగా ప్రవహిస్తున్న గంగానదిని దాటి రావడం ఎలాగని ఆలోచించసాగాం. ఆ సమయంలో పద్మపాదుడు ముందు వెనుకలు ఆలోచించక, వెంటనే గంగానదిలోనికి దుమికాడు."

17. "ఆ విధంగా పరమగురుభక్తితో గంగాప్రవాహంలో దుముకగా, దయామయురాలైన ఆ గంగామాత ఆతని పాదాలకు అడుగున పద్మాల నుంచి చక్కగా వాటిపై నడచివచ్చేట్లు చేసింది."

18. "ఆ విధంగా గంగామాత ఏర్పాటు చేసిన పద్మాలపై కాలిడుతూ నడచి తమ వద్దకు వచ్చిన ఆ సనందుని తాము ఎంతో కొనియాడారు. అప్పుడే ఈ సనందునికి పద్మపాదుడని సార్థకనామ మొసగినారు."

19. "గురుదేవా! ఈ పద్మపాదుడు గంగామాతకు ప్రీతిపాత్రుడైనాడు. తమకూ అత్యంత సన్నిహితుడై ఆంతరంగిక శిష్యుడుగా మెలగుతున్నాడు. అంతేకాక తమ పరిపూర్ణ కృపాకటాక్షం చేత భేదభావం నశించినవాడై కేవలం అద్వైతతత్త్వపరిపూర్ణుడై ఉన్నాడు. నైష్ఠికబ్రహ్మచారి. తమ వద్ద చక్కగా శిక్షణ పొందినవాడు. తమ బోధలను సంపూర్ణంగా తెలిసిన సర్వజ్ఞుడు. కనుక బ్రహ్మసూత్రభాష్యానికి వార్తికాలు వ్రాయడానికి ఈతడు అర్హుడని భావిస్తున్నాం."

20. "మహాత్మా! అలా కాదనుకొంటే, ఆనందగిరి (తోటకాచార్యుడు) కూడ కడు యోగ్యుడనే భావిస్తున్నాం. ఎందుకంటే ఇతడు గురుదేవులను

నిరంతరం సేవించుకొంటూ, గొప్ప తపస్సంపన్నుడయ్యాడు. సరస్వతీదేవి కటాక్షం కూడా పొందినవాడు. అందువలన ఈ తోటకాచార్యునికి వార్తికగ్రంథం వ్రాయడానికి అనుజ్ఞ యిస్తే ఆ శారదాదేవి కూడా ఈతనికి తగిన సామర్థ్యం ఒసగగలదు."

21. "గురుసత్తమా! కేవలం కర్మనిష్ఠాతత్పరుడై, తమతో వాదనకు దిగి పరాజితుడైన ఈ సురేశ్వరాచార్యులు తమకు ఎలా విశ్వాసపాత్రుడయ్యాడో తెలియడం లేదు. తమ బ్రహ్మసూత్ర భాష్యానికి వార్తిక గ్రంథం రచించడానికి పద్మపాదుడే పరమ యోగ్యుడు. అతనిచే ఆ గ్రంథం రచింపబడితే ఈ వేదాంతతత్త్వం పరిపూర్ణంగా వృద్ధి చెందగలదు" అంటూ ఈ విధంగా శిష్యు లందరూ సురేశ్వరాచార్యులపై అసూయతో పలికారు.

(ఆ కాలంలో కూడా, అందునా శ్రీ శంకరభగవత్పాదులవారి సమక్షంలోనే, అసూయాభావం వెల్లడియైనది. అయితే అట్టి సందర్భాలలో శ్రీ శంకరులు ఎంత నిష్పక్షపాతంతో, పారదర్శకతతో వ్యవహరించారో చూడండి.)

22. తరువాత శ్రీ పద్మపాదాచార్యులు కూడా అసూయాగ్రస్తులై యిలా పలికారు. "ఆచార్యవర్యా! కేవలం అఖండ తత్త్వజ్ఞానంతో విలసిల్లే తమ సూత్రభాష్యాలకు, అరచేతిలోని ఉసిరిక పండులా చక్కగా చెప్పగల యీ హస్తామలకాచార్యులు ఎంతైనా సమర్థులు."

(శ్రీ సురేశ్వరాచార్యులు గురుకృపకు పాత్రుడై శిష్యులందరిలోనూ అగ్రగణ్యులైనారు. ఆతడు కర్మిష్ఠి అవడం చేత, గృహస్థాశ్రమం నుండి సన్న్యసించటం చేతం, నైష్ఠికబ్రహ్మచారులైన తక్కిన శిష్యులందరూ ఆయన పట్ల ఈర్ష్యాభావం వహించారు. శ్రీ పద్మపాదుడు తన శక్తిసామర్థ్యాల గూర్చి స్వయంగా తెలియబరచక, తన యోగ్యతలన్నీ హస్తామలకునకు ఆపాదించి తెలిపాడు.)

23. "గురుదేవా! హస్తామలకుడు జన్మతః పరిశుద్ధుడు. నైష్ఠికబ్రహ్మ చర్యం ఆచరించేవాడు. పుట్టినది మొదలు దృశ్యప్రపంచాన్నే ఎరుగనివాడు. వేదాంతసిద్ధాంతాలన్నీ అరచేతిలోని ఉసిరిక పండులా చక్కగా చెప్పగలిగిన

వాడు. అందువలననే తాము ఈతనికి హస్తామలకుడనే నామధేయం స్థిరం చేశారు" అని పలికాడు.

24. శిష్యబృందం శ్రీ సురేశ్వరాచార్యుల గూర్చి చేసిన విన్నపాలన్నిటినీ శ్రీ శంకరులు చిరునవ్వుతో విని శ్రీ పద్మపాదాచార్యులతో ఇలా అన్నారు: "వత్సా! నువ్వు పలికిన పలుకులన్నీ యథార్థాలే. హస్తామలకుని సామర్థ్యం నే నెరుగుదును. వేదాంతంలో అంత్యంత ప్రతిభ కలిగినవాడు. ఎల్లప్పుడూ పరమాత్మయందే మనస్సు నిలిపి అంతర్ముఖుడై ఉంటాడు. బాహ్యస్మృతియే లేనివాడై ఉంటాడు. అటువంటివాడు భాష్యానికి అర్థం వ్రాయడానికి సమర్థుడు కాడుగదా! అందువలన ఈ భాష్యార్థ రచనలో వినియోగించలేము గదా!"

25. "ఈతడు చిన్నతనం నుండీ జడునిమల్లే ఉంటూ ఎక్కడా విద్యాభ్యాసం చేయలేదు. ఉపనయన సంస్కారం పొందినా, వేదాధ్యయనం చేయలేదు. దృశ్య ప్రపంచాన్ని మరచి పరమాత్మతోనే రమించేవాడయ్యాడు."

26. "ఈ హస్తామలకుడు తోటి బాలురతో ఆటలాడలేదు. అన్న పానీయాలందు ఆసక్తి చూపేవాడు కాడు. ఒక మూగవానిలా జీవిస్తూ, నోట ఒక్క మాట అయినా పలుకలేదు. ఈతని ప్రవృత్తిని చూసి భూతగ్రస్తుడని భావించి, ఈతని తండ్రి నా వద్దకు తీసుకొని వచ్చాడు."

27. "నన్ను చూడగానే, ఎంతో వినయంతో నమస్కరించాడు. అంత వరకు ఆతడు నమస్కరించటం ఎవ్వరూ చూసిందిలేదు. అక్కడ చేరిన జనులందరూ ఆశ్చర్యపోయారు."

28. "నేను ఆ బాలకుని చూడగనే 'బాలకా! నీ వెవరవు? ఎవరి పుత్రుడవు? ఎచ్చట నుండి వచ్చితివి' మున్నగు ప్రశ్నలు వేశాను. అందుకా బాలుడు (హస్తామలకుడు) మనోహర సూక్తులతో ఆత్మతత్త్వాన్ని బోధించాడు. ఆ బాలుడు పూర్వజన్మమందే బ్రహ్మజ్ఞానం పొందిన ధర్మాత్ముడు."

29. "ఆ బాలకుడు నాతో తత్త్వబోధ చేస్తుండగా, ఆతని తండ్రి ప్రభాకరుడు ఎంతో ఆశ్చర్యంతోను, వినయంతోను నా వద్దకు వచ్చి యిలా పలికాడు."

30. **శ్రీ ప్రభాకర పండితుడు:** మహాత్మా! ఈ బాలుడు జడుడని జనులు తీర్మానించారు. నేనూ అట్లే తలచాను. కానీ నేడు తమ కృపాకటాక్షం చేత ప్రజ్ఞాశాలియై బ్రహ్మజ్ఞానియై వేదాంతవచనాలెన్నో పలికాడు. వీనికి ఇంతటి దివ్యజ్ఞానం ఎప్పుడు, ఎలా కలిగిందో ఊహింప శక్యం కాకున్నది. ఎంతో ఆశ్చర్యంగా ఉంది. దైవస్వరూపులైన తమ అనుగ్రహం చేతనే ప్రజ్ఞా శాలి అయ్యాడు. అందులో కొంచెం కూడా సందేహం లేదు. నన్ను ధన్యుణ్ణి చేశారు."

31. "పుట్టినది మొదలు దృశ్య ప్రపంచాన్ని దర్శించనివాడు, తమకు శిష్యుడవడానికి యోగ్యుడవుతాడు. ఇప్పుడే ఆ బాలుని తమ కప్పగిస్తున్నాను. అతనికి తండ్రీ గురువూ అన్నీ మీరే. నేను ఈ బాలుని మనస్ఫూర్తితోను, నిస్సంకోచంగాను తమకు సమర్పించుకొంటున్నాను. బ్రహ్మజ్ఞానంతో కూడిన ఈ బాలుడు రాజహంస వంటివాడు. ప్రపంచమేమో పల్లేరుకాయలతో నిండి ఉంది. అటువంటి రాజహంస పల్లేరుకాయలు నిండిన అడవులలో జీవించలేదు. సంసారసముద్రాన కొట్టుమిట్టాడుతున్న నా సంరక్షణలో ఈ బాలుడు వృద్ధి చెందలేడు. తమ పాదపద్మాలే ఆతనికి సరియైన ప్రదేశమని భగవన్నిర్ణయమైనది. అందువలననే ఇంతవరకు ఈ విధంగా జరిగింది."

32. "ప్రభాకరపండితుడు ఈ విధంగా పలికి బాలుణ్ణి అక్కడే వదలి తన ఇంటికి వెళ్ళిపోయాడు. అప్పటి నుండీ ఈ బాలుడు ఇక్కడే నివసిస్తున్నాడు కనుక ప్రపంచజ్ఞానంలేక జడునిలా జీవించిన ఈతడు భాష్య వార్తికగ్రంథ రచనకు అర్హుడు కాడు. అలాకాక ప్రపంచజ్ఞానమున్నవాడైతే, అనేక దృష్టాంతాలను పేర్కొంటూ, అలౌకికమైన బ్రహ్మతత్త్వాన్ని లౌకికులకు సులభంగా బోధపడేట్లు వ్రాయవచ్చు. అలా గ్రంథ రచన సాగితే బ్రహ్మతత్త్వం బాగా విస్తరిస్తుంది. అందువలన వార్తికగ్రంథ రచనకు సామర్థ్యమున్నా, జనామోదయోగ్యంగా  ఉండదు."

33. శ్రీ శంకరులు హస్తామలకుని చరిత్ర వివరించగా, శిష్యులందరూ ఆశ్చర్యపడి, "మహాత్మా! అనేక జన్మలు సాధనలు చేసినా బ్రహ్మజ్ఞానం పొందటం దుర్లభం గదా? అటువంటిది, ఈ హస్తామలకుడు వేదాధ్యయనం

చేయలేదు. గురువుల వద్ద శుశ్రూషలు సలుపలేదు. వేదాంత శ్రవణమసలే చేయలేదు. ఇతడెలా బ్రహ్మజ్ఞానతత్త్వాన్ని పొందగలిగాడు. ఎంతో ఆశ్చర్యం కలుగుతున్నది" అని శ్రీ శంకరులను ప్రశ్నించారు.

34. **శ్రీ శంకరులు ఇలా పలికారు:** శిష్యసత్తములారా! ఒకానొకప్పుడు యమునాతీరాన ఒక సిద్ధపురుషుడు నివసిస్తూండేవాడు. అతడు సంసార ప్రవృత్తులన్నిటినీ విసర్జించి పరమ వైరాగ్యంతో ఉండేవాడు. సాధుశీలుడూ, మహా తేజస్సంపన్నుడూ అయిన ఆ సిద్ధపురుషుడు ఎల్లప్పుడూ బ్రహ్మ తత్త్వంలోనే విహరించేవాడు.

35. "ఇలా ఉండగా ఒక రోజు ప్రభాకర పండితుని భార్య యమునా స్నానానికై వెళ్లింది. అక్కడ తన రెండు సంవత్సరాల బాలుని, ఆ సిద్ధపురుషుని వద్ద వదలి, ఆయనతో 'స్వామీ! నేను యమునానదిలో రెండు మునకలు వేసివస్తాను. అంతవరకు ఈ బాలుణ్ణి సంరక్షించండి' అని పలికి యమునా నదికి స్నానానికై పోయింది. ఆ సిద్ధపురుషుడు మాత్రం ఉలుకు, పలుకులేక ఊరకే ఉండిపోయాడు."

36. "ఇంతలో ఆ బాలుని తల్లి స్నానమాచరించి వచ్చేలోగా ఆ బాలుడు దొర్లి నదిలోపడి మరణించాడు. ఆ మృత బాలుని ఎత్తుకొని ఆ బాలుని తల్లీ, తోటి మహిళలూ ఆ మహర్షి వద్దకు వచ్చి గుండెలు బాదుకొంటూ ఏడ్వసాగారు."

37. "ఈ విధంగా తన సమీపంలో రోదిస్తున్న స్త్రీలను, మృతబాలుని చూసిన ఆ మహర్షి యోగదృష్టి వలన విషయమంతా గ్రహించాడు. ఆ శిశువు తల్లికి ఎలాగయినా ఊరట కలిగింపదలచాడు. అదీగాక, తాను మరల ఒకసారి శైశవాస్థ పొందాలని ఆసక్తి గలవాడై ఆ బాలుని దేహంలో ప్రవేశించాడు. ఆ సిద్ధపురుషుడే యీ హస్తామలకుడు. ఆ కారణంగానే నిరుపమబ్రహ్మతత్త్వంతో వెలయుచున్నాడు."

38. "ఈతడు సిద్ధపురుషుడవటం వలన గురువు నుండి ఉపదేశం పొందకుండానే, వేదాలను, స్మృతులను, సర్వశాస్త్రాలను సమగ్రంగా తెలిసి

ఉన్నాడు. అందువలననే ఏ విషయమైనా, అరచేతిలో ఉన్నట్లు వివరంగా చెప్పగలడు. విజ్ఞాని అవడం వలన ఈతనికి తెలియని విషయాలు ఉండవు."

39. "ఈతడు సిద్ధపురుషుడవడం చేత దృశ్యప్రవృత్తి లేనివాడై, బుద్ధి తత్త్వం నశించినవాడవడం చేత, ఎంతో సూక్ష్మబుద్ధితో రచించవలసిన వార్తికగ్రంథానికి అర్హుడు కాడు. ఇక సురేశ్వరుని విషయమలాకాదు. అతడు బ్రహ్మతత్త్వాన్ని బాగా ఎరిగినవాడవడమే గాక, సరస్వతీదేవి చేత కూడా స్తుతింపబడినవాడవటంతో ఈ మండనపండితుడు అన్ని విధాలుగా అర్హుడై ఉన్నాడు."

40. "ఈ మండనమిశ్రుడు వేదవేదాంగవేదాంతాదిపరాపర విద్య లన్నింటినీ చక్కగా మథించి, ఆపోసన పట్టినవాడు. అనేక విధాలుగా పరిశ్ర మించినవాడవడంచే వాదంలో ఈతణ్ణి జయించి శిష్యునిగా చేసుకొన్నాను. ఇదంతా ఆ మహేశ్వరుని కృపాకటాక్షమే. అందువలన వార్తిక గ్రంథ రచనకు ఇతడు సమర్థుడు కాకపోతే, లోకంలో మరొకరిని చూడలేం.

41. "శిష్యసత్తములారా! సురేశ్వరుడు ఈ వార్తిక గ్రంథం వ్రాయటం మీ కెవరికీ ఇష్టం లేదని తెలుస్తున్నది. పోనివ్వండి. భాష్యవార్తికాలవంటి గ్రంథరచన విషయంలో తొందరపడి ఎలాటి నిర్ణయమూ తీసుకోవద్దు. బాగా విచారించిన తరువాతే ఒక నిర్ణయానికి వద్దాం. బహుజనులకు ఇష్టం లేని కార్యాన్ని సురేశ్వరుని చేత చేయించను. అంతేగాక లోకోద్ధరణ సత్కార్యాలకు బహుజనుల వ్యతిరేకత ఉంటే సంశయాలు అధికం కాగలవు. అందువలన నిదానంగా విచారించే ఈ గ్రంథ రచనను చేపడదాంగాక!"

42. శిష్యులందరకూ తాము నైష్ఠికబ్రహ్మచర్యం నుండి సన్న్యసించామన్న దర్పముండటం చేత శ్రీ శంకరుల వచనాలు వారిని తృప్తిపరచలేకపోయాయి. "గురుసత్తమా! తాము ఇంతగా ఆలోచించవలసిన పనిలేదు. తమరు అనుమ తిస్తే సర్వజ్ఞుడైన సనందనులీ రచనను అవలీలగా చేయగలరు. ఈ మహ నీయుడు నైష్ఠిక బ్రహ్మచర్యం నుండే సన్న్యసించినవాడు. సర్వవేదాంతాలనూ స్పష్టంగాను, నిస్సందేహంగానూ ఎరిగినవాడు. అందుచేత యీ పవిత్ర వార్తికగ్రంథ రచనకు ఎంతో సమర్థుడు" అని పలికారు.

43. అంతట శ్రీ శంకరులు సనందనుని నిరాశపడవలదని సెల విచ్చారు. భాష్యార్థాన్ని వివరిస్తూ ఒక వృత్తి గ్రంథాన్ని రచించడానికి అనుజ్ఞ ఒసగారు. క్రొత్తగా సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన సురేశ్వరాచార్యులను వార్తిక గ్రంథరచనను ప్రారంభించవలదన్నారు. ఇతరుల అంగీకారం కాని కార్యాన్ని తలపెట్టితే కువిమర్శలు రాగలవని శ్రీ శంకరులు ప్రసన్నభావంతో తెలిపారు.

44. **శ్రీ శంకరులు:** (సురేశ్వరాచార్యులతో) "పరమహంసశ్రేష్ఠా! నీ తోటి శిష్యులందరూ అసూయతో కూడినవారై, వార్తిక గ్రంథాన్ని నీచే వ్రాయించవలదని చెబుతున్నారు. కనుక ప్రస్తుతానికి ఆ భాష్యవార్తిక గ్రంథ రచన చేయకు."

45. "సురేశ్వరాచార్యా! నువ్వు గృహస్థాశ్రమం నుండి సన్న్యసించటం చేత యింకా నీలో గృహస్థ సంస్కారాలు పూర్తిగా నశించి ఉండవని తోటి శిష్యులు శంకిస్తున్నారు. అంతేగాక సురేశ్వరుడు సర్వశాస్త్రాలందూ పాండిత్య ప్రతిభ గలవాడవటంచేత తన సొంత సిద్ధాంతాలను (కర్మసిద్ధాంతాలను) కూడా చొప్పించి గ్రంథం రచించగలడని నాతో పలికారు. ఎంతమంది ఎన్ని విధాలుగా చెప్పినా, యథార్థ భావమదే."

46-47. "సురేశ్వరాచార్యా! నువ్వు గృహస్థాశ్రమంలో ఉండగా సన్న్యాసాశ్రమాన్ని నిరసించేవాడవనీ, వేదాలందు సన్న్యాసాశ్రమం ప్రతిపాదింపబడలేదని వాదిస్తూండేవాడవనీ తోటి శిష్యజనులందరూ అపోహ పడుతున్నారు. అంతేగాక నువ్వు సన్న్యాసులకు భిక్ష కూడా వేయక నౌకరులచేత ఇంటి తలుపులు మూసి ఉంచేవాడవని లోకంలో ప్రచారమై ఉంది. అందువలన నీవీ గ్రంథరచన చేయడం విషయమై తోటి శిష్యులు నిన్ను విశ్వసించటం లేదు. అందువలన వేదాంత ప్రతిపాదకమైన స్వతంత్ర గ్రంథమొకటి రచించి, నాకు చూపు. దాని వలన నీపై ఉన్న అపోహలన్నీ సమసిపోగలవు."

48. "మహాత్మా! విద్వద్వరేణ్యా! నీవు కర్మప్రతిపాదకం కాని నిజ వేదాంతతత్త్వాన్ని ప్రబోధించే గ్రంథమొకటి వ్రాసిన పక్షంలో అన్ని అపోహలు

తొలగిపోతాయి. వీరి ప్రలాపాలన్నీ వాటంతట అవే అణగిపోగలవు" అని పలికారు.

49. శిష్యుల అసూయ వలన భాష్యగ్రంథానికి వార్తికాలు వ్రాసే పని ఆగిపోయినందుకు శ్రీ శంకరులు ఎంతో చింతించారు. శ్రీ సురేశ్వరాచార్యులు, గురుదేవుల ఆజ్ఞను శిరసావహించారు.

50. శ్రీ శంకరుల ఆశీర్వాద బలంచేత శ్రీ సురేశ్వరాచార్యులు 'నైష్కర్మ్య సిద్ధి' అనే గ్రంథాన్ని అతి కొద్ది కాలంలో రచించి గురుదేవులకు సమర్పించాడు. అందలి విషయాలన్నీ పూర్తిగా మోక్ష ప్రతిపాదకాలై, కర్మసిద్ధాంతాన్ని లేశమాత్రమైనా ప్రతిపాదించక, బ్రహ్మతత్త్వాన్నే ప్రధాన విషయంగా చేసికొని రచన చేశాడు. ఆ గ్రంథరాజం దోషాలు లేనిదై, కవి పండితులందరి ఆమోదాన్ని పొందినదై, మృదుమధుర సూక్తులతో విరాజిల్లింది. కేవలం నిర్విషయ, నిష్కర్మ, నిర్గుణ బ్రహ్మతత్త్వ బోధితమైన ఆ గ్రంథాన్ని శ్రీ శంకరులు మొదటి నుండి చివరి వరకు నిశితంగా పరీక్షించారు. శ్రీ సురేశ్వరాచార్యుల భక్తిభావంచేత, విజ్ఞానామృతసూక్తిధారలచేత శ్రీ శంకరులు అమితానందాన్ని పొందారు.

51. శ్రీ శంకరులు సురేశ్వరుని ప్రజ్ఞాశక్తిని బహువిధాలుగా కొనియాడారు. ఎంతో హర్షాతిరేకంతో శ్రీ శంకరులా నిష్కర్మ ప్రతిపాదకమైన గ్రంథాన్ని శిష్యులందరకు ప్రదర్శించారు. ఆ గ్రంథాన్ని ఆసాంతం పఠించిన శిష్యులందరూ తమ తప్పిదాన్ని తెలుసుకొన్నారు. శ్రీ సురేశ్వరుడు కర్మిష్ఠి కాడని గ్రహించారు. వేదాంత శిరోమణి అని తెలుసుకొన్నారు. తరువాత అతనిపై అచంచలవిశ్వాసాన్ని ప్రకటించారు. సురేశ్వరునికి సమానుడెవ్వరూ లేరని ప్రశంసించారు.

52. ఆ సురేశ్వరుని నైష్కర్మ్య సిద్ధిలో సంపూర్ణంగా పరమహంసల కొరకై కర్మరహితమైన పరబ్రహ్మ తత్త్వం ప్రతిపాదించబడింది. సన్న్యాసులా గ్రంథాన్ని చదివి ఇప్పటికీ కర్మరహితమైన బ్రహ్మతత్త్వంచే మోక్షాన్ని పొందుతున్నారు. అందుచే ఆ గ్రంథరాజానికి "నైష్కర్మ్య సిద్ధి" అన్న పేరు సార్థకమయింది.

53. శ్రీ సురేశ్వరాచార్యులు తోటి శిష్యులు తనపట్ల ప్రదర్శించిన అసూయా భావానికి కుపితులైనారు. 'ఇకపై ఎవరు వార్తిక గ్రంథం రచించినా అది ఆదరింపబడక నశించుగాక' అని శపించారు. అందువలన ఈనాటికీ భాష్యానికి వార్తికగ్రంథం లేకపోయింది.

54. శ్రీ సురేశ్వరుడు తన నైష్కర్మ్య సిద్ధి అనే గ్రంథాన్ని గురుదేవులు శ్రీ శంకరులకు సమర్పించి ఇలా విన్నవించుకొన్నారు:

55. "గురుదేవా! వేదాంత గ్రంథ మొకటి వ్రాయమని నన్ను ఆదేశించారు. తమ శాసనానుసారంగా ఒక గ్రంథం రచించి తమ అనుగ్రహాన్ని పొందదలచాను. నేను పేరు ప్రతిష్ఠలు కోరి ఈ గ్రంథాన్ని వ్రాయలేదు. ధన సంపాదనకంతకంటే కాదు. భవిష్యత్తులో నా శిష్యులనుండి ప్రశంసలందు కోవడానికీ కాదు. కేవలం గురుకటాక్షాన్ని మాత్రమే కోరి రచించాను."

56. "గురుదేవా! నేను పూర్వాశ్రమంలో గృహస్థుడనై ఉండటం వలన నా సన్న్యాస ధర్మతత్త్వాన్ని జనులు శంకిస్తున్నారని సెలవిచ్చినారు.

మహాత్మా! గృహస్థుడైనా, శాస్త్రవిధిన సన్న్యసించినవానికి గృహధర్మాలన్నీ మరుగున పడిపోతాయి. బాల్యలక్షణాలు యౌవనవంతుడైన తరువాత అతడిలో కనిపించవు. అప్పటి శిశులక్షణాలు కనిపించవు. జీవనంలో బాల్య యౌవనాలు పరస్పరం సంబంధం లేనివై ఉంటాయి. అలాగే గృహస్థాశ్రమాన్ని త్యజించి సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన తరువాత, గృహస్థధర్మాలందూ, ఇల్లు వాకిళ్ళు, భార్యా పిల్లల యందూ నిరాసక్తుడవుతాడు. గృహస్థాశ్రమం పోయి సన్న్యాసాశ్రమం సంభవిస్తున్నది. కనుక ఈ రెండూ పరస్పర విరుద్ధ ధర్మాలలో వెలయుచుంటాయి. అదే విధంగా యౌవనవంతుడు వృద్ధుడవుతున్నాడు. అప్పుడా యౌవన కాలపు వ్యవహారాలు వృద్ధునకు సంక్రమింపవు. కాబట్టి నా యందు గృహస్థ ధర్మాలు నశించి, పరమహంస ధర్మాలనే నేను కలిగి ఉన్నాను."

57. "మహాత్మా! తమకు తెలియని విషయాలేవీ జగత్తునందు లేవు. అయినా చెబుతాను. వినండి. గృహస్థాశ్రమంలో ఉన్నంత మాత్రాన గృహియనీ, సన్న్యాసం స్వీకరించినంత మాత్రాన పరమహంస అనీ తలచరాదు.

మనస్సులో మెదలే శుద్ధాశుద్ధ భావాల వలనే బంధ మోక్షాలు కలుగు తున్నాయి. కనుక మనస్సే ప్రధానం గాని, ఆశ్రమం కాదు. 'బంధమోక్షాలకు మనస్సే కారణమవుతున్నది' అని ఉపనిషత్తులు పలుకుతున్నవి. పాశాలచే బంధితుడవుతున్నాడు, మరల ఆ పాశాల నుండి విముక్తు డవుతున్నాడు. ఆ బంధ విముక్తులకు పాశం కారణం కాగా, ఆ పాశానికి మనస్సు కారణమవుతున్నది. ఈ విధమైన విచారణ చేత మనోమాలిన్యాలు నశించి పరిశుద్ధాత్మ స్వరూపుడై గృహస్థుడైనా, లేక పరమహంసయైనా బంధ విముక్తుడవుతున్నాడు. అతడే నిజమైన సన్న్యాసి అని ఉపనిషత్తు తెలుపుతున్నది. కనుక బంధమోక్షాల ననుసరించే గృహస్థా? లేక పరమహంసయా? అని తుల్యులగుతున్నారు."

58. "గురుదేవా! 'ఈ మండనమిశ్రుడు వేదంలో సన్న్యాసాశ్రమమే లేదని వాదించేవాడు' అని పలికారు!

పరమహంససత్తమా! తురీయాశ్రమమే లేదని వాదించేవాడనయితే ప్రవృత్తి, నివృత్తి మార్గీయులమైన మనమిద్దరమూ ప్రతిజ్ఞబూని వాదించేవారం కాదు గదా? నేను దృఢమైన ప్రతిజ్ఞ జేసి, శిష్యుడనై, మీ శిష్యగణంతో చేరి ఉండను గదా? కనుక ఈ వాదంలో బలం లేదు. తాము యథార్థమని తలచకండి. వారు అవివేకులు తప్ప వేరు కాదు."

59. "ద్వారపాలకులను నియమించి, భిక్షువులను (యతీశ్వరులను) వెడలగొట్టేవాడనని మరొక అభియోగం మోపారు.

గురుదేవా! అది యథార్థం కాదు. యతీశ్వరులైన తాము మా ఇంటి లోనికి వచ్చి అన్ని దినాలు మా ఇంట భిక్ష స్వీకరించారు. ఇందులకు తమరే సాక్షులు గదా! లోకంలో అపవాదులను వ్యాప్తి చేయడానికి హద్దులులేవు గదా? ఇట్టి అసూయావాక్యాలన్నీ వారి అపరిపక్వ మనస్సునే బయటపెట్టు చున్నది."

60. " 'నేను వాదంలో పరాజితుడనై, ప్రతిజ్ఞాపాలనకై తప్పని సరిగా సన్న్యసించానేగాని, స్వబుద్ధితో సన్న్యసించలేదని మరొక అపవాదు ఉంది.

మహాత్మా! వాదప్రతివాదా లెప్పుడూ యథార్థ తత్త్వ నిర్ణయానికే గాని, అందు జయాపజయాల ప్రసక్తి ఉండదు. మున్ముందుగా నేను కర్మానుష్ఠాన గరిష్ఠుడనై పరిశుద్ధాత్ముడనయినాను. తరువాత తమ తత్త్వోపదేశం చేత ఆత్మతత్త్వాన్ని తెలుసుకొన్నాను. వైరాగ్యం చెంది సన్న్యసించాను. ఇదే సత్యం."

61. "నేను గృహస్థుడుగా ఉన్నప్పుడు అర్థవంతమూ విజ్ఞానాత్మకమూ అయిన గ్రంథాలనేకం రచించి న్యాయశాస్త్ర మతస్థుల నెదుర్కొన్నాను. ఆ గ్రంథాలలో నా సొంత సిద్ధాంతాలన్నింటినీ చేర్చాను. ఇకపై గ్రంథరచనపై నా మనస్సు ఇష్టపడటం లేదు. తమ పాదసేవనే సదా కోరుకొంటున్నది. తమ పాదసేవయే మాకు శరణ్యం."

62. "గురువరేణ్యా! ఎవడు తమ పాదపద్మాల నాశ్రయించి తమలోని అసూయా, అహంకారాలను నాశనం చేయగలడో, అట్టి ముముక్షువు తప్పక ముక్తిపదాన్ని పొందుతున్నాడు. కనుక మహనీయులైన తమ దివ్యపాదార విందాలను సామాన్యులు ఆశ్రయింపలేరు. మహా యుద్ధాన్ని సామాన్య సైనికుడు జయింపగలడా? అదేవిధంగా శ్రీ గురుపద సేవ కూడా అందరూ ఆచరింపజాలరు."

63. ఈ విధంగా శ్రీ సురేశ్వరాచార్యులు తనపై పద్మపాదాది శిష్యులు మోపిన ఆరోపణలకు తన ఆవేదనను సముచిత రీతిన శ్రీ శంకరులకు విన్నవించుకొన్నారు. శ్రీ శంకరులు కూడా శ్రీ శావీరక సూత్ర భాష్యానికి వార్తికగ్రంథరచన నిలచిపోవటం చేత ఎంతో వ్యథ చెందారు.

64. శ్రీ సురేశ్వరాచార్యులు 'నైష్కర్మ్య సిద్ధి' అనే వేదాంత గ్రంథాన్ని రచించారు. ఆ గ్రంథంలో చేసిన పదప్రయోగాలూ, శబ్దానుగుణార్థ ప్రతిపాద నలూ, పూర్వపక్షాన్ని ఖండించిన తీరు, వేదాంత సిద్ధాంతాలను సమర్థించే సన్నివేశాలతో ఎంతో మనోహరంగా చిత్రించబడెను. శ్రీ శంకరులా గ్రంథాన్ని ఆసాంతం తిలకించారు. "ఈ గ్రంథ రచన వేరెవరూ చేయజాలరు" అని పలుకుతూ ఈ గ్రంథం మహోత్కృష్టమైనదని, శ్రీ సురేశ్వరాచార్యుల ప్రతిభా పాటవాలకు శ్రీ శంకరులు అత్యంత సంతోషభరితులయ్యారు.

65. **శ్రీ శంకరులు:** "వినయశీలుడవైన ఓ శిష్యవరేణ్యా! సత్యాన్ని పలికావు. వేదాంతత్త్వాన్ని చక్కగా గ్రహించావు. యజుర్వేదానికి సంబంధించిన భాష్యమొకటి ఉంది. ఆ భాష్యానికి వార్తికాలను వ్రాయి. అందువలన మహాత్ములందరి కృపాకటాక్షాలను పొందగలవు. నీ కీర్తి లోక ప్రసిద్ధమవు తుంది."

66. "సురేశ్వరా! కాణ్వశాఖకు చెందిన ఉపనిషద్భాష్యం ఒకటి ఉంది. ఆ భాష్యానికి కూడా నువ్వు వార్తికం వ్రాయి. నీవీ రచనలు చేయటం నా కెంతో ఆనందదాయకం. పరోపకారానికై సత్పురుషుల ప్రవృత్తి కలుగు తున్నది. ఆ రెంటికీ వార్తికాలు వ్రాయి."

67. "ఈ వార్తికాలు నువ్వు తప్పక రచించు. పూర్వం మల్లే అసూయా గ్రస్తుల నుండి ఏ విధమైన ఆటంకాలూ కలుగబోవు. ముముక్షు జనులకు నువ్వు వ్రాసే వార్తికాలు కార్తీకమాసపూర్ణచంద్రునిలా సర్వతాపాలను హరిస్తాయి. నువ్వు ఇతరుల అసూయాపరమైన వాక్యాలకు కలత చెందకు. గురువుగా నిన్ను ఆదేశిస్తున్నాను. గురునాజ్ఞను నెరవేర్చు."

68. గురుదేవులు శ్రీ శంకరుల ఆజ్ఞానుసారంగా శ్రీ సురేశ్వరాచార్యులు ఆ రెండు భాష్యాలకు వార్తిక గ్రంథాలు రచించి శ్రీ శంకరులకు సమర్పించారు.

69. శ్రీ సురేశ్వరుడు తైత్తిరీయ, బృహదారణ్యకోపనిషత్తులకు లలిత గంభీరార్థాలతో రెండు వార్తిక గ్రంథాలను రచించాడు. శ్రీ గురుదేవులైన శ్రీ శంకరుల పాదపద్మములందు సమర్పించాడు.

70. శ్రీ పద్మపాదాచార్యులు కూడా (సనందుడు) గురువర్యుల ఆజ్ఞ ననుసరించి సూత్ర భాష్యానికి టీకను రచించారు. ఈ గ్రంథం పూర్వభాగం 'పంచపాదిక' తక్కిన భాగం 'వృత్తి'గా ప్రసిద్ధి పొందినవి. ఈ గ్రంథాలు (రెండూ) బ్రహ్మసూత్రార్థాలను విపులంగాను, నిస్సందేహంగాను వివరించినవి. వృత్తిగ్రంథంకన్నా, భాష్యగ్రంథంకన్నా, వార్తికగ్రంథ రచన ఉత్తమోత్తమమైనది. ఎందుకంటే భాష్య గ్రంథంలో ప్రతిపాదించే విషయాలు కూడా వార్తిక గ్రంథంలో ప్రతిపాదించే స్వతంత్రతను ఆ రచయిత కలిగి ఉంటాడు. అందు

వలన ఈ కార్యానికై బహుముఖ ప్రజ్ఞాశాలియైన సురేశ్వరాచార్యులనే గ్రంథరచనకు నియోగించారు.

71. బ్రహ్మ సూత్ర భాష్యం సులభంగా అర్థమవడానికీ, ఆత్మ కీర్తికి విజయడిండిమమైన టీకా గ్రంథం శ్రీ పద్మపాదాచార్యులు అతి మనోహరంగా రచించారు. ఈ గ్రంథాన్ని శ్రీ పద్మపాదుడు శ్రీ శంకరులకు గురుదక్షిణగా సమర్పించాడు.

72. **శ్రీ శంకరులు:** (శ్రీ సురేశ్వరాచార్యులతో) "వత్సా! పద్మపాదుడు వ్రాసిన బ్రహ్మసూత్రటీకలోని అయిదు పాదాలు లోకంలో ప్రసిద్ధి గాంచుతవి. మరల ఆ అయిదింటిలో సూత్ర చతుష్టయం ఎంతో ప్రఖ్యాతి చెంది చిరస్థాయిగా నిలచి ఉంటుంది. మిగిలిన భాగాన్ని జనులు ఆదరించరు. కాలక్రమంలో క్షీణించిపోతుంది."

73. "మహాత్మా! తమకు ప్రారబ్ధకర్మశేషమున్నది. అందువలన తిరిగి భూలోకంలో జన్మిస్తావు. ఆ జన్మయందు వాచస్పతి అనే పేరుతో ప్రసిద్ధి చెందుతావు. బ్రహ్మజ్ఞానివై ఇతరులకు సాధ్యం కాని బ్రహ్మసూత్ర భాష్యటీకను చాలా నిర్దుష్టంగాను, ప్రతిభాశక్తితోను వ్రాయగలవు. ఆ గ్రంథం 'భామతీ వ్యాఖ్యాన' మనే పేరుతో విలసిల్లి గురుశిష్య సంప్రదాయానికి ప్రమాణగ్రంథమై ఆచంద్రార్కం ప్రకాశించగలదు."

74. తరువాత శ్రీ శంకరులు హస్తామలకాచార్యులను (ఆనంద గిరి) పిలిచి అద్వైతతత్త్వ గ్రంథాలనేకం రచించమని ఆదేశించారు.

75. శ్రీ శంకరగురుదేవుల శాసనాలను శిరసావహించి శ్రీ తోటకాచార్య, హస్తామలకాచార్యులు బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించే అనేక వేదాంత గ్రంథాలను రచించారు. లోకంలో బ్రహ్మతత్త్వాన్ని విస్తరింపజేశారు; వేదాంత ప్రచారకులయ్యారు; ఆత్మతత్త్వం విస్తారంగా ప్రకాశించింది.



# సర్గము - 14

## పద్మపాదాచార్యుల తీర్థయాత్రా విజయాలు

1. పూర్వసర్గలో శ్రీ సురేశ్వరాది శిష్యులను వేదాంతతత్త్వ గ్రంథాలు వ్రాయమని శంకరులు ఆదేశించారు. శ్రీ పద్మపాదాచార్యులు తీర్థయాత్రలు చేయదలచి గురుదేవులను అర్థిస్తున్నారు.

**శ్రీ పద్మపాదాచార్యులు:** "మహాత్మా! సద్గురుదేవా! నా మనస్సు తీర్థయాత్రలు చేయాలని ఆరాటపడుతున్నది. ఎందుకంటే కొత్తకొత్త ప్రదేశాలను చూడవచ్చు. వివిధ క్షేత్రపాలకులైన దేవతామూర్తులను దర్శించవచ్చు. మార్గమధ్యంలో ఎందరో మహాత్ములు కూడా తటస్థపడతారు. కనుక గురుదేవులు పరమదయతో నాకు అనుజ్ఞ యిస్తారుగాక" అని ప్రార్థించారు.

2. **శ్రీ శంకరులు:** (పద్మపాదునితో) "వత్సా! తీర్థయాత్రలు చేయాలన్న నీ సంకల్పం శ్రేయోదాయకమూ, జ్ఞానప్రదమూ కూడా. కానీ గురుదేవుల పాదపద్మాలను సందర్శించడమూ తీర్థయాత్రలతో సమమే అవుతున్నది. గురూపదేశం చేత ఆత్మదర్శనం సర్వదేవతా దర్శనానికి సమానమవుతున్నది."

3. శిష్యుడు ఎల్లవేళలందూ గురుపాదసేవ చేస్తూ గురుసన్నిధానంలోనే నివసించాలి. అదే శిష్యులకు జ్ఞానప్రదం, మోక్షదాయకం అవుతుంది. అంతేగాని, తీర్థయాత్రలు చేయాలంటే, మార్గంలో ఎన్నో కష్టాల నెదుర్కొనవలసి ఉంటుంది. దానివలన దేహం నిద్రను కోరుతుంది. అలా నిద్రించడం వలన ధ్యానం చేసే కాలం నష్టమవుతుంది. సన్న్యాసులకు ధ్యానమే పరమ లక్ష్యం కదా? ఫలితంగా ఆత్మచింతన చేయలేకపోతాడు. కనుక సన్న్యాస ధర్మానికి విఘాతం కలుగుతున్నది.

4. సన్న్యాసంలో రెండు తరగతులు ఉన్నవి. విద్వత్సన్న్యాసం, వివిదిషాసన్న్యాసం. బ్రహ్మతత్త్వాన్ని తెలిసినవారు విద్వత్సన్న్యాసులు. జీవ బ్రహ్మైక్య తత్త్వాన్ని తెలుసుకోగోరే ముముక్షువులు వివిదిషాసన్న్యాసులు.

ఓ మహామతీ! నువ్వు లక్ష్యసాధనకై కూటస్థబ్రహ్మంలో ధ్యానం ఏకాగ్రంచేసి నిర్వికల్పసమాధిని సాధించాలి. తీర్థయాత్రలు చేస్తే సమాధి నిష్ఠకు అంతరాయాలేర్పడతాయి. కనుక తీర్థయాత్రలు చేయవద్దు.

5. తీర్థయాత్రలు అనేక కష్టాలతో కూడుకొన్నవి. ఒక్కొక్క చోట త్రాగడానికి నీరు కూడ దొరకదు. అటువంటి సమయంలో దప్పికతో కలిగే బాధ వర్ణనాతీతం. మరొకప్పుడు నిద్రించడానికి కొంచమైనా స్థలం చిక్కదు. నిద్రలేకుండానే ప్రయాణం కొనసాగించవలసి వస్తుంది. ఈ విధంగా తినేందుకు తిండి దొరకక, త్రాగేందుకు నీరు దొరకక, నిద్రించే స్థలం దొరకక ఎంతో కష్టపడవలసి ఉంటుంది.

6. అన్నపానీయాలు, శీతోష్ణాలు ఒక్కొక్క రోజు ఒక్కొక్క విధంగా ఉంటాయి. ఈ మార్పుల వల్ల శరీరం తట్టుకోలేక జ్వరం రావచ్చు. లేదా అతిసారంతో బాధపడవచ్చు. ఇవన్నీ మన వశంలో ఉండేవి కావు. కాబట్టి ప్రయాణం కొనసాగించాలంటే ఒంట్లో శక్తి ఉండదు. తోటి ప్రయాణీకులు నీ కోసం వేచివుండరు కదా! వారి దారిన వారు పోతారు.

7. ప్రయాణంలో మనం ఎక్కడ ఉంటామో మనకే తెలియదు. అందువల్ల ఉదయానే స్నానం చేయటం కుదరదు. అట్లాగే నిత్యకర్మలు, అనుష్ఠానాలు సాధ్యం కాదు. భోజనం దొరకదు, మిత్రులుండరు. ఆకలి బాధల కోర్చుకొనలేని శరీరం కూడా సహకరించదు. అందుమూలంగా సమాధి నష్టం కూడా వాటిల్లగలదు" అని తీర్థ యాత్ర లందలి కష్టనష్టాలను పద్మపాదునకు తెలియజెప్పారు.

8. **పద్మపాదుడు ఇలా పలికాడు:** మహాత్మా! గురువచనాన్ని శాసనంగా స్వీకరించాలి. తమ వాక్కును శిరసావహిస్తాను. గురుసన్నిధానానికి మించిన పుణ్యక్షేత్రం ఎక్కడ వెదకినా కనిపించదు. కానీ, పుణ్యక్షేత్రాలలో వివిధ ప్రాంతాల నుండి మహాత్ములు అనేక మంది వస్తుంటారు. వారి దర్శనభాగ్యం లభిస్తుంది. అటువంటి మహాత్ముల దర్శనం చేయాలని మనస్సు తహతహలాడు తున్నది.

9. గురుదేవా! యాత్రలందు కొన్నిచోట్ల జలం లభించదు. కొన్నిచోట్ల మార్గముండదు. ఎత్తుపల్లాలతో కూడిన కొండ ప్రాంతాల నుండి పోవలసి వస్తుంది. ఇంకా మన ఊహకందని అనేక కష్టనష్టాలు సంభవించవచ్చు. మహాత్మా! ఎక్కడైనా కష్టపడకుండా పుణ్యాన్ని సంపాదించలేం గదా! కాబట్టి ఆ కష్టాలన్నింటినీ సహించాలి.

10. మహాత్మా! ఇక వ్యాధి విషయాన్ని గూర్చి విచారించితే, పూర్వ జన్మలందలి కర్మబంధరూపాన కష్టసుఖాలమల్లే వ్యాధి కూడా సంభవిస్తుంది. కాబట్టి మనం ఏ దేశంలో ఉన్నా, జన్మాంతర పాపఫలాల వలన వచ్చే వ్యాధులు మనలను వెంబడిస్తూనే ఉంటాయి. కాబట్టి కర్మఫలాన్ని ఏ చోట ఉన్నా అనుభవించక తప్పదు గదా!

11. గురుదేవా! కాలం తీరితే మరణం తప్పదు గదా! మనం మన గ్రామంలో ఉన్నామా, పరాయి దేశంలో ఉన్నామా అని ఆలోచించదు. తప్పక దాని పని అది చేసుకుపోతుంది. ఏ ప్రాణి అయినా కర్మబంధం తీరగానే మరణిస్తున్నది. ఆ మరణానికి మాత్రం ఏదో ఒక కారణం చెబుతూ ఉంటారు. కాబట్టి ఎక్కడున్నా మరణం నుండి తప్పించుకోలేము. ఇది సాధారణంగా అందరికీ తెలిసిన విషయమే.

12. తీర్థయాత్రలు చేసే సమయంలో ధర్మానుష్ఠానాలు యథావిధిగా నిర్వర్తించలేం. అందువల్ల దోషం లేదని పరాశరాది స్మృతులు తెలుపుచున్నవి. దేశకాలాల ననుసరించి, ధర్మానుష్ఠానాలను సంగ్రహంగా ఆచరించవచ్చునని పరాశరాదిస్మృతులలో స్పష్టపరచారు. అందువలన శౌచాది క్రియలు చేయ జాలకపోయినా పాపం రాదని స్మృతి ప్రమాణాలు ఉన్నవి.

13. గురుదేవుని, భగవంతుని అనుగ్రహమున్నవాడు అరణ్యంలో ఉన్నా కూడా అన్నాదులు పరిపూర్ణంగా లభిస్తాయి. అట్లాగే ఆ దైవమే ప్రతికూలంగా ఉంటే, వడ్డించిన భోజనం కూడా అపహరించబడి తినలేక పోతున్నాడు. నా పట్ల గురుకృప సంపూర్ణంగా ఉండడం చేత ఎట్టి కొరతా రాదు.

14. దైవానుగ్రహం కలవాడు పుణ్యతీర్థాలన్నింటినీ దర్శించి మహాత్ములను దేవతలను సేవిస్తూ పవిత్రుడై ఇంటికి చేరుతున్నాడు. తీర్థయాత్రలందు దర్శించిన దైవబలంచేత, మహాత్ముల సందర్శన భాగ్యం చేత, మరణం పాలిటపడక ధన్యాత్ముడవుతున్నాడు. అలాగాక తీర్థయాత్రలు చేయక ఇంటి పట్టునే ఉన్నవాడు అకాలమరణం చెందుచున్నాడు. అన్నింటికీ దైవమే కారణం.

15. అఖండ బ్రహ్మాన్ని అనుభవించే మహాత్ములు నిశ్చలమనస్సు గలవారవటం చేత, సొంత ఇంట్లో ఉన్నా, యాత్ర లందున్నా, దేశకాల భేదం లేక సమాధి లాభం కలుగుతున్నది. సమాధి దుర్లభం కాదు.

16. దేశాటనం వలన ఆయా దేశ ఆచార వ్యవహారాలు తెలుస్తాయి. అంతఃకరణం సందేహించక కొత్తకొత్త విషయాలను తెలుసుకొంటూ, విశాల భావాల నలవరచుకొంటుంది. కొత్త స్నేహాలేర్పడతాయి. వారితో సంభాషణం సిద్ధిస్తుంది. అందువలన తీర్థయాత్రలు చేయడానికే ఉత్సాహపడతారు.

17. సత్పురుషులైన పండితుల సహవాసం లభిస్తుంది. దానివలన పవిత్రుడై, విజ్ఞానలాభం పొందగలడు. పూర్వజన్మల పుణ్యఫలం చేతనే మహాపురుషుల ఆశ్రయం లభిస్తూంటుంది.

18. గురుదేవా! ఎవరు సర్వకాల, సర్వావస్థలందూ గురుభక్తి కలవాడై, గురుదేవుని మరువక, గురూపదేశాలనే పాటిస్తూ జీవిస్తాడో అతడు దూరదేశాలలో ఉన్నా, యథార్థంగా అతడు గురువుకు సమీపంలో ఉన్నట్లుగా పరిగణించాలి. అలాగాక గురుసన్నిధిన ఉన్నా, గురుభక్తి లేనివాడై గురుని ఆదేశాలను మరచినవాడు గురువుకు దూరంగా ఉన్నవాడవుతున్నాడు. గురు దేవుని ఎవరు మనస్సున విస్మరిస్తారో అట్టివారే నిజానికి గురువుకు దూరంగా ఉన్నట్లు తలచాలి. కనుక ఓ గురుదేవా! తమను ఎల్లవేళలా స్మరిస్తూ, తమ అపార కరుణను స్తుతిస్తూ, నిష్కపటభక్తితో తామే పరబ్రహ్మమని తలచటం చేత తీర్థయాత్రలు చేస్తున్నా, ఎలాటి దోషమూ ఉండదని భావిస్తాను.

19. మహాత్మా! సజ్జనుడు మహాత్ములతో స్నేహం పెంచుకొంటే బుద్ధియందలి దోషాలను సరిదిద్దుకొని విజ్ఞానవంతుడు కాగలడు. విడువదగిన

గుణాలను వదలి సత్త్వగుణాన్ని పెంచుకొంటూ పరమ శాంతిని పొందగలడు. తీర్థయాత్రల చేత అనేక ప్రయోజనాలు పొందవచ్చు. కనుక గురుదేవుని అనుజ్ఞకై ప్రార్థిస్తున్నాను."

20. **శ్రీ శంకరులు:** శిష్యవర్యా! తీర్థయాత్రల పట్ల నీకున్న పట్టుదల ఏపాటిదో తెలిసికొనగోరి అలా పలికాను. నువ్వు యాత్రలు చేయాలని కృతనిశ్చయుడవై ఉన్నావు. నీ ఉత్సాహానికి విఘాతం కలిగించను. అయినా ఎంతో దుస్సాధ్యమూ, కష్టతరమూ అయిన యాత్రలు చేయకు. జీవిత కాలంలో పలు దేశాలను, మహాత్ములను దర్శించాలి. విశేషాలన్నీ స్వయంగా దర్శించి ధన్యుడవు కావాలి. నీకు కలిగిన వైరాగ్యస్థితి ఎలాటిదో పరీక్షించాను.

21. ఏదైనా ఒక క్షేత్రాన్ని దర్శించాలంటే అనేక మార్గా లుంటాయి. కొన్ని మార్గాలు కష్టభూయిష్ఠంగా ఉంటాయి. కొన్ని మార్గాలలో చోరభయ ముంటుంది. మరికొన్ని మార్గాలలో క్రూరమృగాల భయముంటుంది. కనుక సాహసించి ఏదో ఒక మార్గాన్ని ఎంచుకోకు. విచారిస్తే, కొద్దిగా దూరం అధికమైనా సుఖప్రదాలైన మార్గాలు తెలుసుకోగలవు. ఆ మార్గాన్నే ఎక్కువ మంది సాధుపుంగవులు ఎంచుకొని ప్రయాణం చేస్తారు. అంతేగాక, ఏ పుణ్యక్షేత్రంలో బసచేస్తే నువ్వు పోదలచిన క్షేత్రానికి పోయే వారితో పరిచయ మేర్పడుతుందో, అటువంటి పరిచయస్థులతో ప్రయాణం కొనసాగించాలి.

22. యాత్రలందు సత్పురుషులతోటి స్నేహమేర్పడుతుంది. వారిలో బ్రహ్మజ్ఞానసంపన్నులుంటారు. విషయాలకు దూరంగా ఉండే అట్టి మహాత్ముల నుండి ఆధ్యాత్మికతత్త్వబోధలు పొందవచ్చు. వారి బోధలు బహుచమత్కార భూయిష్ఠంగాను, అద్భుతంగాను ఉండి మనోరంజకంగా ఉంటవి. అటువంటి వారి సాహచర్యం వలన మార్గాయాసం తెలియదు. అంటే, అట్టి విజ్ఞానదాయక మైన బోధలు శ్రవణం చేయటం వలన మానసికానందం కలిగి, శారీరక శ్రమ సమసిపోతుంది. ఆకలి కూడా తెలియదు. ఆ విధంగా తాపత్రయాలన్నీ నశించి మహానందం కలుగుతుంది.

23. అటువంటి సజ్జనులను వదలి వెళ్ళవలసి వచ్చేటప్పుడు వియోగ దుఃఖాన్ని అనుభవిస్తారు. బాగా విచారిస్తే, సుఖాన్నిచ్చేదేదీ ఈ విషయ

ప్రపంచంలో కనిపించదు. ఈ విధంగా వియోగం కూడా దుఃఖాన్నే కలిగిస్తోంది.

24. సన్యాసి ఎంతదూర ప్రయాణం చేసినా కూడా, తనతో ఆహార పదార్థాలను గాని, మరే ఇతర వస్తువులను గాని సేకరించి తీసుకొని పోరాదు. చివరకు నీరు కూడా వెంట తీసుకొని పోరాదు. ఈ వస్తువులన్నీ అడ్డంకులుగా మారి, ప్రయాణంలో ఆటంకాలు ఏర్పడతాయి. ఫలితంగా గమ్యాన్ని చేరుకోలేకపోతావు. యాత్రీకులకు నిర్ణయించిన స్థలాలందే బసచేయి. లేకుంటే ప్రయాణానికి ఆటంకాలు ఏర్పడి నువ్వు తలపెట్టిన కార్యమే వ్యర్థమైపోగలదు. ఈ మెళకువలన్నీ చక్కగా తెలుసుకొని ప్రయాణం చేయి.

25. మార్గమధ్యంలో కపట సాధువులు తారసపడతారు. వారి వేష భాషలను చూసి వారు దొంగ సాధువులని తెలుసుకోలేము. ఇతరుల వస్తువులను దొంగిలించటమే వారి వృత్తి. 'సన్యాసిని. నా వద్ద ఏం దొంగిలిస్తాడు' లెమ్మని తలచవద్దు. కౌపీనం దొరికినా, తాటాకు పత్రం దొరికినా చాలు. దొంగిలిస్తారు. వారు ఆప్తులమల్లే, ప్రాణమిత్రుల మల్లే ప్రవర్తిస్తారు. వారు ప్రాణం తీయడానికైనా వెనుకాడరు. వారు చేసిన అకృత్యాలు నీపై మోపడానికి కూడా ప్రయత్నిస్తారు. అట్టి వారిని విశ్వసింపవద్దు. జాగరూకుడవై ఉండు.

26. నువ్వు వెళ్లే మార్గంలో ఎవరైనా మహాత్ములు ఉంటే వారిని దర్శించే ముందుకు పోవాలి. అట్టి మహనీయులకై దూరమనో, శ్రమనో తలచక వారిని తప్పక దర్శించాలి. వారి అనుగ్రహం సంపాదించటం సర్వ శ్రేయస్కరం. వారు అనుకొంటే అనుగ్రహింపగలరు; నిగ్రహించనూ గలరు.

27. యతివరేణ్యా! దేశంలో అనేక రకాలైన మతాలున్నవి. వారందరితో చనువుగా మెలగవద్దు. శ్రేయస్సును చేకూర్చే మతాలనే స్వీకరించు. కుత్సితులు పామరులతో పలుకనైనా పలుకవద్దు. రజస్తమోగుణాలను విసర్జించి, నిర్మలమైన మనస్సుతో సత్త్వగుణ పరబ్రహ్మంలోనే విహరించు. ఈ విధంగా కుటిల మనస్సు గలవారిని స్వీకరింపక, పరబ్రహ్మాన్నే గ్రహించటం చేత నిరంతరం నిత్యానందాన్ని పొందగలవు. నాయనా! పరమలక్ష్యమైన తత్త్వం మాత్రం ఎలాటి పరిస్థితులలోనూ విడువకు.

28. శ్రీ శంకరులు పద్మపాదుని తీర్థయాత్రలకు అనుమతించిన తరువాత కొంతకాలం శిష్యులతో కలసి ఆ ఋష్యశృంగపర్వతం మీదనే ఉండిపోయారు.

29. శ్రీ శంకరులు యోగశక్తిచేత తల్లి మరణావస్థలో ఉన్నదని గ్రహించారు. ఈ విషయాన్ని శిష్యులకు తెలిపి తాను యోగమహిమ చేత ఆకాశమార్గాన తల్లి సమీపమునకు వచ్చిజేరారు.

30. శ్రీ శంకరుల తల్లి, "నాయనా! నా మరణ సమయంలో, పను లన్నింటినీ వదలి, నీ వద్దకు వచ్చి వాలతానని పలికి వెళ్లావు. ఇంతవరకు నువ్వు తిరిగి రాలేదు. నాకు మరణ సమయమాసన్నమైనది. నేనేమి చేయ గలను" అని చింతించసాగింది. అట్టి సమయంలో శ్రీ శంకరులు తల్లిని దర్శించి సాష్టాంగనమస్కారం చేశారు. కుమారుని చూడగానే, సూర్యతాపంచే తపించేవానికి మలయమారుతం వీచినట్లు, ఆమె శరీరతాపాలన్నీ ఉపశ మించాయి.

31. **శ్రీ శంకరులు:** అమ్మా! నువ్వు అనుకోగానే నీ వద్దకు వచ్చాను. ఇక ఏ విధమైన చింతా వద్దు. నీకేం కావాలో శాసించు. నీ ఆజ్ఞకై ఎదురు చూస్తున్నాను.

32. **శ్రీ సతీదేవి:** (శ్రీ శంకరులతో) నాయనా! నా ఈ అవసాన కాలంలో దైవకృపచేత నిన్ను చూడగలిగాను అంతకు మించిన కోరిక ఏదీ నా మనస్సులో లేదు. నా పూర్వజన్మ సుకృతం చేత నిన్ను చూడగలిగాను.

33. వత్సా! నా శరీరం శుష్కించిపోయింది. జీవుడు ఏ క్షణంలోనైనా యీ దేహాన్ని విడిచి పోగలడు. నా దేహానికి శాస్త్రసమ్మతంగా అంత్యక్రియలు నువ్వే చేయాలి. లేకపోతే నాకు పుణ్యలోకాలు లభించవు. అందువలన పరిశుద్ధుడవైన నువ్వు కూడా ధర్మభ్రష్టుడవు గాకుందువు గాక!

34, 35. సతీదేవి యీ విధంగా తనకు పుణ్యలోక ప్రాప్తికై శ్రీ శంకరులను కోరగా, శ్రీ శంకరులామెకు బ్రహ్మతత్త్వం ఉపదేశింపదల చారు. అందువలన ఆమెకు జననమరణ సంసారం నుండి విముక్తి కలిగించి శాశ్వతబ్రహ్మానందాన్ని ప్రసాదింపదలచారు. ఆకాశంలా సర్వవ్యాపకమూ,

మాయాపూరితాలైన ముసలితనమూ, వ్యాధులు లేనిదీ, జననమరణ సంసారం నుండి విముక్తి కలిగించేదీ అయిన శాశ్వతబ్రహ్మానందాన్ని ప్రసాదింపదల చారు.

ఆకాశంలా సర్వవ్యాపకమూ, మాయాపూరితాలైన ముసలితనమూ, వ్యాధులు లేనిదీ, జననమరణ దోషాలు లేనిదీ, అవస్థలన్నింటిని అధిగమించు నదీ, నిత్యమైనదీ అయిన సచ్చిదానంద పరబ్రహ్మను, మునుపు కపిలుడు తల్లికి వేదాంత తత్త్వాన్ని బోధించాడు. అట్లే శ్రీ శంకరులు కూడా తల్లికి బ్రహ్మతత్త్వం ఉపదేశింపదలచారు. తల్లులు పామరులైనా, జ్ఞానమూర్తులైన పుత్రులను కంటే వారి వంశమే ధన్యమవుతుంది.

36. సతీదేవి కుమారు డుపదేశించిన బ్రహ్మతత్త్వం తెలియజాలక శ్రీ శంకరులతో "కుమారా! నువ్వు ఉపదేశించిన నిర్గుణబ్రహ్మతత్త్వం నా బుద్ధి గ్రహించలేకున్నది. కనుక రమణీయరూపంతో కూడినట్టి సగుణ స్వరూపపరబ్రహ్మాన్ని నాకు చూపించు; బోధించు" అని పలికింది.

37. తల్లి కోరిక విన్న శ్రీ శంకరులు ఆమెకు శ్రీ మహేశ్వరుని చూపదలచారు. పరమభక్తితో ఆ మహేశ్వరుని స్తుతించారు. ప్రసన్నుడైన మహేశ్వరుడు తన దూతలను పంపాడు.

38. శివదూతలను చూసిన సతీదేవి వారితో పోనని శ్రీ శంకరులతో చెప్పింది. "కుమారా! శివదూతలు శూలాలు, ధనస్సులు ధరించి ఎంతో భయం కలిగిస్తున్నారు. కనుక నేను వారితో కూడా పోజాలను." అంతట శ్రీ శంకరులు మాతృహృదయాన్ని తెలిసినవారై శ్రీ విష్ణుభగవానుని పరమ ప్రీతితో స్తుతించారు.

39. సర్పరాజైన ఆదిశేషునిపై పరుండి, తన మృదువైన పాదపద్మాలను లక్ష్మీదేవి ఒడిలో ఉంచి, తన భార్యలైన భూనీళాదేవులు చామరాలతో విసరుతుండగా సంతోషంతో సుఖంగా పరుండినవాడూ,

40. పరమ భక్తుడూ, వాహనమూ అయిన గరుత్మంతుడు సదా సేవిస్తూండగా, శంఖ, చక్ర, గదా, ధనుః ఖడ్గాలను అయిదుగురు దేవతా మూర్తుల ఆకారాలతో పరివేష్టింపబడిన శంఖచక్ర గదాధారీ,

41. కానుగ పూవు వంటి సుకుమారమైన దేహంతో కూడి, నీలమేఘ శ్యామ వర్ణంతో, శిరస్సున రత్న ఖచితమైన కిరీటాన్ని ధరించినవాడూ, కేయూర కంకణాది దివ్యకాంతులతో కూడినవాడూ, కోటి సూర్యులను పరిహసించే ఇంద్రనీలకాంతులతో వెలయువాడూ, కేవల తేజస్సంపన్నుడూ,

42. అట్టి అప్రాకృత దివ్యదేహంతో ఒప్పారే ప్రశాంతమూర్తియైన విష్ణుభగవానుని రూపాన్ని శ్రీ శంకరులు వర్ణిస్తూండగా, తల్లియైన ఆ ఆర్యాంబ ఆ రూపాన్నే మదిలో తలంపసాగింది. ఆ విధంగా శ్రీ విష్ణుభగవానుని మనస్సులో ధ్యానించినదై దేహాన్ని విడిచింది.

43. శ్రీ సతీదేవి దేహాన్ని వదలగా, శంఖచక్రాది చిహ్నాలను ధరించిన విష్ణుదూతలు, విమానంతో ఆ సతీదేవి ఎదుట సాక్షాత్కరించారు.

44. బహుసుందరాకారులు, ప్రశాంతభావంతో కూడి తన కొరకు విమానంతో వేచి ఉన్న విష్ణుదూతలను చూసిన శ్రీ ఆర్యాంబ ఎంతో సంతోషించింది. పుత్రుని అత్యంత ప్రభావాన్ని, తన పట్ల చూపిన అత్యంత కరుణాభావాన్ని ఎంతో ప్రశంసించింది. తరువాత ఆ విష్ణుదూతలు ఆమెను విమానంలో ఎక్కించుకొని వైకుంఠానికి బయలుదేరారు.

45. ఆ సతీదేవి, అగ్ని, దిన, శుక్లపక్ష, ఉత్తరాయణ మొదలైన అభిమాన దేవతలను, వాయు, సూర్య, చంద్ర, విద్యుద్వరుణాది లోకాలను, దాటుకొంటూ వైకుంఠం చేరుకొన్నది.

46. తదనంతరం శ్రీ శంకరులు తన తల్లి కోరిక మేరకు ఆమె దేహానికి దహనసంస్కారాలు చేయడానికి బంధువులందరినీ ఆహ్వానించారు. అంతట ఆ బంధుజనులు, శ్రీశంకరులతో "యతీశ్వరా! నువ్వు సన్న్యాసాశ్రమమం స్వీకరించిన తరువాత మాతృకర్మ చేయటం శాస్త్ర విరుద్ధం. నీ కట్టి అధికారం లేకున్నా, శాస్త్రమర్యాద నతిక్రమించి, మాతృదేహానికి దహన సంస్కారం చేయడానికి పూనుకొన్నావు. నువ్వు నిజంగా వంచకుడవు" అని పరిపరి విధాలుగా దూషించారు.

47. అయినా, సహనశీలియై దహన సంస్కారానికై అగ్నికోసం ఆ బంధువులను ప్రార్థించారు. "నువ్వు కర్మభ్రష్టుడవు కనుక అగ్నినీయ" మన్నారు.

అహంకారశూన్యుడే అయినా, శ్రీ శంకరులు వారిపై ఆగ్రహించి శపించారు.

48. శ్రీ శంకరులు జ్ఞాతులపై ఆగ్రహించి తన గృహ ఆవరణలోనే కట్టెలతో చితిని పేర్చి తల్లి మృతదేహాన్ని దానిపై ఉంచారు. తల్లి దహనానికి అగ్నిని ఇవ్వడానికి నిరాకరించిన జ్ఞాతులకు గుణపాఠం చెప్పదలచి, తల్లి కుడిభుజాన్ని మథించి అగ్నిని పుట్టించారు. ఆ అగ్నితో తానే స్వయంగా తల్లి మృతదేహానికి దహనసంస్కారాలను చేశారు.

49. ఎన్ని విధాలుగా ప్రార్థించినా అగ్నినీయకుండటం చేత వారినందరినీ ఈ విధంగా శపించారు. బ్రాహ్మణులకు వేదమే ప్రాణమవడం చేత, ఈ దేశంలో వేదాలు పఠింపని వారవుతారు గాక! అంతేగాక ఈ దేశంలో బ్రాహ్మణుల ఇంట ఏ యతీశ్వరుడు భిక్ష చేయకుంటాడు గాక!

50-51. ఇకమీదట మీ గృహావరణలే మీకు శ్మశానవాటికలవుతవి గాక!" అని శపించారు. నేటికీ కేరళ దేశంలో బ్రాహ్మణులు వేదాన్ని పఠించరు; యతీశ్వరులకు భిక్ష నివ్వరు; వారి గృహావరణలందే దహన సంస్కారాదులు నడుస్తున్నవి.

52. తపోధనులను, శాంత స్వభావులను భయభక్తులతో సేవించాలే గాని, వారిని పీడిస్తే వారి కోపాగ్నికి గురికాక తప్పదు గదా! చందన వృక్షం నుండి సుగంధం, చల్లదనం ఇచ్చే చందనాన్ని పొందవచ్చు. అదే గంధపు మానుని రాపిడి చేస్తే అగ్ని జ్వలించి అడవినంతా దహిస్తుంది. అందువలన మహాపురుషులకు ఎంతమాత్రమూ బాధ కలిగించరాదు.

53. మహాత్ములు, తపస్సంపన్నులు విధి నిషేధాలకు అతీతులు. వారు చేసే కార్యాలు శాస్త్ర విరుద్ధంగా ఉన్నట్లు కనిపించినా, విచారిస్తే అందులో లోకోపకారం అంతర్లీనమై ఉంటుంది. కనుక దోషాలు కావు. దృష్టాంతంగా, పరశురాముడు తండ్రి ఆజ్ఞ ప్రకారం తల్లిని వధించాడు. అందలి అంతరార్థం తెలిసిన తరువాత ఎవరూ ఆతణ్ణి తప్పుపట్టలేదు. ఆ విధంగా శాస్త్రమర్యాదలన్నీ సామాన్యులకే గాని మహాత్ములకు కాదు. శ్రీ శంకరులు యతీశ్వరులే అయినా, మాతృమూర్తిని సంరక్షించాలనే పరమధర్మాన్ని తెలిపారు.

54. శ్రీ శంకరులు తన తల్లిని సంసారబంధాల నుండి విముక్తు రాలను చేసి, వైకుంఠపదానికి చేర్చారు. తరువాత తన అద్వైతతత్త్వ ప్రచారం అప్రతిహతమై వర్ధిల్లేట్లు చేశారు. సర్వవిరుద్ధమతాలను మొదలంట నాశనం చేశారు. సర్వకార్యసమర్థుడని పేరు గాంచారు.

55. శ్రీ శంకరులు మాతృమూర్తికి సద్గతులు కలిగించిన తరువాత, శ్రీ పద్మపాదాచార్యుల ఆగమనానికై కేరళదేశంలోనే కొంతకాలం ఉండి పోయారు. తరువాత పద్మపాదుడు, ఉత్తరదేశపుణ్యక్షేత్రాలను పెక్కింటిని దర్శించాడు.

56. శ్రీ పద్మపాదుడు ఉత్తరదేశయాత్రలు ముగించుకొని దక్షిణ దేశంలో ప్రవేశించాడు. ముందుగా సముద్ర జలమంతా ఒక్క చుక్కకూడా మిగలకుండా ఆపోశన పట్టిన అగస్త్యమహర్షిని దర్శించి, తరువాత సేతు యాత్రను ప్రారంభించదలచాడు. అగస్త్యమహర్షి చరితం సకలవ్యాధి విధ్వంసకమని ప్రతీతి.

57. ముమ్ముందుగా దక్షిణకాశిగా పేరుగాంచిన శ్రీ కాళహస్తీశ్వర క్షేత్రాన్ని దర్శించాడు. ఈ క్షేత్రంలో పరమశివుడు వాయులింగ రూపంలో కొలువుదీరాడు. శిరస్సున చంద్రవంకను ధరించి, సర్పాలనే అలంకారంగా చేసుకొని పార్వతీసమేతుడైన మహేశ్వరుని మహేంద్రాది దేవతలు సేవిస్తూం టారు. జ్ఞానహీనులైన పశు కీటకాదులకూ ముక్తిని ప్రసాదించిన శ్రీకాళహస్తీశ్వరుని శ్రీపద్మపాదుడు తనవితీర సేవించుకొన్నాడు.

58. పవిత్ర సువర్ణముఖీనదిలో స్నానమాచరించి, పార్వతీ దేవితో కూడి వెలుగొందుతున్న ఆ మహేశ్వరునకు పద్మపాదుడు పెక్కుసార్లు సాష్టాంగ పడి నమస్కరించాడు. వివిధాలైన పుష్పాలతో పూజించి జగదీశ్వరుని అనుజ్ఞను పొంది దక్షిణదేశయాత్రను ప్రారంభించాడు.

59. అంతట శ్రీ పద్మపాదాచార్యుడు మహేశ్వరుని వద్ద అనుమతి గైకొని, శివకేశవక్షేత్రమైన కాంచీపురానికి వెళ్లాడు.

60. అపార భవసాగరం నుండి విముక్తి కలిగించే మహేశ్వరుడు ఒక మామిడిచెట్టు నీడన నెలకొని ఉండడాన్ని శ్రీ పద్మపాదాచార్యుడు

దర్శించాడు. ఆ మహారుద్రునికి హృదయమైన కామాక్షీదేవికి కూడా ప్రణమిల్లిన శ్రీ పద్మపాదుడు ఎంతో సంతృప్తుడయ్యారు.

61. తరువాత కాంచీపురానికి సమీపంలోని కల్లాల క్షేత్రంలో వెలసి ఉన్న శ్రీ లక్ష్మీకాంతుని, శ్రీ పద్మపాదాచార్యులు దర్శించారు. ఆ పరమాత్ముని పరమభక్తితో స్తుతించారు.

62. అక్కడ నుండి బయలుదేరి వెళ్లి శ్రీ పద్మపాదుడు పుండరీక క్షేత్రాన్ని దర్శించారు. అక్కడ నృత్యాలకు మూల పురుషుడూ, జగతికి నాట్యాచార్యుడు అయిన పార్వతీసహిత సదాశివుని ఎంతో ప్రీతితో సేవించుకొన్నారు.

63. భవసాగరాన్ని భేదింప సమర్థమైన ఆ దేవదేవుని నృత్యాన్ని నిర్మలాత్ములైన మహర్షులు దర్శిస్తున్నారు. ఆ నృత్యం సర్వభయాలను పోగొట్టి కైవల్యాన్ని ప్రసాదించేదై ఉంది. అట్టి నృత్యాన్ని గౌరీదేవి ఆనందంతో వీక్షిస్తున్నది.

64. శివభక్తుడొకడు ఆ క్షేత్రంగుండా ప్రవహించే నది ఎలా ఉత్పత్తి అయినదో శ్రీ పద్మపాదునకు తెలియబరచాడు. భక్తుల సౌకర్యానికై పరమదయాళువైన పరమశివుడు గంగను స్మరించగా ఆ గంగాదేవి ప్రత్యక్షమై వివిధ నదులలో జలాలను గ్రహించి ఇక్కడ నదిగా ప్రవహించింది.

65. ఈ విధంగా ప్రవహించిన ఆ నది పరమ పవిత్రమై విలసిల్లింది. ఈ గంగలో స్నానం చేసే వారందరూ పరమ పవిత్రులవుతారని పెద్దలు చెబుతున్నారు. పరమశివుని నృత్యాన్ని చూడడానికి వచ్చే అశేష భక్తుల సౌకర్యానికై శివుని ఆజ్ఞ చేత ఏర్పడిన గంగ అవడం చేత ఈ నదికి శివగంగ అనే పేరు ఏర్పడినది.

66-70. పరమశివుడు మహోత్సాంతో నాట్యం చేస్తుండగా, ఆ పరమ శివుని తాపం చల్లార్చడానికై పార్వతీదేవియే గంగా రూపంలో అవతరించినది. అందువలన ఈ నదికి శివగంగ అనే నామం ప్రసిద్ధమైనదని మరికొందరి నమ్మకం. ఏది ఏమైనా, ఆ నదికి శివగంగ అనే పేరు కలుగడమూ, అందు మునకవేసే వారందరూ పవిత్రులవుతున్నారన్నది మాత్రం యథార్థం.

మహేశ్వరుడు మహాసంతోషంతో నాట్యం చేస్తుండగా, ఆ ఒరపిడికి జటాజూటాలలోని గంగాదేవి తాళలేక జలమంతా నేలపైకి చిందినదని ఇంకొందరు చెబుతున్నారు.

ఈ శివగంగలో ప్రతి రోజూ స్నానం చేసి దేవదేవుని పాదపద్మాలను దర్శించుకొని, పరిశుద్ధాంతరంగులై ఆ పరమశివుని నాట్యాన్ని వీక్షిస్తున్నారు; పరిశుద్ధాత్ములవుతున్నారు. ఆ మహాదేవునే నటరాజని స్తుతిస్తున్నారు.

ఏ పుణ్యాత్ముడు ఈ పవిత్ర శివగంగలో మునకలు వేస్తున్నాడో, శివ పార్వతులను దర్శిస్తున్నాడో అట్టి వాడు ధన్యాత్ముడవుతున్నాడు. అట్టివారి పుణ్య సంపదను విలువ కట్టాలంటే ఆ పరమేశ్వరునికి తప్ప ఇతరులకు సాధ్యం కాదు.

ఈ విధంగా ఆ శివభక్తుడు తీర్థ మాహాత్మ్యాన్ని వర్ణించి తెలుపగా, పద్మపాదుడూ, ఆ భక్తునితో కలిసి శివగంగ యందు స్నానమాచరించి పార్వతీపరమేశ్వరులను దర్శించుకొన్నాడు.

71. అంతట శ్రీ పద్మపాదుడు శివగంగ నుండి ప్రయాణమై రామేశ్వర క్షేత్రాన్ని, సేతు సందర్శనాన్ని చేయదలచాడు. మార్గమధ్యంలో కావేరీ తీరాన ఉన్న క్షేత్రాన్ని దర్శించాడు.

72. ఎల్లప్పుడూ క్షీరసముద్రంలో నివసించేవాడూ, పీతాంబరధారీ, అనంతకోటి నామరూపాలతో వెలయు విష్ణుభగవానుడు శ్రీ రంగనాథ నామరూపాన్ని ధరించి కావేరీతీరాన భక్తుల ననుగ్రహిస్తున్నాడు.

73. అట్టి శ్రీ రంగనాథస్వామి విలసిల్లే ఆ క్షేత్రం శ్రీరంగమనే పేరుతో ప్రసిద్ధమైనది. శ్రీ పద్మపాదాచార్యులు శ్రీ రంగనాథస్వామిని తన హృదయంలో నిలుపుకొని ధ్యానించి, కావేరీ జలాలతో పరమభక్తితో అభిషేకించాడు.

74,75. శ్రీ పద్మపాదుడు శిష్యులచే సేవించబడుతూ, దక్షిణదేశ యాత్రలు చేస్తూ తన మేనమామగారి ఇంటికి వెళ్లాడు. మహా పండితు డైన మేనమామకూడా బహుకాలం తరువాత శిష్యగణంతో కలసి వచ్చిన మేనల్లుణ్ణి ఆదరంతో అక్కున చేర్చుకొన్నాడు.

76. ఎన్నడో బాల్యంలో చూసిన సనందుడు సన్న్యసించి వచ్చాడని తెలిసిన బంధుజనులందరూ చూడడానికి వచ్చారు. చాలకాలానికి చూడగలిగామన్న తృప్తితో కొందరి కళ్ల నుంచి ఆనందబాష్పాలు స్రవించాయి. కొందరు సంతోషాన్ని వ్యక్తం చేశారు. ఇంకొందరు బాల్యం నాటి ముచ్చటలను జ్ఞాపక పరచుకొన్నారు. కొందరు పరిహసించారు. ఒక్కొక్కరు నమస్కరించసాగారు. కొందరికి సంభ్రమాశ్చర్యాలతో నోటమాట రాలేదు.

77. **బంధుజనులు ఇలా పలికారు:** యతివరేణ్యా! తమను చూసి చాలకాలమైనది. తీర్థయాత్రల పేరుతో ఈ ప్రాంతాలకు వచ్చినందున మిమ్మల్ని చూడగలిగాము. సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన తమను దర్శించటం వలన అందరూ ఎంతో సంతోషిస్తున్నారు. అందులో కొందరు తమకు బాల్యస్నేహితులు, మరికొందరు ఇప్పుడు తమ పట్ల భక్తి భావం కలిగి ఉన్నారు. వీరందరూ తమతో ముచ్చటించడానికి కుతూహలపడుతున్నారు. మీరు విషయప్రపంచంపట్ల విరక్తులవటం చేత వారిని చూడాలనే కోరిక తమలో కనిపించటం లేదు. అందువలననే తాము బంధవిముక్తులై సుఖంగా ఉన్నారు.

78,79. మహాత్మా! యతివరేణ్యులకు బంధుమిత్రులుండరు. అందు వలన సామాన్య గృహస్థులకుండే ద్వంద్వాలేమీ (కష్టసుఖాలు, సుఖ దుఃఖాలు) ఉండవు. రాజులకు సుంకం చెల్లించవలసిన పని లేదు; చోరభయమంతకన్నా ఉండదు. అహంకారమమకారాలు లేకుండా దేశాలన్నీ విరాగులై సంచరిస్తూ ఉంటారు. ఆ విధంగా సన్న్యాసి జీవితం ధన్యమైనది. లోకంలో ఫలపుష్పాదులతో విలసిల్లే వృక్షాలనే జనులు రాళ్ళతో కొట్టి బాధిస్తున్నారు. ఫలపుష్పాదులు లేని వృక్షాల నెవ్వరూ ముట్టరు గదా? అదేవిధంగా సర్వసంగ పరిత్యాగం చేసినవాని నెవరూ బాధించరు. అట్టి యతీశ్వరుడు నిస్సంగియై ఎల్లప్పుడూ పరబ్రహ్మమందు విహరిస్తూంటాడు.

80. వైరాగ్యసంపన్నులైన యతీశ్వరులు నిరంతరం ఆనందం అనుభవిస్తున్నారు. గృహస్థాశ్రమంలో ఉండే వ్యక్తి సుఖాల కొరకు వెదకుతూ దుఃఖానే పొందుతున్నాడు. ఇవే ముక్తి, బంధాలు. గృహస్థాశ్రమంలో భార్యా

పిల్లలను సంతోషపెట్టడానికి సమయమంతా సరిపోతున్నది. దేవతార్చనకు కూడా సమయం ఉండడం లేదు. ఇక తీర్థయాత్రల విషయం చెప్పాలా? భవసాగరంలో కూరుకుపోయిన మాకు మీ దర్శన భాగ్యమనేది మా పూర్వజన్మల సుకృతమే.

81. ఒకానొక విప్రసత్తముడు మా ఇంటికి వచ్చాడు. తమరు సన్యాసం స్వీకరించి అనేకమంది శిష్యులచే సేవించబడినవారై ఉన్నారని తెలిపాడు. ఆనాటినుండి మిమ్మల్ని దర్శించాలని తలచామే కాని దర్శింప లేకపోయాం. ఇప్పుడు దైవానుగ్రహం చేత తామే తీర్థయాత్రల నెపంతో మా ఇంటికి దయజేశారు.

82. ఇతరులచే నాటబడిన వృక్షాలపై పక్షులు నివసిస్తూ, తరువాత ఆ వృక్షాన్ని వదలి ఆకాశంలోనే సంచరిస్తుంటాయి. అలాగే యతీశ్వరులు కూడా ఇతరులచే నిర్మింపబడిన దేవాలయాలందుగాని, ధర్మసత్రాలందుగాని, గృహస్థుల గృహాలలోగాని కొద్ది రోజులపాటు ఉండి తిరిగి దేశాటనకై పోతుంటారేకాని, అక్కడ భోగాలు లభించినా వాటి నాశించరు. పక్షుల సంచారం, లక్ష్యం నిరాధారంగా ఉండే ఆకాశమే అయినట్లుగా, యతీశ్వరులు కూడా దేవాలయాదినివాసాన్ని దేహయాత్ర కొరకు వినియోగించుకొంటూ మనస్సును మాత్రం చిదాకాశమందే నిలిపి సంచరిస్తుంటారు.

83. భ్రమరాలు పుష్పాలపై వ్రాలి మకరందాన్ని సేకరిస్తాయి. కాని అవి పుష్పానికి ఏ విధమైన బాధను కలిగించవు. పుష్పాల సౌకుమార్యానికి గాని, సుగంధానికి గాని ఏ విధమైన హానీ కలిగించవు. అదే విధంగా యతీశ్వరులు కూడా, భిక్షార్థమై గృహస్థుల ఇళ్లకు వెళ్ళినా, వారికి ఏ విధమైన కష్టాన్ని కలిగించక, భిక్షను గ్రహించి తమ ఆకలిని మాత్రం తీర్చుకొంటున్నారు. ఆ విధంగా నిస్సంగులై నిత్యసుఖాన్ని పొందుతున్నారు.

84. యతీశ్వరులకు వైరాగ్యంచేత పొందే ఆత్మానుభవం భార్య వంటిది. ఆతని దేహమే అతనికి గృహం. సంయమనమే అతని సుఖసంపద. శిష్యులే ఆతని పుత్రుల వంటి వారు. ఈ విధంగా పరమ శాంతిని పొందు తున్నాడు. ఇక యతీశ్వరులు కోరదగినవేమున్నాయి?

85. మహాత్మా! గృహస్థు కోరికలకు అంతం లేదు. కాంతాసుఖాన్ని కోరి భార్యతో రాత్రింబవళ్ళు గడుపుతున్నాడు. తరువాత ఆమె ద్వారా పిల్లలను కోరుకొంటూ సంసారాన్ని వృద్ధి చేస్తున్నాడు. వారిని సుఖ సంతోషాలలో ఉంచాలని విశ్రాంతిలేక చివరకు దుఃఖాన్నే పొందుతున్నాడు. ఆ కారణంగా సద్గతులు పొందడానికి కాలమే దొరకటం లేదు.

86. లోకంలో మనిషి భార్యను పొందక దుఃఖపడుతున్నాడు. ఒకవేళ భార్య సంప్రాప్తిస్తే, (దైవవశాత్తుగా) కాలాంతరాన వియోగం చెందినప్పుడు మరల దుఃఖాన్నే పొందుతున్నాడు. కోరుకున్నది ప్రాప్తించినప్పుడు క్షణికమైన ఆనందం పొందినా, కోరుకున్నది నష్టపోయినప్పుడు తీవ్రమైన దుఃఖాన్ని పొందుతున్నాడు. కాబట్టి సంసారికి దొరికే క్షణికమైన ఆనందం, ఒక కష్టానికి, మరొక కష్టానికి మధ్యన ఉండే చిన్న వంతెన వంటిది. వంతెనపై ఉన్నంతవరకు సుఖం అనుభవించి, వంతెన దాటగానే మరల కష్టాలలో కూరుకుపోతూ ఉంటాడు. కనుక నిరంతరమైన ఆనందాన్ని కోరే పురుషుడు తీవ్రమైన వైరాగ్యం చేతనే దానిని సంపాదించగలడు. పరమహంసలు అటువంటి నిత్యానందంలో విహరిస్తూంటారు.

87. లోకంలో జనులు అనేక మానసిక రుగ్మతలచేత బాధలు పడుతున్నారు. అటువంటి బాధలు తొలగాలంటే ఆత్మశుద్ధి ఒక్కటే మార్గం. ఆత్మశుద్ధి అనేది మహాత్ములను సేవించటంచేతనే లభించగలదు. అందువలన పరమహంసలు, మహాత్ములైన తమబోటివారు తీర్థయాత్రలన్న పేరుతో దేశాటన చేస్తూ జనులకు ఆత్మబోధ చేసి తరణోపాయాన్ని చూపుతున్నారు. ఆ విధంగా మహాపురుషులు దేశాటనం చేస్తూ జనులకు మహోపకారం చేస్తున్నారు. సంచారం శుభప్రదం, శాంతిదాయకమవుతున్నది.

88. పరమహంసలు కీర్తిప్రతిష్ఠలను కోరుకోరు. తమ గోత్రం, నామం, జన్మించిన ప్రదేశం, వంశం మొదలైన వాటినన్నింటినీ విస్మరించి అభిమానం లేనివారై జడునిమల్లే సంచరిస్తుంటారు. జనులు వారిని పిచ్చివారని భావిస్తారు. అయినా సర్వలోకక్షేమాన్నే కోరుకొంటూ, సర్వప్రాణులపట్ల దయతోను, సమభావనతోను మెలగటమే వారి లక్ష్యం. ఆహారపానీయాదులందు కోరిక

లుండవు. ఏది దొరికితే దానితోనే, ఎంత దొరికితే అంతతోనే తృప్తి చెంది జీవిస్తూంటారు. ఇది సన్యాసులకు విధించిన 'అపరిగ్రహవ్రతం' పరమధర్మమై ఉన్నది.

89. పరమహంసలు స్వయంగా పరిశుద్ధాత్ములవటం చేత జనులకు పరమాత్మతత్త్వాన్ని బోధిస్తూ వారిని నిర్మల హృదయులుగా చేస్తుంటారు. వారు ఎక్కడ ఉంటారో అదే పుణ్యతీర్థమవుతుందని పెద్దలు చెబుతున్నారు.

90. ఓ యతివరా! బహుజన్మల సుకృతం చేత అప్రాకృతమైన తమ సందర్శనం లభ్యమైనది. మా బంధుజనులందరమూ ఎంతో సంతోషిస్తున్నాము. అదీ గాక మహాత్ముల దివ్యసందర్శనం, సహజీవనం సామాన్యులకు కూడా ముక్తిని కలిగిస్తుంది. కనుక మా ప్రార్థనలను వమ్ము చేయకండి. మా ప్రార్థనలను మన్నించి కొన్ని రోజులు ఇక్కడ గడపండి. లేకుంటే వారందరు తమ వియోగం తలచుకొని దుఃఖిస్తారు.

91. యతిశ్రేష్ఠా! గృహస్థాశ్రమంలో మా జీవితాలన్నీ అవిద్యా క్లేశాల చేత, వివిధాలైన పాపకృత్యాల చేత, వ్యర్థప్రలాపాలతో మలినమై ఉన్నవి. ధనాశాపీడితులు దుర్జనుల తోటి సదాస్నేహం చేస్తున్నారు. జాలి, దయాగుణాలు పూర్తిగా మృగ్యమై క్రూర స్వభావం పెరిగిపోతున్నది. కనుక ఓ యతీశ్వరా! వీరినందరినీ తమ సుబోధామృతంచే సంస్కరించండి. వారిని పరిశుద్ధులను చేయండి. తమరే మాకు శరణ్యం.

92. **శ్రీ పద్మపాదాచార్యులు:** పూజ్యులారా! శ్రేష్ఠమైన దేహమే జీవునికి ఆశ్రయమిస్తున్నది. మరల ఆ దేహమే వియోగం పొందుతున్నది. అట్లే బ్రహ్మా దుల నొకచోట చేర్చేదీ, పిపీలికాదులను సంఘటితం చేసేదీ దైవసంకల్పమే. ఆయన సంకల్పంచేత దగ్గరగా చేరుతాం, మరల విడిపోతుంటాం. ఇందు వలన మనం సుఖదుఃఖాలను పొందరాదు. కనుక వైరాగ్యమే శ్రేష్ఠం. ప్రకృతి నతిక్రమించి, పరబ్రహ్మమందే మనస్సు లగ్నం చేయాలి. కనుక నా వియోగంచేత దుఃఖపడవద్దు.

93. గృహస్థు ఫలపుష్పాదులతో విలసిల్లే వృక్షం వంటివాడు. మధ్యాహ్నసమయంలో ఆకలి బాధచేత భిక్షువులు గృహస్థుని వాకిట

నిలబడతారు. ఏ గృహస్థు అట్టి భిక్షువుకు అన్నం పెట్టుతూ, అతని ఆకలి బాధను తీరుస్తాడో అట్టివారు ఎంతో పుణ్యాత్ములు. అటువంటి అన్నదాత పుణ్యఫలమింత అని చెప్పనలవికాదు.

94. ఎవరు నిరంతరం వేదాధ్యయనం చేస్తూ, కాలం వ్యర్థం చేయక దైవభావంతో ఉంటాడో అట్టివాడు భిక్షకు అర్హుడు. ఎవరు నిత్యం స్నానం చేసి రెండువేళలా అగ్నికార్యం విడువక చేస్తూ బ్రహ్మచర్యవ్రతం ఆచరిస్తాడో అట్టివానికి గృహస్థు తప్పక భిక్ష నిచ్చి అతని ఆకలి బాధను తీర్చాలి. అట్టివానికి భిక్షనివ్వడం గృహస్థు పరమధర్మం. అట్టి గృహస్థు తప్పక తరిస్తాడు.

95. వేదాంత తత్త్వశాస్త్రాల అధ్యయనం చేస్తూ సంపన్నుడైన యతీశ్వరుడు కూడా మధ్యాహ్నసమయంలో ఆకలిబాధ చేత ప్రణవం జపిస్తూ దండాన్ని చేతబూని గృహస్థుని ఇంట భిక్ష కోసం నిలబడాలి. ఆ యతీశ్వరుడు పుణ్యాత్ముడైన ఆ గృహస్థు పెట్టే అన్నంతో శరీరాన్ని పోషించుకొంటూ నిత్యకర్మానుష్ఠానాలను ఆచరించాలి. సన్యాసి భిక్ష చేసి శరీర పోషణ చేసికోవాలని శాస్త్రాలు వచిస్తున్నాయి. అటువంటి యతీశ్వరుడు, తపస్సులో మనస్సును లగ్నం చేసి ఆత్మానుసంధానం చేస్తూ, మధ్యాహ్న సమయానికి ఆకలి బాధను తీర్చుకోవడానికై భిక్షకు బయలుదేరతాడు. అంతవరకు ఆహారాన్ని గూర్చి ఆలోచించడు. తిరిగి రాత్రివేళ భోజనం గూర్చి ఆలోచించడు. ఏకభుక్తమే వారికి చెప్పబడినది. అట్టి మహాత్ములు భిక్షకర్హులై ఉన్నారు. వారి క్షుద్బాధను తీర్చటం గృహస్థుకు పరమధర్మమై ఉంది.

96. బ్రహ్మచారి, సన్న్యాసియే కాక వానప్రస్థాశ్రమవాసి కూడా గృహస్థుని ఆశ్రయించే జీవిస్తున్నాడు. గృహస్థు దానం చేసే అన్నాన్ని భుజిస్తూ, వనాలలో ఉండి తపస్సు చేసుకొంటూ, శరీరాన్ని పోషించుకొంటున్నాడు. వారి తపఃఫలంలో అర్ధభాగం గృహస్థుకు చెందుతున్నదని శ్రుతివాక్యం. కనుక గృహస్థు స్వయంగా తపమాచరించకపోయినా తపోధనులకు అన్నదానం చేయటం వలన ముక్తుడవుతున్నాడు.

97. గృహస్థు భార్యాపిల్లలతో సంసారభారం వహిస్తూన్నా భక్తిశ్రద్ధలతో పరమహంసలను, బ్రహ్మచారులను సేవించటంవలన వారికన్నా పుణ్యమధి కంగా సంపాదించుకొంటున్నాడు. అదీగాక నిరంతరం సాధుసాంగత్యంలో ఉండడంచేత విజ్ఞాన సంపన్నుడు కూడా అవుతున్నాడు. యతీశ్వరులు అనేక కష్టాల కోర్చి, తీర్థయాత్రలు చేస్తూ, కఠోరమైన నిష్ఠానియమాల నాచరిస్తూ ముక్తులవుతున్నారు. కానీ గృహస్థు ఇంటి వద్దనే ఉండి అన్నదానం మొదలైన సులభమార్గాల ద్వారా పుణ్యాన్ని సంపాదించుకొంటున్నాడు. అయినా ముక్తిని కోరేవారు తత్త్వవిచారణచే ఆత్మశుద్ధిని పొంది, ఇంద్రియాలను జయించాలి. ముక్తి జ్ఞానం వలనే సాధ్యపడుతుంది.

98. ధనవంతుడైన గృహస్థుని ధనాన్ని అనేకమంది అనేక విధాలుగా పొందుతున్నారు. కొందరు గృహస్థుని స్తుతించి వాని నుండి ధనాన్ని పొందు తున్నారు. మరికొందరు వాని ధనాన్ని అపహరిస్తారు. కొందరు బలాత్కారంగా గ్రహిస్తారు. మరికొందరు దాన రూపంలో పొందుతారు. ఏమైనా, ధనవంతుడైన గృహస్థు ధన్యాత్ముడనే చెప్పవచ్చు.

99. విప్రోత్తములు కొందరు వేదాధ్యయనం చేస్తున్నారు. మరికొందరు ఉపనిషత్తులవంటి వేదాంత గ్రంథాలను పఠిస్తూ పవిత్రులవుతున్నారు. అట్టివారి హృదయ పద్మాలు సర్వదేవతలకు నివాస స్థానాలు. అటువంటి వేదాత్ములను, పవిత్రాత్ములను సంతృప్తిపరచిన గృహస్థు సకలదేవతలను సంతోషపెట్టినవాడవుతున్నాడు. అందువలననే అతిథి సత్కారమే గృహస్థునకు పరమధర్మమని శ్రుతి వచిస్తున్నది.

100,101. ఆత్మజ్ఞానసంపన్నులు, జితేంద్రియులు సర్వతీర్థాలను సేవించేవారు, ధ్యానతపోనిధులు, పరోపకారపరాయణులైన మహాత్ములెందరో గృహస్థుని ఇంటికి వస్తూంటారు. బహుజన్మల పుణ్యఫలం లేకుంటే వారి సందర్శనభాగ్యం లభ్యమవుతుందా? ఆ విధంగా గృహస్థు తీర్థయాత్రలు చేయకపోయినా, అంతకన్నా అధికఫలితాన్ని పొందుతున్నాడు. కాబట్టి గృహస్థునకు గృహమే పుణ్యతీర్థమని శాస్త్రాలు వచిస్తున్నవి. ఉదారుడైన గృహస్థు తన ఇంట్లో ఉంటూనే సర్వమూ పొందుతూ, ధన్యాత్ముడవుతున్నాడు.

102. గృహస్థు మానవులకేకాక సకల ప్రాణుల జీవనానికీ ఆధార భూతుడవుతున్నాడు. మూషికాల వంటి జీవులు ఇంటి లోపలే ఉండి జీవిస్తూన్నవి. గోవు మొదలైన జంతువులు గృహానికి బయట ఉంటూ గృహస్థుపై ఆధారపడి జీవిస్తున్నవి. ఆ విధంగా గృహస్థాశ్రమం సర్వశ్రేష్ఠమని తలస్తున్నాను.

103. 'శరీరమాద్యంఖలు ధర్మసాధనం' అని పెద్దలమాట. అంటే చతుర్విధాలైన పురుషార్థాలను సాధించాలంటే శరీరమే ముఖ్య సాధనం. దేహం లేకుండా ఏమీ సాధించలేరు. అటువంటి దేహం అన్నం చేతనే నిలబడి ఉంటున్నది. 'అన్నం సర్వాధార' మని ఛాందోగ్యోపనిషత్తులో శ్వేత కేతువు వృత్తాంతం తెలియజేస్తున్నది. అటువంటి అన్నం గృహస్థుల చేతులలో ఉన్నది. వృక్షాన్ని ఆశ్రయించి పండ్లు ఉన్న విధంగా, గృహస్థు నాశ్రయించి అన్నం ఉంటున్నది. కాబట్టి అతిథులను ఆదరించడం గృహస్థునకు పరమధర్మమై ఉన్నది.

104. ఓ గృహస్థులారా! ఆకలితో ఇంటికి వచ్చిన అతిథిని ఆద రించండి. పూజించండి. ఇదే మీకు పరమధర్మం. అందువలన మీరే కాదు, మీ వంశమంతా తరిస్తున్నది. అతిథిని ఆదరింపక ఆకలితో పంపితే కలిగే గతులు కఠోపనిషత్తులో యమధర్మరాజు మాటలలో స్పష్టం చేయబడినవి. అతిథి సర్వదేవతాస్వరూపియని తెలుసుకోండి.

105. గృహస్థులారా! వేదంలో ప్రతిపాదించిన కర్మలను ఫలాపేక్ష లేకుండా, పరమేశ్వరార్పణ భావంతో చేయండి. దానివలన అంతఃకరణం శుద్ధిచెందుతుంది. ఆత్మశుద్ధియైతే ఆత్మజ్ఞానం సిద్ధిస్తుంది. ఆత్మజ్ఞానం వలన పరమానందప్రాప్తి కలుగుతుంది. అంతేగాక యతీశ్వరుని చూసి 'వీడు బిచ్చగా'డని తలచవద్దు. దైవానుగ్రహం వలననే ఈ మహాత్ముడు మన గృహానికి వచ్చినాడని తలచాలి. ఈ విధంగా గృహస్థులు, యతీశ్వరులు పరస్పర హితం కోరుకొనేవారై మెలగాలి. గృహస్థులు నిరహంకారులై, ఉపకారబుద్ధి కలిగి, స్వధర్మాల నాచరించేవాడైతే క్రమంగా ముక్తి పొందు తారు.

106. గృహవరులారా! 'మేం సంసార కూపంలో పడి మలినమైనా'మని చింతించవద్దు. మీరు మగువల గాఢాలింగనాల చేత, ప్రేయసి ప్రియ సంభాషణలయందు, యువతుల స్తనతటాలందు పటంలా ఉండే వక్షస్థలంతో భాసిల్లుతూ పాపపంకిలాంతఃకరుణులైనా, సర్వదా కామవశులై విషయాభి లాషులై ఉన్నా, విచారించకండి. శ్రీ శంకరుల పాదపద్మాలను భక్తితో సేవిస్తే పవిత్రులవుతారు. అన్నివిధాలైన పాపాల నుండీ విముక్తి పొందు తారు. వారు ధన్యాత్ములై శివస్వరూపులవుతున్నారు."

107. శ్రీ పద్మపాదుడు బంధుజనులతో అనేక విషయాలపై చర్చిస్తూ, తన మేనమామ ఇంటనే భిక్ష తీసికొన్నాడు. మేనమామ వేదవిదుడు, పండితుడు. మేనల్లుని చేతిలోని పుస్తకం చూసి, ఆ గ్రంథమేమిటని అడిగాడు.

108. అంతట శ్రీ పద్మపాదుడు "ఇది శ్రీ శంకరుల భాష్యగ్రంథానికి టీకాగ్రంథ" మని తెలిపాడు. అతని మేనమామ ఆ గ్రంథాన్ని అడిగి తీసికొని, ఆసాంతం చదివి తన మేనల్లుని ప్రజ్ఞాపాటవాలకు ఎంతో సంతోషించాడు. కానీ కొంత దుఃఖం కూడా పొందాడు.

109. పద్మపాదుని మామ కూడా మహావిద్వాంసుడే. మీమాంసా శాస్త్రం క్షుణ్ణంగా చదివినవాడు. పద్మపాదుని గ్రంథమంతా వేదాంత సిద్ధాంతాలతో నిండి ఉంది. ఆ మహాభాష్య గ్రంథటీక అంతా ఖండన మండన పూర్వకమై ఉన్నది. మేనల్లుని ప్రజ్ఞావిశేషాలు, విచిత్ర రచనాశైలి చూసి విస్మయం చెందాడు. అంతేగాక ఆ గ్రంథం ప్రభాకరుడు ప్రభృత మీమాంసకులను, వివిధ మతాల వారిని తీవ్రంగా ఖండిస్తూ, కేవల అద్వైతతత్త్వాన్ని నిర్ద్వంద్వంగా ప్రతిపాదించింది. గ్రంథరచనా నిర్మాణశైలికి సంతసించినా, ప్రభాకరాది పండితులను ఖండించటంచే ఎంతో దుఃఖించాడు.

110. పద్మపాదుని మేనమామ ప్రభాకరునికి ప్రియశిష్యుడు. మీమాంసక మతంలో భట్టమతమనీ, ప్రాభాకరమతమనీ రెండు రకాలైన మతాలున్నవి. శ్రీ పద్మపాదుని గ్రంథంలో రెండు మతాలను తీవ్రంగా ఖండించటం చేత ఆతని మేనమామ ఎంతో కుపితుడయ్యాడు. అయినా మేనల్లుని ముందు

తన మనస్సులోని భయాందోళనలను బయటకు వ్యక్తం చేయక, పైకి మాత్రం ఆ గ్రంథాన్ని ఎంతో ప్రశంసించాడు.

111-112. **పద్మపాదుడు:** పండితవరేణ్యా! మామా! ఇక్కడ నుండి సేతువునకు పోయి పరమేశ్వరుని దర్శించివస్తాను. కనుక తామీ గ్రంథాన్ని తమ ఇంటనే భద్రపరచండి. నేను తిరుగు ప్రయాణంలో తీసుకొంటాను. ఈ గ్రంథం నాకు ప్రాణప్రదం. గృహస్థులకు తమ సిరిసంపదలపై ప్రీతి ఉండేట్లుగా, నాకు ఈ వేదాంత గ్రంథం అంతకన్నా ప్రియమైనది. కాబట్టి తమరు నా పట్ల దయ ఉంచి, నేను తిరిగివచ్చే వరకు మీ వద్దనే భద్రంగా ఉంచండి.

పద్మపాదు డీవిధంగా పలికి మేనమామకు ఆ గ్రంథం ఇచ్చి శిష్యులతో కలసి సేతువును దర్శింప బయలుదేరాడు. బయలుదేరే సమయంలో పద్మపాదుడు కొన్ని దుశ్శకునాలను చూశాడు.

113. శ్రీ పద్మపాదుని ఎడమకన్ను అదిరింది. ఎడమ చెయ్యి, తొడ కొట్టుకొన్నాయి. ఇంతలో ఎదురుగా వచ్చినవాడు తుమ్మాడు. అయినా యతీశ్వరుడవటం చేత, ధైర్యశాలి కావడం చేత వాటిని దుశ్శకునాలుగా పరిగణించక ముందుకు సాగాడు.

114. శ్రీ పద్మపాదుడు సేతు దర్శనానికి ప్రయాణం కాగా, ఆతడి మేనమామ తల దురాలోచనలతో నిండిపోయింది. "ఈతని టీకా గ్రంథం ప్రజల్లోకి పోతే తన గురుదేవులైన ప్రభాకరుని మతం నిస్సంశయంగా నాశనం అవుతుంది. ఆ విధంగా గురుద్రోహం చేసిన వాడనవుతాను. శ్రీ శంకరుల అద్వైతతత్త్వాన్ని అడ్డుకొనే శక్తి మరెవ్వరికీ లేదు. కనుక ఈ పద్మపాదుని గ్రంథాన్ని అగ్నికాహుతి చేయటం ఒక్కటే మార్గమని అప్పుడే ప్రభాకరుని మతం నిరాటంకంగా వృద్ధి చెందుతుంది" అని తలచాడు.

115. "ఈ గ్రంథాన్ని భస్మం చేయడమే సరియైన మార్గం. గ్రంథంతో బాటు ఇంటిని కూడా దహించివేస్తే ఎవరికీ, ఏ విధమైన అనుమానమూ కలుగదు. ఇంటితోపాటు ఇంట్లోని గ్రంథం కూడా అగ్నికాహుతి అయిందని భావిస్తారు. అలాగాక యీ గ్రంథాన్ని దహనం చేయకపోతే గురువు గారి

మతం సత్వరమే నశించిపోతుంది. గురువు మతం నాశనమవడం కంటే, తన స్వగృహం దహనమొనరించుకోవడమే శ్రేయోదాయకం" అని తలచి స్వగృహానికి నిప్పంటించి పెద్దగా కేకలు పెట్టి ఏడవసాగాడు.

116. శ్రీ పద్మపాదుల మేనమామ కథ బహుళంగా ప్రచారంలో ఉంది. అలా విన్న కథనే యీ గ్రంథ రచయిత శ్రీ మాధవాచార్యులవారు మనకు నివేదిస్తున్నారు. ఇది వారి కల్పితం కాదు. ఈ కథను యథాతథంగా పాఠకుల ముందుంచటంలో తన దోషమేమీ లేదని గ్రంథకర్త మనవి చేస్తున్నాడు. [ఇతరుల పాపాలను బహిర్గతం చేయనివాడు పాపం చేసిన వానికన్నా రెండింతలు అధికంగా పాపం పొందుతాడు.]

117, 118. శ్రీ పద్మపాదుడు శిష్యులతో కలసి సేతు సందర్శనార్థమై బయలుదేరి మార్గమధ్యంలోని వివిధ క్షేత్రాలను, దేవాలయాలను దర్శించుకొంటూ మహానందభరితుడయ్యాడు. ఒక రోజు మహామహిమా సంపన్నుడైన శ్రీఫుల్ల మహర్షి ఆశ్రమాన్ని సందర్శించాడు. పూర్వం శ్రీరాముడు సీతాన్వేషణలో తన ధనుర్బాణాల నొక రావిచెట్టు మొదట ఉంచాడు. ప్రక్కనే దర్భలు పరచుకొని విశ్రమించాడు. అందువలననే ఈ క్షేత్రం "దర్భశయన"మని ఖ్యాతిగాంచింది.

అక్కడ కూర్చుని, ఈ మహాసాగరాన్ని దాటి లంకానగరం చేరడానికి మార్గం తెలియక చింతించసాగాడు. అదీగాక తన వద్దనున్న వానర సైన్యాలంతా చెట్టుచేమలపై సంచరించగలవేగాని, నీటిలో ఈదే సామర్థ్యం లేనివి గదా అని చింతాక్రాంతుడయ్యాడు.

119,120. శ్రీరామచంద్రుడు ఆ విధంగా చింతిస్తూండగా దూరంగా దట్టమైన పొగలు కమ్ముకొని, క్రమంగా సర్వాన్ని ఆక్రమిస్తూ ఒక తేజస్సు కానవచ్చింది. ఒక దివ్యతేజోరాశి వచ్చి శ్రీరాముని ముందు వచ్చి నిలువగా, వానర సైన్యమంతా ఒక్కసారిగా లేచి నిలబడింది. అట్టి సమయంలో ఆ కాంతి సముదాయం నుండి ఒక దివ్యమైన మానవాకారం కనిపించింది.

121. ఆ దివ్యతేజస్సునుండి మహామహితాత్ముడైన శ్రీ అగస్త్య మహర్షి తన సతీమణియైన లోపాముద్రతో సహా దర్శనమిచ్చారు. వారి సందర్శన భాగ్యం చేత ఎల్లరూ సంభ్రమాశ్చర్య చకితులయ్యారు.

122. శ్రీరాముడా మునిదంపతులను దర్శించగానే ఆయన మనస్సు లోని దుఃఖాలన్నీ పటాపంచలైపోయాయి. మహానందం పొందాడు. తనకేదైనా ఉపాయం చెప్పగల సమర్థుడు ఎదురయ్యాడని ఎంతో సంతోషపడ్డాడు. సూర్యభగవానుడు గాఢాంధకారాన్ని పటాపంచలు చేసేట్లు ఈ మహాపురు షుని సందర్శనం చేత నా దుఃఖాలన్నీ నిశ్శేషంగా నశించబోతున్నవను కొన్నాడు.

123. పార్వతీ పరమేశ్వరులను పోలిన ఆ లోపాముద్రా, అగస్త్య మునులను అర్ఘ్యపాద్యాదులతో సత్కరించి వారి పాదపద్మాలమీద శిరస్సు నుంచి సాష్టాంగంగా ప్రణమిల్లాడు. సముచితసేవలు చేస్తూ, తన మనస్సులోని బాధను ఈ విధంగా వ్యక్తం చేశాడు.

124. **శ్రీరామచంద్రుడు:** మహాత్మా! మిమ్మల్ని ఇక్కడ చూడగానే నా తల్లితండ్రులను చూసినంత ఆనందం కలుగుతున్నది. కార్యార్థినై ఉన్న, దుఃఖసముద్రంలో మునిగి ఉన్న సమయంలో తమ దర్శన భాగ్యం కలిగింది. నా దుఃఖాలన్నీ నశించి, నా మనోరథం నెరవేరుతుందని ఆశిస్తున్నాను. నా వృత్తాంతం తాము ఎరుగనిది కాదు. అయినా విన్నవించుకొంటాను. నేను సూర్యవంశపు రాజుల వంశంలో జన్మించాను.

125. మునివర్యా! మహానుభావా! అట్టి ఘనచరిత్ర కలిగినట్టి ఆ సూర్యవంశంలో నా లాంటి దుఃఖజీవి ఇంతవరకు జన్మించలేదు. ఇకముందు కూడా జన్మింపబోరు. మొట్టమొదటగా నేను రాజ్యభ్రష్టుడనైనాను. నా భార్యయైన సీతాదేవి, నా సోదరుడు లక్ష్మణునితో ఈ అడవులలో కందమూలాలను తింటూ, నారబట్టలు ధరించి మహర్షుల సాహచర్యంలో జీవిస్తున్నాం. ఇక్కడ మారీచుడనే మాయావి ఒకడు మాయామృగరూపంలో వచ్చి నన్ను వంచించాడు.

126. అంతేగాక ఆ మాయామృగమైన బంగారు లేడిని వెంబడించాను. నేను లేని సమయంలో మాయావి, క్రూరుడు అయిన రావణాసురుడు కపటసన్యాసి వేషంలో వచ్చి నా భార్య నపహరించుకొనిపోయాడు. ఇప్పుడామె లంకాపట్టణంలో అశోకవనాన నాకై శోకిస్తున్నది. చూశారా నా దుఃఖపరంపరలు; రాజ్యభ్రష్టత్వం, అరణ్యవాసం, భార్యావియోగం మున్నగు కష్టాలను సూర్యవంశరాజులు ముందెన్నడూ పొంది ఉండలేదు. అందరిలోకి నేనే దురదృష్టవంతుడను.

127. ఓ మహనీయాత్మా! నేను మహాపరాక్రమశాలురైన వానర సేనను వెంటబెట్టుకొని వచ్చాను. నా బలపరాక్రమాలతో, దుష్టుడైన ఆ రావణాసురుని వధించి నా సీతాదేవిని తిరిగి పొందదలచివచ్చాను. మాకు అడ్డుగా ఈ సముద్రం నిలచి ఉంది. నా వానర సేన ఈ సముద్రాన్ని ఎలా దాటగలదు? తాము కరుణామూర్తులు. ఇతరులకు ఉపాయం చెప్పగల సమర్థులు. తమనే దైవంగా భావిస్తున్నాను. తమరే నాకు శరణ్యం.

128. దయాసాగరుడైన ఆ ముని, శ్రీరాముని శోకాలాపనను విని యిలా పలికాడు:

**అగస్త్య ముని:** వత్సా! శ్రీరామా! శోకింపకు. దుఃఖానికి వశుడవు కావద్దు. సకల ప్రాణులకు కష్టాలు సహజం. సూర్యచంద్ర వంశరాజులలో పూర్వం కూడా కష్టాలనుభవించి వాటి నధిగమించి తిరిగి సుఖపడిన వారు అనేకులున్నారు. చంద్రవంశజుడైన నలమహారాజు కథ నీకు తెలుసు గదా! ఆతడు కూడా భార్యా వియోగానికి లోనై తిరిగి ధర్మపత్నిని పొంది రాజ్యపాలనచేసి సుఖించాడు.

129. ఓ రామా! నువ్వు ధనుర్విద్యలో సాటిలేనివాడవు. నీ తమ్ముడు కూడా మహాపరాక్రమశాలి. నీవు అండగా నిలచిన కపిశ్రేష్ఠులు కూడా మహాబలశాలురు. అటువంటి పురుషోత్తముడవైన నీ నోట దీనోక్తులు పలుకరాదు.

130. రఘువంశ తిలకమా! పరాక్రమశాలీ! మీకు దైవానుగ్రహం పూర్తిగా ఉన్నది. కార్యోన్ముఖులైన వారికి ఒక్కొక్కప్పుడు చిన్న విషయాలే పెద్దవిగా తోచి, ఆలోచింపనీయవు. అటువంటి సమయంలో హితం చెప్పడానికి నేను సంసిద్ధుడను. నీ శక్తి సామర్థ్యాల ముందు ఈ సముద్రం ఒక పంటకాలువ వంటిది. నీకు అడ్డుగా నిలువబోదు.

131. రామచంద్రా! సముద్ర జలాన్ని పెద్దదిగా లెక్కలోనికి తీసుకొనవద్దు. నేను ఇంతకు పూర్వం సముద్ర జలాన్నంతా ఆచమనం చేసినవాడను. మరల ఒక్కచుక్క కూడా మిగలకుండా మొత్తం సముద్రాలలోని జలాన్నంతా ఆచమనం చేయగలను. కానీ అది నీకు కీర్తిని తెచ్చిపెట్టదు. అందువలన నేనా కార్యానికి పూనుకోవడం లేదు. కనుక నీవే ఈ సముద్రంపై వారధి నిర్మించు.

132. ఓ రామా! ఈ సముద్రంపై సేతువు నిర్మించు. సమస్త వానర సేనలు నీకు తోడై ఉంటారు. దానిపై లంకలో ప్రవేశించి లోకకంటకుడైన ఆ దశకంఠుని పరిమార్చు. నీ కీర్తి సూర్యచంద్రులున్నంతవరకు శాశ్వతంగా ఉంటుంది.

133. ఈ విధంగా మహామహిమాన్వితుడైన అగస్త్యముని హితం పలుకగా, శ్రీరామచంద్రుడు సముద్రంపై సేతువు నిర్మించి, రావణాసురుని సంహరించి, సీతాదేవిని గ్రహించి, పట్టాభిషక్తుడై చాలాకాలం రాజ్యపాలన చేశాడు.

134,135. శ్రీరామచంద్రులచే నిర్మించబడిన సేతుతీర్థమందు శ్రీ పద్మపాదుడు తన శిష్యులతో స్నానమాచరించి శ్రీ రామేశ్వరస్వామిని సేవించుకొన్నాడు.

అంతట ఒక పండితుడు. 'రామేశ' అనే పదానికి సమాసవృత్తిని వివరించమని కోరగా శ్రీ పద్మపాదుడు మూడు విధాలుగా తెలిపాడు.

136. శ్రీరామచంద్రుడు తన ప్రభువైన మహేశ్వరుని ధ్యానించి పరమశివుని ప్రతిష్ఠించటం చేత:

i. రామస్య ఈశ్వరః = అంటే రామునకు ప్రభువు - రక్షకుడు, తత్పురుష సమాసం.

ii. రామః ఈశ్వరః యస్యసః = రాముడు పరమేశ్వరుడుగా గలది; రామేశ్వరులచే వెలయునది. బహువ్రీహి సమాసం.

iii. రామాశ్చాసౌ ఈశ్వరశ్చేతి = రామరూపంలో ఉన్న పరమశివుడనే కర్మధారయ సమాసం.

వారి వారి ఉపాసనల ననుసరించి మనోజ్ఞంగా రామేశ్వర పదసమాసాన్ని మూడు విధాలుగా శ్రీపద్మపాదుడు తెలిపాడు.

137. సేతు తీర్థమందు శ్రీ పద్మపాదులు చేసిన మహోపన్యాసాలు విన్న పండిత పామరులందరూ పరమానందం పొందారు. పండిత జనులందరూ ప్రశ్నల రూపాన తమ సందేహాలన్నింటినీ నివృత్తి చేసుకొన్నారు. పండితులందరూ పద్మపాదుల ప్రజ్ఞావిశేషాలకు విస్మయం చెందారు. శ్రీ పద్మపాదుడు శిష్యులతో కలసి కొంతకాలం ఆ సేతుతీర్థంలో నివసించాడు.

138,139. తరువాత పద్మపాదుడు కొంతకాలం సేతుతీర్థాన ఉండి, అక్కడ నుండి తీర్థయాత్రలు చేస్తూ తన గ్రంథాన్ని గ్రహించడానికి మేనమామ ఇంటికి వచ్చాడు. అక్కడకు చేరగానే మేనమామ ఇల్లు అగ్నికి ఆహుతి అయినదనీ, అట్లే తన గ్రంథం కూడా కాలిపోయిందనీ తెలుసుకొని ఎంతో శ్రమపడి వ్రాసిన గ్రంథం అగ్నికాహుతయిందని తెలుసుకొని క్షణకాలం చింతించాడు. అయినా మరల ఊహించి తిరిగి వ్రాస్తానని తలచి తన్ను తానే ఊరడించుకొన్నాడు. యథార్థంగా అతడు మేనమామ ఇల్లు కాలిపోయినందుకే ఎక్కువగా బాధపడ్డాడు.

140. పద్మపాదుని మేనమామ ఇలా అన్నాడు: వత్సా! నన్ను నమ్మి నీవు వ్రాసిన గ్రంథం నా వద్ద ఉంచి వెళ్ళావు. ఆ గ్రంథం వ్రాయడానికి నీ వెంత కష్టపడివుంటావో నేనూహించగలను. నా ఇల్లు దగ్ధమైపోయినా నేను చింతించటం లేదు. వెలకట్టలేని ఆ వేదాంత గ్రంథాన్ని నష్టపోయామనే నా మనస్సు అమిత వేదనపడుచున్నది.

141. **పద్మపాదుడిలా పలికాడు:** మామా! నాకై మీరు శోకింపవలదు. దైవమలా తలచినప్పుడు, మానవమాత్రులమైన మనమేమి చేయగలం. కావలసినది కాకమానదు. నేను వ్రాసిన గ్రంథం మాత్రమే దగ్ధమైనది కాని, నా బుద్ధి స్థిరంగా ఉన్నది. అందువలన మరల కష్టపడి వ్రాసి కొంటాను. గృహదహనంచేత నీవు పొందిన నష్టం పూడ్చలేనిది కదా అని చింతిస్తున్నాను. మరల టీకాగ్రంథాన్ని వ్రాయడానికి ప్రారంభిస్తాను.

142. దుర్మతియైన ఆ మేనమామ తన మేనల్లుడు కుశాగ్రబుద్ధి అవడంచే అసూయ చెందినవాడయ్యాడు. మరల ఇంతకన్నా తీవ్రమైన గ్రంథం వ్రాయగల సమర్థుడని ఎంచాడు. కనుక ఈతణ్ణి ఏ విధంగానైనా తుదముట్టిస్తేగాని తన మనోరథం నెరవేరదని తలచాడు. అందువలన అన్నంలో విషపదార్థం చేర్చి పద్మపాదునకు పెట్టాడు. ఆ కారణాన, పద్మపాదునిబుద్ధి మందగించినది. పూర్వంలా విస్పష్టంగాను, నిశితంగాను, ప్రజ్ఞావిశేషంతోను వ్రాయజాలకపోయాడు.

(పాఠకులారా! ఈ కథనమంతా ఇతరులు చెప్పగా విని వ్రాశాను. వివరం 116వ శ్లోకంలో చూడండి)

143. పద్మపాదుడు తన మేనమామ ఇంటనే ఉండి మరల భాష్యానికి టీకాగ్రంథం వ్రాస్తుండగా, శ్రీ శంకరుల శిష్యులలో కొందరు (సన్న్యాసులు కారు) తీర్థయాత్రలు చేస్తూ పద్మపాదుడుండే చోటునందు కలిసికొన్నారు.

144. పద్మపాదుణ్ణి చూడగానే వారు ఆనందంతో సాష్టాంగ నమస్కారం చేశారు. ఎంతో ఆదరంతో ఆతని పాదధూళిని శిరస్సున ధరించి తమ గౌరవాన్ని ప్రదర్శించుకొన్నారు.

145,146. చిగురుటాకులకన్న సుకుమారమైన పాదాలు గల వాడు, తన నాశ్రయించినవారిని తేజోమయులను చేసేవాడు, అజ్ఞానాంధకారాన్ని ధ్వంసం చేసేవాడు, అంతఃశత్రువులైన కామక్రోధాదులకు భయంకరుడు అయిన శ్రీ శంకరగురువరేణ్యులను నిరంతరం హృదయంలో ధ్యానిస్తూంటాడు. అట్టి గురుకృపా విశేషం చేత ఆదిశేష, బృహస్పతి, వాల్మీకి ప్రభృత మహాత్ము

లను కూడా జయించే విద్యాసంపత్తి సంప్రాప్తమైనదని శ్రీ పద్మపాదుడు పలికాడు.

ఈ విధంగా పద్మపాదుడు కొత్తగా వచ్చి చేరిన శిష్యులతో ముచ్చటిస్తూండగా, సర్వ తీర్థాలను సేవిస్తూ, వారివద్దకు వచ్చిచేరిన ఒక విప్రుణ్ణి చూశారు. అతడు ఆ సమీప ప్రాంతం నుండి వచ్చి తమ స్వదేశాన్ని గూర్చిన విశేషాలను చెప్పగా తెలిసికొని మిక్కిలి సంతోషించారు.

147-148. ఆ విప్రుని వలన తమ గురువరేణ్యులు కేరళ దేశంలో ఉన్నారని తెలిసికొని, శ్రీ శంకరులను దర్శింప బయలుదేరారు.

శ్రీ శంకరులు తమ మాతృపరలోకక్రియలన్నీ యథావిధిగా నిర్వర్తించారు. ఆకాశానికి ఎగబ్రాకుతున్న అరటి తోటల మధ్య, వేదాంత ప్రచారం ఇసుమంతైనా చేయక నిరంతరం పరబ్రహ్మమందే విహరింపసాగారు.

149. శిష్యుల రాకకోసం ఎదురుచూస్తూ శ్రీ శంకరులు మహాసురపురం లోని విష్ణుదేవాలయంలో బసచేశారు. అక్కడ శ్రీ విష్ణుభగవానుని ఈ విధంగా స్తోత్రం చేశారు.

150. ఓ సర్వలోక ప్రభూ! ఈశ్వరా! నీ సృష్టి బహువిధాలుగా ఉన్నది. బహువిచిత్రంగా ఉన్నది. అందు అనేక నామరూపాలను చేతన, జడస్వరూపాలతో నిండిన ఈ జగత్తును సృష్టించావు. నువ్వు ఈ జగత్తునంతా సంకల్పమాత్రాననే సృష్టిస్తూన్నావు; వృద్ధి చెందిస్తున్నావు; తిరిగి నీలోనే సంలీనం చేసుకొంటున్నావు. ఇదంతా నీ వినోదం కొరకే చేస్తున్నావు. కానీ, ఏ ప్రయోజనమూ ఆశించి చేయటం లేదు. నీవు పూర్ణుడవు; నిస్సంకల్పుడవు; నిస్సంగుడవు. భగవంతుడే సద్వస్తువు. అది సర్వమాయాతీతం; పరిపూర్ణం; అదే పరమగమ్యం.

151. జగదీశా! పరాత్పరా! త్రిమూర్తి స్వరూపా! నీవు రజోగుణాన్ని గ్రహించి బ్రహ్మదేవుడవై సృష్టిస్తున్నావు. సత్త్వగుణాన్ని స్వీకరించి విష్ణుమూర్తివై పరిపాలిస్తున్నావు. తమోగుణాన్ని స్వీకరించి మహేశ్వరుడవై లయింపజేస్తున్నావు. పరమాత్మవై ఈ జగత్తు యొక్క సృష్టి స్థితి లయ కార్యాలను నిర్వర్తిస్తున్నావు. నీవు అద్వితీయ పరబ్రహ్మవు. ఆద్యంతాలు లేనివాడవు.

152. ఓ పరమాత్మా! నీ వీ జగత్తును సృష్టించడమే కాక, ఈ జగత్తునందు ప్రవేశించి అనేక రూపాలు ధరిస్తున్నావు. యథార్థంగా సర్వం నీవే తప్ప రెండవవాడు లేడు. అంతా శివం, చిన్మాత్రం; ఏకం, పరిపూర్ణం, పరాత్పరా! ఉపాధులు ధరించి అనేకంగానూ, ఉపాధియే లేనివాడవై ఒక్కడవుగాను ప్రకాశిస్తున్నావు. అది ఎలాగంటే సూర్యుడు ఒక్కడే అయినా, అనేక ఘటాలలో ప్రతిబింబిస్తూ, ఉపాధులచేత అనేకంగా తెలుస్తున్నాడు. అదేవిధంగా పరమాత్మ కూడా అనేక ఉపాధులలో ప్రవేశించి అనేకంగా తెలుస్తున్నాడు. వాస్తవానికి నీవొక్కడవే. అద్వితీయుడవు.

153. ఈ విధంగా విష్ణుభగవానుని స్తోత్రం చేస్తున్న శ్రీ శంకరులను పద్మపాదుడు మున్నగు శిష్యులందరూ దర్శించి సాష్టాంగ నమస్కారాలు జేశారు.

154. శ్రీ పద్మపాదాది శిష్యులను గాంచిన శ్రీ శంకరులు పరమానంద భరితులై 'మీరందరూ కుశలమే గదా' యని ప్రశ్నించి వారితో కొద్దిసేపు మృదుమధురభాషణం చేశారు. అంతట పద్మపాదుడు శ్రీ శంకర గురువరుని సమీపించి, తన దయనీయగాథనంతా వివరించాడు.

155. మహాత్మా! నేను తీర్థయాత్రలను కొనసాగిస్తూ, మార్గాన శ్రీ రంగనాథస్వామిని దర్శించుకొన్నాను. అక్కడ నా పూర్వాశ్రమ మేనమామను కలుసుకోవడం తటస్థించినది. ఆయన బహుశాస్త్రాలను అధ్యయనం చేసిన మహాపండితుడు. నన్ను ఆదరంగా ఇంటికి తీసుకొనిపోయి ఆదరించి బహు విధాలుగా సత్కరించాడు.

156. గురుదేవా! నా మేనమామ భేదవాది. ప్రభాకర మతప్రచారకుడు. అయినా, పూర్వబంధుత్వవాసనల చేత తమ భాష్యానికి నేను వ్రాసిన టీకాగ్రంథాన్ని ఆయన చేత పఠింపజేశాను. ఆయన భేదవాది అవడం చేత నాతో తీవ్రంగా వాదించాడు. నేనాయన వాదన లన్నింటినీ సమూలంగా ఖండించి ఆయనను జయించాను.

157. మహాత్మా! తమ నుండి గ్రహించిన వేదాంత తత్త్వ ప్రబోధాల బలిమి చేత వైష్ణవులను జయించగలిగాను. అంతేగాక న్యాయ, వైశేషిక

మీమాంసా, సాంఖ్య శాస్త్రాలన్నింటినీ ఖండించగలిగాను. అంతేగాక శైవ, వైష్ణవ, గాణపత్యాది మతాలను, ద్వైతతత్త్వంతో కూడుకొన్నవవడం చేత వాటన్నిటికంటే అతీతమై, ఉపనిషత్సారభూతమైన అద్వైతతత్త్వాన్ని ప్రవచించే తమ జ్ఞానసుధలు అమృతధారలుగా ప్రవహింపజేశాను. మహా విద్వాంసుడైన నా మేనమామను కూడా సునాయాసంగా జయించాను. అక్కడ కేవలం అద్వైతత్త్వమొక్కటే ప్రవహించసాగింది.

158. మహనీయాత్మా! తమ సూక్తి సుధలనే కవచాన్ని ధరించిన వాడవడం చేత ఎటువంటి వారితో వాదానికి దిగినా, పరాజయంలేక విజయుడనైనాను. గౌతమాది మతాలన్నింటినీ ఖండించగలిగినాను. ద్వైతాన్ని నిశ్శేషంగా నాశనమొనరించాను. ఇదంతా గురుకృపే కాని, నా ప్రతాపం కాదు. పరస్పరం ఖడ్గాలతో చేసే ఖడ్గాఖడ్గియనే మహాసంగ్రామం మల్లే, కాణాదుల వైశేషిక దర్శన విషయంలో జరిగిన జటిలవాదమందు వారి ద్వైతవాదాలన్నిటినీ ఖండించి, తాము బోధించిన అద్వైత తత్త్వాన్ని ప్రతిపాదించి విజయుడనైనాను. అదేవిధంగా గౌతమముని శిష్యులతో న్యాయ దర్శనంలో పోరు సంభవించినది. అక్కడా గురుదేవుల అద్వైతసుధాసూక్తులదే పైచే అయింది. వీరుకాక కపిలముని శిష్యులతో సాంఖ్యశాస్త్రంలో వాదించి వారిని జయించాను. ఈ విధంగా కేవల అద్వైతసిద్ధాంతాలను కవచంగా ధరించినవాడ నవడంచేత సురక్షితుడనైనాను. ఈ విధంగా పద్మపాదుడు తన తీర్థయాత్రా విశేషాలను గురువరుల పాదాల వద్ద సమర్పించు కొన్నాడు.

159-161. గురుదేవా! నాచే పరాజితుడైన నా మేనమామ హృదయంలో నాపై ద్వేషం పెంచుకొని, పైకి మాత్రం కపట ప్రేమ నటిస్తూ నన్ను మునుపటి మల్లే గౌరవించసాగాడు. నా వాదనా పటిమను, నా గ్రంథ రచనాచాతుర్యాన్ని పరిపరి విధాలుగా అభినందించాడు. అందువలన నేనాతణ్ణి పూర్తిగా విశ్వసించి, నా భాష్యటీకా గ్రంథాన్ని అతని వద్ద భద్రపరచి సేతు తీర్థాన్ని సేవింపబోయాను. యాత్ర నుండి తిరిగి వచ్చిన తరువాత

జరిగిన అనర్థం తెలుసుకొన్నాను. నా మేనమామ గృహం, నా గ్రంథం కూడా అగ్నికి ఆహుతి అయిపోయాయి. గురువరా! నన్ను మన్నించండి.

తరువాత నా మేనమామచే వంచించబడ్డాననీ, గ్రంథాన్ని నాశనం చేయడానికి గృహంకూడా దహించబడినదనీ జనులు చెప్పుకొంటుండగా విన్నాను. అంతమాత్రమే కాదు నేను తిరిగి ఆ గ్రంథాన్ని వ్రాయడానికి పూను కొన్నాను. నాపై మత్సరం చేత, నేనా గ్రంథాన్ని వ్రాయకుండేట్లు నా మేన మామ నా కిచ్చిన భిక్షాన్నంలో విషం కలిపాడు.

162. ఆ కారణంగా నా రచనాశక్తిని, పూర్వపు గ్రంథజ్ఞాపకాలను మరచిపోయాను. పర్యవసానంగా ఆ టీకాగ్రంథం పూర్తిగా వినష్టమై పోయింది. గురువరేణ్యా! చిన్నతనం నుండి తమ పాదాలనే సేవించు కొంటున్నాను. నా కిట్టి దుర్దశ కలగటం న్యాయమా? నేను తమ పాదాలనే శరణు వేడుకొంటున్నాను. నన్నుద్ధరించండి. తమ పాదమే నాకు శరణ్యం.

163. గురువరేణ్యా! కేవలాద్వైతతత్త్వ ప్రతిపాదకమైన తమ సూత్రభాష్య గ్రంథం సకల సంశయాలను నివారించేదై ఉండగా, నేనా భాష్య గ్రంథా నికి మృదుమధురంగాను, లలితమైన పదాలతోను టీకాగ్రంథం రచించాను. ఇప్పుడా గ్రంథం నశించిపోయినది. మహాత్మా! ఇక నా గతి యేమి?

164,165. మహాత్మా! నా దయనీయస్థితిని ఏమని వర్ణిస్తాను? పూర్వంలా వ్రాయలేకపోతున్నాను. ఎంత ప్రయత్నించినా, చక్కని మాటలు నా బుద్ధికి తోచటం లేదు.

మహాత్మా! తమ పాదపద్మాలే నాకు శరణ్యం. లోకంలో ఎందరో దుఃఖితులను, దీనులను తమ అపారకరుణచేత క్షణంలో పాపరహితులను చేశారు. తమ శరణు పొందిన విద్యాహీనులు విద్యావంతులైనారు; ధన హీనులు ధనవంతులైనారు. ఇలా అనేకులు ఉన్నారు. నాకు లెక్కింప సాధ్యం గాకున్నది. నాకీ దుర్దశ ప్రాప్తించడానికి కారణమేమి? గురుపాదాలను సేవించేవారికి పాపా లెక్కడ నుండి సంప్రాప్తమవుతాయి? పాపాత్ములైతే

గురు సన్నిధియే లభ్యం కాదు గదా? నేను తమ దివ్యపాదారవిందాల కడ శరణాగతుడనవుతున్నాను.

166,167. దీనుడై విలపిస్తున్న పద్మపాదాచార్యుల వారిని శ్రీశంకరులు అనుగ్రహింపదలచారు. అంతట శ్రీ శంకరులు ప్రశాంత అనునయ వాక్యాలతో పద్మపాదుణ్ణి ఊరడించారు.

**శ్రీ శంకరులు:** నాయనా! దైవఘటన నెవ్వరూ అతిక్రమించలేరు. కనుక కర్మలు చేసేటప్పుడే అన్ని జాగ్రత్తలూ తీసుకోవాలి. కర్మఫలం ఎంతో కఠినమైనది. ఎంతటి వారినీ విడువదు. మనం శృంగగిరి యందున్నప్పుడే సురేశ్వరునకు తెలిపాను. కాబట్టి ఎవరూ కర్మ విషయాన్ని తెలుసుకోలేరు. ఇది సత్యం.

168-170. వత్సా! శోకింపకు. ముందు శృంగగిరి యందు నా సమక్షాన 'పంచపాదికా' గ్రంథాన్ని నాకు వినిపించావు. ఆ గ్రంథ మంతా నాకు సంపూర్ణంగా జ్ఞప్తిలోనున్నది. ఇప్పుడు దానిని పలుతాను. నీవు ఆ గ్రంథమంతా శీఘ్రంగా వ్రాసుకో. ఇక నీవు దుఃఖించవలసిన అవసరం లేదు.

శ్రీ శంకరులు, పద్మపాదాచార్య విరచితమైన 'పంచపాదికా' కృతిని, మునపటి మల్లేనే తు.చ. తప్పకుండా ప్రవచించారు. ముల్లోకాలకు ప్రభువై నందువలన పద్మపాదుడు కోరిన వెంటనే ఆ గ్రంథమంతా ప్రవచించారు. సర్వేశ్వరుని అనుగ్రహముంటే మానవుడు సర్వమూ పొందగలడనడానికి ఈ పద్మపాదోపాఖ్యానమే ప్రత్యక్ష నిదర్శనం. శ్రీ శంకరులు సామాన్య మానవమాత్రులు కారు; అప్రతిహత ప్రజ్ఞాశక్తితో కూడిన పరమ పురుషుడు.

శ్రీ శంకరులు వచిస్తూండగా, శ్రీ పద్మపాదుడు అతి శీఘ్రంగా వ్రాసికొన్నాడు. తన మనోరథం నెరవేరినందుకు కన్నుల వెంట ఆనందాశ్రువులు స్రవిస్తూండగా, పాడుతూ నాట్యం చేస్తూ నిరవధికానందాన్ని పొందాడు.

171-172. కేరళ దేశపు రాజైన శ్రీ రాజశేఖరుడు సహజంగా మంచి కవి. తదనంతరం ఆయన శ్రీ శంకరులను సమీపించి వారి పాదపద్మాలకు సాష్టాంగనమస్కారం చేశాడు.

అంతట శ్రీ శంకరులు రాజశేఖర మహారాజు తనను దర్శించడానికి మళ్ళీ రావడంచే ఎంతో సంతోషించినవారై "తాము వ్రాసి నాచే శ్రవణం చేయించిన ఆ మూడు నాటకాలు బహుళజనాదరణ పొందినవా?" అని విచారించారు. అందులకా మహారాజు "మహాత్మా! ఆ మూడు నాటకాలు ప్రమాదవశాన అగ్నికాహుతి అయినవి" అంటూ దీనంగా పలికాడు.

173. శ్రీ శంకరులు ఆ రాజశేఖరుని అనుగ్రహింపదలచారు. తాను ఆ మూడు నాటకాలను మునుపు చదివి ఉండటం చేత, శ్రీ శంకరులు ఆశువుగా ఆ నాటకాలను పఠించగా, శ్రీ రాజశేఖరుడు శీఘ్రంగా వాటిని వ్రాసికొన్నాడు. ఆ విధంగా శ్రీ పద్మపాదునివలెనే శ్రీ రాజశేఖర మహారాజుకు కూడా తిరిగి వారి గ్రంథాలను ప్రసాదించి అనుగ్రహించారు. మహా మహితాత్ములైన శ్రీ శంకరులు భక్తసులభులని జనులు విస్తారంగా కొనియాడారు. శ్రీ శంకరగురుదేవులు అపారదయామయులు.

174. శ్రీ శంకరులు కేరళదేశ మహారాజుతో ఇలా అన్నారు: "రాజసత్తమా! కాలటి గ్రామ అగ్రహారపు బ్రాహ్మణులను శపించాను. వారు పాపాత్ములు; మూర్ఖులు." వారిపై కృప చూపవలదని రాజశేఖర మహారాజును శాసించారు.

175. శ్రీ పద్మపాదాచార్యులు తమ టీకా గ్రంథం తిరిగి గురువర్యుల కృపావిశేషం చేత పొంది మహానందభరితుడయ్యాడు. అట్లే శ్రీ రాజశేఖర ప్రభువు కూడా తమ నాటకాలను తిరిగి పొంది పరమానందభరితుడైనాడు. శ్రీ శంకర భగవత్పాదుల వారికి అనేక విధాలుగా కృతజ్ఞతలు తెలుపుకొని తన పురానికి వెళ్లాడు.



# సర్గము - 15

## సర్వదిగ్విజయాలు

1, 2. సుధన్వ మహారాజు సర్వరక్షకుడై వెంటరాగా, శ్రీ శంకరులు తమ శిష్యగణంతో కలసి ముందుగా శ్రీరామసేతు దర్శనానికి బయలు దేరారు.

రామేశ్వర క్షేత్రంలో శ్రీ శంకరులు శాక్తేయులతో వాదనకు దిగారు. వారందరూ ఆ దేవికి మద్యం నైవేద్యంగా సమర్పించి, వారునూ ఆ మద్యాన్నే ప్రసాదంగా స్వీకరిస్తున్నారు. ఆ శాక్తేయులందరూ వారి శక్తియుక్తు లన్నీ ప్రదర్శిస్తూ, శ్రీ శంకరులతో వాదానికి దిగారు. ఆ వాదం పెరిగి మహావాదమై చూసే వారందరికీ ఆశ్చర్యం కలిగించింది.

3,4. వామాచారులైన కొందరు శాక్తేయులు బ్రాహ్మణ జాతినుండి బహిష్కృతులయ్యారు. ఆర్య మార్గాన్ని పూర్తిగా వదలి అనాచారులైన శాక్తేయు లందరూ శంకరుల వాక్ప్రవాహం ముందు నిలువలేకపోయారు. నిరుత్తరులైన శాక్తేయులందరూ శ్రీ శంకరులకు శిష్యులై అద్వైతాన్ని స్వీకరించారు. తరువాత శ్రీ శంకరులు సేతు సందర్శనం చేసుకొని తమ తీర్థయాత్రను కొనసాగించారు.

శ్రీ శంకరులు రామనాథస్వామిని సేవించి అర్చించారు. అచ్చటనుండి పాండ్య, చోళ, ద్రవిడ దేశాలు సందర్శిస్తూ అన్ని దేశాలందూ ద్వైతవాదుల మదమణిచి స్వమతాన్ని స్థాపించారు. తరువాత శివకేశవ క్షేత్రమైన కాంచీ నగరమునకు చేరుకొన్నారు.

5. శ్రీ శంకరులా కాంచీపురంలో నెల రోజులు నివసించారు. నానా విధ మతస్థులను, తంత్రజ్ఞులను జయించి వారి నెల్లరను శిష్యులుగా చేసుకొన్నారు.

అట్టి కాంచీపురంలో శ్రీ దేవీదేవాలయాన్ని అద్భుతంగా నిర్మింప జేశారు. ఆ దేవాలయంలో శ్రీ కామాక్షీదేవికి వేద సమ్మతంగా సకల సపర్యలుచేశారు.

ఆ మహాపవిత్ర కాంచీపురమందే భూలింగ స్వరూపుడై తుంబరేశ్వరుడనే ప్రఖ్యాతనామంతో వెలయు మహేశ్వరుని ప్రతిష్ఠించి శివకాంచీ పట్టణాన్ని నిర్మించారు.

అంతకు పూర్వమే ఆ పట్టణంలో విష్ణువైన వరదరాజస్వామి వెలసి విష్ణు కాంచిగా ప్రసిద్ధి గాంచినది.

ఆ శివకేశవులకు సపర్యలు చేయడానికి భక్తులను నియమించి వారికి సకల వేదాంత తాత్పర్యాలను బోధించి ఆత్మజ్ఞాన సంపన్నులుగా జేశారు.

తామ్రపర్ణి నదీతీరాన ఉండే ఆయా ప్రాంతాల నుండి పండితులు వచ్చి శ్రీ శంకరులను దర్శించసాగారు. "స్వామీ! దేహేంద్రియాది భేదం ప్రత్యక్షంగా తెలుస్తున్నది. కనుక పరలోకాన వారి వారి కర్మ విశేషాల ననుసరించీ, దేవతా ఉపాసనల ననుసరించీ ఆయా పుణ్యలోకాలు ప్రాప్తిస్తా యని తెలుస్తున్నది. దీనిని బట్టి భేదమనేది ఈ లోకంలో, పరలోకంలో కూడా ఉన్నదని స్పష్టమవుతున్నది" అని నివేదించుకొన్నారు.

**శ్రీ శంకరులు:** బ్రాహ్మణులారా! మీరు పరమార్థతత్త్వం తెలియక మాట్లాడుతున్నారు. ముక్తిని పొందిన ఆత్మ (జీవుడు) పరమాత్మయే అవుతున్నాడు. ఇక ఎవరు, దేనిని చూస్తారు. అలా చూడడానికి రెండవ పదార్థం కావాలి గదా! అంటే ద్రష్టృ, దృశ్యాది భావం లేకుండటంచే అఖండ బ్రహ్మమై సర్వాత్మభావనలో ఉంటుంది. తత్త్వజ్ఞానం చేత సర్వపాపాలు నశించి ముక్తి దశ పొందగా, భేదం ఉండదు.

జగత్తును సృష్టించి, ఆ జగత్తునందు తానే ప్రవేశించినాడు; జీవాత్మ రూపంలో ప్రవేశించి నామరూపాలను ధరించాడు. జగత్కర్తయైన పరబ్రహ్మయే జీవరూపంలో జగత్తులో ప్రవేశించాడని స్పష్టమవుతున్నది. అంటే సకల ప్రాణకోటి పరబ్రహ్మమే అయి ఉన్నది.

అట్లే దేవత లెందరనే ప్రశ్న ఉదయిస్తుంది. దేవతలు కూడా అనేక నామరూపాలతోకూడి ఉన్నారు. వారందరూ పరబ్రహ్మమందు లయించడంవల్ల పరబ్రహ్మ మొక్కడే అని నిర్ణయించారు.

భోగ్యంగాను, భోక్తగానుండు సర్వ ప్రపంచం పరబ్రహ్మమందే లయించి పరబ్రహ్మ మయమవుతున్నది. తత్త్వజ్ఞానం తెలిసిన వారికి భేదమనేది లేదు. అంతా పరబ్రహ్మమే అన్న, అఖండ ఆత్మానుభవం పొందటం చేతనే ముక్తులవుతున్నారు.

కనుక ముముక్షువులు పరబ్రహ్మాన్ని ఉపాసించాలి. మీరు కూడా దేవతా భేదభావాన్ని విడచి కేవల శుద్ధాద్వైత పరబ్రహ్మాన్ని ఉపాసించండి. ముక్తులవుతారు.

శ్రీ శంకరుల ఆత్మోపదేశంచేత తామ్రపర్ణీ తీరదేశ వాసులెల్లరూ పరిశుద్ధాత్ములైనారు. శ్రీ శంకరులకు శిష్యులై బ్రహ్మవిద్య నాశ్రయించారు.

6. అంతట శ్రీ శంకరులు ఆంధ్రదేశంలో ప్రవేశించారు. ఆంధ్రులెల్లరూ పరమభక్తితో వచ్చి శ్రీ శంకరులను సేవించారు. వారందరికీ పరమ దయతో జ్ఞానోపదేశం చేసి అనుగ్రహించారు. అచ్చటనుండి శేషాచలవాసుడైన శ్రీ వేంకటేశ్వరుని దర్శించి, ఆయనను అర్చనాదులచే పూజించారు. అచ్చటనుండి విదర్భదేశానికేగారు.

7. విదర్భరాజు శ్రీ శంకరులకు ఎదురేగి భక్తిపూర్వకంగా నమస్కరించి అర్ఘ్య పాద్యాదులతో పూజించాడు. శ్రీ పద్మపాదాచార్యులు వారందరకూ అద్వైతతత్త్వ బోధచేసి వారినందరినీ జ్ఞానసంపన్నులను గావించారు. అచ్చట నుండి శ్రీ శంకరులు కర్ణాటకదేశంలో పర్యటింపదలచారు.

8. విదర్భరాజైన క్రథకేశ్వరుడు శ్రీ శంకరులతో "ఆచార్యదేవా! కర్ణాటకదేశమందు కాపాలికులు అనేకులున్నారు. అందుచేత, తమరా దేశంలో కాలిడటం క్షేమం కా"దని విన్నవించాడు.

9. "స్వామీ! ఆ కాపాలికులు వేదవిరోధులు. అసూయాపరులు. వేదమతాల పట్ల ఎంతో ద్వేషభావాన్ని పూని ఉంటారు. వేద మత

ప్రవక్తలైన తమ బోటివారు ఆ ప్రదేశంలో సంచరించటం, వారు సహించరు" అని విన్నవించుకొన్నాడు.

10. విదర్భరాజు పలుకులు విన్న సుధన్వ మహారాజు "యతివరేణ్యా! నిరంతరం తమను సేవించుకొంటూ నేను తమ సమీపంలోనే ఉండగా, తమకు ఎట్టి శత్రు భయమూ లేదు. మనం నిర్భయంగా కర్ణాటదేశంలో విహరింపగలం" అని పలికాడు.

11. కర్ణాటకదేశంలో భైరవోపాసకులైన కాపాలికులు అనేకులున్నారు. వారిని జయింపదలచి శ్రీ శంకరులు శిష్యులతో కలసి విదర్భనుండి కర్ణాటక దేశంలో ప్రవేశించారు. వారిలో క్రకచుడనే వాడు ప్రఖ్యాతుడు. ఆ క్రకచుడు శ్రీ శంకరుల నెదుర్కోవడానికి నిశ్చయించుకొన్నాడు.

12. ఆ క్రకచుడు శ్మశానమందలి బూడిదను శరీరమంతా పులుము కొన్నాడు. ఒక చేతిలో కపాలం మరొక చేతిలో శూలం ధరించి భయంక రాకారంతో శిష్యగణాన్ని వెంటబెట్టుకొని ఇలా అన్నాడు.

13. **క్రకచుడు:** యతివరేణ్యా! తాము చక్కగా విభూతి ధరించి పరమ పవిత్రులుగా తెలియుచున్నారు. పరమశివునికి అభీష్టమైన పుర్రెను ధరించ రైతిరి. పనికిమాలిన కప్పెరను (భిక్షాపాత్రను) చేతబుచ్చుకొని తిరుగు చున్నావు. జగద్రక్షకుడైన కపాలి నుపాసించక కాలమంతా వ్యర్థం చేస్తున్నావు.

14. నీవుకూడా మానవ పుర్రెలన్నింటినీ చేర్చి మాలగా ధరించు. చక్కగా మద్యం సేవించు. లేకుంటే అమ్మయైన పార్వతీదేవి నిన్ను శపించగలదు. అమ్మ ప్రసన్నురాలైతే ఆమె కూడా ఉండే కాలభైరవుడు కూడా ప్రసన్నుడవుతాడు. కాలభైరవుని ప్రసన్నుని చేసుకొంటే ముక్తి లభిస్తుంది.

15. క్రకచుని ప్రేలాపనాలకు సుధన్వుడు (ప్రభువు)ఎంతో కృద్ధు డయ్యాడు. అధిక ప్రసంగం ఆపమని పలికి తన అధికారిని పిలిచి వాణ్ణి అచ్చటనుండి పంపివేశాడు.

16. సుధన్వమహారాజుచే పరాభవితుడైన ఆ క్రకచుడు మహా కోపంతో తన వికృతాకారాన్ని మరింత వికృతంగా చేసుకొంటూ, తన

చేతిలో ఉన్న గండ్రగొడ్డలిని గాలిలో ఊపుతూ, “మీ అందరి శిరస్సులను నా గండ్రగొడ్డలిచే నరుకుతాను. అలా చేయలేని యెడల నేను క్రకచుడనే కా”నని శపథంచేసి వెళ్లాడు.

17. కృద్ధుడైన ఆ కాపాలిక నాయకుడు, బ్రాహ్మణుల నెల్లరనూ చంపమని తోటి కాపాలికులను ఆజ్ఞాపించాడు. అంతట ఆ కాపాలికులందరూ బ్రాహ్మణులను చంపడానికి పోగా, ఆ బ్రాహ్మణులందరూ భీతులై ప్రాణభయంతో పరుగులుపెట్టసాగారు.

18. కాపాలికులకు భయపడి పరుగులు పెట్టుచున్న బ్రాహ్మణు లందరనూ కాపాడదలచి, సుధన్వ మహారాజు కవచం ధరించి, అంబుల పొదితో రథం అధిరోహించి వారినందరనూ ఎదుర్కొన్నాడు.

19. ఒకవైపు సుధన్వ మహారాజు కాపాలికులను ఎదుర్కొంటుండగా, క్రకచుడు మరికొందరు కాపాలికులను వెంటబెట్టుకొని బ్రాహ్మణులను చంపడానికి వెంబడించాడు.

20. యమకింకరులమల్లే ఆయుధాలు పూని ఆ కాపాలికులు నిరాయుధులైన బ్రాహ్మణుల నెల్లరనూ హతమార్చడానికి వెంబడించారు. విప్రులందరూ భయభ్రాంతులై శ్రీ శంకరులను శరణువేడారు.

21. కత్తి, తోమరం, పట్టిశం, త్రిశూలం ధరించి, మిక్కిలి అట్టహాసం చేస్తూ చంపదలచి వచ్చే ఆ కాపాలికులను యతిరాజైన శ్రీ శంకరులు తన హుంకారాన్నుండి పుట్టిన అగ్నిచేత క్షణంలో భస్మం చేశారు.

22. శ్రీ సుధన్వ మహారాజు, శత్రుకాపాలికులందరనూ తన వాడి బాణాలచే హతమార్చి మహాసంతోషంతో వచ్చి శ్రీ శంకరులకు నివేదించుకొన్నాడు.

23. తన పరివారాన్నంతా కోల్పోయి, మహాసంతోషంతో ఉన్న విప్రులను చూసి క్రకచుడు అమిత ఖిన్నుడయ్యాడు. తరువాత అతడు శ్రీ శంకరులను సమీపించాడు.

24. "ఓయీ కపట యతీశ్వరుడా! నిన్నిప్పుడే హతమార్చి నా ప్రతిజ్ఞను నెరవేర్చుకోబోతున్నాను. కాచుకో" అంటూ, చేతిలోని పుర్రెయందు దృష్టి సారించి మౌనంగా భైరవుణ్ణి ధ్యానించాడు.

25. అంతట ఆ క్రకచుడు భైరవుని ధ్యానించగా ఆతడి చేతిలోని పుర్రెయందు మద్యం ఉత్పన్నమయింది. అందు సగం మద్యాన్ని తాను సేవించి, తక్కిన సగాన్ని భైరవస్వామికి నివేదనచేసి కళ్లు మూసుకొని ధ్యాన నిమగ్నుడయ్యాడు.

26. క్రకచుడు కాలభైరవస్వామిని ధ్యానింపగా, నరకపాలాల మాలికను కంఠాన ధరించి, అగ్నిజ్వాలలను బోలిన జటలతో, త్రిశూలం చేతబూని, మహాభయంకరాకారంతో కాలభైరవుడు అచ్చట ప్రత్యక్షమయ్యాడు.

27. అచ్చట ప్రత్యక్షమైన భైరవస్వామిని చూసి, క్రకచుడు అమిత భక్తి శ్రద్ధలతో ఇలా ప్రార్థించాడు: "స్వామీ! నీ భక్తులందరినీ యీ కపట యతి హతమారుస్తున్నాడు. నీ నేత్రాగ్నిచే యీ కపట యతిని, విప్రసమూహాన్ని కాల్చి బూడిదచేయి. కనుక ఓ దయామయా! నీ భక్తుని కొరకు నీవే యీ కార్యం నిర్వహింపు."

అంతట ఆ భైరవస్వామి, శ్రీ శంకరులను తన ఆత్మ స్వరూపునిగానే చూశాడు. అంతట క్రకచుని వైపు చూస్తూ, "ఓరీ దుష్టమతీ! శ్రీ శంకరుడు నా అవతారమే అవడంచేత నా ఆత్మ పట్ల నీవు అపరాధం తలపెట్టావు? నాకే ద్రోహంచేయ నెంచావు కనుక నిన్ను ఇప్పుడే హతమారుస్తా" అంటూ ఆ క్రకచుని క్షణంలో బూడిదచేశాడు.

28. క్రకచుడా విధంగా సంహరింపబడగా, యతీశ్వరుడైన శ్రీ శంకరులు ఆ భైరవస్వామిని పరిపరి విధాలుగా స్తుతించారు. అంతట ఆ మహాదేవుడు శ్రీ శంకరుల స్తుతివాక్యాలచే ఎంతో సంతోషించి, అనుగ్రహించి అంతర్ధాను డయ్యాడు. తరువాత అచ్చట శత్రుశేషంలేక నిర్మూలమయింది. శిష్యపరివార మందరూ శ్రీ శంకరులను బహువిధాలుగా పూజించారు.

29. శ్రీ శంకరులు తమ దిగ్విజయ యాత్రను కొనసాగిస్తూ, దేశాలన్నీ పర్యటిస్తూ పశ్చిమ సముద్రతీరాన్ని చేరుకొన్నారు. మార్గంలో పాషండుల నెల్లరనూ జయిస్తూ, అవివేకులందరకూ వివేకం కలిగిస్తూ అద్వైతతత్త్వ బోధా మృతాన్ని వర్షింపసాగారు. శ్రీ పద్మపాదాది అనేక వేల శిష్యగణంతో కూడి తాము కాలిడిన ప్రదేశాలనెల్ల పవిత్రంగాను, ఆ నేలపై జీవించే జను లందరనూ జ్ఞానవంతులుగాను చేశారు. వేదాంత విరుద్ధాలైన శైవ, వైష్ణవ, సాంఖ్య, వైశేషిక, ద్వైతమతస్థుల దోషాలన్నింటినీ ఖండిస్తూ, వారందరికీ అద్వైత తత్త్వాన్ని బోధించి ముక్తులుగా చేశారు.

30. శ్రీ శంకరులు నిగూఢమైన అర్థాన్ని చక్కగా అర్థమయ్యే రీతిన వివరిస్తూ, వారి దోషాలనెల్ల సరిదిద్దుతూ, ప్రతిపక్షులుగా నిలచిన సర్వదేశ వాసులను స్వపక్షీయులుగా చేసుకొన్నారు. ఈ విధంగా సర్వదేశాలను అతిక్రమించి, పశ్చిమ సముద్రతీరం చేరారు.

31. గోకర్ణ క్షేత్రాన, విపక్షీయులతో పోరు సలిపి జడస్వరూపుడైన సముద్రుడు దేవతలచేత పండితులచేత బాగా మర్దించబడి అలసి ఉన్నాడు. కనుక సముద్రునితో పోరు యుక్తం కాదని శ్రీ శంకరులు ఉపేక్షించారు.

32. శ్రీ శంకరులు శిష్య సమేతులై ఆ గోకర్ణ క్షేత్రాన సముద్ర స్నానం చేసి, ఆ క్షేత్రాన వెలసిన మహేశ్వరుని పరమభక్తితో ప్రార్థించారు. మనోహరమైన భుజంగ వృత్తాలతో ఆ భగవానుని స్తుతించారు. అంటే శంకర గురువరుల స్తవ పద్యావళి ఆ క్షేత్రాననే రచింపబడినది.

33. ఆ మహా క్షేత్రమందు శ్రీ శంకరులు తమ శిష్యులనెల్లరనూ చేర్చి వేదాంత విద్యను బోధించసాగారు. ఒకానొకనాడు హరదత్తుడనే వాడు శ్రీ శంకర గురువరులతో యిలా విన్నవించుకొన్నాడు.

34. **హరదత్తుడు:** మహాత్మా! నా విన్నపాన్ని. ఆలకించండి. నేను పరమ పూజ్యులైన శ్రీ నీలకంఠాచార్యుల వారి శిష్యుడను. నేను మా గురువుగారితో "శంకరులనే యతీశ్వరుడు యీ గోకర్ణ క్షేత్రాన నివసించు చున్నాడు. ఆ మహాత్ముడు సర్వలోకాలను జయించి, జైత్రయాత్ర సలుపుతూ

ఈ క్షేత్రాన విడిదిచేసి ఉన్నారు. నిరుపమ ప్రజ్ఞాశాలుడైన కుమారిలభట్టు, మండనమిశ్రులను కూడా జయించా"రని తెలిపినాను.

35. మహాత్మా! నా గురువర్యులు శ్రీ నీలకంఠాచార్యులవారు శివ భక్తాగ్రేసరులు. శివతత్త్వాన్ని గూర్చి అనేక గ్రంథాలను రచించారు. బ్రహ్మ సూత్రాలకు కూడా శివపరమైన భాష్యం వ్రాసిన మహాత్ములు.

నేను మా గురువర్యుల వద్ద తమ మహోత్కృష్ట కేవలాద్వైతతత్త్వ సిద్ధాంతాల గూర్చి స్పష్టంగా వివరించినాను. అంతట నా గురువర్యులు నాతో ఇలా అన్నారు.

36. **నీలకంఠాచార్యులు:** హరదత్తా! ఈ శంకరుడు, సముద్ర జలమంతా ఇంకిపోయేట్లు చేస్తే చేయనివ్వు! ఆకాశాన ఉన్న సూర్యభగవానుని నేలపై పడవేయుగాక! ఈ భూతలమునంతా చాపలా చుట్టితే చుట్టవచ్చుగాక! అయినా నన్ను జయించగల సమర్థుడెన్నటికీ కాజాలడు. అది అలావుండనివ్వు! నా సామర్థ్యాన్ని గూర్చి నీవెరుగవా?

37, 38. నీలకంఠుడు అసూయా భావంతోను, అహంకారంతోను కూడినవాడై, పెద్దగా అట్టహాసమొనరిస్తూ, దేహమంతా విభూతినలదుకొని, రుద్రాక్షమాలను ధరించి, వీరశైవులైన శిష్యులు వెంటరాగా, శ్రీ శంకరులను సమీపించాడు.

39. శ్రీ వ్యాస భగవానులు బ్రహ్మసూత్రాలు వ్రాయకముందు, శ్రీ కపిలాచార్యులు సాంఖ్య శాస్త్రాన్ని ప్రతిపాదించాడు. అదేక్రమంగా సాంఖ్య మతాన్ని స్థాపించి దానిని సుస్థిరంచేశాడు. (అటుతరువాతే శ్రీ వ్యాసభగవానులు బ్రహ్మ సూత్రాలను వ్రాశారు.) అదే విధంగా శ్రీ నీలకంఠాచార్యులు కూడా బ్రహ్మసూత్రాలకు శైవభాష్యాన్ని విస్తరింప జేశాడు. శివతత్త్వమే జనులకు మనుగడయని సిద్ధాంతీకరించాడు. శ్రీ శంకరులు బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయక మునుపు శ్రీ నీలకంఠుని వాక్యజాలాలే పరమ ప్రమాణంగా స్వీకరింపబడేవి.

40. శివ రహస్యమనే గ్రంథంలో పరమాత్మ అయిన శివునికి సర్వ జగత్కారణత్వం, ధ్యేయత్వం, జ్ఞేయత్వం, గమ్యత్వం కలవని చెప్పబడింది.

41. పరమేశ్వరా! నీవు ధ్యానింపదగినవాడవను విషయమున మునులు సాక్షులు. నీవు జ్ఞానము నిచ్చెదవను విషయమున వేదములు సాక్షులు. భక్తుల శత్రువుల నాక్రమించెదవను విషయమున యమధర్మరాజాదులు సాక్షులు. నీవు నిత్యుడవను విషయమున బ్రహ్మశిరస్సులనెడు పూలప్రోవు సాక్షి. నీకు మొదలు నాశము లేవను విషయమున వరాహ రూపమును దాల్చిన విష్ణువు; హంసరూపమును దాల్చిన బ్రహ్మ సాక్షులు.

42. రాజహంసలు తామరతూండ్లను అవలీలగా ఖండించి భక్షించేట్లుగా, శ్రీ శంకరులు వేదాంత తత్త్వాన్ని మహాగంభీరంగా ప్రతిపాదించి, శ్రీ నీలకంఠాచార్యుల వాదనలన్నింటినీ బహుముఖాలుగా ఛేదించారు. తరువాత ఆ నీలకంఠపండితుడు రెక్కలు తెగిన పక్షిలా నేలపై కూలిపోయాడు. అనంతరం ఆ పండితుడు మరల కొంత బలం పుంజుకొని యిలా వాదింప సాగాడు.

43. **శ్రీ నీలకంఠాచార్యులు:** యతివర్యా! వేదాలకు తలమానికాలైన తత్త్వమసి మున్నగు మహావాక్యాలు ఉన్నవి. అవి జీవేశ్వరైక్యభావాన్ని ప్రతిపాదించుచున్నవనీ, జీవబ్రహ్మల ఏకత్వమే ఆ మహావాక్యానికి అర్థమనీ వాదిస్తున్నారు. అవి వెలుగుచీకటులలా పూర్తిగా భిన్నస్వరూపాలు. అవి రెండూ ఒకటేయని చెప్పగలరా? అదేవిధంగా జీవునకు, ఈశ్వరునకు భేదమున్నది. అభేదమని పలుకటం ప్రమాణ విరుద్ధం. "జీవేశ్వరాభేదోనైవ సంభవతి పరస్పర విరుద్ధ ధర్మవత్త్వాత్, తమః ప్రకాశయోరివ" అనే అనుమాన ప్రమాణం భేదవాదాన్నే సమర్థిస్తున్నది. కనుక జీవబ్రహ్మైక్య ప్రతిపాదనకు ప్రమాణం లేదు.

44. మహాత్మా! సూర్యుని బింబ ప్రతిబింబాలను దృష్టాంతంగా చూపి మీ వాదనను నెగ్గింపజూస్తారేమో! అది సంభవం కాదు. సూర్యుడు యథార్థబింబం. ప్రతిబింబానికి అస్తిత్వంలేదు. బింబం నిజమైన వస్తువు. ప్రతిబింబం మిథ్య. ఈ రెండూ ఒక్కటేయని చెప్పజాలం. భేదాన్నే చెప్పాలి. కనుక అభేదమనే భ్రాంతిని వదలండి. ప్రమాణం కలిగిన భేదాన్నే అంగీకరించాలి.

45. యతివరా! అద్దంలో ప్రతిబింబాన్ని చూసేవాడెవ్వడూ అద్దంలో తానే ఉన్నానని తలచడు. ప్రతిఫలించిన ముఖానికి, యథార్థమైన ముఖానికి (బింబం) భేదముండటంలేదా? తన ప్రతిబింబమే అద్దమందున్నదని తలుస్తాడేగాని, తానే అద్దమందున్నానని తలచడు. అది అలా ఉంచండి. అద్దమందు ముఖమేకాక చిన్నవి, పెద్దవి అయిన వస్తువులు కూడా కనిపిస్తున్నవి. అవన్నీ యథార్థం కావు కదా? కనుక ప్రతిబింబపదార్థం మిథ్యావస్తువే. బింబ ప్రతిబింబాలు క్రమంగా సత్యం, మిథ్య అవటంచే భేదం స్పష్టమవుతున్నది. ఉన్నది అఖండ పరబ్రహ్మమొక్కడే. జీవుడు లేనే లేడు. ఇక బంధ మోక్షాలెక్కడివి?

46. యతివర్యా! జీవుడు అల్పజ్ఞుడు, మూఢుడు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు మున్నగునవన్నీ జీవునికి, ఈశ్వరునకు విరుద్ధ ధర్మాలు. అవి అన్నీ మాయా కల్పితాలని, జ్ఞానం కలుగగానే మాయ తొలగిపోతుందని, అప్పుడు జీవేశ్వరుల భేదముండదని మీ వాదన. కాని అది యథార్థం కాదు.

47. జీవేశ్వరుల అల్పత్వం, సరజ్ఞత్వం వంటి ధర్మాలు మాయచే ఏర్పడేవి కావు. అవి స్వభావ సిద్ధంగానే ఏర్పడుచున్నవి. ఉదాహరణకు అశ్వాలు, గోవులయందు సామాన్య ధర్మాలను విచారించితే స్త్రీత్వం కనిపించ వచ్చు. కానీ ఆ కారణాన ఆ రెండూ ఒకే జాతికి చెందినవని నిర్ణయించరాదు. మీరు దీనిని అంగీకరించితే జీవేశ్వర ఏకత్వాన్ని నిరాకరించి, భేదాన్నే అంగీకరిస్తారు.

48. “నేను ఈశ్వరుడను కాను” అనే ప్రత్యక్ష ప్రమాణం జీవేశ్వర భేదాన్నే తెలుపుచున్నది. అభేదమనేది భ్రాంతి మాత్రమే. యథార్థం కాదు. లోకంలోకూడా భేదమే ప్రమాణమై ఉన్నది. “ఇది నాది” అనే వ్యవహారాలందు భేదభావం స్పష్టమగుచున్నది. భేదంనుండే అభేదం జనిస్తున్నది. “వాడే వీడు” అనే వాడుక పదాలచే ఇద్దరుండీ అభేదాన్ని పలుకుచున్నారు. ఆ విధంగా జీవేశ్వర విషయంకూడా తెలుసుకోవాలి. ‘నేను బ్రహ్మను’ అని పలికినప్పుడు కూడా ద్వైతం తెలుస్తున్నది.

49. ఈ విధంగా శ్రీ నీలకంఠాచార్యులు అనేక యుక్తులచేత, దృష్టాంతాలచేత, ప్రమాణాలచేత, సూక్తులచేత, తన వచనాచాతుర్యంతో అద్వైతం సత్యం కాదనీ, ద్వైతమే సత్యమనీ నిరూపించబోయాడు.

50. **శ్రీ శంకరులు:** శివతత్త్వజ్ఞా! తాము అద్వైత తత్త్వాన్ని ఖండిస్తూ, ద్వైతాన్ని విశిష్టంగా సమర్థించుకొన్నారు. అది అంతా ప్రేలాపనయే తప్ప వేరొకటి కాదు.

తత్త్వమసి యొక్క యథార్థమైన అర్థాన్ని ఉపనిషత్సాంప్రదాయాన్ని అనుసరించి తెలుసుకోవాలి. బ్రహ్మాదులకన్నా అఖండ పరబ్రహ్మతత్త్వం శ్రేష్ఠమై ఉంది. ఈ మహావాక్యార్థం కేవలం చైతన్య పరబ్రహ్మానికే చెప్పబడి నది. పరమనగా ఈశ్వరుడు. అపరమంటే తరువాత వస్తువవటంచే జీవుడు. కనుక కార్యకారణ రూపాన్ని ఈ మహావాక్యం తెలుపుచున్నది. కాబట్టి తత్త్వమసి మహావాక్యం జీవబ్రహ్మల అభేదాన్నే తెలుపుచున్నది. శరీర మందధిష్ఠించేవాడు జీవుడు కాగా, సర్వజగత్తులందూ ఈశ్వరుండధిష్ఠితుడై ఉంటాడు. ఉపాధులు కల్పితాలు, చైతన్యం సత్యం. కేవలాద్వైతతత్త్వమే యథార్థం, అభయం, నిర్వికారం, నిరంజనం, నిత్యానందం.

51. ఓయీ! తత్త్వమసి అనే మహావాక్యం యొక్క అర్థాన్ని బాగా తెలుసుకో. 'వాడే యీ దేవదత్తుడు' అనే పదం పలికినప్పుడు కాలం, దేశం మున్నగు విశిష్ట దశలతో పరిశీలించితే ఆ వాక్యం ఇరువురిని తెలుపుతోందని బోధపడుచున్నది. కానీ యథార్థంగా ఒక్కడే! కాలం, దేశం మున్నగునవి సందర్భానుసారంగా కల్పించబడినవి. లక్ష్యార్థాన్ని దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే వాడు ఒక్కడే అని తెలుస్తున్నది. అదే విధంగా తత్త్వమసి అనే వాక్యమందు 'ఆ పరమాత్మవు నీవే' అని చెప్పబడుచున్నది. దేహోపాధి, జగదుపాధి, అవిద్యోపాధి, మాయోపాధి, విశిష్టరూపార్థాలతో పలికినప్పుడు జీవేశ్వరులిద్దరని తెలుస్తున్నది. కాని యథార్థానికి చైతన్య పరబ్రహ్మ మొక్కటే; అది కాలాతీతం; అది సత్యం. ఉపాధులు కల్పితాలు. కానీ లక్ష్యార్థాన్ని గ్రహిస్తే ఒకే పరబ్రహ్మం తెలియుచున్నది. ఆ పరబ్రహ్మానికి

భ్రమలుగాని, ఉపాధులుగాని లేవు. ఎల్లప్పుడూ ప్రకాశించేది ఆ పరబ్రహ్మ మొక్కటే.

బాగా ఆలోచించండి. నీ సంశయాలన్నీ తొలగిపోతాయి. యథార్థం బోధపడుతుంది. ఈ విషయాన్ని ఉపనిషత్తులు అనేక పర్యాయాలు ప్రతిపాదించినవి.

52. ఇట్లు చెప్పబడిన విషయంలో నీవు తెల్పిన అతివ్యాప్తి దోషం కలుగదు. గోవునకు గుఱ్ఱానికి అభేదాన్ని తెలిపే ప్రమాణం లేదు. ప్రమాణముంటే భాగత్యాగ లక్షణచేత అభేదానుభవం కలుగుతుంది. ప్రమాణం లేనందున అచట అభేదం చెప్పరాదు.

53. **శ్రీ నీలకంఠాచార్యులు:** యతివర్యా! మహాత్మా! జీవుడు అల్పజ్ఞుడు, ఈశ్వరుడు సర్వజ్ఞుడు. ఈ ధర్మాలేగాక జీవేశ్వరుల స్వరూప నిరూపణమందు లక్షణావృత్తి ప్రవర్తించటంలేదు. వాచ్యార్థాలైన మూఢత్వ, సర్వజ్ఞత్వాలకంటే వేరైన ధర్మాలు జీవేశ్వరులకు లేవు. అందువలన తత్త్వమసి అనే వాక్యమందు లక్షణాప్రవృత్తి లేదు. కనుక భేదాన్నే ప్రతిపాదిస్తున్నది.

54. **శ్రీ శంకరులు:** పండితవర్యా! మూఢత్వ సర్వజ్ఞత్వాలే జీవేశ్వరుల స్వరూపమని తలచవద్దు. ఉపాధిచే కలిగే ధర్మాలు నిత్యాలు కావు. ముత్యపుచిప్ప యందు మెరిసే వెండి కల్పితం. అదే విధంగా జీవేశ్వర రూపాలు పరబ్రహ్మమందు కల్పితాలు. కనిపించే మూఢత్వ, సర్వజ్ఞత్వాలు ఉపాధి వలన గుర్తించబడుచున్నవి. కనుక సత్యాలు కావు. కల్పిత వస్తువుండటంచేత దానికి మూలవస్తువొకటి ఉండి తీరాలి. కల్పితమైన రజతం ఉండటంచే దానికి మూలవస్తువైన ముత్యపుచిప్పను అంగీకరించాలి. అదేవిధంగా కల్పితాలైన జీవేశ్వరులుండటంచే, వారి కధిష్ఠానమైన పర బ్రహ్మాన్ని అంగీకరించాలి. అంటే కల్పిత వస్తువునకు అధిష్ఠాన వస్తువుంటుంది.

55. జీవుని స్వరూపం ఉపాధుల వలన తెలుస్తున్నది. అంటే దేహం, ఇంద్రియాల సమూహం. దీని కధిష్ఠానమొకటి ఉందని అందరూ అంగీ కరించే విషయమే. కంటికి కనిపించే శరీరం నుండి కనిపించని అహంకారం

మున్నగునవన్నీ జడాలు. ఈ దేహాలన్నింటికీ అధిష్ఠానుడై జీవుడొకడు ప్రకాశిస్తున్నాడు. అదే చైతన్యం. అదే పరబ్రహ్మం; సత్యం.

56. పండితశ్రేష్ఠా! పరమాత్మ మాయాశక్తిచే నిర్మితమైన ఈ జగత్తు అంతా జడమై ఉన్నది. జగత్తు జడం కనుక దానికి అధిష్ఠానాన్ని తెలుసుకోవాలి. రజ్జువు (త్రాడు) నందు కనిపించే సర్పం యథార్థం కానట్లుగానే, పరబ్రహ్మంచే కల్పించబడిన జగత్తు కూడా సత్యం కాదు. పామునకు అధిష్ఠానం త్రాడు అయినట్లుగానే, జగత్తున కధిష్ఠానం పరబ్రహ్మమని అంగీకరించాలి. అదే చైతన్యం, అదే సత్యం.

57. జీవేశ్వర యథార్థ స్వరూపం చైతన్యం. ఉపాధితో కూడిన ధర్మాలన్నీ కల్పితాలవటంచే జీవేశ్వర స్వరూపం కేవలం చైతన్యం. అటువంటి నిరుపాధిక చైతన్యమందు మూఢత్వ సర్వజ్ఞతలు సంభవింపవు. తెల్లగా మెరసే స్ఫటికమణి, దాసాని పుష్పం సన్నిధానంలో ఉండటంచే ఎరుపు వర్ణంలో కనిపిస్తున్నా, దాని సహజస్వభావమైన తెల్లదనం మారక అట్లే ఉంటుంది. అదే విధంగా చైతన్య పరబ్రహ్మం ఉపాధి సామీప్యం ఉండటంచే జీవేశ్వరులుగా తోస్తుంది. అయినా చైతన్య స్వరూపమైన పరబ్రహ్మమందు జీవేశ్వరత్వం లేదు. దానియందు సర్వజ్ఞత మూఢత్వాలు ఉండవు.

58. కవివరేణ్యా! జీవేశ్వర అభేదమే సత్యం. అలాగాక జీవేశ్వరభేదం సత్యమని తలచేవానికి జనన మరణ సంసారమే కలుగుతుందని వేదాలు చెప్పుచున్నవి. "ఎవడు జీవేశ్వరుల విషయమై భేదబుద్ధి కలిగి ఉంటాడో అట్టివానికి సంసార భయం తప్పదు." అట్లే "నానాత్వం గాంచేవాడు అమృతత్త్వాన్ని పొందక మృత్యువునే పొందుతున్నాడు" మున్నగు శ్రుతి వాక్యాలు జీవేశ్వరభేదం సత్యం కాదని తెలుపుచున్నవి.

59. "జీవేశ్వరైక్యం తెలుసుకొన్న వానికి శోకమోహాలు లేవు" అనేది శ్రుతి వాక్యం. అభేదజ్ఞానంచేతనే పరమ పురుషార్థమైన మోక్షం సంభవిస్తున్నదని వేదాలు వచిస్తున్నవి. శ్రుతి ప్రమాణాలుండటంచేత జీవేశ్వరాభేదం సత్యం. భేదదర్శికి భయం మాత్రమే కలుగుతుంది. "నేను శివుడను గాను" అనే

బుద్ధి కూడా భ్రమయే. అట్టి భ్రమకూడా వేదాంత శ్రవణంచే తొలగుచున్నది. జీవేశ్వర భేదబుద్ధి భ్రమ కనుక సత్యం కాదు.

60-62. శ్రుతి జీవేశ్వర అభేదం బాధితం కాదని తెలుపుచున్నది. తత్త్వమసి అనే వాక్యం అభేదాన్నే వచిస్తున్నది.

శ్రుతి స్మృతులందు శ్రుతి వాక్యాలు బలమైనవి. కనుక శ్రుతి వాక్యాలే ప్రమాణాలు. అట్లే బలిష్ఠమైన వేదవాక్యాలు మహర్షుల వాక్యాలకన్నా పరమ ప్రమాణాలుగా స్వీకరింపబడుతాయి. కాబట్టి కపిలాది మహర్షుల వాక్యాలకన్న తత్త్వమసి అనే వేదవాక్యం పరమ ప్రమాణమవుతుంది. కనుక వేదవిరుద్ధమైన ప్రమాణాలు అనేకమున్నా, అవి (మహర్షులచే వచించబడినా) ప్రమాణాలు కావు.

63. **శ్రీ నీలకంఠాచార్యులు:** వేద విరుద్ధాలైన స్మృతి వాక్యాలు ప్రమాణాలు కావని చెప్పటం సమంజసం కాదు. వేదాలందు వచింపక పోయినా, మహర్షుల ప్రవచనాలు తప్పక గ్రహించాలి. మహాత్ముల సూక్తులను వినండి – 'ఒకడు సుఖాలను అనుభవిస్తున్నాడు, మరొకడు దుఃఖాలను అనుభవిస్తున్నాడు. కనుక దేహాలందుండే జీవాత్మలందరూ భిన్నసంస్కారాలు కలిగినవారై ఉన్నారు. అంటే ఉన్నది ఒకే ఆత్మ కాదు. అనేక ఆత్మలున్నవి. కనుక జీవేశ్వరవాదాన్ని విడిచి ఆత్మవాదాన్ని స్వీకరించాలి. నానాత్మవాదం ఋషిపుంగవుల పలుకులవడంచే వేదాలందు లేకున్నా అంగీకరించాలి.

64. మహాత్మా! అందరిలోను ఒకే ఆత్మవస్తువు ఉందనే వాదనను నేనంగీకరించను. లోకంలో విపరీతమైన దుఃఖాలననుభవిచే వారు ఉన్నారు; రాజ భోగాలనుభవించేవాడూ ఉన్నాడు. మరల ఈ సుఖదుఃఖాలు కూడా శాశ్వతమైనవి కావు. రాజసుఖాలనుభవించేవాడు దుఃఖాలపాలు కావచ్చు. దుఃఖాలనుభవించేవారు సుఖించవచ్చు. కనుక వీడు సుఖి, వీడు దుఃఖి అని చెప్పలేం. సుఖ దుఃఖ విషయమై నిర్దిష్టమైన వ్యవస్థ లేనందున అందరూ సుఖవంతులు కావాలి, లేదా అందరూ దుఃఖితులు కావాలి. ఆత్మ ఒకటే ఉన్న యెడల ఒకడు ముక్తిని పొందిన యెడల అందరూ

ముక్తిని పొందాలి. కానీ ఇలా జరుగటం లేదు. కనుక ఏకాత్మవాదం చెల్లదు. ప్రతి దేహమందు జీవులు వేర్వేరు ఉన్నవని అంగీకరించాలి.

65. వేదాంతులు ఆత్మ కర్త, భోక్త రెండు కాదు అని తెలుపుతున్నారు. శ్రుతులు కూడా అకర్త అనే పలుకుతున్నవి. కర్తవ్యభోక్తవ్యాలు అంతఃకరణ వ్యాపారములనీ ఆత్మధర్మాలు కావనీ అద్వైతుల మతం. ఇది విరుద్ధం.

చేతనా స్వరూపియైన జీవుడు కర్త అవుతున్నాడు. చేతనత్వం జీవుని యందుండటంచే, జీవుడే కర్త అవుతున్నాడు. అంతఃకరణం జడమవటంచే, జీవుడే కర్తవ్యానికి అర్హుడు. అదే విధంగా భోక్తా జీవుడే అవుతున్నాడు. అలాకాక కర్త ఒకడు, భోక్త మరొకడని చెప్పజాలం. కర్తృత్వ భోక్తృత్వాలు జీవాత్మ ధర్మాలు. ఆ ధర్మాలు జడమైన అంతఃకరణం యొక్క ధర్మాలు కావు.

66. యతివర్యా! ఈ లోకంలో దుఃఖాన్ని విడచి సుఖముండటం లేదు. సర్వసుఖాలు దుఃఖంతోనే అంతమవుతున్నవి. సుఖాలు విడువదగిన వవటం వలన పురుషార్థం కానేరదు. మహాత్మా! దుఃఖనాశనమే మోక్షమవు తున్నది కాని సుఖప్రాప్తి మోక్షం కాజాలదు. కనుక తాము పలుకుచున్నది మోక్షం కాదు; దుఃఖనాశనమే మోక్షమవుతుంది.

67. **శ్రీ శంకరులు:** కవిశేఖరా! తాము ప్రతిపాదిస్తున్న సుఖదుః ఖాలు మనోధర్మమవుతున్నవి కాని ఆత్మధర్మం కాదు. కనుక అది మానసిక భేదాన్ని సాధిస్తున్నది కాని ఆత్మభేదాన్ని సాధింపజాలదు. సుఖ దుఃఖాదులు అంతఃకరణ ధర్మాలే కాని ఆత్మధర్మాలు కావు. ఆత్మ ఒక్కటే.

68. స్థూల, సూక్ష్మదేహాలు జడాలు. వీటికి చైతన్యం చేరటం చేతనే కర్తృత్వం ఏర్పడుచున్నది. చైతన్య విశేషం లేనియెడల గడ్డిపరకలకు కూడా పెరుగుదల సంభవింపదు.

చిత్తం జడమవటం వలన అది కర్త భోక్త అవడానికి అర్హత లేదు. ఆత్మకూడా కర్త భోక్త రెండూ కాదు. ఆత్మ నిర్వికార, నిరుపాధిక, అద్వితీయం. కనుక కర్తృత్వభోక్తృత్వాల నెలా ఆపాదించగలవు?

సూర్యుని కాంతిచే, సర్వప్రాణులు తమ పనులు చేసుకోగలుగుచున్నవి. అదే విధంగా ఆత్మప్రకాశంచే ఇంద్రియాలన్నీ తమ తమ పనులు చేసుకో

గలుగుచున్నవి. సూర్యుడు సర్వసాక్షియైనట్లే, ఆత్మకూడా సర్వసాక్షి అవుతున్నది. కనుక కర్తృత్వ భోక్తృత్వాదులు ఆత్మవి కావు. అంతఃకరణం యొక్క వ్యాపారాలు. చైతన్యం లేకుండా ఏ వ్యవహారమూ నడవదు. దేహేంద్రియాదులు చైతన్యముండటంచేతనే కర్తృత్వ భోక్తృత్వాదులను పొందుచున్నవి. ఆత్మచైతన్యంలేని శవాలు ఏ వ్యాపారాన్ని చేయజాలవు.

69. పండిత ప్రవరా! సుఖ దుఃఖాలు కలిసే ఉంటాయని, కేవలం సుఖంగాని, కేవలం దుఃఖంగాని ఉండవని పలికారు. అంతేగాక లోకంలో కలిగే సుఖాలన్నీ దుఃఖాలే అవుతున్నాయన్నారు. అది ఎంతో సత్యం. అయితే తమరు పలికినవన్నీ లౌకికపరమైనవి. బాహ్య పదార్థాలచే కలిగేవి. కానీ బ్రహ్మసుఖం అలా కాదు. బ్రహ్మసుఖమనేది తనలోనే ఉంటుంది. అదే పరమ పురుషార్థం. ఆత్మానుభవ బ్రహ్మసుఖం అవ్యయం. ఇందుకు ఉపనిషత్ప్రమాణం ఉంది. బ్రహ్మసుఖం ఖర్చు కానిది; అనంతం.

70. బహు విధాలైన ప్రమాణాలతోను, యుక్తి దృష్టాంతాలతోను, సుమనోహర పదజాలంతోను, శివతత్త్వ రహస్యాన్ని ఖండిస్తూ వీరశైవుడైన శ్రీ నీలకంఠాచార్యులను జయించారు.

71. తరువాత నా శైవమతమే శ్రేష్ఠమనే గర్వం వదలి తనచే విరచితమైన శైవభాష్యాన్ని శ్రీ శంకరులకు సమర్పించిన శ్రీ నీలకంఠాచార్యులు తమ శిష్యగణంతో కలసి శరణుజొచ్చారు. శ్రీ శంకరులకు శిష్యులయ్యారు.

72. శ్రీ శంకరులు నీలకంఠాచార్యులను జయించారనే వార్త వినగానే అద్వైతానికి పరమ విద్వేషులైన ఉదయనాచార్యులవంటి పండితులందరూ భీతిచెందారు.

73. నీలకంఠ, ఉదయనాది పండితులను జయించి తమ అద్వైత తత్త్వ సిద్ధాంతాలను సుస్థిరంగా స్థాపించిన శ్రీ శంకర భగవత్పాదుల వారు సౌరాష్ట్రంలో ప్రవేశించి ద్వారకా పట్టణాన కాలుమోపారు.

74, 75. శంఖచక్రముద్రలను భుజాలందు ధరించినవారూ, వివిధాలైన ఊర్ధ్వపుండ్రాలను ధరించిన వారూ, చెవిలో తులసిదళాలు, మెడలో తులసి

మాలలు, తులసి పూసల జపమాలలు ధరించిన వైష్ణవులు శ్రీ శంకరాచార్యుల వారిని సమీపించారు. వారందరూ శ్రీ శంకరులతో పంచభేదాలను బాగా ఎరిగిన వారికే మోక్షం లభిస్తుందని వాదించారు. (పంచ భేదా లేవంటే 1. జీవేశ్వర భేదం 2. జీవుల పరస్పర భేదం 3. జీవ జడ భేదం 4. ఈశ్వర - జడ భేదం 5. జడాలకు - జడాలకు ఉన్న పరస్పర భేదం) శ్రీ పద్మపాదాచార్యులవారు ఈ పాంచరాత్రులపై కొదమ సింగం మదించిన ఏనుగుపై లంఘించి కుంభస్థలాలను భేదించేట్లు వారి పూర్వపక్ష కుంభస్థలాలను భేదించారు. ఈ విధంగా శిష్యులు కూడా విజయపరంపరలను ఆస్వాదించసాగారు.

76-79. శ్రీ శంకరులు వైష్ణవ, శైవ, శాక్త, సౌర, గాణపత్యాదులందరినీ జయించి తమ పాదాక్రాంతులను చేసుకొని ఉజ్జయినికి పయనమైనారు.

శ్రీ శంకరులు ఉజ్జయినీ నగర ప్రవేశం గావించగానే గృహస్థులనే నెమళ్ళ సమూహాలు బయటకు వచ్చి నాట్యం చేయసాగినవి. మహా కాళేశ్వరుని పూజా మందిరమందు ధుమి ధుమి అని మృదంగధ్వనులు మ్రోగగా, జనులు పూజా సమయమైనదని భ్రమపడ్డారు.

శ్రీ శంకరులు అగరు, దీప, ధూపాలతో శ్రీ కాళేశ్వరస్వామిని దర్శించి, అర్చించి అనేక విధాలుగా స్తుతించారు.

80-82. శ్రీ శంకరులు తాను ఎందరు పండితులను జయించినా, ఎన్ని మతాలవారిని ఖండించి అద్వైత స్థాపన చేసినా, ఉజ్జయినీ నగరమందలి భట్ట భాస్కరాచార్యుల వారిని జయిస్తేగాని తన జైత్రయాత్ర సంపూర్ణం కాదని తలచారు. వెంటనే తమ ప్రియశిష్యుడైన పద్మపాదాచార్యుని పిలిచి "సౌమ్యా! ఈ పట్టణంలో మహాకవి పండితుడైన శ్రీ భట్ట భాస్కరాచార్యులకు మన ఆగమన వార్త తెలిపి సమావేశానికి ఏర్పాటు చేయవలసిన"దని ఆదేశించారు.

తరువాత శ్రీ పద్మపాదాచార్యులవారు శ్రీ భట్ట భాస్కరాచార్యులను కలిసి యీ విధంగా ప్రసంగించారు.

**శ్రీ పద్మపాదాచార్యులు:** పండితప్రవరా! శ్రీ శంకర భగవత్పాదులు వేదాంత తత్త్వమైన అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ విమతవాదుల వాదాలన్నింటినీ ఖండిస్తూ, దిగ్విజయయాత్ర సలుపుతూ యతీశ్వర చక్రవర్తులై తమ పట్టణానికి వేంచేశారు.

83. మా గురుదేవులు శ్రీ శంకర భగవత్పాదులవారు తమను ఉద్దేశించి పలికిన పలుకులు తెలిపుతాను. ఆలకించండి.

"కొందరు ఉపనిషత్తులకు విపరీతార్థాలను తెలుపుతూ బ్రహ్మసూత్రాలకు దుర్వ్యాఖ్యానాలు చేస్తున్నారు. అందువలన లోకమంతా వివాదగ్రస్తమై సుఖ శాంతులు కరువవుతున్నవి. అటువంటి లోకకంటకమైన ప్రతిపాదన లన్నింటినీ ఖండించి శాంతి తత్త్వాన్ని స్థాపించదలచి వేదాంత సిద్ధాంతాన్ని ప్రతిపాదింప దలచినాం. అభిన్నమైన పరబ్రహ్మాన్ని జీవ బ్రహ్మ అభేద రూపాన అలరారుచున్నదని తలచుచున్నాం. ఉపనిషత్తులు కూడా జీవబ్రహ్మ అభేదరూప పరమతత్త్వానే ప్రతిపాదిస్తున్నవని బోధిస్తున్నాం. లోకంలో నాస్తికమతాలు, ద్వైతంతో కూడిన ఆస్తికమతాలు విపరీతంగా పెరిగిపోవుచున్నవి. అవి ఏవీ పరమార్థ, బ్రహ్మప్రాప్తిని బోధించటంలేదు. అందువలన ఆ మతాలన్నింటినీ ఖండించి కేవలాద్వైతాన్ని స్థాపింపదలచినాం.

84. "మహాత్మా! తాము సర్వశాస్త్రాలందూ నిష్ణాతులు. కనుక తమకు వేదాంత తత్త్వాన్ని గూర్చి ప్రత్యేకంగా తెలుపవలసిన అవసరం లేదు. కాబట్టి తాము వేదాంత విరుద్ధమైన ద్వైత సిద్ధాంతాన్ని పరిత్యజించండి. మహాత్ములు సత్యమైన విషయాలందు వెంటనే స్పందిస్తారు. అలాకాక మూర్ఖంగా తమ మతాన్నే సమర్థించే పక్షంలో మాతో తర్కమందు పాల్గొని, వజ్రఘాతాల వంటి మా వాదనల నెదుర్కోండి; మీ బలాన్ని పరీక్షించుకోండి."

85. తరువాత ఆ భట్ట భాస్కరాచార్యులు శ్రీ పద్మాపాదాచార్యుల సందేశాన్ని విని, కోపంతో పరిహాసం చేస్తూ ఇలా పలికాడు.

86. **శ్రీ భట్ట భాస్కరాచార్యులు:** పండితాప్రవరా! తాము ఊరికి క్రొత్తగా వచ్చినందు వలన, నా పేరుప్రఖ్యాతులు, శక్తి సామర్థ్యాలు తెలియక

మాట్లాడుతున్నారు. నా విరోధి మతవాదులందరినీ తలెత్తనీయకుండా చేస్తూ, రాజహంసలు తామరతూడులను భక్షించే విధాన, వారి కీర్తిబిరుదాలనెల్ల ఊడబెరకి పంపుతుంటాను. ఇప్పటికైనా మేల్కొని నా వాదనా ఘాతాలనుండి తప్పించుకొని పారిపోండి. విజ్ఞులైన నాబోటి వారి ముందు వ్యర్థ ప్రేలాపనలు చేయకండి.

87. యతివరశిష్యా! వ్యర్థప్రసంగాలు కట్టిపెట్టు. నా సామర్థ్యం తెలుసుకో. నానుండి ప్రవహించే సూక్తి పరంపరలు వెల్లువయై ప్రవహిస్తూండగా, కాణాదముని ప్రవచితమైన న్యాయశాస్త్రవాదమే నిలువ నీడలేక పోయింది. ఇక కపిలముని ప్రేలాపనలు పరుగులు పెట్టుచున్నవి. సాంఖ్యవాదం దూరంగా పోతున్నది. మహర్షి ప్రవరుల సిద్ధాంతాలైన న్యాయ, సాంఖ్యాది మతాలే నిశ్శేషంగా నశిస్తూండగా, నీ గురువైన శంకరులు వారికన్న గొప్పవాడా? తెలుపు. కాదేని మారుపలుకక వెడలిపో.

88. **శ్రీ పద్మపాదాచార్యులు:** అవివేకీ! యథార్థం తెలియక వదరుచున్నావు. మా గురుదేవులను, మా మతాన్ని తూలనాడకు. నీవు మహాపండితుడవే కావచ్చు. అనేకమంది పండితులను నీ వాక్పటిమతో జయించి ఉండవచ్చు. కానీ అలౌకికుడూ, సర్వలోక హితుడూ, సర్వోత్తమ పురుషుడూ అయిన మా గురుదేవునికడ నీవు నిలువజాలవు. సూర్యకాంతి ముందు నక్షత్రాలు శోభిస్తాయా?

89-93. అంతట శ్రీ పద్మపాదాచార్యులు సర్వం శ్రీ శంకరులకు నివేదింతునని తెలిపి అచటనుండి వెళ్లాడు.

తరువాత శ్రీ భట్ట భాస్కరాచార్యులూ శ్రీ శంకరులూ తమ వాద ప్రతివాద పటిమలతో, సాటిరాని పాండిత్య శౌర్యధీమణులవుతూ వాదింపసాగారు. వారి వారి వాక్చాతుర్యంచే ఎవరికివారే విజయాన్ని ఆకాంక్షిస్తూ వాదించుకొన్నారు. అనేక ప్రమాణాలతోను, దృష్టాంతాలతోను వారి వారి వాదనలను దృఢీకరించుకోసాగారు.

ప్రేక్షక పండితులందరూ యుక్తి ప్రతియుక్తి జాలాలతో కూడిన, ఆ వాగ్యుద్ధమందు ఏమి జరుగుచున్నదో తెలియజాలని వారైనారు.

భీకరమైన ఆ పోరులో శ్రీ శంకరుల సిద్ధాంత ప్రతిపాదనలచే భాస్కరుని పక్షం బలహీనమయింది. ఆ సభలో భాస్కరుని పూర్వపు శోభలు ప్రకాశింపజాలకపోయాయి. శ్రీ భాస్కరపండితుడు అద్వైత దోషాల నిలా వచించాడు.

94. **శ్రీ భట్ట భాస్కరాచార్యులు:** మిక్కిలి శమము గలవాడా! జీవాత్మ పరమాత్మలకు భేదాన్ని కలిగించేది ప్రకృతి అని నీవు చెప్పిన విషయం తగినది కాదు. ఈశ్వర భావం, జీవభావం ప్రకృతికి తరువాత ఏర్పడడం వల్ల ఈ ప్రకృతి జీవుని గాని ఈశ్వరునిగాని ఆశ్రయించి వారికి భేదాన్ని కలిగించడం లేదు.

95. **శ్రీ శంకరులు:** పండితప్రవరా! దర్పణం బింబాన్ని ఆశ్రయించి బింబ ప్రతిబింబాలను వేరుచేస్తున్నదా? దర్పణం బింబం కాదు; ప్రతిబింబమూ కాదు. బింబప్రతిబింబ భావం ఏర్పడక ముందే ఆ అద్దం ఉంది. అద్దం ఉండటం చేతనే బింబప్రతిబింబ భావమేర్పడినది. అద్దం లేకుంటే బింబ ప్రతిబింబ భావం కలుగుతుందా? ముఖాన్ని గ్రహించే అద్దం బింబప్రతి బింబాల భేదమై తెలుస్తున్నది. ఆ ప్రకారంగా, ప్రకృతీ మొదట బింబమైన ఈశ్వరగతంకాదు, ప్రతిబింబ జీవగతం కాదు, కేవల చిన్మాత్రము నాశ్రయించి ప్రకృతి ఉన్నది. చిదాశ్రయి అయిన ప్రకృతి నాశ్రయించి మలిన ప్రకృతితో ఒప్పువాడు జీవుడనీ, శుద్ధప్రకృతితో ఒప్పువాడు ఈశ్వరుడనీ తెలుసుకోవాలి. ప్రకృతి ముందుగా ఉన్నా, దర్పణమున్నందున బింబప్రతిబింబాల భావన ఏర్పడేట్లు, ఆ ప్రకృతి నాశ్రయించే జీవేశ్వర భావం సిద్ధమవుతున్నదని తెలుసుకోవాలి.

96. బింబప్రతిబింబ వ్యవహారాలు దర్పణం వలెనే ఏర్పడుచున్నవి. అద్దమేలేని పక్షాన బింబప్రతిబింబ ప్రతిపాదనమే ఉండదు. దర్పణం మాత్రం బింబాన్నాశ్రయించటంచే అద్దమందు ప్రతిబింబం కనిపిస్తున్నది. ఆ విధంగా చిత్తమైన పరమాత్మ బింబమవటం వలన వేరుగా ఉన్నాడు. వానికి ప్రకృతి సంబంధమేమీ ఉండదు. కనుక ప్రకృతి ధర్మాలైన సుఖ

దుఃఖాలను గ్రహించటం లేదు. అయినా బింబమైన చిద్రూప పరమాత్మనే ఆశ్రయించి ఉన్నది. ఆ ప్రకృత్యుపాధి వలన అందు బింబమైన పరమాత్మ కనబడుచున్నాడు. ఆ ప్రతిబింబమే జీవుడు. జీవునికి ప్రకృతికి, దర్పణం ప్రతిబింబాలమల్లే సంబంధం ఉంది.

కనుక బింబమైన పరమాత్మకు ప్రకృత్యుపాధి లేకుండటంచే సుఖ దుఃఖాదులుండవు. ప్రతిబింబమైన జీవునికి ప్రకృతి సంబంధముండటంచే సుఖదుఃఖాదులుంటాయి. అద్దం స్వచ్ఛంగా ఉండటం, లేకుండటంచే బింబం కనిపించటం, కనిపించకపోవటం జరుగుచున్నది. అదేవిధంగా ప్రకృతి యొక్క ధర్మాలచే అందులో పరమాత్మ కూడా కనిపించటం, కనిపించక పోవటం కలుగుతుంటుంది. నిజానికి ప్రకృతే లేనందున బింబప్రతిబింబాలు గాని ఈశ్వరుడు జీవులు గాని ఉండరు. చిన్మాత్రయే సత్యం.

97. **శ్రీ భాస్కరులు:** వికారం కలిగినది, జడం అయిన ప్రకృతి వికారం లేనిది, సంగం లేనిది జ్ఞానైకరసం అయిన బ్రహ్మాన్ని ఆశ్రయించి ఉండడం తగినది కాదు. కాబట్టి ఈ ప్రకృతి అంతఃకరణ విశిష్టుణ్ణే ఆశ్రయించి ఉండడం సముచితం.

98. **శ్రీ శంకరులు:** పండితప్రవరా! జడమైన అంతఃకరణంతో కూడిన ఆత్మనాశ్రయించి ప్రకృతి ఉన్నదని వచించారు. మీ వాదనకు ప్రమాణాలు లేవు. 'నేను అజ్ఞుడను' అనే ప్రమాణం చూపదలస్తే అదీ సరియైన ప్రమాణం కాదు. ఎలాగంటే –

99. 'నేనజ్ఞుడను' అనే అనుభవం అంతఃకరణ విశిష్ట జీవునిదని చెప్పిన యెడల 'నేను అనుభవము కలవాడను' అనే ప్రతీతివల్ల అనుభూతి అంతఃకరణ విశిష్ట జీవునిదని చెప్పవలసి వస్తుంది. అజడమయిన అనుభవం జడమయిన అంతఃకరణమందు ఉండదు. కాబట్టి విశిష్టమును ప్రకృతి ఆశ్రయించి ఉంటుందనడం మాకు సమ్మతం కాదు.

100. దహించే శక్తిగల అగ్ని తాదాత్మ్యం వల్ల ఇనుము దహిస్తున్నదని వ్యవహరించినట్లు అనుభవం కల ఆత్మ తాదాత్మ్యం వల్ల అంతఃకరణమునందు అనుభవం వ్యపదేశింపబడుతోంది.

101. **శ్రీ శంకరులు:** జీవుడు ప్రకృతితో కూడి ఉండటంచే అజ్ఞానానుభవం కలుగుచున్నది. అలాకాదని వాదిస్తే, అంతఃకరణం స్వభావ సిద్ధంగా జడమవటంవలన సుఖ దుఃఖాది అనుభవం సిద్ధించదు. చైతన్య వంతుడైన జీవుడు అంతఃకరణోపాధిచే సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాడు. అంటే అంతఃకరణ ఉపాధి తొలగితే చైతన్యం మాత్రమే మిగులుచున్నది. కనుక జీవుడు చైతన్యవంతుడు. అంతఃకరణం జడమవడం వలన అంతః కరణమందు సుఖదుఃఖానుభవం సంభవింపదు.

102. **శ్రీ భట్టభాస్కరాచార్యులు:** నేననుభవం కలవాడను అనే ప్రతీతిలో జడమయిన అంతఃకరణానికి అనుభూతి విరుద్ధం. కాబట్టి చిదాత్మ తాదాత్మ్యం వల్ల జడాంతఃకరణం చేతనం వలె భాసిస్తుందని గౌణార్థాన్ని ఆశ్రయించడం తగినదే. నేనజ్ఞుణ్ణి అనే ప్రతీతిలో జడమయిన అంతఃకరణంలో జడమయిన అవిద్య ఉండి భాసించడంలో విరోధం లేదు. కావున ఇక్కడ చిదాత్మాశ్రితమయిన అవిద్యాతాదాత్మ్య రూపమయిన గౌణార్థాన్ని ఎందుకు చెప్పాలని ప్రశ్న. అవిద్య నుండి పుట్టిన చిత్తమును అవిద్య ఆశ్రయించి ఉండుట విరుద్ధం. కాబట్టి ఇక్కడ గూడా గౌణార్థాన్ని చెప్పాలి.

103. **శ్రీ శంకరులు:** అజ్ఞానం మనస్సు నాశ్రయించి ఉంటుందని వచిస్తున్నారు. అలాగయితే గాఢనిద్రయందు మనస్సే లేదు గదా? అప్పుడు ఇక అజ్ఞానమనేది ఎలా ఉంటుంది? కాబట్టి ప్రకృతి శుద్ధచైతన్యమునే ఆశ్రయించి ఉన్నది. ఇదే నిజమైన సిద్ధాంతం.

104. **శ్రీ భట్ట భాస్కరాచార్యులు:** గాఢనిద్ర యందు అవిద్యలేదు. కాబట్టి అది చిదాత్మ నాశ్రయించి ఉన్నదనుట కూడా మిక్కిలి ప్రమాణ దూరము. శ్రుతి సుషుప్తిలో జీవుడు బ్రహ్మతో ఏకమవుతాడని తెలుపుతోంది. అవిద్య అపుడు ఉంటే జీవ బ్రహ్మైక్యానికి అది ఆటంకం అవుతుంది. కాబట్టి సుషుప్తిలో చిదాత్మను ఆశ్రయించి అవిద్య ఉందనడం కుదరదు.

105. 'సతి సంపద్య న విదుః' అనే వాక్యం సుషుప్తిలో చిదాత్మ అవిద్యకు ఆశ్రయమై ఉన్నదని చెప్పడం లేదు. సుషుప్తిలో జీవులు బ్రహ్మంతో ఐక్యం పొందినా ఆ జ్ఞానం లేకుండా ఉన్నారని ఆ శ్రుతి

తాత్పర్యం. (చిదాత్మను ఆశ్రయించి అనాది భావ రూప మూలావిద్య ఉందని ఆ శ్రుతి చెప్పలేదు.)

106, 107. చిదాత్మను ఆశ్రయించిన భావ రూపమయిన అవిద్యను వాదం కోసం అంగీకరిస్తే అది నిత్యమా? అనిత్యమా? నిత్యమయితే మోక్షం ఉండదు. నిత్యమని చెప్పడానికి హేతువు లేదు. అనిత్యమని అంగీకరించినా, దానిని తొలగించేది చిత్ప్రకాశమా? జడ ప్రకాశమా? చిత్ప్రకాశం అవిద్యకు ఆధారం, అవిద్యాసాక్షి కనుక అది అవిద్యను నాశం చెయ్యదు. జడప్రకాశం కూడా అవిద్యను నాశం చెయ్యలేదు. చిదాత్మను ఆశ్రయించిన అవిద్య జడ స్వరూపం కనుక అవిద్యను పోగొట్టలేదు. కాబట్టి మీ సిద్ధాంతం ప్రకారం మోక్షప్రతిబంధకమయిన అవిద్యయే సిద్ధించదు. భ్రమ, గ్రహించక పోవడం సంస్కారాలు అవస్థాత్రయంలో మోక్షప్రీతి బంధకాలు.

108. **శ్రీ శంకరులు:** భ్రమ చిదవభాస రాహిత్యానికి కారణమని నీవు చెప్పావు. ఆ భ్రమను వివరించు. నేను మనుష్యుడను అని శరీరమందు ఆత్మబుద్ధిని భ్రమ అంటావా? అలా చెప్పరాదు. నీకు మిక్కిలి విస్మరించే శీలముంది. కాబట్టి సర్వ పదార్థాల సంకరాన్ని చెబుతున్నావు.

109. (భట్ట భాస్కరుని విస్మరించే శీలాన్ని వివరిస్తున్నారు)

**శ్రీ శంకరులు:** సర్వమూ భేదాభేదానికి విషయమవుతోందని నీ శాస్త్ర సిద్ధాంతం. దీనిచే 'ఇది ఖండం' అనే భేదాభేదజ్ఞానాన్ని ప్రమాణంగా తీసుకొనుచున్నావు. 'నేను మనుష్యుడను' అనే భేదాభేద విషయజ్ఞానాన్ని ఎందుకు ఉపేక్షిస్తున్నావు?

110. **శ్రీ శంకరులు:** 'నేను మనుష్యుడను' అనే జ్ఞానం భ్రాంతి కాదని అనుమాన ప్రమాణంచే సిద్ధిస్తోంది. భిన్నాభిన్న విషయమగుట వలన నేను మనుష్యుడను అనే బుద్ధి ప్రమాణము. ఇది ఖండము అనే జ్ఞానము దృష్టాంతము. (ఇది ఖండము అనే జ్ఞానమందు రెండు వస్తువులున్నందువల్ల భేదము, ఇది ఖండమనే అభేద వ్యవహారంచే అభేదమూ తెలుస్తున్నాయి. అలాగే 'నేను మనుష్యుడను' అనే జ్ఞానంలో

ఆత్మ శరీరం వేరుగా ఉన్నాయి. కనుక భేదము నేను మనుష్యుడను అనే వ్యవహారంచే అభేదం గోచరిస్తున్నాయి.

111. **శ్రీ భట్ట భాస్కరాచార్యులు:** నేను మనుష్యుడననే బుద్ధి (దేహేంద్రియాది అనాత్మల యందు ఆత్మబుద్ధి) నిషేధింప దగినదవడంచే ప్రమాణం కాదు. కాబట్టి ముత్యపు చిప్ప యందు వెండి యను భావం వలె దేహేంద్రియ సమూహమందే నేననెడి బుద్ధి నిషేధింపబడునదగుటచే ప్రమాణము కాదని అనుమాన ప్రమాణము. ముత్యపు చిప్పయందు వెండి యను భావమువలె దేహేంద్రియాదులయందు నేననెడి బుద్ధి భ్రాంతి.

కాబట్టి 'దేహేంద్రియ సముదాయ మందు ఆత్మబుద్ధి నిషేధింపబడు చున్నందువల్ల' అనే హేతువు 'నేను మనుష్యుడను' అనే జ్ఞానం భ్రాంతి అని సాధిస్తోంది. ఇలా సాధింపదగిన దాని కోసం చెప్పిన హేతువు సాధ్యాభావాన్ని సాధిస్తే సత్ప్రతిపక్షము అనే దోషం ఏర్పడుతుంది. ఇక్కడ ఆ దోషం కలిగింది. కాబట్టి నేను మనుష్యుడను అనే జ్ఞానం ప్రమాణం కాదు. (ఈ వాదాన్ని శ్రీ శంకరులు తరువాతి శ్లోకంలో నిరాకరిస్తారు.)

112. **శ్రీ శంకరులు:** (సాధింపదగినది సాధ్యం. దీనికంటె ఇతరమయినది సాధ్యాభావం. సాధ్యాభావమందు ప్రవర్తించు హేతువు సవ్యభిచారం. అది హేత్వాభాసమే కాని హేతువు కాదు.) నిషిధ్యమాన విషయత్వమనేది సవ్యభిచారము. ఒక గోవుకు కొమ్ములు లేవు. కొమ్ములు నరకబడినవనే భావంతో ఈ గోవు ఖండము అనే ప్రయోగంలో నిషిధ్య మానత్వమనే హేతువు వ్యభిచరిస్తోంది. ఈ గోవు ముండము (కొమ్ములు మొలవక పోవడంచే లేనిది) అనే ప్రయోగంలో కూడా పై హేతువు ప్రవర్తించుటచే ఈ హేతువు హేత్వాభాస మవుతోంది.

(నిషిధ్యమాన విషయత్వమనే హేతువు హేత్వాభాసమగుటచే నేను మనుష్యుడను అనే బుద్ధి భ్రమ అని చెప్పిరాదు. ఖండత్వ ముండత్వములతో కూడిన గోవు అభిన్నమయినట్లు దేహబ్రహ్మలతో కూడిన జీవుని అభేద జ్ఞానము ప్రమాణ రహితమగును.)

113. **శ్రీ భట్ట భాస్కరాచార్యులు:** ఈ భ్రమను సాధించే అనుమాన ప్రమాణమందు నిషిధ్యమాన విషయత్వము మాత్రమే భ్రమ హేతువు గాదు. ఉపాది అయిన అధిష్ఠానమందు గోచరించేదానికి నిషిధ్యమానవస్తు విషయకత్వము భ్రమ హేతువు. ఇలా చెప్పడంచే ఇది హేత్వాభాసం కాదు. ముత్యపు చిప్పను చూచి ఇది వెండి అని చెప్పునపుడు, అధిష్ఠానమయిన ముత్యపు చిప్ప యందు ఇది వెండి కాదని నిషేధింపబడుచున్నది. అలాగే ఆత్మయందు గోచరమయ్యే మనుష్యత్వం నిషేధింపబడుతున్నది కాబట్టి ఈ మనుష్యత్వం భ్రమయే. ఖండం గోవు అనే వాక్యంలో గోవునందు ఖండత్వం నిషిద్ధ్యమాన విషయం కాదు. ఇది సత్యం. భ్రమ కాదు.

**శ్రీ శంకరులు:** ఈ గోవు ఖండము అనే వాక్యంలో గోత్వోపాధి యందు గోచరించే ఖండము 'ఈ గోవు ఖండము కాదు' అని నిషేధించబడింది. నీవు అంగీకరించిన భ్రమ లక్షణం. నీవు ప్రమాణ సిద్ధంగా అంగీకరించిన ఖండము గోవు అనుచోట అతివ్యాప్తి పొందింది.

114. **శ్రీ భట్ట భాస్కరాచార్యులు:** ఈ పశువు ఖండము కాదు; ముండము అనే ప్రయోగంలో అధిష్ఠానమగు గోత్వమునందు ఖండమునకు నిషేధము లేదు. ముండమునందే ఖండమునకు నిషేధం ఉంది. కాబట్టి అధిష్ఠానమయిన గోత్వమందు ఖండ నిషేధం లేనందున నిషిధ్యమాన విషయత్వమను హేతువునకు సవ్యభిచార దోషము లేదు.

115-117 **శ్రీ శంకరులు:** వికల్పించి ప్రశ్నిస్తే నీ వాదం నిలబడదు. గోఖండప్రతిషేధం గోత్వం లేని ముండమందా? (ముండం = దేహం) గోత్వం కలిగిన గోవు శరీరమందా? దీనిలో మొదటి పక్షంలో గోత్వంలేని శరీరమందు గోఖండానికి సంబంధం ఉండదు కాబట్టి నిషేధం కుదరదు. ప్రసక్తి లేనిచోట ప్రతిషేధం ఉండదు కదా! గోశరీరమందు గోఖండ ప్రతిషేధమనే పక్షమందు ఈ గోముండముఖండము అనే ప్రతీతి యందు నీవు చెప్పిన భ్రమలక్షణం పడుతుంది. కాని ఆ భ్రమ లక్షణానికి సవ్యభిచార దోషం కూడా వజ్రలేపంవలే పడుతుంది.

118. **శ్రీ భట్ట భాస్కరాచార్యులు:** మీరు చూపిన అనుమాన ప్రమాణాల్లో ఉపాధి అనే దోషం ఉంది. ఈ పశువు ఖండమనే బుద్ధిని, ఇది ఖండము కాదు ముండము అని నిషేధించిన తరువాత సరియైన జ్ఞానము లభించిన పిదప కూడా అవిచ్ఛిన్నపూర్వ ప్రత్యయానువృత్తి వల్ల మీరు చూపిన హేతువుకు ఉపాధి దోషం ఉంది.

**శ్రీ శంకరులు:** బ్రహ్మసాక్షాత్కారం తరువాత 'నేను మనుష్యుడను' అనే భావం జ్ఞానిలో కూడా కనబడుతోంది. నేను బ్రహ్మను అనే భావం ఉన్నచోట సాధన వ్యాపకత్వం ఉంది. కాబట్టి ఉపాధి దోషం లేదు.

119. **శ్రీ భట్టభాస్కరులు:** 'తత్కేన కం పశ్యేత్' అనే శ్రుతి జ్ఞానికి విదేహ ముక్తి యందు వ్యవహార సామాన్యముండదని తెల్పుతోంది. కాబట్టి జ్ఞానం కలిగిన వానికి 'నేను మనుష్యుడను' అనే అవిచ్ఛిన్న పూర్వప్రత్యయాను వృత్తి ఉండదు. కనుక మీరు చెప్పిన హేతువునకు ఉపాధి దోషం తప్పదు.

120. పండితవర్యా! మేము జగత్తు అనిత్యమనీ అసత్యమనీ విశ్వసిస్తాం. కాబట్టి బ్రహ్మజ్ఞానికి జగత్తంతా అజ్ఞానమయంగా తోచుతుంది. అట్టి అజ్ఞానమంతా నిశ్శేషంగా నశించి పరబ్రహ్మమందు లయమైనప్పుడు, జగత్తు కూడా పరమాత్మునియందు లయమవుతున్నది. అప్పుడు వ్యవహారాలేవీ మిగిలి ఉండవు. ఇది సత్యం. కానీ మీ మతమందు ప్రారబ్ధకర్మ ననుస రించి 'నేను మనుజుడను' అనే అనుభవం మిగిలి ఉంటుంది. సర్వ వ్యవహారము చిదచిద్భేదాభేదాత్మకంగా సత్యమవడం చేత జగల్లయం లేనందువల్ల బంధనాశ రూపమోక్షం కుదరదు.

121. **శ్రీ శంకరులు:** మీ మతంలో జాతి వ్యక్తులు, గుణిగుణములు, కార్యకారణములు, విశిష్ట స్వరూపాలు, అంశాంశ భావములు అనే అయిదు స్థలాల్లోనే భేదాభేదాత్మకత్వం అంగీకరించబడింది. 'నేను మనుష్యుడను' అనే ప్రతీతి పై అయిదింటిలో చేరదు కాబట్టి శరీరానికి ఆత్మకు భేదాభేదాత్మకత్వం సిద్ధించదు.

నేను బ్రహ్మను అనే జ్ఞానం చేత నేను మనుష్యుడననే ప్రతీతి భ్రమ అవుతోంది. భేదాభేదాత్మకత్వం వల్ల ప్రతీతి సామాన్యం భ్రమ అనే మీ అనుమాన ప్రమాణానికి అసిద్ధి అనే దోషం కలుగుతోంది.

122. **శ్రీ శంకరులు:** మీ మతంలో జాతి వ్యక్తి మొదలయినవి అయిదు కలిసి భేదాభేదాన్ని నిర్వహిస్తాయా? అవి ప్రత్యేకంగా నిర్వహిస్తాయా? ఈ అయిదు ఎచ్చటా కలవవు. కాబట్టి మొదటి పక్షం కుదరదు.

123. **శ్రీ శంకరులు:** రెండవ పక్షంలో జాతి వ్యక్తి మొదలయిన వాటికి ప్రత్యేకంగా భేదాభేద తంత్రం అంగీకరించినట్లే దేహదేహి భావానికి భేదాభేద తంత్ర మెందుకు అంగీకరించకూడదు? నీవంగీకరించిన వాటి కంటె అధికంగా మరొక దానికి కూడా అంగీకరించడం వల్ల గౌరవ దోషం ఏర్పడుతుందంటావా? ఈ దేహదేహి భావాన్ని భ్రమగా నీవంగీకరించావు కదా!

124. **శ్రీ శంకరులు:** నీవు చెప్పిన అయిదింటిలో వాటికి మాత్రమే భేదాభేద తంత్రం ప్రవర్తిస్తుందని నీకు పట్టుదల ఉందా? అయినా నీవు చెప్పిన అయిదింటిలో కార్యకారణ భావం దేహిదేహాలకు కుదురుతుంది. దేహి అయిన చిదాత్మ కారణం. దాని యందు అధ్యస్తమయిన దేహం కార్యం. ఈ విధంగా నేను మనుష్యుడననే ప్రతీతిలో కూడా కార్యకారణ భావ ముండడం చేత భేదాభేద తంత్రం ప్రవర్తిస్తోంది.

125. **శ్రీ శంకరులు:** జగత్తంతా పరమాత్మ కార్యమే అవడం వల్ల దేహం జీవాత్మ కార్యం కాదని నిరాకరించకూడదు. ఉపనిషత్తులు ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంతంలో జీవాత్మ పరమాత్మ ఒకటే. కాబట్టి దేహి కారణము, దేహము కార్యమగుట తప్పుకాదు.

126, 127. **శ్రీ శంకరులు:** అద్వైత వేదాంతంలో నీవు చెప్పిన స్వరూపాసిద్ధి మొదలయిన దోషాలు లేవు. మా సిద్ధాంతం నిర్మలం. భ్రమ జ్ఞానాన్నే ప్రేమగా గుర్తించిన నీకు భ్రమ పదార్థమే సిద్ధించదు.

128. **భట్ట భాస్కరాచార్యులు:** స్వచ్ఛమైన స్ఫటికం కూడా ఎర్రటి పుష్పంతో కలసి ఉన్నప్పుడు దానికి ఎరుపురంగు ఆపాదించబడుచున్నది. అదే విధంగా భ్రాంతి కలిగిన అంతఃకరణంతో సంయోగం చెందటంచే ఆత్మకు కూడా భ్రమానుభవం కలుగుచున్నది. భ్రాంతి జగమగు అంతః కరణమందున్నా ఆత్మకు అనుభవం కలుగుచున్నది. అందువలన ఆత్మయందు భ్రాంతి కలుగదనే వాదన ఖండించబడుచున్నది.

129, 130. **శ్రీ శంకరులు:** పండితప్రవరా! ఈ ఆత్మ, భ్రమల సంబంధం సత్తా? లేక అసత్తా? ఆత్మ సంసర్గ శూన్యమవటం వలన ఆత్మకు భ్రమ సంభవించే; సత్యం కాదు. దీనిని తమరు అంగీకరిస్తే స్ఫటిక, పుష్పాల సామ్యంచే ఆత్మకు భ్రాంతి యొక్క అనుభవంగాదు. ఆ విధంగా ఆత్మభ్రమల సంబంధం సత్తుగాదు.

ఇక రెండవ పక్షమాలోచిద్దాం. భ్రాంతి కాలంలో అపరోక్ష జ్ఞానం లేనందున ఆత్మ భ్రమల సంబంధం అసత్యమని కూడా చెప్పడానికి వీలులేదు. ఆత్మ అపరిణామి అవడంచే ఆత్మయొక్క పరిణామ విశేషం యుక్తం కాదు; ఖండింపదగినది.

131. **శ్రీ శంకరులు:** ఇతర సంగం లేని ఆత్మ అవయవాలు లేనిది కాబట్టి దానికి పరిమాణం కలుగుట యోగ్యం కాదు. దానికి పరిణామ యోగ్యత ఉన్నదని అంగీకరించినా బుధ్యాకృతి వల్ల జ్ఞానాంతరాకారంతో చిదాత్మకు పరిణామం కల్గదు.

132. **శ్రీ శంకరులు:** నీ మతంలో నిత్య చైతన్య గుణాశ్రయ మయిన ప్రత్యగాత్మయందు భ్రమ జ్ఞానాత్మకమయిన పరిణామ ముందునని చెప్పరాదు. ఒక ద్రవ్యమందు రెండు శుక్ల రూపములవలె ఒకే ప్రత్యగాత్మ యందు రెండు నిత్యానిత్య చైతన్యములుండడం కుదరదు.

133. **శ్రీ శంకరులు:** మీ మతంలో నిత్య చైతన్య గుణం కలిగిన ఆత్మయందు భ్రమ రూపమయిన మరొక చైతన్యం ఉండడం కుదరదు. ఒకే ద్రవ్యమందు రెండు తెల్లగుణాలు ఎక్కడైనా ఉంటాయా?

**శ్రీ భట్టభాస్కరులు:** మా సిద్ధాంతంలో ఆత్మ నిత్యచైతన్యం. అది నిత్యచైతన్యగుణం కలది కాదు. కాబట్టి ఒకే సమయంలో రెండు సమానగుణాలకు ఆశ్రయం కావడం అనే దోషం కలుగదు.

134. **శ్రీ శంకరులు:** చేతి గాజులకు ఆశ్రయమైన బంగారం ఏకకాలంలో కంఠాభరణం కూడా కాజాలదు. ఆత్మ అపరిణామి. కాబట్టి భ్రమ ఆత్మకు సంభవింపదు. ఒకవేళ ఆత్మ పరిణామి అనే అంగీకరించినా, జ్ఞానరూప పరిణామం, భ్రమరూప పరిణామం రెండూ ఏకకాలంలో సంభవింపవు. కనుక భ్రమ సంబంధం ఆత్మకు ముడిపెట్టతగదు.

135, 136. **శ్రీ భట్టభాస్కరులు:** మా మతంలో భ్రమ శబ్దార్థ నిర్వచనం కుదరకపోయినా అగ్రహణం, సంస్కారం అనే వాటినే భ్రమ అని, అవిద్య అని చెప్పవచ్చు గదా!

**శ్రీ శంకరులు:** మీ మతంలో భ్రమ శబ్దార్థమే కుదరనప్పుడు భ్రమ నుండి పుట్టిన సంస్కారమెలా సిద్ధిస్తుంది? అగ్రహమే అవిద్య అని కూడా చెప్పరాదు. ఆత్మచైతన్య స్ఫురణం నిత్యం. అస్ఫురణాత్మకమయిన అగ్రహణం ఆత్మయందుండే అవకాశం లేదు.

చిదాభాసాత్మ విశిష్టమయిన అంతఃకరణ వృత్త్యభావమే అగ్రహణ మన్నా కుదరదు. ఆవృత్తి స్ఫురించనపుడు కూడా దానికి సాక్షియైన నిత్యచిదాత్మ ప్రకాశం ఉంది. కాబట్టి అగ్రహణానికి అక్కడ అవకాశం లేదు.

137. **శ్రీ భట్టభాస్కరులు:** మీ మతంలో నిత్యశుద్ధ చైతన్యమందు అధ్యసించబడిన అవిద్య ఎలా పోతుంది? అవిద్యకు అధిష్ఠానమయిన శుద్ధచైతన్యం అవిద్యను తొలగింపచేయదు కదా!

అవిద్య నుండి పుట్టిన అఖండ చిదాకారబుద్ధి వృత్తి అవిద్యతో సమానమయినదే కనుక అవిద్యను, జడబుద్ధి వృత్తిని నివర్తింపచేయలేదు కదా! (ఇక విద్యచేత అవిద్య తొలగుటచే కలిగే మోక్షం ఎలా సిద్ధిస్తుంది?)

**శ్రీశంకరులు:** మహావాక్యాల నుండి పుట్టిన అఖండాకార వృత్త్యారూఢ శుద్ధచైతన్యం అవిద్యను నివర్తింపచేస్తుంది.

138. **శ్రీ శంకరులు:** మీ మత ప్రకారం జీవయాత్ర కూడా కుదరదు. మీ మతంలో సర్వపదార్థాలు సామాన్య విశేష భావాత్మకాలు; భేదాభేద స్వరూపాలు. కాబట్టి ఏ వస్తు విజ్ఞానానికి భ్రమ, ప్రేమ అనే వ్యవస్థ కుదురదు. దీనివల్ల అన్ని వ్యవహారాల్లో సాంకర్యం కలుగుతోంది. లోకంలో జీవిక దుర్లభమవుతుంది.

139. ఈ విధంగా శ్రీ శంకరులు భట్ట భాస్కరాచార్యులవారి సిద్ధాంతా లన్నిటినీ సమూలంగా నాశనంచేసి తమ విజయ కేతనాన్ని ఎగురవేశారు.

140. భయంకరమైన వర్షాకాలపు మేఘ సముదాయం నుండి శరత్కాల చంద్రుని చంద్రికలు జనుల కాహ్లాదం కలిగిస్తున్నట్లుగా, భట్ట భాస్కరుని దుష్టమతంచే పండితులెల్లరు దిక్కుతెలియనివారు కాగా, వారి పాలిట శ్రీ శంకరులు శరత్కాలచంద్రుడై అద్వైతతత్త్వమనే సాటిలేని వెన్నెలను కురిపించారు. శ్రీ భట్ట భాస్కరులను జయించిన దివ్యకథ దేశ మందు నలుదిక్కులకు వ్యాపించింది.

141. శ్రీ శంకరులు భట్ట భాస్కరుని జయించిన తరువాత వారి కీర్తి చంద్రికలు అవంతి దేశపు నలుమూలలకూ వ్యాపించటమే గాక, బాణ మయూర దండి మున్నగు పండితులెందరో అద్వైత సిద్ధాంతాన్ని స్వీకరించి శ్రీ శంకరులకు శిష్యులైనారు.

142. శ్రీ శంకరులు అవంతి దేశంనుండి బాహ్లిక దేశానికి పయనమైనారు. అచ్చట అర్హతమతావలంబులైన జైనులు కొందరు అద్వైత తత్త్వాన్ని ఖండింప శ్రీ శంకరులను సమీపించారు.

143. **జైనుడు (అర్హతుడు):** మహాత్మా! శాశ్వతముక్తిని కోరేవారు సప్త భంగిచే ఎరుగాలి. (1. జీవం 2. అజీవం 3. అస్రవం 4. సంవరాలు 5. నిర్జరాలు 6. బంధం 7. మోక్షం.) తాము సర్వజ్ఞులై కూడా ఈ సప్త భంగిమలను త్యజించి ముక్తిని బోధిస్తున్నారే!

144. **శ్రీ శంకరులు:** పూజనీయుడా! జీవాస్తికాయ మేవిధంగా ఉంటుంది?

**జైనుడు:** జీవుడు దేహసదృశ పరిమాణంతో ఒప్పుతూ ఎనిమిది విధాలైన కర్మలచే బద్ధుడై ఉంటాడు.

145. **శ్రీ శంకరులు:** జీవుడు దేహపరిణామంతో ఉంటాడనడం సరికాదు. ఎందుకంటే, దేహపరిణామాలు చిన్న పెద్ద, పొట్టి పొడుగు మున్నగు వివిధ పరిణామాలతో ఉంటాయి. మనుష్య పరిణామమంత ఉండే జీవుడు ఏనుగు శరీరంలో ప్రవేశించిన పక్షంలో, మనుష్యదేహ పరిమితిగల (గజదేహం) మాత్రమే సజీవంగా ఉండాలి. అలాగే తేనెటీగ శరీరంలో ప్రవేశింపదలస్తే జీవునిలో కొంత భాగం బయట మిగిలిపోవలసి ఉంటుందిగదా! కాబట్టి జీవుడు మహత్తూ కాడు; అలాగని అణువూ కాడు.

146. **జైనుడు (అర్హతుడు):** మహాత్మా! జీవుడు దేహపరిణామంతో ఉంటాడనడంలో దోషమేమీ లేదు. జీవుడు సంకోచ, వ్యాకోచశక్తి గలవాడవడంచే, పెద్ద శరీరాలలో ప్రవేశించేటప్పుడు వ్యాకోచం చెందుచున్నాడు. అలాగే చిన్నశరీరాలలో ప్రవేశించేటప్పుడు తగు విధంగా సంకోచం చెందుచున్నాడు.

147. **శ్రీ శంకరులు:** జీవునికి అవయవాలు రావడం, పోవటం, శరీరాలందు వివిధ పరిణామాలలో ప్రవేశించటం నిర్ణయించటం వంటి వాదానికి శాస్త్రప్రమాణాలు లేవు. ఇది అంతా విరుద్ధవాదం.

148. **జైనుడు (అర్హతుడు):** ఆత్మావయవాలు జనన మరణాలు లేనివి. నాశరహితాలు; నిత్యాలు. కాబట్టి వస్తాయి, పోతాయి; వృద్ధి హ్రాస్వాల నొందగలవు. అందువలన దేహపరిమాణంతో నిమిత్తం లేకుండానే చిన్న, పెద్ద దేహాలందు ప్రవేశిస్తాయి; నిర్గమిస్తాయి.

149. **శ్రీ శంకరులు:** పూజనీయుడా! ఆత్మావయవాలు చేతనాలా? లేక అచేతనాలా? చేతనాలైతే దేహాన్ని ఒకేవిధంగా ఉండనీయవు. ఐకమత్యంతో ప్రవర్తించక తన నాశ్రయించిన దేహాన్ని నానావిధాలైన ఇబ్బందులకు గురి చేస్తాయి. అలాకాదని, అచేతనాలంటావా? అవి జడాలవుతాయి. కాబట్టి అవయవాలను చైతన్యవంతంగా చేయలేవు. చేతనత్వంలేని కారణాన అవయవాలకు వృద్ధి హ్రాస్వాలను చేయజాలవు.

150. **జైనుడు (అర్హతుడు):** యతివరేణ్యా! రకరకాలైన గుఱ్ఱాలను ఒకే రథానికి పూన్చి నడపటంలేదా? అదే విధంగా ఈ ఆత్మావయవాలు చేతనత్వాన్ని పొందికూడా ఈ దేహాన్ని పరస్పరం విరోధంలేక నడిపిస్తుంటాయి. పెద్దరథాన్ని ఈడ్వడానికి అశ్వాల నధికంగా పూన్చుతున్నారు. చిన్నరథాన్ని ఈడ్వడానికి అశ్వాలను తగ్గిస్తున్నారు గదా!

151. **శ్రీ శంకరులు:** శోభనమతిశీలా! అనేకాలైన అశ్వాలు ఒకే రథాన్ని ఈడ్చే విషయం అందరకూ తెలిసినదే. అచ్చట గుఱ్ఱాలను నియంత్రించడానికి రథసారథి ఉన్నాడు. కనుక చేతనాలైన ఆత్మావయవాలను, శరీర రథాన్ని నియంత్రించడానికి ఆత్మ ఉన్నది గదా! ఆత్మావయవాలు ఆత్మకన్నా భిన్నం కాదు కాబట్టి, ఆత్మకు అనిత్యత్వం సంభవిస్తుంది. అంతేగాక ఆత్మకు ప్రత్యేకత లేనందున నియామకత్వం సంభవించటంలేదు.

152. **జైనుడు (అర్హతుడు):** జీవావయవాలు వృద్ధిక్షయాలు లేనివి. ఏనుగువంటి భారీశరీరంగల దేహాలందు వ్యాకోచం చెందుతుంటాయి. అట్లే కీటకాది సూక్ష్మజీవులందు సంకోచం చెందుతాయి. పంటల నశింపచేసే క్రిమికీటకాదుల పరిమాణం నియమితమై ఉండటంచే, ఆ పరిమాణాన్ని అనుసరించే సంకోచ వ్యాకోచా లేర్పడుచున్నవి గదా! అట్లే జీవుని పరిమాణం నియమితం కాదు కనుక సంకోచ వ్యాకోచాలు జీవునికి యుక్తంకాదు.

153. **శ్రీ శంకరులు:** జీవుని అవయవాలు సంకోచ వ్యాకోచాలు చెందుచున్నవని పలుకుచున్నా, జీవుని అవయవాలు వికారం చెందు చున్నవి. అందువలన జీవునికి నిత్యత్వం సిద్ధింపక ఆత్మా నశించగా కృతి నాశాకృతాగమాలనే దోషం సంభవిస్తున్నది. జీవుడు నిత్యుడు కానందున పూర్వజన్మాల పుణ్యపాప కర్మలను ఈ జన్మయందు అనుభవింపక నూతన కర్మానుభవం కలుగుచున్నది. అంటే చేయని కర్మలు సంభవిస్తున్నవి. ఇది అకృతాగమ రూపదోషం. జీవుడు నిత్యుడు కాకపోవటం వలన కర్మానుభవ నియతికూడా కలుగదు.

154. జీవుడు సనాతనుడు కాకపోవటంచే, ముందు తెలిపిన వేద నీయాది అష్టకర్మ బంధాల వలన, సంసారసాగరంలో మునిగిన జీవాత్మకు

(ఎండిపోయిన సొరకాయ నీటిపై తేలేట్లు అనే) ఊర్ధ్వగతిరూప మోక్షం సిద్ధించదు. బంధ మోక్షాలు జీవునికేగదా! జీవుడు నిత్యుడైతే, కర్మాష్టకా లున్నప్పుడు బంధితుడవుతున్నాడు. బంధాలు లేనప్పుడు ముక్తుడవుతున్నాడు. కర్మలెలా నిత్యాలుకావో, జీవుడు కూడా నిత్యుడు కానందున మోక్ష మెవరికి చెప్పాలి? తమ ప్రతిపాదన ననుసరించి, ముక్తిని నిత్యుడుగాని జీవునకు చెప్పజాలం. కాబట్టి జీవునకు సంకోచ వ్యాకోచాలు వర్తించవు.

155. అర్హతా! ఆత్మావయవాలు చేతనాలయినా, నిత్యాలు కానట్లే జీవుడూ నిత్యుడుగాడు. కాబట్టి జీవాస్తికాయంమల్లేనే, సప్తభంగీ క్రమాన్ని కూడా అంగీకరింపం. ఆ విరుద్ధ ధర్మాలైన సప్తభంగిమలు ఏకకాలంలో ఒకే వస్తువునందు ఉండజాలవు. కనుక పరమాత్మ రూపమోక్షానికి సాధనలు కాజాలవు.

156. ఆ విధంగా శ్రీ శంకరుల అద్వైతతత్త్వ ప్రతిపాదనలచే అర్హత మతస్థులందరూ (జైనులు) తమ గర్వాన్ని వదలి శ్రీ శంకరులకు శిష్యులయ్యారు. తరువాత దరద, భరత, శూరసేన, కురు, పాంచాలాది దేశస్థులందలి పండితులెల్లరూ అద్వైతతత్త్వాన్ని స్వీకరించి శ్రీ శంకరులకు శిష్యులైనారు.

157-160. తరువాత శ్రీ శంకరులు ఖండనఖండనఖాద్య గ్రంథ కర్తయైన శ్రీ హర్షుని న్యాయ, మీమాంసాది శాస్త్రాలలో ఓడించి, ఆతడి దర్పం అణచారు.

"ఈతడు సూర్యునిలా ప్రకాశిస్తున్నాడు. వేదార్థాలన్నీ సామాన్యులకు కూడా అర్థమయ్యే విధాన తెలియజేస్తున్నాడు. వీరిని జయించటం అసాధ్యంగా తెలుస్తున్నది. నా మంత్రశక్తిని ప్రయోగించి వీరిని నా వశం చేసుకొంటానుగాక!" అని తలచాడు.

"సకల జనులేకాక నా శిష్యగణం కూడా వారికి శిష్యులవుతుండగా నేను మాత్రం శ్రీ శంకరులకు శిష్యుడనుగాకపోతే లోకులు నన్ను మన్నించరు. కనుక ఈ శంకరులకు శిష్యునిగా నటిస్తూ, నమ్మకం కలిగించి వారిపై నా మంత్ర ప్రయోగం చేస్తాను" అని తలచాడు.

161. ఈ విధంగా శ్రీ శంకరులు ఉత్తరదేశ పండితుల నెల్లరను తన శిష్యులుగా చేర్చుకొని తరువాత విదేహ, కోసలాది దేశాలకు వెళ్లారు. ఆయా దేశాలందు పండితులచే బహు విధాలుగా పూజింపబడి గౌడ దేశానికి వెళ్లారు.

162. శ్రీ శంకరులు గౌడదేశమందు మురారిమిశ్రుని, ఉదయా చార్యుని, ధర్మగుప్తుని వాదమందు జయించి వారినెల్లరను తన శిష్యులుగా చేసుకొన్నారు.

163. ఆ సమయమందు భట్ట భాస్కరునివంటి వైదిక కర్మమార్గీ యులు, బౌద్ధమత ప్రచారకులచే నాస్తిక గ్రంథాలు బహుళ ప్రచారంలో ఉన్నవి. శ్రీ శంకరులు అట్టి విమతాలనెల్ల ఖండిస్తూ, కేవలాద్వైత తత్త్వాన్ని స్థాపించి వేదాంత తత్త్వామృతాన్ని కురిపించారు. భాస్కరాదులు కూడా నిత్యశాంతిదాయకమైన వేదాంతతత్త్వాన్ని స్వీకరించి ధన్యులయ్యారు. ఆ విధంగా శ్రీ శంకరులు వేదాంత విజయభేరిని మ్రోగిస్తూ సర్వదిగ్విజయులై ప్రకాశించారు.

164. శ్రీ శంకరులు శాక్తేయులు, పాశుపతులు, క్షపణకులు, కాపాలికులు, వైష్ణవులు, శైవులు మున్నగువారి దుష్టవాదనలన్నింటినీ ఖండించారే గాని, పరాభవింపలేదు. వారి నెల్లరను ఓడించి వారందరికి సన్మార్గాన్ని బోధించి జగద్గురువులయ్యారు. సర్వజ్ఞుడైన పరమేశ్వరునికి దురహంకారముంటుందా?

165. లోకంలో వేదాంతమార్గం ఉపదేశించేవారూ శ్రవణమననాది పూర్వకంగా అభ్యసించేవారూ లేకపోవటంచే శిథిలమైపోసాగింది. అట్టి సమయంలో దీనదయాళుడైన పరమేశ్వరుడు, సర్వజగాల నుద్ధరింప మోక్షమార్గాన్ని కేవలాద్వైత తత్త్వాన్ని స్థాపించడానికై శ్రీ శంకరులుగా అవతరించారు. బ్రహ్మవిద్యా మార్గమందు గురుశిష్య సంప్రదాయం క్షీణించిపోవటంచే పరమశివావతారులైన ఆదిశంకరులు ఆ సంప్రదాయాల నెల్ల పునఃప్రతిష్ఠించారు. ఇలా శ్రీ శంకరగురు కరుణచే బ్రహ్మవిద్యామార్గం ఎంతో శోభిల్లింది.

166. శ్రీ శంకరులు 1. శాంతి 2. దాన్తి (శమదమనాలతో కూడిన వైరాగ్యం) 3. ఉపరతి (సర్వేంద్రియ జన్యపరమసుఖం) 4. చిత్తైకాగ్రత 5. సహనరూప తితీక్ష 6. శ్రద్ధ (వేదాంతశాస్త్రపరమైన ఆస్తికబుద్ధి) అనే ఈ ఆరుగురు తల్లులచే ప్రవర్ధమానులయ్యారు. మదించిన పాషండులను ఖండించి ముముక్షువులకు చక్రవర్తివలె పరమ సుఖమునందుంచటంచే జనులందరూ పరమానందం చెందసాగారు.

167. శ్రీ శంకరులు శిష్యగణాలతో జైత్రయాత్రకు బయలుదేరగా కాహళ్యాది వాద్యాలు మ్రోగించారు. ఆ మహా సంగ్రామంలో దేహాత్మ వాదులైన చార్వాకుడు దివంగతాలకు పరుగెత్తాడు. పరమాణువును, జడ పదార్థాలను పరమాత్మగా ఉపాసించే కాణాదులు శ్రీశంకరుల శిష్యగణ మందు పరమాణువులై విలసిల్లారు. ప్రకృతి సర్వకారణవాదులైన సాంఖ్యులు లెక్కలు తప్పారు. ఈ విధంగా సర్వశాస్త్ర పండితులు శ్రీ శంకరాచార్య పరమహంస చక్రవర్తితో సంకుల రణమందు పరాజితులై పరుగులెత్తారు. అట్లే ద్వైతవాదులైన యోగులు కూడా పలాయనులైనారు.

168. ఇదివరకెవరూ మండనమిశ్రుని కెదురుగా నిలచి మాట్లాడిన వారే లేరు. అటువంటి మండనమిశ్రుని జయించటంచే శ్రీ శంకరుల కీర్తి నలుదిక్కులా వ్యాపించింది. ఆ విజయ డిండిమ ధ్వనులు విజృంభించగా, పాషండులు దిక్కుతెలియనివారైనారు. కేవలోపనిషత్ప్రతిపాదిత అద్వైత తత్త్వోపదేశాలచే శ్రీ శంకరులు సర్వమతాలను ఖండించారు. శ్రీ మండన మిశ్ర ఉభయభారతీదేవులను జయించిన తరువాత ఇతరులను జయిం చటం నామమాత్రమే అయింది.

169. న్యాయదర్శన కర్తయైన గౌతమ మునివరుడు కూడా తన షోడశ పదార్థ ప్రతిపాదనాలను విడిచి దిక్కుతెలియనివాడై వ్యామోహంలో దగుల్కొన్నాడు. సాంఖ్యుడైన కపిలమహాముని కూడా జడవాదంలో ఎట్టకేలకు జడుడై నిలిచాడు. సర్వకార్యకారణ గమ్యం మోక్షమేనని ప్రతిపా దించే పతంజలిముని సంప్రదాయాలూ శ్రీ శంకరులకు ప్రణమిల్లుతూ నిలబడినవి. శ్రీ శంకరుల యశఃపటిమయేమని ప్రశంసింపగలం?

170. లోకంలో చక్రవర్తులు జైత్రయాత్రలు సలిపి విరోధి సైనికులను కారాగారంలో బంధించిన విధంగానే శ్రీ శంకర చక్రవర్తి కూడా కాణాది, చార్వాకాది మతస్థులందరినీ వారి వారి మతాలందే బందీలనుగా జేస్తూ, వారి మతాలందలి లోపాలను తెలియజెప్పుతూ, సత్యబుద్ధి కలిగిన తరువాత అద్వైతతత్త్వ సిద్ధాంతాలను బోధిస్తూ వారినెల్లరను మోక్ష సామ్రాజ్యానికి అభిషక్తులను గావించసాగారు. ఈ విధంగా శ్రీశంకరుల దివ్యమహిమ, జ్ఞానతత్త్వంలా అనిర్వాచ్యమై వెలయుచున్నది.

171. పాషండమతస్థులు శమదమాది సుగుణాలు లేనివారై, అసత్యవాదులై, దయాశూన్యులై, ఆస్తికులందరికీ శాంతిలేకుండా చేస్తూ లోకకంటకులైనారు. అట్టి మతాలన్నింటినీ శ్రీ శంకరులు నిశ్శేషంగా నశింప జేసి లోకహితం ఒనరించారు. ఈ విధంగా సర్వమతాలు, సర్వశాస్త్రాలు, వైదికావైదిక ఆచారాలన్నీ శ్రీ శంకరులచే ఖండింపబడినవి. కేవలాద్వైత తత్త్వ వేదాంతాన్ని స్థాపించారు.

172. కేవలాద్వైత తత్త్వామృతం సర్వతోముఖంగా ఎడతెగక వర్షించటంచే ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయాలు పూర్తిగా నశించినవి. జనులు పరమశాంతి కలిగి సర్వసంతాపాలను దుఃఖాలను వీడారు. దుష్టులైన నాస్తికవాద భిక్షువుల స్వార్థపూరిత బోధలతో కూడిన అవివేక కాలం నశించింది. పాషండమత తీవ్రతాపాలు పూర్తిగా తొలగి పోయినవి.

173. శ్రీ శంకరగురువరులు సర్వమతాలను కేవలం పేరు చెప్పుకొనే టంత వరకు మిగిల్చి ఉంచారు. అద్వైత తత్త్వాన్ని లోకమంతా వ్యాపింప జేశారు. యోగదర్శన తత్త్వజ్ఞులైన పాతంజలు లందరూ మంచి బంటులై వ్యవహరించారు. కాపాలికులందరూ తాంబూలాలను పట్టుకొనే సేవకు లైనారు. కాణాదులు ద్వారపాలకులయ్యారు. క్షపణికులు స్తుతిపాఠాలు వల్లిస్తూ వందిమాగధులైనారు. దిగంబరమతస్థులందరూ సామంతులైనారు. ఈ విధంగా ఆయా మతస్థ లెల్లరు శ్రీ శంకరుల వేదాంత గరిష్ఠ సూక్తులచే

కథాశేషత్వాన్ని పొందారు. మహాపండితులైన మతకర్తలందరూ శ్రీ శంకర సూక్తులకు వశీభూతులై పరాజయం పొంది శ్రీ శంకరులకు శిష్యులై శరణు జొచ్చారు. ఇదివరకెన్నడూ గ్రహింపని వేదాంత తత్త్వాన్ని గ్రహించి శ్రీ శంకరులకు శిష్యులయ్యారు.

174. ఈ విధంగా శ్రీ శంకరులు అజ్ఞానజనిత వ్యామోహాన్ని పూర్తిగా నశింపజేసి, ముముక్షువుల సందేహాలన్నీ నశించేట్లు చేసి, వివేక వైరాగ్య దివ్యతేజస్సుతో ప్రకాశించారు. శ్రీ శంకరులు సర్వలోక హితానికై శిష్యులతో కూడా జ్ఞానతత్త్వ ప్రచారం గావించారు.



# సర్గము - 16

## శ్రీశంకర యతీంద్రుల సార్వభౌమ శ్రీశారదా సర్వజ్ఞ పీఠారోహణం

1. పూర్వసర్గమందు శ్రీ శంకరుల దిగ్విజయ జైత్రయాత్రను గూర్చి విస్తారంగా వివరించబడినది. ఇకపై శ్రీ శంకరులు సర్వజ్ఞపీఠమైన శ్రీ శారాదాపీఠాన్ని అధిష్ఠించబోవటం తదితర విషయాలను వివరింప బోతున్నారు. అంతేగాక మహామాంత్రికుడైన ఆ అభినవగుప్తుడు పరాజితుడై శిష్యునిలా నటిస్తూ జగద్గురువుల పట్ల ఒనర్చిన దుష్కృత్యాలను తెలుపుచున్నారు.

2. అవమానభారంచే అభినవగుప్తునియందు అసూయాద్వేషాలు దినదినప్రవర్ధమానంగాసాగాయి. సమయానికై వేచివున్నవాడై ఒకానొక రోజు శ్రీ శంకరులపై మహామారణ మంత్రప్రయోగం చేశాడు. మంత్ర మహిమచే శ్రీ శంకరులు భయంకరమైన మూలవ్యాధికి గురిఅయ్యారు.

3. ఆ భయంకర వ్యాధి వలన శ్రీ శంకరులు ధరించిన వస్త్రాలన్నీ రక్తసిక్తాలయ్యేవి. ఆ వస్త్రాలన్నిటిని శిష్యుడైన శ్రీ తోటకాచార్యులవారు శుభ్రపరస్తూ గురుసేవా నిమగ్నులైనాడు. శ్రీ శంకరులు సదా నిర్వికల్ప సమాధిలో ఉంటూ యీ తీవ్రబాధను తెలియకుండా ఉండేవారు.

4. ఆ మహావ్యాధి తీవ్రతకు శిష్యులెల్లరూ మనస్సు కలతచెందిన వారైనారు. వారెల్లరూ గురుదేవుని సమీపించి వారి మనోవేదననిట్లు విన్న వించుకొన్నారు.

**శిష్యులు:** సర్వలోకపూజనీయా! మహాత్మా! తాము సర్వజ్ఞులు. మేము తమకు చెప్పదగినవారం కాము. తమ దేహబాధను కళ్లార చూసి భరించ లేనివారమై మీ వద్దకు వచ్చి యీ విన్నపం చేయదలచాం. సర్వజ్ఞులైన మహాత్ములు శరీరానికి సంభవించే సుఖ దుఃఖాలను, వ్యాధులను

లెక్కచేయక సదా నిర్వికల్పసమాధియందు గడుపుతుంటారు. శరీర రుగ్మత లన్నింటినీ నిర్లక్ష్యం చేస్తుంటారు. అది సరికాదని మనవి చేయడానికే మేమందరమూ ఇచ్చటకు వచ్చాం. తమ దేహాన్ని ఆవహించిన రోగం మహాతీవ్ర దశకు చేరుకొంది. శత్రువు ప్రతిదినం బలాన్ని పుంజుకొంటూనే ఉంటాడు. అట్టి శత్రువును ఉపేక్షచేయక దాని నాశనోపాయం ఆలో చించాలి.

5. మహనీయా! తమకు దేహాభిమానం లేదు. అందువలన వ్యాధిచే కలిగే తీవ్రబాధను కూడ తాము లెక్కచేయటం లేదు. కానీ మేము తమరిని అశ్రయించి ఉన్నవారం. మా కన్నులార తమ శరీర బాధను చూచి ఊరక ఉండలేకున్నాము. మిక్కిలి దుఃఖిస్తున్నాము.

6. మహాత్మా! సర్వవ్యాధులకూ నివారణ తెలిపే అనేక వేదవిహితమైన శాస్త్రాలున్నవి. ఆయా శాస్త్రాలందు నిష్ణాతులైన వైద్యపండితులను రావించి రోగనిర్ణయం గావించి వైద్యం చేయించాలి.

7. వైరాగ్యంచేతగాని, జ్ఞానతత్త్వంచేతగాని మహాత్ములు శరీరాలు నిత్యంగావని తలుస్తారు. ఆ విధంగా గురుదేవులైన తాము సుఖదుఃఖాలను త్యజించినవారై ఉన్నా, తమకు వాటిల్లిన రోగాది బాధలను ప్రత్యక్షంగా చూస్తూ, అందుకు కావలసిన నివారణోపాయాల నాలోచింపని సమర్థులైన శిష్యులుండరాదని శాస్త్రాలు చెబుతున్నవి.

8. మహాత్మా! భ్రమరాలు పద్మాలనాశ్రయించి మకరందమా స్వాదించే విధాన, మేము తమ తత్త్వజ్ఞానామృతాన్ని ఆస్వాదిస్తూ నిత్యా నందం పొందుతున్నాం. కనుక తమ దేహం బాధారహితమై ఉన్నప్పుడే మేము తమ తత్త్వజ్ఞానాన్ని శ్రవణం చేయగలవారమవుతాం. కాబట్టి మా ప్రార్థన ఆలకించి, తప్పక యీ వ్యాధికి చికిత్స చేయించుకోవడానికి అంగీ కరించాలి.

9. **శ్రీ శంకరులు:** ప్రియమైన వత్సలారా! వ్యాధి అనేది పూర్వజన్మ కృత్యంచే సంక్రమిస్తున్నది. అది అనుభవించి తీర్చుకోవాలే గాని వేరే మార్గంలేదు. దానికై చేసే ఎట్టి ప్రతిక్రియయైనా వ్యర్థమవుతుంది. కాబట్టి

అనుభవించే ఈ వ్యాధిని నివృత్తి చేసుకోవాలి. ఒకవేళ ఈ జన్మలో అనుభ వించడానికి వీలుకాని పక్షంలో మరొక జన్మలో ఆ శేషభాగాన్ని అనుభ వించే తీరాలి. ఈ విధంగా కర్మ పూర్తిగా క్షయమయ్యే వరకు వ్యాధి నివృత్తి కాదు. ఈ విషయాలన్నీ శాస్త్రాలు వచిస్తున్నవి.

10. అంతేగాక వ్యాధి చికిత్సార్హమైనవీ, చికిత్సార్హం కానివీ అని రెండు విధాలుగా ఉన్నవని తత్త్వజ్ఞులు తెలుపుతున్నారు. పూర్వజన్మ కర్మ ఫలంచే సిద్ధించేవి కొన్ని వ్యాధులు. వాత పిత్త శ్లేష్మాది దోషాలచే ఏర్పడేవి మరి కొన్ని వ్యాధులు. ఇందు పూర్వజన్మ కర్మ విశేషంచే ఏర్పడే వ్యాధులు ఔషధా లచే నశించేవి కావు. రెండవ తరగతికి చెందినవి మాత్రమే ఔషధాలచే నివృత్తి కాగలవు.

11. శిష్యులారా! ప్రస్తుతం నా శరీరాన్ని ఆవహించిన యీ వ్యాధి పూర్వకర్మచే సంప్రాప్తమైనది. కాబట్టి అనుభవించే ఆ కర్మనివృత్తి చేసు కోవాలిగాని, ఔషధాలచేగాదు. వ్యాధి తీవ్రతచే ఈ శరీర మెప్పుడైనా పడి పోవచ్చు. దేహమెప్పుడైనా నశించవలసినదేగదా! అందుకు నేనెంత మాత్రమూ చింతించటం లేదు.

12. **శిష్యులిలా పలికారు:** మహాత్మా! తమబోటి తత్త్వజ్ఞులైన వారికి దేహభ్రాంతి ఎంతమాత్రమూ ఉండదు. ఇది సత్యం. అయినా మా విన్న పాన్ని త్రోసిపుచ్చవద్దు. ఎందుకంటే, తమరు కేవలం జ్ఞానతేజస్సుచే ప్రకా శిస్తున్నారు. తమరు లోకల్యాణానికై అవతరించారు. అందువలన తమరీ దేహాన్ని ఎక్కువ కాలం ధరించాలని కోరుకొంటాము. నీటి నాధారంగా చేసుకొని అనేక జలచరాలు జీవిస్తున్నవి. అదేవిధంగా, తమ దివ్యపాద పద్మాల నాశ్రయించి మేమందరమూ జీవిస్తున్నాం. తాము జీవించి ఉంటేనే గదా, మాబోటి వారమందరమూ సురక్షితంగా ఉండగలం. తేనెటీగల యందు తల్లి ఈగ నాశ్రయించి యితర ఈగలన్నీ తమ మనుగడ సాగిస్తు న్నవి. ఆ విధంగానే తమ దేహరక్షణ మాకు అత్యంతావశ్యకమై ఉన్నది.

13-16. మహాత్మా! జ్ఞానసంపూర్ణులైన తమకు దేహంతో నిమిత్తం లేకపోయినా, లోకహితం కొరకు శరీర రక్షణం అవసరమై ఉన్నది. కాబట్టి చికిత్సకు అంగీకరించండి.

శిష్యులందరూ చేరి పరిపరి విధాల ప్రాథేయపడగా శ్రీ శంకరులు వైద్యులను రావించడానికి అంగీకరించారు. అంతట శిష్యులందరూ వైద్యుని అన్వేషింప బయలుదేరారు.

ఘనులైన వైద్యులెల్లప్పుడూ ఆయాదేశాలందు రాజులను సేవిస్తుంటారు. కాన శిష్యులందరు మహారాజు నివసించే రాజధానీ నగరానికి పయన మైనారు. అంతట వారందరూ అత్యుత్తమ ప్రతిభ కలిగిన వైద్య నిపుణులను గురువరుల వద్దకు తీసుకొనివచ్చారు.

17-19. **వైద్యులు శ్రీ శంకరులతో:** మహాత్మా! తమ వ్యాధి వివరాలను తెలుపండి. మా శక్తివంచనలేక తమకు వైద్యం చేయగలము.

**శ్రీ శంకరులు:** వైద్యవరులారా! మూలవ్యాధిచే గుద సమీప ప్రాంత మందు రక్తసిక్తమై మిక్కిలి బాధిస్తున్నది. ఆ బాధ నివారణకై తమవద్ద ఏదేని దివ్యౌషధముంటే ఆ బాధను నివారించండి.

వైద్యులారా! ఈ వ్యాధి పూర్వజన్మల పాపకృత్యంచే ఏర్పడినదని నాకు తోచుచున్నది. అట్టి కర్మలు అనుభవంచేతనే తీర్చుకోవాలని తలచి ఔషధాలు సేవించలేదు. అందువలన వ్యాధి ఇప్పుడు ప్రకోపించిన దశలో ఉన్నది. చికిత్స తప్పక తీసుకోవలసినదిగా నా శిష్యులు నిర్బంధించటంచే మిమ్ము రావించడం జరిగినది. దీనిని నివారించే ఔషధమేమైనా ఉందా?

20. శ్రీ శంకరగురువరు లీ విధంగా పలుకగా, ఆ వైద్య శిరోమణు లందరూ, గ్రంథాలన్నీ పరిశీలించి, వారి అనుభవాన్ని జోడించి పరీక్షిం చారు. అయినా ఆ మూలవ్యాధిని నివారింప వారికి సాధ్యపడలేదు. వారూ తమ అశక్తతను తలచుకొని ఎంతో దుఃఖించారు.

21-24. **శ్రీ శంకరులు:** వైద్య శిరోమణులారా! మీరందరూ చికిత్స నిమిత్తమై మీమీ గృహాలను విడచి చాలాకాంగా ఇచ్చటనే ఉన్నారు. ఇందు

మూలంగా మీ భార్యా పుత్రులు ఎంతో అసౌకర్యాలకు గురి అవుతారు. అందుచే మీరు మీ గృహాలకు తిరిగివెళ్లండి.

అంతేకాక, మీరు గృహంలో లేకపోవడంచే ప్రభువుల సేవకు కూడా దూరమై వారి ఆగ్రహానికి గురికాగలరు. దానివలన మీకెంతో తీరని నష్టం వాటిల్లగలదు.

అంతేగాక మీరిచ్చటనే చాలాకాలముంటే మీ దేశమందు వైద్య సౌకర్యాలులేక జనులు ఎంతో కష్టాల పాలవుతారు.

25. వైద్యశిఖామణులారా! దేహం తల్లిదండ్రులచే ప్రసాదించబడినదే అయినా, దేహ సంరక్షణ మాత్రం వైద్యుల అధీనంలోనే ఉంటుంది. వైద్యుడు లేకుంటే జన్మ వృథా కాగలదు. ఈ విధంగా వైద్యుడు సాక్షాత్తూ శ్రీమన్నారాయణమూర్తియే. అందువలన మీ దేశస్థులందరూ ఎంతో పరితాపం చెందగలరు.

26,27. **వైద్యులు ఇలా పలికారు:** మహాత్మా! తాము సెలవిచ్చిన దంతా యథార్థం. అయినా తమ దివ్యసన్నిధానాన్ని విడిచి వెళ్లడానికి మా మనస్సులు అంగీకరించటంలేదు. మిమ్మల్ని ఆశ్రయించి ఎందరో జ్ఞానార్జనకై మీ సన్నిధానంలో ఉన్నారు. అట్టి స్వర్గతుల్యమైన తమ సన్నిధానాన్ని విడిచి పోవడానికి ఎవరైనా అంగీకరిస్తారా?

ఈ విధంగా పలుకుతూ, వైద్యులు వారి గృహాలకు వెళ్లారు. దేహ భ్రాంతిలేని ఆ శంకరగురువరులు ఆ తీవ్రవ్యాధిచే కలిగే బాధనంతా సహిస్తున్నారు.

28–36. శ్రీ శంకరు లా వ్యాధికి వశులుకాక, తీవ్రసమాధి నిష్ఠలో ఉంటూ మనస్సునంతా ఆ పరమేశ్వరునిపైనే లగ్నంజేశారు. శరీర భ్రాంతిని విడిచి స్వస్వరూపస్మృతిని పొంది చిన్మాత్ర స్థితిలో ఉన్నారు.

మహేశ్వరుడైన ఆ పరమశివుని ఆజ్ఞానుసారం అశ్వనీదేవతలు బ్రాహ్మణరూపం దాల్చి వైద్యులుగావచ్చి శ్రీ శంకరులను పరీక్షించారు.

**అశ్వనీదేవత లిలా పలికారు:** యతీంద్రా! మాకు తెలిసిన వైద్యపరీక్ష లన్నీ చేసి చూశాం. మహామంత్ర ప్రయోగంచే ఈ వ్యాధి సంప్రాప్త

మైనదని రూఢి అయినది. కనుక ఇది వైద్యచికిత్సలకు లొంగేది కాదు. ఇది సత్యం.

శ్రీ శంకరుల మూలవ్యాధి నివారణకై చేసిన వైద్యప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. మారువేషంలో బ్రాహ్మణ వేషధారులై వచ్చిన అశ్వనీదేవతలు కూడా అశక్తులై "ఇది శత్రువెవరో మహామంత్ర ప్రయోగం చేయటం వలన ఈ వ్యాధి సంక్రమించి"దని తెలుపటంచే శిష్యగణమంతా ఎంతో కృద్ధులయ్యారు. శ్రీ పద్మపాదాచార్యులు క్రోధావేశపూరితులై శ్రీ శంకరులు వలదని వారించినా వినక తన కిష్టదైవమైన శ్రీ నరసింహస్వామిని ధ్యానించాడు. గురుదేవుల మహావ్యాధి నిర్మూలనకై నారసింహ మంత్రాన్ని జపించారు. నారసింహమంత్రం సర్వ శత్రు విఘాతుకం; సర్వశాక్తేయ మహా మంత్రభేదకం.

శ్రీ పద్మపాదాచార్యులవారి నారసింహ మంత్రప్రయోగంచే, పరమ నీచుడైన అభినవగుప్తున కా మూలవ్యాధి సంప్రాప్తమయింది. వ్యాధి ఎంతో ప్రకోపించిన స్థితిలో ఉండడంతో అభినవగుప్తుడు ఆ వ్యాధిచే మరణించాడు. శ్రీ శంకరుల వ్యాధి క్రమంగా తగ్గుముఖం పట్టి సంపూర్ణ ఆరోగ్యవంతులయ్యారు.

ఆ తరువాత శ్రీ శంకరులకు తమ గురుదేవులకు (గోవింద భగవత్పాదులు) గురువువైన శ్రీ గౌడపాదమహర్షుల దర్శనమయింది. ఒకానొక రోజు గంగాతీరాన కూర్చుని పరబ్రహ్మాన్ని ధ్యానిస్తున్నారు. అట్టి సమయంలో గంగానది నుండి మందశీతల వాయు ప్రసరణల నడుమ పరమ యోగీశ్వరులైన శ్రీ గౌడపాదాచార్యులవారు పయనమై రావడం చూశారు. వారి దర్శనం చేతనే తమకు ఆత్మీయులైన గురువరేణ్యులకు పరమగురువైన శ్రీ గౌడపాదాచార్యులవారని తెలుసుకొన్నారు. వారికి సాష్టాంగదండ ప్రణామ మొనరించి భక్తిప్రపత్తులతో ఎదురేగారు.

శ్రీ గౌడపాదాచార్యుల వారు వికసించిన పద్మంలా తెల్లని కమండలవును చేతబూని, నీలమేఘశ్యాముడై సంధ్యాకాంతులను పోలిన కాషాయ వస్త్రాలను ధరించి ప్రకాశిస్తున్నారు.

శ్రీ గౌడపాదాచార్యవారి చేతి కమండలవును తెల్ల కలువలని భ్రమిం చిన భ్రమరాలు చుట్టుముట్టసాగినవి. చేతిలో రుద్రాక్షమాలను ధరించి వచ్చే శ్రీ గౌడపాదాచార్యుల వారిని శ్రీ శంకరులు దర్శించారు.

దర్శనమాత్రంచేతనే సర్వసంతాపహారులైన శ్రీ గౌడపాదమహర్షు లను చూసి వెంటనే శ్రీ శంకరులు భక్తిశ్రద్ధావినయాలుట్టిపడగా సాష్టాంగ నమస్కారం చేశారు. శ్రీ శంకరులు అతివినమ్రులై గురుదేవుల ప్రక్కన నిలబడ్డారు.

37-40. ప్రసన్నహృదయులైన శ్రీ గౌడపాద మునిపుంగవులు అనుగ్రహదృక్కులతో శ్రీ శంకరులను తడవుతూ, ఆనందజలపూరమిశ్రము లైన చూపులు ప్రసరింపజేస్తూ శ్రీ శంకరుల నుద్దేశించి ఇలా పలికారు.

**శ్రీ గౌడపాదమహర్షులు:** వత్సా! యతీంద్రా! శ్రీ గోవింద భగవ త్పాదాచార్యులవారి అనుగ్రహం పొంది బ్రహ్మవిద్యను గ్రహించావు. ఆ మహోన్నతవిద్యను నిస్సందేహంగాను, సంపూర్ణంగాను గ్రహించావా? అంతే గాక అట్టి జ్ఞానామృత విద్య వృద్ధి పొందుచున్నది గదా? యథార్థ తత్త్వాన్ని బాగా ఎరిగి ఉన్నావు గదా? అట్టి బ్రహ్మవిద్యచే నిరతిశయానంద స్వస్వరూపస్థితిలో ఉన్నావు గదా?

మునివరా! తమ శిష్యులందరూ శమదమాది సద్గుణసంపన్నులై శ్రద్ధతో తత్త్వజ్ఞానాన్ని గ్రహిస్తున్నారా? గురువులైన మిమ్మల్ని నిరంతరం సేవిస్తున్నారు గదా! నీ శిష్యులందరూ ఆత్మజ్ఞాన సంపన్నులై నిత్యానందాన్ని పొందుతున్నారా?

బ్రహ్మవిద్యకు పరమ శత్రువులయిన కామక్రోధాది అంతఃశత్రువులు సంపూర్ణంగా జయించబడినవా? శాంతి దాంతి మున్నగు సద్గుణాలు బాగా అలవడినవా? యమనియమాది అష్టాంగ యోగాలు నిరంతరం సాధన చేస్తున్నావా? సర్వఫలమైన నిత్యానంద పరబ్రహ్మ తత్త్వమందు నీ మనస్సు విహరిస్తున్నదా?

41-47. **శ్రీ శంకరులు:** మహాత్మా! అపార కరుణాసముద్రా! దయా సాగరులైన తమ కృపాకటాక్ష వీక్షణాలచే సర్వం పొందాను. సర్వమూ సిద్ధించటంచే ఎట్టి కొరతాలేదు. తమ యొక్క అనుగ్రహం సకల జ్ఞాన ప్రదం. నిత్యశాంతి పదం.

మహాత్మా! తమ అనుగ్రహముంటే మూగవాడు కూడా మహావక్త కాగలడు. మందమతి కూడా పండితశిఖామణి కాగలడు. కామాభిలాష గల పామరుడు గూడా గణనీయమైన వివేకవైరాగ్యంగలవాడై ప్రఖ్యాతి చెందగలడు. తమ అమృతస్వరూపాన్ని ఏమని కొనియాడగలను.

అచింత్య ప్రభావా! తమ దివ్యతేజోభాసురం పరిమితిలేనిది; అపారం. తమయొక్క అప్రాకృతజ్ఞాన మాహాత్మ్యాన్ని ఎవరూ తెలుసుకోజాలరు. తమ గురుదేవులైన శ్రీ శుకమహర్షి సంతుష్టుడై స్వయంగా తత్త్వజ్ఞానాన్ని ఉపదే శించారు. తమ వైరాగ్య సంపదనెవరు ఊహించగలడు?

తమ గురుదేవులైన శ్రీ శుకబ్రహ్మలవారు పుట్టుకతోనే వైరాగ్య సంపన్నుడై నిరంతరం పరబ్రహ్మమందు రమించేవాడు. అట్టి పుత్రుని గాంచి వ్యాసుడంతటివాడు "పుత్రా! పుత్రా!" అని పిలుస్తూ పుత్రభ్రాంతిచే ఎంతో వ్యామోహితుడయ్యేవాడు.

శ్రీ శుకమహర్షి సర్వాత్మ భావంలో ఉండేవారు. శ్రీ వేదవ్యాసులవారు "హా! పుత్రా!"అని బిగ్గరగా అరుస్తుండగా, శ్రీ శుకబ్రహ్మలవారు మారు మాట్లాడకపోయేవారు. అయినా, వృక్షరూపందాల్చి 'ఓహో' అని తండ్రికి బదులు పలికేవారు. (అంటే వృక్షాలు ప్రతిధ్వనించినవని భావం).

మహాత్మా! గురుదేవా! తాము జ్ఞాన సముద్రులు. బహుజన్మల పుణ్యఫలంచేగాని తమ దర్శనభాగ్యమే లభింపదు. దైవవశాన దీనుడనైన నా కట్టి భాగ్యం లభించినది. ఇదంతా ఈ భక్తుని అపరిమిత భాగ్యం. నన్ను అనుగ్రహించండి.

48,49. **శ్రీ గౌడపాద మహర్షి:** వత్సా! నీ సద్గుణాలన్నీ విని ఉన్నాను. అందువలన నిన్ను చూడాలన్న ఉత్కంఠతో ఇచ్చటకు వచ్చాను. అవన్నీ యథార్థాలేనని స్వయంగా తెలుసుకొన్నాను.

వత్సా! నాచే రచింపబడిన మాండూక్యోపనిషత్తునకు కారికార్థాలను ప్రకటిస్తూ భాష్యగ్రంథం నీవు రచించావని, నా శిష్యుడైన గోవింద పాదాచార్యులు చెప్పగా విన్నాను. విద్యాంసుడా! అది మొదలుకొని, మిమ్మల్ని దర్శించి ఆ భాష్యాలను వినాలని కుతూహలంతో ఉన్నాను.

50. శ్రీ గౌడపాదాచార్యుల వచనాలు విన్న శ్రీ శంకరులు మహదానందం పొంది తాము రచించిన మాండూక్యోపనిషత్తుకు భాష్యాన్ని కారికాలు రెంటినీ సవిస్తరంగా వినిపించారు. అందు ఉపనిషత్తుతో కూడియుండీ, తన అభిప్రాయాలకు భిన్నంగా లేకుండటంచే ఆశ్చర్యసంతోషాలతో శ్రీ శంకరులతో అనుగ్రహపూర్వకంగా ఇలా పలికారు.

51. **శ్రీ గౌడపాదమహర్షి:** యతివర్యా! నాచే రచింపబడిన కారికాలు కడు దుర్ఘటాలు. అయినా వాటిని విడదీసి వ్యాఖ్యానించావు. నేను ఎంతో సంతోషిస్తున్నాను. తమ జ్ఞాన సంపద అపారమని తెలియజేస్తున్నది. అట్టి విద్వాంసుడవైన నీకు వరమీయాలని నా మనస్సు ఉవ్విళ్లూరుచున్నది. ఆ విధాన శ్రీ శంకరుల భాష్యద్వయాన్ని విని శ్రీ గౌడపాదులవారు సంతోష సాగరంలో మునిగి తేలారు.

52. **శ్రీ శంకరులు:** మహాత్మా! తాము సర్వశుభకర జ్ఞానస్వరూపులు. తాము మూడు యుగాలందు పరమాత్మ స్వరూపులై విష్ణుదేవునివలె ఉండేవారలు. కలి నతిక్రమించిన దివ్యపురుషులు. తమ దర్శన భాగ్యంకన్నా వేరే భాగ్యమేమి ఉంది? తమను దర్శించినంత మాత్రాననే సర్వం సిద్ధిస్తుంది. అయినా వరం కోరుకొమ్మన్నారు గాన కోరుకొంటాను. "నేను నిత్యం ఎటువంటి అంతరాయంలేక స్వస్వరూప పరబ్రహ్మమందు విహరించేట్లు వరమివ్వండి."

53,54. అంతట శ్రీ గౌడపాదమునివరులు శ్రీ శంకరులకు ఆ వరమొసగి అంతర్ధానమైనారు. తరువాత శ్రీ శంకరులు శ్రీ గౌడపాద

ముని వృత్తాంతాన్ని శిష్యులకు తెలియజేస్తూ ఆ రాత్రంతా గంగాతీరాననే గడిపారు.

అంతట శ్రీ శంకరులు పరబ్రహ్మాన్ని సాక్షాత్కరించుకొని ధ్యానించ సాగారు. ఇంతలో లోకవార్తను స్పష్టంగా తెలుసుకోగలిగి యీ విధంగా తెలియబరస్తున్నారు.

55-59. శ్రీ శంకరులు ఈ భూమండలమందు జంబూద్వీపం, అట్టి జంబూద్వీపమందు భారతదేశం మిక్కిలి శ్రేష్ఠమైనవని తెలుసుకొన్నారు. అందు కాశ్మీరఖండం ప్రఖ్యాతమై వర్ధిల్లినది. ఆ కాశ్మీర దేశాన సర్వవాగ ధీశ్వరియైన శ్రీ శారదాదేవి (సరస్వతీదేవి) సర్వోత్తమమై అలరారు చున్నది.

అట్టి కాశ్మీర దేశంలో నాలుగు మండపాలతోను, నాలుగు ద్వారాల తోను, ఒక శారదా నిలయం ఉంది. అందులో సర్వజ్ఞపీఠమైన మహోన్నత మైన ఆసనం ఉంది. ఆ మహోన్నత ఆసనాన్ని అధిరోహించినవాడే సర్వజ్ఞుడై విరాజిల్లుతుంటాడు. సర్వజ్ఞులు కానివారు అందు ప్రవేశింపలేరు. అటు వంటి మహోన్నతమైన శారదాపీఠ మొకటి వెలసి ఉంది.

ఆ శారదాపీఠమందలి నాలుగు ద్వారాలలో పశ్చిమద్వారమందు పశ్చిమదేశీయులైన విద్వాంసులు, ఉత్తరద్వారమందు ఉత్తరదేశ పండితులు ఆసీనులై ఉంటారు.

దక్షిణ ద్వారం మాత్రం దక్షిణదేశ పండితులెవ్వరూ లేకుండడంచే ఆ ద్వారం మూసి ఉంచబడినది. ఈ వార్త ప్రపంచమందు అన్ని దిక్కులకూ వ్యాపించింది.

దక్షిణదేశీయులైన శ్రీ శంకరులు ఈ జనవాక్యాన్ని విని ఎంతో సంత సించారు. వెంటనే సర్వశ్రేష్ఠమైన ఆ దక్షిణ ద్వారాన్ని జయించడానికి ఆ కాశ్మీరదేశానికి బయలుదేరారు.

ఇంతకాలంగా దక్షిణదేశంనుండి పండిత శిరోమణులెవ్వరూ ఆ పీఠాన్ని చేరుకొనే సమర్థులు కానందున ఆ ద్వారం మూసియే ఉంచ

బడినది. దక్షిణదేశీయులగుటవలన తామాపీఠమునధిష్టింపదలచి మహా సంతోషంతో శ్రీ శంకరులు ఆ కాశ్మీరదేశానికి ప్రయాణమైనారు.

60-62. మహారాజు రాకను తెలియబరస్తూ వందిమాగధులు స్తోత్రపాఠాలు వల్లించే విధాన శ్రీ శంకర యతీంద్రసామ్రాట్టు రాకను శిష్య పరివారమంతా శ్రీ శంకరుల కీర్తినుద్ఘోషిస్తూండగా ఆ పీఠాన్ని చేరు కొన్నారు. ప్రతివాది భయంకరమైన శ్రీ శంకర దేశికేంద్ర సింహరాజం ద్వైతవనాన్ని ధ్వంసమొనరిస్తూ సర్వజ్ఞులై విహరించినది. అంటే శ్రీ శంకర యతీంద్రులు సర్వజ్ఞతాసామ్రాజ్యము నధిష్ఠించారు. కేవల వేదాంత తత్త్వ ప్రబోధం సర్వవిజయాలను సాధించి సర్వోన్నత పీఠమునం దధిష్ఠించ బడినది.

సింహం మదించిన ఏనుగు కుంభస్థలాన్నే కోరుతుంది గాని అల్ప జీవుల జోలికి పోదు. అట్లే శ్రీ శంకరులుకూడా మహాపండిత ప్రభాస మానులై ప్రతిభావంతులైన గర్వితులైన మహాపండితులతోనే ఢీకొంటారు కాని, విద్యాహీనులైన అల్పపండితులను కన్నెత్తికూడా చూడరు. స్వల్ప పండితులను మనస్సున కూడా తలచరు.

"ప్రతివాది దుష్టపండితులారా! శ్రీ శంకరవాది కేసరి వస్తున్నది. తొలగండి, తొలగండి" అంటూ శ్రీశంకరుల శిష్యులు నినాదాలు చేస్తుండగా శ్రీ శంకరసర్వజ్ఞ శిరోమణులు శ్రీ శారదాపీఠ దక్షిణద్వార ప్రవేశం చేస్తుండగా ప్రతివాదులైన పండితు లనేకులు శ్రీశంకరుల నడ్డగించారు. వాదప్రతివాదాలకు సంసిద్ధులైనారు.

63. శ్రీ శారదాపీఠ పండితులిలా పలికారు: యతివరా! శ్రీ శారదా దేవాలయ ప్రవేశం సర్వజ్ఞులకే పరిమితమని తెలియక తమరు ఆలయ ప్రవేశం గావిస్తున్నారు. త్వరపడకండి. సర్వజ్ఞత్వ ప్రకటన కానిదే ఆలయ ప్రవేశం నిషిద్ధం.

64. పండితుడైనంత మాత్రాననే "నేను సర్వజ్ఞుడను, నాకు అన్ని విషయాలు తెలుసు"నని తనకు తాను ప్రకటించుకొన్న చాలదు. నీవు సర్వజ్ఞపీఠమునధిష్ఠింప తలచితే మాతో వాదించి మమ్ము మెప్పించి

అటుపిమ్మట శ్రీ శారదాపీఠము నధిష్ఠించండి. అది మాకు కూడా సంతోష దాయకమవుతుంది.

65. తార్కిక పండితులు, కాణాది మతావలంబులయిన పండిత విద్వద్వరేణ్యుడు వాదించిన సర్వప్రశ్నలకు శ్రీ శంకరులు తృటిలో సమాధానాన్నిచ్చి వారినెల్ల సంతుష్టులనుజేశారు. పరమాణువుల సంయోగంచే, బహుసూక్ష్మమైన (ద్వ్యణుకాలై జగత్తుకు కారణమవుతున్నవని వారి మతం.) ద్వ్యణకం ఉత్పన్న మవుతున్నదని వారి మతం.

66. **తార్కిక పండితులు:** మహాత్మా! ద్వ్యణుకము నాశ్రయించి మహాసూక్ష్మమైన పరమాణువేది ఉందో, అది దేనినుండి పుట్టుచున్నది? ఆ పరమాణువు సముద్భవహేతువును మాకు తెలియజేయండి. అట్లు మీరు మాకు సరియైన సమాధానం తెలుపని యెడల మీరు మీ శిష్యులు పలుకుతున్న మాటలన్నీ బూటకపుమాటలు కాగలవు.

67. **శ్రీ శంకరులు:** ధీవర్యా! మీరు తార్కికులు గాన, నేనుకూడా తార్కిక సాయాన్ని అనుసరించే సమాధానమిస్తాను. పరమాణు ద్వయమందున్న ద్విత్వసంఖ్యయే ద్వ్యణుకగతమైన అణుత్వానికి కారణమవుతున్నది. అంతట కాణాద మత పండితులందరూ శ్రీ శంకరులు పలికిన ప్రమాణభూతమైన వాక్యాన్ని ఆమోదించారు. వినమ్రులై శ్రీ శంకర యతీంద్రులను పూజించారు. తరువాత కాణాద విజయలక్ష్మి శ్రీ శంకరుల నాశ్రయించింది. శ్రీ శంకరపరమహంసలు సర్వజ్ఞ పీఠాధిరోహణ సమర్థులని ఘోషించారు.

68. తరువాత గౌతమ మతస్థుడొకడు శ్రీ శంకరులతో "మహాత్మా! యతివరా! కాణాద మతమందుండే ముక్తిభావానికీ, గౌతమ పక్షమందుండే ముక్తికీ భేదం తెలుప"మన్నారు.

69. **శ్రీ శంకరులు:** గుణసంబంధం పూర్తిగా నాశనంకాగా, గగనంలా ఉండే స్థితియే కాణాది పక్షమందు ముక్తి అవుతున్నది. అంటే త్రిగుణాలు నశించగా, ఆకాశంలా సర్వవ్యాపకస్థితి నొందడాన్ని ముక్తియని

కాణాద మతస్థులు పలుకుతారు. ఆకాశంలా సర్వవ్యాపకమై, నిర్వికారజ్ఞాన స్వరూపంతో విలసిల్లే మహోత్తమస్థితిని మోక్షమని గౌతమీయులు తెలుపు చున్నారు. రెండు పక్షాలవారికీ గుణత్రయం నిశ్శేషంగా నాశనమయ్యేస్థితి సమానాలై ఉన్నవి. గౌతమీయులు జ్ఞానాన్ని విశేషంగా ప్రతిపాదిస్తారు.

70. ఈశ్వరుడే సర్వజగత్తులకు మూలకారకుడని ఇరుపక్షాల వారూ అంగీకరిస్తున్నారు. పదార్థాలను స్పష్టంగా తెలియటంచే మిగిలినది పరమాత్మ స్వరూపం. ఆ పరమేశ్వర ప్రాప్తియే ముక్తియని భావం. ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, వయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండ, హేత్వాభాస, చ్ఛలజాతి, నిగ్రహస్థానానా, మున్నగు పదునారు పదార్థాలని శ్రీ శంకరులు వచింపగా నైయాయకులు శ్రీ శంకరులను శ్లాఘిస్తూ వాదంనుండి తొలగారు.

71. **సాంఖ్య మతస్థుడు:** యతీంద్రా! మా ప్రశ్నలకు కూడా సంతృప్తిగా సమాధానం తెలిపితేగాని లోనికి ప్రవేశం లభింపదు. వినండి. మూలప్రకృతి స్వతంత్రంగానే జగత్కారణమవుతున్నదా? లేక చైతన్య పర బ్రహ్మాన్ని ఆశ్రయించి జగత్తునకు మూలకారణమవుతున్నదా? సాంఖ్యులు మూలప్రకృతి జడం కాదనీ, స్వతంత్రమైనదనీ, అదే జగత్తునకు మూల కారణమనీ తెలుపుతున్నారు.

72. **శ్రీ శంకరులు:** మూలప్రకృతే సర్వజగత్కారణమని అందరూ అంగీకరించే విషయమే. అయినా సాంఖ్యులు మూలప్రకృతి త్రిగుణాత్మికమై అనేక రూపాలు ధరించి సర్వజగత్తుకు కారణమవుతున్నది. మూలప్రకృతి అంటే స్వభావం; స్వభావంచేతనే సృష్టిస్థితిలయ కార్యాలు జరుగుచున్నవని తెలుపుచున్నారు. కాని వేదాంతులు మూలప్రకృతి జడమవటంచే చైతన్యాన్ని ఆశ్రయించి సర్వజగత్తునకు కారణమవుతున్నదనే వాదానికి పరబ్రహ్మమే సర్వకారణం. ఈ సమాధానంతో పరమ సంతృప్తులైన సాంఖ్యులు కూడా తప్పుకొని ప్రవేశానికి దారి ఇచ్చారు.

73. తరువాత బౌద్ధమత పండిత ప్రకాండులు శ్రీ శంకరుల నద్ద గించారు. వారిలో సౌతాంత్రికులు, వైభాషికులు, యోగాచారులు, మాధ్యమికులనే తెగలవారు ఉన్నారు.

74. **సౌగతులు ఇలా పలికారు:** బాహ్యార్థ వాదమందు రెండు విధాలున్నవి. ఆ రెండు విధాల స్వరూపమేమిటి? ఆ రెండు విధాలకు ఉన్న వ్యత్యాసమేమిటి? వేదాంతవాదానికీ, జ్ఞానమార్గీయులకూ ఉన్న భేద మెట్టిది? మాకు సంతృప్తికరంగా సమాధానమిస్తేనే మేము దేవాలయ ప్రవేశానికి అనుమతిస్తాం.

75. **శ్రీ శంకరులు:** బాహ్యపదార్థాలు సౌత్రాంతికాలనీ, వైభాషికా లనీ రెండు విధాలు. సౌత్రాంతికులు అనుమానప్రమాణ జీవులు. తెలియ దగిన వస్తుసముదాయమంతా అనుమాన ప్రమాణంచే తెలియదగినది. అంటే అనుమాన ప్రమాణంచేతనే సర్వవస్తువులు తెలియబడి, ఆయాపదార్థ జ్ఞానం కలుగుచున్నదని పలుకుతారు. ఇక వైభాషికులు ప్రత్యక్షప్రమాణ జీవులు. కళ్లకు కనిపించేదంతా జ్ఞానవిషయమేనని తెలుపుతారు. అయినా వారిరువురూ రెండు రకాలైన పదార్థాలు అనిత్యమనీ, కళ్ళ ముందే నాశ మొందుతవనీ అంగీకరిస్తారు. ఆ విషయంలో ఎట్టి విభేదాలూ లేవు. సర్వ వస్తువులూ అనిత్యాలేనన్నది వారి వాదనాసారాంశం.

76. ఇక విజ్ఞానవాదులు, బుద్ధి క్షణికమని ప్రతిపాదిస్తారు. బుద్ధిచే తయారుకాబడిన పదార్థాలన్నీ (విజ్ఞానం) వెంటనే నశించేవేననీ, అవి అనేక రీతులలో ఉంటాయనీ అంగీకరిస్తారు. అంటే విజ్ఞానానికి క్షణికత్వం, బహూత్వం కూడా అంగీకరిస్తారు. ఇక వేదాంతవాది జ్ఞానమనేది స్థిర మైనదనీ, ఏకమైనదనీ (బహూత్వాన్ని అంగీకరింపరు) తెలుపుతారు. ఇదే విజ్ఞానులకూ, వేదాంతులకూ ఉన్న ముఖ్యమైన భేదం.

77. తరువాత శ్రీ శంకరుల ప్రత్యుత్తరాన్ని విన్న సౌగతులందరూ శ్రీ శంకరులను ఎంతో గౌరవంతో సర్వజ్ఞులని శ్లాఘించారు. వారు శ్రీ శంకరుల సర్వజ్ఞత్వాన్ని అంగీకరించి శ్రీ శారదాపీఠానికి పోవడానికి అడ్డుతొలగారు.

తరువాత దిగంబరులు శ్రీ శంకరులతో "మహాత్మా! దేశికవర్యా! పరమహంసత్త్వాన్ని గూర్చి తెలుపండి. జైనమతమందేది ఉందో దానిని వివరించండి. తామలా వివరిస్తే ఇకపై తమకు అడ్డుతొలగి ఆలయ ప్రవేశానికి అనుమతిస్తాము.

78. **శ్రీ శంకరులు:** జైనవరులారా! ఆస్తికాలతో కూడిన ఉత్తరదేశ పదాలను జీవాది పంచకాల గూర్చి మీరు కోరుతున్నారు. ఆ మత రహస్యాలను తెలుపుతా. వినండి. 1. జీవాస్తికాయం 2. పుద్గలాస్తికాయం 3. ధర్మాస్తికాయం 4. అధర్మాస్తికాయం 5. ఆకాశాస్తికాయం ఈ పంచాస్తికాయాలు మీకు ప్రధానమైనవి. ఇంకా ఏవైనా గోప్యమైన విషయాలు తెలుసుకోగోరితే ప్రశ్నించండి, తెలుపుతాను.

79. ఈ విధంగా వేద బాహ్యులైన బౌద్ధులు, జైనులు శ్రీ శంకరుల ప్రత్యుత్తరాలచే పరమసంతృప్తులై హర్షధ్వానాలుచేస్తూ ఆలయప్రవేశానికి అడ్డు తొలగారు. అంతట జైమినీ పండితుడొకడు ఇలా ప్రశ్నించాడు. "జైమినీమహర్షి మతమందు శబ్ద స్వరూపమెట్టిది? శబ్దం ద్రవ్యమా? లేక గుణమా? తెలుపండి."

80. **శ్రీ శంకరులు:** జైమినీయప్రవరులారా! మీరు మీమాంసాశాస్త్ర ప్రావీణ్యతచే ప్రకాశిస్తూంటారు. మీ మతతత్త్వంలో, అక్షరాలు (వర్ణాలు); ఆ శబ్ద జాలమంతా గుణంకాదు. ద్రవ్యం నిత్యాలని మీరు వచిస్తున్నారు. మీ మత ప్రకారం వర్ణాలు, వర్ణసముదాయంతో కూడిన శబ్దాలు నిత్యాలని భావిస్తారు. అందుచే ద్రవ్యాలు సర్వవ్యాపకాలు అని చెప్పాలి. ఆ విధాన వేదాలు ప్రళయకాలంలో కూడా నశించేవి కావు. మూడు కాలాలందూ నశింపక ఉండేవి అవటంచే నిత్యాలని సారాంశం. వేదాంతులకు వేదాలు నిత్యాలు కావు. పరబ్రహ్మమొక్కడే నిత్యమని భావిస్తారు. వేదాంతాలైన ఉపనిషత్తులు మాత్రం పరబ్రహ్మ ప్రబోధకాలై ఉన్నవి. బ్రహ్మజ్ఞానం కలుగేటంతవరకు ఆ ఉపనిషత్తులు నిత్యమై ఉంటాయి. బ్రహ్మజ్ఞానం పొందిన తరువాత సచ్చిదానందవస్తువే నిత్యం. ఇతరాలైన దృశ్యాలన్నీ నాశం పొందేవే. ఇదే వేదాంతసారం.

81. శ్రీ శంకరులను మొదట శ్రీ శారదాదేవాలయపు ప్రధాన ద్వార మందే న్యాయ, వైశేషిక, యోగ, సాంఖ్య, పూర్వమీమాంస, పంచదర్శన, నాస్తిక, బౌద్ధ, జైన, సౌగత మతాల వారందరూ అడ్డుకొన్నారు. వారందరినీ వాదమందు జయించి తమ పరమసిద్ధాంతమైన అద్వైత తత్త్వాన్ని స్థాపించారు. వారందరూ మహావిస్మయం చెంది శ్రీశంకర భగవానుని సాక్షాత్పరమశివునిగా తలచి సాగిలపడి నమస్కరించారు. వెంటనే శ్రీ శారదాదేవి దేవాలయద్వారాన్ని తెరచి దారి చూపుతూండగా, శ్రీ శంకరులు శ్రీ శారదాపీఠాధిరోహణం చేశారు.

82–87. శ్రీ శంకరాచార్యులు శ్రీ పద్మపాదాచార్యుల వారిని చేత్తో పట్టుకొని ఆ శారదాపీఠము నధిరోహించుటకై బయలుదేరారు. అంతట ఆ శారదాదేవి అశరీరవాణితో శ్రీ శంకరులతో ఇలా పలికింది.

“మహాత్మా! సర్వ వాక్కులకూ అధిష్ఠానదేవతయైన బ్రహ్మదేవుని అవతారమైన మండనమిశ్రుని అవలీలగా జయించావు. అప్పుడే నీ సర్వజ్ఞత లోకానికి ప్రకటితమైనది. నీ అసమాన అలౌకిక పాండిత్యం దిగంతా లందు మారుమ్రోగింది. తమ అప్రాకృత నిర్మల యశోరాశి సుస్థిరమై సర్వత్రా ప్రకాశించింది.

పరివ్రాజక సార్వభౌమా! శ్రీ శారదాపీఠాన్ని అధిరోహించడానికి కేవలం సర్వజ్ఞతయే సరిపోదు. కేవలాత్మపరిశుద్ధీ, ముఖ్యంగా పరిశీలించ వలసి ఉంది. అట్టి ఆత్మ పారిశుద్ధ్యం నీకడ ఉన్నదా? లేదాయని పరీక్షిం చాలి. నీ ఆత్మ నిర్మలతా విషయాన్ని పరిశీలించిన తరువాత, ఈ శారదా పీఠాన్ని అధిరోహింప యోగ్యుడవవుతావు. జ్ఞానం కేవలం పాండిత్య పఠనంచే చేకూరదు. బహుజన్మల పుణ్యఫలంచే కలిగే విషయ విరక్తీ, ఆత్మశుద్ధీ కూడా ముఖ్యం.

మహాత్మా! యతీంద్రవర్యా! నీవు పుట్టుకచే నైష్ఠిక బ్రహ్మచర్యం ఆచరించి, సన్న్యసించారు. యతిధర్మాలన్నీ చక్కగా పాటించావు. తాము పరమహంసాశ్రమ పరిరక్షణానికే జన్మించారని ఎల్లరూ కొనియాడారు. అందుమూలంగా పరివ్రాజక చక్రవర్తులని బిరుదుకూడా సంప్రాప్తించినది.

అటువంటి నీవు, అమరక మహారాజు యొక్క దేహంలో ప్రవేశించి కామ శాస్త్ర కామకలాపాలందు బహునిష్ణాతుడవయితివి. ఆ కామ ప్రావీణ్యత కూడా సర్వజ్ఞత్వానికి పరాకాష్ఠయని తలచారు. ఆ విధంగా విధినిషేధా లను మీరి సంచరించావు. కాబట్టి ఈ మహా పీఠాధిరోహణకు అర్హులు కారు. సర్వజ్ఞత్వమన్న ఆత్మశుద్ధి కూడా కలసి ఉంటుంది. తమ ఆత్మ పరిశుద్ధి సంశయాత్మకమవటంచే ఈ పీఠమధిరోహింప యోగ్యుడవు కావని తలస్తున్నాను. నీవీ సంశయాన్ని తీర్చి ముందుకు సాగు!

**శ్రీ శంకరులు:** అంబా! విను. నేను ఈ దేహాన్ని ధరించినది మొదలు ఒక్క పాపకర్మా చేసి ఉండలేదు. కనుక నిస్సంకోచంగా నేను పరిశుద్ధు డను. ఇది నిశ్చయం. పరకాయ ప్రవేశంచే అన్యదేహమందు చేసే కర్మలీ దేహానికి వర్తింపవు. విను. ఒకడొక జన్మమందు బ్రహ్మచర్య భ్రష్టుడైతే ఆ వ్రత భ్రష్టత మరొక జన్మయందు ఆపాదింపజాలం. ఆ జన్మమందు బ్రహ్మ చర్యాన్ని వ్రతదీక్షతో ఆచరించిన యెడల నైష్ఠిక బ్రహ్మచారి అవుతున్నాడు. ఇది లోకంలో, శాస్త్ర విధినకూడా సర్వసమ్మతం. శరీరగత దోషాలన్నీ శరీరంతో నశిస్తున్నవి. అట్లే పరకాయమందు సంభవించిన దోషాలు ఆ దేహంతోపాటు నశిస్తున్నవి. ఇది యథార్థం; యథార్థతత్త్వం. కనుక నా దేహం యోగతత్త్వభాసురం, చిన్మయం. కాబట్టి నేను పరిశుద్ధుడనే; సందియం లేదు.

ఈ విధంగా శ్రీ శంకరులు ఆత్మశుద్ధి విషయమై ఆ వాగ్దేవి శారదా దేనినికూడా నిరుత్తరురాలినిగా చేశారు. తరువాతే ఆ వాగ్దేవీ ఊరక ఉండిపోయింది. అంతట శ్రీశంకరులు సర్వవిజయశ్రీశోభితులవుతూ శ్రీ శారదాపీఠ మధిరోహించారు.

88-92. శ్రీ శంకర గురువరులను బహువిధాలుగా సత్కరిస్తుండగా, శ్రీశంకరులు శ్రీ శారదాపీఠ మధిష్ఠించారు. మహోన్నత శారదాపీఠ మధిరో హించటంచే శ్రీ శంకర గురువరునకు, దివ్య పురుషునిచే అధిరోహింప బడటంచే శారదాపీఠానికి పరస్పర యోగ్యతా సంపత్తి ఒనకూరినవి.

శ్రీ శంకర గురువరులు అద్వైతతత్త్వ బోధకసర్వజ్ఞ శిరోమణులు శ్రీశారదాపీఠ మధిరోహించి విజయఘోషతో, అప్రతిహత తేజస్సుతో వెలు గొందుచుండగా, కాణాద, గౌతమ, కపిల, పాతంజలాది మతవాదు లందరూ తలకొక దిక్కునకు పరుగులెత్తారు. కేవలాద్వైతతత్త్వ విజయశ్రీ పరిపూర్ణ సిద్ధాంతంతో ప్రకాశించింది.

మహాప్రభువు ఏకచ్ఛత్రాధిపత్యం వహించి పట్టాభిషిక్తుడై సింహాసన మధిరోహించిన విధాన శ్రీ శంకరులు కేవలాద్వైత తత్త్వ సిద్ధాంత రూప సర్వాధిపత్యాన్ని వహించి మోక్షసామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడై శ్రీ శారదా పీఠాన్ని అధిరోహించారు.

శ్రీ శంకరులు సర్వవిజయశ్రీయై శ్రీ శారదాపీఠ మధిరోహించిన సమయమందు దేవేంద్రుడు దేవతలకు మంగళవాద్యాలు మ్రోగింప ఆజ్ఞ నొసగాడు. తరువాత దేవతలందరూ అతిహర్షంతో మంగళ వాద్యఘోషాల నొనర్చారు.

అంతేకాక దేవతలు కొన్నిదినాల వరకు ఆకాశంనుండి పుష్ప వర్షం కురుపిస్తుండగా, దేవేంద్రుని భార్య శచీదేవి శిరస్సున ధరింప ఒక్క పుష్పంకూడా మిగులలేదు.

93-99. శ్రీ శంకరులు నిరభిమానులు, కేవల చిన్మయ స్వరూపులు, సర్వదృశ్యాతీత బ్రహ్మవిహారులు. అందుచే కేవలం బ్రహ్మవిద్యా పరి రక్షణ కొరకే ప్రతిష్ఠాత్మకమైన ఆ సర్వజ్ఞ శారదాపీఠాన్ని అధిరోహించారు. ఇందువలన సర్వ దిగ్విజయయాత్ర సంపూర్ణమయింది. తరువాత కొంత మంది ముఖ్యశిష్యులను వెంటబెట్టుకొని బదరీక్షేత్రానికి పోదలచారు. ఋష్యశృంగాది పీఠాలందు సురేశ్వరాచార్యులవంటి శిష్యులను నియ మించి శ్రీ శంకరులు బదరీక్షేత్రానికి ప్రయాణమయ్యారు.

బదరీక్షేత్రం నరనారాయణులు తపమాచరించిన పరమ పుణ్య క్షేత్రం. ఆ క్షేత్రమందు పాతంజలి యోగదర్శనమందు నిష్ణాతులైన మహా యోగీశ్వరులు తపమాచరిస్తున్నారు. వారికి తత్త్వం ఉపదేశించి వారి నెల్లరను ధన్యులను చేశారు. అద్వైత తత్త్వానికి పూర్తిగా విరుద్ధాలైన

సాంఖ్య, యోగ, న్యాయదర్శన దర్మనవాదులైన ముని పుంగవుల కెందరికో బ్రహ్మజ్ఞానతత్త్వ ఉపదేశించగా వారందరూ శ్రీ శంకరులను శరణు పొందారు. వారందరికీ తనచే రచింపబడిన వ్యాసకృత బ్రహ్మసూత్రాభాష్యం ఉపదేశించి వారినెల్లరను కృతార్థులనుజేస్తూ అచ్చటనే కొంత కాలం గడిపారు.

చంద్ర కిరణాలు లోకంలో తాపాలనెల్ల హరించి, ఎల్లరకూ ఆహ్లాదం కలిగించే రీతిన శ్రీ శంకరులు బ్రహ్మజ్ఞాన కిరణ ప్రసారంచే దీనజనుల సంతాపాలన్నీ హరింపజేశారు. తన్నాశ్రయించిన పండిత ప్రవరులందరికీ బ్రహ్మసూత్ర భాష్యాన్ని శ్రవణం చేయిస్తూ సర్వమూ బ్రహ్మమయం గావించారు. ఈ విధంగా శ్రీ శంకరులు జ్ఞానకాండను ప్రజ్జ్వలింపజేస్తూ, చిన్మయానందస్వరూపులై విలసిల్లారు.

వేదాంత విరుద్ధ శాస్త్రాలన్నింటినీ సమూలంగా నాశనం చేస్తూ, నిత్య పరమశాంతి ప్రదాయమైన బ్రహ్మానందతత్త్వాన్ని తన అమానుషకృత్య జాలాలతో కీర్తిరాశియగు శ్రీ శంకరాచార్యులకు ముప్పది రెండు సంవత్సరాలు గడచాయి. ఈ స్వల్పకాలంలోనే యుగాంతరాలందు కూడా నశింపని బ్రహ్మజ్ఞాన విద్యను సుస్థిరం చేశారు. ఇక శ్రీ శంకరుల ప్రజ్ఞాతిశయ కృత్యాలు పరిసమాప్తమయ్యే కాలం సమీపించింది. పరమేశ్వరుని సంకల్ప వికల్పాలు అగోచరాలు గదా!

దురవగాహమైన బ్రహ్మసూత్రాలకు మృదుమధురంగా భాష్యార్థాలను రచించి సర్వసంతాపాలను హరించి పరమశాంతిని నెలకొల్పారు. అందువలన మేమే పండితుల మనే దురహంకారుల గర్వం సమూలంగా నాశన మొనరించారు. ముముక్షువులకు సర్వ ప్రతిబంధకాలు తొలగాయి. మహా దుర్లభమై బహుజన్మల జనన మరణ రహిత జ్ఞాన ప్రదమైన పరమ శ్రేయస్సును సులభతరం గావించారు. ఇట్టి మహత్కర కార్యాన్ని సాక్షాత్పరమేశ్వరుడు తప్ప వేరెవరు చేయగలరు? ఆ విధంగా శ్రీ శంకరులు కీర్తి శాశ్వతం, పరమశాంతిపద గమ్యగోచరం.

శ్రీశంకరుల యశోరాశి ముల్లోకాలందూ వ్యాపించాయి. శ్రీశంకరుల అపార జ్ఞానామృతంచే సర్వ సంసార తాపాలు నశించి పరమశాంతి విల సిల్లింది. ఈ విధంగా శ్రీ శంకరులు శాశ్వతకీర్తిని పొందారు.

అంతేగాక శంకరులు బంగారు ఉసిరిక ఫలాలతో కూడిన వర్షం కురిపించటం, చనిపోయిన వ్యక్తిని సజీవునిగా చేయటం మున్నగు మహాశ్చర్యకరమైన అమానుషకృత్యా లెన్నో చేశారు. ఆ పవిత్రగాథలను చెప్పుకొని లోకులు పవిత్రులవుతున్నారు. భక్తు లెల్లరూ సంసార సాగరాన్ని దాటి ముక్తులైనారు. సర్వ విమతాలు అంతరించి, సర్వశుభాలు చేకూరాయి. కేవలాద్వైతం విజృంభించింది.

100-102. ఆ కేదార మహాక్షేత్రం ముముక్షువులను సకలాపత్తుల నుండీ రక్షించి కాపాడుతూంటుంది. తనను సేవించే వారికెల్ల నివాస స్నానాది సకల సౌకర్యాలను సిద్ధింపచేస్తున్నది. సర్వపాపహరమై, స్వచ్ఛమైన జలాలతో తేజరిల్లినది. అందుచే మునీశ్వరులు, యోగీశ్వరులు, సిద్ధులు అనుష్ఠానపరులై నివసిస్తూంటారు. అటువంటి పరమపవిత్రమైన కేదార క్షేత్రానికి శిష్యులతోకలసి శ్రీ శంకరులు వేంచేశారు. అచ్చటనే తన పరమశివావతారాన్ని చాలింపదలచారు.

అట్టి కేదార క్షేత్రమందు అత్యధిక శీతలబాధ ఉన్నందున, శిష్యు లెల్లరూ శీతల బాధను సహింపజాలకపోయారు. అంతట శ్రీ శంకరులు వారిని రక్షించడానికి ఉష్ణోదక గంగను ప్రవహింపజేయమని ఆ పరమశివుని ప్రార్థించారు.

అంతట ఆ మహాదేవుడు శ్రీ శంకరుల ప్రార్థనను మన్నించి తన దివ్య పాదాలనుండి ఉష్ణోదకం ప్రవహించేట్లు చేశాడు. ఆ విధంగా నేటికీ ఆ ఉష్ణోదక గంగ ప్రవహిస్తూ శ్రీ శంకరుల కీర్తిని సుస్థిరం చేసింది. శ్రీ కేదారేశ్వరాన్ని దర్శింప పోయే సందర్శకులకు, స్థిరనివాస మొనరించుకొన్న యోగీశ్వరులకు శీతలబాధ తప్పడానికి తప్తగంగను ప్రవహింపజేశారు.

103-107. శ్రీ శంకరులు సర్వదేవతల ప్రార్థన లంగీకరించి లోకంలో జ్ఞానకాండను స్థిరం గావించారు. విమతాలన్నింటినీ ఖండించి

కేవలాద్వైత సిద్ధాంతాలను శ్రవణం చేయించారు. ప్రజ్ఞావంతులైన శిష్యుల ద్వారా బ్రహ్మతత్త్వాన్ని లోకంలో విస్తరింపజేశారు. విజ్ఞానమయంగాచేసి పరమ శాంతిధామంగా ఒనరించారు. చంద్ర ఉపేంద్రులు, వాయు, అగ్ని, వరుణాదులు, మహర్షులు, సిద్ధులు, బ్రహ్మర్షి, దేవర్షాదులు మున్నగువారి ప్రార్థనలను మన్నించిన మహాదేవుడు వైదిక మార్గాన్ని ప్రతిష్ఠించి, కేవలా ద్వైతతత్త్వ సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికి భూలోకంలో అవతరించిన శ్రీ శంకర గురుదేవులను స్వధామమైన కైలాసానికి తీసుకొనిపోవడానికి ఆ మహాదేవుడు సమీపించాడు.

శ్రీ శంకరులు స్వధామమైన ఆ మహోన్నత హిమపర్వతాలందలి రజతగిరి నధిష్ఠింపగా దేవతలు, సిద్ధులు, మహర్షులు ఎంతో స్తుతించారు. దేవత లధిష్ఠించి వచ్చిన లక్షలాది విమాన కాంతులు విద్యుల్లతలై ఆకాశ మంతా కోటిసూర్యులై ప్రకాశించింది. కల్పవృక్షంనుండి తెచ్చిన మనోహర పుష్పాలచే శ్రీ శంకరులపై పుష్పవర్షం కురిపించారు. వారందరూ పరమ సంతోషంతో శివావతార ఉపసంహారాన్ని వేయి విధాలుగా స్తుతిస్తూ, పాడారు; నృత్యం చేశారు. దేవర్షి, రాజర్షి, దేవతలు మున్నగు వారందరూ ఈ విధంగా స్తుతించారు.

మహాత్మా! మహాదేవా! పరమశివా! ఆదిదేవా! ఎల్లప్పుడూ స్వయం ప్రకాశకుడవై వెలసే పరమాత్మవు. అద్వితీయుడవు. కాలకూట విషాన్ని మ్రింగి జగత్తును కాపాడిన జగద్రక్షకుడవు. సర్వజనుల సంసారతాపాలను నశింపజేసి ఆనందామృతం ఒసగేవాడవు, భక్తుల కామాలను నిశ్శేషంగా దగ్ధమొనరించే వాడవు. విజితేంద్రియుడవు. త్రిపురాసుర సంహారివి. త్రిదేహాలను దహించి కేవలం ఆత్మయై వెలసేవాడవు. సృష్టి స్థితి లయ కారకుడవు. పరాపర దృష్టులతో ఒప్పేవాడవు. నీవు వేదమార్గాన్ని స్థాపించి జ్ఞానతత్త్వాన్ని లోకానికి ప్రసాదించిన మహాదేవుడవు, చైతన్య విగ్రహుడవు.

సంసార విదారకుడవైన ఓ మహాత్మా! తమ అవతార కృత్యాలన్నీ పరి సమాప్తమైనవి. శివలోకవాసులందరూ తమ దర్శనానికై ఎదురు చూస్తు న్నారు. కాబట్టి ఓ మహేశ్వరా! యథాప్రకారం మరల మాకు ఆనందం

గొలుపుతూ కైలాసంలో నివసించు. రమ్ము. ఓ మహేశా! ఆదిదేవా! దీన బంధూ! దయామయా! సర్వశుభంకరా! శంకరా! మా ప్రార్థన లాలింపు.

ఆ విధంగా శ్రీ శంకరులు బ్రహ్మాది దేవతల ప్రార్థన లంగీకరిస్తూ తన అవతారాన్ని ఉపసంహరించుకొని కైలాసానికి పోవ నిశ్చయించారు. వెంటనే అలౌకిక మహిమాన్విత తేజస్సుతో కూడిన దివ్యమంగళ విగ్రహుడై తన మహేశ్వరపాన్ని దాల్చారు. వెంటనే నందీశ్వరుడు, ప్రమథగణాలు, గిరిజాదేవి, మహర్షులు, దేవతలందరూ ఆ పరమశివుని యెదుట నిలచి సేవింప సంసిద్ధులైనారు.

లోకంలో వేదాంతమైన అద్వైత సిద్ధాంతం శిథిలమయ్యే సమయంలో, వేదవిహిత మతాలు స్వైరవిహారం చేసే సమయంలో శ్రీ శంకరులుద యించి వేదాంతమైన జ్ఞానమార్గాన్ని, గురుశిష్య సంప్రదాయాన్ని శాశ్వ తంగా ఉండే విధాన నెలకొల్పారు. అందువలన ముముక్షువులందరూ శాశ్వత తత్త్వం తెలుసుకొనినవారై ముక్తిని పొందుచున్నారు. ఆ విధంగా ఆదిశంకర భగవత్పాదులవారు సర్వత్రా జ్ఞానమార్గాన్ని ప్రతిష్ఠింపజేసి స్వధామమైన కైలాసానికి పయనమయ్యారు. దేవదేవుడైన పరమశివుడు దేవతలతో పరివేష్టితుడై మహర్షులెల్లరూ "జయజయ ఆలోకయ ఆలోకయ" అంటూ విజయ ఘోషలు ఒనరింపగా స్వధామమైన రజతగిరికి బయలుదేరారు. కేవలాద్వైతతత్త్వం ఉపనిషచ్ఛ్రుతి పాద్యం; పరమసత్యం; అఖండం; పరిపూర్ణం.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఈ విధంగా శ్రీ మాధవాచార్య (విద్యారణ్యస్వామి) కృతమైన శ్రీ శంకరవిజయ మహాకావ్యం పరిసమాప్తమయింది.

